



## నివేదన

ఈ ఉపనిషత్ సారామృత గ్రంథమును తెనుగునకు అనువదించిన **మాతృశ్రీ శారద ప్రియానందగారి** పాదపద్మములకు కృతజ్ఞతాపూర్వక నమస్కారములు. వారి అనువాదము నందు భావ గాంభీర్యము, భాషా మాధుర్యము పెనవేసుకొని ప్రవహించుటం అమ్మ ప్రజ్ఞాశక్తికి నిదర్శనం. ఆంధ్ర ముముక్షు జనావళి అమ్మ రచనలో ఆత్మానందమును బడయుగలరు.

శ్రీముఖనామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ విదియ సోమవారము **14-3-94 తేదీన చిన్మయారణ్యం ఆశ్రమంలో మాతృశ్రీ శారద ప్రియానంద** గారు అమృత హస్తములతో ఈ గ్రంథమును ఆవిష్కరించిరి.

హరిః ఓమ్

— పబ్లిషర్స్ —

# SREE SOUMYA KASEESA STOTRAM

(ESSENCE OF ALL UPANISHADS)

By

Sree Paramapujya **Tapovan Maharaj**

English Commentary
By
H H. Poojya Swami **Chinmayananda**

Telugu Translation
By
H.H. Swamini **Sarada Priyananda**

Published By
**J. VEMAIAH**, Phone: 2236
**D. Mohan Kumar**, Phone: 2336
**Central Chinmaya Mission Trust**
Chinmaya Publications, Telugu Division.
PRODDATUR - 516 361 (A.P.)

# శ్రీ సౌమ్య కాశీశ స్తోత్రం

(ఉపనిషత్తుల సారామృతము)


సంస్కృత రచన

**శ్రీ పరమ పూజ్యశ్రీ తపోవన్ మహారాజుగారు**

ఆంగ్ల వ్యాఖ్య

**పూజ్యశ్రీ స్వామి చిన్మయానంద గురుదేవులు**

తెనుగుసేత

**పూజ్యశ్రీ శారదప్రియానందగారు**



పబ్లిషర్స్

**జూటూరు వేమయ్య** ఫోన్ : 2336

**డి. మోహన్‌కుమార్** ఫోన్ : 2336

సెంట్రల్ చిన్మయా మిషన్ ట్రస్టు

చిన్మయా పబ్లికేషన్స్, తెలుగు విభాగం.

వెదుళ్ళ బజారు • ప్రొద్దుటూరు — 516 360

# వినతి

జూటూరు వేమయ్య

శ్రీ పూజ్యశ్రీ గురుదేవుల గురుదేవులు పరమ పూజ్యశ్రీ తపోవన్ మహరాజుగారు. వారి జననము 1889. మహాసమాధి 1957. 1989 సంవత్సరం శ్రీ తపోవనుల శతజయంతి సంవత్సరంగా శ్రీ గురుదేవులు ప్రకటించిరి. తదనుసారముగ, శ్రీ తపోవనులచే రచించబడిన ప్రధాన 4 గ్రంథములు 1. హిమగిరివిహారము, 2. గంగాస్తోత్రము, 3. శ్రీ బదరీశస్తోత్రము, 4. ఈశ్వర దర్శనము – తెనుగునందు ప్రకటింపబడినవి. సర్వ ఉపనిషత్తుల సారాన్ని మథించి, బ్రహ్మానుభూతితో తపోవన్ మహరాజుగారిచే రచింపబడిన "శ్రీ సౌమ్య కాశీశ స్తోత్రము"ను శ్రీ గురుదేవులు తాను స్వయంగ ఆంగ్లము నందు వ్యాఖ్య వ్రాయుటకు సంకల్పించెను. 1991 లో ఆ గ్రంథము ఆంగ్లము నందు ముద్రింపబడి హిమాలయములలోని 'శిద్ధబారీ' ఆశ్రమమునందు శ్రీ గురుదేవులచేత ఆవిష్కరింపబడెను. అపుడు జరుగుచుండిన జ్ఞాన యజ్ఞములో పాల్గొనుటకు వెళ్ళిన కల్లూరు వాస్తవ్యులు శ్రీ కె. రాధాక్రిష్ణయ్య గారికి శ్రీగురుదేవులు ఆంగ్లగ్రంథము నొకదానిని ఇచ్చి, అందులో "Bring it to Telugu" అని వ్రాసి నాకు పంపిరి. అది సుమారు 400 పేజీలు గలది. దానిని అనువదించుటకు శ్రీ స్వామిని శారద ప్రియానందగారు అంగీకరించి 1993 ప్రారంభములో పూర్తిచేసిరి. వ్రాతప్రతి నాకు అందచేసిరి. వ్రాతప్రతులు 700 పేజీలు వున్నవి. 450 శ్లోకాలు. 18 స్తబకములు.

ఇంత పెద్దగ్రంథము ముద్రించుట చాల వ్యయముతో కూడినది. మరియు ఇందలి విషయము ఉపనిషత్తుల సారము శ్రీ తపోవనులు సర్వ ఉపనిషత్తులను మథించి, అమృతసార పానముచేసి, అనుభవపూర్వకముగ వానినన్నిటిని జీర్ణించుకొని. శ్లోకములలో వ్రాశి, ఉత్తర కాశీపతి అయిన తన ఇష్టదైవము శ్రీ సౌమ్య కాశీశునకు సమర్పించిన స్తోత్రమాల. దీనిని ముద్రించి, ప్రచురించుటకు ధైర్యము చాలలేదు.

1993 ఆగష్టు ఆఖరులో శ్రీ స్వామిని శారద ప్రియానందగారు భీమవరం చిన్మయామిషన్ వారిచేత Organise చేయబడిన, సాధనా శిబిరము ఉత్తర కాశీ శ్రీ తపోవనుల ఆశ్రమములో ఏర్పాటు చేసిరి. అందుకు శ్రీ బదరీశ స్తోత్రములోని సాధన స్తబకమును ప్రవచించుటకు నేనుకూడ వెళ్ళడం జరిగినది. Camp తుదిలో, అందరము గంగోత్రి వెళ్ళి వచ్చినాము. నేను

ప్రత్యేకముగ గంగోత్రినుండి పవిత్ర గంగాజలాన్ని తీసుకరావడం జరిగింది. ఉత్తర కాశీలో శ్రీ తపోవనులు జీవితకాలమంతయు అక్కడ దేవాలయములో వెలసియున్న శ్రీ సౌమ్య కాశీశ్వరునకు ప్రతిదినం గంగా జలంతో అభిషేకం చేయుచుండెడివారు గంగోత్రినుండి తెచ్చిన జలంతో శ్రీ సౌమ్య కాశీశ్వరుని అభిషేకించి, ఈ గ్రంథముద్రణ ప్రారంభించవలెనని సంకల్పం కలిగినది. కాని, నా ఆరోగ్యం, ముఖ్యంగ కాళ్ళ నొప్పులు, ఎక్కువై దేవాలయంవరకు నడవగలనసె నమ్మకం లేక పోయింది. మరుసటిదినం క్యాంపు అయిపోవడం జరుగుతుంది. అపుడు ఒక బ్రహ్మచారిని పిలిచి, ఈ గంగోత్రిజలాన్ని శ్రీ సౌమ్య కాశీశునకు అభిషేకం చేసిరమ్మన్నాను కాని, వారికి అవసరమైన వేరే పనివలన, తాను పోలేనన్నాడు. అనుక్షణం, ఈపనిని నేను సొంతంగ చేయవలెనని ఈశ్వర సంకల్పం అనుకొని, మరల స్నానంచేసి గంగోత్రిజలాన్ని తీసుకొని, నేరుగా ఆలయానికి నడిచి వెళ్ళడం జరిగింది. అక్కడ శ్రీ సౌమ్య కాశీశ్వరునకు భక్తిపూర్వకంగ అభిషేకించి, జప, ధ్యానా దుల నొనరించి, ఈ గ్రంథముద్రణకు అనుమతిని, ఆశీర్వాదము ఆ సౌమ్య కాశీశ్వరుని కోరడం జరిగింది. ఎదురుగా, శక్తి మందిరానికి వెళ్ళి, అక్కడ వెలసియున్న శక్తిమాత, శ్రీ గణపతి మొదలగు దేవతలను భక్తితో ఆరాధించి, వారందరి అనుమతిని అభ్యర్థించి దేవాలయప్రాంగణం నుండి వెలుపలికి రావడం జరిగింది. 50 గజములు నడిచిన వెంటనే, శ్రీ రామక్రిష్ణ మఠంలోని ఆంధ్రసన్యాసి స్వామి శ్రీ చిదంబరానందగారు తటస్థించి, నన్ను అభిమాన పూర్వకంగ వారి ఆశ్రమానికి తీసుకెళ్ళి ఉన్మయా తెనుగువిభాగశాఖ చక్కని కృషి చేస్తూందని ఆశీర్వదించి, పూరీజగన్నాథస్వామి ప్రసాదమిచ్చి నారు. ఎందుకో, ఈ గ్రంథముద్రణ తప్పక పూర్తి అవుతుందని, అందుకు శ్రీ సౌమ్య కాశీశ్వరుని అనుజ్ఞ ఆశీర్వాదము పూర్తిగా లభించినట్లు నాకు విశ్వాసము కలిగినది.

సెప్టెంబర్ 10 తారికు ప్రొద్దుటూరు చేరినాను. అక్టోబరు మధ్యనుండి గ్రంథముద్రణ ప్రారంభించినాము.

సంస్కృతశ్లోకాలకు ప్రతిపదార్థము వ్రాసిన బాగుండునను సంకల్ప ముతో, ప్రొద్దుటూరు శ్రీ మలయాళస్వామి ఓరియంటల్ కళాశాల ప్రిన్సిపాలు గారైన విద్వాన్ శ్రీ S. పాండురంగయ్యగారిని ప్రస్తావించగ, వారు దయతో అంగీకరించిరి. శ్రీ కృష్ణగీతాశ్రమ సంస్కృత ఉన్నతపాఠశాల సంస్కృత

అధ్యాపకులు సాహిత్యశిరోమణి P. శంకరయ్య M.A. గారు ఇందుకు ఎంతో సహకరించిరి. వీరిద్దరి కృషిఫలితమె ఈగ్రంథమునందు ముద్రించిన శ్లోకముల ప్రతిపదార్థములు. ఆంధ్రచదువరులు వీరికి ఎంతో ఋణపడియున్నారు అంతేగాక, ఈగ్రంథ విషయము చాల వేదాంత లోతులుగలది గావున, శ్రీ పాండురంగయ్యగారు సుమారు 4 నెలలు, ప్రతిదినం Proof Reading చూస్తూ, ఈగ్రంథముద్రణకు ఎంతగానో తోడ్పడినారు. తెలుగు ప్రచురణ విభాగశాఖ వీరికి హృదయపూర్వక కృతజ్ఞతానమస్కారములు అందజేయుచు, వీరికి శ్రీ తపోవనుల ఆశీర్వాదము నిండుగ వర్షించవలెనని శ్రీ తపోవన్ మహరాజుగారిని ప్రార్థిస్తున్నాము.

ఈగ్రంథము శ్లోకములు ప్రతిపదార్థములతో 520 పేజీలు వరకు పెరిగినది. ముద్రణావ్యయభారముతో, విరాళములు స్వీకరించవలసి వచ్చినది ఈగ్రంథముద్రణకు ముఖ్యముగ హైదరాబాదు వాస్తవ్యులు ప్రస్తుతం చిన్మయారణ్యంలో నివసిస్తున్న శ్రీమతి అమ్మణ్ణమ్మగారు వారి భర్త శ్రీ Y. పిచ్చిరెడ్డి I.A.S గారి జ్ఞాపకార్థంగ, అయిదువేల రూపాయలు విరాళ మిచ్చుటకు అంగీకరించిరి. మరికొందరి దాతల విరాళముతో ఈ గ్రంథ ముద్రణ జరిగినది. విరాళములిచ్చి ప్రోత్సహించిన, దాతలందరకు మా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఈగ్రంథ విషయము గురించి కొంత చెప్పవలసియున్నది. ఇప్పటికే ఉపనిషత్తులను చక్కగ శ్రవణ, మననముల చేసిన సాధకులకు ఈగ్రంథము అమృత తుల్యము. ప్రధానంగ సాధకులకు ఉపనిషత్తునుండి తెలుసుకో వలసిన ప్రధాన విషయములను, శ్లోకములలో ఎంత చక్కగ వ్రాసినారో, చదివి ఆనందిస్తే తప్ప, వ్రాయుటకు సాధ్యంకాదు. వారి సంస్కృతశ్లోకాలు చదివినపుడు గొప్ప సంస్కృత తత్త్వవేత్తకూడ ఆపదములకూర్పుకు ఆశ్చర్య చకితుడు గాకతప్పదు. భాష భావపూరితము. భావములు అద్వైతపులోతులు, భాష, భావము పోటీపడుతూ, శ్లోకం నర్తన చేస్తుంది. అంతేగాదు, చరమపాదం తన ఇష్టదైవమైన ఈశ్వరుని స్తోత్రంతో గంభీరంగ ముగుస్తుంది. ఛాందోగ్య. బృహదారణ్యకోపనిషత్తులు చాలపెద్దవి. వానినన్నింటిని ఒక్కొక్క ఉపనిషత్తును 75 శ్లోకములలో కుదించడం శ్రీ తపోవనుల మహఅద్భుతక్రీడ మొదటి స్తబకంలో. పురాణ శివుని స్తోత్రముతో ప్రారంభిస్తు, ఉపనిషతుల సారాన్ని, మథించి, సాధకులకు అందిస్తూ, కట్టకడన. భక్తి పూర్వకంగ

వినయ విధేతలతో శ్రీ సౌమ్య కాశీశ్వరునికి తాను అర్పించిన శైలి, వాడిస పదజాలము, అందులో నిండిన భక్తి, ప్రేమ, జ్ఞాన, శరణాగతి భావముల రస పోషణ అద్భుతము.

విషయసూచికలో, ఏ స్తబకం ఏ శ్లోకం నుండి ఏ శ్లోకం వరకు పేజీ నెంబరుతో సహా వివరణ ఇవ్వబడినది. దయచేసి దానిని గమనించి, చదవండి. ఆ ఉపనిషత్తులోని ముఖ్యభావాలన్ని స్మరణకు వస్తాయి. ఈ గ్రంథం ఉపనిషత్తుల నన్నిటిని సాధకుడు Revise చేసినట్లుగ ఉంటుంది. నాకు అలాంటి అనుభూతి కలిగినది. మీరు కూడ భక్తితో పఠించి, ధన్యులుగండి. అలాంటి వారినందరను శ్రీ సౌమ్య కాశీశ్వరుడు అనుగ్రహిస్తాడు. శ్రీ తపోవనులు ఆశీర్వదిస్తారు.

ఈ గ్రంథముద్రణ గావించిన శ్రీ సారథి ప్రెస్ యాజమాన్యము వారు ముఖ్యముగ శ్రీ C. రంగస్వామి, వారిసిబ్బంది, ఎంతో భక్తితో ముద్రించినారు. అమ్మ శారదమ్మగారి వ్రాతపతిని చక్కగ ముద్రణ చేయగలిగినారు. వారికి గురుదేవుల ఆశీస్సులు. సారథిప్రెస్‌వారు వారిసిబ్బంది మా ఈ తెలుగు ప్రచురణశాఖను ప్రేమతో సేవిస్తున్నారనుట సత్యము. వారినందరను శ్రీ గురుదేవులు ఆశీర్వదింతురుగాక!

ఈ గ్రంథము బహుసాధకులకు సాధనలో కరదీపికగ ఉండగలదని ఆశిస్తు, శ్రీ సౌమ్య కాశీశ్వరునకు నమస్కరిస్తు, శెలవు తీసుకుంటున్నాను. శ్రీ గురుభ్యోనమః!

హరిః ఓమ్!

# విషయ సూచిక



హైద్రాబాదు వాస్తవ్యులు శ్రీమతి Y. అమృ[illegible]మ్మగారు
చిన్మయారణ్యంలో ఉంటున్నారు. వారి భర్త

**కీ॥ శే॥ యాగా పిచ్చిరెడ్డిగారు I.A.S.**

వారి జ్ఞాపకార్థం ఈ గ్రంథ ముద్రణకు అయిదువేల రూపాయలు
విరాళమిచ్చిన పుణ్యమూర్తి, వీరికి శ్రీ Y. వేణుగోపాల్‌రెడ్డి
శ్రీ Y. రమేశ్‌రెడ్డి అని ఇద్దరు కుమారులు, శ్రీమతి సల్లా ప్రమీలమ్మ
అను కుమార్తె గలరు. వీరికుటుంబాలకు శ్రీ గురుదేవుల ఆశీస్సులు
నిండుగ ప్రసరించుగాక! హరిః ఓమ్ !!

# ఈ గ్రంథముద్రణకు విరాళమిచ్చిన దాతలు

1. శ్రీ వై. పిచ్చిరెడ్డిగారి జ్ఞాపకార్థం వారి భార్య
శ్రీమతి అమ్మణ్ణమ్మగారు, చిన్మయారణ్యం రూ 5000–00
2. శ్రీ కె రాధాక్రిష్ణయ్యగారు, పారిశ్రామికవేత్త, కల్లూరు 1000–00
3. శ్రీ మేడా సుబ్బయ్యగారు, అనంతపురం 1000–00
4 శ్రీ వంకదార రామక్రిష్ణయ్యగారు. గుంతకల్లు 1000–00
5. శ్రీ అప్పల లీలాశ్రీధర్ జ్ఞాపకార్థం అప్పల రామక్రిష్ణారావు
వీరి ధర్మపత్ని విజయలక్ష్మి, గుంటూరు 1000–00
6. శ్రీ కె. సంజీవరాయుడుగారు, మహబూబ్‌నగర్ 1000–00
7. శ్రీ బి.వి. సుబ్బరావుగారు, చిన్మయామిషన్, భీమవరం 1000–00
8. శ్రీ పోలిశెట్టి సోమసుందరం చారిటాస్, మ్యానేజింగ్‌ట్రస్టీ
శ్రీ పి. ఏకనాథగుప్తాగారు 1000–00
9. శ్రీ పడుచూరు వెంకటేశ్వర్లుగారు, గుంటూరు 1000–00
10. శ్రీ కుండెకుప్ప సీతమ్మగారి జ్ఞాపకార్థం
Lt Col K.R. Murthy, Bombay 1000–00
11. శ్రీ W.K. గోవిందరాజులు అండ్ సన్స్, హైదరాబాదు 1000–00
12. శ్రీ తల్లం వీరయ్యశెట్టి మెమోరియల్ ట్రస్టు ప్రొద్దుటూరు 1000–00
13. శ్రీ P.V.V A.V. ప్రసాద్, పారిశ్రామికవేత్త గుంటూరు 1000–00
14. శ్రీ కబలవాయి రాధాక్రిష్ణరావు, జ్యువెలర్స్ హైదరాబాదు 1000–00
15. శ్రీ V. ద్వారకనాథరెడ్డి, Nutrine Confectionery
చిత్తూరు 1000–00
16. శ్రీ శేగు సుబ్బయ్యశెట్టి, I T.C. Agents కడప 1000–00
17. పి. వాసుదేవయ్యశెట్టి అండ్ సన్స్, బళ్ళారి 1000–00
18. శ్రీ సగళా నరశింహుల్మలుశెట్టి, ప్రతిభా జ్యువెలరీ హౌస్
బెంగుళూరు 1000–00

| | | |
|---|---|---|
| 19. | చిన్మయామిషన్, విజయవాడ | 2000-00 |
| 20. | శ్రీ మాజేటి పాపారావు, క్రేన్ వక్కపొడి గుంటూరు | 1000-00 |
| 21. | శ్రీ R.R. నాథం Mg. Trustee దక్షిణఇండియా ఆర్యవైశ్య కన్యకాపరమేశ్వరి ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల | 1000-00 |



# శ్రీ తపోవనషట్కం



1. వ్యాప్తం జగద్యేన చిదాత్మభావా ద్రజ్జ్వా యథాఽహిర్హి చరాచరం యత్।
సంన్యస్య సర్వంచ సదాత్మభావే స్వయం సమస్తంచ బభూవయస్తు॥
నిఃసంగనిర్ముక్తి పదం ప్రపద్య బ్రహ్మాత్మభావేన విరాజితో యః।
శ్రీసౌమ్యకాశీశ మహేశ్వరాయ తస్మై నమః స్వామి తపోవనాయ॥

తా॥ ఎవరిచేత చిద్రూపములో, పాములో అంతర్హితమైవున్న త్రాడులా చరాచరజగత్తు వ్యాపింపబడివున్నదో, సద్రూపభావంతో సకల జగత్తును త్యజించి ఎవరు స్వయంగా సమస్తమూ అయ్యారో, నిస్సంగమైన ముక్తిభావాన్నిపొంది ఎవడు బ్రహ్మభావంతో విరాజిల్లుతున్నారో, అట్టి శ్రీసౌమ్యకాశీశుడైన మహేశ్వరునికి స్వామితపోవనులకు నమస్కారము!

2. అఖండభావః శివరూపతత్త్వ శ్చితిస్వభావః పరమాత్మసత్యః।
సత్యస్యసత్యః సుధియైవగమ్యః పర ప్రధానా త్పరమేశ్వరో యః॥
ఆద్యంతహీనో నిరపేక్షదీప్తిః స్వతఃస్వరూపేణ విపుల్లితోయః।
శ్రీసౌమ్యకాశీశ మహేశ్వరాయ తస్మై నమః స్వామితపోవనాయ॥

తా॥ అఖండభావమై, శివతత్త్వరూపమై, చిత్స్వభావమై, పరమాత్మయై, సత్యమై, పంచతత్త్వముల సత్యమై, వివేకులు మాత్రమే చేరగలిగిన గమ్యమై, మూల ప్రకృతికన్న అధికుడైన పరమేశ్వరుడైన వానికి, అద్యంతములు లేక అధారమక్కరలేని జ్యోతికి, స్వయం రూపుడై వికసించే వానికి శ్రీసౌమ్యకాశీశుడైన మహేశ్వరునికి, స్వామితపోవనులకు నమస్కారము!

3. మన్తుర్నశక్యో మనసాకదాచిద్ వక్తుం న కేనాపి తథా న వాచా।
బోద్ధుంచ బుద్ధ్యాది తథా న శక్యో బుద్ధ్యాదిసాక్షీ ఖలు కేవలో యః॥
సర్వేంద్రియాతీత పదస్థితోఽపి సర్వేంద్రియ ప్రేరయితాపరోయః।
శ్రీసౌమ్యకాశీశ మహేశ్వరాయ తస్మై నమః స్వామితపోవనాయ॥

తా॥ ఎన్నడూ మనస్సుతో చింతించడానికి వీలుకానిది, వాక్కుతో వర్ణించడానికి అలవికానిది, బుద్ధితో తెలుసుకోవడానికివీలుకానిది, బుద్ధ్యాదులకు కేవలం సాక్షిఅయినది, సర్వేంద్రియాలకు అతీతుడయ్యా,

సర్వేంద్రియాలకు ప్రేరకుడైనట్టి శ్రీసౌమ్యకాశీశుడైన మహేశ్వరునికి స్వామితపోవనులకు నమస్కారము!

4. శుద్ధాతి శుద్ధంచ సదాప్రబుద్ధో విశ్వేశ్వరో విశ్వపరః ప్రసన్నః।
వ్యాపీ పరబ్రహ్మణి మోదమానో వేదాంతసారః సుధియాం శరణ్యః॥
ఏకోవశీ సర్వభూతాధివాసః సర్వాధిపః సర్వజీవాత్మ కోయః।
శ్రీసౌమ్యకాశీశ మహేశ్వరాయ తస్మై నమః స్వామితపోవనాయ॥

తా॥ శుద్ధాతి శుద్ధమై, సదాప్రబుద్ధమై, విశ్వానికి అధీశుడై, ప్రసన్నుడై, సర్వవ్యాపియై, పరబ్రహ్మంలో నిరంతరం రమింపచుతూ, వేదాంతసారమై, సజ్జనులకు శరణ్యమైన వానిని ఏకమై, సర్వమూ తనవశంలోవుంటూ సర్వులలో తానుజీవిస్తూ, అందరికీ ప్రభువూ, అందరిలోని సారమూ అయిన, శ్రీసౌమ్యకాశీశుడైన మహేశ్వరునికి, స్వామితపోవనులకు నమస్కారము!

5. అశబ్ద మస్పర్శ మరూపవచ్చ తథారసం నిత్య మగంధ వచ్చ।
నిరంజనం నిత్య నిరీహ మేకం బుద్ధే పరం నిర్గుణ సద్ధృవంచ॥
గుహ్యం గంభీరం గగనోపమం యం పశ్యన్తి నిర్ధూతమలా యతీన్ద్రాః।
శ్రీసౌమ్యకాశీశ మహేశ్వరాయ తస్మై నమః స్వామితపోవనాయ॥

తా॥ శబ్ద స్పర్శ రూప రస గంధాలులేక, అకళంకమై, నిత్యమై, కామనా రహితమై, ఏకమై, బుద్ధికి అతీతమై, నిర్గుణధ్రువమై, గుహ్యమై, గంభీరమై, ఆకాశంవలెనుండి, మాలిన్య రహితులైన యతీంద్రులు మాత్రమే, తెలుసుకోగలిగే శ్రీసౌమ్యకాశీశుడైన, మహేశ్వరునికి, స్వామి తపోవనులకు నమస్కారము!

6. తేజోమయం దివ్యమమేయశక్తిం సనాతనం శాంత మనామయంచ।
అద్వైతమాశ్చర్య మచింత్యరూపం పరాత్పరం నిత్య మనన్తమావ్యం॥
జ్ఞానప్రకాశేన విశుద్ధ సత్వోయం పశ్యతి స్వాత్మని చిన్త్యమానం।
శ్రీసౌమ్యకాశీశ మహేశ్వరాయ తస్మై నమః స్వామితపోవనాయ॥

తా॥ తేజోమయమై, దివ్యమై, అప్రమేయమై, సనాతనమూ, శాంతమూ అనామయమైనశక్తి రెండోదిలేని అద్భుతమైన శక్తియై, చింతించడానికి అలవిగాక, పరాత్పరం నిత్యం, అనంతం, అవ్యయమైన, ఏజ్ఞాన ప్రకాశంవల్ల, విశుద్ధ సత్త్వులు మాత్రమే, ధ్యానంలో చూస్తారొ, అట్టి శ్రీసౌమ్యకాశీశుడైన మహేశ్వరునికి, స్వామితపోవనులకు నమస్కారము!



# శ్రీ సౌమ్య కాశీశ స్తోత్రము

## ప్రథమ స్తబకం

శ్రీ సౌమ్య కాశీశ స్తోత్రం భక్తి పూరితమైన ఒక మధురగీతం. ఇందులో మన సనాతనమైన ఉపనిషత్తుల ఉదాత్త భావాలన్నీ పొందుపరచబడి వున్నాయి. ఇరవైయైదేసి శ్లోకాలు వుండే పద్దెనిమిది స్తబకాలతో కూడినది ఈ గ్రంథం. వేదాంతోపన్యాసాలను ఇంత పటిష్ఠంగా, ఇంత భక్తి మిళితంగా రచించిన గ్రంథాలు హిందూశాస్త్రాలలో చాలా అరుదు. పూర్ణమైన భక్తి లేక పోతే భగవంతుని పైన గాఢచింతన స్థిరంగా నిలవదని సంప్రదాయం చెబు తుంది. అయినా ఈ సౌమ్య కాశీశస్తోత్రంలో ఆ విషయం నిరూపింపబడినంత స్పష్టంగా మరెక్కడా నిరూపించబడలేదు.

మొదటి స్తబకం పూర్తిగా భక్తిమయం. పురాణాలలో ప్రశంసింపబడిన శివుని మహిమలు ఇందులో వర్ణింపబడినాయి. ఉత్తరకాశీ అధిష్ఠాన దైవమైన శివుణ్ణి సౌమ్య కాశీశుడని పురాణాలు పేర్కొన్నాయి. ఈ అధ్యాయంలో మనకు పురాణ శివుని దర్శనం అవుతుంది. పోనుపోను విశ్వనాథుడు సర్వవ్యాపి, సర్వాంతర్యామి అయిన పరబ్రహ్మమేనని శ్రీ స్వామి తపోవనం నిరూపిస్తారు.

శ్లో॥ విశ్వనాథ! నమస్తుభ్యం విశ్వమాయా విలాసినే।
కాశికేశ! నమస్తుభ్యం కేశవాద్యర్చితాంఘ్రయే॥

ప్రతి॥ హే విశ్వనాథ = ఓ విశ్వేశ్వరా! విశ్వ మాయయా = సకలమాయతో, విలాసనే = విరాజిల్లు, తుభ్యం = నీకు, నమః = నమస్కారం, హే కాశికేశ = ఓ కాశీకాధిపతీ! కేశవ + ఆది = కేశవుడు మొదలైనవారిచే, అర్చిత = పూజింపబడ్డ, అంఘ్రయే = పాదాలుగల, తుభ్యం = నీకు, నమః = నమస్కారం.

## తాత్పర్యం

ఓ విశ్వనాథా! నీకు నా ప్రణామాలు. ఈ మాయా ప్రపంచంలోని వైవిధ్యానికి ఆధారమైన పరమసత్యానివి నీవే. సౌమ్య కాశీశుడా, నీకు నా ప్రణామం. విష్ణువు మొదలైన భక్తులందరిచేత నీ పరమపావన పదాలు అర్చింపబడుతాయి.

## వ్యాఖ్య

పరుగులెత్తే మనస్సు శాంతపడి ఇష్టదేవుని సాన్నిధ్యంలో నిలవడం కోసం కాశీ విశ్వనాథుని పవిత్రప్రతీక ఆరాధింపబడుతుంది. ఉత్తర కాశీ దేవుడైన కాశీ విశ్వనాథలింగం యావద్విశ్వంలోని నామరూపాలకు వెనుకనున్న అనంత సత్యానికి ప్రతీక.

'సౌమ్య కాశీశుడైన పరమశివుడు మనలోని ఆత్మయే' అని జగత్తులోని వైవిధ్యనాటకానికి అనంతమైన ఆధారమని శ్రీ గురుదేవులు సూచిస్తున్నారు.

**శ్లో॥ విశ్వంభర! నమస్తుభ్యం విశ్వవిధ్వంస మూర్తయే।**
**విశ్వరూప! నమస్తుభ్యం విశ్వసృడ్ దర్పహారిణే॥ 2**

ప్రతి॥ హే విశ్వంభర = ఓ జగత్పోషకా! విశ్వ = ప్రపంచాన్ని (ప్రళయకాలంలో) విధ్వంస = నాశంచేయ సమర్థమైన, మూర్తయే = స్వరూపం గల, తుభ్యం = నీకు, నమః = నమస్కారం, హే విశ్వరూప = ఓ జగద్రూపా! విశ్వసృడ్ = బ్రహ్మయొక్క, దర్ప = గర్వాన్ని, హారిణే = అణగార్చు, తుభ్యం = నీకు, నమః = నమస్కారం.

## తాత్పర్యం

జగత్తులోని అన్ని వ్యవహారాలకు ఆధారమై, సర్వవిధ్వంసకారివైన నీకు కాలరూపిగా నా ప్రణామాలు! జగత్తులోని అన్ని ఆకారాలూ నీవే! సృష్టికర్త దర్పాన్ని అణచిన నీ కిదే నా నమస్కారం!

## వ్యాఖ్య

మనలోని చైతన్యం అన్ని జడ పరికరాలనూ సజీవం చేస్తుంది. శారీరక మానసిక బౌద్ధికానుభవా లన్నింటిని తెలుసుకునేది కూడా అదే. దృశ్యమాన ప్రపంచంలోని అన్ని కార్యాలు జీవుల పరస్పర వ్యవహారాలు—ఈ చైతన్యం యొక్క ఆధారంగానే సముద్రంలోని కెరటాలలాగా నర్తించుతూ కదులుతాయి.

విష్ణుబ్రహ్మలు ఒకసారి పరమశివుని వ్యాపకత్వాన్ని కొలవ బోయిన గాథ పురాణాలలో ఉన్నది. వాళ్ళలో ఒకరు పైకి తల ఎక్కడ ఉన్నదో చూడ డానికి, రెండవవారు క్రిందికి పాదాలు ఎంత లోతున ఉన్నాయో చూడడానికి వెళ్ళారట. ఇద్దరూ నిరాశతో తిరిగి రావలసి వచ్చింది. అనగా భగవంతుడు అనంతుడు, సర్వవ్యాపి. ఆయన ఉనికికి మొదలు, తుది లేవు. ఇలా సృష్టికర్త —అంటే బుద్ధిలోని సృజనశక్తి తన పరిశోధనా శక్తివల్ల సర్వాన్ని కనుక్కోగల ననే దర్పాన్ని పోగొట్టుకున్నది!

శ్లో॥ వామదేవ! మహాదేవ! దేవదేవ! జగత్పతే!
భవ! భక్త్యాభజామి త్వ ద్భవచ్ఛేద పదాంబుజమ్॥ 3

ప్రతి॥ హే వామదేవ = ఓ వామదేవుడా! మహాదేవ = ఓ మహాదేవా! దేవదేవ = దేవాధిదేవా! జగత్పతే = జగన్నాయకా! భవ = ఈశ్వరా! త్వత్ = నీయొక్క, భవ = సంసారబంధాన్ని, ఛేద = ఛేదించు, పదాంబుజమ్ = పాదపద్మాలను, భక్త్యా = భక్తితో, భజామి = సేవిస్తున్నాను.

## తాత్పర్యం

ఓ వామదేవా! మహాదేవా! దేవదేవా! జగత్పతే! కాలబద్ధమై కనబడే జగానివి నీవే! అందుచేత మార్పులతో కదలాడుతున్నావు. అనే కథా భ్రాంతిని మార్పుల భ్రాంతిని తొలగించే నీ పాదపద్మాలకు వంగి నమస్కరిస్తాను!

## వ్యాఖ్య

వామదేవ: సూక్ష్మరూపి, మోహనరూపి అనే కాక సంస్కృతంలో ఈ పదానికి 'ఆరాధనీయుడు' అనే అర్థం కూడా ఉన్నది.

దేవదేవ: వెలిగించేవాడు, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, విషయప్రపంచం–ఉద్రేకాలు–తలపులను మన చైతన్య పరిధిలోకి తీసుకొని వచ్చే పరికరాలు. చైతన్యం లేకుంటే ఇంద్రియాలకు రూప, రస, గంధ, శబ్ద, స్పర్శలను గ్రహించే జ్ఞానం ఉండదు. అందుచేత నీవే నాలోని చైతన్యకాంతివి. కంటికి కన్ను, చెవికి చెవి అయిన దేవుడివి, నీవే!

**శ్లో॥ సౌమ్య కాశీపతే! తుభ్యం సౌమ్య మూర్తే! నమోనమః।**
**సర్వదైవ నమస్తుభ్యం సర్వదైవత రూపిణే॥ 4**

ప్రతి॥ హే సౌమ్యకాశీపతే = ఓ ఉత్తరకాశీపతీ, సౌమ్యమూర్తే = ఓ ప్రసన్నాకారా! తుభ్యం = నీకు, నమోనమః = సర్వవేళల్లోనూ నమస్కారం, సర్వదైవ = సర్వదైవముల స్వరూప! సర్వదైవత = సమస్త దేవతల, రూపిణే = స్వరూపుడయిన, తుభ్యం = నీకు, నమః = నమస్కారం.

## తాత్పర్యం

ఓ ఉత్తరకాశీపతీ! శాంతి సుఖస్వరూపా! నీకు నా వినయ పూర్వక నమస్కృతులు సర్వదేవతల సారమైన ఏకరూపికి నీకు సర్వకాలాలలో నా నమస్కారం.

## వ్యాఖ్య

"సర్వదైవ" "సర్వదైవత" అనే మాటల వాడుటలోని చమత్కారాన్ని గమనించండి! ఇకపై అయిదో శ్లోకం నుండి ఇరవయ్యో శ్లోకం వరకు పరమేశ్వర మహిమలు విచిత్రంగా చిత్రింపబడినాయి. ఈ చిత్రానికి శ్రీ స్వామీజీ హృదయభావనలోని మధురవైరుద్ధ్యాలే రంగులు! స్వచ్ఛభాషా ప్రయోగమే కుంచె! ఆ విరుద్ధత ముందు మన దృష్టిని ఆకర్షించి నవ్వు

పుట్టిస్తుంది. తరువాత లోతైన ఆలోచనలని సృష్టించి ఆ పదాలలోని భావ గాంభీర్యాన్ని వెలిబుచ్చి లజ్జపడేట్లు చేస్తుంది. సంస్కృత కావ్యాలలో దీనిని "విరోధాభాస" అంటారు. ఇది ఒక అలంకారం.

శ్లో॥ గంగాధరోఽపి భగవన్ గంగారోధసి వర్తసే।
సోమసూర్యాగ్ని నేత్రోఽపి సోమచూడశ్చ దృశ్యసే॥ 5

ప్రతి॥ హే భగవన్ = ఓ పరమేశ్వరా! (త్వం = నీవు) గంగాధరః + అపి = తలపై గంగను ధరించినవాడవయ్యీను, గంగారోధసి = గంగానది తీరమందు, వర్తసే = నివసిస్తున్నావు, సోమ + సూర్య + అగ్ని = చంద్రుడు, సూర్యుడు, అగ్నులు - అనువారినే, నేత్రః + అపి = కన్నులుగా గలవాడివయ్యీను, సోమచూడః + చ = చంద్రశేఖరుడు గను, దృశ్యసే = కనబడుతున్నావు.

## తాత్పర్యం

ఏమి విచిత్రం! పరమశివా! నీవు తలపైన గంగను ధరిస్తావు, అయినా గంగా తీరాన వసిస్తావు! సోమసూర్యాగ్నులు ని కళ్లే, అయినా చంద్రుణ్ణి శిరో భూషణంగా ధరిస్తావు.

## వ్యాఖ్య

విరాడ్రూపిగా పరమశివుడు జడచైతన్యమయమైన యావత్ప్రపంచానికి తానే ప్రతినిధి. అందుచేత ఆయన కళ్లే అందరి కళ్లు. కళ్లు కాంతిరంగంలోనే పనిచేయగలవని తెలిసిన విషయమే. కాంతి లేకపోతే కళ్లు పనిచెయ్యవు. అందుచేత సహజ కాంతులైన సోమసూర్యాగ్నులు ఆయన నేత్రాలు. అయినా చంద్రరేఖ ఆయన శిరస్సును అలంకరిస్తూంది. చంద్రరేఖ క్షీణించిన మనస్సుకు సంకేతం. పరమాత్మకు మనస్సు అనేది అలంకారం.

నిరంతరం గమించేది గంగ, ఎప్పుడూ కదిలే జగత్తే గంగ దీనికి ఆధార మైన వాడు గంగాధరుడు. అయితే ఆయన స్వయంగా కదలడు. కదిలే జగత్తుకు తటస్థమై అచలమై వుండే చైతన్యరూపి ఆయన. అందుకే గంగాతీర వాసుడన్నాడు.

శ్లో॥ కాశీ పృష్ఠే విహరసి విరాణ్మూర్తి రపి ప్రభో।
కో వేత్తి తవ మాహాత్మ్యం త్వదన్యః పరమాద్భుతం॥ 6

ప్రతి॥ హే ప్రభో = ఓ దేవా! విరాట్ + మూర్తి + అపి = విశ్వమంతటా ప్రకాశించు స్వరూపుడవయ్యును. కాశీపృష్ఠే = సోము కాశీ ప్రాంతమందు విహరసి = విహరిస్తున్నావు, తవ = నీయొక్క, పరమ + అద్భుతం = అత్యాశ్చర్యకరమైన, మాహాత్మ్యం—మహత్త్వమును, త్వమ్ + అన్యః నీవు కాక, కః = ఇతరుడెవడు, వేత్తి = తెలిసికొనగలడు?

తాత్పర్యం

ప్రపంచం యావత్తు నిరూపమైన విరణ్మూర్తివి నీవు. అయినా సౌమ్య కాశీ ప్రాంతంలో నివసిస్తూ పునీతం చేస్తున్నావు నీ మాహాత్మ్యాన్ని నీవు తప్ప ఇంకెవరు తెలుసుకోగలరు? అద్భుతాలకల్లా అద్భుతానివి నీవు!

వ్యాఖ్య

సాధారణంగా మన ఇంద్రియాలద్వారా గ్రహించిన విషయాలను బుద్ధి అంచనాలు కట్టి తెలుసుకొంటుంది అంతరాంతరాలలో నిరంతర వ్యాఖ్యలు వినవస్తాయి. ఒక వస్తువును చూచినప్పుడు బుద్ధి అంచనాలు, కట్టకుండా నిలిచినపుడు అంతర్వ్యాఖ్యానాలు లేని మనస్సుయొక్క విచిత్ర స్థితిని "అద్భుతం" అంటారు. ఉపనిషత్తులలో భావనాతీతమైన అనుభవస్థితిని "పరమాద్భుతం" అని ఋషులు వర్ణించారు.

బుద్ధిగ్రహించే విషయాల జాబితాలో పరమాత్మ ఒకడు కాదని తెలుప డానికి ఋషులు ఈ పదాన్ని వాడుతారు. అందుకోసమే కవులు "విరోధాభాస" అలంకారాన్ని వాడుతారు!

శ్లో॥ గిరిరాజసుతా పుణ్య పరిపాకోఽస్తు మే గతిః।
సురవృక్షవృతే యస్య మందిరే సుందరే స్థితిః॥ 7

ప్రతి॥ యస్య = ఎవనియొక్క, సురవృక్షవృతే = దేవతావృక్షములతో చుట్టబడిన, సుందరే = సుందరమయిన,మందిరే = మందిరమందు,స్థితిః = ఉనికిగలదో, గిరిరాజసుతా = పార్వతియొక్క, పుణ్యాపేః పాకః = పుణ్య ఫలమైన, సః = అట్టి శివుడు, మే = నాకు, గతిః + అస్తు = రక్షకుడు అగుగాక!

## తాత్పర్యం

దేవదారు వృక్షాలచేత పర్యవేష్టింపబడిన అందమైన మందిరంలో ప్రభువు వసించి వున్నాడు హిమవంతుని కుమార్తె పుణ్యఫలమైన దేవుడు నా మార్గము, గమ్యము అగునుగాక!

## వ్యాఖ్య

"గతి" అంటే మార్గము, లక్ష్యము అని రెండు అర్థాలున్నాయి. పరమ శివుని పట్ల భక్తిమార్గమైతే, పరమశివుడు లక్ష్యము. ఫలదాయకమైన గమ్యము!

శ్లో॥ త్రిశూల రూపయా, శక్త్యా హేరంభాద్యైశ్చ నిర్జరైః।
గోపకోటేశ్వరాభ్యాంశ్చ సంవృతం శంకరం భజే॥ 8

ప్రతి॥ (హే శంకరా! = ఓ ఈశ్వరా!) త్రిశూలరూపయా = త్రిశూలాత్మకమైన, శక్త్యా = శక్తిచే, హేరంభాద్యైః = వినాయకుడు మొ॥ నిర్జరైః + చ = దేవతలచేతను, గోపకోటేశ్వరాభ్యాం + చ = గోపేశ్వర కోటేశ్వరులతోను, సంవృతం = పరివేష్టింపబడియున్న, శంకరం = శంకరుడైన నిన్ను, భజే = సేవిస్తున్నాను.

## తాత్పర్యం

త్రిశూలరూపంలో శక్తి, గణేశుడు మొదలైన దేవతలచేత, గోపేశ్వరుడు, కోటేశ్వరుల చేత పర్యవేష్టింపబడిన, సౌమ్య కాశీశ్వరుడైన విశ్వనాథుణ్ణి నేను సేవిస్తాను.

## వ్యాఖ్య

ఉత్తర కాశీలో విశ్వనాథమందిరాన్ని చుట్టుకొని చాలా మందిరాలున్నాయి. అందులో ప్రఖ్యాతి చెందిన గోపేశ్వర కోటేశ్వరులు శివస్వరూపాలే. విశ్వనాథుని గర్భాలయాని కెదురుగా సూర్యకాంతిలో బంగారురంగుతో మెరిసే త్రిశూలం ఉన్నతంగా నిలబడి ఉంటుంది. ఈ త్రిశూలాన్ని శక్తిగా, గణేశుడుగా మొదలైన దేవతలుగా ఆరాధిస్తారు.

**శ్లో॥ వారిదాభం గళే గంగావారి గౌరం కళే బరే।**
**వారణాద్రిపతిం వందే వారణాజిన వాససమ్॥** 9

ప్రతి॥ గళే = కంఠమందు, వారిద + ఆభం = మేఘంతో సమానంగ నల్లకాంతి కలవాడయ్యును, కళేబరే = శరీరమందయితే, గంగా + వారి + గౌరం = గంగాజలంవలె తెల్లనయినవాడును, వారణ + అజిన = గజచర్మ లేడిచర్మాన్ని, వాససమ్ = వస్త్రంగా గలవాడయ్యును, వారణ + అద్రి + పతిం = వారణావత పర్వతాధిపతిగానున్న, (శంకరం = ఈశ్వరుని) వందే = నమస్కరిస్తున్నాను.

## తాత్పర్యం

మేఘంవలె నల్లనైన గళంలో గంగాజలం వలె తెల్లనైన శరీరంతో ఏనుగు, లేడి చర్మాలను ధరించిన వారణావత పతికి నమస్కరిస్తాను.

## వ్యాఖ్య

పై వర్ణనలన్నీ ప్రసిద్ధమైన పురాణగాథలకు చెందినవే. దేవ దానవులు పాలసముద్రాన్ని మథించినప్పుడు కవ్వపుత్రాడుగా ఉపయోగపడిన వాసుకి అలిసిపోయి, అతి ప్రమాదకరమైన విషాన్నంతా బైటికి కక్కివేశాడు. దాని సెగలకు సర్వనాశమై పోతామని భయపడి దేవదానవులు నలుదిక్కులకూ పారిపోయారు. ప్రపంచాన్ని రక్షించడం కోసం పరమశివుడు ఆ విషాన్ని స్వీకరించి మింగివేశాడు. పతివ్రతామ తల్లియైన పార్వతి ఆయన గొంతును అదిమి పెట్టి భయంకరమైన ఆ విషం లోపలికి దిగకుండా కాపాడింది.

పరమేశ్వరుడు దానిని బైటకి ఉమ్మివెయ్యలేదు. ఇలా అది కంఠంలోనే ఉండి పోయి, ఆయనను నీలకంఠుణ్ణి చేసింది. గజాసురుణ్ణి సంహరించినప్పుడు, అతడి శరీరాన్ని తన వాసనంగా ధరించాడు.

శ్లో॥ కాలకాలం మహాకాళం కాలవ్యాళ విభూషణం।
ఫాలనేత్రం ప్రణౌమి శ్రీ కాశికాపతి మీశ్వరమ్॥ 10

ప్రతి॥ కాలకాలం = కాలుడైన యమునికి కాలుడును, మహాకాళం = మహా కాల స్వరూపుడును, కాలవ్యాళ = కాలసర్పాన్ని, విభూషణం = అలం కారంగా గలవాడును, ఫాలనేత్రం = నొసటికన్ను గలవాడును, శ్రీ కాశికాపతి = కాశీశ్వరుడును—అయిన, ఈశ్వరం = శివునికి, ప్రణౌమి = నమస్కరిస్తున్నాను.

తాత్పర్యం

యమునికే కాలుడై, కాలసర్పాన్ని అలంకారంగా మెడలో ధరించే వానికి, ఫాలనేత్రునికి కాశీపతి శ్రీ శంకరునికి నా ప్రణామాలు.

వ్యాఖ్య

భక్తుడైన మార్కండేయుణ్ణి రక్షించడంకోసం యమధర్మరాజును దండించినట్లు శివపురాణం చెబుతుంది. మనం చూడగానే భయపడి పారిపోయే నల్లత్రాచు ఆయనకు కంఠాభరణం. కాలమనే త్రాచు అది. మనస్సు ఆలోచనల స్రోతస్సు. ఒక ఆలోచనకు మరో ఆలోచనకు మధ్య ఉన్న అంతరాన్ని కాలమంటారు. ఆలోచనలను నిలిపివేసినప్పుడు కాలం అంతరించి నట్లే, కాలసర్పాన్ని అదుపులోకి తెచ్చుకొని అలంకరించుకొన్నట్లే.

శ్లో॥ భూతానా మీశ్వరం భస్మభూషా భూషిత విగ్రహమ్।
స్మశాన శాయినం వందే జటాజూటక మస్తకమ్॥ 11

ప్రతి॥ భూతానాం = సర్వజీవులకు, ఈశ్వరం = ప్రభువు, భస్మ = భస్మమనే, భూషా = అలంకారంచేత, భూషిత = అలంకరింపబడ్డ, విగ్రహం =

శరీరం గలవాడు. స్మశాన = స్మశానంలో, శాయినం = నిద్రించువాడు, జటాజూటక = జడలముడిచేనిండిన, మస్తకమ్ = శిరస్సు కలవాడూ అయిన, (శంకరం = శివుని) వందే = నమస్కరిస్తున్నాను.

## తాత్పర్యం

ప్రాణులందరికి అధిపతి అయిన వానికి, భస్మంతో అలంకృతమైన శరీరం కలవానికి, స్మశానంలో నిద్రించేవానికి, శిరస్సుపైన జటాజూటం కల వానికి, పరమశివునికి నా నమస్కారం.

## వ్యాఖ్య

ప్రాణులందరికి చేతనత్వాన్ని కలిగించే ఏకప్రభు వాయన. అందుచేత భూతరాశికి అధిపతి, నియామకుడు. ఆయన స్పర్శలేని వృక్షంగాని, జంతువు గాని, మానవుడుకాని—ఏ శరీరమైనా నిర్జీవమైపోతుంది. అందుకే ఆయన భూతపతి.

జాగ్రదవస్థ స్వప్నానికి స్మశానం. పరమశివుడు సాక్షాత్తు పరమాత్మయే. అహంకారాన్ని, మానసికాందోళనలను పూడ్చిపెట్టే స్మశానవాటికలో ఆయన నివసిస్తాడు.

తపస్సు చేసే వాళ్ళకు జుట్టు దువ్వుకోవాలనే ధ్యాసగాని కత్తిరించుకునే ధ్యాసగాని వుండదు.నిత్యతపస్వి అయిన పరమశివుడి జుట్టు పెరిగిపోతూంటుంది. అందువలన వెంట్రుకలను తలపైన చుట్టి పెట్టుకుంటాడు. అదే జటాజూటం.

శ్లో॥ పురత్రయ నిషూదాయ పరమైశ్వర్యధారిణే।
పరాపరాయ రుద్రాయ పరేశాయ నమోనమః 12

ప్రతి॥ పురత్రయ = త్రిపురాలను, నిషూదాయ = సంహరించినవాడును, పరమ + ఐశ్వర్య = అష్టసిద్ధులను, ధారిణే = ధరించినవాడును, పరా పరాయ = పరాపరరూపుడును, పరేశాయ = పరమేశ్వరుడూఅయిన, రుద్రాయ = రుద్రునికి, నమోనమః = సర్వకాల నమస్కారాలు.

## తాత్పర్యం

త్రిపురాలను సంహరించినవానికి, అష్టైశ్వర్యాలు కలిగినవానికి, పరాపరాలు రెండూతానే అయిన వానికి, ప్రాణుల దుఃఖాలను హరించేవానికి, పరబ్రహ్మకు, నా ఇష్టదేవుడైన కైలాసాధిపతికి నమోవాకాలు!

## వ్యాఖ్య

పురమంటే పట్టణమని కాదు. అనుభవరంగమైనది. మానవుని పురం. ప్రతివ్యక్తి జాగ్రత్స్వప్న సుషుప్తులనే మూడురంగాలలో అనుభవాలు పొందుతాడు. ఈ మూటికి భిన్నమైనది ఆత్మ. అది ఈ మూడు రంగాలను నశింపజేస్తుంది. శివపురాణం దానినే త్రిపురాసుర సంహారంగా పేర్కొన్నది. ఆయనకు ఎదురైనిలిస్తే ఈ మూడురంగాలకు నిలిచే సత్తా లేదు. నశించిపోతాయి.

పరాపర:– కార్యకారణ విభజన కాలపరిధిలో ఉంటుంది. ముందున్నది కారణం, తరువాత వచ్చేది కార్యం. అందువలన కార్య కారణ సంబంధం కాలరంగంలోనే పనిచేస్తుంది. మరి కాలమో! అది బుద్ధిలోని ఒక ఆలోచన. బుద్ధిని అధిగమించామో, కాలపరిధిని తరించి కాలాతీతుల మవుతాము. కాలంలేని ఆత్మస్థాయి అది. అక్కడ కార్య కారణాలు రెండూ కరిగిపోయి ఏకమైన కేవల ఘన శుద్ధ చైతన్యం ఒక్కటే భాసిస్తుంది. కార్యమైన జీవుడు, కారణమైన ఈశ్వరుడు ఇద్దరూ ఉండరు. జీవుడు 'అపర'. ఈశ్వరుడు 'పర'. అందుచేత 'పరాపరుడు' పరమేశ్వరుడు. రెండూ తానే అయి, రెంటినీ అధిగమించిన వాడు.

శ్లో॥ కరాళం కాళికేశం నృకరోటీ కలితస్రజమ్।
ఆశా వాసో వసానం శ్రీ విశ్వనాథ ముపాస్మహే॥ 13

ప్రతి॥ కరాళం = భయంకరుడు, కాళికా + ఈశం = పార్వతీదేవి భర్తయు,
నృ + కరోటీ = మానవుల పుఱ్ఱెలతో, కలిత + స్రజమ్ = చేసిన మాలను

ధరించేవాడు, ఆశావాసః = దిగంతాలనే, వసానం = వస్త్రాలు గా ధరించే వాడూ అయిన, శ్రీ విశ్వనాథం = శ్రీ విశ్వేశ్వరుని, ఉపాస్మహే = సేవిస్తాను.

## తాత్పర్యం

భయంకరుడై, కాశీపతియై, కపాలమాలను ధరించి, దిగంబరమూర్తి అయిన శ్రీ విశ్వనాథుణ్ణి ఉపాసిస్తాను.

## వ్యాఖ్య

అందమైనవి, ఆనందకరమైనవి, ఆకర్షణీయమైనవి — ఇలాంటి వీటికి మాత్రమే విశ్వనాథుడు మూలం కాదు. భయంకరం, వికృతం, అసహ్యకరం, జుగుప్సాకరమైన వాటికి కూడా ఆయనే మూలం. అందానికి, వికృతానికి, సుఖప్రదమైనవాటికి, భయంకరమైనవాటికి కూడ కారణం ఆయనే.

శ్లో॥ కాలకూటాశినే తుభ్యం శైలకూట నివాసినే।
శూలినే పాలినే ధన్వశాలినేఽస్తు నమోనమః॥ 14

ప్రతి॥ కాలకూట = కాలకూటవిషమే, అశినే = భోజనంగా గలవాడూ, శైలకూట = కైలాసశిఖరంలో, నివాసినే = నివసించేవాడూ, శూలినే = శూలమును ధరించేవాడూ, పాలినే = పాలించేవాడూ, ధన్వశాలినే = పినాకమనే ధనుస్సును ధరించేవాడూ అయిన, తుభ్యం = నీకు, నమోనమః = సర్వవేళలా నమస్కారాలు, అస్తు = అగుగాక!

## తాత్పర్యం

కాలకూటవిషం త్రాగినవానికి, కైలాసశిఖరంపై వసించేవానికి, త్రిశూలాన్ని పినాకాన్ని ధరించినవాడికి, రక్షకునికి నా నమోవాకాలు.

## వ్యాఖ్య

ప్రతివ్యక్తిలోని వాసనలను సజీవం చేస్తుంది ఆత్మ. సజీవాలైన వాసనలు మనస్సులో సత్త్వరజఃతమస్సులనే మూడు స్థాయిలను కలిగిస్తాయి. ఈ

మూటి ప్రభావానికి లోబడి అందరి మనస్సులు పనిచేస్తాయి. ఈ మూడు గుణాలే వ్యక్తుల స్వభావాలను నిర్ణయిస్తాయి. మనస్సు యొక్క ఈమూడు భావాలకు సంకేతం త్రిశూలం. మూడు గుణాలను అధిగమించినవాడు త్రిశూలధారి అయి పరమాత్మ అయిన శివతత్త్వమౌతాడు. మూడు గుణాల ద్వారా ప్రపంచంలో వ్యక్తమౌతాడు.

శ్లో॥ తుషార ధవళాంగోఽయం తుషార గిరిజా ధవః।
వృషాధి వాహనో హన్యాద్వృష వంద్యోఽ వృషద్విషమ్॥ 15

ప్రతి॥ తుషార = మంచువలె, ధవళ = తెల్లనైన, అంగః = శరీరుడై, తుషార గిరిజా ధవః = మంచుకొండ కూతురైన పార్వతీదేవి భర్తయు, వృష + అధివాహనః = నందీశ్వరుని వాహనంగా కలిగినాకూడా, వృషవంద్యః = ఇంద్రపూజితుడూ, అయం = అయిన, ఈ శంకరుడు, అవృష = నా పాపాలనే, ద్విషమ్ = శత్రువును, హన్యాత్ = చంపుగాక!

## తాత్పర్యం

మంచువలె తెల్లనైన శరీరం కలవాడు, మంచుకొండల కుమార్తెకు భర్త అయినవాడు, నందివాహనుడు, ఇంద్రునిచే అర్చింపబడినవాడు అయిన పరమ శివుడు నా శత్రువులైన దుష్టగుణాలను సంహరించును గాక!

## వ్యాఖ్య

దేవతల రాజైన ఇంద్రుడు కూడా పరమేశ్వరుణ్ణి అర్చించుతాడు. ఇంద్రుడంటే ఇంద్రియాలకి రాజైన మనస్సు భక్తి పూరితమైన మనస్సు తనను చైతన్యవంతం చేసే మంగళస్వరూపుడైన ఆత్మను అర్చిస్తుంది.

వృషమంటే ధర్మం. అవృషమంటే అధర్మం. పాపరూపమై శత్రువు అనడంలో వాడిన పదాల సొబగు కవికి సంస్కృత భాషపైన ఉన్న అధికారాన్ని చెప్పకయే చెబుతుంది.

శ్లో॥ అర్ధనారీపతే! తుభ్య మధ్వర ధ్వంస కారిణే।
అఘోరాయ నమః సాక్షా దపార కరుణాం బుధే॥ 16

ప్రతి॥ అపారకరుణాంబుధే = అపారదయాసాగరా! అర్ధనారీపతే! = అర్ధనారీశ్వరుడా! అధ్వర = దక్షయాగాన్ని, ధ్వంసకారిణే = నాశంచేసే. అఘోరాయ = అజ్ఞానాన్నిపోగొట్టే, తుభ్యం = నీకు, సాక్షాత్ = ప్రత్యక్షంగా, నమః = నమస్కారం.

## తాత్పర్యం

ఓ దయాసముద్రుడా, విచిత్రమైన అర్ధనారీశ్వర రూపధారీ, దక్షయజ్ఞ విధ్వంసకుడా, అజ్ఞాననాశకుడా, నీకు నా నమస్కారాలు.

## వ్యాఖ్య

నేటి క్రిస్టియను ప్రపంచంలో ఉన్నట్లుగా భగవంతుడు పురుషుడా, స్త్రీ యా అనే గందరగోళం హిందూధర్మంలో లేదు. నిజానికి స్త్రీ స్వాతంత్ర్యమనేది పాశ్చాత్య దేశాల సమస్య. మన సంస్కృతిలో లేదు. ఇక్కడ ఋషులు స్త్రీ పురుష లిద్దరూ సమానమని చూపుతున్నారు. భగవంతుడు పురుషుడు, స్త్రీ కూడా—ప్రకృతి పురుషులిద్దరూ అయనే. ఒకరు లేకపోతే రెండోవారు ఉండి ప్రయోజనం లేదు. ప్రకృతి జడమైనది. అచేతనం. పురుషస్పర్శతో జడపదార్థానికి చేతనత్వంవచ్చి కదిలి వ్యవహరిస్తుంది. అలాగే ప్రకృతిని స్వీకరించినప్పుడే పురుషుడు వ్యక్తమవుతాడు. శక్తుడు, శక్తి వేరుకాదు. క్రియలో వాళిద్దరూ ఏకమై పెనవేసుకొని పోతారు.

శ్లో॥ ప్రసీద భగవన్ శంభో ప్రసీద వృషభధ్వజ।
కురుష్వ కృపయా నిత్యం నృత్య మస్మన్మ నోంగణే॥ 17

ప్రతి॥ హే భగవన్ = ఓ భగవంతుడా! శంభో = శంకరుడా! ప్రసీద = అనుగ్రహించుము, వృషభధ్వజ = నందిని ధ్వజచిహ్నంగా కల్గినవాడా,

ప్రసీద = అనుగ్రహించుము, అస్మత్ = మా, మనః + అంగణే = హృదయ ఫలకమందు, కృపయా = దయచేసి, నిత్యం = ఎల్లపుడూ, నృత్యం + కురుష్వ = నర్తించుము.

తాత్పర్యం

ఓ భగవంతుడా! శంభో! వృషభధ్వజుడా, కృపాళుడివై నా మనో ప్రాంగణంలో నిరంతరం నర్తించు!

వ్యాఖ్య

మన కాలం ఎంత హీనస్థితికి దిగజారిందంటే అసభ్యంగా జీవిస్తూ అపకీర్తి పొందిన వాళ్ళని కూడా "భగవాన్" అని పిలుస్తున్నాము! ప్రతివాని జనన మరణాలు, భావి సుఖ దుఃఖాలు తెలిసినవారే "భగవాన్" అని ఈ శ్లోకం వల్ల గోచరమవుతుంది.

శ్లో॥ త్ర్యక్షోఽ ప్యసౌ సప్తశిరాంశ్చ బిభ్రత్
సర్పస్రజం క్ష్వేలభు గష్ట మూర్తిః।
జేజీయతే హన్త హిమాద్రిమధ్యే
కపాల భృత్ కశ్చన భిక్షువర్యః॥ 18

ప్రతి॥ అసౌ = ఈ శంకరుడు త్ర్యక్షః + అపి = మూడుకన్నులుండీకూడా, సప్తశిరాన్ + చ = ఏడుతలల్ని, బిభ్రత్ = ధరిస్తూ, సర్పస్రజం = పాములనే హారాలుగా గలవాడూ, క్ష్వేళభుక్ = విషం తినేవాడు, అష్టమూర్తి = ఎనిమిది శరీరాలు గలవాడయినా, కపాలభృత్ = పుర్రెలు ధరించినవాడు, కశ్చన = ఒకానొక, భిక్షువర్యః = మంచి బిచ్చగాడు, హిమాద్రిమధ్యే = హిమాలయాల్లో, జేజీయతే = వెలుగుచున్నాడు, హన్త = అయ్యో.

తాత్పర్యం

మూడుకళ్లు, ఏడుతలలు కలిగినవాడాయన! పాముల దండలతో, విషం త్రాగుతూ అష్టమూర్తి అయిన వాడాయన! అహా! హిమాలయాలలో కపాలం చేతబట్టి భిక్షువుగా పర్యటిస్తాడు!

వ్యాఖ్య

శివుని మూడుకళ్లు శరీరానికున్న వికారం కాదు. మనందరికీ రెండేసి చర్మనేత్రాలున్నాయి. వాటిద్వారా భౌతిక ప్రపంచంలోని వైవిధ్యాన్ని చూస్తాము. ఆయనో, తన విశిష్ట జ్ఞానంతో ప్రపంచ వైవిధ్యానికి ఆధారమైన ఏకతత్త్వాన్ని కూడా చూస్తాడు. ఈ జ్ఞానం ఉన్న వాళ్లందరికీ మూడోనేత్రం ఉన్నట్లే.

ప్రతి మతంలోను 'పాము' అహంకారాన్ని సూచిస్తుంది. అది మనలోని అల్పవ్యక్తిత్వం. మనలోని అహంకార సర్పం మనపైకే బుసలు కొట్టుతుంది. దానివల్లనే మనం విషపూరితుల మౌతాము. తన తపస్సు వల్ల అహంకారాన్ని అణచి దానినే అలంకారంగా చేసుకొన్నవాడు భగవంతుడు.

వేదవాఙ్మయంలో పంచభూతాలు, యజ్ఞం చేసే యజమాని, సూర్య చంద్రులు—ఈ ఎనిమిదింటిని అష్టమూర్తులంటారు విషయాలు—వ్యక్తులతో కూడిన జగన్నాటకంలో ఈ ఎనిమిది అత్యంత ప్రధానమైనవి. ఈ ఎనిమిదీ ఆయన రూపాలే, పరమాత్మ అయిన శంభుడే అష్టమూర్తి.

ఆత్మానుభవం కలిగిన మహాత్ముడు ఆనందరూపుడుగా వున్నందున విషయవస్తువులపైన ఆయనకు కోరిక వుండదు. అడగకుండా లభ్యమైన దానితో జీవిస్తాడు. ఖాళీగా ఉన్న కపాలంలో దానిని స్వీకరిస్తాడు—అంటే ఆలోచనలు లేని శూన్యమైన మనస్సులోకే ఈ అనుభవాలు వస్తాయి. ఆశలు, ఆకాంక్షలు, లేని "ఖాళీపుర్రె" అది.

శ్లో॥ కైలాసశైలే కలధౌత ధౌతమ్
శైలేంద్ర కన్యా ముపలాలయంతం।
ఆరాధ్యమానం చ సురేంద్ర ముఖ్యై
ర్వారాణసీ నాథ! మహం ప్రపద్యే॥ 19

ప్రతి॥ కైలాసశైలే = కైలాసపర్వతంపై, కలధౌత = వెండివలె, ధౌతం = తెల్లనైనవాడూ, శైలేంద్రకన్యాం = పార్వతిని, ఉపలాలయతం = లాలించేవాడు, సురేంద్ర ముఖ్యైః = ఇంద్రాదులచే, ఆరాధ్యమానం + చ =

పూజింపబడేవాడు, వారాణసీనాథం = కాశీనగర ప్రభువైన (శంకరుని) అహం = నేను, ప్రపద్యే = శరణువేడుచున్నాను.

తాత్పర్యం

కైలాస పర్వతంపైన వెండివలె తెల్లనై, పర్వత రాజపుత్రికను లాలిస్తూ, దేవతాముఖ్యులచేత అరాధింపబడే వారణాసీనాథుణ్ని నేను శరణు వేడుకుంటాను.

వ్యాఖ్య

శైవ వాఙ్మయంలో పరమశివుడు తెల్లగా ఉంటాడనీ, తనకి ఎడమ ప్రక్కన వున్న పార్వతీదేవిని ప్రేమపూర్వకంగా లాలిస్తూంటాడని వర్ణింపబడి వుంటుంది. ఇంద్రుడు, కుబేరుడు, తదితర ముఖ్యులైన స్వర్గలోకవాసులు కైలాసంలోని గౌరీశంకరులని కొలుచుకుంటూ ఉంటారు.

పార్వతీదేవి హిమవంతుని కుమార్తె "ఉమ" అనే విషయం గమనార్హం. ఇరవైశ్లోకాలకు పైగా గురుదేవులు ఈ విషయాన్ని ప్రస్తావిస్తారు.

శాస్త్రవిజ్ఞానం 'పాశ్చాత్యశిశువు' అని మనం ఇప్పుడంటున్నట్లే, హిందూ వేదాంత యోచన 'హిమాలయాలశిశువు' హిమాలయాల ఉత్తుంగ శిఖరాలపైన గంగానదీ తీరాన, ధ్యాననిమగ్నులైన ఋషుల హృదయాలనుండి వెలువడింది, ధ్యాననిమగ్నుడైన పరమేశ్వరుడు వేదోపనిషత్తుల మహావాక్యాలను ప్రీతితో అలింగనం చేసుకుంటాడు.

శ్లో॥ **కుబేరమిత్రం కుసుమేష్వమిత్రం**
**కారుణ్యపాత్రం కరిరాజపుత్రమ్।**
**సరోజనేత్రం స్మితపంచవక్త్రమ్**
**సదాపవిత్రం శరణం ప్రపద్యే॥** 20

ప్రతి॥ కుబేరమిత్రం = కుబేరునికి మిత్రుడు అయినా, కుసుమేషు + అమిత్రం = మన్మథుని శత్రువు, కారుణ్యపాత్రం = దయకు పాత్రుడు

కరిరాజపుత్రం = వినాయకుని పుత్రుడుగా గలవాడు, సరోజ నేత్రం = పద్మనేత్రుడు, స్మిత = నవ్వుచున్న, పంచవక్త్రం = అయిదు ముఖాలు గలవాడును, సదాపవిత్రం = ఎల్లప్పుడూ పవిత్రుడైన ఈశ్వరుని, శరణం + ప్రపద్యే = శరణు జొచ్చెదను.

## తాత్పర్యం

కుబేరునికి మిత్రుడు, కుసుమాయుధునికి శత్రువు, దయానిలయుడు, వినాయకుని జనకుడు, తామరనేత్రుడు, మందహాసంచేసే అయిదు ముఖాల వాడు. సర్వులను పావనం చేసేవాడు అయిన శ్రీ కాశీవిశ్వనాధుని నేను శరణు జొచ్చుతాను.

## వ్యాఖ్య

కరుణామయుడు పరమేశ్వరుడు. ఏ పంచభూతాలనుండి ప్రపంచ నామరూపాలు ఏర్పడ్డాయో ఆ అయిదు భూతాలు ఆయన ముఖాలు. జగత్తు యొక్క వైవిధ్యం నవ్వుతూన్న ఆయన అయిదు ముఖాలనుండి ఉద్భవించింది. ఆయన సచ్చిదానంద రూపుడు.

పరమశివుని గురించి ధ్యానం చేయడంవల్ల మన వాసనాక్షయ మవుతుంది. అందువల్ల అంతరంగంలో ఉవ్వెత్తుగా లేచే కోరికల–కామనల వరదలు తగ్గుతాయి. శాంతించిన మనోబుద్ధుల్ని శుద్ధ హృదయం అంటారు. ఆయనను ధ్యానించడమే వ్యక్తిత్వాన్ని శుద్ధం చేసుకొనే అత్యుత్తమమైన మార్గం. శాంతించిన మనస్సు ధ్యానార్హమవుతుంది. శివ పరిపూర్ణస్థితిని చేరుకోడానికి అది మహత్తరమైన విధానం.

**శ్లో॥ అస్తు మే శరణం సౌమ్య కాశీనాథః స్వయం ప్రభుః।**
**యత్కృపాలేశమాత్రేణ మర్త్యోఽ మర్త్యపదంవ్రజేత్॥ 21**

ప్రతి॥ యత్ = ఏవనియొక్క, కృపాలేశమాత్రేణ = దయాలేశమాత్రంచేత, మర్త్యః = మానవుడు, అమర్త్య = దేవతల, పదం = స్థానాన్ని, వ్రజేత్

= పొందుచున్నాడో, (తం = అట్టివాడైన) స్వయంప్రభుః + స్వయం ప్రభుడైన, సామ్య కాశీనాథః = సామ్య కాశీశ్వరుడు, మే = నాకు, శరణం + అస్తు = రక్షకుడగుగాక.

## తాత్పర్యం

స్వయం ప్రభువైన సామ్య కాశీనాథుడు నాకు పూర్తి శరణ మగుసుగాక ఆయన కృపాలేశంతో మర్త్యుడు అమర్త్యపదాన్ని పొందుతాడు.

## వ్యాఖ్య

కాలపరిధిలో అన్నీ మారుతూంటాయి. మార్పు అంటే ఒకస్థితి గతించి మరోస్థితి జనించడమే. ఇలా జనన మరణ శృంఖలమే ఈ మారిపోయే జగత్తు. కాలబద్ధులమై మనం ఈ జగత్తులో వ్యవహరిస్తున్నంతకాలం ఈ శృంఖలంలో చిక్కుకొని వుంటాము. భక్తితో పరమశివుని సేవించడంవల్ల ఆయన అనుగ్రహ కాంతిరేఖను పొంది కాలబద్ధమైన మార్పునుండి విడివడి, కాలాతీతమైన, శాశ్వతమైన నిత్యపదాన్ని చేరుకుంటాము. అది అమృతపదం!

శ్లో॥ విభో! విశ్వేశ! విశ్వాత్మన్! విభాకర నిభద్యుతే।
విభాతు మోహరజనీ ద్విభావో మేఽ పసర్పతు॥ 22

ప్రతి॥ హేవిభో! = ఓ ప్రభువా, విశ్వేశ = జగన్నాయకా, విశ్వాత్మన్ = విశ్వ స్వరూపా, విభాకరనిభ = సూర్యునివంటి, ద్యుతే = ప్రకాశం గలవాడా, మోహరజనీ = అజ్ఞానమనే అంధకారాన్ని, విభాతు = పోగొట్టుము, మే = నాయొక్క, ద్విభావః = ద్వైధీభావాన్ని, అపసర్పతు = తొలగించుము.

## తాత్పర్యం

ఓ ప్రభూ! సంఘటనల పరంపరతో కూడుకొన్న ఈ ప్రపంచానికి ఈశుడా, అందరిలోని ఆత్మ అయిన వాడా, అగ్నిజ్వాలలతో కూడిన సూర్యునివలె కాంతి స్వరూపుడా, రాత్రి చీకట్లను తొలగించి భయనివారణచేసే సూర్యునివలె నా అజ్ఞాన తమస్సును, ప్రాపంచిక మిథ్యాజ్ఞానాన్ని, భయాలను తొలగించు.

శ్లో॥ వ్యోమాది భూతాని భవత్స్వరూపం
దేవాది దేహాశ్చ భవత్స్వరూపం।
జీవాశ్చ సర్వేఽపి భవత్స్వరూపం
సర్వాత్మనస్తేఽస్తు నమః పదాభ్యామ్॥ 23

ప్రతి॥ వ్యోమ + ఆది + భూతాని = ఆకాశాది పంచభూతాలు, భవత్ = నీ, స్వరూపం = స్వరూపము, దేవాది = దేవతలు మొ॥, దేహాః + చ = శరీరమూ, భవత్ = ని, స్వరూపం = ఆకారమె, సర్వే = సకల, జీవాః + అపి = జీవులందరునూ, భవత్స్వరూపం = నీరూపమే సర్వాత్మనః = సకలజీవుల ఆత్మస్వరూపుడవైన, తే = నీ, పదాభ్యామ్ = పాదాలకు నమః = నమస్కారము, అస్తు = అగుగాక!

తాత్పర్యం

ఆకాశాది పంచభూతాలూ ని స్వరూపమే, దేవతలనుండి జంతువుల వరకు–అన్నిదేహాలూ నీ స్వరూపమె! స్థావరజంగమాలన్నీ నీ స్వరూపమె! నీవు సర్వులలోని ఆత్మవు. నీ పాదాలకు నా నమస్కారం.

వ్యాఖ్య

పెద్ద, చిన్న, మధ్యరకం కెరటాలన్నీ ఏక కారణమైన సముద్ర స్వరూపాలే. అలాగే నామరూప జగత్తుకి ఆధారమైన పరమాత్మే అన్నిరూపాలు, వాటి ఏకసారమూ కూడా. అట్టి కైలాసపతికి ప్రణామాలు!

శ్లో॥ త్వమేవ విష్ణుః కమలా చ దుర్గే
త్వ్యపాస్యసే కల్పిత మూర్తి భేదైః।
కాశీశ! సర్వేశ్వర! శర్వ! సర్వ
దేవాత్మనస్తేఽస్తు నమః పదాభ్యామ్॥ 24

ప్రతి॥ త్వం + ఏవ = నీవే, విష్ణుః = విష్ణువు, కమలా + చ = లక్ష్మియు దుర్గా + ఇతి + చ = దుర్గ అనికూడా, కల్పిత = కల్పింపబడ్డ, మూర్తి

భేదైః = రూపభేదాలతో, ఉపాస్యసే = సేవింపబడుతున్నావు కాశీశ! = సర్వేశ్వర! శర్వ!. సర్వదేవ + ఆత్మనః = సర్వదేవతా స్వరూపుడవయిన తే = నీయొక్క, పదాభ్యామ్ = పాదాలకు, నమః = నమస్కారం, అస్తు = అగుగాక.

## తాత్పర్యం

భక్తులు నీకు వేరువేరు రూపాలను కల్పించి నిన్నే విష్ణువని, లక్ష్మిఅని, దుర్గఅని ఆరాధిస్తారు. ఓ కాశీనాథా! నీవు అందరికీ అధిపతివి. సర్వేశ్వరుడవు. వైవిధ్యాన్ని సంహరించేశర్వుడవు. సర్వదేవతలలోని సారంనివే. నీ పదాంబుజాలకు నా ప్రణతులు!

## వ్యాఖ్య

ఉపనిషత్తులలో పరమాత్మను సర్వుడని వినుతించారు. ప్రతి నామ రూపము ఆయన నుండి లేచి. ఆయనలో వసించి ఆయనలో లయించుతుంది. అందుకే ఆయనను "సర్వ" అన్నారు. మన అందరిలోని శారీరక మానసిక బౌద్ధికానుభవాలు, బాల్యయౌవన మధ్యవయస్క వృద్ధాప్య దశలన్నింట్లోను ఏకమైన దివ్యచైతన్య కాంతి అయిన శంకరప్రభువల్లనె మన ఎరుకలోకి వస్తాయి. అందుకే ఆయన సర్వుడు.

శ్లో॥ శుద్ధం శివం బుద్ధ మబుద్ధి గమ్యం
బ్రహ్మేతి యద్వస్తు వదన్తి వేదాః।
తత్త్వం విభో విశ్వపతే! న తత్త్వం
కించిత్పరం తేఽస్తు నమః పదాభ్యామ్॥ 25

ప్రతి॥ విభో = ఓ ప్రభువా! విశ్వపతే = జగత్పతీ! శుద్ధం = పరిశుద్ధమూ, శివం = శుభప్రదము, బుద్ధం = తెలియబడువాడు, అబుద్ధిగమ్యం = బుద్ధిగోచరం కానివాడు, బ్రహ్మ = సాక్షాత్ పరబ్రహ్మమే అని,యత్ + వస్తు = ఏ వస్తువునయితే, వేదాః = వేదాలు, వదన్తి = పేర్కొంటున్నాయో, తత్ = అదె, త్వం = నీవే, పరంతత్త్వం = (దీనికంటె)

పరతత్త్వం న + కించిత్ = ఏదీలేదు - అస్తి, తే = నీ, పదాభ్యామ్ = పాదాలకు, నమః = నమస్కారాలు, అస్తు = అగుగాక!

## తాత్పర్యం

ఓ విరాడ్రూపా, సర్వత్ర జరిగిపోయే అన్ని వ్యవహారాలకు అధిపతి అయినవాడా, అన్ని వేదాలలోను శుద్ధము,పరమ మంగళము,బుద్ధికి అగోచరము అయిన ఏకచైతన్యమని కీర్తింపబడే అద్వితీయబ్రహ్మము నీవే! ఓ సౌమ్య కాశీశుడా! నీకు నీ మహిమకు అన్యమైన సత్యం ఏదీ లేదు. నీ పాదపద్మాలకు నా ప్రణామాలు!

## వ్యాఖ్య

అన్ని శాస్త్రాలు ధ్యానంచేసే సాధకుని హృదయంలో ఉన్న భగవంతుని పవిత్రస్థానాన్నే నిగూఢమైన, భావగర్భితమైన పదజాలం ద్వారా నిర్దేశిస్తాయి. సమిష్టి సృజించే ప్రపంచనాటకానికి అధారమైన బ్రహ్మము నీవేనని వేదాలలో ప్రఖ్యాతుడవైనది ఓ విశ్వనాథా నీవే! నీ పావన పాదాలకు నా భక్తి పూరిత ప్రణామాలు!



# రెండవ స్తబకం

మొదటి స్తబకంలో పవిత్రమూర్తి అయిన కవి పురాణగాథల ఆధారంగా శ్రీ కాశీవిశ్వనాథుణ్ణి పరమేశ్వరునిగా సుందర చిత్రీకరణ గావించారు. చివరి నాలుగైదు శ్లోకాలలో సౌమ్య కాశీశుడు వేదాలలో నుతింపబడిన పరమ సత్యం బ్రహ్మమేనని శ్రీ తపోవనం స్పష్టంగా నిరూపించారు ఇక ఈ స్తబకం నుండి శ్రీ గురుదేవుని కలం ఉపనిషత్తుల గానలహరికి మధురమధురంగా తన్మయమై నర్తిస్తుంది. భక్తి జ్ఞానయుతమై విశిష్టమార్గంలో సాధకుల్ని అపరోక్ష దివ్యాను భూతి శిఖరాల మీదికి లేవనెత్తే సూక్ష్మకౌశల్యం మెండుగ నిండుగా గోచరిస్తుంది.

ఈ స్తబకంలో ముందు పన్నెండు శ్లోకాలు ఈశావాస్యోపనిషత్తులోని భావాలను, చివరి పదమూడు శ్లోకాలు కేనోపనిషత్తులోని భావాలను వివరిస్తాయి. ఈ స్తబకం లోనివి అద్వైత భావనలు. అందుచేత దృశ్య ప్రపంచానికి వెనక దాగివున్న అద్వితీయ సత్యాన్ని కవి వివరించాలి. జీవాత్మలోని వ్యష్టి చైతన్యము, జగత్తులో అన్ని ప్రాణుల్ని కలిపి వుంచే సమష్టి చైతన్యము ఒకే పరమాత్మ యొక్క చైతన్యమని కవి నిరూపించాలి. ఈ ఐక్యస్థితికి కాశీ విశ్వనాథుడేనని వ్యక్తం చేయడం ద్వారా శ్రీ గురుదేవులు భక్తి యొక్క విశిష్టతని చాటుతున్నారు. భగవంతుని పట్ల సహజమైన భక్తిలేని హృదయా లను కూడా ఈ స్తబకం పులకరింపజేసి చిగురింపజేస్తుంది. భక్తియుతుల్ని అంతంవరకు నడిపించుకొని వెళ్ళుతుంది. పరాభక్తి సాక్షాదనుభూతిలో ఫలిస్తుంది!

అందువల్ల జ్ఞానమార్గం ద్వారా అపరోక్షానుభూతిని పొందటమే ఇందు లోని విషయమైనా, కవి 'భక్తి' అనివార్యమని ఒత్తి చెబుతున్నారు.

ఇదెలా సాధ్యం? ద్వైతంలో భక్తి, జ్ఞానంలో అద్వైతాను భూతికదా? భక్తిజ్ఞానాలకి కలయిక ఎక్కడ?

అంతః కరణాలైన మనోబుద్ధులు శుద్ధమై శమించినప్పుడే నిజమైన శ్రవణ మనన నిధిధ్యాసలు చేయగలుగుతాము. మనోబుద్ధుల్ని లేదా హృదయాన్ని శుద్ధ పరచుకోడానికి భక్తి ఒకటే మార్గం. ★

భగవంతుని పట్ల ప్రీతి లేకపోతే ధ్యానం శుష్కంగా ఆనంద రహితమై వుంటుంది. చాలా క్లిష్టమై విసుగు పుట్టుతుంది. అందుకే ముక్తులైనవారు కూడా ఒక రూపాన్ని హృదయంలో కల్పించుకొని ధ్యానించుతారు. ★ ★

శ్రీ స్వామీజీ నిర్భయంగా చేసిన ఈ ప్రతిపాదనని సమర్థించే శాస్త్రాధారాలు కోకొల్లలు.

ఆధ్యాత్మిక విచారణలో కాశీవిశ్వనాథుని అనుగ్రహం ఒక మెట్టు అని ఇదివరకే చెప్పబడింది. దానిని ఎలా సాధించాలో, జిజ్ఞాసువులకి అది ఎలా తోడ్పడుతుందో అనే అనుమానాలు జిజ్ఞాసువుల హృదయాలలో కలగక మానవు. వాటికి సమాధానంగా స్వామీ తపోవనం ఈశావాస్యోపనిషత్తు ఆధారంగా కల శ్లోకంతో ఈ స్తబకాన్ని ప్రారంభిస్తున్నారు.

శ్లో॥ యేన వాస్య మిదం సర్వం సర్వసన్యసనేన యః।
లభ్యతేఽలుబ్ధ శీలేన తస్మై శ్రీ శంభవే నమః 1

ప్రతి॥ సర్వ సంన్యసనేన = సర్వాన్నీ త్యజించటంచేత, అలుద్ధ = కోరికలులేని, శీలేన + యేన = స్వభావంగలవానిచేత, ఇదం = ఈ, సర్వం వాస్యం = సమస్త ప్రపంచమూ, లభ్యతే = పొందబడు చున్నదో, తస్మై = అట్టి, శ్రీ శంభవే = శ్రీ శంకరులకు, నమః = నమస్కారం.

---

★ శాండిల్యుడు మొదలైనవారు:— "పరానురక్తిః ఈశ్వరే"—భక్తి అంటే ఈశ్వరునిలో అత్యంతమైన ప్రీతి.

"విద్యాలభతేఽసౌ విచారణాత్"—నిరంతర విచారణవల్ల సాక్షాదనుభూతి కలుగుతుంది.

★ ★ "ముక్తా అపి లీలయా విగ్రహం కృత్వా భజంతే"—ముక్తులైనవారు కూడా ఒక మూర్తిని లీలా మాత్రంగా పెట్టుకొని హృదయంలో ఆయనని సేవిస్తారు.

## తాత్పర్యం

దేనిచేత విషయ వ్యక్తులతో కూడిన ఈ ప్రపంచం యావత్తు వ్యాపింప బడి, ఆవాసంగా చేసుకోబడివున్నదో, సర్వకామాల్ని, లోభాన్ని త్యజించడం వల్లనే సాధకునికి ఏది అనుభవమౌతుందో, అట్టి శ్రీ శంభునికి నమస్కారం!

## వ్యాఖ్య

ఆత్మాకలితో మనస్సు బాహ్య విషయాలను సంపాదించుకొని స్వంతం చేసుకోడానికి పరుగులు పెట్టినప్పుడు, వ్యక్తి ప్రపంచంనుండి సంన్యసించి దూరంగా వెళ్ళిపోవలసిన అవసరం లేదు. క్షణికమైన ఇంద్రియార్థాలని ఆలింగనం చేసుకొని అనుభవించాలనే తపనని త్యజించితే చాలు. అప్పుడే ఆత్మానుభవం కోసం స్థిరంగా స్థిమితంగా లోతైన ధ్యానాన్ని చేయగలుగుతాడు. సునాయాసంగా పరమ శుద్ధ చైతన్య పదాన్ని చేరుకుంటాడు. అదే "శంభు పదం" ఆ పరమేశ్వరునికి నమస్కారం!

మనోబుద్ధులను రెంటినీ పూర్తిగా తన అహంకారం యొక్క మూలం వైపుకి సాధకుడు మళ్ళించాలని ఈశావాస్యోపనిషత్తులోని మొదటి మంత్రం చేసే మేఘగర్జన ఆదేశం. ఆ భావమే పైశ్లోకంలోని విషయం.

శ్లో॥ కామ్య నిష్కామ కర్మభ్యాం యోదేవః సంప్రపూజ్యతే।
కర్మిభిః కర్మమర్మజ్ఞై స్తస్మై శ్రీ శంభవే నమః॥ 2

ప్రతి॥ కర్మమర్మజ్ఞైః = కార్యవిధానాన్ని తెలిసిన, కర్మిభిః = కర్మరులచేత, కామ్య = ఆశలు, నిష్కామ = ఆశారాహిత్యాలు—అనే, కర్మభ్యాం = కర్మలతో, యః + దేవః = ఏదేవుడయితే, సంప్రపూజ్యతే = బాగుగా పూజింపబడుతున్నాడో, తస్మై = అట్టి———

## తాత్పర్యం

ఎవరి ఆరాధనలో వివేకులు సకామ నిష్కామ కర్మలను ఆచరిస్తారో, శ్రీ శంభునకు నా ప్రణామాలు!

## వ్యాఖ్య

ఈశావాస్యోపనిషత్తులోని రెండో మంత్రభావం ఇది. అందరూ పూర్తిగా మనస్సును భగవంతుని వైపునకు త్రిప్పలేరు. వాళ్ళ వెనకాల కూడబెట్టుకున్న వాసనలు వాళ్ళలో ఒత్తిడి తీసుకువచ్చి బుద్ధిలో కామంగా, మనస్సులో ఆందోళనగా జనిస్తాయి. ఈ ఒత్తిడితో సాధకుడు దృష్టి బాహ్యవిషయాల వైపునకు సుఖంకోసం దిగజారుతుంది. అందుచేత ధ్యానంలో స్థిరంగా నిలవలేని సాధకుడు కర్మరంగంలోనికి ప్రవేశించి కర్మయోగం ద్వారా తన వాసనల బరువును దించుకోవచ్చును. ఆ కర్మలు సకామమైనా, నిష్కామమైనా పరవా లేదు. దానిద్వారా క్రమంగా, త్వరలోనే అతడి ప్రయత్నాలు ఫలించి ధ్యానంలో స్థిరత్వం ఏర్పడుతుంది,

భగవంతునికి ఆత్మార్పణబుద్ధితో పనిచేయడం నేర్చుకొని, పనులన్నింటిని భగవంతునికి భక్తిపూర్వకమైనా ఆ రా ధ న గా అర్పించినప్పుడు, పూర్వం సంపాదించుకొన్న వాసనలు నిర్వీర్యమై క్రొత్తకోరికల వరదలను, మానసికాందోళనలనే తుఫానును సృజించడం మానివేస్తాయి.

శ్లో॥ యదజ్ఞానహతా మూఢా భ్రామ్యంతే బహుయోనిషు।
ఆత్మహత్యా పరిగ్రస్తా స్తస్మై శ్రీ శంభవే నమః॥ 3

ప్రతి॥ యత్ = ఏ, అజ్ఞానహతాః = అజ్ఞానముచే బాధితులో, మూఢాః = మూర్ఖులో-వారు, బహుయోనిషు = అనేక గర్భవాసాల్లో, భ్రామ్యంతే = సంచరింపబడుచున్నారో, ఆత్మహత్యా = ఆత్మహత్యతో, పరిగ్రస్తాః = పరిగ్రహింపబడినారో, తస్మై = అట్టి.

## తాత్పర్యం

ఆత్మను ఎరుగని మూర్ఖులు భ్రాంతివల్ల కల్పించుకొన్న మిథ్యావిషయాలలో. ఆత్మహత్యా సదృశమైన ఆకర్షణలతో వాటివెంట పరుగులుపెట్టి, అనేక గర్భాలలో జన్మించుతూ తిరిగి తిరిగి బాధలను అనుభవిస్తారు. ఆ ఆత్మయైన శ్రీ శంభునికి నా ప్రణామాలు!

వ్యాఖ్య

స్తంభాన్ని ఎరుగని అజ్ఞానంలో భ్రాంతితో భూతాన్ని చూస్తారు. భూత దృశ్యం విచారాలను భయాలను కలిగిస్తుంది. స్తంభంయొక్క యథార్థజ్ఞానం కలిగినప్పుడు, స్తంభాన్ని సాక్షాత్తుగా చూచినప్పుడు, భ్రాంతులు వెంటనె నశించుతాయి. మనస్సులు శాంతించుతాయి. అలాగే ఆత్మనెరుగని అజ్ఞానంలో మనలను మనం పరిమితజీవుడిగా ఎంచుకొని, పూర్వవాసనలు రెచ్చగొట్టగా ఇంద్రియాల తృప్తికోసం పరుగులుపెట్టుతాము. అలాంటి స్వార్థపరమైన కర్మల వల్ల క్రొత్త వాసనలు సృష్టి అవుతాయి. వాటి సాఫల్యంకోసం అనువైన దేహాన్ని క్రొత్తజన్మని కోరుకొని, వాటికి సరిపడే వాతావరణాన్ని వెదుక్కొని ఆ క్రొత్త వాసనలను తీర్చుకోడంకోసం జనిస్తాము.

ఇది ఆత్మహత్య తప్ప వేరుకాదు. దేనిని తెలుసుకోడంవలన ఇలాంటి వృథా విచారాలన్ని అంతమౌతాయో ఆ ఆత్మ—శ్రీ శంభునికి నా ప్రణామాలు!

శ్లో॥ మనో౽తివేగవ త్తస్మాత్ జవీయ స్తర మిష్యతే।
యదేకం సత్య మత్యక్షం తస్మై శ్రీ శంభవే నమః॥ 4

ప్రతి॥ మనః = మనస్సు, అతివేగవత్ = మిక్కిలివేగము కలది, తస్మాత్ = అందువలన, జవీయస్తరం = అత్యంతవేగము కలది – అనగా మనస్సు కంటె వేగవత్తరమైనదిగా (ఆత్మ), ఇష్యతే = చెప్పబడుచున్నది, యత్ + ఏకం = ఏ ఆత్మ, సత్యం = నిజమైనది, అత్యక్షం = గోచరించుదో, తస్మై——

వ్యాఖ్య

మనసుకన్నా వేగంగా వెళ్లేది ఏదీలేదు. అయినా ఆత్మ మనసుకన్నా వేగవంతమైనదని చెప్పబడుతుంది ఎందుకంటే ఆత్మ సర్వవ్యాప్తమైనది. అతిత్వరితంగా వెళ్ళే మనస్సు చైతన్యంయొక్క పరిధిలోనే పయనిస్తుంది. ఆత్మ సర్వులలోని ప్రాణం దానికి శరీరం లేదు. త్రికాలాలలో ఒకే విధంగా ఉండే ఆత్మను 'సత్యం' అంటారు. అది ఇంద్రియాలకు గోచరించదు (అత్యక్షం). ఆ ఆత్మయైన శ్రీ శంకరునకు నా ప్రణామాలు!

శ్లో॥ యస్మిన్ సతి జగత్సర్వం సూత్రదేవేన ధార్యతే।
నిత్య చైతన్య రూపాయ తస్మై శ్రీ శంభవే నమః 5

ప్రతి॥ జగత్ = జగత్తు, యస్మిన్ సతి = ఎవనియందైతే ఉంటూ, సూత్రదేవేన సూత్రాత్ముడైన శివునిచే, ధార్యతే = ధరింపబడుతూ వుందో, నిత్య చైతన్య రూపాయ = సార్వకాలికమైన చైతన్య స్వరూపుడైన, తస్మై = అట్టి.

## తాత్పర్యం

ఏది ఉండబట్టి యావత్ప్రపంచము సూత్రాత్మ అయిన హిరణ్యగర్భుని చేత నిలిపి వుంచబడుతోందో ఆ అనంత నిత్య చైతన్యరూపి శ్రీ శంభునికి నా ప్రణామాలు!

## వ్యాఖ్య

సమిష్టి హృదయమైన హిరణ్యగర్భుణ్ణి, వ్యష్టి అయిన జీవుణ్ణి సజీవం చేసేది పరమ సత్యమైన శుద్ధచైతన్యం. అదే ఈ యావత్తు బ్రహ్మాండానికీ ఆధారం. ఆ శ్రీ శంభునికి ఆత్మార్పణం చేసుకొని నమస్కరిస్తాను.

శ్లో॥ యచ్చలం నిశ్చలం చైవ నికట స్తంభదూరగమ్।
అంత ర్బహిశ్చ సంపూర్ణం తస్మై శ్రీ శంభవే నమః॥ 6

ప్రతి॥ చలం = చరించునది, నిశ్చలం + చ = జడమును, నికటస్థం = దగ్గరున్నది, దూరగం + చ దూరమందున్నది, అంతః = లోనున్నది, బహిః + చ = వెలుపలనున్నదియునైన, యత్ సంపూర్ణం = ఏ పరిపూర్ణ శక్తి, యున్నదో; తస్మై = అట్టి, శ్రీ శంభవే = శంకరులకు, నమః = నమస్కారము.

## తాత్పర్యం

ఎవరు చలించేవాడు, చలించనివాడు కూడా అయివున్నాడో; ఎవరు దగ్గరగాను, దూరంగాను కూడా ఉన్నాడో; ఎవరు లోపల, బయట అంతటా, వ్యాపించి వున్నాడో—ఆ శంభునికి నా ప్రణామాలు!

<u>వ్యాఖ్య</u>

యావత్తు ప్రపంచానికి ఏకకారణం అయినందున ప్రపంచంలో కదిలే ప్రాణులు, కదలని జడవస్తువులూ కూడా ఆయనే. మారేవీ, మారనివీ, శాశ్వతమైనవీ తాత్కాలికమైనవీ కూడా ఆయనే.

వివేకులకు పరమాత్మ తమలోని ఆత్మే కాబట్టి ఆయన అతిదగ్గరగా ఉన్నాడు అజ్ఞానులకు, బాహ్యదృష్టి కలవాళ్ళకు ఆయన అతిదూరం.

అలలన్నీ సముద్రంచేత ఆవరించబడి, వ్యాపించబడి వున్నట్లు, ఆత్మ అన్ని భూతాలలో వ్యాపించి వుంటుంది. అన్నింటికీ ఉపాదానం కాబట్టి అన్ని ఆకారాలనీ తానే భరిస్తుంది.

ఏభేదాలూ లేని దానిని పూర్ణం అంటారు. అభేదాలు మూడురకాలు— సజాతీయం, విజాతీయం, స్వగతం. 'సజాతీయం' అంటే ఒకే జాతిలోని భేదాలు. ఆవులన్నీ ఒకటే జాతి అయినా అన్ని ఆవులూ ఒకేలాగా ఉండవు. వాటిని వేరువేరుగా గుర్తించగలం. 'విజాతీయ' అంటే వేరువేరు జాతులు. ఆవు, గుర్రంజాతి కాదు, పందిజాతి కూడా కాదు. ఈ మూడుని వేరువేరు జాతులు. 'స్వగతం' అంటే వ్యక్తిగతమైన భేదాలు. ఆవుతల ఒకరకంగా, కాళ్లు వేరుగా తోక వేరుగా వుంటాయి ఈ మూడురకాలు భేదాలు లేని దానిని పూర్ణం అంటారు. ఆత్మ ఎప్పుడూ ఒకేరకంగా ఉంటుంది. కాబట్టి సంపూర్ణం. ఆత్మ ఎప్పుడూ ఏకరకంగా ఉండే చైతన్యరాశి.

ఆ ఆత్మయే శంభుడు. ఆయన నా ప్రాణాధికుడు. ఆయనకు నేను నమస్కారం చేస్తాను.

**శ్లో॥ ఆత్మా యః సర్వభూతానా మాశ్రయత్వేన వీక్ష్యతే।**
**విద్వద్భి ర్వీతదోషై స్తస్మై శ్రీ శంభవే నమః 7**

ప్రతి॥ వీతదోషైః = ప్రజ్ఞాదోషములేని, విద్వద్భిః = పండితులచేత, యః = ఎవడు, స్వ + ఆత్మ = తానుగా, సర్వభూతానామ్ = సర్వజీవులకు, ఆశ్రయత్వేన = ఆశ్రయముగా, వీక్ష్యతే = చూడబడుచున్నాడో, తస్మై—

తాత్పర్యం

బుద్ధిదోషాలు నశించి శుద్ధపడిన విద్వాంసుడు తనలోని ఏ ఆత్మ అందరికీ ఆశ్రయుమని గ్రహిస్తాడో, ఆ శ్రీ శంభుడికి నా ప్రణామాలు!

వ్యాఖ్య

మనలోని ఆత్మస్వరూపాన్ని గుర్తెరుగగానే అందరిలోను ఏకంగావుండే ఆత్మను గ్రహిస్తాము. అలాంటి మహాత్ముడికి లోతైన ధ్యానస్థితిలో నామరూపాలు కరిగిపోయి ఒక్కటి అయిన ఆత్మస్వరూపం గోచర మౌతుంది నిద్ర లేవగానే కలలోని నామరూపాలన్ని జాగ్రత మనస్సులో కలిసిపోతాయి! (ఈశ. ఉ. 6వ మంత్రం)

శ్లో॥ యన్మయం సతి యద్బోధే విశ్వం పశ్యతి సూరయః।
నిశ్చచశ్చ విరాజన్తే తస్మై శ్రీ శంభవే నమః 8

ప్రతి॥ యత్ + బోధే + సతి = ఆత్మబోధలో వున్నపుడు, యత్ + మయం = ఏదైవరూపమయిన, విశ్వం = ప్రపంచాన్ని, సూరయః = పండితులు, పశ్యంతి = చూస్తున్నారో, నిశ్చచః + చ = పరిశుద్ధులుగ, విరాజంతే = ఉంటున్నారో——

తాత్పర్యం

ఆత్మానుభవం కలిగిన మహాత్ముడు చరాచరాలతో కూడిన యావత్ప్రపంచము ఆత్మే అని ఎరిగి అటుపిమ్మట శోకానికి మోహానికి అతీతుడై ఆనంద మయుంగా జీవిస్తాడు. ఆ ఆత్మే నా శంభుడు. ఆయనకు నా ప్రణామాలు!

వ్యాఖ్య

కలనుండి మేలుకోగానే కల, కలగనే స్వాప్నికుడు కరిగిపోయి మెలకువ మనస్సు అయిపోయినట్లే ఆత్మపదంలోనికి మేలుకాంచినప్పుడు నాలోని పరిమితాహంకారము, భిన్నత్వంలో కూడిన నా ప్రపంచమూ ఆత్మచైతన్య స్థాయిలో కరిగి అదృశ్య మైపోతాయి. ఆదివ్యపదమె శంభుడు. అయనకు నా భక్తిపూర్వక ప్రణామములు! (ఈశ. 7వ మంత్రం)

శ్లో॥ శుద్ధం సర్వత్ర సంవ్యాప్తం కాయసంబంధ వర్జితమ్।
దృశిమాత్ర స్వరూపం యత్ తస్మై శ్రీ శంభవే నమః॥ 9

ప్రతి॥ శుద్ధం = పరిశుద్ధమును, సర్వత్ర = అంతటా, సంవ్యాప్తం = బాగుగా వ్యాపించినది, కాయసంబంధం = శరీరసంబంధాన్ని వదలిన, దృశిమాత్ర = దృష్టియే ఆకారంగాగల, యత్ = ఏదైతేవున్నదో.

## తాత్పర్యం

శుద్ధమై సర్వత్ర పరిపూర్ణంగా వ్యాపించి మూడు దేహాలతో ఎలాంటి సంబంధమూ లేక కేవలం సాక్షిగా వెలుగొందే చైతన్యమైన శ్రీ శంభునికి నా ప్రణామాలు!

## వ్యాఖ్య

అవిద్యకాని, దానివల్ల జనించే బహుళ మిథ్యాజ్ఞానం కాని, లేని ఆత్మ శుద్ధమౌతుంది. దానికి స్థూల సూక్ష్మ కారణ శరీరాలతో, వాటి అనుభవాలతో స్పర్శ ఉండదు.

త్రాడుని ఎరుగని అజ్ఞానం భయంకరమైన సర్పంయొక్క మిథ్యాజ్ఞానాన్ని కలిగిస్తుంది. త్రాడనే విషయం తెలియగానే అజ్ఞానం నశిస్తుంది. దానితో పాటే పాముయొక్క మిథ్యాజ్ఞానం కూడా నశిస్తుంది. శుద్ధచైతన్య స్థాయికి చేరినప్పుడు అవిద్య, మిథ్యాజ్ఞానం—రెండూ నశిస్తాయి.

ఆత్మ అప్పుడుకూడా స్థూల, సూక్ష్మ, కారణ – శరీరాల నన్నింటినీ సజీవం చేస్తూనే వుంటుంది. కాని వాటిలో చిక్కుకోదు. విద్యుచ్ఛక్తి అన్ని విద్యుత్పరికరాలనూ పనిచేయిస్తుంది. విద్యుత్తులో ఏపరికరాలూ వుండవు.

శ్లో॥ ధర్మాధర్మాద్యసంస్పృష్టః ప్రజేశానశ్చ యః ప్రభుః।
స్వయంభూః పరిభూశ్చైవ తస్మై శ్రీ శంభవే నమః 10

ప్రతి॥ ధర్మ + అధర్మ + అది = ధర్మాధర్మాదులచేత, అసంస్పృష్టః = స్పృశింపబడనివాడు, ప్రజా + ఈశానాం + చ = ప్రజాధిపతులకునూ, ప్రభుః = పాలకుడో, స్వయంభూః = స్వయంభువు, పరిభూః + చ + ఏవ = తానుగా ప్రతివస్తువులోను వ్యక్తీకరింపబడిన వాడునుఅయిన.

తాత్పర్యం

ధర్మాధర్మాదులచేత స్పృశింపబడని ఆత్మ, హిరణ్యగర్భుడికి కూడా ప్రభువైన వాడు, స్వయంభువు, అన్ని రూపాలలో వున్నవాడూ అయిన శ్రీ శంభువునికి నా ప్రణామాలు!

వ్యాఖ్య

బుద్ధి చేసే మంచి, చెడు నిర్ణయాలను మన ఎరుకకు తీసుకువచ్చేది ఆత్మచైతన్యం. మంచి, చెడులు బుద్ధిలోని విభజనలు. అవి ఆత్మచైతన్య కాంతిలో వెలిగి మెరుస్తాయి. వెలిగించే వెలుగు వెలిగింపబడే వాటికన్న భిన్నమైనది. అందుచేత బుద్ధి విభజనలకు, నిర్ణయాలకు, నిశ్చయాలకు ఆత్మ అతీతమైనది.

సమష్టి మనస్సు ద్వారా వ్యక్తమయ్యే ఆత్మ హిరణ్యగర్భుడు లేదా సృష్టికర్త. సృష్టికర్తని నియమించేది ఆయన. కారణమైనది ఆయన. అయనకు వెనకాల కారణం లేదు. అయనకి వికారాలు లేవు. ఆయన మార్పులు లేని వాడు. ఏకారణానికో తాను కార్యంకాడు. అకారకుడు. అయినా అన్ని ఆకారా లలో వుంటాడు. అన్నింటినీ సజీవం చేస్తాడు. అన్నింటిలోని ప్రాణం ఆయన. అందుకే ఆయన "పరిభూః" అన్నింటికి అతీతుడు. (ఈశ. 8వ మంత్రం)

**శ్లో॥ ఉపాస్త్యా కర్మణా వాపి యత్తత్త్వం నోపలభ్యతే।**
**జ్ఞానగమ్యాయ నిత్యాయ తస్మై శ్రీ శంభవే నమః 11**

ప్రతి॥ ఉపాస్త్యా = ఉపాసనచే లేక, కర్మణా + వా + అపి = కర్మచేగాని, యత్ + తత్త్వం = ఏ భగవత్తత్త్వమయితే, న + ఉపలభ్యతే = పొంద బడదో, జ్ఞానగమ్యాయ = ప్రత్యక్షజ్ఞానంచేత పొందబడువాడు, నిత్యాయ = శాశ్వతుడునయిన.

తాత్పర్యం

ఉపాసనద్వారా కాని, కర్మకాండద్వారా కాని ఆయన లభించడు. సాక్షాత్ జ్ఞానం వలననే తెలియబడుతాడు. ఆయన నిత్యుడు. అట్టి శ్రీ శంభునికి నా భక్తిపూర్వక ప్రణామాలు!

వ్యాఖ్య

గాఢమైన భక్తితో ఉపాసన చేసినప్పుడు ప్రస్తుతం ఉన్న వాసనలు ఖర్చయిపోయి భక్తుని మనోబుద్ధులు విషయ వస్తువులలో పరిభ్రమించకుండా వుంటాయి. అంతరంగం స్తిమితపడి చింతనలో స్థిరపడి గాఢమైన ధ్యానస్థితిలో లోపల ఉన్న ఆధ్యాత్మిక పదాన్ని తెలుసుకొంటుంది. కేవలం కర్మకాండ సాధకుని ఈఆధ్యాత్మిక స్థాయికి తీసుకొని రాలేదు.

ఉపాసన, కర్మ—మనలను ఆత్మవద్దకు తీసుకు రాలేవు, కాని అవి మనస్సును స్తిమితపరచి అది నిలకడగా వుండునట్లు చేయడానికి పరోక్షంగా తోడ్పడుతాయి ఆలా స్తిమితపడిన మనస్సే ధ్యానంలో సూటిగా లేచి శుద్ధాత్మ పదాన్ని అందుకోగలదు. (ఈశ. 9—14 మంత్రాలు)

శ్లో॥ ధ్యాయిభిర్ధ్యాయమానం యత్ ప్రాప్యమాణం చ యత్పదం।
కార్యబ్రహ్మ స్వరూపాయ తస్మై శ్రీ శంభవే నమః॥ 12

ప్రతి॥ యత్ = ఏ బ్రహ్మతత్త్వము, ధ్యాయిభిః = ఉపాసకులచే, ధ్యాయమానం = ఉపాసింపబడుచున్నదో. యత్ + పదం = ఏ బ్రహ్మపదం, ప్రాప్యమాణం + చ = పొందబడుచున్నదో, కార్యబ్రహ్మ = కర్తవ్యపరమైన, స్వరూపాయ = ఆకారముగల, తస్మై = అట్టి, శ్రీ శంభవే = ఈశ్వరునికి, నమః = నమస్కారం.

తాత్పర్యం

ఉపాసన—కర్మ సముచ్చయం ద్వారా సాధకులు సూర్యునిలో వున్న ప్రభువునిగూర్చి ధ్యానించి హిరణ్యగర్భుని ప్రత్యక్షం చేసుకొంటారు. ఆయన శంభుడు. అయనకు నా ప్రణామాలు.

## వ్యాఖ్య

భక్తిపూరితమైన ఆరాధన ద్వారా, నిష్కామకర్మ ద్వారా మనస్సు శుద్ధమైనప్పుడు, సాధకుడు నామరూప జగత్తుకు ప్రభువైన కార్యబ్రహ్మను తేలికగా ప్రత్యక్షం చేసుకొంటాడు. వేదాలలో "ఆయనను ప్రాణదాత అయిన సూర్యునిలోని సారం" అన్నారు. ఆయన అనుగ్రహంవలన సాధకులు తమ ఐహిక కామనలను స్వర్గసుఖాలను పొందుతారు. (ఈశ 15-18 మంత్రాలు)

ఈ పన్నెండు శ్లోకాలలో శ్రీతపోవనం ఈశావాస్యోపనిషత్తులోని ముఖ్య మైన భావాలని వివరించారు. దాని తరువాత సామవేదంలోని తలవకర సంహితలో తొమ్మిదవ అధ్యాయమైన కేనోపనిషత్తును పొందుపరుస్తున్నారు. తలవకర శాఖలోని మొదటి ఎనిమిది అధ్యాయాలలో ఉపాసనాకర్మలు వున్నాయి. శ్రద్ధతో వాటిని అభ్యాసం చేసినప్పుడు ఆసాధకుడు ధ్యానరంగంలోకి ప్రవేశించవచ్చును. అందుచేత తొమ్మిదో అధ్యాయంలో సాధకుణ్ణి సూటిగా ధ్యానంలోకి ప్రవేశపెట్టే కేనోపనిషత్తు వున్నది.

శ్లో॥ చక్షుఃశ్రోత్రా దీంద్రియాణి తత్త త్కార్యకరాణి వై।
యద్దేవానుగృహీతాని తస్మై శ్రీ శంభవే నమః॥ 13

ప్రతి॥ యత్ = ఏ, దేవ + అనుగృహీతాని = పరమాత్మునిచే అనుగ్రహింప బడినట్టి, చక్షుః + శ్రోత్ర + ఆది = కన్నులు, చెవులు మొ॥ ఇంద్రి యాణి = జ్ఞానేంద్రియాలు, తత్ + తత్ + = ఆయా, కార్య = కార్యా లను, కరాణి + వై = చేస్తున్నవో, తస్మై = అట్టి——

## తాత్పర్యం

ఎవరి చైతన్యకాంతి కారణంగా అందరి కళ్లు, చెవులు మొదలైన ఇంద్రియాలు చూడడం, వినడం మొదలైన తమతమ కార్యాలను నిర్వర్తించు చుంటాయో, ఆ ఆత్మ శ్రీ శంభునికి నా ప్రణామాలు!

వ్యాఖ్య

కేనోపనిషత్తులో గురువుని శిష్యుడు చురుకుగా జరిగే ఇంద్రియవ్యాపారా లని గురించి ప్రశ్నించాడు—"ఎవరి అనుగ్రహంవల్ల ఈ పరికరాలన్ని ఇంత సమర్థవంతంగా పనిచేస్తున్నాయి?"

శ్లో॥ శ్రోత్రాదే రపి యం దేవం శ్రోత్రాది మనుదృశ్య హి।
మహాంతో యాంతి నిర్వాణం తస్మై శ్రీ శంభవే నమః॥ 14

ప్రతి॥ యం + దేవం = ఏ పరమాత్మను, శ్రోత్రాదేః + అపి = చెవి మొ॥ జ్ఞానేంద్రియాలవల్లకాడా, శ్రోత్రాదిం = వినుట మొ॥ జ్ఞానాలను, అనుదృశ్య + హి = చూచి—అనగాపొంది, మహాన్తః = మహాత్ములు, నిర్వాణం = మోక్షాన్ని, యంతి = పొందుచున్నారో———

తాత్పర్యం

చెవికి చెవి, కంటికి కన్ను ఆదిగా ఏ ఆత్మను దర్శించి మహాత్ములు ఉత్తమోత్తమ పదాన్ని చేరుకున్నారో, ఆ పరమాత్మ శ్రీ శంభునికి నా ప్రణామాలు!

వ్యాఖ్య

ఆత్మ కంటిలో ద్రష్ట అనీ, చెవిలో శ్రోత అనీ, ముక్కులో ఘ్రాత అని, మనస్సులో భావుకుడు, బుద్ధిలో ఆలోచనాపరుడని, కేనోపనిషత్తు నిర్దేశించింది.

టెలిస్కోపు ద్వారా మీరు దూరంగా ఉన్న నక్షత్రాన్ని చూచినప్పుడు మీరు ద్రష్ట, నక్షత్రం దృశ్యం, టెలిస్కోపు పరికరం. ద్రష్ట అయిన మీరు పరికరానికన్న, దృశ్యానికన్న భిన్నులు పరికరాన్ని వాడుచున్నంత కాలమే మీరు ద్రష్ట. అయినా మీకు ప్రత్యేకమైన సత్తా ఉన్నది. అలాగే ఆత్మ అయిన చైతన్యాది ఇంద్రియాలద్వారా వ్యవహరించే సమయంలో "ద్రష్ట నేను" గా, మనస్సులో "భావుక నేను" గా, బుద్ధిలో ఆలోచనాపర నేను" గా తయారవు తుంది. అయినా నిజానికి ఈ పరికరాలు లేని ఆత్మ తన సుందరమైన ఆనంద స్థితిని ఎప్పుడూ కలిగే వుంటుంది.

ఆ శుద్ధాత్మ నా ప్రియప్రభువైన శంభుడు. ఆయనకు నా ప్రణామాలు. (కేన. 1. 2)

శ్లో॥ యత్ర వ్రజన్తి నో చక్షు ర్వాగ్మనాంసి మనాగపి।
న జ్ఞాతం యచ్చ నాజ్ఞాతం తస్మై శ్రీ శంభవే నమః॥ 15

ప్రతి॥ యత్ర = ఏ భగవత్స్వరూపాన్ని, చక్షుః + వాక్ + మనాంసి = కండ్లు, వాక్కు, మనస్సులు, మనాక్ + అపి = కొంచెమైనా, న + వ్రజంతి = = పొందవో, యత్ + చ = ఏదయితే, న + జ్ఞాతం = తెలియబడదో, న + అజ్ఞాతం + చ = తెలియబడనిది కాదో——

## తాత్పర్యం

ఎక్కడ కళ్లు సంచరించలేవో, వ్యక్తం చెయ్యడానికి వాక్కుకు రంగం లభించదో, ఎక్కడ మనోబుద్ధులు వ్యవహరించలేవో, ఏపదం తెలియబడేది, తెలియబడనిదీ కూడా కాదో, ఆపదం ప్రియాత్ప్రియమైన నా శంభుడే. అయనకు నా ప్రణామాలు!

## వ్యాఖ్య

అయనను కళ్లు చూడలేవు. ఎందుకంటే కళ్ళల్లో వ్యవహరించే చైతన్యమే కళ్ళకి చూచే శక్తి నిస్తుంది. చీకటి గదిలో వున్నప్పుడు టార్చిలైటు సహాయంతో ఆగదిలో ఉన్న అన్ని వస్తువులనూ చూడగలం కాని ఆ టార్చియొక్క బ్యాటరీని దానికాంతితో చూడలేము. ఎందుకంటే బ్యాటరీని టార్చిలోనుండి బైటకు తీయగానే టార్చికి కాంతే వుండదు! ఎలాగైతే నిప్పు తాను తాకిన వాటి నన్నింటిని కాల్చుతుంది. కాని తన వేడికి తానే కాలిపోదో, అలాగే కళ్ళకి చూపునిచ్చే ఆత్మ కళ్ళవల్ల చూడబడదు. అలాగే వాక్కు ఆత్మను వివరించ లేదు. వాక్కు దానివల్ల పలుకుతుంది.

ఆత్మ బుద్ధికికూడా విషయం కాదు. అది దృశ్యం కాదు, ద్రష్ట. అలాగని దానిని "అవిద్య" అనలేము. అది కారణ శరీరానికి అతీతమైనది. అజ్ఞాన రూప మైన వాసనలుకూడా ఆత్మకు దృశ్యమే. అందుచేత ఆత్మ తెలియబడేది

(జ్ఞాతం), తెలియబడనిది (అజ్ఞాతం) కూడా కాదు. రెంటినీ వెలిగించే చైతన్యమది (కేన 1–3)

రాబోయే అయిదు శ్లోకాలలో శ్రీ తపోవనం "చెవికి చెవి" అనే వాటిని వివరిస్తారు.

శ్లో॥ వ్యజ్యతే యస్మిన్ వాచా యత్ వాచం వ్యంజయతి స్ఫుటమ్।
సచ్చిద్బ్రహ్మ స్వరూపాయ తస్మై శ్రీ శంభవే నమః॥ 16

ప్రతి॥ యత్ = ఏ పరబ్రహ్మస్వరూపము, వాచా = వాక్కుచే, న + వ్యజ్యతే = అభివ్యక్తంకాదో, యత్ = ఏదైతే, వాచం = వాక్కును, స్ఫుటం = స్పష్టంగా, వ్యంజయతి = వ్యక్తపరచునో— సత్ + చిత్ + బ్రహ్మ + స్వరూపాయ = సచ్చిదానందబ్రహ్మరూపుడయిన———

తాత్పర్యం

దేనిని మాటలు వ్యక్తం చెయ్యలేవో, దేనివల్ల మాటలు వ్యక్తం అవుతాయో, అసచ్చిద్రూపబ్రహ్మమైన నా ఇష్టదైవం శ్రీ శంభునికి నమస్కారం!

వ్యాఖ్య

శారీరక, మానసిక, బౌద్ధికస్థాయిలలో విషయం-ఉద్రేకంతలపు రంగాల నుండి మనకు కలిగే అన్ని అనుభవాలను మాటలు వ్యక్తంచేస్తాయి. శరీర మనోబుద్ధులద్వారా అనుభవించడానికి వీలులేని "వస్తువు" ఉంటే ఆవిచిత్రానుభవాన్ని మాటలద్వారా వెల్లడించడానికి సాధ్యం కాదు ఆ వస్తువుకారణంగా అన్ని మాటలూ వ్యక్తం అవుతాయి.

ఈ నిత్యచైతన్యమే బ్రహ్మము. ఆయనే నాపైన అనుగ్రహాన్ని చూపే శ్రీ శంభుడు. ఆయనకు నా ప్రణామాలు! (కేన 1 4)

శ్లో॥ మనుతే న మనో యత్తు మనుతే యేన మానసమ్।
సచ్చిద్బ్రహ్మ స్వరూపాయ తస్మై శ్రీ శంభవే నమః॥ 17

ప్రతి॥ యత్ = దేనిని, మనః = మనస్సు, న + మనుతే = తలంచదో, యేన = దేనిచేత, మానసం = మనస్సును, మనుతే = తలచునో, సత్ + చిత్ + బ్రహ్మ + స్వరూపాలు = సచ్చిదానంద పరబ్రహ్మరూపుడయిన— –

## తాత్పర్యం

దేనిని మనోబుద్ధిపరికరం గ్రహించలేదో, దేనికారణంగా మనో–బుద్ధి పరికరం తన రంగంలో వ్యవహరిస్తుందొ ఆసచ్చిద్బ్రహ్మమైన నిత్యచైతన్యానికి నా ప్రియాతిప్రియ శంభునికి నా ప్రణామాలు!

## వ్యాఖ్య

మనస్సు ఉద్రేకాలకు నిలయం. సంకల్పాత్మక మైంది. బుద్ధి వివేకానికి, నిర్ణయాలకు స్థానం. నిశ్చయాత్మక మైనది. ఈపరికరంతో మనం భగవంతుణ్ణి అందుకోలేము. అది దానివెనకాల ఉన్న చైతన్యకారణంగా పని చేస్తుంది. ఆ చైతన్యమే శంభుడు. ఆయనకు నా ప్రణామాలు. (కేన 1. 5)

శ్లో॥ శ్రోత్రేణ శ్రూయతే యన్న శ్రోత్రం యన్న శృణోతి వై।
సచ్చిద్బ్రహ్మ స్వరూపాయ తస్మై శ్రీ శంభవే నమః॥ 18

ప్రతి॥ యత్ = ఏది, శ్రోత్రేణ = శ్రోత్రేంద్రియాలచే, న + శ్రూయతే = వినబడదో, యేన = దేనిచే, శ్రోత్రం = శ్రోత్రేంద్రియం, శృణోతి = వింటున్నదో, సత్ + చిత్ + బ్రహ్మ = సత్, చిత్, బ్రహ్మలైన, స్వరూపాయ = స్వరూపముగల, తస్మై = ఆ, శ్రీ శంభవే = శంకరులకు, నమః = నమస్కారము.

## తాత్పర్యం

ఏది చెవిద్వారా వినబడదో, దేని కారణంగా చెవులు అన్నింటినీ వింటాయో-అనిత్యచైతన్య బ్రహ్మము నా ఇష్టదేవుడు శంభునికి నాప్రణామాలు!

## వ్యాఖ్య

తీవ్రమైన ధ్యానదీక్షలో ఔన్నత్యాన్ని పొందుతున్న శిష్యుణ్ణి ఇంకా ఎక్కువైన సూక్ష్మతమ స్థాయికి గొంపోవడంలో ఈ శ్లోకాలు జోలపాటగా వుపయోగిస్తాయి గురువు జోలపాట పాడుతూండగా శిష్యుడు పరమపదంలోకి జారుకుంటాడు.

శ్లో॥ చక్షుషా దృశ్యతే యన్న యేన చక్షుః ప్రపశ్యతి।
సచ్చిద్బ్రహ్మ స్వరూపాయ తస్మై శ్రీ శంభవే నమః॥ 19

ప్రతి॥ యత్ = ఏది, చక్షుషా = కన్నులచే, నదృశ్యతే = చూడబడదో, యేన = దేనిచే, చక్షుః = కన్ను, ప్రపశ్యతి = చూచునో, సత్ + చిత్ + బ్రహ్మ = సత్, చిత్, బ్రహ్మలైన, స్వరూపాయ = రూపాలుగల——

## తాత్పర్యం

దేనిని కళ్ళు ఎన్నడూ చూడలేవో, దేని కారణంగా అన్నికళ్ళూ చూస్తాయో, అనిత్యచైతన్య బ్రహ్మమైన నా ప్రియశంభునికి నా ప్రణామాలు!

శ్లో॥ ప్రాణేన చేష్టతే యన్న యేనః ప్రాణః ప్రచేష్టతే।
సచ్చిద్బ్రహ్మ స్వరూపాయ తస్మై శ్రీ శంభవే నమః॥ 20

ప్రతి॥ యత్ = ఏది, ప్రాణేన = ప్రాణముచే, న + చేష్టతే = చైతన్యవంతము కాదో, యేన = దేనిచే, ప్రాణః = ప్రాణము, ప్రచేష్టతే = చైతన్యవంతమగుచున్నదో, సత్ + చిత్ + బ్రహ్మ = సత్, చిత్, బ్రహ్మలను, స్వరూపాయ = రూపాలుగల——

## తాత్పర్యం

మనలోని శక్తులు (ప్రాణాలు) దేనిని సమీపించలేవో, దేనికారణంగా అన్ని ప్రాణాలు పనిచేస్తాయో ఆ నిత్యచైతన్య బ్రహ్మము నాపరమపావన శంభుడే. ఆయనకు నా ప్రణామాలు!

## వ్యాఖ్య

జీవంతో ఉన్నంతకాలం మనలో శారీరక, మానసిక, బౌద్ధిక స్థాయిలలో వ్యక్తమై కనబడే జీవలక్షణా లన్నింటినీ కలిపి 'ప్రాణాలు' అంటారు. అవి శరీరంలోను, శారీరక క్రియలలోను, మానసిక వ్యవహారాలలోను పనిచేస్తాయి. అవి అయిదు రకాలు. (1) ప్రాణం (అన్నిస్వీకరణలు) (2) అపానం (అన్ని విసర్జనలు) (3) సమానం (జీర్ణంచేసుకోవడం) (4) వ్యానం (రక్తప్రసారణ) (5) ఉదానం (ఆలోచనాతీరులు). వ్యవహారిక బౌద్ధిక స్థాయిలలో చేసే ప్రయత్నాలవల్ల ఆత్మను అందుకోలేము. ఎందుకంటే ఇవన్నీ దాని ఉనికివల్ల వెల్లడి అయ్యే లక్షణాలు.

ఈ ప్రాణాలు మనలోని జీవమైన ఆత్మ లేకుండా పనిచెయ్యలేవు. ఆ ఆత్మే నా ప్రేమాస్పదుడైన శంభుడు. ఆయనకు నా ప్రణామాలు! (కేన 1.9)

శ్లో॥ ద్రష్టా న దృశ్యతే యద్వై దృశ్యతే చాప్రపశ్యతే।
శుద్ధచిన్మాత్ర రూపాయ తస్మై శ్రీ శంభవే నమః॥ 2

ప్రతి॥ యత్ = ఏది, ద్రష్టా = ద్రష్టచేత, న + దృశ్యతే = చూడబడదో, అప్రపశ్యత = చూడబడనివానిచే, దృశ్యతే = చూడబడుచున్నదో, శుద్ధ = స్వచ్ఛమైన, చిత్ + మాత్ర + రూపాయ = చిత్‌రూపమే అయిన——

## తాత్పర్యం

చూచేవాడికి అది కనబడదు. చూడనివానికి కనబడుతుంది. ఆశుద్ధ చిన్మాత్ర రూపమైన నా ప్రేమాస్పద శంభునికి నా ప్రణామాలు!

## వ్యాఖ్య

విద్వాంసునికి పరమాత్మ తెలియబడని వాడు. విషయాలను చూడ డానికి మనం ఉపయోగించుకొనే పరికరాలు – ఇంద్రియాలు గాని, మనస్సు బుద్ధి గాని ఆయనను బాహ్య విషయంగా చూడలేవు. అందుచేత విద్వాంసులు ఆయనను చూడలేమని చెబుతారు. అయినా కొందరు తాము చూచామని

చెబుతూ ఉంటారు. వాళ్లు పరమాత్మని ఎరగని అజ్ఞానులే. పరమాత్మే మన లోని అనుభవదారు కాబట్టి ఆత్మ చూడబడే వస్తువు కాదు.

పరమాత్మని తెలుసుకుడమంటే తానే పరమాత్మనని తెలుసుకోడమే. కలగంటూనే ఎవరైనా "నేను మెలుకొన్న వాణ్ణి చూశాను" అంటే అతడింకా కలకంటున్నట్లే! అతడు మెలుకొనినచో తానే మెలుకొన్నవాడవుతాడు. జాగ్రదవస్థలోని చైతన్యమే తాను. వేరుగా చూడడం ఎక్కడ? (కేన 2.3)

శ్లో॥ యత్సర్వబుద్ధి వృత్తీనాం సాక్షిత్వేన ప్రకాశతే।
శుద్ధచిన్మాత్ర రూపాయ తస్మై శ్రీ శంభవే నమః॥ 22

ప్రతి॥ యః = ఎవడు, సర్వ = సమస్తమైన, బుద్ధివృత్తీనామ్ = బుద్ధిజీవులకు, సాక్షిత్వేన = చైతన్యరూపుడుగ, ప్రకాశతే = భాసిల్లుచున్నాడో, శుద్ధ = స్వచ్ఛమైన; చిత్ + మాత్ర + రూపాయ = కేవల 'చిత్' — స్వరూపమే అయిన——

## తాత్పర్యం

హృదయాన్ని చలింపచేసే ఆలోచనా రీతుల్ని చూచే సాక్షిచైతన్యంగా ఏది వ్యవహరిస్తుందో ఆ ఆత్మ నా ప్రేమాధికుడైన శంభుడే! అయనకు నా వినయపూర్వక ప్రణామాలు!

## వ్యాఖ్య

ఉద్రేకాలు, తలపులు మన మన్సుబుద్ధుల వృత్తులు. అవి నిత్యమూ లేస్తూ, పడుతూనే వుంటాయి. మనలో ప్రతిఒక్కరికీ ఏమేమి ఉద్రేకాలు కలుగుతున్నాయో, ఎలాంటి తర్కంతో ఆలోచనలు వస్తున్నాయో ఎప్పుడూ తెలుస్తూనే వుంటుంది. వీటిని వెలిగిస్తూ అవి మనకి తెలిసేట్లు చేసేది ఆత్మయొక్క చైతన్యం.

సముద్రంలో అలలు నిరంతరం లేచి ఆడుతుంటాయి, పడుతూంటాయి సూర్యకాంతి రోజంతా వాటిని వెలిగిస్తూనే ఉంటుంది. అయినా సూర్యకాంతికి లేశమైనా తడి అంటదు. సూర్యుడిలో ఒక్క అలకూడా ఉండదు.

అలాగే మన ఉద్రేకాలని, ఆలోచనలని వెలిగించే ఆత్మకాంతి వాటివల్ల ప్రభావితం కాదు, ఆత్మలో ఉద్రేకాలు, ఆలోచనలు పుండవు సూర్యుడు సముద్రంలో అలల్ని సృజించి వెలిగించే మహాప్రభ అయినట్లు ఆత్మసాన్ని ధ్యంలో లేచిపడే ఉద్రేకాలు – తలపులకి ఆత్మసాక్షి చైతన్యం మాత్రమె (కేన 2 4)

శ్లో॥ నియమ్య దైత్యాన్ నిజసేతు భేత్రూన్
సురప్రియో హి జగత్ప్రశాస్తి।
బుద్ధ్వా య మాపుశ్చ మహేంద్ర ముఖ్యా
మహత్పదం తం భజ విశ్వనాథమ్। 23

ప్రతి॥ యః = ఏ, సురప్రియః = దేవతాప్రియుడో నిజ = తన, సేతు = నియమాలను భేత్రూన్ = ఉల్లంఘించునట్టి, దైత్యాన్ = రాక్షసులను, నియమ్య = అణచి, జగత్ = జగత్తును, ప్రశాస్తి = పాలిస్తున్నాడో, యం = ఏ పరమాత్మను, బుద్ధ్వా = తెలిసికొని, మహేంద్రముఖ్యాః = ఇంద్రాది ప్రముఖులు మహత్ + పదం = గొప్పపదవిని, ఆపుః + చ = పొందుతున్నారో——

## తాత్పర్యం

తన శాసనాలని ధిక్కరించే అసురులను నిర్జించి దేవతలపై ప్రీతిచూపి జగత్తును ఎవరు నిర్వహిస్తూన్నారో, ఎవరిని తెలుసుకోడం ద్వారా ఇంద్రాదులు ఏ ఉత్తమపదాన్ని అందుకుంటారో, ఆ ఆనందపదం అయిన శ్రీ విశ్వనాథుణ్ణి మనం భజించెదముగాక!

## వ్యాఖ్య

పరమాత్మ శాసకుడే కాదు, నియామకుడు కూడా. అసురులు ధర్మాన్ని ధిక్కరిస్తారు, అధర్మాన్ని ఆచరిస్తారు. అందుకే ఓడిపోతారు. దేవతలు ధర్మాన్ని పాటించి, జయిస్తారు. పరమాత్మే ఈరెంటినీ సాధిస్తుంది. అనంత న్యాయ తత్పరతతో ప్రపంచ బాహుళ్యాన్ని నిలబెట్టుతుంది.

మనకు భౌతిక మానసిక శాసనాలను అర్థంచేసుకొనేపాటి తెలివి వున్నది జీవిత నియమాలను తెలుసుకొని ఆ నియమాలను పాటించడానికి తగిన అంతః శక్తిని చూపాలి. వాటిని క్షుణ్ణంగా పాటించాలి

ఇందులో ఏమీ వింత, విశేషం లేదు. విద్యుచ్ఛక్తి నియమాలని తెలుసుకున్నాక, వాటిని పాటించి విద్యుచ్ఛక్తి యొక్క పూర్ణలాభాన్ని పొందే పాటి క్రమశిక్షణ మనలో ఉండాలి. పొరపాటుగా కనెక్షనులు ఇస్తే, ఒక్క పొరపాటు భవనాన్నంతా కాల్చివేయగలదు! భగవత్ శాసనాలను అతిక్రమించి దుఃఖాలు, కష్టాలు కొనితెచ్చుకొనేవాళ్లు అసురులు, ధర్మాన్ని పాటించి విజయం పొంది సుఖపడేవాళ్ళు దేవతలు.

ఈ శాసకుణ్ణి, పరమసత్యాన్ని తెలుసుకొని దేవతల అధిపతి ఇంద్రుడు, తదితరులు చిదానందపదాన్ని పొందారు. ఈ పరమపదమైన ఉత్తరకాశీశుడు శ్రీ విశ్వనాథుని గురించి ధ్యానం చేయుదముగాక! (కేన. 3వ అధ్యాయం)

శ్లో॥ విద్యుత్ప్రకాశాయిత చిత్ప్రకాశ
శ్చక్షు ర్నిమేషాయిత లోకసర్గః।
ఇంద్రాది గర్వాపహరశ్చ విశ్వ।
మూర్తి శ్చ యస్తం భజ విశ్వనాథమ్॥ 24

ప్రతి॥ విద్యుత్ ప్రకాశాయిత = మెఱుపు మెఱయు నంతటి, చిత్ + ప్రకాశః = చిత్ రూప ప్రకాశము గలవాడు, చక్షుః + నిమేషాయిత = కనురెప్ప పాటులోనే, లోక = ప్రపంచంయొక్క, సర్గః = సృష్టిగలవాడు, ఇంద్ర + అది = దేవేంద్రాదుల, గర్వ + అపహరః = వర్వములను వదిలించువాడు, విశ్వమూర్తిః = విరాడ్రూపుడు, చయః + చ = సర్వవ్యాపియునైన——

## తాత్పర్యం

విద్యుత్తువలె ప్రకాశమానమై, ఎవరి కనురెప్పపాటు ఈ దృశ్యప్రపంచానికి సృష్టిలయలు అవుతాయో, ఇంద్రాదుల గర్వాన్ని ఎవరు తొలిగించారో, ఎవరు విశ్వమూర్తియో, ఆ పరమాత్మ ఉత్తరకాశీ విశ్వనాథుణ్ణి ధ్యానించుదాము!

## వ్యాఖ్య

కేనోపనిషత్తు నాలుగో అధ్యాయంలో ఆత్మస్వరూపాన్ని సరిగా అర్థం చేసుకొడానికి గాను రెండు ఉపమానాలు ఇవ్వబడినాయి– విద్యుత్‌కాంతి, కనురెప్పపాటు.

ఆకాశంలో ఎక్కడో ఒకమూలగా ఒకక్షణంపాటు మెరుపు మెరుస్తూంది ఆ మెరుపు ఎంత కాంతివంతంగా, ప్రబలంగా ఉంటుందంటే ఆఒక్క క్షణం లోనే ఆలోయలో అంతటా దట్టంగా కప్పిపున్న చీకట్ల తెరను సునాయసంగా ఒక్కసారిగా ఎత్తివేస్తుంది. మనకు అక్కడ వున్నవన్ని స్పష్టంగా కనబడుతాయి.

పైకనురెప్ప క్రింద కనురెప్పని మూసి తెరవడాన్ని రెప్పపాటు అంటారు రెప్పపాటు తెలివితేటలకి సూచకం. జంతువులు అతిఅరుదుగా రెప్పపాటు వేస్తాయి.

మనం కన్నుమూసినప్పుడు ప్రపంచదృశ్యాలన్ని పూర్తిగా తొలిగిపోతాయి కన్ను తెరిచినప్పుడు అవివస్తాయి. ఇదే నిద్ర, మెలకువ. ప్రపంచానికి సృష్టికర్త సంహారకుడు అయిన పరమాత్మ కన్నుమూసినపుడు ప్రపంచం లయమై, తెరిచినప్పుడు సృష్టి జరుగుతుంది. ఆయన రెప్పపాటు బ్రహ్మాండాలని సునాయాసంగా, క్షణంలో సృజిస్తుంది, సంహరిస్తుంది.

పురాణాలలోని ఇంద్రుడు, ఇంద్రియాధిపతి అయిన మనస్సే! (ఇంద్రియాణాం రాజా ఇంద్రః) భక్తుని మనస్సులోని అగర్వాన్ని అభిమానాన్ని, దర్పాన్ని ప్రభువు సంహరిస్తాడు.

ఈ పరమాత్మ ఉత్తరకేశునిదైన శ్రీ విశ్వనాథుడే అనీ గుర్తించి, "ఆయనను ధ్యానించుదాము" అని మహాత్ముడైన కవి సలహా!

శ్లో॥ తపశ్చ శాంతి స్సకలాశ్చ విద్యా
స్సత్యం చ యస్య ప్రతిపత్తి హేతుః।
సత్యం సకృద్భాసుర మాత్మవిద్యా।
మూర్తి ర్యత స్తం భజ విశ్వనాథమ్॥ 25

ప్రతి॥ తపః = తపస్సు, శాంతిః + చ = శాంతియు, సకలాః + విద్యాః + చ = సమస్త విద్యలును, సత్యం + చ = సత్యమును, యస్య = ఏ భగవత్స్వరూపముయొక్క, ప్రతిపత్తి = ఉనికికి, హేతుః = కారణమో యతః = ఎందుకంటే, సకృత్ + భాసురం = ఎప్పటికైనా భాసించునట్టి సత్యం = సత్యమో, ఆత్మవిద్యా = బ్రహ్మవిద్యా రూపమయిన, మూర్తిః, = ఆకారమో, తం = అట్టి, విశ్వనాథం = పరమేశ్వరుని, భజ = సేవింపుము.

తాత్పర్యం

ఎవరిని సిద్ధింపజేసుకోడానికి తపస్సు, శాంతి, సకలవిద్యలు, సత్యమూ రాచమార్గాలో, ఏది శుద్ధచైతన్య రూపమని పేరుగాంచి ప్రకాశిస్తోందో, ఆపరమాత్మ అయిన విశ్వనాథుని మనం ధ్యానించెదము గాక!

వ్యాఖ్య

కేనోపనిషత్తు ముగింపుభాగంలో జిజ్ఞాసువులకోసం ఒక ఆధ్యాత్మికసాధన ఇవ్వబడింది, ప్రాపంచిక విషయాలవైపు మనస్సుని పరుగులు పెట్టించే కోరికల వరదల్ని నిలబెట్టి వుంచడం తపస్సు, బాహ్యంనుండి లోపలికి ప్రవేశించి మనస్సుని చెదరగొట్టే విషయ ప్రేరణల వరదలను అరికట్టడానికి ఇంద్రియాలను నిగ్రహించడం దమం.తపస్సు,దమాలవలన మనస్సుశాంతించి స్తిమితపడుతుంది. అప్పుడు శాస్త్రాధ్యయనం చేసి మనుస్సును ఏదారివెంట నడపాలో తెలుసుకోవాలి. అదే విద్య

ప్రపంచంలో మన అన్ని సంబంధ వ్యవహారాలలో మనోవాక్కర్మలలో నిజాయితీని చూపడం సత్యం, అబద్ధాలు చెప్పినప్పుడు మనస్సుకు, వాక్కుకు

వైరుద్ధ్యం యేర్పడి వ్యక్తిత్వం చీలిపోతుంది. క్రమంగా, త్వరితంగా అది మన స్సుకు ఒకఅలవాటు అవుతుంది బుద్ధి ధ్యానాభ్యాసాల్ని చేస్తున్నప్పుడు మనస్సు దానిని కావాలని ఖండించి వ్యతిరేక ధోరణిలో ఆలోచనలను ఎదురు సృష్టించి శాంతిపూర్వక ధ్యాన శిఖరాలనుండి కామలోభాల మురికిగుంటలోకి ఈడ్చేస్తూ పరుగులుపెట్టుతుంది సత్యాన్ని పాటించడ మంటే శరీర మనో బుద్ధులకు చక్కని సయోధ్య కుదర్చడమే. ఇలా సమగ్రమైన వ్యక్తిత్వం ఉన్నప్పుడే ధ్యానంలో కావలసిన స్తిమితం, స్థిరత్వం ఉంటాయి.

ధ్యానమ నే ప్రక్రియలో మన అంతః కరణాని చక్కగా మేళవించుకో డానికి ఉపాయాలు ఇవి. లోతుగా స్థిరంగా జరిగే ధ్యానంలో విషయాలోచనలు పూర్తిగా ఉడిసిపోయి ఆత్మాలోచనే మిగులుతుంది. ధ్యాత సునాయసంగా పర మాత్మచైతన్యపదంలోకి చేరుకుంటాడు.

ఈ ఆత్మ అయిన ప్రభు విశ్వనాథుణ్ణి మనం ధ్యానించెదముగాక!



# మూడవ స్తబకం

శ్లో॥ ప్రతిష్ఠా జగతః సాక్షా దగ్ని రూపేణ యః ప్రభుః।
యతశ్చ కర్మణాం సిద్ధి ర్విశ్వనాథస్స మే గతిః॥ 1

ప్రతి యః + ప్రభుః = ఏదేవుడయితే, సాక్షాత్ = ప్రత్యక్షంగా, అగ్నిరూపేణ = అగ్నిరూపంతో, జగతః = జగత్తునకు, ప్రతిష్ఠా = ఉనికి, (గా ఉంటున్నాడో) యతః + చ = ఎవనివలననయితే, కర్మణాం = వ్యక్తులప్రయత్నాలయొక్క, సిద్ధిః = ఫలస్వరూపమో, సః = ఆ, విశ్వనాథః = కాశీశ్వరుడు, మే = నాకు, గతిః = రక్షకుడు.

## తాత్పర్యం

నామ రూపాలతోకూడిన ప్రపంచానికి సాక్షాత్తు ఏ పరమాత్మ అగ్నిరూపంలో ఆధారంగా ఉన్నాడో, తాను ఏకమై వివిధవ్యక్తులకు వారివారి కర్మఫలాలను ప్రదానం చేస్తాడో ఆ విశ్వనాథ ప్రభువు నాకు గతియగుగాక!

## వ్యాఖ్య

ప్రపంచంలోని ప్రాణస్పందన వెచ్చదనం లేకుండా నిలవలేదు సూర్యుడు ముందుకో వెనక్కో ఒక్క అడుగు కదిలాడా, మనకు కనబడే ఈ ప్రాణస్పందన నిలవకపోవచ్చును. శరీరంలోని వెచ్చదనం ప్రాణముస్పందనకు దానికి సూచన. అందుచేత భౌతిక ప్రపంచంలో ప్రాణస్పందనకు మూలం అగ్ని అనడం కేవలం కవి యొక్క ఊహకాదు. అది విజ్ఞానశాస్త్రం యొక్క ప్రకటన!

వేదవాఙ్మయంలో ఈ ప్రపంచానికి వెనకాలవున్న ఏక విజ్ఞానఘనమే ప్రతిఒక్కరు చేసే కర్మల యొక్క ఫలాలని ప్రసాదిస్తుందని వివరించబడింది.

ప్రతి సందర్భంలోను రంగం ఒకటే అయినా, వ్యక్తులు సమాన మైన కాలం పనిచేసినా, వాటి ఫలితాలు వేరు వేరుగా వుంటాయనే విషయం మనం గమనిస్తూనే వున్నాము. వేలకొలది కారణాలు రంగంమీదనో, పనిచేసేవాళ్ళమీదనో ఆ వాతావరణంపైనో ప్రభావం చూపుతూండ వచ్చును. ఒక్క పరమవిజ్ఞాన స్ఫూర్తే ఇన్నింటిని గణనలోకి తీసుకొని, ఎవరికి ఎంత అర్హతవున్నదో, ఎంత ఫలం ఇవ్వాలో నిర్ణయించి ఆ ఫలితాన్ని సరిగా ఇవ్వాలి. ఈ "కర్మఫల ప్రదాత" ఈశ్వరుడని వేదాల కర్మకాండ భాగం చెబుతుంది

"గతి" అనే పదానికి మార్గము, గమ్యము అని రెండు అర్థాలున్నాయి. కాశీవిశ్వనాథునిపట్ల భక్తి శుద్ధ చైతన్య పరమ పదంలో మెల్కొనడానికి మార్గం విశ్వనాథచైతన్య పదమే గమ్యంకూడాను, చివరికి చేరవలసినది ఇదే. (కఠోపనిషత్తు 1-12-19)

శ్లో॥ అస్తి నాస్తీతి యద్దేవే విచికిత్సన్త్యపండితాః।
నిత్య సిద్ధస్తు విదుషాం విశ్వనాథ స్స మే గతిః॥ 2

ప్రతి॥ యత్ + దేవే = ఏదేవునిగురించి అయితే, అపండితాః = మూర్ఖులు, అస్తి + నాస్తి + ఇతి = ఉన్నాడో లేడోఅని, విచికిత్సంతి = సందేహిస్తున్నారో, విదుషాంతు = పండితుల కయితే, నిత్యసిద్ధః = (నిత్యలబ్ధుడు), సదాసన్నిహితుడూ.——

## తాత్పర్యం

అవిద్వాంసులు ఎవరిని గురించి ఉన్నాడో, లేడోఅని సందేహిస్తూంటారో, వివేకుల హృదయంలో ఆయన నిత్యమూ ప్రకాశిస్తూంటాడు. ఆపరమప్రభువు విశ్వనాథుడు నాకు గతియగునుగాక!

## వ్యాఖ్య

కఠోపనిషత్తులో పరిపూర్ణుడైన గురువు యమధర్మరాజు, ఆయనతో సమాన తేజస్వి అయిన శిష్యుడు నచికేతుడు. ముఖాముఖీ తారాస పడడంతో మొదలవుతుంది. గురుశిష్యుల అర్హతలను మొదటి కొన్నిమంత్రాలు సూక్ష్మంగా

చిత్రిస్తాయి. వాటిని వదిలేసి మొదటి అధ్యాయంలోని 12–19 మంత్రాలలో స్వామి తపోవనం ఈ అధ్యాయాన్ని ప్రారంభించేశారు. ఈ శ్లోకంలో నచికేతుడు వేసిన ప్రశ్నని ఉదహరిస్తున్నారు.

సాధకులు కానివారు, బాహ్యదృష్టికలవారు ఎందరో! వాళ్ళలో పరమ పదం అంటూ ఒకటి వున్నదా అనేది ఒకపెద్దసందేహం. చింతనాపరులైన మహాత్ముల హృదయాలలో ఆ పదం నిత్యమూ ప్రకాశిస్తూంటుంది. ఈచైతన్య రాశిఅయిన ఆత్మ దేవుడే నా ప్రేమాధిక ప్రభువు విశ్వనాథుడు ఆయన ఒక్కడే నాకు శరణ్యం!

ఇలా సందేహించేది కేవలం లౌకికులైన మానవులేకాదు. స్వర్గంలోని వివేకులైన పుణ్యజీవులకుకూడా ఈ అనుమానం ఉండేది–ఈ విషయాన్ని రాబోయే శ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ దేవై రపి మహాప్రజ్ఞై ర్యస్మిన్ సంశయితం పురా।
దుర్విజ్ఞేయః సుసూక్ష్మత్వా ద్విశ్వనాథ స్స మే గతిః॥ 3

ప్రతి॥ పురా = మునుపు, మహాప్రజ్ఞైః = ప్రజ్ఞావంతులచే, దేవైః + అపి = దేవతలచేతను, యస్మిన్ = ఎవనియందు, సంశయితం = సందేహింపబడినదో. సుసూక్ష్మత్వాత్ = సూక్ష్మతమ మయినందున, దుర్విజ్ఞేయః = అధికప్రయత్నముచే తెలియబడదగినవాడో

## తాత్పర్యం

స్వర్గలోకనివాసులలోకూడా, వారికి ప్రత్యేక శక్తులు, విజ్ఞానమూ ఉండినను, ఈ సందేహం ఉండేది. సూక్ష్మాతిసూక్ష్మమైన ఆత్మను గ్రహించడం తెలియకకాదు. ఆ ఆత్మే నా విశ్వనాథుడు. ఆయన నాకు గతియగుగాక!

## వ్యాఖ్య

ఇక్కడ, ఈ ప్రపంచంలో ఎంత తెలివైనవాళ్ళకైనా విరామం చాలా

తక్కువగా ఉంటుంది. జీవితం అల్పమైంది. సగటున జీవితం డెబ్బై సంవత్స రాలు ఉండవచ్చును. అందులో ముప్పై అయిదు సంవత్సరాలు రాత్రికాలమే పగటికాలం అయిన ముప్పైఅయిదు సంవత్సరాలలోను రోజూ జీవితనిర్వాహణ కోసం ఏడెనిమిది గంటలు పనిచెయ్యక తప్పదు—ఇది పదేళ్లువేసుకోండి.అంతా చదువుకి, జిజ్ఞాసకి, ప్రయత్నానికి. మిగిలింది ఇరవై అయిదు సంవత్సరాలు స్నానం, పానం, వంట, విశ్రాంతి, బట్టలుదుక్కోవడం - ఇలాంటివి రోజూ దాదాపు నాలుగు గంటలు పట్టవచ్చును-అంటే దరిదాపుగా నాలుగు సంవత్స రాలు వాటికే ఖర్చు అయిపోతాయి. ఇక మిగిలింది ఇరవైయొక్క సంవత్స రాలు. ఇందులో పది, పదిహేను సంవత్సరాలు బాల్యం. ఇవి అమాయకంగా గడిచిపోతాయి. ఇంక మిగిలిందెంత? డెబ్బైయేళ్ళలో బహుశా ఆరుసంవత్స రాలు!

స్వర్గంలోనో వేలాది సంవత్సరాలు జీవిస్తారు. వాళ్ళకి నిద్ర, ఆకలి దాహం, రోగం ఏవీ వుండవు. భయాలు, ఆందోళనలు వుండవు. మనస్సు మన కన్నా స్థిమితంగా ఉంటుంది. అయినా వాళ్ళకు ఈ అనుమానం వుండనే వున్నది. దీనికి కారణం ఆత్మ అంత సూక్ష్మం కావడమే. దానిని గ్రహించటం తేలిక కాదు, అందుకోడం సరేసరి!

శ్లో॥ పుత్ర పౌత్ర సమూహేన ప్రాజ్యరాజ్య శ్రియాపి వా।
ప్రాప్తుం న శక్యతే యః శ్రీ విశ్వనాథ స్స మే గతిః॥ 4

ప్రతి॥ యః = ఎవడు, పుత్ర పౌత్ర + = కొడుకులు, మనుమలు మొ॥
సమూహేన = సంతాన పరంపరచే, ప్రాజ్య = పొందిన, సామ్రాజ్య =
సామ్రాజ్యముయొక్క, శ్రియా + అపి + వా = పరిపాలనచేకూడ
ప్రాప్తుం = పొందుటకు, న + శక్యతే = సాధ్యపడడో —

## తాత్పర్యం

పుత్రపౌత్రుల ద్వారా పొందటానికి వీలులేనిదీ, రాజ్య సంపదయొక్క

ప్రాబల్యంవల్ల పొందలేనిది అయిన ఆత్మ నా ప్రేమాధిక విశ్వనాథుడు నాకు గతి యగుగాక!

## వ్యాఖ్య

తానిక వస్తువులను పుత్రపౌత్రులద్వారా సంపాదించినట్లు, ఆత్మను పుత్రపౌత్రులద్వారా సంపాదించుకోలేరని ఉపనిషత్తులు పదేపదే ప్రకటిస్తాయి ఈ లోకంలో నాకేమైనా కావలసి వస్తే దానికోసం ప్రయత్నించి సాధిస్తాను. నా ప్రయత్నం ఒకటీ చాలకపోతే ఇతరుల సహాయంతో పొందడానికి ప్రయత్నిస్తాను నిర్వాహకులు, పనివాళ్ళతో కూడిన సమూహాలు–వాళ్లు నా పుత్రులనుకుంటాను. అయితే ఆత్మని పొందడానికి వాళ్లెవరూ సహాయం చెయ్యలేరు. ఎందుకంటే ఆత్మనందుకోవడ మంటే ఉన్నత చైతన్య స్థాయికి నేను ఎదగడమే! అది నేను అంతర్గతంగా సాధించవలసిందే!

కలలోని వాళ్ళెవరూ నాకు జాగ్రదవస్థను అర్థంచేసుకోలేరు నా అంతట నేను మేలుకోవలసిందే! (కఠ 1–1·23-29)

శ్లో॥ యోగక్షేమ నిషక్తానాం ప్రేయః పథ విచారిణామ్।
క్రోశకోటి విదూర శ్రీ విశ్వనాథ స్స మే గతిః॥ 5

ప్రతి॥ క్రోశకోటి విదూరః = కోటిక్రోశాల దూరమందున్నవారి, యోగక్షేమ = కుశలములను, నిషక్తానాం = కోరువారి, పథ = ధర్మమార్గమందు, విచారిణాం = ఆలోచించువారికి, ప్రేయః = కోరదగినవాడు–అయిన——

## తాత్పర్యం

బాహ్యవస్తువులను సంపాదించుకోవాలనే తాపత్రయం వున్నవాళ్ళకి ఆత్మ కోట్లకొలది మైళ్ళదూరం. ఇంద్రియాల తృప్తికోసం జీవించే వాళ్లకు అంతే! ఆ ఆత్మ కాశీవిశ్వనాథుడు నాకు గతి యగుగాక!

## వ్యాఖ్య

సంపాదించి స్వంతం చేసుకొని, ఆలింగనం చేసుకొని అనుభవిస్తూ విషయ వస్తువులద్వారా ఇంద్రియాల తృప్తి పొందేవాళ్ళకు దృష్టి ఎప్పుడూ బైటకే తిరిగి వుంటుంది. వాళ్ళ మనస్సును నిలకడైన దృష్టితో ఆలోచనల వైపు ప్రసరింపజేసే మనఃస్థిమితం ఉండదు. వాళ్లు ధనాన్ని, పదవుల్ని పొంద వచ్చును. క్షుద్రమైన అనిత్యమైన ఇంద్రియాల తృప్తిని కూడా పొందవచ్చును ఆనందపదాన్ని శాశ్వత సుఖాన్ని ఎన్నటికీ పొందలేరు.

శ్లో॥ త్యక్త్వా కామాన్ సుష్ఠు ధీరైః శ్రేయః ప్రార్థితయా హృది।
పూజ్యతే భావ్యతే యః శ్రీవిశ్వనాథ స్స మే గతిః॥ 6

ప్రతి॥ ధీరైః = ధైర్యవంతులచే, కామాన్ = కోరికలు, సుష్ఠు = బాగుగా, త్యక్త్వా విడువబడి. శ్రేయః = శ్రేయస్సును, ప్రార్థితయా = ప్రార్థించుటద్వారా హృది = మనస్సునందు, యః = ఏ పరమాత్ముడు, పూజ్యతే = పూజిం పబడుచున్నాడో, భావ్యతే = తలంపబడుచున్నాడో, సః = ఆ, శ్రీవిశ్వ నాథః = శివుడు, మే = నాకు, గతిః = నాయకుడు.

## తాత్పర్యం

అన్ని కామాలను త్యజించి హృదయపూర్వకంగా తమ ముక్తికోసం తపిస్తూ సాధకులు తమహృదయంతో ఎవరిని ఆరాధించి ధ్యానించుతారో ఆ ఆత్మ శ్రీవిశ్వనాథుడే నాకు గతి యగుగాక.

## వ్యాఖ్య

ప్రాపంచిక విషయాలను స్వంతం చేసుకొని పట్టుకొని క్షణికమైన సుఖా లను పొందాలనే శుష్కకాంక్షలను వదిలేసి, ప్రస్తుత పరిధుల మధ్య ఇరు క్కుపోయి వున్న, తమ వ్యక్తిచైతన్యాన్ని పూర్తిగా విడిపించుకోవాలనె తపన ఉన్నవాళ్ళు జిజ్ఞాసా యుతమైన వివేకంతో సాధన చేస్తూ జీవిస్తారు. బయట

నుండి మనస్సును తానే అవాంతరాలకు అరికట్టడానికి నిరంతర కృషిని కొన సాగిస్తూ ఆలోచనా ప్రవంతికి మూలమైన అహంకారానికి ఉనికి ఎక్కడో తెలుసుకోడంలో పూర్తిగా నిమగ్నులౌతారు. ధ్యాన నిమగ్నులై సాధకులు నిరం తరం పూజించి ధ్యానించే ఈ సారమే, ఆత్మే, శ్రీ కాశీవిశ్వనాథుడు. ఆయన నాకు గతి యగుగాక! (కఠ 1-2 1,2)

శ్లో॥ శృణ్వంతి బహవో యన్న శ్రుత్వాపి న విదంతి చ।
వక్తాఽపి దుర్లభో యస్స విశ్వనాథ స్స మే గతిః॥ 7

ప్రతి॥ యః = ఏ తత్త్వమును, బహవః = అనేకులు, నశృణ్వంతి = వినరో, శ్రుత్వా + అపి = విన్నను, న + విదంతి + చ = తెలిసికోరో, యస్య = ఏతత్త్వానికి, వక్తా + అపి = బోధకుడుకూడా, దుర్లభః = దొరకడో—

## తాత్పర్యం

చాలమందికి ఆత్మను గురించే వినే అవకాశంకూడా లభించదు. విన్నాక కూడా చాలామంది దానిని అర్థం చేసుకోలేరు, సూక్ష్మమైన ఈ ఆత్మను గురించి చెప్పగలిగిన మహాత్ములు ఎంతో అరుదుగా ఉంటారు. ఈఆత్మ, శ్రీవిశ్వనాథుడు నాకు శరణ్యము, గమ్యము అగుగాక!

## వ్యాఖ్య

నిజానికి ఏకాలంలోను సృజనాత్మకమై ఆత్మగురించి వినే అవకాశాలు చాలా అరుదుగా వుంటూ వచ్చాయి, ఎందరో విన్నా వాళ్ళల్లో కొద్దిమందికే భక్తితత్పరత వుంటుంది. శుద్ధమైన అంతరంగంతో విన్నదానిని మననం చేసు కునే శక్తి వుంటుంది, అలాంటి వాళ్ళకైనా సిద్ధుడై సూక్ష్మాతిసూక్ష్మమైన ఆత్మ తత్త్వానుభూతి కలిగిన మహాత్ముడు గురువుగ లభించినపుడే,ఆత్మను గురించిన వివరణ హృదయాలను తాకుతుంది.

అలాంటి గురుశిష్యుల కలయిక ఎంతో అరుదుగా జరుగుతుంది. శుద్ధహృదయుడై వినే శిష్యుడు, తన్మయుడై వివరించే గురువు ఆ అరుదైన సమ

యాలలో మన శాస్త్రాలు ఆనందంతో నర్తిస్తాయి. ఆ సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మ శ్రీవిశ్వనాథుడే నాకు గతి యగుగాక! (కఠ 1-2.7)

శ్లో॥ తర్కాగమ్యా హి యద్బుద్ధిః దేశికోక్త్యైవ గమ్యతే।
బహుధా చింత్యమానః శ్రీ విశ్వనాథ స్స మే గతిః॥ 8

ప్రతి॥ యత్ + బుద్ధిః = ఏ పరమాత్మ, తర్కాగమా + హి = వాదనలచే పొందబడదో, దేశిక + ఉక్త్యా + ఏవ = గురుదేవుల బోధనలచేతనే, గమ్యతే = తెలియబడుతుందో, బహుధా = అనేకవిధాలుగా, చింత్యమానః = విచారింపబడుచున్నదో——

## తాత్పర్యం

బుద్ధితర్కంద్వారా ఆత్మ అందుకోబడదు అది అనేకవిధాలుగా ధ్యానింపబడాలి. జ్ఞాని అయిన గురువు వాక్కు వల్లనే అది పూర్తిగా (వివరం) అర్థం అవుతుంది. ఆయనే ఆత్మను గురించిన సమగ్రజ్ఞానాన్ని శిష్యునికి అందించగలడు. ఆ ఆత్మ శ్రీ కాశీవిశ్వనాథుడు నాకు గతి యగుగాక!

## వ్యాఖ్య

భౌతిక శాస్త్రాలలో తర్కం ఉపయోగిస్తుంది. అధ్యాత్మిక శాస్త్రానికి పనికిరాదు. నీటిలో ప్రయాణానికి అనువైన పడవ నేలపై పోవటానికి పనికిరాదు. కాలపరిధిలో బహుళప్రపంచంలో బుద్ధిక్రీడారంగంలో తర్కం పనికి వస్తుంది. బుద్ధికి అతీతంగా చొచ్చుకుపోయే ఆధ్యాత్మిక విచారణలో అంతరంగంలో తర్కానికి తావు లేదు. ఆ ఆత్మయే కాశీవిశ్వనాథుడు. ఆయన నాకు గతి యగుగాక! (కఠ 1_2.8,9)

శ్లో॥ ఆబ్రహ్మభువనాద్యో హి విరక్త సాధనాన్వితః।
తేనైవ దృశ్యతే యః శ్రీ విశ్వనాథ స్స మే గతిః॥ 9

ప్రతి॥ యః = ఎవడయితే. ఆబ్రహ్మభువనాత్ = బ్రహ్మలోకపర్యంతము విరక్తః = విరక్తుడై, సాధన + అన్వితః = భగవదారాధనితో కూడియుండునో, తేన + ఏవ = అట్టిభక్తునిచేతనే, యః = ఏపరమాత్ముడు, దృశ్యతే = చూడబడుచున్నాడో.——

## తాత్పర్యం

బ్రహ్మలోకంవరకూ దేనిని పొందాలనే, అనుభవించాలనే స్పృహ లేని వారు, ఆధ్యాత్మిక అర్హతల నన్నింటినీ తమలో పెంపొందించుకొన్నవారు మా త్రమే అందుకోగలిగిన ఆ సత్యధామం, ఆత్మరూపం శ్రీ సామ్యకాశీశుడు నాకు గతి యగుగాక!

## వ్యాఖ్య

ఎంతవరకు భూలోకంలోనో, స్వర్గలోకంలోనో విషయాలను భోగించాలనే కోరిక వున్నదో, అంతవరకు మనోదృష్టి బహిర్ముఖమై ఆత్మకు దూరమై పోతుంది. ఆత్మయే ద్రష్ట, కర్త, శమం అంటే మనోనిశ్చలత, దమం అంటే ఇంద్రియనిగ్రహం, తితిక్ష మౌనంగా అన్నింటినీ ఓర్చుకోగలిగిన శక్తి, శ్రద్ధ అంటేలోతైన విశ్వాసం మొదలైన క్రమశిక్షణలు అలవరుచుకొన్నప్పుడు అవి ఆత్మధ్యానంలో ఎంతో తోడ్పడుతాయి. లోపల కామనల పురుగులు కుట్టుతూ వుంటే ఇవేవీ లభించవు, ధ్యానం కుదరదు.

**శ్లో॥ అధ్యాత్మ యోగ్యయుక్తేన చేతసా యోఽనుచింత్యతే।**
**గుహాహిత నిగూఢః శ్రీ విశ్వనాథ స్స మే గతిః॥ 10**

ప్రతి॥ అధ్యాత్మ = ఆధ్యాత్మికమైన, యోగ = కర్మాదియోగములచే, యుక్తేన = కూడిన, చేతసా = బుద్ధితో, యః = ఏపరమాత్ముడు, అనుచింత్యతే = యోచింపబడుచున్నాడో, గుహా + హిత + నిగూఢః = హృదయమనెడి గుహయందు దాగియున్న——

## తాత్పర్యం

ఆలోచనలన్నీ అంతర్ముఖమై శుద్ధచైతన్య స్థితివైపుకి తిరిగినప్పుడు ఆ ఆధ్యాత్మయోగంవల్ల ఆత్మానుభూతి కలుగుతుంది. హృదయంలో నిగూఢంగా వసించే ఆత్మ శ్రీ కాశీవిశ్వనాథుడు నాకు గతి యగుగాక!

## వ్యాఖ్య

బాహ్య బహుళ రంగాలలో నిశ్చలంగా చరించే ఆలోచనల నన్నింటినీ గుచ్చి ఎత్తి మనలోని ప్రాణచైతన్యానికి మూలమైన కేంద్రంవైపుకు పూర్తిగా త్రిప్పడం అధ్యాత్మయోగం, మన పరికరాలన్నింటికి ఆత్మయొక్క అనంత శక్తివల్ల సచేతనా లయినప్పుడే అవి వ్యవహరిస్తాయి. అన్ని ప్రాణాలలోని జీవ ప్రవంతికి మూలమైన ఆత్మ శ్రీ కాశీవిశ్వనాథుడు నాకు గతి యగుగాక!
(కఠ 1–2,10)

శ్లో॥ శ్రుత్వా మత్వా చ యం లబ్ధ్వా మోదతే మోహవారిధౌ।
మోదనీయః శరీరః శ్రీవిశ్వనాథ స్స మే గతిః॥ 11

ప్రతి॥ శ్రుత్వా = వినుటచే, మత్వాచ = బుద్ధిచేతను. యం = ఏపరమాత్మను లబ్ధ్వా = పొంది, మోదవారిధౌ = సంతోషసముద్రమందు, మోదతే = సంతసించు చున్నాడో, మోదనీయశరీరః = ఆనందింపదగిన శరీరంగల వాడయిన——

## తాత్పర్యం

శ్రుతులను అధ్యయనం చేసి, ధ్యానం చేసిన సాధకుడు ఆనందస్థాయిని చేరుకొని కేవలానందంలో ఓలలాడుతాడు. ఆ ఆనందరూపుడైన విశ్వనాథ ప్రభువు నాకు గతి యగునుకాక!

## వ్యాఖ్య

గురువువద్ద శ్రవణం చేసి, లేదా శాస్త్రాలను అధ్యయనం చేసి అర్థం

చేసుకోవడం వాటినిగురించి లోన మననం చేయడం, ఆత్మసాక్షాత్కారం మీద ధ్యానం చేయడం, వేదాంత సాధనలోని మూడుభాగాలు. చివరిగమ్యం ఆలోచనల అంతం, అహంకారంయొక్క మరణం, అప్పుడు సాధకుడు ఆనంద రూపాత్మతో పూర్తిగా తాదాత్మ్యం పొందుతాడు. ఆ చివరి ఆనందదశ శ్రీ విశ్వనాథుడు నాకు గతి యగునుగాక! (కఠ 1-2.13)

శ్లో॥ పుణ్యాపాపాత్ పృథగ్భూతః కార్యకారణత శ్చ యః।
కాలత్రయాచ్చ శశ్వ చ్ఛ్రీవిశ్వనాథ స్స మే గతిః॥ 12

ప్రతి॥ యః = ఏ పరబ్రహ్మ, పుణ్యపాపాత్ = పుణ్యపాపాలవలన, కార్యకారణతః + చ = కారణకార్యాలవలనను, కాలత్రయాత్ + చ = త్రికాలాలవలనను, పృథక్ + భూతః = వేర్వేరుగాకన్పడుచున్నాడో. సః = అతడు, శశ్వత్ = శాశ్వతముగా, శ్రీ విశ్వనాథః = శంకరుడు, మే = నాకు, గతిః = శరణము.

## తాత్పర్యం

పుణ్యపాపాల కతీతమై, కార్యకారణాలకు అతీతమై, త్రికాలాతీతమైన శాశ్వత మంగళస్వరూపుడు శ్రీవిశ్వనాథప్రభువు నాకు గతి యగునుగాక!

## వ్యాఖ్య

ఆత్మ దేశకాలాలకు అతీతమైనది. అందువల్ల భూతభవిష్య ద్వర్తమానాలను అధిగమిస్తుంది. అది బుద్ధికి అతీతం. అందువల్ల కార్యకారణాలను అధిగమిస్తుంది. ముందున్నది కారణం, తరువాత వచ్చేది కార్యం (చెట్టుకు సంబంధించినంత వరకు పండు కార్యం. పండుకు సంబంధించినంతవరకు ఆ పండులోని విత్తనంద్వారా తిరిగి ఒకచెట్టు వస్తుంది కాబట్టి చెట్టు కార్యం.) ఆత్మ కార్యకారణ భావాలను వెలిగించే చైతన్యం. కాలప్రవాహం నిలిచిపోయినప్పుడు కార్యకారణాలు శుద్ధ చైతన్యంలో కరిగిపోతాయి.

మీ తండ్రితో పోల్చుకున్నప్పుడు ఆయన భూతకాలం, మీరు భవిష్యత్తు మీకుమారునితో పోల్చుకున్నప్పుడు మీరు భూతకాలం, అతడు భవిష్యత్తు నిజానికి మీరు భూతకాలమూ కాదు, భవిష్యత్తూ కాదు. కార్యకారణాలకు భూత భవిష్యాలు ఉన్నాయి. వాటిలో సంబంధం పెట్టుకోపడంవల్ల మీకు భూతభవిష్యత్తులు కలుగుతున్నాయి. భూతభవిష్యత్తులతో సంబంధం లేని వర్తమానం శుద్ధఆత్మయే. అందుచేత కార్యకారణాలకు అతీతం.

పని చేసేవాడికి పుణ్యపాపా లుంటాయి. ఆత్మ పదార్థ పరికరాలను సజీవం చేస్తుంది. అది ఏపనిని చేయదు. పరికరాలే పనిచేస్తాయి. అందుచేత దానికి పుణ్యపాపాలు లేవు. రెంటికి భిన్నమైనది.

కారులోని పెట్రోలు ఇంజనులోని శక్తిని వ్యక్తంచేస్తుంది. పెట్రోలు సమర్థుడైన డ్రైవరూ కాదు, చేతకాని డ్రైవరూ కాదు, డ్రైవరుకన్న భిన్నమైనది. అలాగే మనలోని అహంకారం పనిచేసే పరికరాలతో తాదాత్మ్యం పొంది "నేను చేసేవాడిని" అని భ్రాంతి పొందుతుంది. దానికే పాపపుణ్యాలు చెందుతాయి. ఆత్మకు చెందవు. (కఠ 1–2.14)

శ్లో॥ యత్పదం గీయతే వేదై ర్యత్ పదం బ్రహ్మచర్యయా।
దిదృక్షన్తే మహాంతః శ్రీ విశ్వనాథ స్స మే గతిః॥ 13

ప్రతి॥ యత్ + పదం = ఏ బ్రహ్మ పదము, వేదైః = వేదాలచే, గీయతే = గానం చేయబడెనో, యత్ + పదం = ఏ బ్రహ్మపదను, మహాంతః = మహాత్ములు, బ్రహ్మచర్యయా = బ్రహ్మజ్ఞానముచే, దిదృక్షన్తే = చూడగలుగు చున్నారో——

## తాత్పర్యం

వేదాలచేత గానం చేయబడిన పదం. బ్రహ్మచర్యంద్వారా జిజ్ఞాసువులు అనుభవంకోసం ప్రయత్నించే పదం శ్రీవిశ్వనాథుడు నాకు గతి యగుగాక!

వ్యాఖ్య

ప్రపంచములోని అన్ని ఆధ్యాత్మికశాస్త్రాలు దైవపదాన్ని గురించి చెబుతాయి, నిజమైన సాధకులు ఆత్మానుభవాన్ని గురించి దీర్ఘంగా లోతుగా ధ్యానం చేసి ఈచైతన్యపదాన్ని అందుకుంటారు. ఇదే బ్రహ్మచర్యం (బ్రహ్మణి చరతి ఇతి బ్రహ్మచర్యం)

శ్లో॥ ప్రణవైక ప్రకాశ్యో య స్త త్ప్రతీక శ్చ యః ప్రభుః।
పరాపర బ్రహ్మరూపో విశ్వనాథ స్స మే గతిః॥ 14

ప్రతి॥ యః + ప్రభుః = ఏ పరబ్రహ్మ అయితే, ప్రణవః + ఏక + ప్రకాశ్యః = ప్రణవమనే ఓంకారరూపంతోనే ప్రకాశింపబడుచున్నాడో, యః = ఎవడయితే, తత్ + ప్రతీకః + చ = ఆ ఓంకారానికిసూచకమో, పరాపర బ్రహ్మరూపః = పరాపరమైన బ్రహ్మరూపుడో——

తాత్పర్యం

ఓంకారోపాసన ద్వారా పరమాత్మ అందుకోబడుతుంది ఓంకారం అయన దివ్యప్రతీక నామం. ఓంకారంద్వారా ప్రపంచబాహుళ్యము, శుద్ధఆత్మ కూడా నిర్దేశింపబడుతాయి. ఈఓంకారమే నా విశ్వనాథప్రభువు. ఆయన నాకు గతి యగుసుగాక!

వ్యాఖ్య

"ఓం" అనే సంకేతం పరమాత్మయొక్క వాచకం, అంటే నామం. ఓంకారం బ్రహ్మమునే సూచించడం కాకుండా, శరీర మనోబుద్ధులద్వారా దేశకాల పరిధులు మనం చూచే నామరూప జగత్తును కూడా ఓంకారం సూచిస్తుంది అందుచేత ఓంకారంలో పరమగమ్యస్థితి అయిన కారణబ్రహ్మము, మనలోని వ్యక్తిత్వము, మనం పరికించే కార్యం ప్రపంచ బాహుళ్యమూకూడా

ఓంకారాన్ని తెలుసుకోగానే సాధకులు ఏమి కోరుకొన్నా, కాలపరిధిలో గాని, కాలతీతపదంగాని, పొందుతారు.

ఇలా వాచకమైన అవ్యక్త పరమసత్యం, వాచ్యమైన ప్రపంచబాహుళ్యం ఈరెంటినీ తనలో ఇముడ్చుకొన్న ఓంకారం నా ప్రేమాస్పదుడైన కాశీవిశ్వనాథుడు. ఆయనే నాకు ఏకసాంత్వనం. శరణ్యం! (కఠ 1-2 14-16)

15-19 శ్లోకాలలో శ్రీగురుదేవులు ఆత్మయొక్క వేరువేరు వ్యక్తిస్వరూపాలను వివరిస్తూ శుద్ధాత్మ శరీరానికి అతీతమని సూచిస్తున్నారు.

శ్లో॥ శరీరే హన్యమానేఽపి న చ హన్యేత యోఽజనిః।
శాశ్వతః శశ్వదాభః శ్రీవిశ్వనాథ స్స మే గతిః॥ 15

ప్రతి॥ యః + అజనిః = ఎవడయితే పుట్టుకలేనివాడో, శరీరే = శరీరము, హన్యమానే + అపి = చంపబడినప్పటికిని, న + చ + హన్యేత = చావడో, శాశ్వతః = నిత్యుడో, శశ్వత్ + ఆభః = నిత్యప్రకాశమానుడో——

## తాత్పర్యం

శరీరం చంపబడినప్పటికీ, చావకుండా ఏది ఉంటుందో అజము, శాశ్వతము, నిత్యము అయిన శ్రీవిశ్వనాధుడు నాకు గతి యగునుగాక!

## వ్యాఖ్య

ప్రతివారూ ఆరు మార్పులను చెందుతారు. ప్రతిమార్పూ బాధాకరమైనదే. వాటి బారినుండి తప్పించుకొనే విధానం ఎవరూ ఎరగరు. అందరూ వాటిని అనుభవించ వలసినదే, పుట్టడం, ఉండడం, ఎదగడం, కృశించడం, రోగం, మరణం-అనేవి ఈ ఆరు. కాలపరిధిలో వర్తించే అన్ని ఆకారాలకి అనివార్యంగా వచ్చే గతులవి. అయితే కాలరహితమైన దానిని ఈమార్పు లేమీ

చేయలేవు. అందుచేత జన్మరహితము, మరణరహితము అయిన అది, మార్పులు లేనిది. అందుకే శాశ్వతమైనది. అందువలన నిత్యమైనది. కాబట్టి ఎప్పుడూ ఒకేరకంగా ఉంటుంది అందుచేత ధ్రువము, అనంతమైనది. ఒకఅల విరిగి పడినప్పుడు సముద్రానికి ఏవిధమైన నష్టమూ వాటిల్లదు.

ఈ ఆత్మ నా విశ్వనాథుడు. భక్తితో ఆయనకు ఆత్మార్పణం చేసుకొంటాను (కఠ 1–2.18)

శ్లో॥ కర్తృతా కర్మతా చైవ యస్మి న్నధ్యస్యతే ఖలైః।
వస్తుతోఽద్వైతమూర్తిః శ్రీ విశ్వనాథ స్స మే గతిః॥ 16

ప్రతి॥ యస్మిన్ = ఏభగవంతునియందు, ఖలైః = అజ్ఞానులచేత, కర్తృతా = కర్తృత్వాన్ని, కర్మతా + చ = కర్మత్వాన్ని, న + అధ్యస్యతే = నేర్పబడదో, వస్తుతః = వాస్తవానికి, అద్వైతమూర్తిః = ద్వైతాదిభావంలేని మూర్తి—అయిన.— —

## తాత్పర్యం

అవివేకులైన మానవులు తమ అహంకారాన్ని, కర్తృత్వభావాన్ని పరమాత్మమీద అధ్యారోపణం చేస్తారు. ఆత్మస్వభావం ఎప్పుడూ అద్వితీయమైనది. ఈఆత్మ శ్రీ విశ్వనాథుడు నాకు గతి యగునుగాక!

## వ్యాఖ్య

అహంకారం, కర్తృత్వభావం రెండూ కలిసింది జీవుడు. "నేను ద్రష్ట-భావుకుడు-విచారశాలిని" అనే జీవదృష్టి జాగ్రత్తగా పరిశీలించి చూస్తే, అవివేకంతో ఆత్మని కించపరచడమేననే సంగతి బోధపడుతుంది.ఆత్మసాన్నిధ్యంలో జడమైన శరీర మనోబుద్ధులు చేతనత్వాన్ని పొంది ఇంద్రియాలు చూచేవాటిని

బుద్ధి యోచించే వాటిని తెలుసుకుంటుంది. ఈ ద్రష్ట-భావుక-విచారశాలియే జీవుడు. మన పూర్తి వ్యక్తిత్వం అనుకునేది శుద్ధచైతన్యం కాదు. పరిధుల్లోనికి వచ్చిన చైతన్యం విషయ వస్తువులను గుర్తించే చైతన్యం.

సరిగా వివేచనం చేసినప్పుడు శుద్ధచైతన్యం మన స్వరూపమని విషయ–ఉద్రేక-తలపులవలన దోషాలు, పరిమితులు చెందనిదని బోధపడుతుంది. ఆయనలో అహంకారం గాని దర్శింపబడే బాహుళ్యంకాని లేవు. ఆయనే నా విశ్వనాథుడు అయనే నాకు శరణ్యం.

శ్లో॥ అణుభ్యోఽణుతరో య శ్చ మహద్భ్యోఽపి మహత్తరః।
శోకరాశి విముక్తః శ్రీవిశ్వనాథ స్స మే గతిః॥ 17

ప్రతి॥ యః + చ = ఎవడయితే, అణుభ్యః = అణువులకంటే, అణుతరః = పరమాణువో, మహద్భ్యః + అపి = మహత్తులకంటె, మహత్తరః = మహత్తరమైనదో, శోకరాశి = దుఃఖసముద్రమునుండి. విముక్తః = విడుదల పొందినవాడో——

## తాత్పర్యం

చిన్నదానికన్న చిన్నది పెద్దదానికన్న పెద్దది అయి అన్నిరకాల శోకాలకు అతీతంగా ఉండే ఆత్మ విశ్వనాథుడే. నాకు గతి యగునుగాక!

## వ్యాఖ్య

చిన్న-పెద్ద, స్థూల-సూక్ష్మ, పొడుగు--పొట్టి, నలుపు-తెలుపు, ఈవిభజనలన్నీ బుద్ధిఅంచనాలలో భాగం. పరిమితమైన ప్రపంచవిషయాలలో దృశ్యమానమైన బాహుళ్యంలో అవి పనికివస్తాయి. బుద్ధిని అధిగమించి సాధకుడు ధ్యానంలో జాగృతుడైనప్పుడు అక్కడ ఈ విభజనలకు తావులేదు. రెండవది లేని ఏకవస్తువది. భావాతీతమైన ఏకదివ్య సర్వవ్యాప్త నిత్యాత్మ అది.

శరీర మనోబుద్ధులు పరికరాలు మనకు అన్నిరకాల పీడలను కలిగిస్తాయి. వాటిని అధిగమించినపుడు, దుఃఖాల కతీత మైనది ఆత్మపదం అని మాత్రమే వర్ణించడానికి వీలవుతుంది.

శ్లో॥ ఆస్తే యాతీవ యః శేతే విషీదతి చ హృష్యతి।
విరుద్ధ ధర్మా విశ్వాత్మా విశ్వనాథ స్స మే గతిః॥ 18

ప్రతి॥ యః = ఎవడు, ఆస్తె = కూర్చున్నట్లుగానే, యాతి = వెళ్లుచున్నాడో, శేతే = నిదురించుచున్నాడో, విషదతి = దుఃఖించుచున్నాడో, హృష్యతి = సంతోషించుచున్నాడో - ఆదిగా, విరుద్ధధర్మా = పరస్పరవిరుద్ధ ధర్మాలుకల, విశ్వాత్మా = విశ్వరూపుడయిన, సః = ఆ, విశ్వనాథః = శివుడు, మే = నాకు, గతిః = శరణము.

## తాత్పర్యం

కూర్చొనే, నిద్రపోతూనే ప్రయాణిస్తున్నట్లు అగపడేది. విచారిస్తుంది- సంతోషిస్తుంది అన్నట్లు అగపడేది, ఆత్మ. ఇలా విరుద్ధ ధర్మాలలో కనబడే విశ్వాత్మకుడు విశ్వనాథుడు నాకు గతి.

## వ్యాఖ్య

సర్వత్రా వ్యాపించి ఉన్నందున ఆత్మకు తనస్థాయిలో ఏకదలికా లేదు. పరికరాలతో కూడివున్నప్పుడు కదులుతున్నట్లు కనిపిస్తుంది. విద్యుత్తులో కాంతి లేదు. అయినా అది బల్బులో ఉన్నప్పుడు గదినంతా కాంతితో నింపుతుంది.

ఇంద్రియాలద్వారా వ్యవహరిస్తున్నప్పుడు అది విషయ వస్తువుల్ని భోగించి సుఖిస్తున్నట్లు అగుపడుతుంది. అయితే ఆత్మస్థాయిలో భోగించడానికి విషయ వస్తువులే లేవు. ఇంద్రియాలు శరీరానికి వున్నాయి కాని ఆత్మలోలేవు మనస్సు సుఖాన్ని అనుభవిస్తుంది. ఆత్మలో మనస్సులేదు.

ప్రపంచానికి ప్రభువై ఎన్నో విరుద్ధలక్షణాలతో కూడివున్నట్లు అగపడుతూ, పరికరాలలో చురుకుగా వ్యవహరిస్తూ తనస్థాయిలో నిర్లిప్తంగా ఉదాత్తంగా ఉండే పరమాత్మ శ్రీకాశీవిశ్వనాథుడు నాకు ఏకశరణ్యం. (కఠ 1-2.21)

శ్లో॥ నిర్వపు ర్వపు రధ్యక్షో నిత్య నిర్వృత విగ్రహః।
వ్యోమవ ద్వ్యాపకో యః శ్రీవిశ్వనాథ స్స మే గతిః॥ 19

ప్రతి॥ యః = ఏపరమాత్మఅయితే, నిర్వపుః = శరీరములేనివాడై, వపుః + అధ్యక్షః = ఇతర శరీరాలకు అధ్యక్షుడో, నిత్య = ఎల్లప్పుడు, నిర్వృత విగ్రహః = మోక్షస్వరూపుడో, వ్యోమవత్ = ఆకాశంవలె, వ్యాపకః = వ్యాపించియున్నాడో—

## తాత్పర్యం

శరీరం లేకనే అన్ని శరీరాలను సజీవం చేసేవాడు, నిత్యుడు, ఏపరికరం లేక ఆకాశంవలె సర్వవ్యాప్తి అయిన పరమాత్మ శ్రీకాశీవిశ్వనాథుడు నాకు గతి యగుగాక!

శ్లో॥ వేదవేదాంగ పాఠేన ప్రజ్ఞయా ప్రాభవేణ వా।
యోఽయ మాత్మా న లభ్యః శ్రీవిశ్వనాథ స్స మే గతిః॥20

ప్రతి॥ యః = ఏ, అయం + ఆత్మా = పరమాత్మ, వేదవేదాంగ = వేదాల వేదాంగాల, పాఠేన = పఠనముచేగాని, ప్రజ్ఞయా = జ్ఞానముచేగాని, ప్రాభవేణ + వా = ప్రాపంచికశక్తులచేగాని, న + లభ్యః = పొందబడదో

## తాత్పర్యం

నాలుగు వేదాలు, ఆరు వేదాంగాలు పఠించడంవల్ల కాని, ప్రాపంచికమైన శక్తిసామర్థ్యాల వేటివల్ల కాని పొందబడని ఆత్మ శ్రీకాశీవిశ్వనాథుడు నాకు గతి యగునుగాక!

## వ్యాఖ్య

చదవడంవల్ల, తెలివితేటలవల్ల, శారీరకబలంద్వారా బాహ్యప్రపంచంలో కావలసిన దానిని పొందవచ్చును ఆత్మ? అది వ్యక్తిలోని సారం. దానిని త్యాగంవల్ల మాత్రమే పొందగలం. శారీరక మానసిక బౌద్ధిక స్పర్శలన్నింటిని త్యాగం చేసినప్పుడే గాఢనిద్రలోకి జారుకోగలం. ఎవరి అనుగ్రహంవల్ల విషయ-ఉద్రేక-తలపుల ప్రాపంచి కానుభవాలు వస్తాయో అనిత్యాత్మ శ్రీకాశీవిశ్వనాథుడే నాకు శరణ్యం. (కఠ 1-2.23)

శ్లో॥ ప్రేమ్ణా సంప్రార్థ్య సంప్రార్థ్య యేన సంధాయతే భృశమ్।
**తేనైవ లభ్యతే యః శ్రీవిశ్వనాథ స్స మే గతిః॥** 21

ప్రతి॥ యేన = ఎవనిచే, ప్రేమ్ణా = ప్రేమతో, సంప్రార్థ్య + సంప్రార్థ్య = మాటి మాటికి ప్రార్థించి, భృశం = ఎక్కువగా, యః = ఎవడు. సంధీయతే = సంధింపబడుచున్నాడో. తేన + ఏవ = అతనిచేతనే, లభ్యతే = పొంద బడుచున్నాడో—

## తాత్పర్యం

గాఢమైన భక్తిలో నిరంతరం ధ్యానం చేసిన సాధకుడే ఆత్మస్వరూప మైన చైతన్య పదంలోకి మేలుకోగలుగుతాడు. ఆ పదం శ్రీకాశీవిశ్వనాథుడు నాకు గతి యగునుగాక!

## వ్యాఖ్య

భక్తి లేకపోతే ఆత్మధ్యానం దృఢంగా, స్థిరంగా ఉండదు. బుద్ధి తల పోస్తుంది, మనస్సు ఆవేశాలతో ఊగిపోతుంది. ధ్యానం అంటే కేవలం బుద్ధి చేసే తార్కిక యోచన కాదు, మనస్సుయొక్క ఆవేశమూ కాదు. మనోబుద్ధు లనే రెండు రెక్కలతో చేసే ఉత్తేజితమైన యానమే నిజమైన ధ్యానం

దానిని కర్మాగానికి నిలబడే భక్తి అనికాని, భక్తివాతావరణంలో జరిగే తార్కిక యోచన అనిగాని అనాలి.

ధ్యానానికి కూర్చునే సాధకుడికి భక్తి లేకపోతే శుష్కతర్కం, మండించే వాదం మాత్రమే దక్కుతాయి. కేవలప్రజ్ఞ సాధకుణ్ణి భగవదనుభూతిలోకి తీసుకొని వెళ్ళలేదు. కేవలం మనస్సులోని ఆవేశాల జోరు, అతనిని భగవంతుని సన్నిధానంలోకి కొనిపోలేదు. మనోబుద్ధుల పరిశ్రమ సమరాసి పూరితమైన ధ్యానకరణంగా తయారు చేసుకోవాలి. దానినె 'హృదయం' అంటారు. (కఠ 1-2.23)

శ్లో॥ అశనం యస్య దేవస్య బ్రహ్మక్షత్త్రాదికం జగత్।
ఉపదంశస్తు మృత్యుర్ శ్రీవిశ్వనాథ స్స మే గతిః॥ 22

ప్రతి॥ యస్య = ఏ దేవదేవునికి, బ్రహ్మక్షత్త్ర + ఆదికం + జగత్ = చాతుర్వర్ణ్య రూపమైన-ప్రపంచం, అశనః = ఆహారమో, మృత్యువైతే, ఉపదంశః = (దానికి) నంజుడుపదార్థమో—

తాత్పర్యం

బ్రహ్మక్షత్త్రాది ప్రపంచం ఎవరికి వండిన అన్నం అవుతుందో, ఎవరికి మృత్యువు ఊరగాయ అవుతుందో, ఆ ఆత్మ కాశీవిశ్వనాథుడు నాకు గతి యగును గాక!

వ్యాఖ్య

నిశ్శబ్దంగా కూర్చుని నిత్యమూ యోచన చేసే సాత్త్వికులు బ్రాహ్మణులు, చురుకుగా ప్రజాహిత కార్యాలలో నిమగ్నమై వుండేవాళ్ళు క్షత్త్రియులు అందరూ ఆయనచేత తినబడవలసిన "పరిపక్వాన్నం"! జగత్తులోని నామరూపాలను చూచే అహంకారం పరమాత్మలో కరిగిపోయినప్పుడు దాని ప్రపంచం కూడా కలసిపోతుంది. కలగనేవాడు, మేలుకొని "నేను మేల్కొన్న వాడిని అని ప్రకటించేసరికి కలగనేవాడు, కల రెండూ మాయమయిపోతాయి.

అన్నం తినునపుడు రుచికోసం ఊరగాయని నంజుకొంటారు. బ్రహ్మ క్షత్రియులనే అన్నాన్ని తినే పరమాత్మకు మృత్యువు ఊరగాయ లాగా ఉపయోగించి ఆనందాన్ని ఇస్తుంది. ఇక్కడ మృత్యువంటే త్యాగంవలన వచ్చే నిస్సంగభావం. ధ్యానంలో కూర్చుని అహంకారాన్ని ఎంత త్యాగం చేస్తే అంత ఎక్కువైన ఆత్మానందం హృదయంలో వెల్లివిరుస్తుంది.

ఈ ఆత్మ నా విశ్వనాథుడు నాకు ఏకైక శరణ్యం. (కఠ 1-2.25)

శ్లో॥ దేహే రథే బుద్ధినియంతృకే యో
రథిత్వ మాసాద్య చర త్యజస్రమ్।
భోక్తాఽపి సోఽదభ్ర విచిత్రలీల
స్త్వమేవ విశ్వేశ నిరంజనోఽపి॥ 23

ప్రతి॥ యః = ఎవడు, బుద్ధినియంతృకే = బుద్ధిచేత నియంత్రింపబడిన, దేహే + రథే = దేహమనెడురథంలో. రథిత్వం = సారథ్యమును, ఆసాద్య = పొంది, అజస్రం = నిరంతరం, చరతి = చరించుచున్నాడో, భోక్తా + అపి = భోక్తయైనను, సః = అతడు, అదభ్రవిచిత్రలీలః = మేఘమువలె ఆశ్చర్యకరములయిన ఆటలాడువాడో, నిరంజనః + అపి = దోషరహితుడు కూడా విశ్వేశ = ఓవిశ్వనాథా! త్వమ్ + ఏవ = నీవే.

## తాత్పర్యం

తాను మార్పులు లేనివాడై, నిర్దుష్టమైన వాడయిన, తాను స్వయంగా యావత్తు విశ్వానికి నాథుడైనా, ఆవిశ్వనాథప్రభువు శరీరమనే రథంలో సారథిగా బుద్ధిరూపంలో సంచరిస్తూ విచిత్రలీలను చూపుతాడు.

## వ్యాఖ్య

23,24 శ్లోకాలలో శ్రీగురుదేవులు ప్రసిద్ధమైన "రథ" ఉపమానాన్ని ఉదహరిస్తున్నారు. శరీరం రథం. బుద్ధి సారథి. శరీర మనోబుద్ధులపరికరంతో

పాపకి ఏమి ఉద్దేశ్యాలూ ఉండవు. ఆటలో ప్రయోజనం ఉండదు. ఆడడం పాపలక్షణం. అలాగే ఆత్మకూడా సముద్రం మీద అలలతో ఆడుతున్నట్లు కన బడే సూర్యుడిలాగే ఆత్మ ఆడుతుంది సముద్రంలో అల లున్నాయికాని సూర్యుడు లేడు. అయినా సూర్యకాంతి అలలపైన చిందులాడినప్పుడు సూర్యుడే సముద్రగర్భంలో చిందులాడినట్లు గోచరిస్తుంది.

ఈవిశ్వనాథుడు విశ్వానికి నాథుడు. నాకు ఏకశరణ్యం! ఏకైక రక్షకుడు (కఠ 1.3-3,4)

చురుకైన బుద్ధిని సారథిగా కలవాడు తన వివేకంద్వారా ఇంద్రియాలను తేలికగా నిగ్రహించగలడు. అలాంటి వ్యక్తియే ధ్యానంలో 'ఓం' అనే స్వస్థానాన్ని చేరుకొని ఆత్మలో చేరిపోతాడు.

శ్లో॥ క్షత్తు స్సదశ్వా ఇవ యస్య వశ్యా
న్యక్షాణి తత్ప్రాప్య మరూపరూపమ్।
వన్దే త మవ్యక్తపరం పురాణ
మధ్వావధిం విష్ణు ముమేశ మారాత్॥ 24

ప్రతి॥ క్షత్తుః = సారథికి, సదశ్వాః ఇవ = శిక్షణపొందిన గుర్రములవలె, యస్య = ఏ భగవంతునికి, అక్షాణి = ఇంద్రియములు, వశ్యాని = అధీనములైయున్నవో, తత్ = అట్టి, ప్రాప్యం = పొందదగిన, అరూపరూపం = నిష్ప్రకారుడును. అవ్యక్తం = అవ్యక్తుడును. పరం పురాణం = అత్యంత ప్రాచీనుడును, అధ్వావధిం = భవబంధమును పోగొట్టువాడును, విష్ణుం వ్యాపకుడును, తం ఉమేశం = ఉమాపార్వతీపతిని, ఆరాత్ = దూరము నుండియే, వందే = నమస్కరించుచున్నాను.

## తాత్పర్యం

సమర్థుడైన సారథికి మచ్చికైన గుర్రాలు ఎలా తేలికగా స్వాధీనమౌతాయో, అలాగే ఇంద్రియాలమీద పూర్తినిగ్రహం ఉన్న సాధకుడు తేలికగా

పరానికి పరమైన, రూపరహిత రూపాన్ని బహుళ ప్రపంచంయొక్క అవధిని❋ సర్వవ్యాపకుడైన ✶✶ ఉమేశుణ్ణి చేరుకుంటాడు. ఆయనకు నా ప్రణామాలు.

## వ్యాఖ్య

విచక్షణతో కూడిన సారథి బుద్ధి, తన వివేకంతో ఇంద్రియాలనే గుర్రాలను అవలీలగా నిగ్రహిస్తుంది ఏమరుపాటు లేని సాధకుడు ఇంద్రియాలను నిగ్రహిస్తాడు. దీనివలన నిరాకార స్వరూపుడైన ఆత్మను గురించిన ధ్యానం గాఢమౌతుంది.

పరిమితులలో ఉన్నదానికే ఆకారం వుంటుంది. ఆకాశంవల్ల నియమితమైన ప్రతి దానికీ ఆకారం వుంటుంది. సర్వవ్యాప్తమైన ఆకాశానికి ఏఆకారమూ లేదు. దాని చుట్టూ వస్తువేదీ లేదు. అలాగే ఆత్మకూడా, నిరాకారమే దాని ఆకారం!

ఆత్మ పరానికి పరమైంది. సమిష్టి వాసనలే ❋ సృష్టి-స్థితి-లయలను చేస్తూంటే ఆత్మ వాటిని సచేతనం చేసి ఈశ్వరత్వం వహిస్తుంది అందుచేత పరమైన అవ్యక్త వాసనలకు కూడా అది పరం.

జాగ్రదవస్థ స్వప్నావస్థకు అంతం. అలాగే ఆత్మలో మేల్కాంచినప్పుడు జీవభావము దాని ప్రపంచము ఆత్మలో కలిసి అదృశ్యమౌతాయి. అందుకె ఆత్మను సంసారానికి అంతం అని వర్ణించారు.

హిమవంతుని కుమార్తె ఉమ ఉపనిషద్దేవి. ఉపనిషత్తులే మనకు ఆత్మ బోధ చేస్తాయి.ఆమెభర్త ఆత్మ అయిన విశ్వనాథప్రభువే. ఆయనకు నేను నమస్కరిస్తాను.

---

❋ అధ్యవధి ❋❋ విష్ణు
❋ అవ్యక్తం

శ్లో॥ క్షురస్య ధారావ దతీవ తీక్ష్ణం
యన్మార్గ మాహుః కవయో వినిద్రాః।
అశబ్ద మస్పర్శ మనద్ధ్రువం తం
భక్త్యా భజే భవ్యనిధిం మృడేశమ్॥ 25

ప్రతి॥ వినిద్రాః = జాగరూకులయిన, కవయః = కవులు, క్షురస్య = కత్తి యొక్క, ధారావత్ = పదనువలె, అతి + ఇవ దుర్గం = మిక్కిలి కష్ట మైనదిగా, యత్ + మార్గం = ఏ ఆత్మమార్గమును, ఆహుః = చెప్పు చున్నారో, అశబ్దం = ధ్వనిలేని అస్పర్శం = తాకలేని. అనద్ధ్రువం = భూతభవిష్యద్వర్తమానాలలో ఉండునట్టి, భవ్యనిధిం = భవిష్యత్తుకు నిధియైనట్టి, తం = ఆ, మృడేశం = పరమశివుని, భక్త్యా = భక్తితో భజే = సేవించుచున్నాను.

## తాత్పర్యం

నిద్రను జయించిన మహాత్ములు ఆత్మమార్గం అసిధారమీద నడవడ మంత దుష్కరమని చెబుతారు. శబ్ద, స్పర్శ రహితమై, త్రికాలాలలో ఉండేది అయిన ఆత్మ మంగళనిధానమైన మృడేశుణ్ణి నేను భక్తితో ప్రార్థిస్తాను.

## వ్యాఖ్య

ఈ దారి అతిసూక్ష్మమైనది. నిర్లక్ష్యంగా నడిచే సాధకుడు తన స్థిమితాన్ని పోగొట్టుకొని విషయ ప్రపంచంలోకి పడిపోయే అవకాశం ఉన్నది, ధ్యానంలో నెగ్గడానికి నిరంతర జాగరూకత అవసరం. కత్తి వాదరలాగా సన్ననైన, పదునైన ఈ ఆధ్యాత్మికమార్గం మంగళస్వరూపులైన మృడేశుని శ్రీకాశీ విశ్వనాథునిపట్ల గాఢమైన నిత్యమైన భక్తి కలిగిన వారికే తేలిక అవుతుంది. ఆయన భవిష్యత్తుయొక్క కోశం * భవిష్యత్తుకి ప్రభువు. ఆయనను సేవించ గోరుతాను-** (కఠ 1 3.14,15)

---

* భవ్యనిధి

** భజ—సేవాయాం

# నాలుగవ స్తబకం

ఈ స్తబకంలో శ్రీగురుదేవులు కఠోపనిషత్తులోని రెండో అధ్యాయంలోని భావాలను ఉపహరిస్తారు. ఇందులో మృత్యుదేవుడు మొదటి అధ్యాయంలో వివరించినవాటినే విస్తరించి నచికేతుడికి ధ్యానాభ్యాసాలను బోధిస్తాడు.

శ్లో॥ పరాగర్థ సమర్థాని ససర్జాక్షాణి యః ప్రభుః।
అంతర్న దృశ్యతే తస్మాత్ విశ్వేశం తముపాశ్రయే॥ 1

ప్రతి॥ యః + ప్రభుః = ఏప్రభువయితే, పరాక్ + అర్థసమర్థాని = అత్యంత విషయగ్రహణ సమర్థాలైన, అక్షాణి = ఇంద్రియాలను, ససర్జ = సృష్టించినా, అంతః = లోపల, నదృశ్యతే = చూడబడదో, తస్మాత్ = అందుచేత, తం = అట్టి, శ్రీవిశ్వేశం = ఈశ్వరుని, ఉపాశ్రయే = సమాశ్రయిస్తున్నాను.

## తాత్పర్యం

ఇంద్రియగోళాలను బయటవైపుకు పెట్టి, వాటిని బాహ్య ప్రపంచంలోని విషయాలవైపుకు పరిగెత్తడానికే అర్హంగా చేసింది ఆత్మ. అందువల్ల ఇంద్రియ గోళాలు ఆత్మనెప్పుడూ చూడలేవు. ఆ పరమాత్మే విశ్వనాథప్రభువు. అందు చేత ఆయన పాదాలనే ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఇంద్రియాలు వాటివాటి విషయరంగాలనుండి అనుభవాలను సేకరించడానికి పనికివచ్చేయంత్రాలు. అవి ఏనాడూ నిజమైన ద్రష్టను-కర్తను - శుద్ధ

చైతన్య స్వరూపాన్ని చూడలేవు. ఆత్మకాంతి ద్వారా మనం ఇంద్రియ దృశ్యాలను తెలుసుకొంటాము. ఇంద్రియాలు విషయ ప్రేరకాలను మాత్రమే తీసుకొనిరాగలవు. టెలిస్కోపులోనుండి చూసేవాడిని టెలిస్కోపు ఎప్పుడైన చూపించగలదా? టెలిస్కోపులోంచి చూచేవాడు టెలిస్కోపుకన్న భిన్నం. టెలిస్కోపు ద్వారా చూడబడే దూరంగాఉన్న నక్షత్రాలకు కూడా చూచేవాడుభిన్నుడే. (కఠ 2.4 1)

విషయవస్తువులను అనుభవించాలనే విపరీతమైన కోరికలను వదిలించుకొని, బయటకు పరిగెత్తే ఇంద్రియాలకు శిక్షణనిచ్చి, స్వాధీనంలోకి తెచ్చుకొనే సాధకులు మాత్రమే చెదరిపోయిన మనస్సుయొక్క దృష్టిని కూడగట్టి లోపలవుండే ఆత్మవైపుకు త్రిప్పి, అదే తమలోని సారమైన ఆత్మఅని గ్రహించగలరు.

శ్లో॥ అధ్రువం కామ జాలంహి విహాయ విగతాశిషః।
ధ్రువేచ్ఛయా భజంతే యం విశ్వేశం తముపాశ్రయే॥ 2

ప్రతి॥ యం = ఏదేవుని, విగత + ఆశిషః = వాసనలను వదలుకొన్న వారు అధ్రువః = అశాశ్వతమైన, కామజాలం = కోర్కెల సమూహాన్ని, విహాయ = విడిచి, ధ్రువా + ఇచ్ఛయా = శాశ్వతానందమందలి కోరికచే, యం = ఏ, విశ్వేశం = శివుని, భజంతే = సేవింతురో—

## తాత్పర్యం

అధ్రువమైన విషయాల మోహజాలంనుండి విడివడి ఇంద్రియ సుఖాలకోసం ఉవ్విళ్లూరక, తమవ్యక్తిత్వం యొక్క పూర్ణవిముక్తికోసం తీవ్రంగా తపిస్తూ సాధకులు ఆత్మను అన్వేషిస్తారు. ఆ ఆత్మ విశ్వానికంతా అధిపతి. ఆయనను నేను ఆరాధిస్తాను.

## వ్యాఖ్య

కాలంచేత నియమితమైన వస్తువులన్నీ నిరంతరం మార్పు చెందుతాయి. అయినా లోతుగా ఆలోచించలేనివారికి అవి అమితమైన ఆకర్షణను కలిగిస్తాయి

లౌకిక సుఖాల ఉచ్చుల బారినుండి వివేకంతో తప్పించుకొని, శరీర–మనో. బుద్ధి పరికరాల పట్టునుండి తన అంతర్వ్యక్తిత్వాన్ని స్వతంత్రం చేసుకోగోరే వివేకులు, శ్రవణంచేసి విన్నవాటిలోతైన అర్థాలను తెలుసుకోడానికి మననంచేసి, తరువాత ధ్యానంచేసి ప్రాణానికి మూలస్థానమైన శుద్ధచైతన్య పదాన్ని అందు కొంటారు. ఆ పరమ పదం శ్రీవిశ్వనాథుడు. అయనపాదాలవద్ద శరణువేడు తాను. (కఠ 2.4 2)

అత్మ నిత్యమూ కేవల సాక్షి చైతన్యమనే విషయం క్రిందచెప్పబడు తోంది.

శ్లో॥ రూపాది విషయాన్ సర్వాన్ యేనచిద్ధాతునా జనాః।
విజానంతి దృగాత్మ శ్రీవిశ్వేశం తముపాశ్రయే॥ 3

ప్రతి॥ యేనచిత్ + ధాతునా = ఏఆత్మజ్ఞానంచేత, జనాః = జనులు, సర్వాన్ = సమస్తములైన, రూపాదివిషయాన్ = రూపము మొ॥ జ్ఞానాలను, దృక్ + ఆత్మశ్రీః = అంతస్సాక్షులుగా, విజానంతి = తెలియచున్నారో—

## తాత్పర్యం

ఏశుద్ధ చైతన్య కాంతి కారణంగా ప్రజలు రూపము మొదలైన అన్ని విషయాలను తెలుసుకోగలుగుతారో, ఏది కేవల సాక్షి చైతన్యంగా ఉండి పోతుందో ఆ ఆత్మ విశ్వనాథ ప్రభువు. అయున పాదాల వద్ద శరణు పొందుతాను.

## వ్యాఖ్య

మనకు ఎరుకలోకి వచ్చిన అన్ని అనుభవాలు నిజమవుతాయి. అను భవాలు కాలపరిధిలో వుంటాయి. ఎవరి చైతన్యం కారణంగా మన కీఅనుభవాలు తెలుస్తాయో, ఆ ఆత్మలో అనుభవ పరికరాలుగాని, విషయాలుగాని వుండవు అదిరెండోది లేని కేవల సాక్షిచైతన్యం. ఆ ఆత్మ విశ్వనాథప్రభువు నాకు ఏకైక శరణ్యం (కఠ 2.4.3)

శ్లో॥ స్వాప్నికం జాగ్రతం చైవ వస్తుజాతం ప్రకాశయన్।
జాగర్తి సర్వదా యః శ్రీవిశ్వేశం తముపాశ్రయే॥ 4

ప్రతి॥ యః = ఎవడు, వస్తుజాతం = భౌతికవస్తుసమూహన్ని. స్వాప్నికం = కలలుగా, జాగ్రతం = ప్రత్యక్షాలుగా, ప్రకాశయన్ = కనబఱుస్తూ సర్వదా = ఎల్లప్పుడూ, జాగర్తి = మేల్కొనియున్నాడో—

## తాత్పర్యం

స్వప్నంలో మెలకువలో అన్ని విషయాలను నిరంతరం వెలిగిస్తూ తాను జాగృతుడై ఎవరు ఉంటాడో ఆ విశ్వనాథప్రభు పాదాలను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

స్వప్నంలోను, జాగ్రదవస్థలోను కూడా అనుభవాల నిచ్చే అన్ని వస్తువులను ఆత్మకాంతి వెలిగిస్తుంది. ఆత్మచైతన్యంయొక్క స్వభావమే కాంతి. కాబట్టి అది నిద్రపోవడం అంటూ వుండదు అది ఎప్పుడూ వెలుగుతూంది, అందుచేత ఆయన ఎప్పుడూ మేలుకునే వుంటాడు.

తన వెలుగులో సంచరించే అన్ని వస్తువుల్ని, ప్రాణుల్ని సూర్యుడు నిరంతరం వెలిగిస్తున్నట్లే చైతన్యకాంతి కూడా ఎప్పుడూ ప్రకాశిస్తూ జీవితంలోని అన్ని అనుభవాలను వెలిగిస్తుంది.

అధ్యాత్మ శాస్త్రమైన వేదాంత పరిభాషలో "నిద్ర" అంటే ఆత్మనెరుగని అజ్ఞానం. ఆత్మసంబంధమైన అజ్ఞానం మిథ్యాజ్ఞానాన్ని "స్వప్నాన్ని" సృజిస్తుంది. త్రాడు నెరుగని అజ్ఞానంలో పాము అన్న మిథ్యాజ్ఞానం కలుగుతుంది.

"నిద్ర" అజ్ఞానస్థితి. ఆతనినితెలియడం "మెలకువ". విద్వాంసులు ఈ స్థితిలోకి జాగృతు లవుతారు. ఇది తన్ను తాను ఎప్పుడూ ఎరిగివుంటుంది. అందుకే అది ఎప్పుడూ ఎరిగివుంటుంది. అందుకే అది ఎప్పుడూ మెలకువగా ఉంటుంది. (జాగర్తి సర్వదా) (కఠ 2,4.4.)

శ్లో॥ ప్రాణాది ధారకం జీవం ప్రణిధాయ యదాత్మనా,
అభయం యాంతి సంతః శ్రీవిశ్వేశం తముపాశ్రయే॥ 5

ప్రతి॥ సంతః = సత్పురుషులు, యత్ + ఆత్మనా = ఏ ఆత్మచేత, ప్రాణ + ఆది ధారకం = పంచ ప్రాణాలను ధరించే, జీవం = జీవుని, ప్రణిధాయ = ఉంచుకొని, అభయం = శరణును, యాంతి = పొందుచున్నారో—

## తాత్పర్యం

పనులు చేస్తూ అనుభవాలు పొంగుతూండే జీవుడు అసలు సారంలో శుద్ధాత్మ తప్ప వేరుకాదని గుర్తించిన మహాత్ములు పరిమితానుభవ రంగాల నుండి విముక్తులౌతారు. ఆ శుద్ధచైతన్యపదం శ్రీవిశ్వనాథుడు. ఆయన పాదాల వద్ద శరణు పొందుతాను

## వ్యాఖ్య

మన అచలోనల సమూహంపైన చరించే ఆత్మకాంతియే జీవుడు బొక్కెనలో ప్రతిఫలించిన సూర్యుడు సూర్యకాంతియేగదా? ఆ ప్రతిబింబం సూర్య కాంతిసారమే.

దేశకాల పరిధుల్లో పరిమితుడై జీవుడు ఆ శుద్ధచైతన్యంతో తాదాత్మ్యం పొందినప్పుడు పరిమిత జీవుడు అదృశ్య మౌతాడు. విషయ రహితమైన శుద్ధ చైతన్యపదమే తానని తెలుసుకుంటాడు. (కఠ 2.4 5.)

శ్లో॥ సూత్రాత్మా సూత్రధారోఽసౌ జగత్సర్గాది నాటకే,
యస్మాత్సంపద్యతే సాక్షా ద్విశ్వేశం తముపాశ్రయే॥ 6

ప్రతి॥ అసౌ = ఈ, సూత్ర + ఆత్మా = సూత్రదేహుడు, జగత్ + స్సర్గ + ఆది ప్రపంచసృష్టి మొ॥, నాటకే = నాటకంలో, సూత్రధారుడుగా నుండు యస్మాత్ = ఎవనివలన, సాక్షాత్ = ప్రత్యక్షంగా, సంపద్యతే = (ఆశక్తి) కలుగుచున్నదో—

## తాత్పర్యం

నామరూపాలన్నీ ఏ ఏక సూత్రంపైన గుచ్చబడివున్నాయో, సృష్టి స్థితిలయలు జగన్నాటకానికి ఏక దర్శకుడు ఎవరో ఆ ఆత్మ శ్రీకాశీవిశ్వేశుడు. ఆయన పాదాలను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

సంస్కృత వాఙ్మయంలో "సూత్రాత్మ" అనే పదాన్ని సమిష్టి మనస్సును సూచించడానికి ఉపయోగిస్తారు. ఇదే ప్రపంచానికీ సమిష్టి కారణమైన ఈశ్వరుడు. సమిష్టి మనస్సును వెలిగించే చైతన్యం పూలమాలలోని దారంవంటిది, ఎన్నోరంగుల పూలను అందమైన మాలగా కలిపి వుంచే దారం తానుమాత్రం కనిపించదు. అలాగే చైతన్యం కూడా ప్రపంచాన్ని యావత్తును ఏకంగా సంఘటిత పరచి చూపుతుంది. మనలో జడ పరికరాల నన్నింటిని సజీవం చేసి చైతన్యాన్ని ఇస్తుంది సమర్థవంతంగా నిష్కర్షగా సృష్టి-స్థితి-లయల జగన్నాటకాన్ని ఆడించే సూత్రధారి ఇదే! (కఠ 2.4.6,7)

శ్లో॥ అరణ్యో ర్నిహితో యస్తు యాజ్ఞికై స్సముపాస్యతే।
ఆశ్రయాశశరీరః శ్రీవిశ్వేశం తముపాశ్రయే 7

ప్రతి॥ యః + తు = ఏఅన్నిఅయితే, యాజ్ఞికైః = ఋత్విక్కులచే, అరణ్యోః = (నిప్పురాజేసే) అరణుల్లో, నిహితః = ఉంచబడి, సముపాస్యతే = సేవించబడుచున్నదో· ఆశ్రయాశశరీరః = (రూపంలేని రూపంగల) అగ్నిగాఉన్నదో—

## తాత్పర్యం

కట్టెలన్నింట్లో ఉండే ఏపవిత్రమైన అగ్నిని యాజ్ఞికులు వెలిదీసి ఉపాసిస్తారో, అట్టి వ్యక్తావ్యక్త స్వరూపుడైన శ్రీవిశ్వనాథుని నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

యజ్ఞయాగాదులకోసం అవ్యక్తంగా కట్టెలలో ఉండే అగ్నిని సమిధాధానంవలన మథించి వెలికిదీస్తారు. శుద్ధంగా పవిత్రంగా వుండే ఈపవిత్రాగ్నిని

యాజ్ఞికులు ఎంతో భక్తితో కాపాడి, రక్షించి వృద్ధిచేస్తారు. ఈ అగ్ని పరమ సత్యమైన ఆత్మ, శ్రీవిశ్వనాథునియొక్క ప్రతీక అయిన నాకు శరణమగును గాక! (కఠ 2·4 8)

శ్లో॥ యస్మాదుదేతి సవితా యస్మిన్నేవ దినే దినే।
అస్తమేతి జగత్ప్రాణం విశ్వేశం తముపాశ్రయే॥ 8

ప్రతి॥ దినే దినే = ప్రతిదినమూ, సవితా = సూర్యుడు, యస్మాత్ = దేని నుండి అయితే, ఉదేతి = ఉదయిస్తున్నాడో, యస్మిన్ + ఏవ = దేని యందైతే, అస్తం + ఏతి = అస్తమిస్తున్నాడో, జగత్ + ప్రాణం = జగత్తునకు జీవాధారమైన—

## తాత్పర్యం

ఎందుండి సూర్యుడు ఉదయిస్తాడో, ఎందులోకి రోజు రోజూ అస్తమించి అదృశ్యమౌతాడో, ప్రపంచంలో మారిపోతూఉన్న ఆకారాలలో ప్రాణులలోని ప్రాణమెవరో ఆ ఆత్మ ప్రపంచానికి అధిపతి విశ్వనాథుడు. ఆయనను నేను శరణువేడుతాను.

## వ్యాఖ్య

తన కాంతితో సూర్యుడు అన్ని ఆకారాలను వెలిగిస్తాడు. అందుకే మనం వాటిని చూచి అనుభవం పొందుతాము. అలాగా మనలోని చైతన్యకాంతి మన అనుభవాల నన్నింటినీ వెలిగించి మన జీవితాన్ని సంపన్నం చేస్తుంది. ఆ చైతన్యానికి మూలస్థానాన్ని “సూర్యుడుదయించే స్థానంగా” వివరించబడింది. అలాగే గాఢనిద్రలో ఏవిషయమూ అనుభవానికి రాదు. అప్పుడు చైతన్య విషయ వస్తువుల అభావాన్ని వెలిగిస్తుంది. అది ఏమీతెలియని స్థితి. మన అను భవాలకు, నిద్ర, స్మృతిలేని అనుభవరహిత స్థితికి కూడా మూలమైన విశ్వ నాథుడు అందరిలోను ప్రాణము. ఆయనే నాకు ఏక శరణ్యం (కఠ 2.4.9.)

శ్లో॥ బ్రహ్మ యద్భాసతేఽధర్మి దేహ ధర్మేణ దుర్ధియామ్।
నానాస్తి నానాఽద్వితీయం శ్రీ విశ్వేశం తముపాశ్రయే॥ 9

ప్రతి॥ అధర్మి = లక్షణనిర్దేశములేని, యత్ + బ్రహ్మ = ఏబ్రహ్మ, దుర్ధియాం = అల్పబుద్ధులందు, దేహధర్మేణ = శరీరధర్మముచే, నానా + అస్తి = అనేకవిధాలుగావుందో—అది, భాసతే = ప్రకాశిస్తుందో, నానా = అనేకముగా, అద్వితీయం = ద్వంద్వభావాలులేని——

## తాత్పర్యం

ఏధర్మాలూ లేని పరబ్రహ్మముపైన అశుద్ధమైన మనస్సు దేహధర్మాలను ఆపాదిస్తుంది. పరబ్రహ్మలో నానాత్వం లేదు. అది రెండోది లేని వస్తువు. ఈ ఆత్మే ప్రపంచానికి అధిపతి శ్రీ కాశీవిశ్వనాథ ప్రభువు ఆయన పాదాలవద్ద నేను శరణుపొందుతాను.

## వ్యాఖ్య

కోరికలలో ఆవేశాలలో నర్తిస్తూ ఆందోళన చెందే మనస్సును మలినమైన మనస్సు అంటారు. వెలిగించే ఆత్మను, వెలిగింపబడే అనుభవాల పరంపరని వేరుచేసి తెలుసుకొనే వివేకం మలినమైన మనుస్సుకు వుండదు.అందువల్ల సామాన్య మానవుడు శరీరమనోబుద్ధుల వ్యవహారాలను ఆత్మ కాపాదించి, తాను స్వతంత్రముగా అనుభవాలు పొందుతున్నాననుకొంటాడు. ఇలాఅనుకొనే వాడె దర్శించే-భావించే-విచారణలు చేసే వ్యక్తి. ఈ జీవుడు తానే కర్తని, భోక్తని అని వ్యర్థంగా భావిస్తాడు. బాధలతో, పీడలతో కూడిన గాథ ఇలా మొదలవుతుంది.

నిజానికి ఆత్మలో బాహుళ్యం లేదు ఆత్మ నెరుగని అజ్ఞానంలో సృష్టి అయే భ్రాంతియే నామరూపజగత్తు. త్రాడును తెలుసుకోగానే పాముభ్రాంతి వెంటనే మటుమాయం అయినట్లు ఆత్మలో మేల్కొనగానే బాహుళ్యభ్రాంతి తొలగిపోతుంది, (కఠ 2.4.10)

శ్లో॥ యస్మిన్ నానాత్వ మాపాద్య విభ్రాంత దృష్టయః।
మృత్యు చక్రే భ్రామంతి శ్రీవిశ్వేశం తముపాశ్రయే॥ 10

ప్రతి॥ మాయయా = మాయచే, విభ్రాంతినొందిన, దృష్టయః = భావముగలవాడు యస్మిన్ = ఏఆత్మయందు, నానాత్వం = అనేకత్వాన్ని, ఆపాద్య = ఆపాదించి, మృత్యుచక్రే = జనన మరణ చక్రమందు. భ్రమంతి = = తిరుగుచున్నాడో—

## తాత్పర్యం

ఏఆత్మలో సామాన్యులు తమ అజ్ఞానంవల్ల మోహితులై మాయా విభ్రాంతిలో బాహుళ్యాన్ని చూస్తారో, మృత్యుచక్రంలో పరిభ్రమిస్తూ మార్పులకు లోనవుతారో, ఆ ఆత్మ విశ్వనాథప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

కారణం లేకుండా కార్యాలు వుండవు. కార్యాలకు వేరే సత్తా అంటూ లేదు. కాబట్టి అవి కారణం నుండే జనిస్తాయి. ప్రపంచనాటకం దేని ఆధారంగా ఆడుతుందో ఆ పరమపదం ఆత్మ.

త్రాడు చూడలేని అజ్ఞానంలో పాముభ్రాంతి కలిగి భయంతో వణుకుతాము. అలాగే ఆత్మ నెరుగని అజ్ఞానం మిథ్యా బాహుళ్య భ్రాంతిని కలిగిస్తుంది. కాలపరిధిలో ఆత్మ అగుపించనప్పుడు వ్యవహారాలతో కూడిన నామ రూప జగత్తునే చూస్తాము. కాలం నిత్యం మారుతున్నందున దృశ్య ప్రపంచం ఎప్పుడూ మారుతూ కనబడుతుంది. ఇదేజనన మరణ వలయం.

అజ్ఞానియైన జీవుడు ఏ ఆత్మమీద ఈ విషాదాన్ని శాశ్వతంగా నిలిపి వుంచుతాడో ఆ ఆత్మ విశ్వనాథప్రభువే. ఆయనలో భక్తితో శరణు పొందుతాను. (కఠ 2·4.11)

శ్లో॥ యో౽౦గుష్ఠ పరిమాణ స్సన్ మర్త్యానాం హృదయాంబుజే।
నిర్ధూత వహ్నివ ద్భాతి విశ్వేశం తముపాశ్రయే॥ 11

ప్రతి॥ యః = ఏఆత్మ అయితే, అంగుష్ఠ = బొటన వేలంత, పరిమాణః + సన్ = పరిమాణం గలవాడై, మర్త్యానాం = మానవులయొక్క, హృదయ + అంబుజే = మనఃపద్మాల్లో, నిర్ధూత = పొగలేని, వహ్నివత్ = అగ్నివలె భాతి = ప్రకాశిస్తున్నదో—

## తాత్పర్యం

ఏ ఆత్మ అంగుష్ఠమాత్ర పరిమాణంతో పొగలేని అగ్ని శిఖలా అందరి హృదయాలలో వసించి వెలుగుతోందో, ఆ ఆత్మ నావిశ్వనాథప్రభువు. ఆయనను నేను శరణుపొందుతాను.

## వ్యాఖ్య

"మన హృదయంలో ఉండి పరమాత్మ సర్వానికి చేతనత్వాన్ని కల్పిస్తాడు" అనేసంగతి అన్ని అధ్యాత్మగ్రంథాలలోను తరుచు పేర్కొనబడుతుంది. ఈ ఆత్మ బొటనవ్రేలంత కొలతతో పొగలేని అగ్ని శిఖలాగా అందరి హృదయాలలో ఉంటుందనిన ఉపనిషత్తుల భావన ప్రసిద్ధమైనది. క్రొత్తవారికి పరిపక్వదశకి రాని సాధకులకి ఈ భావన ప్రారంభదశలో ధ్యానానికి తోడ్పడుతుంది. వాళ్లు ఇంకా శుద్ధమైన చిత్తంలో నిలకడగా ధ్యానం చేసే స్థితికి వచ్చివుండరు.

ఆత్మ సర్వవ్యాప్తమైనది. అన్ని అలలతో కనబడే సముద్రంలో అంతటా అన్నిసమయాలలో అది వుంటుంది. అయితేనేం, ప్రారంభంలో సాధకుడు ఆత్మను చేరడానికిగాను ఒకస్థానం, కొలత, స్వభావం, గుణం మొదలైనవి. కావలసివస్తాయి. అందుచేత భావనా మాత్రంగా ఆత్మచైతన్యం బొట్టనవ్రేలంత ఉంటుందనీ, నిత్యమూ అగ్నిశిఖలా వెలుగుతుంటుందని చెప్పారు.

ఆయన ఎప్పుడూ హృదయంలో ఉంటాడు. నెత్తురుని ప్రవహింపజేస్తూ కొట్టుకునే మాంసముయం హృదయం కాదు. ఇక్కడ 'హృదయం' అంటే కేంద్రమనీ సారమని, మనవ్యక్తిత్వంలో ముఖ్యమైన వస్తువనీ, ఆలోచనలనే జీవభావానికే మూలమని అర్థం.

"పొగలేని అగ్నిశిఖ" చైతన్యం మనలోలేని సమయం అంటూ లేదు కలలో, మెలకువలో విషయాలు—ఆలోచనలు వున్నప్పుడు మనకు వాటి సంగతి తెలుస్తుంది నిద్రలో వాటిని చూడము, అప్పుడుకూడా ఏమీ లేదని గహిస్తాము. ఆ సమయంలోకూడా శూన్యం యొక్క గ్రహింపు వున్నది.

ఏ వెలుగుయొక్క సాన్నిధ్యంలో మాత్రమే శారీరక-మానసిక—బౌద్ధిక అనుభవాలన్నింటికి విలువ వస్తుందో హృదయంలోని ఆ వెలుగే శ్రీ విశ్వనాథ ప్రభువు, ఆయనని నేను ఆరాధిస్తాను. (కఠ 3.4.12.13)

శ్లో॥ ప్రసన్నాంభో యథా తాదృక్ ప్రక్షిప్తం శుద్ధవారిణి।
తద్వ ద్యద్విద్ధి ఆత్మా స్యాద్విశ్వేశం తముపాశ్రయే॥ 12

ప్రతి॥ యథా = ఎట్లు, ప్రసన్న + అంభః = పవిత్రజలం శుద్ధవారిణి = పరిశుద్ధజలమందు, ప్రక్షిప్తం = ఉంచబడి, తాదృక్ = అట్టి, (పవిత్రమైనదిగా అవుతూందో) తత్ + వత్ = దానివలె, ఆత్మా = జీవాత స్యాత్ = అగును. తత్ = అట్టి, ఆత్మను విద్ధి + తెలిసికొనుము. తం = అట్టి విశ్వేశం = ప్రభుని, ఉపాశ్రయే = దరిజేరుచున్నాను.

## తాత్పర్యం

శుద్ధమైన నీరు శుద్ధమైన జలాశయంలో కలిసినప్పుడా రెండూ ఎలా ఏకమైపోతాయో, అలాగే ఆత్మ నెరిగినవాడు ఆత్మలో కలిసిపోయి ఏకమవుతాడు. ఇదే విశ్వనాథ ప్రభువు. ఆయనను నేను శరణుపొందుతాను.

## వ్యాఖ్య

కలగనే వాడు మేల్కొన్నప్పుడు **అతడిలో** ఏ అంశమూ మేల్కొన్న వాడికన్న వేరుగా, భిన్నంగా నిలువలేదు. అతడు పూర్తిగా మేలుకొని "కలగనే.

వాడినయిన నేను నిజానికి మేలుకొన్న వాడినే" అని తెలుసుకుంటాడు అలాగే జీవుని ఆలోచనా స్రోతస్సుయొక్క మూలాన్ని చేరాక జీవుడు శుద్ధచైతన్యమైన ఆత్మలో లీనమై ఏకమైపోతాడు. శుద్ధమైన నీరు శుద్ధజలంతో కలిసిపోయే ఉపమానం ఈ తాదాత్మ్యాన్ని సూచించడానికే ఉపయోగింపబడింది.

రాబోయే శ్లోకంనుండి శ్రీ గురుదేవులు కఠోపనిషత్తుయొక్క అయిదోవల్లి లోని సారాంశాన్ని విశదపరుస్తారు. ఇక్కడ ప్రతి ఉపనిషత్తులోని భావం ఒక అందమైన భక్తిప్రసూనంగా ఆత్మకు సమర్పించబడింది. ఇది ఒక విశిష్టమైన ధ్యానప్రక్రియ. శ్రీ సామ్యకాశీశస్తోత్రంలో భక్తి అనే ఆవిరి ధ్యానమనే రైలుని సరిగా నడిపిస్తుందని సూచిస్తున్నారు సాధారణ సాధకులు ధ్యానమంటే బుద్ధి ద్వారా చేసే శుష్కాభ్యాసం అని అనుకుంటారు. బుద్ధి ఆలోచించగలదు. మనం చేరగోరేది బుద్ధికి అతీతమైన ఆత్మను అని జ్ఞాపక ముంచుకోండి. ఏ కాంతిలో మన ఆలోచనలు జ్ఞానపరిధిలోకి వస్తాయో ఆ ఆత్మ అది!

శ్లో॥ ఏకాదశ ద్వారయుతే పురే యః ప్రతితిష్ఠతి।
రాజవ త్సూర్య సంకాశం విశ్వేశం తముపాశ్రయే॥ 13

ప్రతి॥ యః = ఎవడు, ఏకాదశద్వార = 11 రంధ్రాలచే యుతే = కూడిన, పురే = శరీరంలో రాజవత్ = మహారాజువలె ప్రతితిష్ఠతి = ఉంటున్నాడో, సూర్య సంకాశం = సూర్యప్రకాశమువలె ఉన్నట్టి——

## తాత్పర్యం

పదకొండు ద్వారాలతో ఉన్న శరీరమనే పురంలో సూర్యసమాన ప్రభతో రాజువలె అధివసించి వున్న శ్రీ విశ్వేశునికి నేను సర్వార్పణం చేసుకుంటాను.

## వ్యాఖ్య

రెండు చెవులు రెండు ముక్కులు, రెండు కళ్లు నోరు బొడ్డు, పాయువు, ఉపస్థ, బ్రహ్మరంధ్రం + అనే పదకొండు ద్వారాలతో ఉన్న కోట ఈ మానవ శరీరం. ఆత్మ అనే రాజు అందులో నివసిస్తాడు. రాత్రి అయ్యేసరికి కందకం మీదనుండి వంతెనని లాగివేస్తారు, తలుపులు మూసేస్తారు. కోటలోని రాజు

ప్రజలు ప్రశాంతంగా నిద్రపోతారు. ప్రతి ఉదయం తలుపులు తెరుచుకుంటాయి. వంతెన తిరిగి కందకంమీద పరుచుకుంటుంది. కోటకి బయట ప్రపంచంలో వ్యవహారాలు తిరిగి మొదలవుతాయి.

ఈ వ్యవహారాలన్నీ కోటలో రాజు వున్నంతవరకే సాగుతాయి. ఆయన దానిని విడిచి వేరుగానే అందరూ వెళ్లిపోతారు, నెమ్మదిగా కోట నిరుపయోగమై శిథిలమైపోతుంది.

శరీరమనే కోటలోని రాజు శుద్ధచైతన్య స్వరూపం నిత్యప్రకాశమానమైన సూర్యునివంటిది, ఈ ఆత్మ అయిన ప్రియ విశ్వనాథ ప్రభువు నాకు ఏక శరణ్యం. (కఠ 2 5.1,2)

శ్లో॥ ప్రాణాపానే నయత్యూర్ధ్వ మధశ్చాంత రవస్థితః।
దేవా శ్చోపాసతే యం శ్రీ విశ్వేశం తముపాశ్రయే॥ 14

ప్రతి॥ అంతః + అవస్థితః = లోపల వున్నట్టి, ఆత్మస్వరూపుడు, ప్రాణ + అపానే = ప్రాణాపానాలను, ఊర్ధ్వం + అధః + చ = పైకి, క్రిందికిని నయతి = తీసుకొని వెళ్తున్నాడో, యం = ఎవని నైతే, దేవాః + చ = దేవతలుకూడ, ఉపాసతే = పూజిస్తున్నారో——

## తాత్పర్యం

లోన ఉన్న ఏకాత్మ ప్రాణాన్ని పైన, అపానాన్ని క్రిందకి పంపుతుంటాడు. దేవతలందరూ ఆయనని పూజించి ఆరాధిస్తారు. ఆ ఆత్మ కాశీనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

ప్రాణమంటే కేవలం ముక్కుతో పీల్చుకొనే ఊపిరికాదు. బాహ్యం నుండి మనం స్వీకరించే అన్ని అనుభవాలకు అది ప్రతినిధి. మనం బయటికి త్రోసివేసేవి, వెలిబుచ్చేవి—అపానం. అందువల్ల శరీర మనోబుద్ధిస్థాయిలు మూడింటిలోను స్వీకారాలన్నీ ప్రాణము, స్పందనలన్ని అపానము. ఈ రెండూ ఆత్మ సాన్నిధ్యంలోనే జరుగుతాయి.

ఇంద్రియాలంటే దేవతలు, నిముష నిముషానికి ఆత్మ కాంతిని తమ తమ వ్యవహారాల్లో ఉపయోగించుకుంటాయి. ఇది అవి చేసే సత్య ఆరాధన.

ఈ ఆత్మే నాప్రియాత్రిప్రియ విశ్వనాథుడు. నాకు ఏకైక సాంత్వనము, శరణ్యము అయనే (కఠ 2 5 3 )

శ్లో॥ యస్య విస్రంసనే దేహో నిశ్చేష్టః కాష్ఠ ఖండవత్।
ప్రాణస్వామిని మారాచ్ఛ్రీ విశ్వేశం తముపాశ్రయే॥ 15

ప్రతి॥ యస్య = ఏఆత్మయొక్క విస్రంసన = నిర్గమనంచేత,దేహః = శరీరం,కాష్ఠ ఖండవత్ = కొయ్యముక్కవలె, నిశ్చేష్టః = నిర్జీవంగా వుండునో (అట్టి) ప్రాణస్వామినం = ప్రాణానికి అధిపతి అయిన, తం = ఆ, శ్రీవిశ్వేశం = శివుని, ఆరాత్ = సమీపంనుండే ఉపాశ్రయే = శరణు వేడెదను.

## తాత్పర్యం

ఏ ఆత్మ నిష్క్రమించడంవల్ల శరీరం కొయ్యబొమ్మలా నిశ్చేష్టము, నిర్జీవము అవుతుందో ఆ ఆత్మ శ్రీ విశ్వేశుని నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

ఏ ఆత్మ వెళ్లిపోవడంవల్ల సజీవమైన మానవ శరీరం చేష్టలుడిగి కొయ్యలాగా జడమైపోతుందో, ఆయన సాన్నిధ్యమే అన్ని శరీరాలను చేతన పరుస్తుంది. అయనే కాశీపతి శ్రీ విశ్వనాథుడు. ఆయనే నా అనుగ్రహమూర్తి, సర్వ రక్షకుడు, ఏకైక శరణ్యం. అయనలో కలిసిపోయి ఆత్మగా మారుతాను. (అభేద భావన) ( కఠ 2.5 4 )

శ్లో॥ ప్రాణాపానే యమాశ్రిత్య విధత్తః స్వస్వజీవనమ్।
విజ్ఞాన ఘన మజ్ఞేయం విశ్వేశం తముపాశ్రయే॥ 16

ప్రతి॥ యం = ఏ ఆత్మ స్వరూపాన్ని, ఆశ్రిత్య = ఆశ్రయించి, ప్రాణ + అపానౌ = ప్రాణాపానాలు, స్వస్వ = తమ తమ. జీవనం = సంచారాన్ని

విధత్తః = నెరవేర్చుచున్నవో, విజ్ఞానఘనం = విజ్ఞానఘనుడును, అజ్ఞేయం = బుద్ధి కందనివాడును, అయిన——

## తాత్పర్యం

ఏ ఆత్మ ఆధారంగా ప్రాణం ప్రేరకాలను స్వీకరించుతుందో, అపానం స్పందనలని పంపుతుందో—ఆ ఆత్మ అగ్రాహ్యమైనది. ఇంద్రియాలు, మనస్సు వల్ల తెలియబడనిది. ఆ కాశీ విశ్వనాథుడు నాకు శరణు మగునుగాక!

## వ్యాఖ్య

పైపై చూపులకు ఊపిరివల్ల శరీరం, జీవం నిలబడి వున్నట్లు కనబడుతుంది. అందుచేత ఎవరైనా చనిపోయినప్పుడు "ఆఖరి ఊపిరి పీల్చుకున్నాడు" అంటారు. అయితే సాధకుడి జిజ్ఞాస ఇది—దేనికారణంగా ఊపిరి క్రమబద్ధంగా ఆడుతోంది" డాక్టర్లు ఈ శరీరమనే యంత్రం ఎలా పనిచేస్తోందో చెబుతారు. దీనిని పని చేయించేవాడు ఎవరు?

తల్లి గర్భంలో ఉన్నప్పుడు మనం ఎవరం ఊపిరి పీల్చలేదు. తల్లి గర్భంలోంచి బయట పడగానే ఊపిరిపీల్చడం మొదలుపెట్టుతాము. ఎందువలన? మనం బ్రతికున్నాము కాబట్టి! చనిపోయి పుట్టిన బిడ్డ ఊపిరిపీల్చడం ప్రారంభించదు. ఏ విచిత్రమైన దాని సాన్నిధ్యాన్ని 'జీవ' మంటామో అదే ఆత్మ. ఆత్మకారణంగానే నిరంతరం ఊపిరి ఆడుతోంది.

కేవలం ఊపిరే అయితే, సంస్కృతంలో దానిని సూచించడానికి వేరే మాట ఉన్నది. "శ్వాస" అంటే ముక్కులో ఆడే ఊపిరి. ఇక్కడ "ప్రాణ" మన్న పదం వాడబడింది. ఈ పదంలో అన్ని శారీరక మానసిక వ్యాపారాలు చేరుతాయి. అందుచేత 'ప్రాణం' అన్నదాంట్లో బాహ్యప్రపంచంనుండి మన హృదయాన్ని తాకే అన్ని ప్రేరకాలు చేరుతాయి. అలాగే "అపానం" అన్న పదంలో బాహ్యప్రేరకాలకు, మనలోంచి బయల్వెడలే అన్నిప్రతిస్పందనలూ చేరుతాయి.

ఆత్మ అన్నిటికన్న ఎక్కువైనది అది ఇంద్రియమనోబుద్ధుల వ్యవహారా లన్నింటికీ మూలం. అందువల్ల ఈ పరికరాలు ఆయనను చూడలేవు, తెలుసుకోలేవు. ఫ్లాషులైటునుండి బయటికి వచ్చే కాంతి దాని అవలో ఉన్న బ్యాటరీని వెలిగించలేదు. ఆత్మ ఇంద్రియాలచేతగాని, మనోబుద్ధులచేతగాని తెలుసుకోబడే విషయం కాదు అందుచేత దానిని ఒకవస్తువుగా తెలుసుకోడానికి వీలుపడే "విషయం" కాదు. "అజ్ఞేయం" అనడం అందుకే.

పరికరం దాని పరిసరాలలో పనిచెయ్యడానికి సాధ్యపరిచేది ఆత్మ, అ ఆత్మే సౌమ్య కాశీవిశ్వనాథుడు. ఆయనలో నేను విలీనం అవుతాను. (కఠ 2.5 5.)

శ్లో॥ నిర్మిమాణో బహూన్ కామాన్ కరణోపరమేఽపి యః।
జాగర్తి శశ్వత్ దృగ్రూపం విశ్వేశం తముపాశ్రయే॥ 17

ప్రతి॥ కరణ + ఉపరమే + అపి = ఇంద్రియ భోగాల్ని అనుభవించికూడా, యః = ఎవడు, బహూన్ = అనేకాలయిన, కామాన్ = కోర్కెలను, నిర్మిమాణః = సృష్టించుకొంటూ శశ్వత్ = నిరంతరం, జాగర్తి = మేల్కొంటాడో, దృగ్ + రూపం = దృఙ్మాత్ర గోచరుడైన——

తాత్పర్యం

ఇంద్రియాలన్నీ ఉపశమించిన తరువాతకూడా ఎవరు రకరకాల కామ్య వస్తువుల్ని నిర్మించి నిత్యమూ మేల్కొనివుండే ద్రష్టగా చూస్తూంటాడో ఆ ఆత్మ విశ్వేశ్వరుణ్ణి నేను శరణు పొందుతాను.

వ్యాఖ్య

ఆత్మ తన చైతన్యకాంతిలో జాగ్రత్స్వప్న సుషుప్తులలోను మూడురకాల అనుభవాలను కలిగిస్తుంది. పరమమైన ఆ ఆత్మే ఏకద్రష్ట. ఆత్మకాంతిలో అన్ని వస్తువులు విషయాలూ వెలుగుతాయి. మనం శరీరంలో వ్యవహరించడం మాని వేసినా, అవ్యక్త వాసనల ఒత్తిడివల్ల మనస్సు స్వప్నమనే ఒకప్రపంచాన్ని సృజిస్తుంది. ఈ స్వప్నాలనుకూడా మనం తెలుసుకుంటాము. మనకలలోని ద్రష్టకూడా ఆత్మే. ఇలా ఆత్మే నిరంతరం ద్రష్ట, అదే వా శరణ్యమైన విశ్వనాథ ప్రభువు. (కఠ 2.5.8.)

శ్లో॥ యథాగ్ని ర్దాహ్యభేదేన బహుర్భవతి యస్తథా।
దేహేషు దేహితా మేతి విశ్వేశం తముపాశ్రయే॥ 18

ప్రతి॥ యథా = ఎట్లు అగ్నిః = అగ్ని, దాహ్యభేదేన = తాను కాల్చునట్టి వస్తుభేదముచే, బహుః + భవతి = అనేకాలవుతుందో తథా = అట్లే, యః = ఏ పరమాత్మ దేహేషు = ఆయా దేహాల్లో, దేహితాం = ఆయాశరీరం గలవాడు, ఏతి = పొందుచున్నాడో, తం = అట్టి శ్రీ విశ్వేశం = శివుని, ఉపాశ్రయే = సమాశ్రయిస్తున్నాను.

## తాత్పర్యం

ఏకమైన అగ్నిభూతం కాలే వస్తువుల్లోని భేదాలవల్ల వేర్వేరు రూపాలుగా ప్రజ్వరిల్లుతూ కనబడుతుందో, అలాగే ఏకమైన ఆత్మ వేర్వేరు వ్యక్తులుగా భాసిస్తుంది. ఆ ఏకాత్మ విశ్వనాథుడు ఆయనని నేను శరణుగోరుతాను.

## వ్యాఖ్య

నిప్పు ఏకమైనదే. నూనె, వత్తిని బట్టి ఏ వస్తువుని కాల్చుతున్నప్పుడు దానినిబట్టి మంటలు వేరువేరు విధాలుగా కనబడుతాయి. అలాగే ఏకమైన చైతన్యం వేర్వేరు ప్రాణులుగా కనబడుతుంది. శరీరాల ఆకారాల తీరునుబట్టి, మనోబుద్ధుల ఆలోచనా విధానాలనుబట్టి, ఉద్దేశ్యాలనుబట్టి ఇలా వేరుగా కనబడుతుంది. ఈ ఏకాత్మ కాశీవిశ్వనాథుడే, ఆయనకు నేను ఆత్మనివేదనం చేసుకుంటాను. (కఠ 2.5 10)

శ్లో॥ రూపం రూప మనుప్రాప్య తత్తత్స్వరూప్య మృచ్ఛతి।
యః పరాత్మా యథా వాయు ర్విశ్వేశం తముపాశ్రయే॥ 19

ప్రతి॥ యథా = ఎట్లు, వాయుః = వాయువు, రూపంరూపం = భిన్నరూపాలను, అనుప్రాప్య = పొంది, తత్ + తత్ + స్వరూపం = వాటివాటి సమాన రూపాలను, ఋచ్ఛతి = పొందుచున్నదో (తథా = అట్లే) పరాత్మా = పరమాత్మ (కూడా ప్రవర్తిస్తుంది)——

**తాత్పర్యం**

ఏకమైన వాయువు వేరువేరు రూపాలలో ప్రవేశించి ఎలా బహురూపాలుగా కనబడుతుందో అలాగే ఏకాత్మ వేర్వేరు రూపాలను సచేతనంచేస్తూ ఆ రూపాలను ధరించినట్లు కనబడుతుంది. ఆ ఆత్మ శ్రీ విశ్వేశుణ్ణి నేను శరణు వేడుతాను.

**వ్యాఖ్య**

వాయువుకు ఒక ఆకారం అంటూ లేదు. అది అంతటా వున్నది అది అన్ని ఆకారాలలోకి ప్రవేశించి ఊపిరిపోసి నిలబెట్టుతుంది. అలాగే రెండోది లేని సర్వవ్యాప్తమైన అద్వితీయాత్మ ప్రాణుల్ని సజీవులను చేసి ఆయా వ్యక్తుల రూప గుణాలను స్వీకరించినట్లు అగపడుతుంది.

శ్లో॥ అక్షిదోషై ర్యథా సూర్యో లోకదుఃఖై స్తథైవ యః
లిప్యతే నహి భూతాత్మా విశ్వేశం తముపాశ్రయే॥ 20

ప్రతి। యథా = ఎట్లు, అక్షిదోషైః = కండ్లకలక గలవానిచేత సూర్యః (నహిలిప్యతే) = సూర్యుడు (చూడబడడో,) తథా + ఏవ = అట్లే, యః = ఏ, భూతాత్మా = జీవాత్మ, లోకదుఃఖైః = సంసార దుఃఖాల చేతను (నహిలిప్యతే = చూడబడడు)——

**తాత్పర్యం**

చూచేవాని కంట్లో దోషాలవల్ల సూర్యుడు ఎలా తాకబడడో, అలాగే లోకుల దుఃఖాలవల్ల పరమాత్మ తాకబడడు. ఆ ఆత్మ శ్రీ విశ్వనాథుణ్ణి శరణు వేడుతాను.

**వ్యాఖ్య**

చూచే అన్ని కళ్ళకు కాంతిరూపుడైన సూర్యుడు అధ్యక్షుడు. ఎక్కడ కాంతి లేదో అక్కడ కన్ను చూడలేదు. అయితే వ్యక్తి కళ్ళల్లో దోషాలుంటే అతడిచూపు మందంగానో, వక్రంగానో ఉంటుంది. వ్యక్తియొక్క కంటిదోషాలవల్ల సూర్యుడికి ఏవిధమైన నష్టమూ వాటిల్లదు.

అలాగే ఆత్మ శుద్ధచైతన్యంగా అన్నిపరికరాలను సజీవపరచి అన్ని అనుభవాలను వెలిగిస్తుంది. వ్యక్తి పరికరాలలోని దోషాలు, దృష్టిజ్ఞానంలోని వంకరలు, స్పందనలలోని వక్రతలు ఆనందరూపమైన ఆత్మను ఎంతమాత్రం మైలపరచలేవు. (కర 2.5.12)

శ్లో॥ నిత్యానా మపి యో నిత్య శ్చేతనానాంచ చేతనః।
సర్వజ్ఞం సర్వబుద్ధిస్థం విశ్వేశం తముపాశ్రయే॥ 21

ప్రతి॥ యః = ఏ దేవదేవుడు, నిత్యానాం + అపి = నిత్యులకు కూడ, నిత్యః = శాశ్వతుడో—, చేతనానాం = చేతనాలకుకూడ, చేతనః + చ = చేతనుడో, సర్వజ్ఞం = సర్వజ్ఞుడును, సర్వబుద్ధిస్థం = సమస్తజ్ఞానగమ్యుడునయిన—

## తాత్పర్యం

నిత్యమైన వాటికన్న నిత్యమైనది, సజీవమూర్తులలో చైతన్యమైనది, సర్వజ్ఞమైనది, సర్వబుద్ధులలో సంస్థితమై వున్నది. అయిన కాశీవిశ్వనాథుని నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

శాశ్వతము-అశాశ్వతము అనేవి బుద్ధినిర్ణయాలు, ఈ రెండూ చైతన్య కాంతివల్ల మానవుని ఎరుకలోకి వస్తాయి. అందుకని శుద్ధ చైతన్య బుద్ధి యొక్క శాసనం దేశమంతా వ్యాపించివున్నా ప్రభుత్వాన్ని చూడాలంటే రాజధానికి రావలసిందే. అలాగే ఆత్మను బుద్ధితో సూటిగా దర్శించడానికి వీలవుతుంది. అందుచేత ఆత్మని "బుద్ధిస్థం" అన్నారు.

ఇక కఠోపనిషత్తులోని ఆరోవల్లిని శ్రీ గురుదేవులు ముక్తసరిగా వివరిస్తున్నారు.

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖం ఛిన త్యశ్వత్థ మర్ధధీః।
యత్కటాక్ష కుఠారేణ విశ్వేశం తముపాశ్రయే॥ 22

ప్రతి॥ ఊర్ధ్వమూలం = ప్రేళ్ళభాగం పైకి ఉంటూ, అధః + శాఖం = కొమ్మలు క్రిందిభాగానికి వ్యాపించి వున్నదియైన, అశ్వత్థం = రావిచెట్టును, యత్ = ఏదేవుని, కటాక్ష = దయఅనే, బుద్ధధీః = పరిణత బుద్ధుడు కఃఠార = గొడ్డలిచే, ఛినత్తి = ఛేదిస్తూన్నాడొ, తం = అట్టి, శ్రీవిశ్వేశం = శంకరుని, ఉపాశ్రయే = సమాశ్రయిస్తున్నాను.

## తాత్పర్యం

మూలం పైకి కొమ్మలు క్రిందికి వున్న జీవిత వృక్షం భగవదనుగ్రహమనే గొడ్డలివల్ల ఛేధింపబడుతుంది. ఆ భగవంతుడు శ్రీ కాశీవిశ్వనాథునికి నేను సర్వార్పణం చేసుకుంటాను.

## వ్యాఖ్య

ఈ నామరూప జగత్తు యావత్తు ఉత్తమోత్తమమైన పర బ్రహ్మమునుండి క్రిందికి శాఖలతో ప్రేలాడుతున్న అశ్వత్థవృక్షం వంటిదని ఉపనిషత్తు ఉదహరించింది, ఈ వృక్షం నిత్యమైనది పరమాత్మనుండి పుష్టిని బలాన్ని పొందుచూ ఈ వృక్షం తిరిగి జీవించి వ్యవహరిస్తుంది. వ్యక్తమై పైకి వచ్చే ఈ చెట్టు భూమిలోంచి పీల్చుకొన్న సారంయొక్క మహారూపమే, అయితే చెట్టుని చూచిన వాళ్లెవరూ ఆ చెట్టు మట్టి రూపమేనని గుర్తించలేరు.

అనేకంతో కూడిన ఈ వృక్షానుభవాన్ని భగవంతుని అనుగ్రహమనే గొడ్డలితో ఛేదించాలి. నిరంతర ధ్యానంతో శాంతపడిన మనస్సులో భగవంతుని అనుగ్రహం పొంగివస్తుంది. ఆత్మయొక్క ఈ లీల శ్రీ విశ్వనాథుడే, ఆయన విశ్వానికి అధిపతి నాకు సర్వరక్షకుడు. (కఠ 2.6.1.)

శ్లో॥ నిరీక్ష్య వజ్రోద్యతపాణి మీశ్వరం
యథా భుజిష్యా శ్శిఖిభాస్వ దాదయః।
విభక్తి కృత్యేషు తథైవ యద్భయాత్
చరస్త్యజస్రం కురు తద్ధరే రతిమ్॥ 23

ప్రతి॥ వజ్ర + ఉద్యతపాణి = వజ్రాయుధాన్ని, పైకెత్తిన,చేయిగల ఈశ్వరం = ప్రభువును, నిరీక్ష్య = చూచి, యథా = ఎట్లు, శిఖి + భాస్వత్ + ఆదయః = అగ్ని, సూర్యుడు, మొదలుగా, విభక్త = తమకు నియమింపబడిన కార్యాలల్లో, భుజిష్యాః = నెరవేరుస్తున్నారు, తథా + ఏవ = అట్లే, యత + భయాత్ = ఏ పరమేశ్వరుని భయంచేత, అజస్రం = నిరంతరం. చరతి = సంచరిస్తున్నారొ, తత్ + అ, హరే = ఈశ్వరునియందు, రతిం = అనురక్తిని, కురు = చేయుము– (నిల్పుము)—

## తాత్పర్యం

చేతితో వజ్రాయుధాన్ని పట్టి నిలుచున్న ప్రభువును చూచి సేవకులు భయపడి ఎలా తమ తమ కర్తవ్యాలని నిర్వహిస్తారొ అలాగే ఆత్మకు భయపడి అగ్ని, సూర్యుడు మొదలైన దేవతలు తమ తమ విధులను పూర్ణంగా క్షుణ్ణంగా నెరవేర్చుతారు ఆ ప్రభువులో రతిపొందు!

## వ్యాఖ్య

శాస్త్రవిజ్ఞానం ప్రపంచంలో ఉన్న సహజశక్తులు, వ్యక్తులూ కూడా తమ తమ ధర్మాలను సక్రమంగా నెరవేర్చుతున్నారని, ప్రభువు వజ్రాయుధాన్ని చేబట్టి నిల్చొని వారినందరిని తరుముతూ ఉన్నందువల్లనే వారు అంతచక్కగా తమ విధులను నిర్వర్తిస్తారనే భావన ఉపనిషత్తులలో తరుచు వినవస్తుంది. తమస్సును బద్ధకాన్ని తరిమివేసి సామాన్య మానవుని రజోగుణంలో చురుకుగా వ్యవహరించేట్లు ప్రేరేపించడానికి భయం అవసరం. (కఠ 2.6.3)

శ్లో॥ బుద్ధీంద్రియాణాం మనశ్చ బుద్ధే
రచేష్టనం శ్రేష్ఠగతి హి యోగః।
నిధ్యాయతే తేన య ఈశి భక్తిం
తస్మిన్నరూపే కురు సత్స్వరూపే॥ 24

ప్రతి॥ బుద్ధి + ఇంద్రియాణాం = జ్ఞానేంద్రియాలకు, మనసః = మనస్సుకు, బుద్ధేః + చ = బుద్ధికిని, అ చేష్టనం = కర్తృకత్వరూపమైన, శ్రేష్ఠగతిః

+హి = ఉత్తమమార్గముగా, యః = ఏ, యోగః = యోగము, నిధ్యా యతే = ఆచరింపబడుచున్నదో, తేన = ఆ యోగ-చేత, తస్మిన్ = ఆ, అరూపే = రూపంలేని, సత్ + స్వరూపే = పరమాత్ముడైన, ఈశే = శివుని యందు, భక్తిం = భక్తిని, కురు = నిల్పుము.

## తాత్పర్యం

పరమోత్తమమైన యోగమంటే జ్ఞానేంద్రియాలు, మనోబుద్ధులు తమ తమ వ్యవహారాలను నిలిపివేయడం. ఇలా ఉంచగలిగినవారు ఈశ్వరునిపైన లోదృష్టిని వుంచగలరు. ఆ నిరాకార సత్స్వరూపంపైన ప్రభువులో భక్తిని చూపు.

## వ్యాఖ్య

యోగమంటే ఏమిటో ఇక్కడ వివరింపబడింది. ఇంద్రియాలు వాటివాటి అర్థాలలో చేసే వ్యర్థవ్యాపారాలను అరికట్టాలి. ఇది సాధ్యమేనా అనే అను మానం సహజంగా కలుగుతుంది. మన మనోదృష్టి ఆత్మలో వున్నప్పుడు ఇంద్రి యాల వ్యాపారాలు సహజంగానే ఉడిగిపోతాయి. ఇది ఉత్తమోత్తమమైన యోగం. మనోబుద్ధుల పూర్తి దృష్టిని ఏ ఆత్మ మీద నిలుపుతామో అదే నా ప్రియాతిప్రియ కాశీవిశ్వనాథుడు, మన స్వస్వరూపాన్ని శుద్ధభక్తితో అభిషేకించు దాము! (కఠ 2.6.11,12)

**శ్లో॥ ఉపాసకైర్యః క్రమశోఽధిగమ్య**
**స్సుషుమ్నయా మంక్షు చ వర్ష్మణో యః।**
**ముంజాదిషీకేవ వివిక్తధీభి**
**ర్నిష్కృష్యతే తం భజ కాశికేశమ్॥** 25

ప్రతి॥ యః = ఏ ఆత్మస్వరూపుడయితే, ఉపాసకైః = ఉపాసకులచే, క్రమశః = క్రమంగా, అధిగమ్యః = పొందబడుచున్నాడో, యః = ఏ ఆత్మ స్వరూపుడు, వర్ష్మణః = శరీరంనుండి, సుషుమ్నయా = సుషుమ్నా నాడిచే మంక్షు = వెంటనే, వివిక్తధీభిః = పరిశుద్ధులైన, పండితులచే,

ముంజ + ఆది + షీకా + ఇవ = ముంజ. మొ॥ గడ్డివలె, నిష్క్రష్యతే = వేఱు చేయబడుచున్నాడు, తం = అట్టి, కాశీకేశం = విశ్వేశ్వరుని, భజ = సేవించుము.

## తాత్పర్యం

ఉపాసకులచేత సుషుమ్నా నాడిద్వారా పయనిస్తూ ఏ గమ్యం అంచెల వారిగా అందుకోబడుతుందో, అ గమ్యమె వివేకులవల్ల ముంజగడ్డినుండి ఇషీ కను వేరుచేసి తీసినట్లు వేరుచేయబడుతుంది. ఆ గమ్యమైన కాశీ విశ్వనాథుణ్ణి భజించు!

## వ్యాఖ్య

కర్మకాండలో నిమగ్నమైన వాళ్లు భోగలాలసతకి దూరం అయినా పూర్ణా త్మని దర్శించలేరు. వాళ్లు బ్రహ్మలోకానికి వెళ్లుతారు. అక్కడ సృష్టికర్త పాదాలవద్ద శాస్త్రాధ్యయనం చేస్తూ సూక్ష్మాతి సూక్ష్మమైన సుఖభోగాలను అను భవిస్తూ, భోగవాసనలను వదిలించుకుంటారు. అప్పుడు వాళ్లు పూర్తిగా పర బ్రహ్మములో లీనమైపోతారు. దానిని క్రమముక్తి అంటారు. చివరికి వారు అందుకునేది. ఆత్మనే శ్రీ కాశీవిశ్వేశుణ్ణే!

వికసించిన విచక్షణగా జ్ఞానంతో మనలోని జీవనస్రవంతికి మూలాన్ని పరిశోధించినప్పుడు,స్థూలసూక్ష్మ కారణ శరీరాలను అనాత్మగా తెలిసి త్యజించి ఆత్మను శుద్ధ అనంతస్వరూపంగా గుర్తించుతారు. ఇదే సూటిగా పొందే అప రోక్షనుభూతి.



# పంచమ స్తబకం

ఈ స్తబకంలో శ్రీ గురుదేవులు ప్రశ్నోపనిషత్తు భావాలను వివరించారు. ప్రశ్నోపనిషత్తు అథర్వణ వేదంలోని బ్రాహ్మణోపనిషత్తు, బ్రాహ్మణోపనిషత్తు ఒక మంత్రోపనిషత్తులోని నిగూఢార్థాలను విస్తరించి వివరిస్తుంది. ప్రశ్నోపనిషత్తు మంత్రోపనిషత్తు అయిన ముండకోపనిషత్తులోని ఉత్తేజపూరితమైన నిగూఢ సౌందర్యాన్ని, అంతరార్థాలలో వెలిబుచ్చుతుంది, గాఢధ్యానంలో నిమగ్నులై ఉన్న ఋషి వారి భాషను దహించుకుంటూ బయల్వెడలుతుంది. ఇలాంటి ముండకోపనిషత్తులో భావగర్భితాలైన ఋషి వాక్కులను ప్రశ్న శ్రద్ధాపూర్వకంగా విశదీకరిస్తుంది.

వేదాంతాధ్యయనానికిగాను జిజ్ఞాసువుకు వుండవలసిన అర్హతలలో శ్రద్ధ, బ్రహ్మచర్యం. గురుశుశ్రూష తప్పనిసరి అని పేర్కొంటున్నారు.

శ్లో॥ శ్రద్ధయా బ్రహ్మచర్యేణ గురుశుశ్రూషేణ ఏవ చ।
బ్రహ్మ యద్బుధ్యతే ధీరై స్తమీడే మృడ మీశ్వరమ్॥ 1

ప్రతి॥ యత్ + బ్రహ్మ = ఏ బ్రహ్మస్వరూపుడు, శ్రద్ధయా = శ్రద్ధచే, బ్రహ్మచర్యేణ = బ్రహ్మచర్యంతో, గురుశుశ్రూషేణ + చ = గురుశుశ్రూష చేతను, ధీరైః = సంకల్పబలం గలవారిచే, బుద్ధ్యతే = తెలియబడుచున్నదో, తం = ఆ, మృడం = మృడుడైన, ఈశ్వరమ్ = శంకరుని, ఈడే—స్తుతిస్తున్నాను.

## తాత్పర్యం

శ్రద్ధ నలవరచుకొని బ్రహ్మచర్యంలో నివసిస్తూ గురువును సేవించేవాళ్లు ఆత్మను తెలుసుకుంటారు. ఆ ఆత్మ అయిన శంకర భగవానుని నేను సేవిస్తాను.

వ్యాఖ్య

శ్రద్ధ అంటే కేవలం నమ్మకంకాదు. శాస్త్రాలలో ఆత్మను గురించి చెప్పిన విషయాలను స్వయంగా మీదైనందిన ప్రపంచంలో మీతో ఎంత సన్నిహిత సంబంధం ఉన్నదో తెలుసుకొని వుంచే నమ్మకం శ్రద్ధ.

విషయ—ఉద్రేక—తలపుల ప్రపంచంలో మీ ఇంద్రియ మనోబుద్ధులు విచ్చలవిడిగా సంచరించి ఇరుక్కుపోకుండా నిగ్రహించడం బ్రహ్మచర్యం. ఇంద్రియ మనోబుద్ధులకు సహజంగానే బాహ్యదృష్టి, వాటిని స్వేచ్ఛగా వదిలేస్తే బాహ్యప్రపంచంలోని బాహుళ్యంలోకి నామరూపాల రంగాలలోకి చొచ్చుకుపోతాయి. ఆలోచనల దృష్టిని ఆయన వైపుకి త్రిప్పి బ్రహ్మములోనే తరింపజేయడం బ్రహ్మచర్యం. (బ్రహ్మణి చరతి ఇతి బ్రహ్మచర్యః)

గురువుకు శారీరక సేవలు చేయడమే గురుశ్రూషకాదు. గురువు బోధించే జీవిత విధానాన్ని అలవరచుకోడం, నిరంతర ధ్యానం ద్వారా ఆత్మపదంలో జాగృతుడు కావడానికి కృషి చెయ్యడం నిజమైన శుశ్రూష.

శ్లో॥ దర్శనం స్పర్శనం కేళి ప్రేక్షణం గుహ్యభాషణమ్।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియా నిర్వృతి రేవ చ॥
ఏతన్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః।
విపరీతం బ్రహ్మచర్యమనుష్ఠేయం ముముక్షుభిః॥ 2

ప్రతి॥ దర్శనం = చూచుట, స్పర్శనం = తాకుట, కేళిః = సల్లాపము, ప్రేక్షణం = దృష్టి సారించుట, గుహ్యభాషణం = రహస్య సంభాషణం, సంకల్పః = భోగేచ్ఛ, అధ్యవసాయః + చ = కార్యనిర్ణయం, క్రియానిర్వృతిః + ఏవ + చ = కార్యనిర్వహణముకూడా—అను, ఏతత్ = ఈ అష్టాంగం = ఎనిమిది అంగాల సమాహారాన్ని, మనీషిణః = విజ్ఞులు, మైథునం = రతిక్రీడగా, ప్రవదంతి = చెప్పుచున్నారు, విపరీతం = దీనికి భిన్నమైన, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్య మనునది, ముముక్షుభిః = మోక్షకాంక్షా పరులచే, అనుష్ఠేయం = ఆచరింపదగినది.

## తాత్పర్యం

(1) స్త్రీలను దర్శించడం, (2) వారిని తాకడం, (3) వాళ్లతో సరసా లాడడం, (4) వాళ్లవంకే చూడడం, (5) వాళ్లతో రహస్య మంతనాలాడడం, (6) వాళ్లని గురించి యోచించడం, (7) వాళ్లతో సంగమించాలనే నిర్ణయం, (8) సంగమించడం—ఇలా ఎనిమిది రకాలైనవి మైథున క్రియలని పండితులు చెబుతారు. వీటికి పూర్తిగా భిన్నంగా చరించడం బ్రహ్మచర్యం నిజమైన సాధకులు నిత్యమూ వాటిని అభ్యసించాలి.

## వ్యాఖ్య

కామ సంకల్పంతో స్త్రీలను చూడడం అంటే మనస్సులోని పశుప్రవృత్తిని కదలించడమే, ఆ తరువాత మనస్సు ఆవేశాల అయాసాలలో విషయ ప్రపంచంలోకి తృప్తికోసం పరుగులు పెట్టుతుంది.

వాటిని తాకడమంటే శాంతిగా పడివున్న వెఱ్ఱి ఉద్రేకాలను రెచ్చగొట్టడమే, స్త్రీలతో సరసాలాడడం, నవ్వడం, గుసగుసలు, నర్మగర్భితమైన సంకేతాలలో రహస్య మంతనాలు, చనువుతో ఇద్దరిలోను ఆవేశాల జ్వాలలను ముట్టించడం అతి ప్రమాదకరం. ఇవన్ని రతికేళిని గురించి ఉపద్రవకరమైన ఆలోచనలకు దారితీస్తాయి.

ఒకసారి ఇలాంటి ఆలోచనలు మొదలయ్యాయా నిలపలేని కల్పనలు వరదలుగా వచ్చి అతనిని బలవంతంగా ఆ పనికి పూనుకొనేట్లు చేస్తాయి. అందుచేత అతడెంత దీక్షగల భక్తుడైనా సిగ్గుకూడ వదిలేసి, తనగమ్యాన్ని మరిచి కామకేళికి దిగుతాడు.

అందుచేత ఈ ఎనిమిది రకాల చర్యలను ప్రమాదకరమైనవని పెద్దలు ప్రకటించారు. ఆత్మవికాసంవైపుకి పయనించే శుద్ధ రాజమార్గంలో సాధకుడిని వినాశకరమైన-పతనానికి తీసుకుపోయే-ఎనిమిది దగ్గిరదారులివి. మనస్సు పూర్తిగా బాహ్యదృష్టిని పొందినప్పుడు దాని బాహ్యదృష్టిని అరికట్టడం చాలా దుష్కరం. అంతశ్శాంతి తుడిచి పెట్టుకు పోతుంది. ధ్యానంలో నిలకడ చెదిరి పోతుంది.

మైధునం: సంగమించడం ఇది కామక్రియకు ప్రేరేపించుతుంది. అందుచేత సర్వనాశనకారియైన సురతకేళిని ఎంతదూరంగా ఉంచాలో పై సంగమాలకి కూడా అంతదూరంగా వుండాలి.ఇలా ఆధ్యాత్మిక పథ మార్గ దర్శులైన వివేకులు నిర్దేశించారు.

మొదటి శ్లోకంలో చెప్పబడిన మూడురకాల క్రమశిక్షణలద్వారా మనో బుద్ధి పరికరం శుద్ధమవుతుంది. అతి తక్కువైన అశాంతిని పొందుతుంది. అందువల్ల సాధకులు ఆత్మను దర్శించుతారు. ఈ ఆత్మ శంకర ప్రభువే, ఆయనను కీర్తించుతాను. (ప్రశ్న 1 2)

ఆలోచనకు మూలమైన ఆత్మయొక్క స్వభావాన్ని గురించిన యోచనలో మనస్సును పూర్తిగా నిలిపి ధ్యానించడానికిగాను, బాహ్యవిషయాలద్వారా కలిగే అన్నిసుఖాలపట్ల పరమ వైరాగ్యం వుండడం తప్పనిసరి. పరబ్రహ్మము ఒక్కటే నిత్యసత్యము, ఆనందరూపమని, తక్కినవన్నీ అనిత్యమైనవి, అశాశ్వత మైనవి, దుఃఖ భూయిష్ఠములైనవి అని నిజంగా అర్థంచేసుకొన్నప్పుడు మాత్రమే ఈ వైరాగ్యం అలవడుతుంది.

సాధకులు స్వయంగా దీనిని గుర్తించాలి. అందుకోసం ప్రపంచ బాహుళ్యం ఎలా సృష్టి అయిందో, ఇక చర్చించబడుతుంది.

**శ్లో॥ ప్రజాపతి శ్శరీర స్సన్ ప్రజాః కామయతే ప్రభుః।**
**తపశ్చ తప్యతే దివ్యం తమీడే మృడమీశ్వరం॥ 2**

ప్రతి॥ ప్రభుః = పరమేశ్వరుడు, ప్రజాపతి శరీరః + సన్ = బ్రహ్మగావుంటూ, ప్రజాః—ప్రజలను, కామయతే = ప్రేమిస్తున్నాడు, దివ్య = దివ్యమైన, తపః + చ = తపస్సుకూడ, తప్యతే = తపింపబడుతూంది, తం = ఆ, మృడం = మృడుడైన, ఈశ్వరం = శంకరుని, ఈడే = స్తుతిస్తున్నాను.

## తాత్పర్యం

ప్రజాపతి శరీరధారి అయి ఆత్మ, ప్రజలను కోరుకొని, ఆ కోరిక తీరడం కోసం తీవ్రమైన తపస్సు చేశాడు. ఆ ఆత్మ అయిన శంకరభగవానునికి స్తుతుల నర్పిస్తాను.

## వ్యాఖ్య

పరమాత్మ తన సర్వశక్తిమంతత్వాన్ని, సర్వజ్ఞత్వాది విశిష్ట లక్షణాలను గుర్తించడంతోనే ఆయన ఈశ్వరత్వం మొదలవుతుంది. సర్వశక్తిమంతుడైన ఈశ్వరుడు తన సృష్టిసంకల్పంయొక్క వేగం కారణంగా ఊరుకోలేడు. ఎక్కడైనా అంతే. సృజనాత్మకమైన ప్రేరణలు సృజించనిదే ఆగవు ఈ ప్రేరణల కృతకృత్యత సృష్టిలోనే. ఇలా భగవంతుడు సృష్టిని సంకల్పించాడు. దేనిని? ఎలా? ఎప్పుడు?—ఈ రకమైన గాఢచింతన తపస్సు అనబడుతుంది. ఈ దివ్య తపంతో ఆయన సృజిస్తాడు. ఇలా భగవంతుడు ప్రజాపతి అవుతాడు.

ప్రపంచ బాహుళ్యాన్ని సృష్టించాక సృష్టిని ప్రేమించి ప్రజాపతి ప్రజగా మారుతాడు. జీవుడైనాక తానే తన పరికరాలను, పరిసరాలను సృష్టించుకున్నాననే భావనకూడా రాదు.

ఇలా జీవ—జగత్తులుగా మారిన పరమాత్మ పరమేశ్వరుడే, ఆయనకు స్తుతుల నర్పించుతాను. (ప్రశ్న 1.4)

శ్లో॥ అగ్నీషోమౌ సృజత్యాదౌ యః ప్రజాకరణేచ్ఛయా।
అత్త్రన్నభూతౌ భూతేశం తమీడే మృడమీశ్వరం॥ 3

ప్రతి॥ యః = ఏ పరమేశ్వరుడు, ప్రజా = ప్రజలను, కరణ = సృష్టించు, ఇచ్ఛయా = కోర్కెతో, అదౌ = మొదట, అత్త్రన్నభూతౌ = తినుట, తిండి —అను రెండురూపాలైన, అగ్నీషోమౌ = సూర్యచంద్రులను, సృజతి = సృజిస్తున్నాడో——

## తాత్పర్యం

ప్రారంభంలో ప్రజలను సృజించే నిమిత్తం ప్రజాపతి సూర్యచంద్రుల్ని సృష్టించాడు—భుజించే సూర్యుడు, భుజింపబడే చంద్రుడు, ఆ భూతరాశికి ప్రభువైన శంకరప్రభువును నేను కీర్తించుతాను.

## వ్యాఖ్య

తన సర్వజ్ఞత్వాన్ని, సర్వశక్తి మంతత్వాన్ని తెలుసుకొన్న పరమాత్మ ఈశ్వరుడై, సృష్టి సంకల్పంతో అనుభవించే సూర్యుడినీ (ఆత్మ) అనుభవాల నిచ్చే చంద్రుడ్నీ (అన్నం) సృజించుతాడు. సూర్యుడు అన్నింటినీ శోషింప జేస్తాడు కాబట్టి భుజించేవాడు, ఓషధులను అన్నరసాన్ని పుష్టిని ఇస్తాడు కాబట్టి చంద్రుడు చెట్లకి, జంతువులకు, మనుష్యులకుకూడా అన్నమై ప్రాణా లని నిలబెట్టుతాడు.

ఈశ్వరుడుగా, సృష్టికర్తగా, జీవుడుగా మారి ఆ పరమాత్మ, అనుభవ దారు—అనుభవం, సంఘర్షణలు—సాధ్యాలు మొదలైన వాటితో కూడిన ప్రపంచంగాకూడా మారుతాడు. ఆ పరమేశ్వరునికి శంకరప్రభువుకి నా స్తుతుల నర్పించుతాను. (ప్రశ్న 1.4)

శ్లో॥ సూర్యాత్మనా సర్వలోక చక్షు స్తపతి రశ్మివాన్।
ప్రాణాశ్రయ శ్చ యో దేవ స్తమీడే మృడమీశ్వరమ్॥ 4

ప్రతి॥ యః + దేవః = ఏ ప్రజాపతి అయితే, రశ్మివాన్ = కిరణాలను గలిగిన, సర్వలోకచక్షుః = సకలలోకాలకును, నేత్రమైన, సూర్యాత్మనా = సూర్య స్వరూపంతో, తపతి = తపించుచున్నాడో, ప్రాణ + ఆశ్రయః + చ = సర్వప్రాణాలకు ఆశ్రయభూతుడో——

## తాత్పర్యం

ఏ ఆత్మ ప్రజాపతి అయి లోకచక్షువైన సూర్యుడుగా మారి, తన ప్రచండ కిరణాలలో ప్రాణులందర్నీ సజీవం చేసి, ప్రాణులందరి నిత్యకర్మలకు మూల మౌతుందో ఆ ఆత్మ అయిన పరమేశ్వరుణ్ణి నేను స్తుతించుతాను.

## వ్యాఖ్య

పరమాత్మ ఈశ్వరాత్మ అయి, బ్రహ్మాత్మగా ప్రజలందరికి పతి అయి, సృష్టిలో సూర్యాత్మ అవుతాడు. ఈ సూర్యుడు తన వేడి_వెలుగులతో లోకం

లోని ప్రాణులందరినీ నిలబెట్టుతాడు, వెలుగు చూపుతాడు, ఆయన తన వేడితో ప్రాణాన్ని వేడిని బాహ్యాపరిసరాలను, అంతఃపరికరాలను నిలబెట్టుతాడు. శరీరంలోని వెచ్చదనమే ప్రాణులలోని ప్రాణానికి సూచన.

అందరికీ కాంతినిచ్చే వెలుగుగా అందరికళ్లకీ అధిదైవం ఆయనే. ఎవరి కళ్లయినా బైట కాంతి ఉన్నప్పుడే చూస్తాయి. అందుచేత ఆయన లోకచక్షువు. ఆయన లేకపోతే అన్ని కళ్లూ చీకటే,

అన్నీ తానే అయి, అన్నింటిని తానే నిలబెట్టుతూ, ప్రాణుల సంచారానికి రంగాన్ని ఇచ్చే ఆ ఆత్మ శంకరప్రభువే. ఆయనను స్తోత్రాలతో ఆరాధిస్తాను (ప్రశ్న 18)

శ్లో॥ సంవత్సరం షట్చరణం ద్వాదశాకృతి సంయుతం।
కాలమూర్తిం విధత్తే య స్తమీడే మృడమీశ్వరమ్॥ 5

ప్రతి॥ ఏ ప్రజాపతి, షట్ + చరణం = ఆరు (అయనాలు) పాదాలును, ద్వాదశ + అకృతి + సంయుతం = పండ్రెండు (నెలలు) ఆకారాలతోను, గూడిన సంవత్సరం = సంవత్సరమును—కాలమూర్తిం = (సూర్యకారణమైన) కాలదైవత రూపాన్ని, విధత్తే = ధరించు చున్నాడో——

## తాత్పర్యం

ఆరు పాదాలలో పన్నెండు అకృతులతో కాలమూర్తి అయిన సంవత్సరాన్ని నియమించే కరుణామూర్తి ఈశ్వరుణ్ణి నేను స్తుతించుచుతాను.

## వ్యాఖ్య

ఇక్కడ వర్ణింపబడిన సూర్యుడు వేదభాషలో శుద్ధనిగూఢమైన సంకేతం. సూర్యుడికి ఆరుకాళ్లున్నాయని వర్ణించబడింది. ఆరుకాళ్లు ఆరు ఋతువులు, చాలా కాళ్లుండే పురుగులు నడుస్తుంటే ఆ కాళ్లు వొకదాని తరువాత ఒకటిగా కదిలి ముందుకు నడవడం చూస్తాము. అలాగే ఆరు ఋతువులుకూడా ఒకదాని తరువాత ఒకటి వస్తాయి.

ఆయనకు పన్నెండు ఆకృతులట, పన్నెండు నెలలలోను పన్నెండు రకాలుగా కనబడే సూర్యుని వర్ణన ఇది. వేసవికాలంలో సూర్యుడు, శీతా కాలంలో సూర్యుడు ఒకేలాగ ఉండడు.

సూర్యుని ప్రమాణం సంవత్సరం, సంవత్సరాలు కాలప్రవాహాన్ని సూచి స్తాయి.అందుచేత ప్రజాపతి అయిన ఆత్మ సూర్యుడుగా మారి ప్రబలమైన కాల పురుషుడుగా మారుతాడు. ఆయనకు ఆ.రునే శాసకుడు. (ప్రశ్న 1.11)

శ్లో॥ మాసాదికం తతశ్చాన్న మన్నా ద్వీర్యం తతః ప్రజాః।
యత ఇత్థం ప్రజోత్పత్తి స్తమీడే మృడమీశ్వరమ్॥ 6

ప్రతి॥ యతః = ఏ ప్రజాపతివలన, నయితే, మాసః = నెల, దినం = దినము, తతః + చ = దానితర్వాత, అన్నం = ఆహారం, అన్నాత్ = ఆ ఆహారం నుండి, వీర్యం = శక్తి, తతః = దానినుండి, ప్రజాః = ప్రజలు, ఇత్థం = ఇట్లు, ప్రజా + ఉత్పత్తి (సంతానోత్పత్తి) జరుగుతూవుందో, తం = ఆ, మృడం = మృడుడైన, ఈశ్వరం = శంకరుని, ఈడే = పొగడుచున్నాను।

## తాత్పర్యం

ప్రజాపతినుండి సంవత్సరం, నెలలు, రోజులు, రాత్రింబవళ్లు వస్తాయి. తరువాత అన్నం, వీర్యం, వ్యక్తులు—ఇలా ప్రపంచంలోని ప్రాణులు సృష్టి అయ్యాయి. ఈ ప్రజాపతి ఆత్మ శంకరప్రభువే. ఆయనను భక్తిపూర్వకంగా స్తుతించుతాను. (ప్రశ్న 1.12.15)

శ్లో॥ ప్రాణాత్మనా యేన సమ్య గ్ప్రాణ మేత ద్విధాయతే।
పంచవృత్తి విభక్తేన తమీడే మృడమీశ్వరమ్॥ 7

ప్రతి॥ ప్రాణాత్మనా = ప్రాణాన్నే ఆత్మగా గల్గిన, పంచవృత్తి విభక్తేన = ప్రాణాది, పంచప్రవృత్తులను, విభాగంగల, యేన = ఏ పర్మబహ్మచే, యేతత్ + ప్రాణం = ఈ ప్రాణం, సమ్యక్ = బాగుగా, విధార్యతే = ధరింపబడుతున్నదో——

తాత్పర్యం

ఏ ఆత్మ ప్రాణరూపంలో తన్ను తాను అయిదు వృత్తులుగా విభజించుకొని ఈ శరీరాన్ని నిలబెట్టుతుందో ఆ ఆత్మ శ్రీ పరమేశ్వరుణ్ణి నేను స్తుతులలో ఆరాధిస్తాను.

వ్యాఖ్య

స్థూల శరీరంలో వ్యక్తమయ్యే జీవాన్ని ప్రాణమంటారు. అది ముఖ్యంగా అయిదురకాల వ్యవహారాలుగా వ్యక్తమవుతుంది (1) స్వీకారాలు—ప్రాణం, (2) పరిత్యాగాలు—అపానం, (3) విషయప్రేరణలకి స్పందించి జీర్ణించుకోవడం–సమానం, (4) ప్రసారం–వ్యానం, (5) ప్రస్తుత స్థాయిలోని ఆలోచనలను ఉదాత్తం చేసుకోవడం—ఉదానం. ఇవి అయిదూ జీవలక్షణాలైన వ్యవహారాలు, మృతశరీరంలో కనబడవు. జీవితం చివరిదశకు అంటే వృద్ధాప్యం సమీపించినప్పుడు ఈ అయిదు వ్యవహారాలు మందగిస్తాయి.

ఈ వ్యవహారాలే సుఖదుఃఖ రూపాలైన తన జీవితానుభవాలను సేకరించుకోడానికి గాను వ్యక్తికోసం శరీరాన్ని అనువైన పరికరంగా నిలిపి వుంచుతాయి.

ఈ ప్రాణవృత్తులన్నీ ఏకాత్మరూపమే. శరీరంలో జీవంయొక్క అద్భుత విలాసం ప్రాణమే. (ప్రశ్న 2 2,3)

శ్లో॥ వరిష్ఠ ప్రాణదేవం యం ప్రాణ స్సర్వేఽనుయాంతి వై।
స్వరాజం మక్షికా యద్వత్త మీడే మృడమీశ్వరమ్॥ 8

ప్రతి॥ యత్ + వత్ = ఏ విధంగానైతే, మక్షికాః = తేనెటీగలు, స్వరాజం = తమపోతుటీగ ననుసరించునో—(తద్వత్) = ఆ విధంగా, యం = ఏ, వరిష్ఠం = సర్వశ్రేష్ఠమైన, ప్రాణదేవం = ప్రాణదేవుని, సర్వే + ప్రాణాః = సమస్త ప్రాణాలును, అనుయాంతి = అనుసరిస్తున్నవో———

తాత్పర్యం

తేనెపట్టునుండి రాజమక్షిక వెళ్ళిపోతే మిగతా ఈగలన్నీ తేనెపట్టుని వదిలేసి వెళ్ళినట్లుగా శరీరాన్ని సజీవంగా నిలిపివుంచే ముఖ్యప్రాణం నిష్క్ర

మించినప్పుడు ఇతర అల్పప్రాణులన్నీ అనుసరించి వెళ్లుతాయి. ఆ ముఖ్య ప్రాణమే ఆత్మ అయిన శంకరప్రభువు. ఆయనని స్తుతులతో సుతించుతాను.

వ్యాఖ్య

అన్ని ప్రాణాలకు మూలమైన ముఖ్యప్రాణం నిష్క్రమించినప్పుడు ఉపప్రాణాలు, తక్కిన క్రియలు ఆగిపోవాలి అయినా అజ్ఞానంలో ఇంద్రియాలు వాటిలో అవి అనుకున్నాయట.—“మనమే వ్యవహరించి శరీరాన్ని నిలబెట్టుతున్నాము. ఇతరులెవరికీ అది సాధ్యం కాదు” అని.

ముఖ్యప్రాణం అసలు విషయాన్ని వివరించబోయింది —“మీరు నా అనుగ్రహంవల్లనే వ్యవహరించ గలుగుతున్నారు. సుమా” అని. అహంకార దర్పితాలైన ఇంద్రియాలు దానిని నమ్మలేదు. అందుచేత ముఖ్యప్రాణం లేచి వెళ్లడానికి ఉపక్రమింపబోయింది. అన్ని ఉపప్రాణాలు పట్టువదలి ఆ ప్రాణంతోబాటే లేచాయి. డీలా పడిపోయిన ఇంద్రియాలు తెలివితెచ్చుకొని ముఖ్యప్రాణానికి నమస్కరించి, ఆయన శ్రేష్ఠత్వాన్ని అంగీకరించి తమను వదిలి వెళ్లిపోవద్దని వేడుకున్నాయి.

ఈ ఉపమానం చాలా సముచితమైనది. రాణి ఈగ తేనెపట్టుని వదిలినప్పుడు మిగిలిన ఈగలన్నీ ఆమె ననుసరిస్తాయి. ఆమె తిరిగి కూర్చొన్నప్పుడు పనిచేసే సామాన్యపు ఈగలన్నీ క్రొత్తపట్టుని నిర్మించడానికి సిద్ధమవుతాయి. (ప్రశ్న 2 4)

శ్లో॥ అగ్ని రర్కశ్చ పర్జన్యో మఘవా ననిలోఽపి యః।
ప్రాణాత్మనా జగత్సర్వం తమీడే మృడ మీశ్వరమ్॥ 9

ప్రతి॥ యః = ఏ పరమాత్మ అగ్నిః = అగ్నిగాను, అర్కః + చ = సూర్యుడుగాను, పర్జన్యః = వరుణుడుగాను. మఘవాన్ = ఇంద్రుడుగాను, అనిలః + అపి = వాయుదేవుడుగను, ఉంటూ ప్రాణాత్మనా = ప్రాణాత్మతో, సర్వం = సమస్తమైన, జగత్ = ప్రపంచమే అయిన———

## తాత్పర్యం

ఏకాత్మయొక్క వ్యక్తరూపమైన ప్రాణమే అగ్నిగా, సూర్యుడుగా. వర్షంగా, ఇంద్రవాయువులుగా ప్రకట మౌతుంది. ఈ ప్రాణం శ్రీ శంకరుడే. ఆయనను స్తోత్రాలతో నుతిస్తాను.

## వ్యాఖ్య

జడపదార్థాన్ని ఆత్మ తనసాన్నిధ్యంచేత చైతన్యవంతం చేస్తుంది, జడ పదార్థంలో ప్రకటమయ్యే చైతన్యచిహ్నా లన్నింటినీ కలిపి 'ప్రాణం' అంటారు. అందువలన ప్రాణమే అగ్ని, వేదకాలంలో అగ్నిని భగవంతునికి ఏకప్రతీకగా ఆరాధించేవారు. ఆ అగ్ని సూర్యుడుగా వ్యక్తమై ప్రాణులందరికి శక్తిని ప్రాణాన్ని ప్రసాదించి పుష్టి కలిగిస్తున్నది. సూర్యుడివల్లే వర్షం కలుగుతుంది, అందువల్ల వర్షంకూడా ప్రాణంయొక్క మరోరూపమె,

ఇలా "ప్రాణం" అన్ని ప్రాణుల్నీ నిలబెట్టుతూ వాతావరణంలో వాయువుగా ప్రకటమౌతుంది. వాయురూపంలో ఊపిరిగా మారి ఇంద్రియశక్తుల్ని నిలబెట్టుతుంది ఇలా ఇంద్రియాల రాజు ఇంద్రుడుకూడా ప్రాణంయొక్క రూపమే.

అగ్ని, సూర్యుడు వర్షం, ఇంద్రుడు (మనస్సు), వాయువు–అన్నీ ప్రాణ రూపాలై మానవ ప్రపంచంలో అన్ని చురుకైన వ్యవహారాలకు కారణ మౌతాయి. వస్తువులు–వ్యక్తుల పరిస్పర స్పందనాలలో కదులుతూ, ఊగుతూ జరిగే సంఘటనలన్నీ ప్రాణఖేలనమే.

ఈ ప్రాణం శంకరప్రభువు, ఆయనను స్తోత్రాలలో స్తుతించుతాను, (ప్రశ్న 2,5)

ఉపనిషత్తులో అయిదునుండి పది మంత్రాలవరకు ప్రాణమహిమ యొక్క గానమే వున్నది. శ్రీ గురుదేవులు వాటిని వదిలేసి మూడో అధ్యాయం లోని భావాలను ఇక్కడ్డనుండి వివరిస్తారు.

ఇంతవరకు ప్రాణంయొక్క గొప్పదనం, ప్రాణంనుండి ప్రపంచం వ్యక్తమవడం వర్ణించబడినాయి. అయితే ఈ ప్రాణంకూడా పరమాత్మ ప్రకట రూపమే. ప్రాణం పరమాత్మయొక్క ఛాయమాత్రమే. అందుచేత విషయ ప్రపంచంలో తుచ్ఛమైన సుఖాలను పట్టుకు వ్రేలాడక ఆత్మవైపుకు నీ దృష్టిని మళ్లించుమని సందేశం ఇవ్వబడుతోంది.

శ్లో॥ యస్మా దుత్పద్యతే ప్రాణశ్ఛాయా వదనృతాకృతిః।
పరస్మా దక్షరాత్ త్ర్యక్షం తమీడే మృడమీశ్వరమ్॥ 10

ప్రతి॥ యస్మాత్ = ఏ, అక్షరాత్ = నాశంలేని, పరస్మాత్ = పరబ్రహ్మము నుండి, అనృతాకృతిః = మంచిఆకారంలేని, ప్రాణః = ప్రాణం, ఛాయావత్ = నీడవలె, ఉత్పద్యతే = కల్గుచున్నదో, త్ర్యక్షం = ముక్కంటియైన—

## తాత్పర్యం

ఎందుండి భ్రమాత్మకమైన ప్రాణం ఛాయలాగా ఉదయించిందో ఆ పరమాక్షరమైన ఆత్మయే త్రినేత్రుడైన శంకరుడు. ఆయనను స్తోత్రాలతో స్తుతిస్తాను.

## వ్యాఖ్య

ప్రాణం ఆత్మకారణంగా ఏర్పడిందని చెప్పవచ్చును. కాని పైన ఇవ్వ బడిన ఉదాహరణ ఆత్మలోంచి నిజంగా ఏదో వచ్చిందనే భావనని తొలగిస్తుంది. ఏవస్తువుకైనా నీడ పడుతుంది. అది వస్తువు కారణంగానే ఏర్పడుతుంది. అయితే నీడలో నిజం లేదు. వస్తువులో నీడ అనేపదార్థం లేదు. ఈ సంబంధం కాని సంబంధమే పరమాత్మకు ప్రపంచంలోని నామరూపాలకు, వాటిలో 'ప్రాణం' అని పిలువబడే స్పందనకు ఉన్నది. నామరూపాలకుగాని, ప్రాణానికి గాని సత్తాలేదు. అందుకే ప్రాణం భ్రమాత్మకమైనదని వర్ణింపబడింది.

త్రినేత్రప్రభువు శివుడు. పరమేశ్వరునికి దేశకాలాలలో నర్తించే పరిచిత మైన ప్రపంచాన్ని చూడడానికి రెండు కళ్ళున్నాయి. ఈ ఆట కంతటికీ అతీతంగా ఉండే పరమాధార సత్యాన్ని చూచే "నేత్రం" కూడా ఉన్నది. ఉపనిషత్తు సూర్యచంద్రాగ్నులు మూడూ అయన కళ్లుగా వర్ణిస్తుంధి. ఈ మూడే ప్రపంచంలోని మూడు సహజకాంతులు.

ఆ ఏకదివ్య సత్యమే ప్రతివ్యక్తిలోను ప్రాణరూపంలో వ్యక్తమై బాహ్య ప్రపంచంనుండి ప్రేరణలను పొందుతూ ప్రతిస్పందించుతూ వ్యవహరిస్తూం టుందని శ్రీ గురుదేవులు ఇపుడు వివరిస్తున్నారు.

శ్లో॥ నియుంక్తే ప్రాణరూపస్స న్నపానాదీన్ పృథక్ పృథక్।
సమ్రా డధికృతాన్ యద్వత్త మీడే మృద మీశ్వరమ్॥ 11

ప్రతి॥ సమ్రాట్ = చక్రవర్తి, అధికృతాన్ = అధికారులను, యద్వత్ = ఎట్లు నియమిస్తాడో అట్లు, ప్రాణరూపః + సన్ = ప్రాణరూపములో నున్న ఆత్మ, అపాన + ఆదీన్ = అపానము మొ॥ వానిని, పృథక్ పృథక్ = వేరు వేరుగా, నియుంక్తే = నియమించుచున్నదో, తం———



తాత్పర్యం

మహారాజు తన అధికారులను ఒక్కొక్క ప్రాంతంలో పాలించడానికి ఎలాగ నియమిస్తాడో అలాగే ప్రాణరూపంలో వున్న ఆత్మ అపాన, ఉదాన, సమాన, వ్యానాలకు విధులను అప్పగించి, వాటి నిర్వహణకు పరిధులను ఏర్పరచుతాడు. ఆ ఆత్మే త్రినేత్రుడైన కరుణామూర్తి నా శంకరుడు. ఆయనను స్తోత్రాలతో స్తుతించుతాను.

వ్యాఖ్య

ప్రశ్నోపనిషత్తులో ప్రాణరూపమైన ఆత్మ ఉపప్రాణాలను తమతమ స్థానాలలో ప్రత్యేక విధులను నిర్వహించడానికి సామ్రాట్ అధికారులను నియమించినట్లు నియమించుతుందని ఉన్నది. ఈ ఉపమానం నిగూఢార్థాలతో ఎంతో అర్థవంతంగా ఉన్నది. (ప్రశ్న 3.4)

శ్లో॥ ఏకోత్తర శతం నాడ్య స్సశాఖీ నిస్సృతా హృదః।
వ్యానాఖ్యోఽటతి యస్తత్ర తమీడే మృడమీశ్వరమ్॥ 12

ప్రతి॥ హృదః = మనస్సునుండి, సశాఖాః = అనేకశాఖలై, ఏక + ఉత్తర శతం = నూటొక్క, నాడ్యః = నాడులు, నిస్సృతాః = వెలువడినవో, తత్ర = అచ్చట, యః = ఏపరమాత్మ, వ్యాన + అఖ్యాః = వ్యానమనేపేరుతో అటతి = ప్రవర్తించుచున్నదో, తం = అట్టి, మృడం = మృడుడైన, ఈశ్వరం = శివుని ఈడే = స్తుతిస్తున్నాను.

తాత్పర్యం

హృదయంనుండి నూటొక్క నాడులు తమ శాఖలతోకూడ విస్తరించుకుంటాయి. వాటిలో వ్యానప్రాణరూపమైన ఆత్మ సంచరించుతూంటుంది. ఆ ఆత్మే శంకరప్రభువు. ఆయనను స్తోత్రాలతో నుతిస్తాను.

వ్యాఖ్య

"నాడి" అనే సంస్కృతపదానికి ఇంగ్లీషులో సమానమైన పదం లేదు. పాశ్చాత్యుల పరిశోధనలన్నీ బాహ్యదృష్టితోనే సాగినందున సిరలు, ధమనులు

నరాలు మొదలైన స్థూలభాగాలనే పేర్కొంటారు. "నాడులు" ఇవేవి లేవు. చైతన్య కాంతియొక్క రేఖలు శరీరంలోని అతి చిన్నభాగానికి కూడా చేరి చుట్టూరా వుండే ప్రపంచంలోకి విస్తరించుకొంటాయి. వీటికేంద్రం హృదయం.

నాడుల సంఖ్య ఎంతఅని వింటే విస్మయ మనిపిస్తుంది. హృదయం నుండి నూటొక్క నాడులు బయలుదేరుతాయి. అవి ఒక్కొక్కటి నూరేసి ప్రతిశాఖలుగా ($100 \times 101 = 10{,}101$) విస్తరించుకొంటాయి. తిరిగి వాటిలోని ప్రతిశాఖ డెబ్బైరెండు వేలుగా విభజించుకొంటుంది. అంటే $10{,}101 \times 72000 = 72$ కోట్లు 72 లక్షల 72వేల నాడులవుతాయి. వీటి అన్నింటిలోను ప్రసరించే చైతన్యం శరీరంలోని ప్రతిజీవకణంలోను ఉన్నదని తెలుసుకోవాలి ఈ దారులలో వ్యానం నిరంతరం సంచరిస్తూంటుంది.

తుఫానులాంటి వ్యానశక్తిని చైతన్యవంతం చేసివ్యక్తమయ్యే ఆత్మ పరమేశ్వర ప్రభువే ఆయనకు భక్తిపూర్వకమైన స్తోత్రాలద్వారా స్తుతించు తాను. (ప్రశ్న 3.6)

**శ్లో॥ ఇంద్రియోపరమే భానురశ్మివ ద్ధృది దృశ్యతే।**
**యేన స్వప్నజ మాహాత్మ్యం తమీడే మృడ మీశ్వరమ్॥ 13**

ప్రతి॥ యేన = ఏబ్రహ్మచే, ఇంద్రియ + ఉపరమే = ఇంద్రియప్రవృత్తులు ఉపశమించినప్పుడు, భానురశ్మి + వత్ = సూర్యకిరణాలవలె, హృది = మనస్సులో, స్వప్నజ + మాహాత్మ్యం = స్వప్నమందులభించిన గొప్ప తనం, దృశ్యతే = చూడబడునో———

## తాత్పర్యం

సూర్యుడు అస్తమించినప్పుడు తేజోవంతంగా ఉండే కిరణాలన్నీ సూర్యునిలో కలసిపోతాయి. అలాగే ఇంద్రియ వ్యాపారాలన్నీ మనస్సులోకి ముడుచుకుపోయినప్పుడు ఆత్మచైతన్యం మనసు సృష్టించే స్వప్న పపంచాన్ని చూస్తూంది. ఆ ఆత్మ శంకరప్రభువే. ఆయనని స్తోత్రాలతో నుతిస్తాము.

## వ్యాఖ్య

సూర్యుడు అస్తమించినప్పుడు పగలంతా అన్నివస్తులమీద విచ్చలవిడిగా వ్యాపించిన అన్ని కిరణాలు ప్రపంచం నుండి అదృశ్యమైపోయి సామూహికంగా సూర్యుడిలా కలిసిపోతాయి.

అలాగే ఇంద్రియాలద్వారా విషయవస్తువుల్ని వెలిగించే చైతన్యరాశి మనం నిద్రిస్తున్నప్పుడు నిలిచిపోతుంది. అన్నికాంతిరేఖలు మూలమైన శుద్ధ చైతన్యంలో అణిగిపోతాయి.

ఆ సమయంలో మనకు స్థూలప్రపంచంలో వ్యక్తులు – వస్తువులు తెలియకుండాపోతాయిగాని మనలో మనస్సు సృష్టించిన స్వప్నాన్ని తెలుసుకుంటాము. చైతన్యం అక్కడప్పుండి మరో ప్రపంచాన్ని మనకు అనుభవానికి తెస్తుంది. సూర్యుడు రాత్రిళ్లు మనప్రాంతాన్ని వెలిగించడంలేదుకాని భూగోళానికి అటుప్రక్కన తన తేజస్సుతో వెలిగిస్తూనే వున్నాడు. ఆయన కాంతి లేకుండా ఎప్పుడూ ఉండడు.

అలాగే చైతన్యం ఎప్పుడు తన తేజస్సుతో మనకు జాగ్రత్స్వప్నసుషుప్తులనే మూడు ప్రపంచాలలో ఏదో వొకదానిని వెలిగించుతూనే ఉంటుంది అందుకే సూర్యుని వుపమానం ఎంతో భావగర్భితమైన ప్రాముఖ్యతతో సరిగ్గా అతికినట్టు సరిపోయింది. (ప్రశ్న 4.2.5.)

**శ్లో॥ యదా నిరుధ్యతే చిత్తం తైజసా సుప్తి మాస్థితః।**
**యోఽశ్నుతే సుఖమక్షయ్యం తమీడే మృడమీశ్వరమ్॥ 14**

ప్రతి॥ సుప్తిం + ఆస్థితః = స్వప్నావస్థను పొందిన, చిత్తం = మనస్సు, తేజసా = తేజస్సుతో, యదా = ఎప్పుడు, నిరుధ్యతే = నిరోధింపబడునో (అప్పుడు) యః = ఏ పరబ్రహ్మ, అక్షయ్యం = నాశంలేని, సుఖం = సుఖాన్ని, అశ్నుతే = పొందుచున్నాడో——

## తాత్పర్యం

అలిసిపోయిన మనస్సు విశ్రాంతిలోకి చేరుకున్నప్పుడు ఆలోచనలు రెక్కలు సాచి ఎగరని సమయంలో ఆత్మ తేజంవల్ల మూర్ఛితుడైన జీవుడు గాఢసుషుప్తిలో అవధులు లేని ఆనందాన్ని పొందుతాడు. ఆ ఆత్మ శంకర దేవుణ్ణి స్తోత్రాలతో సంస్తుతించుతాను.

## వ్యాఖ్య

స్థూల సూక్ష్మ శరీరాలు రెండూ బాహ్య, స్వప్న ప్రపంచాల సుఖదుఃఖాలను అనుభవించి అనుభవించి అలసిపోయినప్పుడు, అవి విశ్రాంతికోసం నిష్క్రమిస్తాయి, అప్పుడు మనం జాగ్రత్స్వప్నావస్థలు దేనిలోను ఉండం. ఆసమయంలో విషయరహితమైన రంగంలో మిరిమిట్లు గొలిపే ఆత్మ తేజః పుంజంచేత అంధుడైన "ప్రాజ్ఞుడు" అనబడే ఆత్మ సుఖదుఃఖాలు లేని స్థితిని అనుభవిస్తుంది. ఇది మందమందమైన సుఖానుభవం. కేవల అవిద్య అయిన ఈస్థితిలోకూడా పరమాత్మచైతన్యం మనకు పరిచితమైన వ్యక్తులు - వస్తువులు లేకపోవడాన్ని వెలిగించి చూపుతుంది. ఈ పరమాత్మయే నా ప్రేమాధిక ప్రభువు శంకరుడు. ఆయనను స్తోత్రాలతో ఆరాధిస్తాను. (ప్రశ్న 4.6)

విశ్వతైజస ప్రాజ్ఞవ్యక్తిత్వాలు, ఆయారంగాలలోని అంతులేని అనుభవాలు అన్నీ ఏకాత్మఅయిన పరమాత్మ ఆధారంగా మాయ ఆడే ఆట అని శ్రీస్వామీజీ రాబోయే శ్లోకంలో వివరిస్తున్నారు,

**శ్లో॥ విజ్ఞానాత్మా సహ ప్రాణై ర్దేవభూతై శ్చ సంవిశేత్।**
**శాంతే స్వాత్మని యత్తుర్యే తమీడే మృడ మీశ్వరమ్॥ 15**

ప్రతి॥ సహప్రాణైః + చ = ప్రాణాల సాహచర్యంతోడి, దేవభూతైః = దేవతలచే యత్ = ఏ విజ్ఞానాత్మ, తుర్యే = నాల్గవదైన, శాంతే = శాంతమైన, స్వ + ఆత్మని = తనఅంతరాత్మయందు, సంవిశేత్ = ప్రవేశించునో—

## తాత్పర్యం

ప్రాణాలతోసహ దేవతలు (ఇంద్రియశక్తులు), స్థూలభూతాలు (ఇంద్రియగోళాలు), మనోబుద్ధులలో వ్యక్తమయ్యే ఆత్మ (జీవుడు) తురీయావస్థ గాంతాత్మలో విశ్రమించుతాయి ఆ ఆత్మే శ్రీకాశీవిశ్వనాథుడు అయన్ని స్తోత్రాలతో స్తుతించుతాను.

## వ్యాఖ్య

ఆలోచనలలో వ్యవహరించే ఆత్మ, లేదా చైతన్యంతో కూడిన ఆలోచనల సమూహం జీవుడు ఈ చైతన్యమూర్తి జీవుడి విజ్ఞానాత్మఅని పేర్కొన్నాము ఈవిజ్ఞానాత్మ శరీరంలోని ప్రాణాలన్నింటితో సహ ఇంద్రియశక్తులనె దేవతలు ఇంద్రియ గోళాలు (అంటేపంచభూతాలు) బాహ్యప్రపంచం ఇవి అన్నింటితో ఏకమై ఉన్నతమైన ఆత్మలో కలిసిపోతాయి అక్కడ జీవజగదీశ్వరులు ఏకంగా మిళితమై శుద్ధచైతన్యరాశిగా భాసిస్తాయి

జీవస్థాయిలో మేలుకొన్న-కలలుగనే-నిద్రించే వాడుగా వున్నంతకాలం జివుడు ప్రపంచ బాహుళ్యాన్ని చూస్తూంటాడు దృశ్యప్రపంచానికి సృష్టి-స్థితి లయకారకుడైన ఈశ్వరుడు వుండి వుండాలని బుద్ధి ఒప్పుకొని తీరుతుంది. అతడు శుద్ధాత్మలో మేల్కొంచినప్పుడు, కలలోంచి మేల్కొన్నవాడు కల ప్రపంచం రెండు మనుస్సుతో కలసిపోయినట్లు; జీవుడు జగత్తు దాని కారకుడైన ఈశ్వరుడు పరమాత్మలో కలసి అదృశ్య మైపోతాయి.

వ్యామోహంలో వుండి జాగ్రత్స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలతో సంచరించే మనకు తెలియచెప్పడంకోసం ఋషులు ఆత్మను "తురీయం" అంటే నాలుగోఅవస్థ అని నిర్దేశిస్తారు. ఈ మూడింటి నుండి పరీకిస్తే ఆత్మ నాలుగోది, అయితే దాన్తో ఐక్యమైనప్పుడు ఈ మూడుపోవులు అదృశ్యమైపోతాయి దానిని నాలుగోది అనడానికి వీలులేదు.

రెండోది లేక ఏకమైన ఆ సర్వవ్యాప్త పరమాత్మ కాశివిశ్వనాథుడే ఆ శంకరుణ్ణి నేను స్తుతించి ఆరాధిస్తాను. (ప్రశ్న 4.7.11)

నాలుగో అధ్యాయంలోని వివరణలు పూర్తిఅయ్యాయి ఇప్పుడు శ్రీస్వామిజీ అయిదో అధ్యాయాన్ని ప్రారంభిస్తారు.

శ్లో॥ ఓంకారాయతనే నైతత్ పరం చాపర మేవ చ,
బ్రహ్మ యద్భావ్యతే భవ్యై స్తమీడే మృడమీశ్వరమ్॥ 16

ప్రతి॥ భవ్యైః = పూజ్యులయిన, ఓంకార + ఆయతనేన = ప్రణవమునే ముఖ్యాధారముగా, పరం + చ + అపరం + ఏవ + చ = పరాపరములయిన ఏతత్ = ఈ, బ్రహ్మ = పరబ్రహ్మము, యత్ = ఎట్లు, భావ్యతే = భావింపబడుతున్నదో.

## తాత్పర్యం

శుద్ధహృదయులైన సాధకులు ఓంకారాశ్రయంతో పరము, అపరమూ కూడా అయిన ఆత్మను చేరగోరుతారు, ఆ ఆత్మ శ్రీశంకరప్రభువే. ఆ అయనను నేను నుతులతో ఆరాధిస్తాను.

## వ్యాఖ్య

పరాపరాలు రెంటికీ ఆత్మ ఆధారం. ఈ రెండూ పరస్పర సంబంధం ఉన్న పదాలు. పరంతో పోల్చినప్పుడే పరం అనే పదాలకు అర్థం వుంటుంది. అపరం పరంలో కలసిపోయినప్పుడు పరాపరాలు రెండూ వుండవు. అత్మ వొక్కటే అధిష్టానం. అదే అజ్ఞానులకు పరాపరాలు రెండుగా అగపడుతుంది. (ఏతత్ పరంచాపరంచ)

కర్మ, భక్తిసాధనలద్వారా వాసనల బరువును తగ్గించుకొన్న సాధకులు మనోబుద్ధులు కొంతవరకు స్తిమితపడి స్థిరత్వం చెందగా అప్పుడు "ఓం" అనే సంకేతాన్ని, అందులోని సూక్ష్మ రహస్య సందేశాలను గురించి నిరంతర ధ్యానం చేస్తూ ఆత్మస్థాయికి చేరుకొంటారు. సునాయాసంగా పరమపదంలోకి జారుకొంటారు (ప్రశ్న 5,2)

శ్లో॥ ఓంకారేణ త్రిమాత్రేణ ధ్యాయీ నిష్పాప ఏష్యతి।
బ్రహ్మలోకేన యద్బ్రహ్మ తమీడే మృడ మీశ్వరమ్॥ 17

ప్రతి॥ ధ్యాయీ = ధ్యానించేవాడు, త్రిమాత్రేణ = త్రిమాత్రలుగల ఓంకారేణ = ఓంకారరూపమయిన, బ్రహ్మలోకేన = బ్రహ్మలోకముచే యత్ = ఏ, బ్రహ్మ = పరబ్రహ్మస్వరూపాన్ని, నిస్ + పాపః = పాప రహితుడై, ఏష్యతి = పొందుచున్నాడో—

తాత్పర్యం

త్రిమాత్రలను కలిపి ఓంకారాన్ని ధ్యానించిన వాళ్ళు నిష్పాపులై బ్రహ్మ లోకంద్వారా ఏ పరబ్రహ్మమును చేరుకొంటారో ఆ కరుణామూర్తి శంకరుణ్ణి నేను స్తోత్రాలతో స్తుతిస్తాను.

వ్యాఖ్య

అకార ఉకార మకారాలతో కూడిన ఓంకారం. జాగ్రత్, స్వప్న సుషుప్తుల్ని వెలిగించి విశ్వతైజస—ప్రాజ్ఞులుగా వర్తించే చైతన్యానికి సంకేతం. ఈ మాత్రల పైన ఓంకారాన్ని ధ్యానించడంద్వారా మనస్సు విషయ – ఉద్రేక– తలపుల ప్రపంచంలో పరిభ్రమించకుండా శాంతపడుతుంది.

రోజూ క్రమం తప్పకుండా దీక్షతో ధ్యానం చేస్తూన్నా ప్రాపంచిక కామనలు లేని వ్యక్తికూడా ఆఖ్రేసెపు ధ్యానంలో ఉత్తమ స్థాయిలో నిలువలేక పోవచ్చును. అతడి మనస్సు చలించి విషయవస్తువులలోకి పడిపోతుంది దానికి కారణం ఇంకా కొన్ని సూక్ష్మమైన విషయవాసనలుండటమే.

అలాంటి ఉత్తమ సాధకుడు మరల ఒకస్థూల శరీరాన్ని ధరించి ఈ స్థూల ప్రపంచనాటక రంగానికి రాడు. ఈ ప్రపంచంలో అణచిపెట్టిన కోరికలను తీర్చుకొనే అవసరం అతడికి వుండదు. అయినా సూక్ష్మవాసనల కారణంగా ధ్యానంలో ఉండవలసిన స్థిరత్వం రాదు. అలాంటి సందర్భాలలో ఆ జీవుడే ఆత్మ (మనోబుద్ధులు) ఉత్తమస్వర్గాన్ని, అంటే బ్రహ్మలోకాన్ని చేరుకొం

టుంది అక్కడ ఆ ఉత్తమలోక సుఖాలను పొందటమే కాక చతుర్వేదాలకు మూలమైన చతుర్ముఖ బ్రహ్మ ఇచ్చే అద్భుతమైన ప్రవచనాలను విని ఆత్మ దర్శనం చేసుకొంటాడు.

ఇలాంటి క్రమముక్తిని గురించి ఉపనిషత్తులు ఏకమై ముక్తకంఠంతో ఆ బ్రహ్మలోకాన్ని చేరిన ఉత్తమ సాధకుడు భూలోకానికి తిరిగిరాడని, క్రమంగా పరమాత్మలోకి చేరుకొంటాడని ఘోషిస్తాయి.

ఇలా బ్రహ్మలోకంలో శుద్ధులైె సాధకులు పరమాత్మ శ్రీశంకరప్రభువే. ఆయనకు నాసమ్మతులు. (ప్రశ్న 5.3 7)

అయిదో ప్రశ్నలోని భావాలు ముగిశాయి. ఇప్పుడు శ్రీతపోవనంమహరాజ్ ఉపనిషత్తులోని చివరి అధ్యాయంలో వర్ణింపబడ్డ ఉదార కళాపురుషుణ్ణి గురించి తెలుపుతారు.

శ్లో॥ హృచ్ఛయో నిష్కలః స్వాత్మా కలావానివ లక్ష్యతే।
అవిద్యా ఒవద్యబుద్ధే య స్తమీడే మృడ మీశ్వరమ్॥ 18

ప్రతి॥ యః = ఏ, నిష్కలః = అఖండమైన, స్వాత్మా = అంతరాత్మ, హృత్ + చయః = మనస్సును జాగృతపఱచువాడు, కళావాన్ + ఇవ = అజ్ఞానానికి విభక్తుడుగానయి, అవద్యబుద్ధేః = ప్రజ్ఞాశాలియొక్క, అవిద్యా = అజ్ఞానముగా, లక్ష్యతే = గుర్తింపబడుచున్నదో, తం = అట్టి, మృడం = మృడుడైన, ఈశ్వరం = శివుని, ఈడే = కీర్తిస్తున్నాను.

## తాత్పర్యం

హృదయాకాశంలో ఏకాత్మగా రమించే నిష్కళ బ్రహ్మ, మిథ్యాభ్రాంతులతో కూడిన అజ్ఞానానికి షోడశకళలతో విరాజిల్లుతున్నట్లు అగపడుతారు. ఆ నిష్కలబ్రహ్మమే శంకరప్రభువు. ఆయనను స్తోత్రాలతో నుతిస్తాను.

## వ్యాఖ్య

ఆత్మ అద్వితీయమైనది. సాక్షిచైతన్యంగా ఎప్పుడూ ఒకే ప్రకాశంగా ఉంటుంది. ఆయన ఒకడే కర్త. జీవుడిగా, అతడి ఆలోచనలకి ఉద్రేకాలకు మూలం ఆయనే. వెలిగించే వెలుగు వెలిగింపబడే వాటికన్న భిన్నం. ఆత్మ నెరుగని కారణంచేత మాయా కలుషితమైన బుద్ధి భ్రాంతిజన్యమైన ప్రపంచ బాహుళ్యాన్ని చూస్తూంటే దానిని ఆత్మ వెలిగిస్తుంది.

ఇలా మలినమైన మనస్సు అంతులేని కోరికలతో సతమతమౌతూ ఆవేశాలు, భయాలు, భ్రాంతులకు లోనై ఆయనకు పదారు కళలున్నట్లు చూస్తుంది.

నిష్కలమైన ఆ ఆత్మే నేను ఆరాధించే శంకరప్రభువు. (ప్రశ్న 6 2)

శ్లో॥ ప్రభవంతి కలా యస్మా ద్యస్మిన్నే వాపియన్తి చ।
నిర్విశేషే పరేతత్త్వే తమీడే మృడ మీశ్వరమ్॥ 19

ప్రతి॥ నిర్విశేషే = రూపాంతరంలేని, పరేతత్త్వే = పరతత్త్వంలో, యస్మాత్ = ఏ పరబ్రహ్మంనుండి, కళాః = కళలు (విభాగాలు), ప్రభవంతి = పుట్టుచున్నవో, యస్మిన్ + ఏ = ఏ పరబ్రహ్మమందు, యంతి + చ + అపి = లీనమగుచున్నవో——

## తాత్పర్యం

మార్పులు లేని ఏ ఆత్మనుండి కళలు ఉదయిస్తాయో, ఏ ఆత్మలోనే కళాభ్రాంతులన్నీ అణగిపోతాయో ఆ ఆత్మ కాశీనాథుణ్ణి, శంకరప్రభువును స్తోత్రాలద్వారా నుతిస్తాను.

## వ్యాఖ్య

ఆత్మకు వికారాలు లేవు. కాలంలో లేచిపడే వస్తువు లన్నింటికీ మార్పు అనేది తప్పదు. బుద్ధి ఆలోచనల స్రోతస్సు, కాలంకూడా బుద్ధిలోని ఒక

ఆలోచనే. రెండు ఆలోచనలకు మధ్యవున్న విరామం కాలమనే భ్రాంతిని జనింపజేస్తుంది. గాఢనిద్రలో ఆలోచనలు పొగలుగ్రక్కుకుంటూ రావు. కాబట్టే నిద్రించే వాడికి కాలమనేది లేదు.

విషయవస్తువుల్ని చూచినప్పుడుగాని ఆలోచనలు యేర్పడవు. శుద్ధ చైతన్యంలో ఏవిషయ వస్తువులూ లేవు. మన ఎరుకలో వున్నవాటిని ఆయన వెలిగించి చూపుతాడు.

ఇలా బుద్ధి తన అజ్ఞాన మిథ్యాభ్రాంతుల కారణంగా ఏకచైతన్యరాశి అయిన ఆత్మలో పదారుకళలను చూస్తుంది.

ఆత్మనుండి కళలు ఉదయించి, నిలిచి, కరిగిపోతాయి. ఈ ఆత్మే శంకరప్రభువు. ఆయనను నేను ఆరాధిస్తాను. (ప్రశ్న 6 2)

**శ్లో॥ యచ్చితి వ్యతిరేకేణ కలాః కాలత్రయేఽపి చ।**
**న తిష్ఠన్తి తతో మిథ్యా తమీడే మృడ మీశ్వరమ్॥ 20**

ప్రతి॥ యత్ + చితి = ఏ ఆత్మస్వరూపమందు, కళాః = కళలు, కాలత్రయే + అపి + చ = త్రికాలాల్లోనూ, వ్యతిరేకేణ = వ్యతిరేకంగా, న + తిష్ఠంతి = నిలువలేవో, తతః = అందుచేత, మిథ్య = అసత్యము ఉనికి లేనిది——

## తాత్పర్యం

త్రికాలాలలోను ఆత్మకు పదహారు కళలు లేవు. అవి కేవలం భ్రాంతులే. ఆ నిష్కల ఆత్మ శ్రీ శంకర భగవానుడే. ఆయనని స్తోత్రాల ద్వారా ఆరాధిస్తాను. (ప్రశ్న 6.2)

ఎందరో మహాపండితుల ద్వారా ఆత్మ తమ తమ దృక్కోణాల నుండి వేర్వేరుగా చూడ బడింది. ప్రతిఒక్కరూ ఆత్మస్వభావాన్ని గురించి తమ దృక్కోణంనుండి చూచి అంచనాలు కట్టి వివరించారు. వాటి నన్నింటినీ గురుదేవులు క్రింద సూచిస్తున్నారు.

శ్లో॥ విజ్ఞానం క్షణికం ప్రాహు శ్శూన్య మిత్యపరే జనాః।
కలాధారం యమాత్మానం తమీడే మృడ మీశ్వరమ్॥ 21

ప్రతి॥ యం = ఏ,కళాధారం = కళల కాధారమును, విజ్ఞానం = విజ్ఞానమును అయిన, ఆత్మానం = ఆత్మను, జనాః = జనులు, క్షణికం = క్షణికమైన దిగా, ప్రాహుః = చెప్పుచున్నారో, అపరే = మరికొందరు శూన్యం + ఇతి శూన్యమని (చెప్పుచున్నారో)

## తాత్పర్యం

అన్ని కళలకు ఆధారమైన ఆత్మ కొందరిచేత "క్షణికవిజ్ఞానం" గాను, మరికొందరిచేత "శూన్యం" గాను ఎంచబడింది. ఈఅత్మే శంకరప్రభువు. ఆయనను స్తోత్రాలలో నుతిచేస్తాను.

## వ్యాఖ్య

ఆందోళనలతో నిండిన సాధకుడి మనస్సులో ఏకాత్మ అయిన అధిష్ఠానం మీద పదహారు కళలు ఆరోపింపబడుతాయి. అతడు తన మనస్సును శాంత పరచుకొన్నప్పుడు, ఆకళలన్నీ శుద్ధాత్మకలసి అదృశ్యమౌతాయి.

మలిన మనస్సుతో కూడిన గొప్పపండితులు, అశాంతితో నిండిన అచార్యులు పరమాత్మని గురించి వేరువేరు నిర్ణయాలు చేశారు. కొందరు (భౌద్ధులు) పరమాత్మ "మినుకుమనే కాంతి" అని, అది అప్పుడప్పుడు ప్రకాశమాన మౌతుందని ఎంచుతారు. విషయవస్తువుల తాలూకు అలోచనా తరంగాలు రేగినప్పుడు మాత్రం అది ప్రకటితమౌతుందని వారిభావం.

అశాంతిగా వుండే సముద్రపు పొంగుల్లో సూర్యకాంతి ప్రకాశమాన మౌతుంది.

ఇతరులు కుతర్కాలద్వారా ఆత్మ 'నాస్తి' అని లేదా శుద్ధ శూన్యమని తేల్చుకొన్నారు. వాళ్లు (భౌద్ధులు) శూన్యవాదులై శూన్యాన్నే ప్రచారం చేశారు.

ఈ రెండూ బౌద్ధులలోని రెండు శాఖలవారి ప్రతిపాదనలే. (ప్రశ్న 6.2)

శ్లో॥ అనిత్యో గుణ ఇత్యాహు ర్భూతధర్మ ఇవాపరే।
చైతన్య యత్కలాధారం తమీడే మృడ మీశ్వరమ్। 22

ప్రతి॥ యత్ = ఏ, కళాధారం = కళాధారము, చైతన్యం = చైతన్యమూ-అయిన ఆత్మను, అనిత్యః = అసత్యమయిన, గుణః + ఇతి = గుణముకల్గిన దానినిగా, ఆహుః = చెప్పుచున్నారో, తథా = అట్లే, అపరే = మరికొందరు భూతధర్మః = ప్రాణిధర్మముగ, (ఆహుః = చెప్పుచున్నారో)———

## తాత్పర్యం

అన్ని కళలకు ఆధారమైన చైతన్యరూపి ఆత్మను మృత్యువుతో కూడిన అశాశ్వతమైన గుణం కలదని కొందరంటే, అన్ని భూతాలస్వభావం కలిగినదని మరికొంద రంటారు. ఆ ఆత్మ శంకరప్రభువును నేను స్తోత్రాలలో నుతిస్తాను.

## వ్యాఖ్య

నైయాయికులు (తార్కికులు) ఆత్మ అనిత్యమని వాదిస్తారు. అది అశాశ్వతమని వారిభావం వారు పెద్ద మేధావులే. తమ తర్కాన్ని ఉపయోగించి బుద్ధికతీతమైన ఆత్మకు మృత్యు వున్నదనే నిర్ణయాలకే రాగలుగుతారు.

సత్యమైన ఆత్మ మహాభూతాలే ఆత్మ అంటారు నాస్తికులు. అవి పరస్పరం కలుసుకుంటూ విడిపోతూ ప్రపంచంలోని నామరూపాలను సృజించి నిలిపి నాశనంచేస్తాయి. ఈ భూతాలతో తయారైన శరీరమె ఆత్మ!

ఇందులో ఒక చమత్కారం వున్నది. ఆకాశాన్ని ఒక భూతం క్రింద నాస్తికులు వప్పుకోరు. మిగతా నాలిగింటినే వొప్పుకుంటారు. ఈ నాలుగింటి కలయికవల్ల శరీరం ఎర్పడగానే చైతన్యం ప్రకటమౌతుందని వారిభావం.

ఆత్మస్వభావాన్ని గురించిన ఈ వేరువేరు నిర్ణయాలన్నీ ఆయా పండితుల దృక్పథం నుండి సరియైనవి. అన్నీ బుద్ధిస్థాయిలోని నిర్ణయాలు. ఆత్మ బుద్ధికి అతీతం. అదే కాశీవిశ్వనాథుడు, శంకరప్రభువు. ఆయునను నేను ఆరాధిస్తాను.

వీటివల్ల ఆయనను షోడశకళా పురుషుడిగా భావిస్తారో ఆ పదహారు కళలను శ్రీ గురుదేవులు తరువాతి శ్లోకంలో పేర్కొంటున్నారు.

శ్లో॥ ప్రాణం తథాస్తిక్య మతిం ఖం వాయు
జ్యోతి ర్జలం భూమి మథేన్ద్రియం చ।
మనశ్చ తేనేఽతను దృగ్య ఈశ
స్స విశ్వనాథో భియ ముచ్ఛినత్తు। 23

ప్రతి॥ ప్రాణం = ప్రాణము, తథా = అట్లే, ఆస్తిక్యమతిం = ఆస్తిక్యబుద్ధి, ఖం + వాయు = ఆకాశవాయువులు, జ్యోతిః = ప్రకాశం, జలం = నీరు, భూమిం = పృథివి, అథ = తర్వాత, ఇంద్రియంచ = వాని ఐక్యరూప మయిన ఇంద్రియమును-- మనః + చ = మనస్సును, తేన = ఆ పర మాత్మచే--. అతను = బాగుగా, దృగ్యః = అనుగ్రహింపబడినవో

## తాత్పర్యం

ప్రాణం, అధికమైన దానిలో విశ్వాసం, పంచమహాభూతాలు, అయిదు జ్ఞానేంద్రియాలు - అయిదు కర్మేంద్రియాలు, మనస్సు ఇవి అన్నీ సాక్షి చైతన్యంలో వ్యవహరిస్తాయి. ఈ ఆత్మే కాశీవిశ్వనాథుడు. ఆయన నా భయా లన్నింటిని నశింపజేయునుగాక!

## వ్యాఖ్య

పదహారు కళల్లో తొమ్మిదింటిని శ్రీ తపోవనం ఈశ్లోకంలో పేర్కొన్నారు.

1. సమష్టి ప్రాణం, హిరణ్యగర్భుడు.

2. సత్యం ఉన్నదనే గొప్ప విశ్వాసం - ఎప్పుడూ ఏదో ఒకటి చురుకుగా జరిగే భౌతిక సంఘటనలకు ఆధారంగా సత్యం ఉన్నదనే శ్రద్ధ

3–7 ప్రపంచంలోని నామరూపాలను నిర్మించడానికి ఉపయోగపడే అయిదుభూతాలు. శబ్దగుణం కలిగిన ఆకాశం, శబ్దస్పర్శగుణాలతో

కూడిన వాయువు, శబ్ద స్పర్శరూపాలనే మూడు గుణాలున్న అగ్ని, శబ్ద, స్పర్శరూప రసాలనే నాలుగు గుణాలున్న నీరు, శబ్ద స్పర్శ రూప రస గంధాలనే అయిదు గుణాలున్న పృథివీ, ప్రపంచంలోని అన్ని స్థూల రూపాల నిర్మాణానికి ప్రకృతి ఈ పంచమహాభూతాలను వాడుతుంది.

8. సూక్ష్మభూతాలనుండి తయారయ్యే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు.

9. జ్ఞానేంద్రియాలు అయిదూ పంపే దృశ్యాలను సమీకరించేది, బుద్ధినిర్ణయాన్ని కర్మేంద్రియాలకు పంపించేది అయిన ఏక ఉపకరణం మనస్సు. బాహ్య ప్రేరకాలకు వ్యక్తి ప్రతిస్పందనలను వ్యక్తీకరించేది మనస్సే.

స్థూల సూక్ష్మ భూతాలనుండి ఇవన్నీ తయారైన కూటమి నిజమే అయితే మానవుడి ఇంద్రియాలు, మనస్సు సచేతన మైనవి అందుచేత వాటికి కదలికను చైతన్యాన్ని ఇచ్చేది యేదో ఒకటి అక్కడుండాలి. అదే ఆత్మ. అశరీరసాక్షి, శుద్ధచైతన్యం అయిన శ్రీ విశ్వనాథుడు. ఆయన నా భయాలను నివారించి అభయప్రదమైన మోక్షాన్ని ప్రసాదించును గాక!

రాబోయే శ్లోకంలో పదహారు కళల్లో మిగిలిన ఏడు – కళలూ వివరింప బడుతున్నాయి.

శ్లో॥ అన్నం బలశ్చైవ తపశ్చ మంత్రాః
కర్మాథ లోకాశ్చ తతోఽభిధానామ్।
ఇత్థం కలాష్షోడశయ స్ససర్జ
స విశ్వనాథో భియ ముచ్ఛినత్తు॥ 24

ప్రతి॥ అన్నం = అన్నము, బలం + చ + ఏవ = బలమును, తపః + చ = తపస్సు, మంత్రాః = మంత్రాలు, కర్మ = కర్మయు, అథ = మరియు, లోకాః + చ = లోకాలును, తతః = అటుపిమ్మట, అభిధానాం = పేర్లను, ఇతం = ఇట్లు, షోడశకళాః = పదునారుకళలను, యః = ఏపరబ్రహ్మ, ససర్జ = సృష్టించెనో, సః = అతడు, విశ్వనాథః = విశ్వేశ్వరుడు, భియం = భయమును, ముచ్ఛినత్తు = పోగొట్టుసుగాక!

## తాత్పర్యం

అన్నం, బలం, నిరంతర తపస్సు, మంత్రాలు, కర్మలు, లోకాలు, నామరూపాలు. ఈ పదహారింటిని సృజించే ఆత్మ కాశీవిశ్వనాథుడు. ఆయన అన్ని భయాలను నివారించునుగాక!

## వ్యాఖ్య

మిగతా ఏడు కళలు ఇందులో పేర్కొనబడినాయి.

10. అన్నం—మనస్సు ఇంద్రియాలతో కూడుకొన్న వాడు బ్రతకడానికి అన్నం అవసరం.

11. బలం—ఆహారాన్ని తిని జీర్ణంచేసుకొని సరిగా ఉపయోగించుకొన్న వానికి ఆలోచించి, ఒక ప్రణాళిక వేసుకొని పనిచెయ్యడానికి బలం వస్తుంది.

12. తపస్సు—యోచించె మనస్సుయొక్క శక్తి వృథకాకుండా చురుకుగా సమర్థతతో వ్యవహరించేట్లుగా వివేకంతో ఆత్మనిగ్రహంతో ఉండడం తపస్సు.

13. మంత్రాలు— శక్తితో సంపన్నమైన మనస్సు మళ్ళీ సంశయం, చాంచల్యంలో పడకుండా నిర్ణీత ప్రయోజనం వైపుకు నడిపించాలి. ఇవే మంత్రాలు. విజయం సాధించేవరకూ ఏరుకున్న ఆలోచనలో నిలిపి వుంచుకోడానికి తోడ్పడేవి.

14. కర్మ—ఇలా స్థిరమైన వ్యక్తిత్వం క్రమబద్ధమైన తనశక్తిని బాహ్య ప్రపంచంలో చేతలలో చూపగలదు – ఇది కర్మ.

15. లోకాలు—కర్మలు పైప్రకారంగా చేయగా అవి ఫలాలని ప్రసాదించి వాటిని అనుభవించడానికి తయారుచేసే రంగాలు.

16. నామరూపాలు—అనుభవరంగంలో ఉండే వస్తువులు, వ్యక్తులు. ఇవి లేని అనుభవరంగం ఉండదు.

ఈ పదహారింటిని ఉపనిషత్తులో మొదటిసారి చదవగానే సాధకుడు డీలాపడుతాడు. ఆందోళన కలుగుతుంది. వాటికి ఉన్న పరస్పరసంబంధం అర్థమైతే వాటి వెనుకవున్న సత్యం మనకు గోచర మవుతుంది. (ప్రశ్న 6. 4)

శ్లో॥ స్వకారణే యత్ర కలా స్సమగ్రా
రూపంచ నామాత్మవిదాం విహాయ।
ఏకీభవం త్యంబునిధౌ యథాప
స్స విశ్వనాథో భియ ముచ్ఛినత్తు॥ 25

ప్రతి॥ యథా = ఎట్లు, అపః = నీరు, అంబునిధౌ = సముద్రమంధ ,ఏకీభవంతి = ఒకటిగానవుచున్నదో, యత్ర = ఎచ్చట, సమగ్రాః + కలాః = అన్ని కళలు, స్వకారణే = తనకారణముగనే, ఆత్మవిదాం = ఆత్మబోధకల వానియొక్క, నామ = పేరును, రూపం + చ = రూపాన్ని, విహాయ = విడిచి, ఏకీభవంతి = ఒక్కటవుచున్నవో, సః = ఆ, విశ్వనాథః = విశ్వేశ్వరుడు, భియం = భయాన్ని, ఉచ్ఛినత్తు = పోగొట్టుగాక!

తాత్పర్యం

నదులలో ప్రవహించే నీరు ఎలా సముద్రాన్ని చేరుకొని అదృశ్యమై సముద్రంగా మారుతోందో అలాగే ఆత్మవిదునిలోని అన్ని కళలు మాయమై ఏకాత్మ అవుతుంది. ఆ ఆత్మ కాశీవిశ్వనాథుడు నన్ను అన్ని భయాలనుండి రక్షించునుగాక!

వ్యాఖ్య

పై ఉపమానం సాధకుడికి ఎంతలోతైన అర్థాన్నో స్పష్టంగా వివరిస్తుంది. గంగ, కృష్ణ, కావేరి, అమెజాను, నైలు మొదలైన అన్ని నదులు సముద్రాన్ని చేరుకున్నాక తమ ప్రత్యేకతలను,పేర్లను విడనాడి సముద్రంలో ఏకమవుతాయి అలాగే సంభవించే మనస్సులో వ్యక్తమయ్యే అన్ని కళలూ ధ్యానంలో మనస్సు శాంతమై, చురుకై ఆత్మానుభవానికి ఎదురుచూచే సమయంలో దివ్య అనంత చైతన్య రూపాత్మలో అదృశ్య మౌతాయి. ఆత్మ ఏకమై నిలిచిపోతుంది.

ఆత్మను గుర్తించని అవిద్య కళలభ్రాంతిని కలిగిస్తుంది. ఆత్మను సాక్షాత్కారం చేసుకొన్న మహాత్మునిలో అవిద్య అంతమౌతుంది. దానితోబాటు మిథ్యాభ్రాంతులన్ని అనంత దివ్య పరమాత్మానుభవంలో మాయ మవుతాయి. ఆ అనుభవస్థానమే కాశీవిశ్వనాథుడు, సామ్య కాశిశుడు. ఆయన నాభయా లన్నింటిని తొలగించి అభయపదమైన కైవల్యాన్ని ప్రసాదించును గాక! (ప్రశ్న 6. 5)



# ఆరవ స్తబకం

ఈ స్తబకంలో శ్రీ గురుదేవులు ముండకోపనిషత్తుయొక్క, భావాలను వివరిస్తారు. ఈ ఉపనిషత్తు అథర్వణవేదంలోని శౌనకేయ శాఖకు చెందినది. ఈ శీర్షిక వేదాలలో వర్ణించబడిన 'శిరోవ్రతాన్ని' గురించి తెలుపుతుంది. పవిత్రమైన అగ్నిని ఉంచిన కుండను ముండనం చేసిన తలపైన పెట్టుకొని బ్రహ్మచారి తీసుకొని వెళ్ళాలి. అంటే శారీరకంగా అలా నడవాలని అర్థంకాదు. ఆధ్యాత్మిక జిజ్ఞాసతో బుద్ధి దహించుకొని పోతున్న సాధకుడే ఈ ఉపనిషత్తుని అర్థం చేసుకోడానికి అర్హుడని సూచన. ఇది మంత్రోపనిషత్తు. ఈ ఉపనిషత్తులో నిగూఢంగా ఉన్న అర్థాలను, సూచితమైన గుహ్యవిషయాలను ప్రశ్నోపనిషత్తు సూటిగా వాచ్యంగా వివరిస్తుంది.

**శ్లో॥ యత్స్వరూపం న నిర్ణేతుం దేశికోపనతిం వినా।**
**శక్యతే పండితే నాపి శం కరోతు స శంకరః॥** 1

ప్రతి॥ యత్ + స్వరూపం = ఏ ఆత్మస్వరూపాన్ని, దేశిక + ఉపనతిం + వినా = గురూపదేశం లేకుండా, నిర్ణేతుం = నిర్ణయించడానికి, పండితేన + అపి = పండితునిచే కూడ, న + శక్యతే = సాధ్యముకాదో, సః = అట్టి ఆత్మస్వరూపుడైన, శంకరః = శంకరుడు, శం = శుభమును, కరోతు = కల్గించుగాక!

తాత్పర్యం

గురుసహాయం, నిర్దేశం లేకుండా ఎవరి స్వభావాన్ని అతితెలివైన పండితుడు కూడా తెలుసుకోలేడో ఆ ఆత్మ శంకరుడే. ఆయన నాకు ఆధ్యాత్మికానందాన్ని ప్రసాదించుగాక!

## వ్యాఖ్య

ఆత్మ మాటల కందరానిది. జీవితంలో అనుభవానికి వచ్చినవో, లేదా అతిదగ్గరలో ఉన్నవో, లేదా పరస్పరం కలిసి అనుభవాలు పొందుతున్నవో అయితే అలాంటి విషయాలను వర్ణించడానికి భాషలో సరైన మాటలున్నాయి. శరీరమనోబుద్ధులకు అతీతమైన ఆత్మానుభవాన్ని పొందిన గురువు శిష్యులకు చెప్పవలసి వచ్చినప్పుడు మామూలు భాషనే వాడవలసి వస్తుంది. పదాలు నిర్వీర్యం, నిరుపయోగం అయిపోయినా వాటినే వాడి శిష్యులకు బోధించాలి. లేదా మౌనంగా ఉండాలి. మౌనసందేశాన్ని శిష్యులు అర్థం చేసుకోలేరు— వాళ్ళకు మాటలద్వారా చర్చించడం అవసరం. అలాంటి వాదాలద్వారా వాళ్ళ బుద్ధిలో ఆత్మనుగురించి ఒక నిశ్చితమైన ఊహని ఏర్పరచుకొని శ్రద్ధను పెంచుకోవాలి.

భావగర్భితమైన పదాలను వాడుతూ వేదాంతగ్రంథాలు ఈ అద్భుతాన్ని సాధిస్తాయి. వాచ్యమైన అర్థాలకన్న భిన్నమైన దివ్యార్థాలను సూచించే సాహిత్యాన్ని నిగూఢ సాహిత్య మంటారు. ఇట్టి నిగూఢత ద్వారా అన్ని మత గ్రంథాలు ఈ పరమసత్యాన్నే విజయవంతంగా చాటుతున్నాయి.

అందువల్ల లోతైన ఈ లక్ష్యార్థాలను తెలుసుకోడానికి గురుశిక్షణ పొందిన ఒక గురువుయొక్క సాన్నిధ్యం కావాలి.

కేవలం బుద్ధిస్థాయిలో ఆ శాస్త్రాలలోని వాచ్యార్థాలను మాత్రం తెలుసుకొంటే అవి సూచితార్థాలను పూర్తిగా మూసివేస్తాయి. "అక్షరాలు అర్థాలను చంపడం" అంటే ఇదే. అది వైరుధ్యాలలోకి దించి సాధకులకు అర్థంకాక సిగ్గుపడవలసినంత గందరగోళాలను సృజిస్తుంది.

ఎంత విశారదుడైన పండితుడికైనా సద్గురువుసహాయంతోనే తెలియబడదగిన ఆత్మ ఏదో ఆ ఆత్మ శ్రీ శంకరుడే. ఆయన అందరికీ మంగళాన్ని ప్రసాదించును గాక! (ముండక 1. 1. 2)

శ్లో॥ జ్ఞాతే యస్మిన్ జగత్సర్వం జ్ఞాతం భవతి భావుకః
సర్పరజ్జువ దాధార శ్శం కరోతు స శంకరః॥ 2

ప్రతి॥ సర్పరజ్జువత్ = త్రాడుసుజూచి పాముగా భావించునట్లు, జ్ఞాతే + యస్మిన్ = ఏ ఆత్మజ్ఞానమునందు, జగత్ + సర్వం = విశ్వమంతయు, జ్ఞాతం = తెలియబడినదిగా, భవతి = అగుచున్నదో, భావుకః = భావించువాడును, ఆధారః = జగదాధారుడును—అయిన——

## తాత్పర్యం

ఎలాగైతే త్రాడును తెలుసుకోగానే భ్రాంతిమూలకమైన పాము, దాని వలన కలిగే భయాలు సర్వమూ వెంటనే నశించిపోతాయో అలాగే ఏది తెలుసుకుంటే మారిపోయే నామరూప జగత్తు యావత్తు మిథ్య అని తెలుస్తుందో—ఆ అనుగ్రహమూర్తి ఆత్మ, సుఖదుఃఖదాయకమైన మంగళస్వరూపం శంకర ప్రభువే! ఆయన అందరికీ సంతోషాన్ని కలిగించును గాక!

## వ్యాఖ్య

అధ్యారోపమైన పాము, దానివల్ల ఉద్భవించే భ్రాంతిపూర్వక దుఃఖాలు, పాముయొక్క అధిష్ఠానమైన త్రాడు చూచినప్పుడు మనస్సునుండి తొలగిపోతాయి. జాగృతస్థితిని అర్థం చేసుకోగానే యావత్స్వప్న ప్రపంచము దాని పీడలు, బాధలు సునాయాసంగా తొలగిపోతాయి. అలాగే ఆత్మను తెలుసుకోగానే మిథ్య అయిన జీవభావము, దాని దుఃఖాలు నశించిపోతాయి. ఆ ఆత్మే శంకరుడు (ముండక 1. 1. 3)

శ్లో॥ పరావిద్యైవ యత్ప్రాప్తౌ సాధనం కర్మకోట యః।
కుంఠీ భవన్తి యస్యాగ్రే శం కరోతు స శంకరః॥ 3

ప్రతి॥ యత్ + ప్రాప్తౌ = ఏఆత్మస్వరూపాన్ని పొందుటయందు, పరవిద్యా + ఏవ = బ్రహ్మవిద్యయే, సాధనం = ఉపకరణమో, యస్య + అగ్రే = ఏ ఆత్మస్వరూపముముందు, కర్మకోటయః = కోట్లకొలదిగాగల కర్మలు కుంఠీభవంతి = మొక్కబోవునో——

## తాత్పర్యం

ఈ ఆత్మ జ్ఞానాన్ని పొందడానికి పరావిద్య ఒక్కటే సాధనం, కోటికర్మలైనా దేనిముందు కుంచించుకు పోతాయో ఆ ఆత్మ శంకరుడు అందరికి సుఖాన్ని కలిగించును గాక!

## వ్యాఖ్య

వెనక శ్లోకంలో సాక్షాదనుభవం వల్లనే ఆత్మ పదాన్ని యావత్తు ప్రపంచ బాహుళ్య రహస్యాన్ని తెలుసుకోగలుగుతారని చెప్పబడింది. ఆత్మ సాక్షాత్కారాన్ని ఎలా పొందవచ్చునో ఈ శ్లోకం వివరిస్తుంది.

భగవత్పదంలోకి మేల్కొనడానికి ఆత్మధ్యానమే సరైన మార్గమని, ఎంత దీక్షతో విశ్వాసంతో ఆచరించినా కర్మ ఆత్మపదానికి తీసుకువెళ్ళదనే ముండకం చెప్పినట్లే గురుదేవులు కూడా ఒత్తిచెబుతారు.

కర్మమార్గంలో దృష్టిని బాహుళ్యం వైపుకి త్రిప్పాలి శరీరమనోబుద్ధుల పరికరాలద్వారా కర్మ చేయబడాలి. ప్రతికర్మ సుఖాన్నో దుఃఖాన్నో కలిగిస్తుంది, ఉదాత్త వాసనలను చేకూర్చుతుంది. అంతవరకే. పరిమితులతో కూడిన కర్మ అనంతఫలాన్ని ఇవ్వలేదు ధ్యానం చేసినప్పుడు విషయ -- ఉద్రేక-తలపుల బాహుళ్యంనుండి దృష్టి మళ్ళిపోయి పూర్తిగా ఆత్మవైపుకు తిరుగుతుంది.

ధ్యానం కూడా పరిమితులతో కూడినదే. ధ్యానంవల్లనే ఆత్మ లభ్యంకాని మాట నిజమే. కేవలం పరిమితమైన ధ్యానప్రక్రియవల్ల అనంతాత్మానుభవం లభించదు. ధ్యానంద్వారా సాధకుడు ఎక్కువ స్థైర్యాన్ని, ప్రశాంతతను పొందుతాడు. అపుడతని వ్యక్తిత్వం అర్థవంతమైన నిశ్శబ్దతరంగాల సాన్నిధ్యాన్ని అనుభవిస్తుంది. ఆ సమయంలో వాసనలు కాలి నశించిపోతాయి. అవి కోరికలు--తలపులు--అందోళనలను సృజించలేవు. ఇలా ధ్యానాగ్నిలో వాసనలు కాలిపోయి శుద్ధమైన మనస్సు శాంతమై, జాగృతమై, ఆత్మకోసం ఎదురు చూస్తూంటుంది. ధ్యానస్థితమై లోతులలోకి సహజంగా దిగుతుంది.

ఈ ప్రకారంగా వాసనలు సమసిపోయాక ఆలోచనలు ఆగిపోయి మనో బుద్ధుల పరికరం నశించి, అంతవరకు తన ఆలోచనల వలలో ఊహాజాలంలో చిక్కుకు పోయివున్న జీవుడు విడివడి తన శుద్ధచైతన్య స్వరూపాన్ని తెలుసుకుంటాడు. ఇదే "విద్య" అంటే, ఆత్మస్వభావాన్ని గురించి ధ్యానించే మార్గం. దివ్యాత్మలోకి ఎగిరి ప్రవేశించే చివరి విహారం.

ఆ ఆత్మే శ్రీ శంకరుడు. ఆయన సర్వులకు ఆనందాన్ని మంగాళాన్ని కలిగించును గాక!

శ్లో॥ దృశ్యగ్రాహ్యేతరో గోత్రవర్ణహీనశ్చ యో విభుః।
చక్షుః శ్రోత్ర వినిర్ముక్తః శం కరోతు స శంకరః॥ 4

ప్రతి॥ చక్షుః + శ్రోత్ర = కన్నులు చెవులచే, వినిర్ముక్తః = గ్రహింపబడడో, దృశ్య = కంటిచూపుచే, గ్రాహ్య + ఇతరః = గ్రహింపబడనివాడో, గోత్రవర్ణహీనః + చ = కుల గోత్రాలునులేనివాడో—అయిన, యః = ఏ, విభుః = ప్రభువయితే (ఉన్నాడో) సః = ఆ, శంకరః = శంకరుడు, శం = శుభమును, కరోతు = కల్గించుగాక.

## తాత్పర్యం

ఏవరినైతే కన్నులుచూడలేవో చెవులు వినలేవో, ఎవరికి కులగోత్రములు లేవో, ఆయనే అన్నిటికి ప్రభువైన శంకరుడు. అందరకు శుభమును చేకూర్చు గాక!

## వ్యాఖ్య

ఎవరి చైతన్యకాంతితో కన్నులు చూస్తాయో, చెవులు వింటాయో, ఎవరిని కన్నులు చూడలేవో, చెవులు వినలేవో, ఆయనే చిత్‌స్వరూపుడైన, ఆత్మ. జ్ఞానేంద్రియములద్వారా ఆత్మ తెలియబడదు. ఒకడు టెలిస్కోపు ద్వారా దూరముగనున్న వస్తువులను చూడవచ్చు. కాని, ఆపరికరము తన్ను చూప లేదు. ఏ ఆత్మకాంతితో, కన్నులు చూడగలవో, చెవులు వినగలవో, ఆ ఆత్మకు కులగోత్రములు లేవు ఆ ఆత్మ స్వరూపమే శంకరప్రభువు. ఆయన సదా అందరకు శుభమును కలుగుచేయుగాక! (ముండకో 1. 1. 6)

శ్లో॥ ఊర్ణనాభి ర్యథా తంతూన్ సృజతే సంహరత్యపి।
ఏవం య స్సృజతే లోకాన్ శం కరోతు స శంకరః॥ 5

ప్రతి॥ యథా = ఎట్లు, ఊర్ణనాభిః = సాలెపురుగు, తంతూన్ = దారాలను, సృజతే = సృష్టించుకొనునో, సంహరతి + అపి = కూల్చివేయునో, ఏవం = ఇట్లు, యః = ఏ పరమాత్మ, లోకాన్ = లోకాలను, సృజతే = సృష్టించి, (సంహరతి + అపి = నాశంచేయునో)——

## తాత్పర్యం

ఎలాగైతే సాలీడు తనలో నుండే దారాన్ని వెలికితీసి మ్రింగివేస్తుందో అలాగే ఎవరినుండి అన్నిరంగాల అనుభవాలు వెలికి వస్తాయో ఆ ఆత్మ శ్రీ శంకరుడు అందరికి మేలొనరించును గాక!

## వ్యాఖ్య

సాలీడే తంతువులు. దాని ఉమ్మి తంతువులుగా బైటకివచ్చి గూడుగా అయి మళ్ళీ దానిలోకి మ్రింగబడుతాయి. చక్కగా పొందికగ అమరిన గూడుకు సాలీడే ఉపాదాన కారణం, నిమిత్తకారణం కూడా. చివరకు తంతువులు సాలీడులోకే చేరిపోతాయి. అలాగే ప్రపంచ నిర్మాణంలో పరమాత్మే ఉపాదాన నిమిత్త కారణాలు రెండూను. మేలుకున్నవాని మనస్సులోంచి కల వస్తుంది. తిరిగి అందులోనే కరిగిపోతుంది. (ముండక 1. 1. 7.)

శ్లో॥ తపసా చీయమానాద్వై యస్మాత్సూత్రాదికం జగత్।
ప్రాదుర్భవతి విశ్వేశః శం కరోతు స శంకరః॥ 6

ప్రతి॥ తపసా = తపస్సుచేత, చీయమానాత్ = సంపాదింపబడ్డ—, యస్మాత్ = ఏ ఆత్మజ్ఞానమువలన, సూత్రాదికం + జగత్ = సూక్ష్మమైనజగత్తు మొ॥ ప్రాదుర్భవతి = కల్గుచున్నదో, విశ్వేశః = సర్వేశ్వరుడైన, సః = ఆ, శంకరః = శంకరుడు, శం = సుఖమును, కరోతు = చేయుగాక!

## తాత్పర్యం

తపస్సుద్వారా విస్తరించుకొన్నప్పుడు ఏ ఆత్మనుండి హిరణ్యగర్భుడు జీవుళ్ళు బయల్వెడలుతారో ఆయన శంకరప్రభువే. ఆయన అందరికీ ఆధ్యాత్మికానందాన్ని ప్రసాదించును గాక!

## వ్యాఖ్య

ఏ చలనమూ లేకుండా శుద్ధమైన ఆత్మ అనేకంతో కూడిన ప్రపంచంగా మారదు—ఈ చలనం నిరపాయమైన ఒక కోరికవల్ల కలిగింది. దానిని ఆత్మ యొక్క దివ్యసంకల్పమని ఋషులు వర్ణించారు. "ఏకమైన నేను అనేకంగా ఎందుకు కారాదు?" అన్న ❋ సృష్టిసంకల్పంతో ఆయన సమిష్టికారణమైన ఈశ్వరుడు, సమిష్టి సూక్ష్మం సృష్టికర్త అయినాడు. విషయవస్తువుల్ని అనుభవించాలనే ఆదుర్దాతో జీవుడైనాడు. పరిమితుడైన జీవుడుగా ఆత్మ తన్నుతాను మరచి ప్రపంచబాహుళ్య భ్రాంతులలో బాధపడుతున్నా ననుకొంటుంది.

ఈ ఆత్మ శంకరప్రభువే. ఆయన అందరికీ మంగళాన్ని చేకూర్చుసు గాక! (ముండక 1. 1. 8)

ఇంతవరకు మొదటి అధ్యాయంలోని మొదటిఖండము భావాలను తెలుసుకున్నాము. ఇక ముందు దాదాపు పన్నెండు శ్లోకాలలో శ్రీ తపోవనం మహారాజు కర్మద్వారా మోక్షం సాధ్యపడదని వివరిస్తున్నారు. త్యాగంవల్లనే ఆత్మ పదంలోకి మేల్కొనగలం.

**శ్లో॥ కర్మణా బధ్యతే జంతు స్త్యాగేన తం విముచ్యతే।**
**విమోక్షరూపో య స్సాక్షా చ్ఛం కరోతు స శంకరః॥ 7**

ప్రతి॥ కర్మణా = కర్మచే, జంతుః = జంతువు, బధ్యతే = బంధింపబడు చున్నాడో, త్యాగేన + తు = త్యాగంచేతనయితే, విముచ్యతే = విముక్తు డగు చున్నాడో, యః = ఏ, సాక్షాత్ = ప్రత్యక్షముగా, విమోక్షరూపః = మోక్షరూపుడో——

---

❋ ఏకోఽహం బహుస్యాం!

## తాత్పర్యం

కర్మవలన అంతర్వ్యక్తిత్వం మూసుకుపోయి జీవుడు బంధనంలో పడతాడు త్యాగంవల్ల అతడు విముక్తు డౌతాడు సాక్షాత్తు విమోక్షస్వరూపమైన ఆ శంకరుడు అందరికీ సుఖాన్ని ప్రసాదించుచు గాక!

## వ్యాఖ్య

అహంకారంతో స్వార్థకామనలతో కూడుకొని కర్మలను చేసినప్పుడు వాసనలు మరింత పెరుగుతాయి అవి తిరిగి తిరిగి అవే కర్మలను చేయడానికి ప్రేరేపిస్తాయి ఇదే అలవాటు అంటే మనలో వెనకటి వాసనలు ఎంతగా గూడుకట్టుకొని పోయివున్నాయంటే మన మంచితనం, నేర్పు, కర్మను ఏరుకునే స్వాతంత్ర్యం అన్ని వాటివల్ల కోల్పోతున్నాము పూర్వకర్మలు పెట్టిన ఒరవడిలో జీవించె యంత్రాల మైపోయాము

అందుచేత స్వార్థకర్మలు మన యోచనా విధానాన్ని బాహ్యానుభవాలకు, స్పందించే విధానాన్ని కూడా కట్టుదిట్టంచేసి బంధిస్తాయి

త్యాగం వ్యక్తిత్వాన్ని విడుదలచేస్తుంది. త్యాగమంటే మనం నివసించే సమాజంపట్ల కర్తవ్యాన్ని, బాధ్యతను మర్చిపోవడం, విసర్జించడం కాదు మన దైన దానిని మనం త్యాగం చెయ్యవచ్చును సమాజం మనది కాదు అహంకారం, స్వార్థం పూర్తిగా మనవి ఆ రెంటినీ త్యాగంచేసి మనం వివేకంతో వ్యవహరించాలి. స్వార్థం అహంకారం లేకపోతే మనిషికి సమర్థత పోతుందని కొందరిలో ఒకభావం ఉన్నది అది నిజం కాదు శాశ్వతమైన, ఉత్తమమైన లక్ష్యాలు ఉన్న అన్ని కార్యాలూ ప్రేమతో ఉత్తేజనం పొందిన హృదయాల నుండి జనించిన కర్మలవల్లనే సాధింపబడ్డాయి.

త్యాగంవల్ల ప్రస్తుతం ఉన్న వాసనలు కరిగిపోతాయి శాంతించిన మనస్సు ధ్యానసమయంలో ఎంతో స్థిరత్వాన్ని నిలకడను పొందుతుంది సాధకుడు ఆత్మకైవల్యపదంలోకి విహరించి నివసింపసాగుతాడు. పరిపూర్ణ ముక్తిని పొందుతాడు

ఈ ఆత్మపరమైన శంకరుడు అందరికీ సుఖాన్ని ప్రసాదించును గాక! (ముండక 1. 2. 1.)

శ్లో॥ ధర్మాధర్మౌ సముత్సృజ్య యత్కృపానౌకయా బుధః।
ఉత్తితీర్షే ర్భవాంభోధిః శం కరోతు స శంకరః॥ 8

ప్రతి॥ బుధః = జ్ఞాని, ధర్మ + అధర్మౌ = ధర్మాధర్మాలను, సమ్ + ఉత్సృజ్య = బాగుగావదలి, యత్ + కృపా = ఎవనికృపయనెడి, నౌకయా = నౌకచేత, భవ + అంభోధిం = సంసార సాగరమును, ఉత్ + తితీర్షేత్ = దాటునో——

## తాత్పర్యం

మంచిచెడూ కర్మలనుండి ఉద్భవించే పాపపుణ్యాలకు అతీతులై ఎవరి కృపానావ సహాయంతో సంసారసముద్రాన్ని వివేకులు తరించగోరుతారో ఆ శంకరుడు సర్వులకూ సుఖాన్ని కలిగించును గాక!

## వ్యాఖ్య

మంచిచెడూ కర్మలు సృజనాత్మక వినాశాత్మక వాసనలను సృష్టిస్తాయి పూర్వకర్మ ఫలితాలైన వాసనలు "నేను కర్తను" అని భావించే వానినే తాక గలవు. ఈ అహంభావాన్ని త్యజించినప్పుడు వాసనలు అతనిని ఏమీ చేయలేవు. ఇలా శుద్ధమైన మనస్సుతో బుద్ధిమంతులైన సాధకులు ఆత్మానుగ్రహంవల్ల మోక్షాన్ని పొందగోరుతారు. ఆ ఆత్మ స్వరూపం శంకరుడే. (ముండక 1. 2. 7)

శ్లో॥ అవిద్యా తమసి భ్రాంతా మూఢాః పండితమానినః।
పీడ్యంతే యత్పదభ్రష్టాః శం కరోతు స శంకరః॥ 9

ప్రతి॥ అవిద్యా = అవిద్యఅనెడి, తమసి = చీకటియందు, భ్రాంతాః = కొట్టు మిట్టాడు, పండితమానినః = ఆభాసపండితులు, మూఢాః = మూర్ఖులు, యత్ + పద = ఏ శివాత్మ పదమునుండి, భ్రష్టాః = భ్రష్టులై, పీడ్యన్తే బాధింపబడుచున్నారో——

### తాత్పర్యం

తమ అజ్ఞానంవల్ల పీడింపబడుతూ భ్రాంతులైన మూర్ఖులు తమ్ముతాము పండితుల మనుకొంటూ ఏ ఆత్మపదం నుండి పతనమై ప్రాపంచిక దుఃఖాల ననుభవిస్తారో ఆ ఆత్మయైన శంకరప్రభువు అందరకు ఆనందాన్ని ప్రసాదించును గాక!

### వ్యాఖ్య

శుద్ధాత్మను ఎరగనందున భ్రాంతిపూర్వకమైన మిథ్యాబాహుళ్యంలో సంచరిస్తూ పరిమిత జీవుల్లుగా ఉంటూ వారల దర్పాభిమానాలవల్ల ఊహించుకున్న దుఃఖాలతో బాధపడతారు. గ్రుడ్డిగా చెవులు బ్రద్దలుకొట్టే పాండిత్యపు మ్రోతతో, చెకచెకలాడే పదాల సమూహంతో పెద్ద పండితులమని భావిస్తారు. శుద్ధచైతన్యపదాన్ని సాక్షాత్కారం చేసుకొనే సులువును పోగొట్టుకొంటారు. ఆ ఆత్మ శంకరప్రభువే. ఆయన అందరికీ దివ్యానంద ప్రసాదాన్ని అనుగ్రహించును గాక! (ముండక 1. 2. 8)

**శ్లో॥ ఇష్టాపూర్తశ్రేష్ఠ మాహూ ర్యే జనాః కామకామినః।**
**భ్రమంతి తే పదభ్రష్టా శ్శం కరోతు స శంకరః॥ 10**

ప్రతి॥ కామకామినః = కోర్కెలుకోరు, యేజనాః = ఏ జనులయితే, ఇష్టాపూర్తం ఇష్టాపూర్తములగు కర్మను, శ్రేష్ఠం = గొప్పదానినిగా, ఆహుః = చెప్పుచున్నారో, తే = అట్టి, పదభ్రష్టాః = ఈశ్వరస్థానమునుండి తొలగినవారై భ్రమంతి = తిరుగుచున్నారో——

### తాత్పర్యం

ఇష్టకర్మలు, పూర్వకర్మలు శ్రేష్ఠమైనవని కోరికలతో సతమతమయ్యే వాళ్లు భావిస్తారు. అత్యుత్తమపదాన్ని అందుకోలేక భ్రష్టులై సంసారంలో భ్రమించుతారు. ఆ అత్యుత్తమ ఆత్మపదం శ్రీ శంకరప్రభువు అందరికీ మంగళాన్ని కలిగించును గాక!

### వ్యాఖ్య

వైదికవాఙ్మయంలో 'ఇష్టా పూర్తాలు' అనే పదాలు ప్రత్యేకమైన కర్మలను సూచిస్తాయి యజ్ఞయాగాదులను చేయడంవల్ల పుణ్యం లభిస్తుంది. ఈ కర్మలని 'ఇష్టము' అంటారు పాఠశాలలు, కళాశాలలు నడిపించడం, నూతులు చెరువులు త్రవ్వించడం, విహారప్రదేశాలు ఏర్పాటుచేయడం, అన్నదానం, సమాజసేవ – ఇతర ఉదారసేవాకర్మలు 'పూర్తం' అనబడుతాయి ఇలాంటి కర్మలుచేయడంవల్ల ఎంతో పుణ్యప్రదాలైన వాసనలు ఏర్పడుతాయి. ఈరెండు రకాల కర్మలద్వారా ఈ లోకంలోనో, స్వర్గంలోనో సుఖసంపన్నమైన జీవితాన్ని ఫలంగా పొందుతారు, అయితే ఆత్మను తెలుసుకోనిదే ముక్తిమాత్రం దొరకదు శుద్ధచైతన్యపదంలో మేలుకొనే అనుభవాన్ని పొందకుండా ఆ వ్యక్తి ఇంకా భ్రాంతిపూర్వక ప్రాపంచిక సుఖాలలోనే మునిగివుంటాడు. ఆ ఆత్మపదమైన శంకరప్రభువు అందరికి సుఖాలను ప్రసాదించును గాక (ముండక 1 2 10)

శ్లో॥ తపస్యంతో వనాంతేషు భిక్షవ శ్చాది జాన్తికమ్।
ప్రవజన్తి యత్పదభ్రష్టా శ్శం కరోతు స శంకరః॥ 11

ప్రతి॥ వనాంతేషు = అరణ్యాల్లో, తపస్యంతః = తపస్సుచేసుకొంటూ, భిక్షవః + చ = బిచ్చగాండ్రై, యత్ = ఏపరమేశ్వరుని, పద = స్థానమునుండి, భ్రష్టాః = తొలగినవారలై, ఆదిజ + అంతికం = జన్మసహజమైన తమకు తాముగా, ప్రవజంతి = తిరుగుచున్నారో———

### తాత్పర్యం

త్యాగజీవులు సంసారం వదలి అరణ్యాలలోకి ప్రవేశించి తపస్సు చేస్తూ భిక్షాజీవనం గడుపుతూ ఉండిపోతారు కాని వాళ్ళు పరమాత్మను సూటిగా అందుకోలేక సంచరిస్తారు ఆపదమైన శంకరప్రభువు అందరికీ సుఖశాంతుల్ని ప్రసాదించుము గాక!

## వ్యాఖ్య

సంసారాన్ని త్యజించినవారు, వానప్రస్థులు అరణ్యాలకు వెళ్లి తపస్సు చేసుకొంటారు ఆ కారణంగా వారికి పుణ్యం వస్తుంది ఆ పుణ్యం వారిని సృష్టికర్త హిరణ్యగర్భుని ❋ లోకానికిమాత్రమే తీసుకువెళుతుంది. అక్కడ సూక్ష్మసూఖాలను అనుభవిస్తూ వేదాలను గురించి ఉత్తమోత్తమాధికారియైన బ్రహ్మదేవుని వద్ద వేదాంతోపన్యాసాలు వింటూ ప్రళయకాలంలో బ్రహ్మలోకం లయమైనప్పుడు బ్రహ్మదేవునితో సహా పరమాత్మలో కలిసిపోతారు.

వాళ్లుచేసే తపస్సు ఉత్తమమైన కర్మ అయినప్పటికీ, దానికి ఫలం ఉన్నందున వాళ్లు ఆత్మని సూటిగా చేరుకోలేకపోతారు బ్రహ్మలోకాన్ని మాత్రమే అందుకోగలరు క్రమముక్తిలో కూడా సాధకులు సూటిగా ఆత్మని అందుకోలేక ఇలా వంచితులౌతారు ఆ చిట్టచివరి పరమపదం ఏది వున్నదో అది శంకరప్రభువే. (ముండక 1. 2. 11)

కర్మ ఉపాసనల చివరిగమ్యం బ్రహ్మలోకమే కాని పరమాత్మ కాదు. ఈసంగతి అర్థంచేసుకొన్న జిజ్ఞాసువులు బాహ్యవిషయస్పర్శల వలన జనించే అన్ని సుఖాలపట్ల పరమవైరాగ్యాన్ని పొందుతారు. అంటే ఇహలోకంలో లభ్యమయ్యే సుఖాలే కాక, అనుభవయోగ్యాలైన ఇతర ఉత్తమలోకాలపట్ల కూడా వైరాగ్యం ఏర్పరచుకొంటారు విషయ స్పర్శలవలన లభించే సుఖం ఆద్యంతాలతో కూడింది అందుచేత ఆసుఖంతోబాటు దుఃఖంకూడా ఉంటుంది ఆత్మ మన నిజస్వభావమే. అది అద్వితీయం, జిజ్ఞాసువుకన్న భిన్నమైంది కాదు పూర్ణవైరాగ్యం పొందినాకనే దానిని గురించి జిజ్ఞాస ఏర్పడుతుంది. దానివిషయం తెలుసుకోడానికి గురువును అన్వేషించాలి.

శ్లో॥ కర్మ నిష్పాదితే లోకే నిర్విణ్ణో యద్వివత్సయా।
ఉపేయాద్ గురుపాదాబ్జం శం కరోతు స శంకరః॥ 12

---

❋ హిరణ్యగర్భుడు — బంగారుగర్భం కలవాడు. నామరూపాలన్నింటికీ మూలం సమష్టిమనస్సు ప్రపంచబాహుళ్యానికి సృష్టికర్త.

ప్రతి॥ కర్మ = కర్మచే, నిష్పాదితే = పుట్టిన, లోకే = లోకముందు, యత్ = ఏఆత్మను, వివిత్సయా = తెలుసుకొనవలెననెడికోరికతో, నిర్విణ్ణః = ఏమీచేయుటకు పాలుపోక, గురుపాద + అబ్జం = గురునిపాదపద్మాలను ఉపేయాత్ = చేరునో, సః = అట్టి, శంకరః = శివుడు, శం = శుభమును కరోతు = కల్గించుగాక.

## తాత్పర్యం

కర్మద్వారా పొందబడే లోకాలన్నీ అంతంతో కూడుకొన్నవే అని అర్థం చేసుకొన్నవారు వాటి నన్నింటిని తిరస్కరించి గురు పాదపద్మాలవద్ద ఆత్మార్పణం చేసుకొంటారు. ఆ పరమాత్మ శంకరప్రభువు. ఆయన అనుగ్రహించి అందరికి శుభం కలుగచేయును గాక!

## వ్యాఖ్య

కర్మ లెంత ఉత్తమమైనవి, ఉదారవంతము లైనవి అయినా అవి పుణ్య వాసనలనే ఇవ్వగలవు. వాటిని క్షయం చేసుకోడానికి అనేకంతో కూడిన లోకాలలో జీవించవలసి వస్తుంది. ఆ లోకాలు మానవలోకంకన్న ఉత్తమ చైతన్యంతో నిండిన లోకాలు కావచ్చును. అయినా అవీ అనుభవానికి వచ్చే లోకాలే. అందుచేత వాటిని పొంది,అనుభవించి సుఖించాక మనస్వస్వరూపాన్ని తెలుసుకోడానికి గాను ఈలోకంలోకి ప్రవేశించవలసిందే. యావత్కర్మలోను వున్న ఈ పరిమితుల్ని అర్థంచేసుకొన్నప్పుడు సూటిగా మనలో ఉన్న ఆత్మను అందుకోడం కోసం గురువును సమీపించి ఆత్మార్పణం చేసుకోవాలి. ఆయన ఆదేశాలను పూర్తిగా పాటిస్తూ నిష్కామకర్మ చేస్తూ జీవించాలి. ఉపనిషత్తుల లోని సూక్ష్మ సందేశాలను శ్రవణం చేసి, మననం చేస్తూ, ధ్యానిస్తూ వుండటం వల్ల మనస్సు శుద్ధమై అహంకారానికి ఆధారమైన పరమాత్మను, ఆలోచనలకు మూలమైన అనంతశాశ్వత దివ్యపరమపదాన్ని సూటిగా తెలుసుకొంటాడు. ఆ పరమపదమే శంకరప్రభువు. ఆయన మనలను అనుగ్రహించును గాక! (ముండక 1. 2. 12)

శ్లో॥ ఉపసన్నాయ యత్తత్త్వం శమాది గుణశాలినే।
దీయతే దేశికేంద్రేణ శం కరోతు స శంకరః॥ 13

ప్రతి॥ యత్ + తత్త్వం = ఏ ఆత్మస్వరూపం, శమ + ఆది = శమము మొ॥
గుణ = గుణాలచే, శాలినే = కూడిన, ఉపసన్నాయ = శిష్యునికొఱకు
దేశికేంద్రేణ = గురుశ్రేష్ఠునిచే, దీయతే = ఇవ్వబడుచున్నదో——

## తాత్పర్యం

నిజమైన జిజ్ఞాసువులు ఒక గురువును సమీపించినప్పుడు వాళ్ళకి హృదయ, విజ్ఞానార్హతలు ఉంటే, ఆ గురువు వాళ్ళకి సూటిగా ఆత్మబోధను చేస్తాడు. ఆ ఆత్మయైన శంకరప్రభువుయొక్క అనుగ్రహం మన అందరిమీద ప్రసరించును గాక!

## వ్యాఖ్య

ఉపనిషత్తుల జ్ఞానం సమగ్రంగా ఉన్న "శ్రోత్రియుడు", సాక్షాత్తు ఆత్మానుభవంవున్న "బ్రహ్మనిష్ఠుడూ" అయిన గురువును విరాగి అయిన శిష్యుడు ఆధ్యాత్మికజ్ఞానం కోసం సమీపించినప్పుడు అతడిలో అంతశ్శిక్షణ సరిపడినంత ఉంటే గురువు మార్గనిర్దేశం చేస్తాడు.

మనస్సును చెదరగొట్టే విషయాలను అందాకా చేర్చకుండా ఇంద్రియాలను అరికట్టడం దమ మనబడుతుంది. విషయ సుఖాలకోసం ఉవ్వెత్తుగా కామనలు లేచి మనస్సును బాహ్యప్రపంచంలోకి నెట్టకుండా ఉండడం శమం. ఈరెంటినీ సాధించినప్పుడు మనస్సు స్థిరము, శాంతము, జాగరూకము అవుతుంది. అలాంటి మనస్సును తేలికగా శుద్ధచైతన్య స్థితిలోనికి నడిపించవచ్చును. ఆస్థితి జిజ్ఞాసువుయొక్క నిజస్వరూపమే. ఆ ఆత్మే శంకరప్రభువు శ్రీ కాశీవిశ్వనాథుడు. (ముండక 1. 2. 13)

ఇకనుండి ముండక రెండోఅధ్యాయంలోని భావాలను శ్రీ గురుదేవులు మనకు ప్రసాదిస్తారు. ముందు ప్రపంచసృష్టిని గురించి సహజంగా అందరికీ ఉండే అనుమానాన్ని నివృత్తి చేస్తారు.

అహంకారంతో మనం ప్రపంచబాహుళ్యాన్ని చూచి అనుభవిస్తాము. ముందు జిజ్ఞాసువుకు ప్రపంచసృష్టిని గురించిన అనుమానమే కలుగుతుంది. ప్రపంచం ఎలా సృష్టిఅయింది? సృష్టికర్తకు సృష్టికి మధ్య సంబంధం యేమిటి? శిష్యుని హృదయంలో ఉండే ఈ సందేహాలను పూర్తిగా తొలగించ డానికి గాను రెండోఅధ్యాయం ప్రసిద్ధమైన ఉపమానాలతో మొదలవుతుంది.

శ్లో॥ అగ్నిస్ఫులింగవ ద్భావా నిస్సరంతి యతోఽక్షరాత్।
సర్వేఽపి యత్ర లీయంతే శం కరోతు స శంకరః॥ 14

ప్రతి॥ యతః = ఏ, అక్షరాత్ = నాశంలేని ఈశ్వరునినుండి, భావాః = భావాలు, అగ్నిస్ఫులింగవత్ = అగ్నిమిణుగురులవలె, నిస్సరంతి = వెలువడునో, సర్వే + అపి = సమస్తభావాలును, యత్ర = ఏ శివునిలో, లీయంతే = లీనమౌగుచున్నవో———

## తాత్పర్యం

ప్రజ్వలిస్తున్న అగ్నినుండి ఎలాగైతే నిప్పురవ్వలు ఆడుకుంటూ బైటికి వచ్చి చివరికి క్షణాల్లో అగ్నిలోనే మాయమవుతాయో, అలాగే అక్షరపదంనుండి క్షరవస్తువులు లేచి కొంతకాలం ఆడి తిరిగి అక్షరంలో ప్రవేశించి మాయ మవుతాయి. ఆ అక్షరపరమాత్మ శంకరప్రభువు ప్రపంచాన్ని అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

ఇది ప్రసిద్ధమైన ఉపమానం. మండుతున్న పెద్ద అగ్నిస్థానంనుండి వేలాది నిప్పురవ్వలు లేస్తాయి. ప్రతినిప్పురవ్వ ఇంకా కాలవలసిన ఒకచిన్న కర్రముక్కని కాల్చుతూండే ఒకచిన్న అగ్నికణం. అలాగే సమష్టివాసనలను మండించే ఈశ్వరుడినుండి ఒక వ్యష్టి వాసనను కాల్చుకొంటూ వచ్చే ఈశ్వర తత్త్వమే జీవుడు. తన జీవితాన్ని తన వాసనలకి అనుగుణంగా ఒకపద్ధతిలో నడుపుకుంటాడు. ఒకరవ్వ త్వరగా మాయ మవుతుంది, మరోటి ఇంకా కొంచెం ఎక్కువకాలం ఉంటుంది. ఎందుకంటే రెండోదానిలో ఖర్చుకావలసిన

వాసనలు ఎక్కువ వున్నాయి. చివరికి కర్ర అంతా కాలిపోయినప్పుడు అన్ని రవ్వలూ మాయ మవుతాయి బంగారు రంగులో మెరిసే నిష్ప్రపవ్వ అవ్యక్తమైన అగ్ని తత్త్వంగా మారిపోతుంది.

ఎవరినుండి అన్ని ప్రాణులు ఉద్భవిస్తాయో, తిరిగి ఎవరిలోపల లీనమవుతయో ఆ ముఖ్యమైనసారం శంకరప్రభువు ఆయన మనఅందరిమీద అనుగ్రహాన్ని వర్షించునుగాక! (ముండక 2. 1. 1)

శ్లో॥ అంత ర్బహి శ్చ సంపూర్ణం మనః ప్రాణాది వర్జితః।
అమూర్తో దివ్యమూ ర్తి ర్య శ్శం కరోతు స శంకరః॥ 15

ప్రతి॥ యః = ఏ ఆత్మస్వరూపుడు, అంతః + బహిః + చ = లోపల వెలుపల కూడా, సంపూర్ణః = పరిపూర్ణుడును, మనః = మనస్సు, ప్రాణ + ఆది = ప్రాణము మొ॥,వర్జితః = వదలినవాడు, అమూర్తః = నిరాకారుడును దివ్యమూర్తిః + చ = దేవతామూర్తియునైనవాడో——

## తాత్పర్యం

ఈ అక్షర పురుషుడు లోపల బయట అంతటా, నిండి, మనఃప్రాణాలు లేనివాడై, నిరాకారుడై, దివ్యస్వరూపుడై వెలుగొందే శంకరప్రభువే. ఆయన మన కందరికి సుఖాన్ని ప్రసాదించునుగాక!

## వ్యాఖ్య

అక్షర పరమాత్మ లోన, బయట సర్వత్ర వ్యాపించి పూర్ణంగా ❋ ఉంటుంది. అది మనస్సుకి ఇంద్రియాలకి అతీతమైనది. అది స్థూలసూక్ష్మ శరీరాలు రెంటినీ చేతన పరుస్తుంది. దానికి ఆకారం లేదు. కాని తనచైతన్య కాంతివల్ల ప్రకాశవంతమై వుంటుంది. ఆ ఆత్మ శంకరప్రభువే. ఆయన అనుగ్రహం అందరికీ సుఖప్రదమైంది, (ముండక 2. 1. 2)

---

❋ సజాతీయ, విజాతీయ, స్వగత భేదాలు లేనిది పూర్ణం.

జడపదార్థంవల్ల పరిమితం కాని ఆత్మను ఇలా వర్ణించి, ఇకముందు శ్రీ గురుదేవులు దృశ్యప్రపంచంవల్ల పరిమితమయ్యే పరమాత్మ ప్రపంచ రూపంలో ఎలా గోచరిస్తాడో చెబుతారు. అన్ని కెరటాలు కలియుగా కనబడేది సముద్రరూపం. అలాగే సమష్టి మనస్సువలన పరిమితుడైన అక్షరపరమాత్మ సమష్టి స్థూలాకారాలు అవుతాడు – విరాట్పురుషుడు. విరాడ్రూపం అవుతాడు.

శ్లో॥ ద్యులోకో మస్తకం యస్య చక్షుషీందు దివాకరౌ।
దిశః శ్రోత్రే పదం పృథ్వీ శం కరోతు స శంకరః॥ 18

ప్రతి॥ యస్య = ఏ పరమాత్మయొక్క, మస్తకం = తల, ద్యులోకః = దేవలోకమో, చక్షుషీ = కండ్లు, ఇందుదివాకరౌ = చంద్రసూర్యులో, శ్రోత్రే = చెవులే, దిశః = దిక్కులు, పదం = పాదము, పృథ్వీ = భూమియో———

## తాత్పర్యం

బహిరాకాశం ఆయన శిరస్సు సూర్యచంద్రు లాయన నేత్రాలు· దిక్కు లాయన చెవులు. ఆయన పాదాలు భూమి. ఆయనే శంకరప్రభువు. ఆయన మనందరకు మంగళం చేకూర్చును గాక!

## వ్యాఖ్య

ఆత్మయొక్క సమష్టి వ్యక్తరూపం అయిన బ్రహ్మాండంయొక్క చిత్రణం ఇవి. ఆయన శిరస్సు బహిరాకాశాన్ని స్పృశిస్తుంది. ఆయనకళ్ళు అన్నిప్రాణుల కళ్ళు ఏ కన్నూ కాంతి లేనిదే చూడలేదు కాబట్టి సహజ కాంతులైన సూర్యచంద్రులు విరాడ్రూపంయొక్క కళ్ళు.

ఆకాశం లేకుండా ధ్వని పుట్టదు. మనచెవికి వచ్చే ధ్వని ఏదో ఒక దిక్కుగా రావాలి. అందుచేత దిక్కులే సమష్టి కర్ణం. ప్రతిప్రాణి భూమిపైన తన కాళ్ళతో నిలబడుతాడు. అందువల్ల భూమి యావత్తు తన పాదాలుగా విరాడ్రూపి వుంటాడు.

పురుషసూక్తంలో విరాట్పురుషుని గురించి ఇంకా చాలా విస్తృతంగా కవితావర్ణనలతో నిండిన చిత్రణ వున్నది దానిలో అద్భుతమైన బలం అప్పి తీయమైన అందం వున్న అనుగ్రహమూర్తిగా ఆయన దర్శన మిస్తాడు. (ముండక 2. 1. 4)

శ్లో॥ యస్మా ద్భవంతి భూతాని వనపర్వత సాగరాః।
యస్మా త్స్రవంతి గంగాద్యాః శం కరోతు స శంకరః॥ 17

ప్రతి॥ యస్మాత్ = ఏపరమాత్మనుండి, భూతాని = పంచభూతాలు, వనపర్వత సాగరాః = వనాలు, పర్వతాలు, సముద్రాలును, భవంతి = పుట్టు చున్నవో, యస్మాత్ = ఏపరమాత్మనుండి, గంగా + ఆద్యాః = గంగ మొ॥ నదులు, స్రవంతి = ప్రవహిస్తున్నవో——

## తాత్పర్యం

ఎవరినుండి పంచమహాభూతాలు, అరణ్యాలు, పర్వతాలు, సప్తసముద్రాలు – ఉద్భావిస్తాయో, ఎవరినుండి, గంగమొదలైన నదులు ప్రవహిస్తాయో ఆపరమాత్మ శంకరప్రభువు యొక్క అనుగ్రహం మనకు బ్రహ్మవిద్యా సుఖాన్ని ప్రసాదించునుగాక!

## వ్యాఖ్య

కలలోని యావత్ప్రపంచమూ ఎలాగైతే మెలకువ మనస్సునుండి ఉదయిస్తుందో అలాగే పరమాత్మనుండి పంచమహాభూతాలు, వాటి పరస్పర కలయిక ఏర్పడ్డ నామరూపాలు లేస్తాయి. సూక్ష్మభూతాలు మనోబుద్ధులకు ఆలోచనలకు ఉపాదాన కారణమౌతాయి.

ఆయన నుండే సముద్రాలు, అడవులు, కొండలు, నదులు జనిస్తాయి. అవి అన్నీ స్థాణువులో కనిపించే దయ్యంలాగా ఆయనలో కనిపిస్తాయి. ఈదృశ్యప్రపంచ బాహుళ్యానికి మహాఅధిష్ఠానం శంకరప్రభువు. (ముండక 2. 1. 5–10)

ఇప్పటివరకు శ్రీ స్వామీజీ ముండకలోని రెండవఅధ్యాయంయొక్క మొదటి ఖండాన్ని వివరించారు ఇప్పుడు రెండో ఖండంలోని భావాలలో వారు శ్రీ శంకరుని తాండవకేళిని దర్శిస్తారు జిజ్ఞాసువుకు శంకరుని అద్భుతనాట్యం కనబడడానికి ముందు అతడిమనస్సు శుద్ధం కావాలి అందువేత ఉపనిషత్తులో ఓంకారోపాసన ఉపదేశింపబడింది

శ్లో॥ వర్ణో ధనుః శ్శరో హ్యాత్మా శరవ్యం బ్రహ్మ యత్పరం।
ద్వైతాద్వైత వినిర్ముక్తః శం కరోతు స శంకరః॥ 18

ప్రతి॥ వర్ణః = ఓంకారము, ధనుః = పినాకమనువిల్లు, ఆత్మ = ఆత్మ, శరః = బాణము, యత్ + శరవ్యం = గమ్యమేదో, బ్రహ్మ = ఆత్మవిద్య, ద్వైతాద్వైతవినిర్ముక్తః = ద్వైతము–అద్వైతమును – కానివాడెవడో, సః = అట్టి, శంకరుడు = శంభుడు, శం = శ్రేయస్సును, కరోతు = ఇచ్చుగాక!

## తాత్పర్యం

ఓంకారం ధనుస్సు. అహంకారంతో కూడిన జీవుడు బాణం. లక్ష్యం నామరూప జగత్తు యావత్తుకు ఏకాధిష్ఠానమైన పరబ్రహ్మము. ద్వైతము అద్వైతము రెండూ కాని ఈ పరమాత్మ శంకరప్రభువె. ఆయన అనుగ్రహం మనకు మంగళం చేకూర్చుగాక!

## వ్యాఖ్య

ముండకోపనిషత్తులోని ఈఉపమానం చాలా ప్రసిద్ధమైనది ఓంకారం యొక్క ప్రాముఖ్యతను గురించి ధ్యానం చేయడం ద్వారా పరిమితమైన జీవ అహంకారం ఉద్ధరింపబడి ఏకమైన పరమశుద్ధ దివ్యచైతన్యంలో ఐక్యమయ్యే స్థితిని అందుకోవాలి. ధ్యానంలో స్థిరంగా నిమగ్నం కావటమె మనవిజయం లోని రహస్యం.

... అందువల్ల అన్నిమాటలను కట్టిపెట్టి మీపూర్తి దృష్టిని శుద్ధచైతన్య పదం వైపుకు మరల్చుమని ఆదేశిస్తుంది ముండకోపనిషత్తు.

శ్లో॥ శబ్దజాలం సముత్సృజ్య రమంతే యత్పరాత్మని।
నిస్స్పృహా నిఖిలాధారే శం కరోతు స శంకరః॥ 19

ప్రతి॥ శబ్దజాలం = శబ్దప్రపంచమైనవాదాలు, సిద్ధాంతాలు, సం + ఉత్సృజ్య = వదలిపెట్టి, నిఖిల + ఆధారే = సమస్తమునకూ ఆధారమైన, యత్ + పరాత్మని = ఏపరమాత్మయందు, నిస్ + స్పృహాః = కోర్కెలులేనివారై, రమంతే = ఆనందింతురో——

తాత్పర్యం

అన్నివాదాలను ఆలోచనలను,చెరిపివేసి వివేకియైన సాధకుడు,మమకారాలు వదిలి, జీవపదార్థాలతో కూడిన అన్ని నామరూపాలకు ఆధారమైన పరమాత్మను చేకొని ఆనందించుతాడు. ఆ పరమాత్మే శంకరప్రభువు. ఆయన అందరిపైన అనుగ్రహజల్లులను కురిపించునుగాక!

వ్యాఖ్య

వాదాలు బుద్ధియొక్క తర్కాలు బుద్ధి ఎప్పటికీ పరమాత్మను అర్థం చేసుకోలేదు. ఎందుకంటే చైతన్యంవల్లనే బుద్ధి చేతనత్వాన్ని పొందుతుంది. దాని వాదాలను, నిర్ణయాలను చైతన్యం వెలిగిస్తుంది. దానికి తన మూలాన్ని తెలుసుకునే శక్తిలేదు. అందువల్ల దీక్షతోనిండిన జిజ్ఞాసువు ఆత్మధ్యానంలో మనస్సును నిశ్శబ్దం చేసుకోవాలి. హృదయంలో వెలిగే నిరంతర సాక్షి చైతన్యమే ఆత్మ.

ఇలాంటి జిజ్ఞాసువులు అపరోక్షమైన ఆత్మ సాక్షాత్కారాన్ని పొంది రమిస్తారు. అదే అన్నింటికీ ఆధారం. ప్రపంచబాహుళ్యంలోని అన్నిమమకారాలను వదిలేసి తమ దృష్టిని విడిపించుకొన్నప్పుడే అపరోక్షానుభూతి కలుగుతుంది. ఇలా అందుకోబడే ఆత్మపదమే శంకరప్రభువు.

శ్లో॥ పిండీకాయామరా యద్వద్ధమనోర్యత్ర సంహతాః।
తత్రాస్తే బహుధా నృత్యన్ శం కరోతు స శంకరః॥ 20

ప్రతి॥ పిండికాయాం + అరాః = చక్రమునందలి ఆకులమధ్యగల అరలు, యత్ = ఏపరమాత్మయందు, ధమన్యః = నాడులు, సంహతాః = చుట్టి యున్నవో, తత్ర = అచ్చట (ఆపరమాత్మ) బహుధా = అనేకవిధాలుగా, నృత్యన్ = నర్తించుచూ, అస్తే = ఉండునో——

## తాత్పర్యం

చక్రంయొక్క నాభికి ఆకు లమర్చబడినట్లుగా శరీరంలో ముఖ్య ధమనులు (నాడులు) హృదయంలో అమర్చబడి వున్నాయి. ఆహృదయాకా శంలో విలాసంగా ఆత్మ నర్తిస్తుంది. ఈ ఆత్మే శంకరప్రభువు. ఆయన అందరినీ ఆనందవర్షంతో అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

బండిచక్రంయొక్క నాభిలో అమర్చబడిన ఆకుల అధారంగా చక్రం యొక్క చక్రం(కుండ)బలంగా నిలబడి వుంటుంది.అలాగే జడమైన శరీరాన్ని సజీవంచేసే చైతన్యనాడులు వ్యక్తిహృదయంనుండి విస్తరించుకుంటాయి. ఈ హృదయాకాశంలో మనోబుద్ధులద్వారా పరిమితమైన ఆత్మ ఉద్రేకాలు, కోరికలు, ఆశలు, ఆవేశాలు, కామాలు, భయాలు అనే అన్ని భ్రాంతులలోను నర్తించుతున్నట్లు అగపడుతుంది. ఆ ఆత్మ అయిన శ్రీ శంకరుడు, కాశీ విశ్వనాథుడు మనల నందరినీ అనుగ్రహించును గాక!

**శ్లో॥ యస్మిన్ ద్రష్టే నష్టకర్మా ఛిన్నగ్రంథీ రసంశయః।**
**మృత్యుముక్తో భవే న్మర్త్యః శం కరోతు స శంకరః॥ 21**

ప్రతి॥యస్మిన్‌ద్రష్టే = ఏద్రష్టయైన పరమాత్మయందు,మర్త్యః = మనుష్యుడు నష్ట = నశించిన, కర్మా = కర్మలుగలవాడై, ఛిన్న = తొలగిన, గ్రంథిః = లోపాలుగలవాడై, అసంశయః = సందేహములేనివాడై, మృత్యు + ముక్తః = చావునకుదూరమై, భవేత్ = ఉండునో——

## తాత్పర్యం

ఆత్మానుభవం పొందిన మానవుడి కర్మలన్నీ నశించుతాయి. అజ్ఞాన గ్రంథులు తెగిపోతాయి. మర్త్యుడు అమరు డౌతాడు. ఈ ఆత్మే శంకరప్రభువు. ఆయన అనుగ్రహం అందరిపైన ప్రసరించును గాక!

## వ్యాఖ్య

కలలోంచి మెల్కొన్నప్పుడు కలలోని నేరాలన్నీ సమసిపోతాయి. అలాగే కర్తృత్వభావం ఉన్న జీవుడు ఉత్తమ చైతన్యపదమైన ఆత్మలో లీన మైనప్పుడు జీవుడుగా చేసిన కర్మలన్నీ శక్తివిహీనా లవుతాయి,

ఆత్మ నెరుగని అవిద్యా, విషయకామాలు, సకామ కర్మలు—ఈమూటిని వేదాంతంలో హృదయగ్రంథు లంటారు. సాక్షాదాత్మానుభవంవల్ల అవిద్య అంత మైనప్పుడు మిగతావి రెండూ స్వయంగా నశించిపోతాయి. కాలపరిధిలో నిరంతరం మారే బాహుళ్యాన్ని చూస్తూ, అందులో నిమగ్నమై తానుకూడ మార్పులు చెందుతున్నట్లు భ్రాంతిచెందుతూ పరిమితమైన వ్యక్తిత్వం కాలా తీతం, మార్పులకు అతీతం, నిత్యం అక్షరం అయిన ఆత్మలో జాగృతమై పూర్తి తాదాత్మ్యం పొందుతుంది. ఇలా మరణంతో కూడిన మర్త్యుడు అమరుడౌతాడు.

ఈ ఆత్మ కాశీ విశ్వేశ్వరుడు మనలనందరిని అనుగ్రహించును గాక! (ముండక 2. 2 1–9)

**శ్లో॥ సూర్యసోమౌ తథా విద్యు ద్యం న భాసయితుం క్షమాః।**
**యద్భాసైతా ప్రకాశం తే శం కరోతు స శంకరః॥ 22**

ప్రతి॥ యం = ఏపరతత్త్వాన్ను, సూర్యసోమౌ = సూర్యచంద్రులు, తథా = అట్లే, విద్యుత్ = మెఱుపుకాంతి, భాసయితుం = ప్రకాశింపజేయుటకు, న + క్షమాః = సమర్థములుకావో, యత్ + భాసా + ఏతే = ఏపరమాత్మ కాంతిచేతనే యివి, ప్రకాశంతే = ప్రకాశించునో——

## తాత్పర్యం

సూర్యచంద్రులుకాని విద్యుత్తుకాని దానిని వెలిగించలేవు. నిజానికి ఆత్మ కాంతివల్లనే ఇవన్నీ వెలుగుతాయి. ఆ ఆత్మ శంకరప్రభువు యొక్క అనుగ్రహం మనలను శుభాలతో కటాక్షించును గాక!

## వ్యాఖ్య

భౌతికకాంతులైన సూర్య చంద్ర తారక విద్యు దగ్నులు — ఇన్నింటికి మూలమైనది ఆత్మకాంతి. ఈ భౌతికకాంతులు బాహ్యావిషయాలను వెలిగించ గలవు. ఆత్మను వెలిగించలేవు. ఆత్మకాంతి ఈభౌతిక కాంతు లన్నింటినీ వెలిగించి చూపుతుంది.

ఈ ఆత్మే శంకరుడు. ఆయన అనుగ్రహం మనలను కాంతితో ఆనందంతో నింపును గాక! (ముండక 2. 2. 11)

ముండక రెండోఅధ్యాయంలోని ముఖ్యభావాలు పూర్తి అయ్యాయి. ఇప్పుడు శ్రీ గురుదేవులు మూడోఅధ్యాయంలోని ముఖ్యభావాలను ప్రారంభిస్తు న్నారు. ఆత్మ అతి సూక్ష్మ మైనందున దానిని సాధకులు సూటిగా అర్థం చేసుకోలేరు. అందువల్ల ఉపనిషత్తు మరోదృక్కోణంనుండి ఆత్మను సమీపిస్తోంది.

శ్లో॥ వృక్షే సమానే విహగౌ నివిష్టా—
వేకో౽శ్నుతే తత్ఫల ముచ్చగో౽న్యః।
పశ్య న్ననశ్నన్నభియ స్సుఖాత్మా
తమీశ్వరం సౌమ్యపురీశ మీడే॥ 23

ప్రతి॥ వృక్షే = చెట్టునందు, సమానే = ఒకేజాతికిచెందిన, విహగౌ = రెండు పక్షులు, నివిష్టౌ = కూర్చొనియున్నవి, ఏకః = అందొకటి, తత్ + ఫలః = ఆచెట్టు పండును, అశ్నుతే = తినుచున్నది, అన్యః = మరొకటి, ఉచ్చగః = ఎత్తైనకొమ్మపై కూర్చొని, పశ్యన్ = చూస్తూ, అనశ్నన్ =

తినక, న + భియః = భయపడనిదై, సుఖ + ఆత్మ = ఆత్మయందు సుఖిస్తూ, ఉన్నదో, సౌమ్యపురీశం = ఉత్తరకాశీశ్వరుడైన, తం = ఆ, ఈశ్వరం = శివుని, ఈడే = స్తుతిస్తున్నాను.

## తాత్పర్యం

ఒకేవృక్షంమీద రెండుపక్షులు కూర్చొన్నాయి. ఒకటి పళ్ళు తింటుంది. రెండోది ఎత్తైన కొమ్మమీద కూర్చొని పళ్ళు తినకుండా కేవలం చూస్తోంది. ఈనిత్యానంద ఆత్మ సౌమ్య పురీశుని నేను స్తోత్రాలతో నుతిస్తాను.

## వ్యాఖ్య

మరచి పోడానికి వీలులేని మహాఅద్భుత నిగూఢచిత్రణ ఈ ఉపమానం.

ఒకే చెట్టు వంటి శరీరంలో రెండు పక్షులున్నాయి— ఈశ్వరుడు, జీవుడు జీవుడు ఫలాన్ని తింటూంటే, దేవుడు తినకుండా ఫలాలు తినే పక్షిని చూస్తూం టాడు. సమిష్టిద్వారా ఈశ్వరుడుగా వ్యక్తమయ్యే ఆత్మే ఈ చూచే పక్షి. ఈశ్వరుడైన పక్షి ఏమీ తినదు కాబట్టి నిత్యసంతోషి. మాయవల్ల వ్యామోహం చెందదు. ఈశ్వరుడు, జీవుడు ఒకే దివ్యాత్మయొక్క స్వరూపాలే అయితే వాళ్ల ఉపాధులు వేరు కాబట్టి వేరుగా కనబడుతారు. ఉత్తర కాశీశుడైన విశ్వనాథుడే ఈ పరమాత్మ అయనను నేను ఆరాధిస్తాను. స్తోత్రాల ద్వారా ఆయన అనుగ్రహాన్ని పొందగోరుతాను. (ముండక 3. 1. 1)

శ్లో॥ యత్సత్యవాదేన సతాధిగమ్యం
సంగమ్య యన్నాతివదంతి విజ్ఞాః।
యత్రీక్రీడ మాత్మజ్ఞతమం సమర్చ్య
మర్త్యోఽభ్యుదేత్యస్తుగతి స్స శంభుః॥ 24

ప్రతి॥ యత్ = ఏ పరమాత్మ, సత్యవాదేన = సత్యవాక్కుగల, సతా = సజ్జను నిచే, అధిగమ్యం = పొందదగియున్నదో, యత్ = ఏ పరమాత్మను, సంగమ్య = చేరి, విజ్ఞాః = విజ్ఞులు, న + అతివసంతి = వాదనకుదిగరో,

యత్ = ఏ, ఆత్మజ్ఞతమం = ఆత్మను బాగుగానెరిగి, క్రీడం = క్రీడించు నట్టి ఆపరమాత్మను. సమ్ + అర్చ్య = బాగుగాపూజించి,యః + మర్త్యః = ఏమనుష్యుడు, అభి + ఉదేతి = అభ్యుదయమును పొందుచున్నాడో సః = అట్టి, శంభుః = శివుడు, గతిః = శరణ్యముగా, అస్తు = అగుగాక!

## తాత్పర్యం

మహాత్ములతో సంవాదముల ద్వారా పొందబడదగినది ఆత్మ. ఆత్మానుభవం పొందినాక అతడు ఇక వాదనలలోకి దిగడు. ఆ తరువాత అతడు ఆత్మలో రమిస్తూ ఆత్మతో క్రీడిస్తాడు. సామాన్య మానవుడు అట్టి మహాత్ముణ్ణి ఆరాధించి భౌతిక సుఖాలను ఆధ్యాత్మిక వికాసాన్ని పొందుతాడు. ఆ ఆత్మే నా శంభుడు ఆయనను చేరుకోడమే నా గమ్యం.

## వ్యాఖ్య

ఉపనిషత్తుల అధ్యయనం, మహాత్ములతో, సత్సంగం ద్వారా అనుమానాలను నివృత్తి చేసుకోడం మొదలైనవి సత్యాన్ని తెలుసుకొనే పద్ధతులు. ఒకసారి ఆత్మను అందుకున్నాక సాధకుడు సిద్ధులపై నిశ్శబ్దం వహిస్తాడు. ఆత్మ ఉన్నదా లేదా అని, దాని స్వభావ మేమిటి అని ఏ వివాదాలూ లేవవు. ఆ పరమసత్యం ఉన్నదని కాని లేదని కాని నిరూపించడానికి కూడా ఇచ్ఛ ఉండదు.

ఆత్మదర్శనమైన మహాత్ముడు తనలో తాను ఆత్మలో రతిచెందుతూ, ప్రపంచబాహుళ్యాన్ని చూచినప్పుడు ఆత్మరూపాలైన వాటితో క్రీడిస్తూ ఉంటాడు.

ఆత్మగా నిరంతరం నిలిచివుంటే ఆ మహాత్ముడు ధ్యాననిమగ్నుడైనా ప్రపంచంలో మెలగినా భగవద్రూపుడే. ఆయనను ఆరాధించి ప్రేమించడం, మన ఆధ్యాత్మిక భౌతికాభ్యుదయానికి తోడ్పడుతుంది. (ముండక 3 1.5–10)

చివరిశ్లోకంలో శ్రీ గురుమహారాజు మూడోఅధ్యాయంలోని రెండో ఖండం యొక్క భావాలను పొందుపరుస్తున్నారు.

శ్లో॥ కామైషిభిశ్చ బలరిక్త నరై రలభ్య
స్సంన్యాస హీనతపసాపి న లభ్యతే యః।
యల్లబ్ధిత స్తు సుధియ స్సరితో యథాబ్ధిం
యం సంవిశంతి వికలా స్త ముమేశ మీడే॥ 25

ప్రతి॥ యః = ఏపరమాత్మ, కామైషిభిః = కోర్కె కోరువారైన, బలరిక్తనరైః = ఆత్మబలములేని మానవులచే, అలభ్యః = పొందబడడో, సంన్యాసహీన తపసా + అపి = సన్యాసములేని తపస్సుచేతకూడ, న + లభ్యతే = పొందబడడో, యత్ = ఏపరమాత్మను, లబ్ధితః + తు = పొందుటవలన కూడ, సుధియః = పండితులు, సరితః = నదులు, యథా = ఎట్లు, అబ్ధిం = సముద్రమును, సంవిశంతి = చేరుచున్నవో, (అట్లు), వికలాః = తమస్వరూప స్వభావాలను వదలి, యం = ఏపరమాత్మను, (సంవిశంతి = చేరుచున్నారో) తం = అట్టి, ఉమేశం = పార్వతీపతిని, ఈడే = స్తుతిస్తున్నాను.

## తాత్పర్యం

అధ్యాత్మిక వికాసం మనమనోబుద్ధుల పరికరంలో కావలసిన అర్హతలను సృజించకుండా ఉండదు. నిద్రకు ఉపక్రమించినప్పుడు జాగ్రదవస్థలోని అన్ని సంపర్కాలను పూర్తిగా వదిలేసినప్పుడు తప్ప నిద్రలోకి జారుకోలేరు. అలాగే విషయ–ఉద్రేక–తలపుల ప్రపంచంలోని వాటికోసం ఉన్న అన్ని కోరికలు ఆగిపోయినప్పుడు కాని ధ్యానంలో మనస్సు నిమగ్నం కాలేదు.

అధ్యయ మననాలవలన మనదృష్టి స్పష్ట మవుతుంది. ధ్యానంలో కలిగే అనుభవంవలన నానాటికి సూక్ష్మమైన ఆనందం పెరుగుతున్నప్పుడు, ఆ మార్గాన్ని అనుసరించి ఆత్మదగ్గరకు చేరి ఇంకా విస్తృతమైన లోతైన అనుభవాలను పొందాలనే నిశ్చయం దృఢపడుతుంది. ఈధార్ఢ్యత చిక్కని సాధకుడు ఉన్నత ధ్యానస్థితిలో నిలచేంత బలంగా ఉండడు.

శక్తి వృథాగా దుర్వినియోగం కాకుండా పొదుపు చేసుకోడానికి ఆత్మ నిగ్రహము, ఇలా పొదుపైన దానిని సృజనాత్మకంగా వినియోగించడము

తపస్సు అనబడుతుంది. దానిని కొంతవరకు సాధకుని సంకల్పబలం ద్వారా, నిర్ణయంలోని దృఢత్వంవల్ల సాధించవచ్చును. కేవలం ఇవి మాత్రమే చాలవు. అనంతకోటి జన్మలుగా పేర్చుకొంటూ వచ్చిన వ్యామోహశక్తి చాలా ప్రబల మైనది. కర్త–భోక్త భావాలుగా వెలువడే అహంకారాన్ని వదలకుండా తపస్సు వలన అక్కడకి చేరలేము.

ఒక్కసారి ఆత్మపదాన్ని చేరిన తరువాత ఆ మహాత్ముడు ఆ అనుభవం తోనే జీవిస్తాడు. అందులోంచి బైటికి రాడు. ఆ అనుభవం కాలాతీతమైనది. కాలంలో అంతంకాదు. అలాంటి మహాత్ముడు ప్రపంచబాహుళ్యంలో పని చేసినా అది ఆయనకు ఆత్మలోని ఆటే. ఆయన విజ్ఞానస్థాయిలో దానిని ఆత్మ అనేకమై తనతోతాను ఆడుకునే ఆటగానే చూస్తాడు. ఆత్మక్రీడలో అలిసి మనస్సును ముడిచిపెట్టి తన ధ్యానస్థితిని చేరుకున్నాడా ఆయన ఆత్మలో నిలుస్తాడు. అందుచేత శుద్ధమైన ఆత్మలో ఆత్మగా నిలిచి రతిచెందుతాడు.

ఈ ఆత్మ శ్రీ ఉమేశుడు. ఉపనిషన్మాత అయిన ఉమాదేవి భర్త పరమాత్మయే. స్తోత్రాలద్వారా ఆయన అనుగ్రహాన్ని కోరుకుంటాను!



# సప్తమ స్తబకం

ఈ అధ్యాయంలో రెండు ప్రధాన ఉపనిషత్తుల భావాలను వివరిస్తారు. మొదటి ఏడు శ్లోకాలు మాండూక్యోపనిషత్తుకు చెందినవి. మిగిలినవి తైత్తిరీయాన్ని గురించి వుంటాయి.

అథర్వణ వేదానికి చెందిన మాండూక్యోపనిషత్తు అతిగొప్ప ఉపనిషత్తుగా భావించబడుతుంది. చాలాకొద్ది వ్యవధిని తీసుకొని అతిసూక్ష్మమైన బోధతో పూర్తిగా పరిపక్వత చెందిన సాధకుడికి నిజాత్మస్వరూపానికి సూటిగా మార్గ నిర్దేశం చేశాడు సాధారణ మానవులుగా మనం జాగ్రతనుండి స్వప్నానికీ, అక్కడనుండి గాఢనిద్రాస్థితికి కప్పగంతులు వేస్తాము. సామాన్యులందరి సాధారణ అనుభవాన్ని వాడుతూ ఈ అనుభవా లన్నింటికి మూలమైన పరమ వస్తువును చూపుతుంది. కాబట్టి ఈ ఉపనిషత్తును మాండూక్యోపనిషత్తు అన్నారు. మండూకమంటే కప్ప.

శ్రీ గౌడపాదాచార్యులు తనకారిక ద్వారా ఉపనిషత్తులోని మహిమాన్విత మైన భావాలను మనం తెలుసుకోడానికి వీలుగా చిన్నచిన్న కంతలను ఏర్పాటు చేశారు. ఎనిమిదో శతాబ్దానికి కారికని కూడా అర్థం చేసుకోలేని దుఃస్థితికి జారారు సాధకులు. అందువల్ల శ్రీ శంకరాచార్యుడు ఉపనిషన్మంత్రాలు, గౌడపాద కారికలు — ఈరెంటి మీద విస్తృతమైన భాష్యం వ్రాశాడు.

పందొమ్మిదో శతాబ్దం వచ్చేసరికి శంకరభాష్యం కూడా అర్థంచేసుకోవడం కష్టమైంది. అందువల్ల పూనానుండి శ్రీ ఆనందగిరి టీకా లభించింది. ఈ సాహిత్య మంతా పెట్టుకొని మన మాండూక్యమును అధ్యయనం చేసి ఆత్మ ధ్యానంలో ఉన్నప్పుడు మనస్సును ఎటు మళ్ళించి స్థిరత్వాన్ని సంపాదించుకో వచ్చునో కొంతవరకు అర్థం అవుతుంది.

శ్లో॥ ప్రణవే నాభిధేయం యత్ ప్రణవైక కలేబరమ్।
ప్రణవే నోపలక్ష్యం చ తం వందే కాశికాపతిమ్॥ 1

ప్రతి॥ యత్ = ఏ బ్రహ్మస్వరూపం, ప్రణవేన = ఓంకారముచే, అభిధేయం = చెప్పబడుతుందో, ప్రణవ + ఏక + కళేబరం = ఓంకారమే శరీరంగా గలదో, ప్రణవేన = ఓంకారముచే, ఉపలక్ష్యం + చ = గుర్తింపబడుతుందో, తం = ఆ, కాశికాపతిం = కాశీశ్వరుని,వందే = నమస్కరిస్తున్నాను.

## తాత్పర్యం

ఓంకారమనే పేరుతో నిర్దేశింపబడుతూ, ఓంకారంద్వారా ఆత్మరూపం నిరూపింపబడుతూ ఓంకారోపాసన ద్వారా అందుకోబడే ఆత్మ ఉత్తరకాశీ విశ్వనాథుడికి నేను వంగి నమస్కరించుతాను.

## వ్యాఖ్య

ఏధ్వనిని వింటే ఒక వస్తువు మన మనస్సుకు స్ఫురిస్తుందో అది ఆ వస్తువుయొక్క పేరు. 'ఓం' అనే ధ్వని ఆద్యంతాలతో కూడిన బాహ్యక్రీడకు, మారిపోయే పదార్థాలకు అతీతమైన పరమసత్యాన్ని గురించిన స్ఫురణను మన మనస్సులోకి తీసుకొని రావాలి. ❋

భక్తిపూరితమైన హృదయం సాలగ్రామంలో విష్ణువును దర్శించినట్లు, శివలింగంలో శివుణ్ణి దర్శించినట్లు, క్రాసులో జీసస్ క్రైస్తును దర్శించినట్లు, వేదాంతంలో సాధకులు చిట్టచివరి లక్ష్యంగా ఎంచుకునే పరమసత్యానికి ఓంకారం సంకేతం.

---

❋ 1) ఓం ఇత్యేత్, 2) ఓం.......ఆలంబనం శ్రేష్ఠం, 3) ఏతదాలంబనం పరం, 4) ఓం అనేది వాచకం......కఠోపనిషత్తు.

'ఓం' అనేది ఒకపేరని, ఆత్మను సూచిస్తుందని అన్నప్పుడు మనం పొరపాటు పడడానికి అవకాశం ఉన్నది. సాధారణంగా నామం, రూపం— రెండూ వేరువేరుగా ఉంటాయి. నామాన్నిబట్టి రూపాన్ని గ్రహిస్తాము. ఇక్కడ అలాకాదు ఓంకారధ్వని, సూచితమైన పరమాత్మ రెండూ వేరువేరు కాదు. ఓంకారమే పరమాత్మ. అందుకే శ్రీ గురుదేవులు "ఓంకారం ఎవరి రూపమో" అంటున్నారు. సముద్రపునీరే అన్నికెరటాలు అయినట్లు 'ఓం' అనే వాచక నిర్దేశితమైన వాచ్యం ఆత్మ ఒకటే. అంటే వాచకమే వాచ్యం ఇలా ఓంకారమే వాచ్యం ఏకమైన ఆత్మ కాబట్టి మనం చూచే అన్ని నామరూపాలు, జగన్నాటకమూ ఓం అనే ఆత్మను ఎరగని అజ్ఞానంవల్ల సృజింపబడిన మిథ్యారోపాలు.

శ్లో॥ అయమాత్మా పరంబ్రహ్మ బ్రహ్మ చైత చ్చరాచరమ్।
చతుశ్చరణ సంయుక్తం తం వందే కాశికాపతిమ్॥ 2

ప్రతి॥ అయం + ఆత్మా = ఈఆత్మస్వరూపం, పరంబ్రహ్మ = పరబ్రహ్మమే, బ్రహ్మ + చ = బ్రహ్మముకూడ, ఏతత్ = ఈ,చరాచరం = చరాచరము, చతుః + చరణసంయుక్తం = నాలుగు పాదాలు కలది.

## తాత్పర్యం

ఈచరాచరప్రపంచం యావత్తు అదేనని ఏ బ్రహ్మము ముందు సూచితమైనదో, అదే బ్రహ్మలోపల ఉన్న చైతన్యకేంద్రం ఆత్మ. దానికి నాలుగు పాదాలున్నాయి. ఆ ఆత్మ — బ్రహ్మ పరమాత్మయే, ఉత్తరకాశీశుడైన శ్రీ విశ్వనాథుడు. ఆయనను నేను ఆరాధిస్తాను.

## వ్యాఖ్య

అద్వితీయమైన ఆత్మ ఓంకారమనె పెరు గలిగినదని వెనకాలి శ్లోకంలో చెప్పబడినది బ్రహ్మమే. బ్రహ్మాండంగా రూపొందిన నామరూపాలన్నీ ఈ బ్రహ్మముయొక్క వ్యక్తస్వరూపాలే తేస్తూ పడుతూ నృత్యం చేసే అన్ని అలలకు సముద్రం ఆధారమైనట్లు, అనేకం యొక్క ఆట యావత్తుకు ఏక సత్యమే ఆధారం.

మన ప్రతిఒక్కరిలోను వున్న ప్రాణజ్యోతి, హృదయంలోని చైతన్య జ్యోతి, ఆత్మసారం పరబ్రహ్మ తప్ప వేరుకాదు.

బ్రహ్మమునకు నాలుగుపాదా లున్నాయని చెప్పబడింది. ఈ పాదాలు పశువులకు ఉండే నాలుగుకాళ్ళ లాంటివి కాదు. ఇవి రూపాయలో ఉండే నాలుగుపావలాల వంటివి. రూపాయను చిల్లరగా మార్చుకొన్నప్పుడు రూపాయ నాలుగుపావలాలుగా ముక్కలవుతుంది.

ఏవిభజనలూ లేని ఏకాత్మను అందుకోడంలో సాధకులకు తోడ్పడం కోసం ఋషులు పరమసత్యాన్ని ఈవిధంగా వివరించారు అనేక పర్యాయాలు ఉపనిషత్తులలో ఆత్మ నిష్కలమని, అంటే విభజనలు లేనిదని చెప్పాయి. సర్వవ్యాప్తమైన ఆత్మ సర్వత్ర సమంగా ఉన్నదని, అమలమని (రెండోది ఉంటే మలినమౌతుంది) వర్ణించారు. అయితే మాండూక్యంలో ఆత్మకు నాలుగు పాదాలున్నాయని పేర్కొనబడింది. పైవర్ణనలకు వ్యతిరేకమైన ట్లనిపిస్తుంది. నిజానికి ఇందులో విరుద్ధత ఏమీ లేదు.

'ఓం' అనే ఆత్మమీద అవిద్యాకారణంగా అనుభవపరికరాలు, అనుభవ రంగాలు ఆరోపించబడినట్లే 'ఓం' అనే ఆత్మపైన మూడు అవస్థలను—అకారం మేలుకొన్నవానిని (విశ్వుడు), ఉకారం స్వప్నాన్ని చూచే తైజసుణ్ణి, మకారం నిద్రపోయే ప్రాజ్ఞుడిని శ్రీ గురువుగారు ఆరోపిస్తున్నారు. 'నేను' అనుభవాలు పొందే మూడు అవస్థలను మూడు మాత్రలమీద ఇలా ఆరోపించాక శ్రీగురువు రెండు ఓంకారధ్వనులమధ్య వున్న నిశ్శబ్దాన్ని నిర్దేశించి ఆ 'అ'మాత్ర 'ఓం' కారమే అత్మ అని చెబుతారు. ఇదే ఆత్మ అయిన శుద్ధచైతన్యం. ఆత్మ అయిన ఈశుద్ధ చైతన్యమే స్థూలశరీరంద్వారా వ్యక్తమై మేలుకున్నప్పుడు స్థూల ప్రపంచాన్ని చూచి,సూక్ష్మశరీరంలో స్వాప్నికుడు అవుతుంది. కారణ శరీరంలో గాఢనిద్రద్వారా సుఖాన్ని శాంతిని పొందుతుంది.

ఈ మూడు శరీరాలను అధిగమించి విశ్వ, తైజస, ప్రాజ్ఞులుగా అనుభవాలను పొందనప్పుడు మీరు శుద్ధ ఆత్మచైతన్య స్థాయిలో వుంటారు. మీలోని ఈ ఆత్మ బహుళ ప్రపంచానికి అధిష్ఠానమైన పరబ్రహ్మము.

ఆత్మ అయిన ఈ బ్రహ్మమే సౌమ్య కాశీశుడు. విశ్వనాథప్రభువు. ఆయనను నేను ఆరాధిస్తాను. (మాండూక్య 2)

శ్లో॥ జాగ్రత్స్థానో బహిః ప్రజ్ఞః స్థూలాన్ భుంక్తే హి యోఽంగవాన్।
విశ్వాత్మనా విశ్వమూర్తి స్తం వందే కాశికాపతిమ్॥ 3

ప్రతి॥ యః = ఏ, అంగవాన్ = శరీరి, జాగ్రత్ + స్థానః = జాగ్రదవస్థలో వుంటూ, బహిః ప్రజ్ఞః = బాహ్యజ్ఞానాన్ని పొందుతాడో, స్థూలాన్ = స్థూలరూపాన్ని, భుంక్తే = అనుభవిస్తాడో, విశ్వాత్మనా = అట్టిసర్వాత్మకుడగుటచే. విశ్వమూర్తిః = విరాడ్రూపుడో———

## తాత్పర్యం

జాగ్రదవస్థలో ప్రపంచంవైపుకి బహిర్ముఖమైన ప్రజ్ఞతో విషయ వస్తువుల్ని అనుభవించు తున్నప్పుడు విశ్వుడనబడే జాగ్రదాత్మకి ఏడు అంగాలుంటాయి. స్థూలవస్తువులు, వ్యక్తులు అందరితోను కూడిన సమష్టి ప్రపంచ రూపుడైన విశ్వాత్ముడు కాశీనాథుడే. ఆయనను గాఢభక్తితో కొలుస్తాను.

## వ్యాఖ్య

నా స్థూలశరీరంద్వారా వ్యవహరించే చైతన్యం వ్యష్టి అయిన 'నేను' అవుతుంది. ఈ "నేను" నామెలకువ స్థితిలో నాస్థూల ప్రపంచాన్ని చైతన్య రూపిణియై చూస్తుంది. అన్ని స్థూలరూపాలలోని ఆత్మ ఒక్కటే. అందుచేత ఆయన సమష్టి విశ్వుడు. సర్వప్రపంచమూ ఆయనే.

ఇలా విశ్వరూపుడైన విశ్వుడు విరాట్పురుషుడు. ఆయనకు ఏడు అంగాలున్నట్లు వివరింపబడింది — 1) బహిరాకాశంలో కనిపించని దూరంలో ఉన్న ఆయన శిరస్సు, 2) సూర్యచంద్రు లాయన నేత్రాలు, 3) వాయువు ఆయన ఊపిరి, 4) అంతరాకాశం ఆయన ఉరఃస్థలం, 5) నీరు ఆయన మూత్రం, 6) భూమి ఆయన పాదాలు, 7) అహవనీయాగ్ని ఆయన నోరు— ఛాందోగ్యోపనిషత్తులో ఆయన ఏడు అవయవాల వర్ణన ఈ ప్రకారంగా ఉన్నది. (మాండూక్య 3)

శ్లో॥ స్వప్నస్థానోఽబహిః ప్రజ్ఞః సూక్ష్మాన్ భుంక్తేఽథ యోఽంగవాన్।
తైజసీ భూయ విశ్వేశం తం వందే కాశికాపతిమ్। 4

ప్రతి॥ అథ = మరియు, యః = ఏ, అంగవాన్ = శరీరి, స్వప్నస్థానః = స్వప్నావస్థలో వుంటూ, అబహిఃప్రజ్ఞః = స్వప్నజ్ఞానము కలిగివుంటాడో, సూక్ష్మాన్ = సూక్ష్మశరీరాన్ని, భుంక్తే = అనుభవిస్తాడో, తైజసీభూయః = తేజస్స్వరూపుడైన, తం = అట్టి, విశ్వేశం = విశ్వేశ్వరుడైన— కాశికాపతిం = కాశీశ్వరుని, వందే = నమస్కరిస్తున్నాను.

## తాత్పర్యం

స్వప్నస్థానంలో వ్యవహరిస్తూ బహిర్ముఖం కాని చైతన్యంతో సూక్ష్మవిషయాల ననుభవిస్తూ స్వాప్నికుడైన ఆత్మ తైజసునిలా వ్యవహరిస్తాడు. ఇలా వ్యవహరించే తైజసుడు విశ్వానికి నాథుడు కాశీనాథుడే. అయనను నేను ఆరాధిస్తాను.

## వ్యాఖ్య

ఇప్పుడు శ్రీ గురుదేవులు ఓంకారంలో రెండో విభజన అయిన ఉకార మాత్రగా ఉండే స్వాప్నికుణ్ణి గురించి ప్రస్తావించుతున్నారు

స్థూల శరరంనుండి తన చైతన్యాన్ని ఉపసంహరించుకొన్నప్పుడు ఆ వ్యక్తికి ఇక స్థూలప్రప చంలోని విషయాలు అగపడవు. సూక్ష్మశరీరంద్వారా వ్యవహరించుతూ స్వాప్నికుడైన "నేను" ఒక సూక్ష్మప్రపంచాన్ని సృజించి అనుభవిస్తాను. ఈప్రపంచాన్ని నావ్యక్తిగత వాసనలు కల్పించుతాయి. ఆ సమయంలో ఆత్మ తైజసుడిగా మారి జీవిస్తుంది. ఎలాగైతే విశ్వునియొక్క సమిష్టిరూపం విరాడ్రూపమో, అలాగే తైజసుని సమిష్టిరూపం హిరణ్యగర్భుడనబడుతుంది. ఇలా తైజసుని రూపంలో వర్తించే ఆత్మ ప్రపంచానికి నాథుడైన విశ్వనాథుడు. ఆయనే ఉత్తర కాశీప్రభువు. నేను ఆయనను ఆరాధిస్తాను. (మాండూక్య 5)

శ్లో॥ సుప్తిస్థానో ఘనప్రజ్ఞః సుఖం భుంక్తే చ యః స్వయమ్।
ప్రజ్ఞానాత్మా ప్రబోధాత్మా తం వందే కాశికాపతిమ్॥ 5

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, స్వయం = తానుగా, సుప్తిస్థానః = నిద్రావస్థలో వుంటూ, ఘనప్రజ్ఞః = ఘనీభవించిన చైతన్యం గలవాడై, సుఖం = సుఖమును, భుంక్తే = అనుభవిస్తూ, ప్రాజ్ఞనామ్నా = ప్రజ్ఞాశాలి అను పేరుతో, ప్రబోధ + ఆత్మా = ఏ ఆత్మ పిలువబడుచున్నదో———

తాత్పర్యం

గాఢనిద్రావస్థలో పదమచైతన్యం (విషయరహిత) చైతన్యరాశియై తనకు తానుగా ఆనందాన్ని అనుభవిస్తూ ప్రాజ్ఞుడని పిలువబడుతుంది. ఆ ఆత్మే ఉత్తర కాశీప్రభువు. ఆయనను భక్తితో నమస్కరిస్తాను.

వ్యాఖ్య

అకార, ఉకార మాత్రలుగా నిర్దేశింపబడే జాగ్రత్స్వప్నావస్థలలోని మానవస్థితి వివరించాక శ్రీ గురుదేవులు ఈశ్లోకంలో గాఢనిద్రావస్థలోని శూన్య స్థితిని వర్ణిస్తున్నారు. ఇందులో ఆత్మ ప్రాజ్ఞుడుగా వ్యవహరిస్తుంది ఈఅవస్థలో స్థూలసూక్ష్మ శరీరాలు రెండూ లేవు. కాబట్టి స్థూలసూక్ష్మ విషయాలు ఏవీ వుండవు. అది విషయరహితమైన స్థితి విశ్వతైజస స్థితులలోవలె చైతన్యం విషయాల మధ్య చెదిరిపోదు. ఇక్కడ ఉండేది ఒకే చైతన్యం. అది కేవలం అవిద్యాస్థితిని వెలిగిస్తుంది.

ఇలా విశ్వతైజస ప్రాజ్ఞుల రూపాలలో క్రీడించే ఆత్మ కాశీప్రభువు శ్రీ విశ్వనాథుడు. ఆయనను నేను ఆరాధిస్తాను. (మాండూక్య 6)

శ్లో॥ అదృశ్యోఽవ్యవహార్యో యః శివః శాంత శ్చనిర్ద్వయః।
అప్రజ్ఞ శ్శుద్ధతుర్యాత్మా తం వందే కాశికాపతిమ్॥ 6

ప్రతి॥ యః = ఏ, శుద్ధః = పవిత్రమైన, తుర్యాత్మా = నాల్గవఆత్మ (మోక్షం), అదృశ్యః = చూడబడనివాడు, అవ్యవహార్యః = వ్యవహారాతిరిక్తుడు, శివః = మంగళరూపుడు, శాంతః = పరమశాంతుడు, నిర్ద్వయః = ద్వంద్వాతీతుడును-అయిన, తం = అట్టి, కాశికాపతిం = కాశీశ్వరుని, వందే = నమస్కరిస్తున్నాను.

## తాత్పర్యం

తురీయమైన శుద్ధచైతన్యం ఇంద్రియగోచరం కాని అతీతవస్తువు. కర్మేంద్రియాలూ దానిలో వ్యవహరించలేవు. అది నిత్యమంగళము. ప్రశాంతము, అద్వితీయము. అప్రజ్ఞము అయిన శుద్ధవస్తువు. ఆ ఆత్మ అయిన ఉత్తర కాశీశునికి నేను నమస్కరిస్తాను.

## వ్యాఖ్య

సామాన్యమానవు లందరూ జీవించే జాగ్రత్స్వప్నసుషుప్తులనే మూడు చైతన్యావస్థలూ తురీయాస్థితి అయిన ఏకచైతన్యంయొక్క విలాసాలు.

ఈ శుద్ధచైతన్యమే అసలు ద్రష్ట. అందులో ఏవిషయాలూ లేవు. అక్కడ జ్ఞానేంద్రియాలు సంచరించలేవు. (అదృశ్యం) కర్మేంద్రియాలు వ్యవహరించ లేవు (అవ్యవహార్యం). అందుచేత అది శుద్ధమైనది, మంగళప్రద మైనది, నిత్యశాంతము, అద్వితీయము.

దానిని "ప్రజ్ఞ" అనడానికికూడా వీలులేదు. ఎరుగబడే వస్తువు లున్నప్పుడే ఎరుక: లేదా ప్రజ్ఞ అనడానికి వీలుంటుంది. వస్తువులేవీ లేక కేవలం ఒక్క చైతన్యమే ఉన్నప్పుడు అది 'ప్రజ్ఞ' అనే సందర్భం కాదు. ఇక్కడ మీరు చూచే వస్తువులలో అది ఆడుతుంది, ప్రజ్ఞ అనబడుతుంది. అక్కడ దానిని "అప్రజ్ఞ" అవాలి.

ఇది ఆత్మ, తుర్యం. నాలుగోదిగా చెప్పబడే ఈఆత్మ నా ఉత్తర కాశీ ప్రభువైన విశ్వనాథుడు. ఆయనను నేను ఆరాధిస్తాను. (మాండూక్య 7)

శ్లో॥ అకారేణ తథోకార మకారాభ్యాం చ సంస్థితః।
ఓంకారాత్మా య స్తురీయ స్తం వందే కాశికాపతిమ్॥ 7

ప్రతి॥ యః = ఏ ఆత్మస్వరూపము, అకారేణ = అకారముచే, తథా = అట్లే, ఉకారమకారాభ్యాం + చ = ఉకారమకారాలచేతనూ, సంస్థితః = ఉండునో, ఓంకారాత్మా = ఓంకారస్వరూపుడు, తురీయః = మోక్ష రూపుడో——

## తాత్పర్యం

అకార, ఉకార, మకారాలు, రెండు ఓంకారధ్వనులకు మధ్య ఉన్న నిశ్శబ్దం—ఈ ఓంకారంలో నాలుగుపాదాలు కలిగిన ఆత్మ ఉన్నది. అమాత్ర ఓం తుర్యావస్థ. పరమమైన నాలుగో పాదమే ఉత్తరకాశీశుడైన ప్రియ విశ్వనాథుడు. ఆయనను నేను ఆరాధిస్తాను.

## వ్యాఖ్య

ఓంకారంలో అకార, ఉకార, మకారాలనే మూడు అక్షరాలు ఉన్నాయి అవి మేలుకొన్నవాడిని, స్వాప్నికుణ్ణి, గాఢనిద్రలో ఉన్నవానిని సూచిస్తాయి. ఈ మూటికన్న భిన్నమై వాటి అనుభవాలకన్న భిన్నమైనది ఆత్మజ్ఞానమైన శుద్ధపదం. అదే నాలుగోది. ఈ నాలుగోపాదం 'అ' మాత్ర "ఓం" ద్వారా సూచిత మౌతుంది. 'అ' మాత్ర అంటే రెండు ఓంకారాలకు మధ్యనుండే నిశ్శబ్దం (మాండూక్య 8–12)

ఎనిమిదో శ్లోకంనుండి శ్రీ గురుమహారాజ్ కృష్ణయజుర్వేదానికి చెందిన తైత్తిరీయోపనిషత్తును విశదీకరిస్తారు. శిక్షావల్లి యొక్క నాలుగో అనువాకంలో ఓంకారం సాధకుని యొక్క సత్కామనలను తీర్చుతుందని చెప్పబడివున్నది

శ్లో॥ ఓంకారాత్మా మహానిద్రః ప్రజ్ఞా ప్రజ్ఞాన మేవచ।
యో దదాతి తదర్థిభ్య స్తం వందే కాశికాపతిమ్॥ 8

ప్రతి॥ యః = ఎవడు, ఓంకారాత్మా = ఓంకారస్వరూపుడై, మహాన్రిద్రాః = అలజడులులేని మహాశాంతస్వరూపుడు, ప్రజ్ఞ = ఘనీభవించిన ప్రజ్ఞగల ఆత్మ, ప్రజ్ఞానం + ఏవ + చ = ప్రజ్ఞానమును కూడా, తత్ + అర్థిభ్యః = తన్ను ఆరాధించిన వారికి, దదాతి = ఇచ్చుచున్నాడో———

## తాత్పర్యం

ఓంకార స్వరూపుడైన, పరమాత్మ జపపూజాదులవల్ల ఆరాధింపబడి నప్పుడు ఆయన తగిన వివేకాన్ని ప్రసాదించుతాడు ఆవివేకంద్వారా ఏపరమ పద శుద్ధచైతన్యాన్ని భక్తుడు తనమనోవాంఛితానుసారం అందుకొంటాడో ఆ సౌమ్య కాశీశునికి నేను నమస్కరిస్తాను.

## వ్యాఖ్య

శ్రీ గురుదేవులు ఈ శ్లోకంనుండి తైత్తిరీయోపనిషత్తులోని భావాలను ఉపయోగిస్తున్నారు. తైత్తిరీయం కృష్ణ-యజుర్వేదంలో ఉన్నది అందులోని భావాలు మూడువల్లులు అంటే మూడు తీగెలుగా సాగుతుంది — శిక్షావల్లి, బ్రహ్మానందవల్లి, భృగువల్లి అనేవి ఆ మూడు. ఎనిమిది, తొమ్మిది శ్లోకాలలో శ్రీ స్వామీజీ మొదటి వల్లిలోని నాలుగో అనువాకంలోని బోధను చాలా సన్నిహితంగా అనుసరిస్తారు. ఓంకారోపాసనవల్ల చురుకైన, తేజోవంతమైన బుద్ధిని కోరినవారు దానిని, అంతరంగిక సంపదని కోరుకున్నవారు దానినిపొంది తద్ద్వారా ఆధ్యాత్మిక జీవితంలో అత్యున్నతస్థాయిని చేరవచ్చును.

ఈ శ్లోకంలో ఉదహరించబడిన అనువాకంలో ఋషి ఓంకారోపాసన విషయం తెలుపుతున్నారు. జప, హోమ పూజాదులద్వారా ఓంకారం ఉపాసింప బడినప్పుడు సాధకుడు తాను కోరుకునే ప్రజ్ఞను నైతికవిలువలను పొందగలడు. ధ్యానంలో విజయవంతంగా నిలిచి శుద్ధచైతన్య పదాన్ని చేరడానికి ప్రజ్ఞ, నైతికవిలువలు చాలా అవసరం.

ఆ ఓంకారసారం సౌమ్య కాశీశుడు. ఆయనను నేను ఆరాధించి నమస్కరిస్తాను.

"సమేంద్రో మేధయా స్పృణోతు" అమృతస్యధారణో భూయాసమ్" వంటి మంత్రాలను ప్రతిభావంతమైన బుద్ధిని కోరుకునేవాళ్ళు జపించాలని ఉపనిషత్తు సందేశం. తైత్తిరీయంలోని అతిసూక్ష్మమైన బోధను లోతుగా అధ్యయనం చేసి తెలుసుకోడానికి ఇది అవసరం. (తైత్తిరీయ 1· 4. 1)

కేవలం బుద్ధితో గ్రహిస్తే చాలదు. మనలో సరైన విలువలు, నైతిక ఆధ్యాత్మిక సంపద కావాలి. దానినే "లక్ష్మి" అంటారు. వీటిని కూడా మనం ఓంకారంవల్ల పొందవచ్చును.

శ్లో॥ అన్నపానే శ్రియం గాశ్చ ఛాత్రాన్ కీర్తిం చ కీర్తితః।
యో దదాతి తదర్థిభ్య స్తం వందే కాశికాపతిమ్॥ 9

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, అన్నపానే = అన్నపానాలను, శ్రియం = సంపదను, గాః + చ = గోవులను, ఛాత్రాన్ = శిష్యులను, కీర్తితః = పొగడదగిన, కీర్తిం + చ = కీర్తిని, తత్ + అర్థిభ్యః = తన భక్తులకు, దదాతి = ఇస్తున్నాడో——

## తాత్పర్యం

ఏ ఓంకారం పూజింపబడి ఉపాసింపబడినప్పుడు భక్తులు కోరుకునే అన్నపానాలను, ధనాన్ని, పశుసంపదను, అనేక శిష్యుల్ని, గొప్పకీర్తిని ప్రసాదించగలదో ఆ ఓంకారమైన పరమాత్మ కాశీపతికి నేను నమస్కరిస్తాను.

## వ్యాఖ్య

తైత్తిరీయంలో ఈనాలుగో అనువాకంలో హోమం చేయడానికి అనువైన మంత్రాలనేకం ఇవ్వబడినాయి.

"అన్నపానే చ సర్వదా"
"తతో మే శ్రియ మావహ"
"లోమశం పశుభిః సహ స్వాహా"
"ఆమాయం తు బ్రహ్మచారిణః స్వాహా"

మొదలైనవి. ధనం, వస్తుసంపద, తినడానికి–త్రాగడానికి పుష్కలంగా ఆహారపానీయాలు, చేతలో—తలపులో ఉదారులైన శిష్యవర్గము మొదలైనవి. అయితే ఇవన్నీ గురుకులాశ్రమాలకోసం కాని వ్యక్తిగత సుఖాలకోసం కావని గమనించాలి. (తె. 1. 4, 2)

ఇప్పుడు వ్యాహృతిరూపంలోను, పాంక్తరూపంలోను ఓంకారోపాసన ఇవ్వబడుతోంది.

శ్లో॥ యద్వ్యాహృత్యాత్మనా పాంక్త స్వరూపేణ చ చింత్యతేః ।
చింతకైః బ్రహ్మ నిశ్చింతైః స్తం వందే కాశికాపతిమ్॥ 10

ప్రతి॥ యత్ బ్రహ్మ = ఏ బ్రహ్మస్వరూపం, నిశ్చింతైః = నిష్కాములైన, చింతకైః = విజ్ఞులచేత, వ్యాహృతి + ఆత్మనా = భూర్భువాది వ్యాహృతులచే, పాంక్తస్వరూపేణ + చ = పాంక్తస్వరూపాలచేతను, చింత్యతే = ధ్యానింపబడుతున్నదో——

## తాత్పర్యం

ఏకాగ్రచిత్తులై చెదరని మనస్సుతో ఓంకారాన్ని వ్యాహృతుల రూపంలోను పాంక్తరూపంలోను ధ్యానించి సాధకులు ఏపరబ్రహ్మమును ఉపాసిస్తారో ఆ బ్రహ్మమే కాశీపతి. ఆయనను నేను ఆరాధించి ప్రణమిల్లుతాను.

## వ్యాఖ్య

శిక్షావల్లిలో 5, 6 అనువాకాలలో వ్యాహృతుల రూపంలో ఓంకారాన్ని ఉపాసించే విధానం చెప్పబడింది. ఏడో అనువాకంలో పాంక్తరూపాలలో (అయిదేసి రూపాలుగా) ఓంకారోపాసన విధించబడివున్నది. అయిదయిదుగా ఉన్న ఇవి 1) ఐదు లోకాలు, 2) అయిదుగురు దేవతలు, 3) అయిదు భూతాలు (ఇవి అధిదైవికము), 4) అయిదు ప్రాణాలు, 5) కళ్లు మొదలైన అయిదు ఇంద్రియాలు, 6) అయిదు ధాతువులు, (అవి అధ్యాత్మికము). వ్యాహృతుల రూపంగా ఉన్న సమిష్టి ప్రపంచాన్ని, పాంక్తరూపంలో ఉన్న

వ్యక్తి అంటే వ్యష్టిని నిర్దేశించుతాయి. వ్యష్టి–సమిష్టి–ఈరెంటూ పరబ్రహ్మ రూపాలే, ఓంకారసారమే. జీవజగత్తుల ఈమొత్తాన్ని కలిపి ప్రజాపతి అంటారు అందువల్ల ఓంకారాన్ని ప్రజాపతిగా ఉపాసించేవాళ్లు విశ్వనాథుని పూర్తి మహిమను అనుభవించ గలుగుతారు.

నిజమైన సాధకుడి హృదయంలో వుండవలసిన సద్గుణాలు, ప్రవర్తనలో తెచ్చుకోవలసిన సౌశీల్యం ఉపనిషత్తు పేర్కొన్నది ముఖ్యమైన వీటిని మరిచి ఆధ్యాత్మిక దివ్యపథంలో ముందుకు పోలేక చిక్కుకు పోకుండా ఉండడానికి గాను శ్రీ గురుదేవులు వీటిని ఎత్తిచూపుతున్నారు.

శ్లో॥ సత్యోక్త్యా ధర్మచారేణ స్వాధ్యాయాధ్యయనేన చ।
యద్బ్రహ్మ సేవ్యతే సద్భిస్తం వందే కాశికాపతిమ్॥ 11

ప్రతి॥ యత్ + బ్రహ్మ = ఏ పరబ్రహ్మము, సత్య + ఉక్త్యా = సత్యవాక్కుచే ధర్మచారేణ = ధర్మాచరణచే, స్వాధ్యాయ + అధ్యయనేనచ = వేద శాస్త్రాధ్యయనములచే, సద్భిః = సత్పురుషులచే, సేవ్యతే = సేవింప బడుచున్నదో———

## తాత్పర్యం

సత్యవాక్కును అభ్యసిస్తూ, ఇంద్రియనిగ్రహాన్ని అలవరచుకొంటూ, సాదానిజాయితీ జీవనంలో శాస్త్రాలను నిరంతరం అధ్యయనం చేస్తూ ఉత్తమ సాధకులు ఏ పరబ్రహ్మమును ఉపాసిస్తారో ఆ ఉత్తరకాశీశునికి నేను నమస్కరించుతాను.

## వ్యాఖ్య

స్వార్థకామన లేకుండా ఆధ్యాత్మిక జీవనంలోని నియమాల నన్నింటినీ దీక్షతో అభ్యసించినప్పుడు ఆ అభ్యాసాలు సాధకుని మనోబుద్ధుల్ని నిర్మలం గావిస్తాయి. శుద్ధమైన మనస్సు జాగృతమై, చురుకుగా ఆత్మానుభవంకోసం ఎదురుచూస్తూ ఉంటుంది. అలాంటి మనస్సు ధ్యానానికి తగిన స్థిరత్వాన్ని

పొందుతుంది. సాధకుడు సునాయాసంగా, సుఖంగా, మధ్యలో ఏ అవాంతరాలూ లేకుండా శుద్ధచైతన్య పరబ్రహ్మ స్వరూపంలోకి చేరుకోగలుగుతాడు. ఆ బ్రహ్మమే ఉత్తరకాశీశుడు. ఆయనకు నా నమస్కారాలు!

శ్లో॥ దానాగ్నిహోత్ర మిజ్యా చ శ్రౌతస్యైతద్ధి లక్షణమ్।
స్మార్తో వర్ణాశ్రమాచారో యమై శ్చ నియమై ర్యుతః॥
సత్యం జ్ఞాన మనంతం యద్ బ్రహ్మబుద్ధ్వా విపశ్చితః।
భుంజతే సకలాన్ భోగాన్ తం వందే కాశికాపతిమ్॥ 12

ప్రతి॥ దాన + అగ్ని హోత్రం = దానాగ్ని హోత్రాలు, ఇజ్యా + చ = యాగము చేతను కూడిన, ఏతత్ = ఇదియే, శ్రౌతస్యలక్షణం = శ్రోత్రియుని లక్షణం, వర్ణ + ఆశ్రమ + ఆచారః = చాతుర్వర్ణాలు, చతురాశ్రమాలు, ఆచారాలు, యమైః = యమముతోను, నియమైః = నియామాలచేతను, యుతః = కూడినవాడు, స్మార్తః = స్మార్తుడు, యత్ + బ్రహ్మ = ఏ పరబ్రహ్మస్వరూపమును, సత్యం = సత్యము, జ్ఞానమ్ = జ్ఞానము, అనంతమ్ = అనంతముగా, బుద్ధ్వా = తెలిసికొని, విపశ్చితః = పండితులు, సకలాన్ = సమస్తమైన, భోగాన్ = భోగాలను, భుంజతే = అనుభవిస్తున్నారో — తం = అట్టి, కాశికాపతిం = కాశీశ్వరుని, వందే = నమస్కరిస్తున్నాను.

## తాత్పర్యం

వేదాలలో విధింపబడిన దానాలు, అగ్నిహోత్రాలు, యజ్ఞాలు, ధర్మశాస్త్రాలలోని వర్ణాశ్రమాచారాలు, యమనియమాలతో కూడుకున్న విజ్ఞానులు త్రికాలాబాధితమైన సత్యము, శుద్ధచైతన్య స్వరూపమైన జ్ఞానము అనంతమూ అయిన బ్రహ్మసాక్షాత్కారంపొంది ప్రాపంచిక భోగాలన్నింటినీ పొందుతారు. కాశికాపతి అయిన ఆ పరబ్రహ్మకు నేను ప్రణమిల్లుతాను.

## వ్యాఖ్య

పరమపదమైన బ్రహ్మముయొక్క ఉత్తమోత్తమ నిర్వచనం తైత్తిరీయం రెండోవల్లిలో ఉన్నది. పరబ్రహ్మన్ని వాక్కుతో వర్ణించడానికి వీలులేదు.

కాబట్టి వీనిని నిర్వచనం అనడానికికూడా వీలులేదు. సూచనం అనవచ్చును ప్రతివాని హృదయంలోను కేవల సాక్షిరూపంలో ఉండి, ప్రతి అనుభవాన్ని వెలిగించే శుద్ధచైతన్యాన్ని సూచించే మూడు నిర్దేశాలు అవి.

మనలోని ఎరుకసారమే అది మూడుకాలాలలోను మారదు. బాల్యంలో, యౌవనంలో, మధ్యవయస్సులో, వృద్ధాప్యంలో మన అన్ని అనుభవాలను వెలిగిస్తూ ఉంటుంది. కాబట్టి సత్యం అనబడుతుంది. మన శారీరక మానసిక, బౌద్ధిక అనుభవాలు మారినా మనచుట్టూతా వుండే ప్రపంచంలో అన్ని పరిస్థితులూ మారినా, సంఘటనలు, సన్నివేశాలూ మారినా ఏకమై సమమైన చైతన్యం వాటినన్నింటని మన ఎరుకలోనికి సూటిగా చేర్చుతుంది.

ఎవరికాంతిలో మన అనుభవాలన్నీ ప్రవేశించి, వెలిగి. మనకు వ్యక్తిగతమైన స్వాంతజ్ఞానంగా నిలిచిపోతాయో ఆ చైతన్యం అది. అది అనంతం. దేని చేతా, ఎప్పుడూ అది పరిమితం కాదు (పరిచ్ఛేద రహితం)

యావత్ప్రపంచానికి అధిష్ఠానమైన ఈ బ్రహ్మము మన అందరి హృదయాలలోను సాక్షిచైతన్యమైన ఆత్మయే. ఈ ఆత్మను తెలుసుకోగానే మనం బ్రహ్మమునుకూడా తెలుసుకుంటాము. పడకగదిలో వున్న ఒక బల్బులోని కరెంటును తాకగానే ప్రపంచంలో ఉన్న యావత్తుకరెంటును గురించీ తెలుసుకున్నట్లే.

ఈ బ్రహ్మమే ఉత్తరకాశీశుడు. నా ప్రియ సౌమ్య కాశీశునికి ప్రణమిల్లుతాను.

"తస్మా దేతస్మా దాత్మనః"—(ఆ బ్రహ్మమైన ఈ ఆత్మనుండి) అని ఉపనిషత్తు ప్రకటించినప్పుడు ఆత్మే పరబ్రహ్మమని ఋషి స్పష్టంగా సూచిస్తున్నాడు. మన బుద్ధిలోని సారంగా చైతన్యకేంద్రం వున్నది. అదే ఆత్మ. దీనిని తెలుసుకొంటే ప్రపంచబాహుళ్యానికి వెనకవున్న ముఖ్యసారాన్ని తెలుసుకున్నట్లే, ప్రతికెరటంలోను సారంగా సముద్రమే వున్నది! ఒక కెరటంలోని నీటిని రుచిచూస్తే సముద్రాన్నంతనూ రుచిచూచినట్లే. (తై 2. 1, 2)

శ్లో॥ వ్యోమవాతాదికం సర్వం సంభూతం భూత భౌతికమ్।
ప్రత్యగాత్మాత్మనో యస్మా త్తం వందే కాశికాపతిమ్॥ 13

ప్రతి॥ యస్మాత్ = ఏ, ఆత్మనః = బ్రహ్మస్వరూపంనుండి, ప్రత్యక్ + ఆత్మా అంతరాత్మ, వ్యోమవాత + ఆదికం = ఆకాశం గాలి మొ॥ వానిని, సంభూతం = పుట్టిన, సర్వం = సమస్తమైన భూతభౌతికం = ప్రాణులు, ప్రకృతులను, పొందుచున్నదో——

## తాత్పర్యం

అందరిలోని ప్రత్యగాత్మ అయిన పరబ్రహ్మమునుండి ఆకాశము మొదలైన పంచమహాభూతాలు ఉదయించాయి. వాటి పరస్పర సమ్మేళనంలో అన్ని నామరూపాలు సంభవించాయి. ఆ పరబ్రహ్మమే సౌమ్య కాశీశుడు. ఆయనకు ప్రణామాలర్పిస్తాను.

## వ్యాఖ్య

ఒక సజీవవ్యక్తిలో వ్యక్తమయ్యే పరబ్రహ్మం అతడి ఆత్మ ఆయన నుండి పంచమహాభూతాలు—ఆకాశ, వాయు, అగ్ని, జల భూములు వ్యక్తమయ్యాయి. పరస్పరం అవి కలియడంతో భూమినుండి ఓషధులు, వాటినుండి ఆహారం, అందులోనుండి బీజం, తల్లిదండ్రుల బీజాలనుండి మానవులు ఏర్పడ్డారు. సృష్టిని గురించి చెప్పిన క్రమాలలో ఇది ఒకటి.

ఇలా పరబ్రహ్మం నుండి జగత్తుకు ఉపాదానకారణమైన పంచమహాభూతాలు, నామరూప యుక్తమైన భౌతిక ప్రపంచము రూపొందింది. (తై 2. 5. 1,)

శ్లో॥ అన్నాది ప్రపంచకోశేభ్యో యోఽన్య ఆనంద ఆంతరః।
బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా చ తం వందే కాశికాపతిమ్॥ 14

ప్రతి॥ యః = ఏ పరబ్రహ్మము, అన్న + ఆదిపంచకోశేభ్యః = అన్నాది పంచ కోశాలకంటే, అన్యః = ఇతరమైన, ఆనందః = ఆనందము, ఆంతరః =

అంతరము, బ్రహ్మపుచ్ఛం = బ్రహ్మపీఠము, ప్రతిష్ఠా + చ = పతాక యిను అగుచున్నదో——

## తాత్పర్యం

పంచకోశాలకు అతీతమైనది, కేవలం ఆనందరూపమైనది, అన్నికోశాలకు లోపల నిత్యం నివసిస్తూ ఆనందమయకోశానికి ప్రతిష్ఠ అయిన ఆ బ్రహ్మమే కాశీపతి. ఆయనకు నేను ప్రణమిల్లుతాను.

## వ్యాఖ్య

ప్రాణిలో ప్రాణకేంద్రాన్ని చుట్టుకొని వున్న పదార్థాలను వేరువేరు స్థాల్యాలతో వుండే అయిదుకోశాలుగా వేదాంతం విభజించి వివరిస్తుంది.

అతిస్థూలమై అన్నింటికన్న బయట వున్నదానిని అన్నమయకోశం అంటారు. అరిగించుకొని జీర్ణంచేసుకొన్న అన్నంతో ఇది తయారవుతుంది. దీనిని స్థూలశరీరంఅనికూడా అంటారు. మన మెలకువ సమయంలో ఇందులో ఉండి వ్యవహరిస్తాము.

పంచప్రాణాలు ఇంద్రియ మనోబుద్ధులతో కూడినది సూక్ష్మశరీరం. స్వప్నావస్థలో మనం ఇందులో వుండి వ్యవహరిస్తాము. దానిని ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, కోశాలనికూడా అంటారు.

ఏమీ తెలియని అయోమయస్థితిని "అవిద్య" అంటారు. అదే అయిదోది అయిన ఆనందమయకోశం. గాఢనిద్రావస్థలో మనం అందులో వుంటాము.

ఈ అయిదూ పరమాత్మను కప్పిపెట్టుతాయి కాబట్టి కోశాలన్నారు. పట్టుపురుగు తనలోంచే తయారుచేసుకొన్న పట్టుదారంతో తన చుట్టూరా అల్లుకొని చివరికి అందులో చిక్కుపడిపోయి బాధపడుతుందో, అలాగే ఆత్మ కూడా తన ఆలోచనా కల్పనాలతో వాటిలో చిక్కుపడిపోతుంది,

అన్నమయంనుండి ఆనందమయం వరకు ❋ ఈ కోశాలు ఒకదానిలో ఒకటి ఉన్నట్లుగా భావించబడుతాయి. వేదాంతపరిభాషలో సూక్ష్మమైనది లోపల ఉన్నట్లు లెక్క. ఇలా ఏర్పాటైన కోశాలు 'గుహ' వలె వుంటాయి. ఈ గుహ లోని ఆత్మని కనుక్కోవాలి

ప్రతికోశము ఒకపక్షిలా వుంటుందని ఉపనిషత్తు వర్ణించింది ప్రారంభ దశలో ఉండే ఈవర్ణన సాధకులకు ఎంతో ఉపయోగంగా ఉంటుంది. అన్నమయ కోశవర్ణన ఇలా ఉన్నది. ❋❋ ఈ తలే దాని శిరస్సు ఈ కుడి చెయ్యి దాని కుడిరెక్క. ఈ ఎడమచెయ్యి దాని ఎడమరెక్క ఈమధ్య నుండే శరీరం దాని ఆత్మ ఈ కాళ్లు దానితోక దానిమధ్య మనం నడిచి ఒకదిక్కును అనుసరిస్తాము.

అయిదు కోశాలకు భిన్నంగా మనలోనే ఈ ఆత్మ ఆనందమయ కోశానికి పుచ్ఛంగా అధిష్ఠానం (ప్రతిష్ఠ)గా వున్నది. ఇది ధ్యానాభ్యాసంకోసం ఇవ్వ బడింది నిజంగా ఆత్మ అయిన బ్రహ్మము ఆనందమయకోశానికి తోక కాదు, బ్రహ్మము అన్నికోశాలకు భిన్నము, స్వతంత్రము. ఈ కోశాల వివరణలన్నీ పది దశల్లో శుద్ధచైతన్యం యొక్క పరమసాన్నిధ్యాన్ని మనం చేరుకోడానికే ఇవ్వబడినాయి. (తై 2. 1–5)

ఈ బ్రహ్మ ము "నాస్తి" అని అన్నాడా, ఆ వ్యక్తి నాస్తికుడే అవుతాడు!

శ్లో॥ యద్బ్రహ్మ సద్ఘనం మూఢో వేద యోఽసచ్ఛరీరకమ్।
అసన్నేవ భవత్యేష తం వందే కాశికాపతిమ్॥ 15

---

❋ జీవితంలో మనకు కలిగే యావత్తు ఆనందము ఇందులో ఉన్నది— 1) ప్రియమైన వస్తువును తలచుకోడం, 2) ఇష్టమైన వస్తువుకు దగ్గరగా ఉండం. 3) ఇష్టమైన దానిని అనుభవించడం — ప్రియ, మోద, ప్రమోద — అని మూడరకాలుగా ఈ ఆనందం వ్యక్తమవుతుంది.

❋❋ తస్య ఇదమేవ శిరః అయం దక్షిణః పక్షః అయ ముత్తరః పక్షః అయమాత్మా ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా!

ప్రతి॥ యత్ + బ్రహ్మ = ఏ బ్రహ్మస్వరూపాన్ని, యఃమూఢః = ఏ మూర్ఖుడయితే. సత్ + ఘనం = ఘనీభవించిన ఉనికిగల దానిని, అసత్ = లేనిదానినిగను, శరీరకం = శరీరము కలదిగాను, వేద = తెలిసికొనుచున్నాడో, ఏషః = యితడు, అసన్ + ఏవ = అసత్తే, భవతి = అవుతాడు——

## తాత్పర్యం

సద్ఘనమైన ఈచైతన్య స్వరూపాత్మను అసత్తని ఏమూర్ఖుడు తలపోస్తాడో అతడు అసత్తే అవుతాడు ఆ బ్రహ్మమే కాశీశుడు. ఆయనకు భక్తితో ప్రణమిల్లుతాను!

## వ్యాఖ్య

ముక్తసరిగా చెప్పాలంటే ఆత్మ అయిన ఆయనను కాదనే వాళ్లుండరు. ఆయనను కాదంటే తన్ను తాను కాదని త్రోసివేసుకొన్నట్లే, ఆయనే తనకు అస్తిత్వాన్ని ఇచ్చేది. 'నాకు తండ్రి లేడు' అని తన అస్తిత్వాన్నే కొట్టివెయ్యకుండా ఎవరైన అనగలరా? తండ్రి లేడంటే తాను లేనట్లే!

శ్లో॥ జగత్సృష్ట్వా త దేవానుప్రావిశ జ్జీవభావభృత్।
**కామితా చ తపస్వీ య స్తం వందే కాశికాపతిమ్॥** 16

ప్రతి॥ జగత్ + సృష్ట్వా = లోకమును సృష్టించి, జీవభావభృత్ = ప్రాణుల స్వరూపంధరించేవాడు, తత్ + ఏవ = ఆప్రాణుల దే, అనుప్రావిశత్ = ప్రవేశించిన వాడు, కామితా = కోరికలు గలవాడు, తపస్వీ + చ = తపస్వియు (నగుచున్నాడో)——

## తాత్పర్యం

ఏకమైన ఆ పరమాత్మ నామరూపాలతో మార్పులతో కూడిన జగత్తును సృష్టించి, అందులోకి ప్రవేశించి జీవుడిగా వ్యక్తిత్వాన్ని పొందాడు. ప్రపంచ

సృష్టిని కోరి తపస్సు చేసిన పరమాత్మయే కాశీకేశ్వరుడు. అకామి, తపస్వి కూడా అయిన ఆయనకు నా ప్రణామాలు.

## వ్యాఖ్య

ప్రపంచాన్ని సృజించాక సృష్టితో తాదాత్మ్యం పొంది ప్రవేశించాడు. ప్రవేశించి చేతనత్వం, చురుకు కలిగిన పరిమితప్రాణి అయ్యాడు. అదే మీరూ, నేనూ. ఇలా తన మహిమను తాను తెలుసుకొని తాదాత్మ్యం పొందిన ఆ బ్రహ్మము సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అయిన ఈశ్వరుడయ్యాడు తన జ్ఞాన ఇచ్ఛా క్రియా శక్తుల్ని తెలుసుకొన్న భగవంతుడు సృష్టిచెయ్యాలని కోరకుండా ఉండలేడు. అందుచేత ఆయన సృష్టికర్త అయ్యాడు సృష్టి చేశాక దానిని ప్రేమించి,శరీరమనోబుద్ధులతో తాదాత్మ్యం చెంది పరిమితుడై దర్శించే భావించే–విచారించే జీవుడయ్యాడు. ఇవన్నీ గొలుసుగా ఒకదానివెంట ఒకటిగా వచ్చిన ఆలోచనా పరంపరలో జరిగాయి మనోబుద్ధులతో ఆలోచనాప్రవాహం ఏర్పడడమే దేశకాలాలకు మూలం.

పరిమితమైన ప్రపంచబాహుళ్యాన్ని చూస్తూ మనం ప్రస్తుతం ఈ పరిస్థితిలో ఉన్నాము. ప్రతిఒక్కరు దర్శించే, భావించే, జీవి ఆనందాన్ని తిరిగి పొంది అనుభవించడానికి ప్రయత్నిస్తున్నాడు, అయితే దీనికోసం అతడు శరీర మనోబుద్ధుల సహాయంతో 'విషయాలు–ఉద్రేకాలు–తలపులు' ప్రపంచంలో పరుగులు పెట్టవలసిందే. ఇవన్నీ కాలపరిధిలోవే.కాబట్టి పరిమితమై అశాశ్వతమై అంతమయిపోతాయి. అందువల్ల పూర్ణతృప్తి లేక జీవి తిరిగి తిరిగి సంపాదించ డానికి, అట్టిపెట్టడానకి, అతుక్కపోడానికి మళ్ళీమళ్ళీ అనుభవించడానికి ప్రయత్నిస్తూ తన పరిస్థితిని మెరుగు చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. ప్రతి అనుభవానికి కాలంయొక్క కాటు వున్నది. అందుకే అవి మారిపోతాయి.

ఇలా అన్నిటికన్న నిత్యంగా ఉండే సత్యం పరబ్రహ్మం. సరిగా విచారించి తెలుసుకున్నప్పుడు చివరికి జీవుని అసలు రూపం బ్రహ్మమే. ❋

ఇంకా:

---

* ❋ జీవో బ్రహ్మైవ నాపరః

శ్లో॥ సచ్చ త్యచ్చాభవ ద్బ్రహ్మ మూర్తామూర్తాత్మకం జగత్।
జడాజడ విభిన్నం య త్తం వందే కాశికాపతిమ్॥ 17

ప్రతి॥ యత్ + బ్రహ్మ = ఏ పరబ్రహ్మము, సత్ + చ = సత్యమును, త్యత్ + చ = లేనిదియు, మూర్త + అమూర్త + ఆత్మకం = సాకార, నిరాకారాత్మకము, జడ + అజడ + విభిన్నం = చరాచరాత్మకము— అయిన, జగత్ = ప్రపంచముగా, అభవత్ = అయినదో——

## తాత్పర్యం

ఏకమైన ఆబ్రహ్మమే ఇలా సాకారము నిరాకారము అయి జడచైతన్యాలయి, అనుక్షణం మారే ఈప్రపంచ మయ్యాడు. ఆబ్రహ్మమె నా కాశీశుడు ఆయనకు వినయపూర్వకంగా నమస్కరిస్తాను.

## వ్యాఖ్య

ఒకే సముద్రమే చిన్న పెద్ద అలలు అయినట్లు, ఒకే బంగారం అన్ని నగలూ ఆయినట్లు, ఒకే బ్రహ్మం ప్రపంచంలోని జడము, చైతన్యములతో కూడిన ప్రాణులు కూడా అయివున్నాడు. భూమి, నీరు, అగ్ని—ఇవి సాకారాలు ఇవి మూర్తి లేదా సత్తు, గాలి ఆకాశం నిరాకారం. ఇది అసత్ లేదా అమూర్తి. ఈ అయిదు భూతాలు తమ పరస్పర సంపర్కాలతో స్థూలసూక్ష్మశరీరాలన్ని తయారయి జీవుడు, అతడు వ్యవహరించి అనుభవాలు పొందడానికి అనువైన జగత్తు ఏర్పడుతాయి.

పరబ్రహ్మలో మార్పులు లేవు. ఏకప్రశాంతాత్మ పైన ప్రపంచబాహుళ్యం లోని మార్పులన్నీ ఆపాదింపబడుతాయి. ఆ ఆత్మే సౌమ్య కాశీశుడైన విశ్వనాథుడు ఆయనకు భక్తితో ప్రణామాలర్పిస్తాను,

శ్లో॥ రసవద్బ్రహ్మ యల్లబ్ధ్వా బుధః పిబతి యద్రసమ్।
రసం బ్రాహ్మం బహిష్కృత్య తం వందే కాశికాపతిమ్॥ 18

ప్రతి॥ యత్ + రసవత్ + బ్రహ్మ = ఏ రసస్వరూపమైన పరబ్రహ్మమును, లబ్ధ్వా = పొంది, బుధః = పండితుడు, బాహ్యం + రసం = భౌతికానందాన్ని, బహిష్కృత్య = బహిష్కరించి, యత్ + రసం = ఏఆనందాన్ని, పిబతి = గ్రోలుచున్నాడో, తం = అట్టి, కాశికాపతిం = శివుని, వందే = నమస్కరిస్తున్నాను.

## తాత్పర్యం

బాహ్యవిషయ వస్తువుల సుఖాన్ని వదిలేసి ఆనందరసమైన బ్రహ్మమును సాక్షాత్కారం చేసుకొన్న మహాత్ముడు ఆంతఃసుఖాన్ని గ్రోలుతాడు. ఆ బ్రహ్మము కాశీ విశ్వనాథుడే. ఆయనకు నేను ప్రణమిల్లుతాను.

## వ్యాఖ్య

ఇంద్రియ మనోబుద్ధులద్వారా బాహ్యవిషయాలను, వ్యక్తుల్నీ స్పృశించినప్పుడే మనకు ప్రాపంచిక సుఖానుభవం కలుగుతుంది. అది విషయాధారమైన సుఖమే. విషయ–ఉద్రేక–తలపుల ప్రపంచంలో గ్రుడ్డిగా పెట్టుకొన్న ప్రమేయాలను విడిచి. మనస్సుయొక్క పూర్తిదృష్టిని లోపలికి మళ్ళించినప్పుడు, మనస్సుశాంతమై, జాగృతమై ఉత్తమానుభవానికి ఎదురుచూస్తూ చైతన్యకేంద్రమైన ఆత్మ వైపుకి తిరుగుతుంది. ఆ సమయంలో వర్ణనాతీతమైన శుద్ధచైతన్యానందం కలుగుతుంది, దానిని దేవుడనండి. సత్యమనండి, అదే ఇక్కడ వున్న అన్ని ఆకారాలలో, అన్ని ప్రాణులలో రమించే అద్వితీయ శుద్ధచైతన్య పదమైన బ్రహ్మము. ఇదే నా ప్రీతిపాతుడైన కాశీ విశ్వేశ్వరుడు, సౌమ్య కాశీశుడు. ఆయనకు భక్తితో ప్రణమిల్లుతాను, (తై 2. 5. 7)

**శ్లో॥ అదృశ్యేఽనాశ్రమేఽనాత్మ్యే యస్మిన్ బ్రహ్మణి నిష్ఠయా।**
**అభయం విందతే విద్వాన్ తం వందే కాశికాపతిమ్॥ 19**

ప్రతి॥ అదృశ్యే = కనబడని, అనాశ్రమే = ఆశ్రయింపని, అనాత్మ్యే = ఆత్మ కాని, యస్మిన్ = ఏ, బ్రహ్మణి = బ్రహ్మమందు, నిష్ఠయా = నిష్ఠచే, విద్వాన్ = పండితుడు, అభయం = అభయమును, విందతే = పొందుచున్నాడో——

## తాత్పర్యం

దృశ్యం కాని, ఆశ్రయం లేని, ❋ అశరీరి బ్రహ్మమును గురించి ధ్యానం చేస్తూ విద్వాంసుడు జాగృతుడైనప్పుడు ఆ ఆనందంలో అతడు అన్ని ఆందోళనలు, భయాలనుండి విముక్తు డౌతాడు. ఆ బ్రహ్మమె సౌమ్య కాశీశుడు ఆయనకు భక్తి పురస్సరంగా నమస్కరిస్తాను.

## వ్యాఖ్య

పరమాత్మ విషయ – ఉద్రేక – తలపుల ప్రపంచంలోని వస్తువుకాదు అందుచేత ఇంద్రియాలచేతగాని, మనోబుద్ధులవల్లగాని చూడబడడు. "అదృశ్య" అనడం అందుకే.

యావత్ప్రపంచానికి ఆయన అధిష్ఠానం, ఆధారం. ఆయన సర్వవ్యాపి కాబట్టి ఆయనకు వేరే ఆధారం అక్కరలేదు. "ఆయన తన మహిమలో తాను నిలిచివుంటాడ"ని ఉపనిషత్తు ఎలుగెత్తి మరీ చెబుతుంది.

పరమాత్మ పదంలో ధ్యానం ద్వారా ప్రతిష్ఠితుడైనప్పుడు, ఆ విజ్ఞాని శరీరమనోబుద్ధులనే పరికరాల నిరంకుశాధికారంనుండి, విషయ – ఉద్రేక – తలపుల అనుభవరంగాల ఆకర్షణలనుండి పూర్తిగా విముక్తుడౌతాడు.(తై 2.7)

**శ్లో॥ యోఽద్వయైకరసే యస్మిన్నుదరం ❋❋ కురుతేఽన్తరమ్।**
**స భయం విందతే బాల స్తం వందే కాశికాపతిమ్॥ 20**

ప్రతి॥ యః = ఏ, బాలః = బాలుడు, యస్మిన్ = ఏ, అద్వయ + ఏకరసే = అద్వైత పరబ్రహ్మ స్వరూపమందు, అంతరం = భేదమును, ఉదరం = లేశమాత్రమును, కురుతే = చూస్తూన్నాడో – కావున, సభయం = భయముతో, విందతే = పొందుచున్నాడో———

---

❋ "స్వమహిమ్ని ప్రతిష్ఠితః"

❋❋ అరం = కొద్దిగా, ఉత = అయినా.

## తాత్పర్యం

శుద్ధ అద్వయ పరబ్రహ్మంలో ఎవరు కొద్దిగానైనా భేదాలు చూస్తారో ఆ అజ్ఞాని బాలకుడు. జనన మరణాల భయంతో జీవిస్తాడు. ఆ పరబ్రహ్మ మైన కాశికాపతికి నేను భక్తితో ప్రణామం చేస్తాను.

## వ్యాఖ్య

జిజ్ఞాసువుయొక్క చివరి లక్ష్యం శుద్ధచైతన్యపదం. పరిమితులు లేని, అద్వయమైన, మార్పులు లేని, పరిపూర్ణమైన ఆనందపదం దానితో తాదాత్మ్యం పొందడానికి బదులు జిజ్ఞాసువు కొద్దిపాటిగానైనా ద్వైతభావాన్ని పట్టుకొని కూర్చున్నాడా అతడు ఆనందానుభవంనుండి తన్నుతాను బహిష్కరించు కున్నట్లే.

శ్లో॥ భియా యస్మాద్వాతి వాయు స్సూర్యాగ్నీ తపతోఽనిశమ్।
ధావతో మృత్యు రింద్రశ్చ తం వందే కాశికాపతిమ్॥ 21

ప్రతి॥ యస్మాత్ = ఏ పరబ్రహ్మమువలన, భియా = భయముచే, వాయుః = గాలి, వాతి = వీచుచున్నదో, అనిశం = ఎల్లప్పుడు, సూర్య + అగ్నీ = సూర్యాగ్నులు, తపతః = కాల్చుచున్నవో, మృత్యుః = (చావు) యముడు ఇంద్రః = (రక్షకుడు) దేవేంద్రుడు, ధావతః = (కర్తవ్యమున)పరుగిడు చున్నాడో——

## తాత్పర్యం

ఏ పరబ్రహ్మ భయంవలన వాయువు వీస్తుందో, సూర్యాగ్నులు మండు తారో, మృత్యువు, ఇంద్రుడు పరుగెత్తుతారో ఆ పరబ్రహ్మము కాశీపతి. ఆయనకు నేను ప్రణామాలర్పిస్తాను.

## వ్యాఖ్య

ఇక్కడ భయమంటే శిక్షింపబడుతామన్న భయం కాదు. ప్రేమగౌరవా లున్నచోట హృదయంలో జనించే భయమది. ప్రకృతిలోని అన్ని వస్తువుల

లోను కనిపించే నియమబద్ధతవల్లనే మనం నివసించే ఈ ప్రపంచం ఒకతీరుగా నడుస్తోంది. ఇది అయోమయం కాదు. ఒక శాసకుడు, పాలకుడు ఉండి అందరిచేత ప్రేమింపబడి, గౌరవింపబడుతున్నప్పుడు ఆయన శాసనాలని భయ భక్తులతో అందరూ, అన్నీ పాటిస్తారు. ఏవీ ఉల్లంఘించరు ఆయన వాటివెనుక కొరడా ఝుళిపిస్తూ బెదరిస్తున్నట్టుగా ప్రకృతిలోని ప్రతిఒక్క విషయం ఆయన శాసనాలని సంపూర్ణంగా పాటిస్తాయి.

మనుష్యుడికి ఒక్కడికే ఈ శాసనాలకు ఎదురుతిరిగే 'స్వాతంత్ర్యం' ఉన్నది. అయితే అలా ఉల్లంఘించినప్పుడల్లా మనం ఎన్నో సమస్యలను దుఃఖాలను సృజించుకుంటున్నాము. మనం పర్యవేక్షించి చూచుకుంటే మన అశాంతి, ఉద్రిక్తత, దుఃఖాలు అన్నీ మానవకృతాలేనని ప్రకృతివల్లనో భగవంతుడివల్లనో కలిగినవి కావనీ గ్రహించుతాము (తై 2. 8)

శ్లో॥ యదానంద మహాంభోధే ర్విప్రుషో హి వపుష్మతామ్।
బ్రహ్మాదీనాం య ఆనందా స్తం వందే కాశికాపతిమ్॥ 22

ప్రతి॥ యః = ఏ పరబ్రహ్మము, యత్ + ఆనందమహాంభోధేః = ఏ ఆనంద రూపమయిన సముద్రంయొక్క, వపుష్మతాం = ప్రాణులయొక్క, విప్రుషః = ఆనందము, బ్రహ్మ + ఆదీనాం = బ్రహ్మాదులయొక్క, ఆనందాః = ఆనందములును——

## తాత్పర్యం

అనంతానంద సముద్రమైన పరబ్రహ్మ స్వరూపంతో పోల్చితే అన్ని ప్రాణుల విషయానందాలు సృష్టికర్త ఆనందంకూడా కలుపుకున్నా, ఆ సముద్రంలో ఒకనీటిబొట్టు అవుతాయో, ఆ ఆనందరూప కాశిపతికి నేను భక్తితో ప్రణమిల్లుతాను.

## వ్యాఖ్య

లెక్కల అధికారులు అంకెలతో ఆడుకున్నట్లే సామాన్య మానవుడికి అర్థంకావడంకోసం ఉపనిషత్తు ఋషీ అనంతానందాన్ని లెక్కలుకట్టి చూపు

తున్నాడు ఎంతో సమర్థవంతమైన సూక్ష్మమైన విశ్లేషణం చేసి ఆనందపు అంచనాలు ఇవ్వబడుతున్నాయి. ఈలోకంలో, స్వర్గంలో అన్ని ప్రాణుల అన్ని సుఖాలు కూడి, ప్రజాపతి ఆనందాన్ని కూడా కలిపి ఈ మొత్తం ఆనందం బ్రహ్మానంద సముద్రంలో ఒక చుక్క అని ప్రకటింపబడింది. బహుళ ప్రపంచంలో ఉన్న విషయానందం విలువ ఇంతే.

మనస్సు సంపూర్ణంగా శాంతమైనప్పుడు ఆక్షణంలో ప్రతిఒక్కడూ సుఖాన్ని అనుభవిస్తాడు. కోరికలతో సతమతమయ్యే మనస్సు దాని కాక్షణంలో ఉన్న కోరిక తీరినప్పుడు క్షణకాలం శాంతిస్తుంది. ఆక్షణంలో ఒక ఆనందరేఖ మెరుపులా వస్తుంది. సామాన్య మానవుడు ఆ ఆనందాన్ని తన కామ్య వస్తువు ఇచ్చిందనుకుంటాడు.

నిజానికి ఆవస్తువులోనే సుఖం వుండివుంటే ప్రతివస్తువును పొంది నప్పుడూ ప్రతివ్యక్తికి ఏకమైన సమానమైన సుఖం కలగాలి. అలా వుండదు. ఒకవ్యక్తికి ఆవస్తువులో ఎంతగాఢమైన కోరిక వున్నదో అంతలోతైన ఆనందమే లభిస్తుంది.

నిజంగా జరిగేదేమంటే, మనస్సు శాంతించినప్పుడు లోపలనుండి ఆత్మ స్వరూపమైన ఆనందం మెరుపులా వచ్చి కనబడుతుంది. అది పరమాత్మసారం (తై 2. 8)

శ్లో॥ సంప్రాప్య యద్బ్రహ్మ వచోవిదూర
మానందభాజోఽతితరంతి భీతిమ్।
శ్రేయోంఽహసే నిర్దహతశ్చ నైతాన్
సోదేతు చిత్తే మమ శంభుమూర్తిః॥ 23

ప్రతి॥ ఆనందభాజః = ఆనందం పొందువారు, యత్ + బ్రహ్మవచః = వేదాలను, విదూరం = క్షుణ్ణంగా, సంప్రాప్య = పొంది, భీతిం = సంసార భయాన్ని, అతితరంతి = దాటుచున్నారో, శ్రేయో + అంహసే = పుణ్య పాపాలను, నిర్దహతః + చ = కాల్చుచున్నారో, ఏతాన్ = ఈ అన్ని రూపాలు, న = తానుకాడో, సః = ఆ, శంభుమూర్తిః = శివుడు, మమ = నా, చిత్తే = చిత్తమందు, ఉదేతు = పుట్టుగాక!

## తాత్పర్యం

వాక్కులకు దూరమైన బ్రహ్మచైతన్య పదాన్ని క్రమమైన ధ్యానం ద్వారా పొంది తన స్వస్వరూపమైన ఆనందంలో రమించుతున్న ఆనిర్భయుడు దైనిక జీవితంలోని భయాలు, బెంగలు, విచారాలవల్ల స్పృశించబడక పరమాత్మ నందుకొంటాడు. ఆ బ్రహ్మపదమే కాశీవిశ్వనాధుడు. నా హృదయంలో ఆ సదాశివమూర్తి ఉదయించును గాక!

## వ్యాఖ్య

వాక్కుకు సంబంధించిన పరికరాలనన్నింటినీ వెలిగించేది ఆత్మ చైతన్యం. అందువల్ల వాక్కు దానిని వెలిగించలేదు. కారునడిపే డ్రైవరు తన కారుక్రింద పడలేడు!

ఈ ఆత్మపదంలోకి విధానోక్త పద్ధతిలో ధ్యానం ద్వారా చేరుకున్నప్పుడు (సంప్రాప్య), ఆ మహాత్ముడు ఆత్మ స్వరూపమే అయిన ఉత్తమోత్త మానందాన్ని అనుభవించి ఆనందిస్తాడు.

ఆ స్థాయిలో ఆయన పరిమితుడైన జీవికాడు. శరీర – మనో – బుద్ధుల కోరికలచేత, విషయ – ఉద్రేక – తలపుల ప్రపంచంలోని మార్పులచేత చెదరడు. అహంభావుల సామాన్య దుఃఖాలకు అతీతుడై అతడు ఆనందంలో జీవిస్తాడు.

తన వాసనలన్నీ దహింపబడినందున వెనకాల చేసిన దుష్కర్మలు, చెయ్యని సత్కర్మలు అతణ్ణి ఇంక బాధపెట్టవు. కలగనేవాడి దుఃఖాలు మేలుకున్న వాడివెంట పడుతాయా?

రెండుశ్లోకాలలో శ్రీ గురుదేవులు భృగువల్లిలోని భావాలను పొందుపరుస్తున్నారు.

శ్లో॥ శాఖా నిశాధీశవ ద తరాత్మా
యోఽన్నాదికోశై రుపలక్ష్యతేఽద్వా।
సమాధినోద్య త్తపసేంద్రియాణాం
సోదేతు చిత్తే మమ శంభు మూర్తిః॥ 24

ప్రతి॥ యః + అంతరాత్మా = ఏ అంతరాత్మ; శాఖా నిశాధీశవత్ = చంద్రశాఖా న్యాయరీతిగా, తపసా + ఇంద్రియాణాం = తపసేంద్రియాలయొక్క, సమాధినా = సమాధిచే, ఉద్యత్ = పుట్టినదై, యః + అద్వా = ఏ అద్వైతము, అన్నాదికోశైః = అన్నమయాదికోశాల ద్వారా, ఉపలక్ష్యతే = గుర్తింపబడుచున్నదో, సః = ఆ, శంభుమూర్తిః = శంకరుడు, మమ = నాయొక్క, చిత్తే = చిత్తమందు, ఉదేతు = పుట్టుగాక.

## తాత్పర్యం

ఒక వృక్షంయొక్క శాఖద్వారా చంద్రుణ్ణివలె, అన్నాది కోశాలద్వారా ఇంద్రియాలను మనస్సును శాంతింపజేసిన సాధకుడికి ఆత్మ నిర్దేశింపబడు తుంది అపరమాత్మ నాసామ్య కాశీశరూపంలో నాహృదయంలో ఉదయిం చును గాక!

## వ్యాఖ్య

దీనిని చంద్రశాఖాన్యాయ మంటారు. విదియనాడు సన్నగా గోరువలె, ఉండే చంద్రరేఖను ఒకచెట్టును చూపి దాని కొమ్మకొసను చూపి దానిమీదుగా చంద్రరేఖను నిర్దేశించుతారు. ఆ ప్రకారంగానే శుద్ధచిత్తం కలిగిన సాధకుడు ధ్యానంచేస్తున్నప్పుడు శ్రీగురువు అయిదు కోశాలనూ చూపి, వాటిద్వారా, వాటిని చైతన్యవంతంచేసే ఆత్మవైపుకు అతడి దృష్టిని మరల్చుతాడు.

అన్ని పద్ధతులలో జరిగే ధ్యానానికి అంతిమ లక్ష్యమైన ఆనందరూపాత్మ కాశీవిశ్వనాథుడు. ఆయన మంగళస్వరూపం నాహృదయంలో భాసించునుగాక!

శ్లో॥ యద్బ్రహ్మతా మేత్య బుధోఽభిగాయ
త్యన్నం తథాత్తాహమహో విచిత్రమ్।
తయోశ్చ కర్తా ప్యహ మేవ సర్వం
సోదేతు చిత్తే మమ శంభుమూర్తిః॥ 25

ప్రతి॥ బుధః = పండితుడు, యత్ + బ్రహ్మతాం = ఏ బ్రహ్మతత్త్వాన్ని, ఏత్య = పొంది, అభిగాయతి = గానంచేయుచున్నాడో, తథా = అట్లు, అహం = నేను, అన్నం = అన్నాన్ని, అత్త = తినుచున్నాడో - అది, అహో = ఔర!, విచిత్రం = ఆశ్చర్యకరము, తయోః + చ = ఆ రెండింటికి, కర్తా = కర్తను, అహం + ఏవ = నేనే, సర్వం = సమస్తమును—అయిన, సః = ఆ, శంభుమూర్తిః = శివుడు, మమ = నా, చిత్తే మనస్సునందు, ఉదేతు = ప్రతిష్ఠింపబడుగాక.

## తాత్పర్యం

బ్రహ్మపదమైన శుద్ధచైతన్యాన్ని అందుకొన్నప్పుడు ఆమహాత్ముడు సామగానం చేస్తాడు—"ఓహో అద్భుతం!" నేను రెండోది లేని శుద్ధసర్వవ్యాప్తాత్మనైనా, నేను జడమైన అన్నాన్ని, అన్నభోక్తను కూడా! ఈ రెంటినీ సృజించిన కర్తను, చైతన్యం ఇచ్చేవాడిని కూడా! ఆ బ్రహ్మపదం, ప్రియ కాశీపతి శంభురూపంలో నిరంతరం నాహృదయంలో నిలుచునుగాక!

## వ్యాఖ్య

ఏకమైన ఆత్మే భోగించే జీవుడుగా, భోగింపబడే ప్రపంచంగా అగపడుతుంది. మేలుకున్న మీ మనస్సే మీలో కలగనే వాడు — అతడికి కనబడే కలప్రపంచమూ కూడా. ఈ భోక్త — భోగ్య సమావేశాన్ని సృజించి, ఆడించి చేతనత్వాన్ని ఇచ్చేవాడు కూడ ఆత్మ అయిన నేనే! ఈ ప్రపంచంకూడా అలాంటి దైనందిన విచిత్రమే!

ముక్తసరిగా చెప్పాలంటే ఆ పదంలో నేను ఒక్కణ్ణె. ఇక్కడ కదిలి వ్యవహరించే వ్యక్తుల–విషయాల ప్రపంచము, వారికలయికలు, స్పందనలు, స్వంత అనుభవాలు కూడా నేనే! ఆ బ్రహ్మము, కాశికాపతి మంగళమూర్తి శంభుడు తన మహత్కరమైన మహిమతో నాలో నిరంతరం ఉదయించి కనబడుచుండును గాక!



# అష్టమ స్తబకం

ఈ స్తబకంలో శ్రీ గురుదేవులు ఋగ్వేదానికి చెందిన ఐతరేయోపనిషత్తులోని ముఖ్యభావాలను పేర్కొంటారు.

శ్లో॥ యః పరాత్మైక ఏవాసీ దగ్రే కించన నాభవత్।
అన్యద్వస్తు సదా ఖండం కాశీశం తముపాస్మహే॥ 1

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, పరా + ఆత్మా + ఏకః + ఏవ = పరమాత్మగానే, ఆసీత్ = ఉండెనో, అగ్రే = తర్వాత, కించన = ఏమియును,న + అభవత్ = కాలేదో, అసత్ + వస్తు = మరొకటి కాకుండా, సదా = ఎల్లప్పుడు, అఖండం = ఏకరూపమైన, తం = అట్టి, కాశీశం = శంకరుని, ఉపాస్మహే = ఉపాసిస్తున్నాను.

## తాత్పర్యం

ప్రారంభంలో సృష్టికి పూర్వం పరాత్మ ఒక్కటే ఉన్నది వేరే ఏదీ సృష్టికాలేదు. ఎప్పుడూ పరిమితులకు లోనుకాని అద్వితీయమైన అబ్రహ్మమే కాశీపతి. ఆయనను ఆరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

సృష్టికి పూర్వం ప్రపంచం అవ్యక్తంగా, అవ్యాకృతంగా ఉన్నప్పుడూ వ్యాకృతమై దృశ్యమైన ఈ స్థూలరూపంలోకి వచ్చినప్పుడూ ఎప్పుడూ అది కేవలం ఆత్మస్వరూపమే. అలలన్నీ కదులుతున్న సముద్రరూపాలు తప్ప వేరుకాదు. అన్ని అలలకు సముద్రమే అధిష్ఠానం అలాగే ఈ ప్రపంచంలోని, నామరూపాలన్నింటికీ ఆయన ఏకమైన అధిష్ఠానం. ఈ బాహుళ్యమంతా ఆయన

మీద అధ్యారోపింపబడి వున్నవి. ఈ ప్రపంచం పరబ్రహ్మయొక్క వ్యక్త రూపమే. అయితే ఇంద్రియాలు, మనోబుద్ధులు దానిని వికృతంగా మార్చి చూపుతున్నాయి.

శక్తిమంతంగా కదిలి మారే ప్రపంచబాహుళ్యం విశుద్ధ చైతన్యంయొక్క క్రీడయో ఆశుద్ధచైతన్యం ప్రేమాస్పదుడైన సౌమ్య కాశీశుడే! అయనను ఆరాధించి పూజిస్తాను.

సమిష్టి వాసనలలో వ్యక్తమయ్యే పరమాత్మ ఈశ్వరుడై, అనేకంతో కూడిన ప్రపంచాన్ని సృజించకోరుతాడు. (ఐ 1. 1)

శ్లో॥ య ఐక్షత సృజే లోకానితి లోకాన్ ససర్జ చ।
అంభోముఖాన్ లోకపాంశ్చ కాశీశం తముపాస్మహే॥ 2

ప్రతి॥ యః = ఏ పరబ్రహ్మ, లోకాన్ = లోకాలను, సృజే + ఇతి = సృష్టించుదునని, ఐచ్ఛత = ఇష్టపడెనో, అంభోముఖాన్ = నీరుమొదలుగాగల, లోకపాన్ + చ = లోకపాలకులుగల, లోకాన్ = లోకాలను, ససర్జ + చ = సృష్టించెనో,——

## తాత్పర్యం

పరమాత్మ లోకాలను సృజించాలని కోరుకొని సృష్టించాడు, అలాగే నీరు మొదలైన లోకపాలకుల్ని కూడా సృజించాడు. ఆ పరమాత్మ అరాధనీయుడైన కాశీపతి. ఆయనను ప్రేమతో ఆరాధిస్తాను.

## వ్యాఖ్య

రెండోది లేని ఏకమైన పరమాత్మ తన్ను తానెరిగినప్పుడు సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడు, ప్రాణులు—జడాలతో కూడిన ప్రపంచానికి ఈశ్వరుడౌతాడు. ఈశ్వరుణ్ణి సమిష్టివాసనలు ప్రేరేపించగా, అవాసనలు వ్యక్తమవడానికి వీలుగా ప్రపంచాన్ని సృజించడానికి సంకల్పించాడు. ఇలా బ్రహ్మ దేవుడుగా సృష్టికర్త అయ్యాడు. సృష్టించాడు. ఆయనే విష్ణువుగా రక్షిస్తాడు. పరము శివుడుగా ధ్వంసంచేస్తాడు.

అన్ని ఆకారాలకూ నీరు ముఖ్యమైనది. నీటితో ఘనీభవించిన పదార్థాలే ఆకారాలు అవుతాయి. వేడిచేసి నీటిని తీసివేస్తే స్థూలఆకారం పాడిఅయి పోతుంది. ఆకారం నిలవదు.

ఇందులో మరోసూచన కూడా వుండవచ్చును. స్వర్గానికి పైన వున్న లోకాలన్నింటినీ "అంభస్సు" అని మన సనాతన శాస్త్రాలలో పేర్కొన్నారు, ఇలా స్వర్గంనుండి క్రింద అన్ని లోకాలను (అంభోముఖాన్ లోకపాలాన్ చ), రక్షించే నిమిత్తం అగ్ని మొదలైన లోకపాలకుల్ని సృజించాడు. ఇలాగ విరాట్పురుషుడు సమిష్టి ప్రపంచాన్ని జ్ఞానంద్వారా సృజించాడు (జ్ఞానమయ తపస్సుద్వారా) యోచించి, ప్రతిప్రాణికి కావలసిన అవయవాలన్నింటినీ కూడా ఊహించాడు ఇది ఐతరేయోపనిషత్తులోని మొదటి ఖండంయొక్క సారాంశం. (ఐతరేయ 1. 2. 3)

ఇప్పుడు గురుదేవులు తన హృదయాధినాథుడైన సౌమ్య కాశీశుని ఉపనిషత్తులోని రెండో ఖండంద్వారా ఉపాసిస్తున్నారు.

శ్లో॥ అగ్న్యాది లోకపాలానాం స్థానానిచ పితామహః।
పురుషే నిర్ణిషేద్యః కాశీశం తముపాస్మహే.। 3

ప్రతి॥ యః + పితామహః = ఏ పరబ్రహ్మ, పురుషే = పరమ పురుషుని యందు, అగ్ని + ఆదిలోకపాలానాం = అగ్ని మొ॥ లోకపాలురయొక్క, స్థానాని + చ = స్థానాల్నికూడా, నిర్ణిషేత్ = నిర్ణయించెనో——

## తాత్పర్యం

పితామహరూపంలోని పరమాత్మ విరాట్పురుషునిలోని అగ్ని మొదలైన లోకపాలకుల ఆశ్రయాలను, వ్యవహారాలను నిర్ణయించాడు. ఆ పరమాత్మ సౌమ్య కాశీప్రభువే. ఆయనను ఆరాధించి సేవిస్తాను.

## వ్యాఖ్య

అనుభవరంగాలైన లోకాలను నిలబెట్టే అధినేతలు లోకపాలకులు. వీరు మన ఇంద్రియశక్తులే ప్రతి ఇంద్రియశక్తికి నిర్ణీతమైన రంగంలో నిశ్చితమైన వ్యవహారం వున్నది. అందుచేత వాళ్ళల్లో ఎటువంటి గందరగోళమూ ఉండదు వాళ్ళరంగాలు ఎక్కడా, ఎప్పుడూ కలిసిపోవడం అంటూ వుండదు.(ఐ 2. 3)

ఈ శక్తుల స్థానాలు ఏమిటో తరువాత శ్లోకంలో చెప్పబడుతుంది.

శ్లో॥ దేహే ముఖ మధిష్ఠాన మగ్నేర్వాయోశ్చ నాసికే।
రవేశ్చ నేత్రే యశ్చక్రే కాశీశం తముపాస్మహే॥

ప్రతి॥ యః = ఏ పరబ్రహ్మ, దేహే = శరీరమునందు, ముఖం = ముఖము అధిష్ఠానం = అగ్రభాగము, నాసికే = ముక్కునందు, అగ్నేః + వాయోః, + చ = అగ్నివాయువులకు (అధిష్ఠానము), నేత్రే = కంటియందు, రవేః + చ = సూర్యునికి, (అధిష్ఠానం), చక్రే = చేసెనో ——

## తాత్పర్యం

ఈ శరీరంలో నోటిలో అగ్ని వ్యవహరిస్తుంది వాయువు ముక్కుపుటాలలో, సూర్యుడు కళ్ళల్లోను వ్యవహరిస్తారు. ఇలా లోకపాలకులకు వ్యవహార రంగాలు ఏర్పరచిన పరమాత్మ సామ్య కాశీశుడే. ఆయనను నేను ఆరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

విరాట్పురుషునిలోని మూలశక్తులు మన వ్యవహారాలకు అధిష్ఠానదేవతలుగా వుంటాయి.

ఇలా అగ్ని వాక్కుకు అధిపతి, సూర్యుడు కంటిచూపునకు అధిపతి. వాయువు ముక్కుకు అధిపతి. అవి ఆయాస్థానాలకు సూత్రప్రాయమైన అధిష్ఠానాలు. ఆ వ్యవహారాలు నెరవేరడానికి ఆయా లోకపాలకులు అవసరం. జ్ఞానకర్మేంద్రియశక్తులే అవి (ఐ 2. 4)

శ్లో॥ దిశాంతు కర్ణౌ శుభ్రాంశో ర్హృదయం చ మహాప్రభుః।
యోఽథ నాభిం వ్యధాన్ మృత్యోః కాశీశం తముపాస్మహే॥ 5

ప్రతి॥ యః + మహాప్రభుః = ఏ మహారాజు, కర్ణౌ = చెవులను, దిశాం = దిక్కులకు, హృదయం = హృదయాన్ని, శుభ్రాంశోః = చంద్రునికి, అథ = తర్వాత, నాభిం = నాభిని, మృత్యోః = యమునికి–ఆధారంగా, వ్యధాన్ = అజ్ఞాపించెనో——

## తాత్పర్యం

దిక్కులకు చెవుల్ని శాసించడానికి, చంద్రుణ్ణి హృదయాన్ని ఏలడానికి; నాభివద్ద మృత్యువును పెట్టిన ఆ మహాప్రభువు కాశీకాపతియే. ఆయనను ఆరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

ఇలా విశ్వశక్తుల్ని సృజించి ఇంద్రియశక్తులకు అధిపతులుగా నియమించి వాళ్ళను ఏర్పాటు చేశాక, ప్రభువు వాటిని ఆకలిదప్పులకు గురిచేసినట్లు ఐతరేయం రెండోఖండంలో చెబుతుంది. ఆకలిదప్పులతో తహతహలాడుతూ పరమాత్మకు అవి మొరబెట్టుకొన్నాయి —"మాకు అనందాన్ని తృప్తిని ఇచ్చే విషయాలను స్వేచ్ఛగా తిరుబాటుగా భోగించడానికి అనువైన నివాసస్థానాలను ఏర్పాటుచేయి. వాటికోసం అవును, గుర్రాన్ని ఆయన చూపాడు. వాటికి ఆ శరీరాలు తృప్తి నివ్వలేదు. మానవశరీరాన్ని చూచినప్పుడు అవి పరిపూర్ణంగా తృప్తిపడ్డాయి. ఈ దేవతలు ముందు చెప్పిన క్రమంలో తమతమ స్థానాలలో వ్యష్టి మానవశరీరాలలో స్థిరపడి తమ ప్రభావాన్ని చూపసాగాయి. దానితో రెండోఖండం ముగింపుకి వస్తుంది.

ఇక మూడోఖండం, పరమాత్మ అనుకున్నాడు – పురుషుణ్ణి, లోకపాలకుల్ని, వాళ్ళధర్మాలను, స్థానాలను ఏర్పాటుచేసి ఆకలి దప్పులు కూడా పెట్టాడు. వాళ్ళ తుష్టికీ పుష్టికీ అన్నాన్నికూడా ఏర్పాటు చెయ్యాలి. అమితమైన ప్రేమవల్ల ఆయన ఇలా సంకల్పించాడు.

శ్లో॥ యో లోకలోకపాలేభ్యః సృష్టాన్నం చ పృథగ్విధమ్।
ప్రాణే నాగ్రాహయ ద్ధాతా కాశీశం తముపాస్మహే॥ 6

ప్రతి॥ యః + ధాతా = ఏ ప్రాణదాతయైన బ్రహ్మ–, లోక = లోకాలను లోకపాలేభ్యః = లోకపాలురకు, పృథగ్విధం = వేర్వేరుగా, సృష్ట = సృష్టించబడిన, అన్నం + చ = ఆహారమును, ప్రాణేన = ప్రాణవాయువు ద్వారా, అగ్రాహయత్ = అనుగ్రహించెనో, తం = అట్టి, కాశీశం = ఈశ్వరుని ఉపాస్మహే = ఉపాసిస్తున్నాను.

## తాత్పర్యం

లోకానికి, లోకపాలకులకు వివిధాలైన అన్నాన్ని సృష్టించి ప్రాణవాయు సహాయంతో పట్టుకొని అనందించే ఏర్పాటు చేశాడు. ఆ ఏర్పాటు చేసిన పరమాత్మ కాశీపతియే. ఆయనను ఆరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

ప్రపంచాన్ని, ఇంద్రియాలను, ఇంద్రియశక్తుల్ని సృష్టించిన తరువాత ప్రాణవాయువు సహాయంతో నోటికి ఆహారాన్ని స్వీకరించేట్లు (అనుభూతులు పొందేశక్తి) చేసి శరీరంలోని అన్ని శక్తులకు తృప్తి, పోషణ కలిగించాడు. ఆ పరమాత్మ సౌమ్య కాశీశుడే. ఆయనకు నావినమ్ర నమస్కృతుల నర్పిస్తాను

ఉపనిషత్తు ప్రకారం లోకపాలకుల ఆహారంనిమిత్తం అయిదు మహా భూతాలను సృజించి వాటి పరస్పరసంయోగాలద్వారా ప్రాపంచిక చరాచర రూపాలన్నింటినీ సృష్టించాడు. విషయాలు, ప్రాణులు ఇలాఏర్పడ్డాయి.

లోకపాలకుల్ని చూచి అన్నం తన్ను తినివేస్తారని భయపడి పరిగెత్త సాగింది. ప్రాణవాయువు వాటిని నిరోధించింది. ఇలా విషయ–ఉద్రేక–తలపుల ప్రపంచాన్ని శరీరమనోబుద్ధులు ఆస్వాదించి తృప్తిపడతాయి. నోటిలో పనిచేసే వాయుశక్తిని అన్నాయువని ఉపనిషత్తు పేర్కొన్నది. (ఐ 3. 1)

శ్లో॥ మూర్ధానం ప్రపిదార్యైతత్ కార్యకారణ సంహతిమ్।
ప్రాపద్యత యః స్రష్టా కాశీశం తముపాస్మహే॥ 7

ప్రతి॥ యః+స్రష్టా = ఏ బ్రహ్మ, మూర్ధానం = శిరస్సునందలి బ్రహ్మ రంధ్రమును, ప్రవిదార్య = చీల్చిప్రవేశించి, ఏతత్ = ఈ, కార్యకారణ + సంహతిం = జీవితానుభవాలసంపుటిని, ప్రాపద్యత = సృష్టించెనో—

## తాత్పర్యం

పరమాత్మ తాను నివసించి సుఖించడానికిగాను కార్యకారణ సంఘాత మైన శరీరంలో తలభాగాన్ని చీల్చి బ్రహ్మరంధ్రంద్వారా లోపలికి ప్రవేశించాడు అయన నాప్రీతిపాత్రుడైన కాశీశుడే. ఆయనను ప్రేమించి ఆరాధిస్తాను.

## వ్యాఖ్య

తలలో మూడు (నడినెత్తి) మీద మెత్తగా ఉండే స్థానంబ్రహ్మరంధ్రం. దానిద్వారా ప్రభువు ప్రవేశించి శరీరంలో అధ్యక్షత వహించి దాని అన్ని కార్యాలకు చేతనత్వాన్ని ఇస్తాడు "ప్రవేశించడం" అంటే శరీరమనోబుద్ధులతో తాదాత్మ్యం వహించడమే.

ఈ తాదాత్మ్యం బుద్ధిస్థాయిలో జరుగుతుంది. ఇది పరమ తప్పిదం. సరైన విచక్షణ లేక జరుగుతుంది. ఈ ప్రకారంగా పరమేశ్వరుడు దర్శించే—భావించే—వివక్షించే వాడు అయిన పరిమిత జీవుడుగా నటించసాగుతాడు. ఆ పరమాత్మే కాశీశుడు. అయనని ప్రేమతో భక్తితో ఆరాధిస్తాను.

పరబ్రహ్మం ఈ రంధ్రంద్వారా ప్రవేశించినందున దానికి బ్రహ్మ రంధ్రం అనే పేరుకలిగింది.

శ్లో॥ విదృతి ర్నాందనం చేతి గీయతే వేదపారగైః।
యత్ప్రవేశ సృతిర్భక్త్యా కాశీశం తముపాస్మహే॥ 8

ప్రతి॥ యత్ + ప్రవేశసృతిః = ఏ బ్రహ్మరంధ్రంయొక్క ముఖద్వారము—, వేదపారగైః = వేదవేత్తలచేత, భక్త్యా = భక్తితో, విదృతిః = విదృతియు, నాందనం = నాందనముననియు, గీయతే = పాడబడుచున్నదో——

## తాత్పర్యం

పరమాత్మ శరీరంలోకి ప్రవేశించిన ద్వారాన్ని * విదృతి అని నాందనం ** అనీ కూడా అంటారు. ఆయన తలను చీల్చి ప్రవేశించాడు. అందుకే విదృతి అనబడింది. ఈ ద్వారం నుండే పరిమితపరికరాలను వదిలి జీవుడు శుద్ధానందపదాన్ని చేరుకుంటాడు. అందుకే ఇది నాందనం అనబడుతుంది.

శ్లో॥ తథా ప్రవిష్టో యస్సాక్షా జ్జీవభావేన వేశ్మసు।
త్రిషు సంక్రీడతే నిత్యం కాశీశం తముపాస్మహే॥ 9

ప్రతి॥ తథా = అట్లు, ప్రవిష్టః = బ్రహ్మరంధ్రం ప్రవేశించిన, యః = ఏ పరబ్రహ్మ, సాక్షాత్ = ప్రత్యక్షముగా, జీవభావేన = జీవభావనచే, త్రిషువేశ్మసు = మూడులోకాల్లో, నిత్యం = ఎల్లప్పుడు, సంక్రీడతి = వినోదించుచున్నాడో——

## తాత్పర్యం

ఏశుద్ధ సత్యాత్మస్వరూపం జీవభావంగా శరీరాలలో ప్రవేశించి జాగ్రత్స్వప్న నిద్రాప్రపంచాలలోని అనుభవరంగాలలో క్రీడిస్తుందో ఆ బ్రహ్మమే కాశీశుడు. ఆయనను భక్తితో సేవిస్తాను.

## వ్యాఖ్య

పరిమితజీవుడైన ఆత్మ శరీరమనో బుద్ధులతో భ్రాంతివల్ల తాదాత్మ్యం పొంది జాగ్రత్తు, స్వప్నము, గాఢనిద్రాస్థితులు—మూటిలో సంచరిస్తూ సుఖ

---

* విదృతి = విదారిత – చీల్చబడిన.

** నాందనం = చిన్నప్పుడు కృష్ణుడు ఆడుకున్నచోటు.

దుఃఖాల పంటలను భోగిస్తుంది. ఆయనే బాధపడేవాడు, కర్మచేసేవాడు, భోగించేవాడుకూడా!! ఆ బ్రహ్మమే కాశీశుడు. అయినను ప్రేమతో భక్తితో సేవిస్తాను.

శ్లో॥ జాగ్రదా ద్యభిమానేన సంసరన్ తద్గుణార్దితః।
గురూక్త్యా బ్రహ్మ యః పశ్యేత్ కాశీశం తముపాస్మహే॥ 10

ప్రతి॥ యః + బ్రహ్మ = ఏ పరబ్రహ్మ, జాగ్రత్ + ఆది = జాగ్రదాది అవస్థలను, అభిమానేన = ఇష్టముతో, సంసరన్ = ఆదరిస్తూ, తత్ + గుణ = వానిగుణాలచే, అర్దితః = చుట్టబడి, గురు + ఉక్త్యా = గురూపదేశముచే పశ్యేత్ = చూచునో——

## తాత్పర్యం

జాగ్రత్స్వప్న సుషుప్తి ప్రపంచాలలో అభిమానంతో సంచరిస్తూ ఆ గుణాలవలన వేధింపబడుతున్న జీవుడు సద్గురు బోధలవల్ల పరబ్రహ్మను దర్శించే ఆ సౌమ్య కాశీశుణ్ణి ఆరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

మూడు అవస్థలలోని చైతన్యానికి అహంకార, కామపూర్వకమైన సంబంధాల వల్ల సుఖదుఃఖాలు జనించుతాయి. వాటివల్ల వేధింపబడుతూ పరమాత్మే మిథ్యా బాధలను అనుభవిస్తుంది. గురుసహాయంతో అందులోంచి బయట పడుతుంది.

శ్రీ గురు సహాయంతోనే జీవుడు, తన ఆత్మస్వరూపాన్ని తిరిగి పొంద గలుగుతాడు. గురువు దారిచూపుతాడు. శిష్యుడు గురువుబోధించిన పద్ధతి ప్రకారం ధ్యానిస్తాడు. దీనివల్ల మనస్సు శుద్ధమై, శాంతమై, జాగృతమై స్థిరమైన ధ్యానస్థితినిపొంది, ఆత్మను సాక్షాత్కారం చేసుకొని శుద్ధచైతన్య పదంలో మేల్కొంటుంది. ఇలా జ్ఞానాన్ని పొంది ముక్తుడౌతాడు. (ఐ 3. 13)

ఇక్కడితో ఉపనిషత్తులోని మూడోఖండంలోని భావాలు పూర్తిఅయ్యాయి.

శ్లో॥ గర్భబాలజరత్తాది చక్రేఽస్మిన్ జీవనామభృత్।
యోఽయం భ్రాంత్యా బంభ్రమితి కాశీశం తముపాస్మహే॥ 11

ప్రతి॥ యః + అయం = ఏ పరబ్రహ్మ, చక్రే + అస్మిన్ = ఈ ప్రాణి చక్రమందు, గర్భ + బాల + జరత్ + అది = గర్భవాసము, బాల్యము, ముసలితనము మొ॥ జీవనామభృత్ = జీవులను పేరుతో, భ్రాన్త్యా = భ్రాంతితో, బంభ్రమం + ఇతి = సంచరిస్తున్నాడో——

## తాత్పర్యం

గర్భస్థశిశువును, బాల్యాన్ని, వృద్ధాప్యాన్ని సృజించిన పరమాత్మ తన నిజస్వరూపాన్ని ఎరగని అవిద్యలో భ్రాంతివల్ల తిరిగి తనకు సరిపడే యోనిలో మరో క్రొత్త జీవితాన్ని వెదుక్కుంటాడు. ఆ పరమాత్మే కాశీశుడు. అయనని ఆరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

జాగ్రదవస్థను విస్మరించడంవల్ల ఎలా మనం స్వయంగా సృష్టించుకొన్న కలలోని అనుభవాలతో తాదాత్మ్యంచెంది భ్రాంతిపడతామో, అలాగే ఆత్మకూడా తన్నుతాను విస్మరించి శరీర–మనో–బుద్ధుల పరికరాలద్వారా విషయ–ఉద్రేక–తలపుల ప్రపంచాన్ని గుర్తించి పరిమితమైన జీవుడుగా వ్యవహరిస్తుంది. ఇలా వ్యవహరిస్తున్నప్పుడు కూడా అతడు పరమాత్మయే, వేరుకాదు. మీరు కలలో బాధపడుతున్నప్పుడుకూడా సుఖంగా ఏ ప్రమాదమూ లేక గదిలో నిద్రపోతున్నవారే!

గర్భంలో, బాల్యంలో, వృద్ధాప్యంలో బలహీనతలతో పరిమితుడైన జీవుడుగా వ్యవహరించే పరమాత్మ చనిపోయి తనవాసనలను ఖర్చుచేసుకోడానికి అనువైన రంగానికి తగిన గర్భాన్ని వెదుక్కుంటాడు. ఆ పరమాత్మ నా సౌమ్య కాశీశుడే! ఆయనను ఆరాధిస్తాను. (ఐ 6. 1)

ఇవి అన్నీ ఆత్మ నెరుగని అవిద్యాకారణంగా కలుగుతాయి. ఆధ్యాత్మికంగా ప్రగతిని పొంది శుద్ధమైన హృదయంతో ధ్యానంలో జీవుడు

ముక్తుడై శుద్ధచైతన్య పరమపదంలోకి మేల్కొన్నప్పుడు దాని పరిభ్రమణలు ఇక బాధాకరంగా, భ్రాంతిజన్యకంగా ఉండడం మానివేస్తాయి. కలలోంచి మెల్కొన్నాక కలలోని బాధ లేంచేస్తాయి? ఈ విషయాన్ని రాబోయే శ్లోకం తెలుపుతుంది.

శ్లో॥ అవిద్యాజాలకం భిత్వా శ్యేనవత్ యత్ప్రబోధతః।
నిర్ముక్తో నిశ్చరేత్ కశ్చిత్ కాశీశం తముపాస్మహే॥ 12

ప్రతి॥ యత్ = ఏ పరబ్రహ్మము. శ్యేనవత్ = డేగవలె, కశ్చిత్ = ఒకానొకడు, అవిద్యాజాలకం = అవిద్యయనెడివలను, భిత్వా = చీల్చుకొని ప్రబోధతః = బోధితుడై,– నిర్ముక్తః = ముక్తుడై, నిశ్చరేత్ = వెలువడున్తో తం = అట్టి, కాశీశం = శంకరుని, ఉపాస్మహే = ఉపాసిస్తున్నాను.

## తాత్పర్యం

వలలో చిక్కుకున్న గ్రద్ద ఏప్రకారంగా దానిని తెంపివేసి విడుదల పొంది తనసహజ స్వాతంత్ర్యాన్ని తిరిగి పొందుతుందో, అలాగే అవిద్యా జాలాన్ని తెంపివేసి శుద్ధాత్మపదంలో జాగృతుడౌతాడు. ఇలా విడుదలై సంచ రించే వారు అరుదుగా ఉంటారు. ఆశుద్ధాత్మ కాశీశుడు. ఆయనను ఆరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

శుద్ధాత్మపదాన్ని ఎరుగని అవిద్యకారణంగా మనం ప్రపంచ మిథ్యా భ్రాంతుల్ని నిలుపుకొంటాము, విషయవస్తువుల ఆకర్షణలకు, వాటివల్ల వచ్చే అల్పసుఖాలకు లోనై భ్రాంతుల జాలంలో చిక్కుకుంటాము. సాక్షాత్తు ఆత్మ స్వరూపాన్ని గుర్తెరగడంద్వారా ఈ అవిద్యా పంజరంలోనుండి విడివడినప్పుడు జాగృతుడైన ఆ జ్ఞాని విముక్తుడై అనంతానందంలో స్వతంత్రంగా జీవిస్తాడు. (ఐ 4. 5)

శ్లో॥ అవిద్యాకామకర్మాణి విభిద్య విబుధాగ్రణీః।
యద్భవ త్యాత్మభేదే శ్రీ కాశీశం తముపాస్మహే॥ 13

ప్రతి॥ యత్ = ఏపరబ్రహ్మం, విబుధ + అగ్రణీః = పండితశ్రేష్ఠుడు, అవిద్యా కామకర్మాణి = అజ్ఞానరూప కార్యాలను, విభద్య = ఛేదించి, ఆత్మభేదే = ఆత్మఅంతర్యాలల్లో, భవతి = ఉంటున్నదో———

## తాత్పర్యం

హృదయగ్రంథుల్ని తెంచినవాడై ఆ ఉత్తమవిజ్ఞాని శరీరం నశించిన తరువాత పరమాత్మలో పూర్తిగా ఐక్యమౌతాడు. ఆ ఆత్మే స్వామ్యి కాశీశుడు ఆయనను ఆరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

మన వ్యక్తిత్వంపైన వున్న సంకెళ్ళను హృదయగ్రంథు లంటారు అవి మూడింటివలన ఏర్పడుతాయి—ఆత్మయొక్క ఆనందస్వరూపాన్ని గుర్తెరగని స్థితి అవిద్య, ఆకారణంగా కలిగే కోరికల పరంపర–కామం, ఉన్న కోరికలను తీర్చుకొనుటకు శ్రమపడి చేసేవి కర్మలు.

ఈ మూడింటికి ప్రాథమికకారణం మొదటిదైన అవిద్యయే. శుద్ధ చైతన్యంయొక్క అద్భుతానంద స్థితిని సూటిగా అనుభవించి తెలుసుకున్నప్పుడు దాని కోసం కృషిచేయవలసిన అవసరం ఉండదు. ఇలా ఆధ్యాత్మికంగా వికసించి ఆత్మసాక్షాత్కార మైనవాడు శరీరాన్ని విడిచిన తరువాత తిరిగి మరో శరీరంలోకి ప్రవేశించి విషయరంగంలో తిరుగాడవలసిన అవసరం లేదు. దివ్యాత్మలో లీనమైపోతాడు.

ఇక్కడితో ఉపనిషత్తుయొక్క నాలుగోఖండంలోని భావాలను శ్రీ గురు దేవులు సమాప్తం చేశారు.

శ్లో॥ కోఽయమాత్మేతి సంసారాద్వ్యావివృత్సుభి రాత్మని।
అన్విష్యతేఽన్వహం యః శ్రీ కాశీశం తముపాస్మహే॥ 14

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, సంసారాత్ = సంసారబంధం నుండి, వ్యావివృత్సుభిః = తప్పించుకొనగోరువారిచే, కః + ఆత్మా + ఇతి = ఎవడుఈ ఆత్మ అని, ఆత్మని = ఆత్మయందు, అన్వహం = ప్రతిదినమూ, అన్విష్యతే = వెదుకబడుచున్నాడో

## తాత్పర్యం

బహుళప్రపంచములోని పరిమిత జీవితంనుండి విముక్తులు కాగోరిన తపోనిష్ఠులైన ఋషులు, "ఈఆత్మ ఎవరు?" అని నిత్యము హృదయాలలో విచారణ చేస్తూంటారు. ఆ ఆత్మయే కాశీశుడు. నేను అయనను భక్తితో అరాధిస్తాను.

## వ్యాఖ్య

లోలోపలే ఆత్మవిచారణద్వారా ఆత్మ స్వరూపాల్ని వారు గుర్తెరుగుతారు అది ఎలా సాధ్యమవుతుందో స్ఫూర్తిమంతమైన క్రింది అయిదు శ్లోకాలలో ఈవిషయం తెలుపబడుతోంది, (ఐ 5.1)

శ్లో॥ చక్షు ర్భూతేన మనసా నానారూపాణి పశ్యతి।
ప్రత్యగాత్మా త్మనా యః శ్రీ కాశీశం తముపాస్మహే॥ 15

ప్రతి॥ యః + ప్రత్యగాత్మ = ఏఅంతరాత్మ, ఆత్మనా = ఆత్మచే, చక్షుః భూతేన = కన్నుల రూపమైన, మనసా = మనస్సుచేత, నానారూపాణి = అనేకరూపాలను. పశ్యతి = చూస్తున్నదో, తం—

## తాత్పర్యం

ఎవరు పరిమితుడైన జీవుడుగా మారి కన్నుగా మారిన మనస్సుద్వారా వివిధరూపాలను చూస్తాడో ఆప్రత్యగాత్మ అయిన సామ్యకాశీశుణ్ణి నేను అరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

మనస్సు వెనక లేకపోతే ఇంద్రియాలు చురుకెక్కి జ్ఞానంతో వ్యవహ రించవు. గాఢనిద్రలో మనస్సు విశ్రాంతి తీసుకొంటుంది. అందుకే ఏదృశ్యాలు కనబడవు. అందుకే గురుదేవులు 'కంటిరూపంలోని మనస్సు' చూస్తుందన్నారు అయితే కేవలం మనస్సు తనకు తానుగా కళ్ళద్వారా చూడలేదు. దానిలో చైతన్యం ఉండాలి. చైతన్యం యొక్క మూలస్థానం ఆత్మ. అందుచేత ఇక్కడ ఆత్మ మనస్సు కారణంగా మనస్సునుండి చూస్తుందని వివరింపబడింది, (ఐ 5.1,2)

శ్లో॥ శ్రోత్రభూతేన మనసా నానాశబ్దాన్ శ్రుణోతిచ।
ప్రత్యగాత్మాత్మ నా యః శ్రీకాశీశం తముపాస్మహే॥ 16

ప్రతి॥ యః + ప్రత్యగాత్మ = ఏఅంతరాత్మ, ఆత్మనా = ఆత్మచే, శ్రోత్రభూ తేన = చెవిరూపమైన, మనసా = మనుస్సుచే, నానాశబ్దాన్ = అనేక నాదాలను, శ్రుణోతి + చ = వింటున్నదో, తం—

## తాత్పర్యం

పరిమితజీవుడై కర్ణంగా మారిన మనస్సుద్వారా వివిధ శబ్దాలను వినే అపరమాత్మ శ్రీ కాశీశుణ్ణి నేను ఆరాధించి ఉపాసిస్తాను.

శ్లో॥ ఘ్రాణభూతేన మనసా గంధాన్ జిఘ్ర త్యనూనకాన్।
ప్రత్యగాత్మాత్మనా యః శ్రీ కాశీశం తముపాస్మహే॥ 17

ప్రతి॥ యః + ప్రత్యగాత్మ = ఏఅంతరాత్మ, ఆత్మనా = ఆత్మచే, ఘ్రాణభూతే న = నాసికా స్వరూపముతో, మనసా = మనస్సుచేత, అనూనకాన్ = నా నారకాలైన, గంధాన్ = వాసనలను, జిఘ్రతి = వాసనచూస్తున్నాడో, తం

**తాత్పర్యం**

పరిమితజీవుడై ముక్కుగా మారిన మనస్సుద్వారా అనేకరకాల వాసనలను అనభవించే ఆపరమాత్మ శ్రీ కాశీశుణ్ణి నేను ఆరాధించి ఉపాసిస్తాను.

శ్లో॥ వాణీభూతేన మనసా వక్తవ్యం వ్యాకరోతి చ।
ప్రత్యగాత్మాత్మనా యః శ్రీ కాశీశం తముపాస్మహే॥ 18

ప్రతి॥ యః + ప్రత్యగాత్మ = ఏఅంతరాత్మ, ఆత్మనా = అత్మచే, వాణీభూతేన వాగ్రూపమైన, మనసా = మనస్సుచేత, వక్తవ్యం = చెప్పదగినదానిని, వ్యాకరోతి = విశదీకరిస్తున్నాడో, తం = ఆ, కాశీశం = ఈశ్వరుణ్ణి ఉపాస్మహే = ఉపాసించుచున్నారు.

**తాత్పర్యం**

పరిమిత జీవుడై వాక్కుగా మారిన మనస్సుద్వారా పెక్కు అర్థాలతో కూడిన అనేకధ్వనులను చేసే ఆపరమాత్మ శ్రీ కాశీశుణ్ణి నేను ఆరాధించి ఉపాసిస్తాను.

శ్లో॥ జిహ్వా భూతేన మనసా జానాతి వివిధాన్ రసాన్।
ప్రత్యగాత్మాత్మనా యః శ్రీ కాశీశం తముపాస్మహే॥ 19

ప్రతి॥ యః + ప్రత్యగాత్మ = ఏఅంతరాత్మ, ఆత్మనా = ఆత్మచే, జిహ్వాభూతేన = నాలుక స్వరూపముతో, మనసా = మనస్సుచేత, వివిధాన్ = అనేకములైన, రసాన్ = రుచులను, జానాతి = తెలుసుకొనుచున్నదో, తం

**తాత్పర్యం**

పరిమితజీవుడై జిహ్వగా మారిన మనస్సుద్వారా రకరకాల రుచులను అస్వాదించే ఆపరమాత్మ శ్రీ కాశీశుణ్ణి ఆరాధించి ఉపాసిస్తాను.

వ్యాఖ్య

ఆత్మ వేరు వేరు ఉపాధులనుండి ఇలా వ్యవహరిస్తున్నప్పుడు జరుగుతున్న క్రియలను బట్టి వేరువేరు పేర్లను పొందుతుంది. ఈవిషయం రానున్న మూడు శ్లోకాలలో చెప్పబడుతుంది.

శ్లో॥ సంజ్ఞాన జ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞానాని చ శేముషీ।
యద్బ్రహ్మణోఽభిధాః శ్రీమత్కాశీశం తముపాస్మహే॥ 20

ప్రతి॥ యత్ + బ్రహ్మణః = ఏబ్రహ్మనుండి, శేముషీ = తెలివి, సంజ్ఞాన + అజ్ఞాన + విజ్ఞాన + ప్రజ్ఞానానిచ = సంజ్ఞానము, అజ్ఞానము, విజ్ఞానము, ప్రజ్ఞానము—నని, అభిధాః = పిలువబడుచున్నవో

తాత్పర్యం

సమ్యగ్జ్ఞానమని, అజ్ఞానమని, విజ్ఞానం, ప్రజ్ఞానం, శేముషీ—అని వేరు వేరు పేర్లతో సూచింపబడే శ్రీ కాశీశుణ్ణి భక్తితో ఉపాసిస్తాను.

వ్యాఖ్య

(1) పరిపూర్ణమైన జ్ఞానం సంజ్ఞానమనబడుతుంది. (2) సమష్టి అయిన అవిద్యఅజ్ఞానం అందులో కనబడే ఈశ్వరుడుకూడా అజ్ఞానంవల్లగోచరమయ్యేవారే. అందుకే అజ్ఞానం (3) అనుభవజ్ఞానం విజ్ఞానం. (4) విషయరహితమైన కేవలజ్ఞానం ప్రజ్ఞానం (5) తెలివిరూపంలో బైటికి వచ్చేది శేముషి-అన్నియు పరమాత్మ పేర్లే.

శ్లో॥ దృష్టి ర్ధృతిశ్చ మననం మనీషా జాతిసంస్మృతీ।
యద్బ్రహ్మణోఽభిధాః శ్రీమత్కాశీశం తముపాస్మహే॥ 21

ప్రతి॥ యత్ + బ్రహ్మణః = ఏబ్రహ్మనుండి, దృష్టిః = చూపు, ధృతిః + చ = ధైర్యము, మననం = మననము మనీషా = తెలివి, జ్యూతి = మరపు, సంస్మృతి = జ్ఞాపకశక్తి—అనునవి, అభిధాః = తెలియబడుచున్నవో—

తాత్పర్యం

దృష్టి, ధృతి, మననం, మనీష బాధాకరమైన ఆలోచనలు (జాతి), జ్ఞాపకం—ఇవన్నీ తన పేర్లే అయిన పరమాత్మ శ్రీ కాశీశుణ్ణి నేను ప్రేమతో ఉపాసిస్తాను.

వ్యాఖ్య

ఇవిఅన్నీ మనోబుద్ధులలోని రకరకాల ఆలోచనలే. మిగతావాటిని తరువాత శ్లోకం చెబుతుంది.

శ్లో॥ సంకల్పోఽధ్యవసాయోఽసు స్తృష్ణా స్త్రీ సంగమ స్పృహా।
యద్బ్రహ్మణోఽభిధాః శ్రీమత్ కాశీశం తముపాస్మహే॥ 22

ప్రతి॥ యత్ + బ్రహ్మణః = ఏపరమాత్మనుండి, సంకల్పః = సంకల్పముల అధ్యవసాయః = నిర్ణయము, అసుః = ప్రాణము, తృష్ణ = కోరిక, స్త్రీ సంగమస్పృహ = భోగేచ్ఛయును, అభిధాః = తెలియబడుచున్నవో

తాత్పర్యం

సంకల్పం, నిర్ణయం (అధ్యవసాయం), ప్రాణం, తృష్ణ, స్త్రీ సంగమేచ్ఛ—ఇన్నీ తనపేర్లయిన పరమాత్మ శ్రీ కాశీశుణ్ణి ప్రేమతో ఆరాధిస్తాను.

వ్యాఖ్య

మనోబుద్ధుల పరికరాల పరిమితులవలన నియమింపబడిన ఆలోచనల రూపంలో పరమాత్మే కనబడుతున్నాడు. అందువలన పైవన్నీ బ్రహ్మను నిర్దేశించే వర్ణనలు.

శ్లో॥ బ్రహ్మేత్వ మద్రీశభి దద్రిశాయిన్
ప్రజాధిభూశ్చ దితిజా స్త్వమేవ।
ప్రజ్ఞాతను స్త్వంహి జగత్ప్రతిష్ఠా
బ్రహ్మాత్మనే తేఽస్తు నమో నమస్తే॥ 23

ప్రతి॥ అద్రీశభిత్ = ఇంద్రుడు, అద్రిశాయిన్ = కైలాసవాసి, బ్రహ్మ = పరబ్రహ్మము, ప్రజాధిభూః = ప్రజోత్పత్తి కారకుడు, అదితిజాః = దేవతలు–అదిగాఅన్నీ, త్వం + ఏవ = నీవే, త్వం + హి = నీవే, జగత్ప్రతిష్ఠా = ప్రపంచముయొక్క స్థితి, ప్రజ్ఞాతనుః = తెలివితేటలు, బ్రహ్మాత్మన్ = పరబ్రహ్మముగా, ఏతే = ఈపైవన్నియు, అస్తు = అగుగాక, తే = అట్టి(నీకు) పదేపదే, నమోనమః = నమస్కారాలు

## తాత్పర్యం

ఓ గిరీశా! అద్రిశయనా! పరమశివా! నీవే సృష్టికర్త బ్రహ్మవి. నీవే అద్రిభేదనం చేసిన ఇంద్రుడువి. నీవే ప్రజాపతివి అదితిపుత్రులైన దేవతలు కూడా నీవే. ప్రజ్ఞా స్వరూపానివి. జగత్ప్రతిష్ఠవు నీవే. బ్రహ్మస్వరూపా, నీకు వినయ పూర్వకమైన ప్రమాణాలు పునః సమర్పించుతాను.

శ్లో॥ త్వమేవ ఖం వాయు రథానలశ్చ
త్వమేవ పాథః పృథివీ త్వమేవ,
ప్రజ్ఞాతను స్త్వం హి జగత్ప్రకాశో
బ్రహాత్మనే తేఽస్తు నమోనమస్తే॥ 24

ప్రతి॥ బ్రహ్మాత్మనే = ఓపరమేశ్వరా! త్వం + ఏవ = నీవే,ఖం = ఆకాశం, వాయుః = గాలి అథ = మరియు, అనలః + చ = అగ్నియు, త్వం + ఏవ = నీవే, పాథః = సముద్రం, త్వం + ఏవ = నీవే, జగత్ప్రకాశః = ప్రపంచానికి సూర్యుడవు అయిన, ప్రజ్ఞాతనుః = ప్రజ్ఞాశరీరి. ఏతే = ఇవన్నియు, అస్తు = అగుగాక, (నీకు) మరిమరి, నమోనమః = నమస్కారాలు

## తాత్పర్యం

ఓ పరమేశ్వరా! నీవే ఆకాశ వాయు అగ్ని జలభూములు, శుద్ధ చైతన్యరూపుడవైన నీవల్లనే, నీకాంతిలోనే యావత్ప్రపంచం నిలిచివున్నది. బ్రహ్మ

స్వరూపుడవైననీకు వినయపూర్వకమైన నమస్కారాలు పునఃపునఃసమర్పించుతాను.

శ్లో॥ త్వమేవ గావ స్తురగా నగాశ్చ
ఖగాశ్చ యత్కించి దిదం సమగ్రమ్।
ప్రజ్ఞాతను స్త్వం హి జగద్బిభర్షి।
బ్రహ్మాత్మనే తే స్తు నమో నమస్తే॥ 25

ప్రతి॥ త్వం + ఏవ = నీవే,గావః = ఆవులు, తురగాః = గుఱ్ఱాలు, నగాః + చ కొండలును, ఇదం = ఈ, సమగ్ర = పరిపూర్ణము, యత్కించిత్ = ఏమాత్రమైనను (నీవే), ప్రజ్ఞాతనుః = జ్ఞానశరీరమైన, త్వం + హి = నీవే, జగత్ = జగత్తును, బిభర్షి = భరించుచున్నావు, బ్రహ్మాత్మనే = బ్రహ్మస్వరూపమైన, తే = నీకు, నమః + సహస్రః = వేలాదినమస్కారాలు, అస్తు = అగుగాక!

## తాత్పర్యం

ఓ కాశీవిశ్వనాథుడా, నీవు శుద్ధచైతన్య స్వరూపుడివి. చైతన్య రూపివిగా యావత్తు ప్రపంచబాహుళ్యాన్ని భరిస్తూన్నావు. ప్రపంచంలోని ఆవులు, గుఱ్ఱాలు, పర్వతాలు, పక్షులు, చరాచారాలన్ని వేరువేరు రూపాలలోవున్నది నీవే. నీకు నాఅనంతకోటి ప్రణామాలు!

## వ్యాఖ్య

సముద్రంలోని అలలన్నీ నిజంగా సారంలో సముద్రమే అన్నినగలలోని సారమూ బంగారమే. పరమాత్మయే సారమైన ప్రపంచబాహుళ్యం. పరమాత్మ అధారంగానే నిలిచివున్నది,

కలలోని పర్వతాలు, వ్యక్తులూ చురుకైన మెలకువ మనస్సు యొక్క కల్పనలు తప్పవేరుకాదు.

అలానే ప్రపంచంలోని చరాచరాలు. ప్రాణులు, పదార్థాలు ఏకదివ్య చైతన్య పరబ్రహ్మస్వరూపంమీది అధ్యారోపాలే!

పూజ్యాయ రాఘవేంద్రాయ సత్యధర్మ రతాయచ।
భజతాం కల్పవృక్షాయ నమతాం కామధేనవే॥

# నవమ స్తబకం

రాబోయే మూడు స్తబకాలలో (9–11) శ్రీ గురుదేవులు సామవేదానికి చెందిన ఛాందోగ్యోపనిషత్తులోని భావాలను ఉదహరిస్తారు. ఈ ఉపనిషత్తులో ఎనిమిది అధ్యాయాలు ఉన్నాయి. మొదటి అయిదు ఉపాసనకు చెందినవి. మిగిలినవి పూర్తిగా వేదాంతపరమైనవి. ప్రస్తుత స్తబకంలో నాలుగు అధ్యాయాలను క్లుప్తంగా వివరిస్తున్నారు.

శ్లో॥ ఉద్గీథవర్ణే పరమే పరాత్మా
శ్రుత్యేకసారే చ గుణోపజుష్టే।
ఉద్గాతృవర్యై స్సముపాస్యతే యః
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥

ప్రతి॥ యం = ఏ, పరాత్మా = పరబ్రహ్మ, శ్రుత్యేకసారే = వేదసారమైన, గుణ + ఉపజుష్టే = గుణసంయుక్తమైన, పరమే = శ్రేష్ఠమయిన, ఉద్గీథవర్ణే = ప్రణవమందు, ఉద్గాతృవర్యైః = సామవేదగాయకులచే, సముపాస్యతే = ఉపాసింపబడుచున్నాడో, తం = ఆ, సౌమ్యపురాధినాథం = సౌమ్యకాశీశుని, ఆశ్రయే = ఆశ్రయిస్తున్నాను.

## తాత్పర్యం

శ్రుతులయొక్క ముఖ్యఏకసారం పరానందం, ఓంకార రూపమైన పవిత్ర ఉద్గీథ ద్వారా ఉపాసింపబడే పరమాత్మ శ్రీ సౌమ్యపురినాథుడే. ఆయన పాదాలను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

పరమానందయుతమైన ఓంకారం పరమాత్మయొక్క శబ్దసంకేతం. దానినే సామవేదంలో ఉద్గీథ అంటారు. ఉద్గాతృలనే సామగాయకులు ఉపాసించుతారు. (ఛాందోగ్య 1. 1)

శ్లో॥ ప్రాణాత్మనాఽధ్యాత్మ మథాధిదైవం
సూర్యాత్మనా చాక్షరసప్రతీకే।
ఉద్గీథవి త్పశ్యతి యం హి దేవం
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్। 2

ప్రతి॥ యం + దేవం + హి = ఏ దేవునయితే, ఉద్గీతవిత్ = సామవేదపాఠకుడు ప్రాణాత్మనా = ప్రాణస్వరూపంచే, అధ్యాత్మం = అధ్యాత్మికమును, అథ = మరియు, అధిదైవం = అధిదైవమును, సూర్యాత్మనా + చ = సూర్యస్వరూపంచేతను, అక్షరసప్రతీకే = ఓంకారమందు, పశ్యతి = చూచునో——

## తాత్పర్యం

ఉపాసకుడు తన దృష్టిలోని ప్రాణస్ఫూర్తిని, సమష్టినేత్రాలకి అధిదైవమైన సూర్యుణ్ణి ఏకపరమాత్మ ఓంకార ఉద్గీథగా గుర్తించుతాడు. ఆ పరమాత్మ సౌమ్యపురాధినాథుని పాదాల నాశ్రయించుతాను.

## వ్యాఖ్య

ఛాందోగ్యోపనిషత్తులో మానవహృదయాలలో దైవాసుర శక్తులమధ్య నిత్యమూ జరిగే సంఘర్షణ నిగూఢంగా సూచితమైంది. జ్ఞానేంద్రియ మనోపరిక రాల ద్వారా ఓంకారోపాసన చేయడానికి మనుష్యుల్ని వారి ఉదారస్వభావం ప్రేరేపించినప్పుడు ఫలితాలు సరిగా రాలేదు. ప్రతిధ్యాన మార్గంలోను ఆసురికశక్తులు అడ్డుతగులుతాయి. ఎందుకంటే అతడిలో అనేక విచ్ఛినకర వాసనలున్నాయి. అవే పాపాలు.

అప్పుడు ఉదాత్తుడైన సాధకుడు ఓంకారోపాసనను ముఖ్యప్రాణంగా ప్రాణస్ఫూర్తిగా చేయసాగేసరికి తేలికగా, సూటిగా జయం లభించింది. క్షుద్ర భావనలు సాధకుణ్ణి ఏవిధంగా కదిలించలేకపోయాయి. అంటే సాధకుడు ముందు ఓంకారాన్ని తనప్రాణానికి సంకేతంగా, చైతన్య ప్రవంతికి మూలంగా, ప్రాణస్ఫూర్తిగా గుర్తించాలి.

బాహ్యప్రపంచంలోని సూర్యుడు, జీవిలోని ప్రాణము ఏకాత్మవిలాసాతే రెండూ కాంతి నిచ్చే వెలుగులే. రెండూ లోపల, బయటకూడా ప్రాణాన్ని వెచ్చదనాన్ని ఇస్తాయి.

శ్లో॥ జ్యోతిర్మయ శ్మశ్రు కచోఽర్క బింబే
కంజేక్షణ స్తిష్ఠతి యోగిగమ్యః।
ఉన్నామభృ ద్యో యమృగాదిగేష్ఠః
తమాశ్రయే సౌమ్యపురాదినాథమ్॥ 3

ప్రతి॥ అర్క బింబే = సూర్యబింబమందు, జ్యోతిర్మయః = జ్యోతిస్వరూపుడు, స్మశ్రుకచః = చెదరినకేశపాతముకలవాడు, కంజేక్షణః = పద్మ నేత్రుడు యోగిగమ్యః = యోగులకు పొందదగినవాడు, ఉన్నామభృత్ = ఓంకారనామకుడు, యః + అయః = ఆ ఇతడే, ఋక్ + అది + గేష్ఠః ఋగ్వేదము మొ॥ వానికి స్థానమో——

## తాత్పర్యం

జ్వలించుతున్న గడ్డం,చెదరివున్న జుట్టుతో, ఎఱ్రతామరలవంటి కళ్ళతో సూర్యబింబం మధ్యలో ఆసీనుడై యోగులకు దర్శనమిచ్చే పరబ్రహ్మ సౌమ్యపురీశుని పాదాలవద్ద ఆశ్రయం పొందుతాను.

## వ్యాఖ్య

సూర్యునిలో ఉన్న దివ్యపురుషుడు జీవుళ్ళందరకు ప్రాణదాత. ఆయనను ఆరాధించినవారు ఆయనే పరబ్రహ్మమని గుర్తిస్తారు. పదార్థ గోళ

మైన సూర్యబింబంద్వారా వ్యక్తమయ్యే పరమాత్మే సూర్యుడినుండి అంతు లేకుండా వెల్వడే శక్తికి కాంతికి కారణం. అదే లేకపోతే భూమిపైన ప్రాణి ఉదయించడానికి నిలవడానికి ఆస్కారం లేదు. సూర్యునిలోని ఈదివ్యతత్త్వాన్ని జ్వలించే భగవంతుడని ఉపాసనకోసం వేదాలలో పేర్కొన్నారు. ఆ పరమాత్మ నా ఏకైక శరణ్యమైన సౌమ్య కాశీశుడే!

శ్లో॥ హృన్మందిరాంతః స్థిత మాత్మదేవం
ఆనర్చయన్ భూదివిషత్ కుమాషైః।
ఉషస్తి రాధోరణ భుక్తశేషైః
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 4

ప్రతి॥ భూదివిషత్ = బ్రాహ్మణుడైన, ఉషస్తిః = ఉషస్తిఅనుపేరుగల వైదిక ఋషి, అధోరణ = ఏనుగుచే, భుక్తశేషైః = తినగామిగిలిన, కుమాషైః ఎండినవులవలచే, హృత్ + మందిర + అంతస్థితం = హృదయమందిరం లోపల వున్న, యం = ఏ, ఆత్మదేవం = ఈశ్వరుని, ఆనర్చ్య = అర్చించెనో——

## తాత్పర్యం

వేదకాలంనాడు ఉషస్తి అనే ప్రసిద్ధఋషి ఒక మావటీడు తింటూన్న పాసిపోయిన మినుముల దినుసుల్ని తీసుకొని తనహృదయనాధుణ్ణి అర్చించాడు. ఆ ఆత్మ సౌమ్యపురీశుని పాదాలను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఒకానొకప్పుడు ఉషస్తి అనే ఋషి, అయనభార్యా కురుభూమిలో సంచరిస్తున్నారు. అప్పుడక్కడ కరువు తాండవిస్తోంది.ఋషి ఆకలితో నీరసించి చనిపోయే స్థితిలో ఉన్నాడు. ఆ మావటీడు పాసిపోయిన మినుముల పదార్థాన్ని తింటున్నాడు. ఆకలికి తాళలేని ఋషి తనకుకూడా కాస్త పెట్టమని ప్రాధేయ పడ్డాడు. ఆమావటీడు సిగ్గుపడుతూ వినయంగా, "అయ్యా, ఇది నేను సగం తిని ఎంగిలి చేసిన పదార్థం. నావద్ద మరేమీ లేదు" అన్నాడు. ఆ ఋషి ఆ

ఎంగిలి కూడునే అతడి చేతిలోంచి లాక్కొని భగవంతుడికి నైవేద్యం పెట్టి ప్రాణదేవుణ్ణి తృప్తిపరిచాడు. ఆ మావటీడు కొద్దిగా నీటిని ఇచ్చాడు కాని ఆ పావన మూర్తులు స్వీకరించలేదు. ఏమని అడిగితే ఋషి ఇలా జవాబిచ్చాడు– "ప్రాణాన్ని రక్షించుకోడానికి ఏమైనా తినవచ్చును. ఎంగిలైనా ఫరవాలేదు. కాని అమూల్యమైన నీ కొద్దిపాటి నీటిని నేను పుచ్చుకొంటే నేను సుఖాలవెంట పడుతున్నట్లే. ఆ పని మాత్రం చెయ్యను" ఈ గాథ ఛాందోగ్యోపనిషత్తులో ఉన్నది.

ఇలా ఋషిచేత ఎంగిలిద్వారా ఆరాధింపబడిన ఆత్మ కాశీశుడే. ఆయన పాదాలవద్ద శరణుపొందుతాను.

ఆధ్యాత్మిక సాధనకోసం సమాజసేవకోసం అపవిత్రమైన ఆహారాన్నైనా స్వీకరించి శరీరాన్ని నిలబెట్టుకోవడం అవసరమని ఈ కథ ఉత్తమోత్తమ సూచనని చేస్తున్నది.

శ్లో॥ యాః పంచసప్తాపి చ భక్తయ స్త
ద్యుక్తస్య సామ్నో య ఉపాసితౄణామ్।
తత్త ద్ధియారాతి ఫలంచ తత్తత్
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 5

ప్రతి॥ యః = ఏ పరబ్రహ్మ, సామ్నః = సామవేదంయొక్క. ఉపాసితౄణాం ఉపాసకులకు, యాః = ఏ, పంచసప్త + అపి + చ = ఐదో, ఏడోఅయిన, భక్తయః = భక్తివిధానాలు ఉండగా, తత్ + తత్ + ధియా = వారివారి జ్ఞానంచే, (తత్ + యుక్తస్య = దానికితగినవానికి), తత్ + తత్ + ఫలం + చ = ఆయాఫలాన్ని, ఆరాతి = ఇస్తున్నాడో——

## తాత్పర్యం

అయిదు పద్ధతులుగా, ఏడు పద్ధతులుగా విధింపబడిన సామోపాసన లను ఆయాభక్తులు దీక్షతో అనుష్ఠించినప్పుడు ఆయా ఫలాలను పరమాత్మ ద్వారా వారు పొందుతారు. ఆపరమాత్మ సౌమ్యపురాధీశుని పాదాలను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఛాందోగ్యోపనిషత్తులో దీర్ఘమైన ఉపాసన లున్నాయి. వర్షం, నీరు, ఋతువులు, జంతువులు—ఇవన్నీ సామోపాసనలోనివే. రెండవ అధ్యాయంలో 8–22 ఖండాలవరకు ఏడు ఉపాసనలు చెప్పబడివున్నాయి. వివరాలు ఇక్కడ అవసరం లేనందున వదిలేస్తున్నాము (ఛాందోగ్య 2–1–22)

ధర్మము మూడు విధాలుగా విభజింపబడింది — 1) గృహస్థులకు అగ్నిహోత్రము, 2) వానప్రస్థులకు కృచ్ఛ్రచాంద్రాయణాలు, తపస్సు, 3) బ్రహ్మచారులకు ఆత్మముఖులై ఆశ్రమంలో ఉంటూ అధ్యయన ధ్యానాదులు చేయడం. ఈ మూడు సాధనలను దీక్షతో చేసిన ఆయా ఆశ్రమస్థులు ఆయా స్వర్గాలలో ఆయా ఫలాలను పొందుతారు.

ఈ విషయం రాబోయే శ్లోకం తెలుపుతుంది.

శ్లో॥ యజ్ఞాదిభిః కృచ్ఛ్రముఖై స్తపోభిః
నోపేతి యం నైష్ఠిక చర్యయా వా।
లోక స్సులోకో భవతీవ ధర్మైః
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 6

ప్రతి॥ యజ్ఞ + ఆదిభిః = యజ్ఞయాగాదులచే, కృచ్ఛ్రముఖైః = కష్టసాధ్యాలైన, తపోభిః = తపస్సులచే, నైష్ఠికచర్యయా + వా = నియమనిష్ఠలచే గాని, యం = ఏ పరమాత్మను, న + ఉపైతి = పొందలేడో, ధర్మైః = ధర్మాలచే, లోకః = లోకము, సులోకః = మంచిలోకముగా, భవతి + ఇవ = అగుచున్నట్లున్నదో, తల = ఆ, సౌమ్యపురాధినాథం = సౌమ్యకాశీశుని ఆశ్రయే = ఆశ్రయిస్తున్నాను.

## తాత్పర్యం

యజ్ఞాదానాదుల ద్వారా, కృచ్ఛ్ర మొదలైన తపస్సులద్వారా, నిత్యమూ బ్రహ్మచర్యంలో ధ్యానంలోనే దినాన్ని గడపడంద్వారా ఉత్తమలోకాలలోని

సుఖానుభూతులు పొందుతారు అయితే పరమాత్మను పొందలేరు. ఆపరమాత్మ సౌమ్యపురీశుడు. ఆయన పాదాలను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

పైన చెప్పబడినవి ఉత్తమజీవిత విధానాలు. నిజమైన సాధకుడికి చాలా పుణ్యాన్ని కలిగిస్తాయి. కాని వాటి ఫలితంగా స్వర్గాది సుఖాలు మాత్రం దొరుకుతాయి. వారు శారీరక మానసిక బంధనాలనుండి పూర్తి విముక్తిని పొందలేరు. విముక్తి పరమాత్మ మీది ధ్యానంవల్లనే లభిస్తుంది, (ఛాందోగ్య 2. 23. 1)

హృదయాలను నిర్మలం చేసుకొని నిరంతరధ్యానంవల్ల పరమాత్మ యొక్క అపరోక్షానుభూతిని పొందిన వారికే ముక్తి వస్తుంది.

శ్లో॥ తుర్యాశ్రమీ తుర్యపదే హి యస్మిన్
ధర్మోజ్ఝితే బ్రహ్మణి సంస్థిత స్సన్।
అమృత్యుభావం సముపైతి శశ్వత్
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 7

ప్రతి॥ తుర్యాశ్రమే = సంన్యాసి, ధర్మ + ఉజ్ఝితే = లౌకికధర్మముచే విడువబడిన, తుర్యపదే = నాల్గవదైనమోక్షమైన, యస్మిన్ + బ్రహ్మణి = ఏ పరబ్రహ్మమందు, సంస్థితః + సన్ = ఉంటూ, శశ్వత్ = మాటిమాటికి, అమృత్యుభావం = శాశ్వతత్వమును, సముపైతి = పొందుచున్నాడో—

## తాత్పర్యం

సన్యాసి తురీయాన్ని గురించి ధ్యానిస్తాడు. అదే బ్రహ్మపదం. లక్షణాలకు అతీతమైంది. దాని ద్వారా అమృత మోక్షపదాన్ని చేరుకుంటాడు. ఆ పరబ్రహ్మము సౌమ్యకాశీశుడే. ఆయన పాదాల నాశ్రయిస్తాను.

వ్యాఖ్య

సన్యాసి అంటే కాషాయం ధరించి, సమాజజీవితానికి రోజంతా దూరంగా ఉంటూ ఆశ్రమంలో ఏకాంతజీవితం గడిపేవాడు కాదు నిలకడగా ధ్యానం సాగించడానికి తగిన మనోనైర్మల్యాన్ని సాధించి, నిరంతరదీక్షతో తనమనస్సుకు మూలకారణమైన ఆత్మపదాన్ని అందుకోడానికి ప్రయత్నించే వ్యక్తిని ఇక్కడ 'సన్యాసి' అంటున్నారు. అతనికి తనవ్యక్తిత్వపు పరిధులు, అంటే జీవభావం తెలుసును. అందుకే దుఃఖాల ఎల్లలను దాటి బయటపడాలని ప్రయత్నిస్తాడు.

అలాంటి సాధకులు నిరంతరం ధ్యానమగ్నులై ఉంటూ దినదినమూ జీవితంలో జాగ్రత్స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలలోను లభించే అనుభవ రంగాలను అధిగమించి తురీయంలో మేలుకొంటారు, అందుకే బుద్ధిస్థాయిలో ఉండే భావాలేవీ ఆ పదాన్ని నిర్వచించలేవు, శరీరమనోబుద్ధులు చూచే అన్ని లక్షణాలనూ వెలిగించేది శుద్ధచైతన్యం. అందుచేత అది అన్ని లక్షణాలకు అతీతం.

ఇలా పరబ్రహ్మముయొక్క తురీయావస్థలో జాగృతుడైన సాధకుడు కాలబద్ధమైన శరీరమనోబుద్ధులకు అతీతుడై, నిరంతరం మార్పులతో కూడిన వాటి అనుభవరంగాలను కూడా దాటుతాడు. అతడు అందుకునేవి ఒక విలక్షణమైన పదం "శాశ్వతం", "అవ్యయం", "నిత్యం", "అమృతం", "అవికారం", "ధ్రువం" అనబడే పదం అది, ఆ శుద్ధాత్మయే ఉత్తరకాశీ విశ్వనాథుడు. ఆయనను శరణుజొచ్చుతాను. (ఛాందోగ్య 2. 23. 1)

ఈపదం ఓంకార మనబడుతుంది అందుచేత ఓంకారంయొక్క విశిష్టత ఇప్పుడు కీర్తింపబడుతున్నది.

**శ్లో॥ ఛందాంసి సాఙ్గోభువి భూర్భువస్స్వ**
**స్తత్రాపి తేషు ప్రణవోఽఖిలాత్మనా।**
**అగ్రాహి ధాత్రీ స తు యత్ ప్రతీకః**
**తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥** 8

ప్రతి॥ ధాత్రా = బ్రహ్మచే, భువి = భూలోకంలో, ఛందాంసి = వేదాలను, భూః + భువః + స్వః = ఈమూడు,వ్యాహృతులనెడు, సారః = సారాన్ని తత్రాపి = అందులోను, తేషు = వాటియందు, అఖిలాత్మా = సర్వాత్మ యైన, ప్రణవః = ఓంకారము, అగ్రాహి = గ్రహించెనో, సతు = అఓంకారమే, యత్ + ప్రతీక = ఎవనికి ప్రతీకముగానున్నదో——

## తాత్పర్యం

ప్రజాపతి అయిన ఆ బ్రహ్మదేవుడు ప్రపంచంలోని నామరూపా అన్నింటినీ విశ్లేషించి వడగట్టి వాటిసారాన్ని మూడు వ్యాహృతులుగా గుర్తించాడు — భూః, భువః, సువః, అనేవి అవి. తిరిగి వాటిని విశ్లేషించి వడగట్టి వాటిసారం ప్రణవమైన ఓంకారమని గాఢధ్యానంలో తెలుసుకున్నాడు. ఇదే చివరి లక్ష్యమైన మోక్షస్థానమని అర్థంచేసుకున్నాడు. ఓంకారం శుద్ధాత్మ యొక్క శబ్దసంకేతం. ఆ అనంతాత్మే సామ్యపురాధీశుడు. ఆయనను ఆశ్రయిస్తాను

## వ్యాఖ్య

అన్ని నామరూపాలు ఓంకారంలో నుండి ఉద్భవిస్తాయి ఇది ఉపనిషత్తుల ప్రసిద్ధనిర్ణయం. ఓంకార సంకేతం అ, ఉ, మ, అనే మూడు ధ్వనుల సంయోగంవల్ల ఏర్పడింది.

అకారం లేకుండా ఏభాషలోను ఏపదం ఉచ్చరింపబడలేదు. ఇలా ఓంకారంలోని మొదటిమాత్ర 'అకారం' అన్ని భాషలలోని ధ్వనులని ఇముడ్చుకుంటుంది. ఇలా ఓంకారం అన్నింటినీ తనలో ఉంచుకొని అన్నిధ్వనులలోను వ్యాపించివున్నదని మననం చేసుకునే సాధకుడు సుందరమైన ముక్తిపథంలో అడుగుపెట్టుతాడు (ఛాందోగ్య 2. 23. 2 5)

ఇంతవరకు శ్రీ గురుదేవులు ఛాందోగ్యోపనిషత్తులోని రెండోఅధ్యాయం యొక్క సారాన్ని వివరిస్తూ వచ్చారు, ఇంక ముందు మూడోఅధ్యాయంలోని ముఖ్యమైన సూర్యోపాసన చెప్పబడుతుంది, సూర్యుడు అన్ని ప్రాణులకు ముఖ్యఆధారం.

శ్లో॥ ఆదిత్యగాత్ర స్సురమాక్షికత్వ
మధ్యస్య సద్భి రుపాస్యతే యః।
దేవాదయో వంశముఖా హి యత్ర
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 9

ప్రతి॥ యః + ఆదిత్యగాత్రః = ఏ సూర్యశరీరి, సురమాక్షికత్వం = అమృత పిపాసకత్వమును, అధ్యస్య = నేర్చి, సద్భిః = పండితులచే, ఉపాస్యతే సేవింపబడుచున్నాడో, యత్ర = ఎచ్చటయితే, దివ్ + ఆదయః = స్వర్గాదిలోకాలు, వంశముఖాః + హి = సూర్యాదులో———

## తాత్పర్యం

ఉత్తమసాధకులు సూర్యుణ్ణి పరమాత్మగా ఉపాసించి ఆరాధిస్తారు. ఏసూర్యరూపం దేవమధువో, స్వర్గాదులు ఆమధువుకు తేనెపట్టులో ఆ పరమాత్మ సౌమ్యపురాధీశుణ్ణి ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఉపాసనకోసం సూర్యుణ్ణి 'మధువు' అంటారు. మనం చేసిన అన్ని మానసిక శారీరక కర్మల ఫలమే ఆ మధువు స్వర్గం ఆ మధువుని సేకరించి వుంచే తేనెపట్టు ఈ అధ్యాయంలోని 11 వ ప్రకారం "దేవమధు" ఉపాసనని విధిస్తుంది ఈ ఉపాసనవల్ల అంతరంగం శుద్ధమై, ధ్యానం గాఢమై శుద్ధాత్మ పదంలోకి మేల్కొనగలుగుతారు. (ఛాందోగ్య 3. 1. 11)

ఇప్పుడు గాయత్రిరూపంలో బ్రహ్మోపాసనను శ్రీ గురుదేవులు పేర్కొంటారు.

శ్లో॥ గాయత్ర్యుపాధేః పురుషస్య యస్య
పాదోఽస్తి సర్వం జగదాత్మనిష్ఠమ్।
పాదత్రయం వైకృత దూరదూరం
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 10

ప్రతి॥ గాయత్రి + ఉపాధేః = గాయత్రీ ఉపాసకుడైన, యస్య = ఏ, పురుషస్య = పురుషునియొక్క, పాదః = ఒకేపాదం, సర్వం = సమస్తమైన, జగత్ + ఆత్మనిష్ఠం = పరమాత్మ నిష్ఠమగుచున్నదో, అదే పాదత్రయం = మూడు పాదాలుగ, వైకృతదూరదూరం = వికృతమైన దూరములు కలిగినదిగా. (అస్తి = కలదో)

## తాత్పర్యం

గాయత్రీరూపమైన పురుషునికి వ్యక్తప్రపంచంలోని నామరూపాలన్నీ ఏకమాత్ర అయిన అకారమే. అకార, ఉకార, మకార మాత్రలు--మూటి యొక్క అనంతవికారాలు ఆ నిశ్చల నిర్వికార పరమాత్మకు ఎంతోదూరంగా ఉంటాయి. ఆ సౌమ్య కాశీనాథుని నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

పరమాత్మ గాయత్రిగా ఉపాసింపబడుతాడు. అకారమాత్ర అయిన మొదటి పాదంలో జాగ్రదవస్థలోని అన్ని అనుభవాలు ఇమిడివున్నాయి. శుద్ధ చైతన్యపదంలో అకార, ఉకార, మకార మాత్రలైన జాగ్రత్స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలూ వుండవు ఆత్మ రెండు ఓంకారధ్వనులకు మధ్యవున్న నిశ్శబ్దం—అమాత్ర ఓంకారంద్వారా నిర్దేశింపబడుతుంది. తక్కిన మూడు మాత్రలూ ఈనిత్య సర్వవ్యాప్త నిశ్శబ్ద సాక్షిచైతన్యంలో లేచిపడే అలజడులు.

శరీరమనో బుద్ధులద్వారా విషయ – ఉద్రేక – తలపుల ప్రపంచంలో కలిగే అనుభవాలు ఆత్మలో ఉండవు. నాలుగోది అయిన తురీయావస్థ అనేకంలో ఉన్న అన్ని అనుభవాలకు దూరంగా ఉంటుంది. ఈ శుద్ధచైతన్యమే కాశీవిశ్వనాథుడు. (ఛాందోగ్య 3. 12. 1–6)

శ్లో॥ శ్రోత్రాక్షి వాక్ప్రాణ మనోఽభిధానై
ర్ధ్వాస్థై ర్నిరుద్ధం నృపతే రివైతత్।
యద్బ్రాహ్మణో హార్మ్య మగమ్య మస్మాత్
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 11

ప్రతి॥ శ్రోత్ర + అక్షి + వాక్ + ప్రాణ + మనస్ + అభిధానైః = చెవి, కన్ను, వాక్కు, ప్రాణము, మనస్సు-అనెడి పేర్లుగల, ద్వాః + స్థైః = ద్వార పాలకులచే, నృపతేః + ఇవ = రాజువలె, యత్ + బ్రహ్మణః = ఏ బ్రహ్మయొక్క, అగమ్యం = గోచరము కాని, ఏతత్ + హర్మ్యం = ఈ మేడ, నిరుద్ధం = కాపాడబడుచున్నదో, అస్మాత్ = అందువలన——

## తాత్పర్యం

రాజభవనంలో మహారాజుయొక్క భద్రతకోసం ద్వారపాలకులున్నట్లుగా, హృదయంలో పరమాత్మ విశ్రమించే స్థానం జ్ఞానేంద్రియాల అధిదేవతలచేత రక్షింపబడుతూంటుంది. అందుచేత పరమాత్మను చేరడం కష్టం. ఈ పరబ్రహ్మ సౌమ్య కాశీనాధుడే. ఆయన పాదాలవద్ద ఆశ్రయం పొందుతాను.

## వ్యాఖ్య

సూర్యచంద్రులు, ఇతర అధిష్ఠాన దేవతలు హృదయంలో వసించే పరమాత్మను ద్వారాపాలకులలాగా సేవిస్తూ వుంటారు. ఇంద్రియాలను వాటి బాహ్యదృష్టిని మనం జయిస్తే తప్ప లోపలికి ప్రవేశించి భగవంతుణ్ణి కలవ లేము. అందుకే సామాన్య మానవుడు ఆత్మను అందుకోడానికి కష్టపడతాడు. ఆ ఆత్మ సౌమ్య కాశీశుడు. నా హృదయంలో నిరంతరం వసించివుండే ఆయనకు నేను ఆత్మార్పణం చేసుకుంటాను.

ఆత్మను సూటిగా తెలుసుకోడానికి మనలను ఆటంకపరిచే అయిదు ఇంద్రియాలను గురుదేవులు పేరుపేరునా చెప్పారు చెవి, కన్ను, వాక్కు, ప్రాణము, మనస్సు — ఈ అయిదు భగవంతుని రాజభవనంలో కేవలం ద్వారపాలకులే! వాళ్ళను లోబరచుకొని వశంచేసుకోనేంతవరకు మనం హృదయంలోనికి ప్రవేశించలేము. ధ్యాననిమగ్నులమై హృదయస్థానంలోని పరమాత్మ భవనంలోకి వెళ్ళి పరమాత్మలో లీనం కాలేము. కాశీ విశ్వనాథుణ్ణి భక్తితో సేవించడం, ఉపాసించడం ఒక్కటే ఈద్వారపాలకుల్ని మనవశంలోకి తెస్తుంది. (ఛాందోగ్య 3. 13. 1-6)

గాయత్రిరూపంలో ఉపాసించబడిన ఈ పరమేశ్వరుణ్ణే ఇప్పుడు జఠరాగ్నిగా దర్శింపబడుతున్నాడు.

శ్లో॥ యజ్జ్యోతిషో లింగ మిహోష్ణి మాంగే
కర్ణాపిధానే చరవోఽన్తరంగే।
యచ్ఛ్రూయతే స్యందన నిఃస్వనాభః
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 12

ప్రతి॥ యత్ = ఏబ్రహ్మయొక్క, జ్యోతిషఃలింగం = సూర్యాగ్ని, అంగే = శరీరమందు, ఉష్ణిం = ఉష్ణమును, కర్ణా + పిధానే = చెవులను మూయుట చేత, అంతరంగే = ఆత్మయందు, చరవః = హవ్యమువండు కుండలు, స్యందన = తేరుయొక్క, నిస్వన + అభః = శబ్దముతో సమానముగ, యః = ఏధ్వని, శ్రూయతే = వినబడునో, తం = అటి, సౌమ్యపురాధినాథం = కాశీశ్వరుని, ఉపాశ్రయే = సమాశ్రయిస్తున్నాను.

## తాత్పర్యం

శరీరంలోని వెచ్చదనం మనలో జఠరాగ్ని రూపంలో ఎవరు ఉన్నట్లు సూచనయో, చెవులు మూసుకొన్నప్పుడు రథాలు పరుగెట్టుతున్నట్లు లోపల వినవచ్చే శబ్దం ఎవరి సాన్నిధ్యసూచనయో ఆ పరబ్రహ్మమైన సౌమ్య పురాధీశుణ్ణి నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఛాందోగ్యోపనిషత్తులో మనలో నిత్యమూ ఉండే పరబ్రహ్మోపాసనకు ఈ రెండు పద్ధతులు బోధింపబడినాయి—1) భగవంతుడే మనశరీరానికి వెచ్చదనాన్ని ఇస్తాడు. 2) చెవులు మూసుకున్నప్పుడు వినబడే పెద్దధ్వనులూ ఆయననుండే వస్తాయి. (ఛాందోగ్య 3. 13. 7–8)

శ్లో॥ యజ్జం హి విశ్వం యదనం చ యల్లం
తస్మాదిదం సర్వ ముపాస్యతే జ్ఞైః।
బ్రహ్మేతి యత్ సంయత శేముషీకైః
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 13

ప్రతి॥ యత్ + జం = ఏపుట్టుక, యత్ + అనం = ఏస్థితి, యత్ + లం = ఏ లయము, సర్వం + విశ్వం + ఇదం = ఈప్రపంచమంతయును, బ్రహ్మ + ఇతి = బ్రహ్మమని, సంయత = నిగ్రహయుకల, శేముషీకైః = పండితులైన, జ్ఞైః = జ్ఞానులచేత, యత్ = ఏపరబ్రహ్మము, ఉపాస్యతే = సేవింపబడుతూందో, తస్మాత్ = అందువలన——

## తాత్పర్యం

ఏ పరబ్రహ్మంనుండి ప్రపంచంలోని నామరూపాలు జనించుతాయో (యజ్జం), ఎవరి శక్తి కారణంగా మన ఇంద్రియాలు వ్యవహరిస్తాయో (యదనం) తిరిగి ఎవరిలోకి ప్రతిఈ లయమై పోతుందో (యల్లం), ఎవరి కారణంగా ధీరులు ఇంద్రియాలను నిరోధించి, మనస్సులను శమింపజేసి సర్వనామరూప జగత్తును ఆబ్రహ్మమే అని ఆరాధిస్తారో, ఆ శుద్ధాత్మ సౌమ్యపురీశుని ఆశ్రయిస్తాను

## వ్యాఖ్య

ఈ వ్యక్తప్రపంచంలోని అన్ని విషయాలు – ప్రాణులు పరబ్రహ్మంలో నుండి జనించి, నిలిచి, సంచరించి, చివరకు ఆయనలోనే లీనమై పోతాయి. అందువలన మనం చూచేది, వినేది, అన్నీ బ్రహ్మమే సముద్రంలోనుండి అలలు లేచి, నిలిచి, ఆడి, తిరిగి అందులోకే విరిగి పడిపోతాయి అందుచేత అలలన్నీ సముద్రమే అలాగే ఇంద్రియాలద్వారా చూడబడే నామరూపజగత్తు ఆలోచనలవల్ల తెలుసుకోబడేదీ కూడా బ్రహ్మమే తప్ప వేరుకాదు

శుద్ధహృదయులైన సాధకులు తమ ఇంద్రియాల బాహ్యప్రవాహ వేగాన్ని అరికట్టి శుద్ధాత్మను ధ్యానించి అందుకోగలరు. వివేకులైన సాధకుల అంతిమ

గమ్యమైన పరమాత్మ సౌమ్య కాశీనాథుడు. ఆయననే నేను శరణుపొందుతాను (ఛాందోగ్య 3. 14. 1)

శ్లో॥ మనోమయం భాకృతి సర్వకర్మ
కామాది చ ప్రాణకలేవరం చ।
బ్రహ్మేతి విద్భిః క్రియతే క్రతుర్యత్
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 14

ప్రతి॥ మనోమయం = మానసాకారమైన, భా + ఆకృతిః = తేజోరూపమై, సర్వకర్మ + కామ + ఆది + చ = సమస్తకర్మలు, కోరికలు మొ॥వాటిని ప్రాణకళేబరం + చ = ప్రాణము, కళేబరమునూ-, బ్రహ్మ = పర బ్రహ్మమును, ఇతి = అని, విద్భిః = పండితులచే, యత్ = ఏ, క్రతుః = యజ్ఞం, క్రియతే = చేయబడుచున్నదో——

## తాత్పర్యం

చైతన్య ప్రకాశంగా పరమాత్మ మనస్సుద్వారా దర్శన మిస్తాడు. సర్వ కామనలు, కర్మలు, ప్రాణాలు, శరీరం, — ఇవి భగవంతుడేనని అర్థం చేసుకొన్న సాధకులు ఆత్మధ్యానాన్ని కొనసాగిస్తారు. ఆ పరమాత్మ సౌమ్య కాశీశుణ్ణి నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

శక్తిరూపమైన విద్యుత్తుని అర్థంచేసుకోవడం కష్టం. అయితే బల్బులోని కాంతిగా, హీటరులోని వేడిగా, రేడియోలోని శబ్దంగా తెలుసుకోవడం తేలిక. అలాగే పరబ్రహ్మను మనస్సుకు చైతన్యాన్ని ఇచ్చేదిగా, అన్నికర్మలుగా, కామనలుగా, అన్నిప్రాణాలకు వెనకవున్న శక్తిగా భావించుతారు.

ఇది ఒక ఉపాసనావిధానం. సాధకు డీపద్ధతిలో ఉపాసించి ఆత్మను అందుకుంటాడు. ఈఆత్మ సౌమ్య కాశీశుడైన విశ్వనాథుడు! బ్రహ్మాండాధిపతి అయిన ఆయనను నేను శరణువేడుతాను.

శ్లో॥ హృత్పుండరీకాంతరణీయ ఆస్తే
శ్యామాకత స్సర్షపతోఽపి వాయత్।
జ్యాయో దివో బ్రహ్మ తథాంతరిక్షాత్
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 15

ప్రతి॥ యత్ + బ్రహ్మ = ఏ పరబ్రహ్మ, హృత్ + పుండరీక = హృదయ మనెడి పద్మముయొక్క, అంతరణీయః = లోపలివాడై, ఆస్తే = ఉన్నాడో, సర్షపతః + అపి = ఆవగింజకంటె, శ్యామాకతః + వా = చిన్నవాడై, దివః = స్వర్గముకంటె, తదా = అట్లే, అంతరిక్షాత్ = ఆకాశము కంటె, జ్యాయః = పెద్దవాడో———

తాత్పర్యం

అందరి హృదయగుహలలోను నువ్వగింజకన్న సూక్ష్మంగా నివసించి వుంటూనే ఆకాశమంతటా వ్యాపించివుండే పరబ్రహ్మం సౌమ్య కాశీశుని నేను ఆశ్రయిస్తాను

వ్యాఖ్య

ఏ ఆకాశంలో బ్రహ్మాండాలు పరిభ్రమిస్తున్నాయో ఆ ఆకాశాన్ని బ్రహ్మమైన పరమాత్మ వ్యాపించివున్నాడు ఆయనే ప్రతివారి హృదయంలోను వున్నాడు సూదిబెజ్జంలో ఉన్నది, సూర్యమండలం యావత్తూ నిలిచి పరిభ్రమించే ఆకాశమూ ఒక్కటే.

ఇది ఛాందోగ్యంలో విధించిన మరో ఉపాసన ఈ ఉపాసన ద్వారా సాధకులు అంతఃకరణశుద్ధిని పొందుతారు (ఛాందోగ్య 3 14. 3)

ఇక్కడితో పద్నాలుగో ఖండాన్ని ముగించి శ్రీ గురుదేవులు పదిహేనో ఖండంలోని ముఖ్యాంశాలకు వస్తున్నారు.

శ్లో॥ కోశాకృతిం యం పరికల్ప్య కేచిత్
పుత్రస్య దీర్ఘాయు రభీప్స యైవ।
ధ్యాయంతి జాపోపహితం కుబుధ్నం
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 16

ప్రతి॥ కేచిత్ = కొందరు, యం = ఏ బ్రహ్మను, కోశ + ఆకృతిం = అన్నమయాది కోశాలరూపంగ, పరికల్ప్య = భావించికొని, పుత్రస్య = కుమారునియొక్క, దీర్ఘ + ఆయుః = దీర్ఘాయువగు, అభీప్సయా + ఏవ = కోరికచేతనే, జాప + ఉపహితం = జపముతో పాటు, కుబుధ్నం = శివుని, ధ్యాయంతి = ధ్యానించుచున్నారో——

తాత్పర్యం

పుత్రుడి దీర్ఘజీవితంకోసం ఒక భక్తుడు కోశరూపంలో భగవంతుణ్ణి ఊహించుకొని జపంతోసహా ధ్యానంచేస్తాడు. ఆ బ్రహ్మమైన సౌమ్య పురాధీశుణ్ణి ఆశ్రయిస్తాను. (ఛాందో 3. 15)

ఇప్పుడు పదహారో ఖండంలోని సారాంశం చెప్పబడుతుంది.

శ్లో॥ యద్బ్రహ్మబుద్ధ్యా మనసోఽప్యుపాస-
శ్చతుష్పదస్య క్రియతేఽభియుక్తైః।
వాక్ప్రాణచక్షుః శ్రవణై రుమేశం
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 17

ప్రతి॥ యత్ = ఏ, బ్రహ్మబుద్ధ్యా = బ్రహ్మఅను జ్ఞానముతో, చతుష్పథస్య = నాలుగంగాలైన, మనసః = మనస్సుయొక్క, ఉపాసః = ఉపాసన, వాక్ + ప్రాణ + చక్షుః + శ్రవణైః = వాక్కు, ప్రాణము, కన్నులు, చెవులచే, అభియుక్తైః = కూడినవారిచే, క్రియతే = చేయబడుచున్నదో, తం = ఆ——

## తాత్పర్యం

కొందరు మనస్సుపైన ధ్యానంచేస్తూ దాని నాలుగు భాగాలను—వాక్కు, ప్రాణం, కళ్ళు, చెవులు—బ్రహ్మమని ఉపాసిస్తారు. ఆ పరబ్రహ్మమైన సౌమ్యపురీశుణ్ణి నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

వాక్కు, ప్రాణం, కళ్ళు, చెవులు—ఈ నాలుగింటిలో మనస్సు ఎపుడూ నిమగ్నమై వుంటుంది. అందుచేత వీటిని మనస్సుయొక్క నాలుగుపాదాలంటారు. ఇవి చైతన్యం ప్రాణస్పందనగా జీవుడిలో వ్యక్తమౌతున్నప్పుడే వుంటాయి. మనస్సు వెనకాల శక్తిగా ప్రకట మయ్యేది బ్రహ్మమే. ఇలా ధ్యానించేవారు అంతరంగశుద్ధిని పొంది స్థిరచిత్తంలో శాంతంగా నిరంతర ధ్యానంలో నిమగ్నులౌతారు. (ఛాందోగ్య 3. 18—1 2)

శ్లో॥ యద్బ్రహ్మబుద్ధ్యా స్వముపాస్యతేఽధి
దైవం చతుష్పా దనలానిలాభ్యామ్।
అర్కేణ దిగ్భిశ్చ మహద్భి రుచ్చైః
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 18

ప్రతి॥ యత్ = ఏ, బ్రహ్మబుద్ధ్యా = బ్రహ్మఅనెడి జ్ఞానంచే, చతుష్పాత్ = నాలుగుపాదాలుగల, స్వం = తనదైన, అధిదైవం = అధిదైవం, అనల + అనిలాభ్యాం = అగ్నివాయువులచే, అర్కేణ = సూర్యునిచే, మహద్భిః గొప్పవైన, దిగ్భిః + చ = అష్టమహాదిక్కులచే, ఉచ్చైః = గొప్ప ఉపాసకులచే, ఉపాస్యతే = ఉపాసింపబడుచున్నాడో, తం = అట్టి, సౌమ్యపురాధినాథం = కాశీశ్వరుని, ఆశ్రయే = శరణుగోరుచున్నాను.

## తాత్పర్యం

కొందరు ఉపాసనలక్రింద నిరంతరం ఆకాశాన్ని అగ్ని, వాయువు, సూర్య, దిక్కులనే నాలుగుపాదాల బ్రహ్మంగా వుపాసిస్తారు. ఆబ్రహ్మమైన సౌమ్య కాశీనాథుని నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

సూర్యుడు, వాయువు, అగ్ని, దిక్కులు – ఈ నాలుగు ఆకాశబ్రహ్మం లోని భాగాలుగా కొందరు ఉపాసిస్తారు. ఆధ్యాత్మిక జీవనాన్ని సమిష్టిజీవనాన్ని సమంగా ఎంచుతూ చేసే బ్రహ్మోపాసనద్వారా సాధకుడు జీవితమాధుర్యాన్ని కీర్తిని పొందుతాడని ఉపనిషత్తులు చెబుతాయి. (ఛాందోగ్య 3–18)

ఇంతవరకు మూడో అధ్యాయంలోని ముఖ్యాంశాలు చెప్పబడినాయి. ఇకనుండి శ్రీ గురుదేవులు నాలుగో అధ్యాయంలోని ముఖ్య భావాలను ప్రారంభిస్తారు. మొదటి శ్లోకంలో సంవర్గ విద్యఉపాసనను శ్రీ గురుదేవులు పేర్కొంటున్నాము.

శ్లో॥ వాతాత్మనా యోఽగ్నిముఖాన్ హి దేవాన్
సంవృంక్త ఏషోఽనువిభావ్యతేఽతః।
సంవర్గ ధర్మేణ మహావిభూతిః
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 19

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, అగ్నిముఖాన్ + హి + దేవాన్ = అగ్ని మొ॥ దేవతలను, వాత + ఆత్మనా = వాయురూపంగ, సంవృంక్తే = ఇముడ్చు కొంటారో, అథః = అందుచేతనే, సంవర్గధర్మేణ = సంవర్గధర్మముచే, మహావిభూతిః = మహావిభూతిగ, అనువిభావ్యతే = భావింపబడు తున్నాడో——

## తాత్పర్యం

అనుపమాన మహిమ కలిగిన ఆత్మ వాయురూపంలో అగ్ని, నీరు మొదలైన భూతాలను తనలో ఇముడ్చుకొంటుంది. సాధకులు ఆత్మయొక్క సంవర్గ ధర్మాన్ని గురించి ధ్యానం చేస్తారు. ఈ ఆత్మ సౌమ్య కాశీశుణ్ణి నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

నిప్పు ఆరిపోయినప్పుడు ఆ అగ్నిస్థానం చల్లబడిపోతుంది. వేడి వాయువులో లీన మవుతుంది. నీరు ఆవిరయినప్పుడు అది వాయువులో కలిసి పోతుందీ. ఇలా వ్యక్తమై ప్రకటమైన భూతశక్తుల్ని వాయువు స్వీకరించి తనలో కలిపివేసుకొంటుంది. అవి అదృశ్యమౌతాయి. ఇలా సాధకులు బ్రహ్మమును గురించి ఉపాసన చేస్తారు. వారికి ఆత్మసాక్షాత్కార మయిన సమయంలో ప్రపంచంలోని నామరూపాలన్నీ ఆత్మలో లీనమై అదృశ్యమౌతాయి.

బాహ్యప్రకృతి ధ్యానంలో (అధిదైవిక) వాయువు సర్వాన్ని తనలో ఇముడ్చుకోడం అనేది ముఖ్యమైనది. సాధకుడు బ్రహ్మజ్ఞానం పొందినప్పుడు బ్రహ్మానుభవంకూడా అంతే. ఆ అనుభూతిలో అన్నీ లయమైపోతాయి. (ఛాందోగ్య 4–1. 2 3)

తరువాతి శ్లోకంలో ఆధ్యాత్మిక సంవర్గ భావం పేర్కొనబడుతోంది.

శ్లో॥ ప్రాణాత్మనాఽధ్యాత్మ మపేక్ష్యతే య
స్సంవర్గధర్మే దృశ మధ్యగచ్ఛత్।
శూద్రోఽపి జానశ్రుతి రేత్యరైక్వాత్
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 20

ప్రతి॥ జానశ్రుతీః = జానశ్రుతి–అనే. శూద్రః + అపి = శూద్రరాజుకూడ, రైక్వాత్ = రైక్వఋషివలన, అధ్యాత్మం = ఆధ్యాత్మికజ్ఞానాన్ని. ఏత్య = పొంది, దృశ్యం = జ్ఞానదృష్టిని, అధ్యగచ్ఛత్ = పొందెనో, (అట్లు) యః = ఈబ్రహ్మ, ప్రాణాత్మనా = ప్రాణరూపముగ, సంవర్గధర్మే = సంవర్గధర్మమందు, అధ్యాత్మం + అపి = ఆఅధ్యాత్మికతగూడ, ఈక్షతే చూడబడుచున్నదో———

## తాత్పర్యం

ఆధ్యాత్మికంగా వ్యక్తి తనలోని ప్రాణాన్ని సంవర్గభావన చేస్తూ పరబ్రహ్మాన్ని ఉపాసిస్తాడు. జనశ్రుతి శూద్రుడైన ❋ రైక్వఋషినుండి ఈ ఉపాసనను నేర్చుకున్నాడు. ఆబ్రహ్మమైన సౌమ్య పురీశుణ్ణి నేను ఆశ్రయిస్తాను

❋ ఈ సందర్భంలో రైక్వఋషియొక్క కథ వివరంగ తెలుపబడుతుంది.

వ్యాఖ్య

నిద్రలో మన దృశ్యాలు, కర్మలు ప్రాణంలో లీనమైపోతాయి. ఉదయం లేవగానే మళ్ళీ అందులోంచే ప్రకటమౌతాయి. అలాగే తెలివితో మనం చేసే ప్రతిపని బ్రహ్మనుండి ఉదయిస్తుంది. అన్నింటిలోని ఏకసారమైన ఆత్మను సాక్షాత్కారం చేసుకొన్నప్పుడు మన ప్రతిదృశ్యం, ప్రతికర్మ శుద్ధచైతన్యరూపమైన పరమాత్మలో కలిసి పూర్తిగా అదృశ్యమైపోతాయి.

జానశ్రుతి మహారాజు రైక్వఋషి ప్రశంసను విన్నప్పుడు, అతడు ఆయన వద్దకు వెళ్ళి సంవర్గవిధాన బ్రహ్మోపాసనను నేర్చుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఋషికి తన సంపదను, రాజ్యంలో ఒక భాగాన్ని, తన కుమార్తెను ఆయనకు అర్పించాడు. ఋషి ఆయనకు జ్ఞానాన్ని ఇచ్చి, రాజ కానుకలను తిరస్కరించాడు. జ్ఞానంకోసం ధనాన్ని, భూమిని, కన్యకని సమర్పించిన రాజు మనస్తత్వాన్ని "శూద్ర" * అని ఋషి ఖండించాడు. గురుసేవచేసి జ్ఞానం పొందటం శ్రేష్ఠం. ధనంద్వారా పొందటం 'క్షుద్రం' అని బ్రహ్మసూత్రాలలో వ్యాసులవారు పేర్కొన్నారు. (బ్ర సూ 1–3–10) శంకర భాష్యంలోకూడా ఇదే చెప్పబడింది.

వ్యాసుడు, శంకరుడు శూద్రులు వేదాలను చదవడానికి నేర్చుకోడానికి అర్హులు కారని అన్నట్లుగా ఇక్కడ తోస్తుంది. కాని ఈ ఉపనిషత్తులోనే శూద్రులుకూడా ఈ మహాజ్ఞానానికి అర్హులైనట్లుగా కనబడుతుంది. **

శ్లో॥ ప్రకాశవానేవ మనంతవాంశ్చ
ప్రదీప్తి మానాయతనీ చ పాదాః॥
యద్బ్రహ్మణో భాంతి విచింతకానాం
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 21

* "ఓశూద్రుడా, నాకు కానుకలుగా అర్పించిన దండలు, రథాలు, గోవులు మొదలైన వాటిని నీవే వుంచుకో"

** సత్యకామ జాబాలి గౌతమఋషి వద్దకు వెళ్ళాడు. ఉన్న సత్యాన్ని చెప్పాడు– "నా తండ్రి ఎవరో, నా గోత్రమేమిటో ఎరుగను "సత్యం చెప్పినందుకు ఋషి అతడు బ్రాహ్మణుడని అంటూ స్వీకరించాడు.

ప్రతి॥ యత్ = ఏ బ్రహ్మ, ప్రకాశవాన్ = ప్రకాశవంతుడు, ఏవం = అట్లే, అనంతవాన్ + చ = అనంతరూపుడును, ప్రదీప్తిమాన్ = తేజోరూపుడును ఆయతనీ + చ = విశాలుడును అను, పాదాః = నాల్గుపాదాలు, బ్రహ్మణి = బ్రహ్మయందు, విచింతకానామ్ = జిజ్ఞాసువులకు, భాంతి = భాసించుచున్నవో——

## తాత్పర్యం

తేజస్సు, అనంతం, ప్రదీప్తం, ఆయతనం – ఇలా చతుష్పాదంగా ఉపాసింపబడిన బ్రహ్మమైన సౌమ్య పురీశుని నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

సత్యకాముడు మొదలైనవారిచేత ఇలా చతుష్పాదబ్రహ్మము ఉపాసింప బడింది. ఈ నాలుగురూపాలు పరబ్రహ్మముపైన ఉపాసనాభాగంగా ఆపాదించబడినాయి.

సత్యకామజాబాలి గురుకులంలో విద్యాభ్యాసం నిమిత్తం గౌతమఋషి వద్దకు వెళ్ళాడు. అతణ్ణి అడవికి వెళ్ళి గురుకుల గోవులను కాపలా కాయమని గురువు ఆదేశించాడు. "అయ్యా అవి వెయ్యిగోవులైనాక తిరిగి వస్తాన"ని ఆ కుర్రవాడు అన్నాడు. గురుసేవాతత్పరతలో అతడు పదేళ్లు గడిపాడు. అప్పటికి గోవులమంద వెయ్యింటికి పెరిగింది. అతడు తిరిగి రావడానికి నిర్ణయించు కొన్నాడు. ఆసమయంలో ఆలమందలోని వృషభం ద్వారా వాయుదేవుడు అతడికి పరబ్రహ్మం యొక్క ప్రకాశతత్త్వాన్ని బోధించాడు. రెండోరోజు అగ్ని దేవుడు భగవంతుని అనంతతత్త్వాన్ని బోధించాడు. మూడోరోజు హంస (సూర్యుడు) భగవంతుని ప్రదీప్తతత్త్వాన్ని బోధించాడు. చివరిరోజు ప్రాణం భగవంతుని ఆయతన తత్త్వాన్ని బోధించింది.

ఈ కథ ఆధారంగా శ్రీ గురుదేవులు పైశ్లోకాన్ని రచించారు. (ఛాందోగ్య 4. 4. 8)

శ్లో॥ చతుష్పదం బ్రహ్మ చ షోడశాంశం
సముచ్చితం యన్మని రాదిదేశ।
జాబాలకాయై తదనన్వయాయ
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 22

ప్రతి॥ యత్ = ఏ, మునిః = గౌతమముని, అనన్వయాయ = గోత్రముతెలియని, జాబాలకాయ = జాబాలమునికి, చతుష్పదం = నాలుగుపాదాలుగలది యును, షోడశ + అంశం = పదారుకళలు కలదియును, సముచ్చితం = సమాహారరూపమయిన, బ్రహ్మ = బ్రహ్మజ్ఞానమును, అదిదేశ = ఉపదేశించెనో——

## తాత్పర్యం

తన గోత్రంకూడా తెలియని సత్యకామ జాబాలునికోసం గౌతమఋషి బ్రహ్మముయొక్క నాలుగుపాదాలను, పదారు అంశాలను ఉపదేశించారు. ఆబ్రహ్మమైన సౌమ్య పురీశుని నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఉపకోశలుడనే గురుకులవాసి. ఆయన గురువైన సత్యకామఋషి అతడికి ఉపదేశం చేయలేదు. ఉపకోశలుడు తన ఇష్టదైవమైన అగ్నిదేవుని ఆరాధనలో ఉపవాసాలు, తీవ్రమైన తపస్సు చేస్తూ ప్రార్థనలు చేశాడు. త్రేతాగ్నులు అతనికి దర్శనమిచ్చి బ్రహ్మవిద్యను నేర్పాయి.

శ్లో॥ ప్రాణో హ్యసౌ బ్రహ్మనిరుక్త మేతత్
కం బ్రహ్మ ఖం చే త్యనలై స్త్రిభిశ్చ।
కార్యేతరాకార మకారణం యత్
తమాశ్రయే సౌమ్యపురాధినాథమ్॥ 23

ప్రతి॥ కం = నీరు, బ్రహ్మ = బ్రహ్మము, ఖం = ఆకాశము–అను, త్రిభిః = మూడైన, అనలైః + చ = అగ్నులచే, అసౌ + ప్రాణః = ఈప్రాణము, బ్రహ్మ = బ్రహ్మముగా, నిరుక్తం = నొక్కిచెప్పబడింద్, కార్య + ఇతర + ఆకారం = కార్యంకంటె భిన్నమైన ఆకారముకలది, అకారణం = కారణరహితముగ, యత్ = ఏ బ్రహ్మమున్నదో——

## తాత్పర్యం

త్రేతాగ్నిదేవతలు ఇలా ఉపదేశించారు. — 'ఈప్రాణం బ్రహ్మము. అది ఆనందబ్రహ్మము (కం). అది ఆకాశబ్రహ్మము (ఖం). ఈబ్రహ్మమే కార్యము, కారణము కూడా దానికి మాత్రం కారణం లేదు. ఈబ్రహ్మము సౌమ్య పురీశుని నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

మన పరికరాల స్పందనలన్నీ కేవలం ఆత్మసాన్నిధ్యంవల్లనే జరుగుతున్నాయి. అందరిలోను వ్యక్తమయ్యే ఈ శక్తినే "ప్రాణము" అంటారు. ఈ ప్రాణం బ్రహ్మముయొక్క వ్యక్తస్వరూపం.

బ్రహ్మము ఆనందరూపం (కం). అది హృదయాకాశంలో ఉన్నది. ఇలా బ్రహ్మము హృదయాకాశంలో ప్రాణంగా వ్యక్తమయ్యే ఆనందమే. ఇక్కడ కార్యకారణాలు రెండూ బ్రహ్మమే అని తెలుపుతూ బ్రహ్మమునకు వెనకాలమాత్రం ఏ కారణం లేదని వివరించబడింది. అది అకారణం.

నిత్యశాశ్వత వస్తువైన బ్రహ్మమును గురించి ధ్యానించేటప్పుడు అంతశ్శుద్ధికోసం ఈ ఉపాసన ఇవ్వబడింది. అకారణమైన శుద్ధసారం కాల పరిధిలో కార్యకారణాలుగా క్రీడిస్తుంది. కాలగణనలో ముందున్నది కారణం. తరువాత ఉన్నది కార్యము. చెట్టు దృష్ట్యా విత్తనం కారణం. విత్తు దృష్ట్యా చెట్టు కారణం. కార్యకారాణాలనేవి బుద్ధినిర్ణయాలు. ఈరెండూ చైతన్యంవల్ల వెలిగింపబడుతాయి. వెలిగించే కాంతి వెలిగింపబడే వాటికన్న ఎప్పుడూ భిన్నమైనదే. అగ్నిదేవతలచేత కార్యకారణ బ్రహ్మంగా ఉపదేశింపబడిన బ్రహ్మము సౌమ్య కాశీశుణ్ణి నేను ఆశ్రయిస్తాను. (ఛాందోగ్య 4–10)

పరమపవిత్రమైన దివ్య అగ్నిదేవతలు ఉపకోశలునితో ఇలా అన్నారు. "ఇంతమాత్రమే నీకు మేము ఉపదేశిస్తున్నాము. మిగతావి నీకు మీ గురువు నుండి లభిస్తుంది". గురువు సత్యకాముడు ఆశ్రమానికి తిరిగివచ్చాడు. సంతృప్తితో వెలిగిపోతున్న శిష్యుడిముఖం చూచి, "ఈవిద్యను నీకు ఎవరు నేర్పారు"? అని అడిగాడు. ఉపకోశలుడు జరిగినదంతా చెప్పాడు. పరమానంద భరితుడైన సత్యకాముడు, "ఆదేవతలు నీకు స్థూలమైన చిన్న ఉపాసనని నేర్పారు. ఇప్పుడు నేను నీకు ఉత్తమజ్ఞానాన్ని ప్రసాదిస్తాను. దానివల్ల నీవు పాపాలవల్ల తాకబడక నీటిపైన తామరాకువలె అవుతావు". అన్నాడు.

శ్లో॥ వశ్యైక్షణై శ్శమపరై రపరాజితై ర్య
శ్చక్షుస్థ ఏష పురుషః పురుదృశ్యతేఽస్య
స్థానేఽపి సర్పి రుదకం చ న సించతి శ్రీ
విశ్వేశ మేతమభయం శరణం ప్రపద్యే॥ 24

ప్రతి॥ శమపరైః = నిగ్రహీతములైనవి, అపరాజితైః = గెలువబడని, వశ్య = స్వాధీనములైన, ఈక్షణైః = చూపులచే, చక్షు + స్థః = కంటి యందున్న, ఏషః = ఈ,- పురుషః = మహపురుషుడు, పురుదృశ్యతే = ప్రధానుడుగచూడబడునో, అస్య = అతని, స్థానే + అపి = ఉన్నచోటు నందుకూడ, సర్పిః = నేయి, ఉదకం + చ = నీరును, న + సించతి = తడుపదు, ఏతం = ఈ, శ్రీవిశ్వేశం = శివుని, అభయం = భయములేని, శరణం = దాపును, ప్రపద్యే = పొందుచున్నాను.

## తాత్పర్యం

కళ్లు మొదలయిన ఇంద్రియాలను వశపరచుకొని ఇంద్రియ విషయాల వల్ల చలించని యోగులు కుడికంటిలో నివసించే ప్రాణాధిపతి బ్రహ్మను సాక్షాత్తు దర్శిస్తారు. ఆయన వసించే కంట్లో నెయ్యి, నీరు పోసినా కంటిని తడపవు.కారిపోతాయి. ఆకంటిలోని ప్రభువే అభయస్థానమైన ప్రియ కాశీ పురాధీశుడు. ఆయనను నేను ఆశ్రయిస్తాను.

వ్యాఖ్య

పరమపావనుడైన పురుషుడుండే స్థానం కుడికన్ను ఎవరూ తాకి మలిన పరచలేనంత పరమ పవిత్రమైనది ఇక ఆ పురుషుడెంత పవిత్రుడు, తాకబడరాని వాడూ అయివుండాలి? సాధకుడు అపరమాత్మ తన కుడికంట్లోనే వుండి వ్యక్తమౌతున్నాడని గుర్తించి తాదాత్మ్యం పొందాడా, ఇక ఎలాంటి పాపాలు అతణ్ణి తాకవు అతడి కర్మలు ఇక వాసనలను సృజించవు

అగ్నులు ఉపకోశలుడికి అవ్యక్తమైన శుద్ధబ్రహ్మమును ❋ గురించి ఉపదేశించారు అతడి గురువైన సత్యకామ జాబాలి అపరమాత్మ వ్యక్తియొక్క కుడికంట్లో ఉంటూ అతడి జాగ్రదవస్థలో ఎంతో చురుకుగా ప్రపంచాన్ని దర్శించేవాడని బోధచేశాడు

ఇలా కుడికంటిలోని ప్రభువుని ఆరాధించే సాధకుడు అన్నిటికన్న ఎక్కువైన స్వర్గం-బ్రహ్మలోకాన్ని పొందుతాడు.

శ్లో॥ చిత్తే యదక్షిపురు షేక్షకమర్చి రుచ్చై
ర్మిత్రార్జునోదగయనాని నయంతి వైధీమ్।
సంవత్సరో రవిశశాంకశతప్రహదాశ్చ
పశ్చాత్ పుమాన్ పుర ముదేతు స విశ్వనాథః॥ 25

ప్రతి॥ యత్ = ఏ, ఉచ్చైః + అర్చిః = ఉజ్జ్వలతేజస్సు, అక్షిపురుషేక్షకం = కంటితేజఃప్రదానకంగ తపస్సుచేయుసాధకుని (మరణానంతరం), మిత్ర + అర్జున + ఉదక్ + అయనాని = సూర్యచంద్ర,ఉత్తరదిక్కులు అయనాలును, పశ్చాత్ = తర్వాత, సంవత్సరః = సంవత్సరము, రవిశశాంకశతప్రహదాః + చ = సూర్యచంద్ర వరుణలోకాలును, వైదీం + పురం = బ్రహ్మలోకమును, నయంతి = పొందించుచున్నారో, సః = ఆతేజోరూపుడైన, పుమాన్ = పురుషుడు, విశ్వనాథః = కాశీశ్వరుడు, చిత్తే = నాచిత్తమందు, ఉదేతు = ప్రత్యక్షమగుగాక!

---

❋ అవ్యాకృతబ్రహ్మము

## తాత్పర్యం

కుడికంటిలోని ఈ ప్రభువును దీక్షతో ఆరాధించే ఉపాసకుడు మరణించాక జ్వాలాదేవత (అర్చి–అభిమానిదేవత) అతణ్ణి తీసుకువెడుతుంది. అటు పిమ్మట పగలుదేవత (ఘస్రదివసాభిమానిదేవత), శుక్లపక్ష దేవత (అర్జున), ఉత్తరాయణదేవత, సంవత్సరదేవత, తరువాత సూర్యుడు, చంద్రుడు, తరువాత విద్యుద్దేవత... ఈ ప్రకారం ఒక ప్రదేశంనుండి మరో ప్రదేశానికి ఇంకా ఇంకా ఉన్నతంగా తీసుకొనిపోతాయి, విద్యుద్దేవతా లోకంలో బ్రహ్మలోకం నుండి ఒక దివ్యపురుషుడు వచ్చి అతణ్ణి పరమగమ్యానికి తీసుకొని వెళ్లుతాడు కుడికంటిలోని ఆ ప్రభువు నా విశ్వనాథప్రభువు. నిత్యము ఆయన నా హృదయంలో వెలుగొందునుగాక! (చిత్తే ఉదేతు).

## వ్యాఖ్య

ఆయనను గురించి, ఆయన మహిమలను గురించి ఎప్పుడూ భక్తితో నా హృదయంలో రమించెదనుగాక!

ఉపాసకుని మరణం తరువాత బ్రహ్మలోకానికి వెళ్లే ఆహ్లాదకరమైన ఈ మార్గం చదవడానికి అద్భుతంగా ఆసక్తికరంగా ఉంటుంది. ఒక్కొక్క దేవతే కొంతవరకు తీసుకువెళ్ళి అతణ్ణి మరో ఉన్నతమైన దేవతకు వప్పగిస్తుంది. అతడు విద్యుల్లోకానికి చేరేసరికి బ్రహ్మలోకంనుండి దివ్యపురుషుడు వచ్చి కుడికంటిలోని ప్రభువు ఉపాసకుణ్ణి క్షేమంగా చూచుకుంటూ బ్రహ్మలోకానికి తీసుకుపోతాడు. (ఛాందోగ్య 4. 15 5)



# దశమ స్తబకం

వెనకాలి అధ్యాయంలో శ్రీ గురుదేవులు ఛాందోగ్యోపనిషత్తులోని మొదటి నాలుగు అధ్యాయాలను వివరించారు. ఈస్తబకంలో తరువాతి అధ్యాయాలను కొనసాగిస్తున్నారు.

శ్లో॥ ప్రాణాత్మనా దేహ ముపాశ్రితో యః
శ్రేష్ఠ స్తథా జ్యేష్ఠతరశ్చ నిత్యమ్।
వాగాదికాన్ ధారయతీచ్ఛయైష
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 1

ప్రతి॥ యః = ఏ, ఆత్మా = ఆత్మ, ప్రాణాత్మనా = ముఖ్యప్రాణంగ, దేహం = శరీరాన్ని, ఆశ్రితః = ఆశ్రయించియున్నదో, ఏషః = ఈఆత్మ, శ్రేష్ఠః = ఉత్తమమై,తథా = అట్లే, జ్యేష్ఠతరః + చ = సర్వోత్కృష్టమైన ప్రాణమై, ఇచ్ఛయా = కోరికచే. నిత్యం = ఎల్లప్పుడు, వాక్ + ఆదికాన్ = వాక్కు మొ॥ వానిని, ధారయతి = ధరించుచున్నదో, తస్మై = అట్టి, శివాయ = శివునికి, నమః = నమస్కారము, అస్తు = అగుగాక! నమః + అస్తు = పునర్నమస్కారము.

## తాత్పర్యం

వాక్కు, చక్షువు, శ్రోత్రం మొదలైన వాటికి శక్తి నిచ్చే ప్రాణాలకన్న జ్యేష్ఠుడుగా, శ్రేష్ఠతరుడుగా పరమాత్మ ఈశరీరంలో ఉంటాడు. ఆయన ఇచ్చ ప్రకారం అవి ఆ ఇంద్రియాలకు చేతనత్వాన్ని ఇస్తూ, నిగ్రహిస్తూ, నడిపిస్తూంటాయి. ఆ శివునికి నమస్కారాలు, నమోవాకాలు!

## వ్యాఖ్య

ఈ స్తబకంలో మకుటంలో శ్రీ గురుదేవులు పరమశివునికి ప్రీతితో రెండేసిసార్లు నమస్కారం అర్పిస్తున్నారు. సౌమ్య కాశీశునిపట్ల ఆయనకు వున్న భక్త్యావేశం అట్టిది!

ముఖ్యప్రాణరూపంలో ప్రముఖంగా శక్తిని ప్రసాదించే పరమాత్మను జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అని వర్ణించారు. తల్లిగర్భంలో పిండం వున్నప్పుడు వాక్కు చక్షువు, శ్రోత్రం, ఆలోచనాశక్తిని కలిగించే ప్రాణాలు వ్యక్తం కావడానికి ముందే పిండానికి ప్రాణంపోసి చేతనత్వాన్ని ఇచ్చి నిలబెట్టే ఈప్రాణస్ఫూర్తి ఉన్నది. పిండంలో మొట్టమొదటి ప్రాణస్పందనకు కారణం కాబట్టి ఆయన శ్రేష్ఠుడు.

ఆయన జ్యేష్ఠుడు ఉత్తముడు. ఆయనే లేకపోతే వాక్కు, చక్షుశ్రోత్రాలను పనిచేయించే ఇతరప్రాణాలు ఏవీ శరీరంలో ఒక్క క్షణం ఉండలేవు. పనిచెయ్యలేవు. ఆయన ముందు జీవిలో ఉండాలి.తరువాత అవి పనిచేస్తాయి,

ఈ భావాన్ని ఛాందోగ్యోపనిషత్తు చాలా విస్పష్టంగా ఒక కథరూపంలో వెల్లడిస్తుంది. అది చాలా పెద్దగా ఉంటుంది కాబట్టి ఇప్పుడు చెప్పబడటం లేదు. ఇతర ప్రాణాలంటే వాక్కు, కన్ను, చెవి, మనస్సును ప్రేరించే ప్రాణ శక్తులు.

ఆత్మను ఈప్రకారంగా ముఖ్య ప్రాణరూపంలో ఉపాసించే సాధకుడు ఉత్తమము ఉదాత్తము అయిన స్థితిని పొంది జ్యేష్ఠుడుగా పరిగణించ బడుతాడు. ప్రాణోపాసన యొక్క గొప్పదనం ఇక్కడ వివరించబడింది. ఇంద్రియమనోబుద్ధులు ముఖ్యప్రాణరూపమైన ఆత్మసాన్నిధ్యంలోనే, ఆయన అనుగ్రహంవల్లనే వ్యవహరించగలవు. ఆయన అనుగ్రహం వెనక్కి వెళ్ళిందా, అన్నీ జడం, నిశ్చేతనం అయిపోతాయి.

**శ్లో॥ శ్రద్ధాది జుహ్వా త్యనలేషు దేవా**
**ద్యులోకముఖ్యే ష్వథ పూరుషాత్మా।**
**నిష్పద్యతే పంచసు యః పరాత్మా**
**నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥** 2

ప్రతి॥ దేవాః = దేవతలు, అనలేషు = అగ్నులందు, శ్రద్ధా + అది = శ్రద్ధాదులను, జుహ్వతి = వ్రేల్చుతారో, యః = ?, అథ = మరియు, పరాత్మా = పరమాత్మ స్వరూపమయిన, పూరుష + ఆత్మా = ముఖ్యాత్మ, పంచసు = అయిదయిన, ద్యులోకముఖ్యేషు = స్వర్గాదిలోకాలలో, నిష్పద్యతే = పుట్టుచున్నదో——

## తాత్పర్యం

స్వర్గం మొదలైన వాటిలో దేవతలు శ్రద్ధ మొదలైన వాటిని ఆహుతులుగా అర్పిస్తారు దానివల్ల అయిదింటి ద్వారా జీవుడిగా ఉదయించే పరమశివునికి నమస్కారాలు! నమోవాకాలు!

## వ్యాఖ్య

బ్రహ్మదేవుని నుండి చిన్న గడ్డిపోచవరకు వ్యక్తమైన జీవుళ్ళందరి జీవితాలు ఎట్లాంటి మార్పులతో కూడివున్నాయో ఈ శ్లోకం వివరిస్తుంది ఈ నిజాలను లోతుగా అర్థంచేసుకొన్న సాధకులకు లౌకిక స్వర్గసుఖాలపట్ల పరమ వైరాగ్యం ఉదయించక మానదు జీవుళ్ళందరు తప్పనిసరిగా జననమరణాల వలయంలో అంతులేకుండా తిరుగవలసివుంటుంది మానవజీవితమనే అద్భుత లీల—అతడి పుట్టుకకి వెనకాలవున్న రహస్యప్రక్రియ అంతా వివరించబడుతోంది తల్లిగర్భంలో మానవ శిశుపిండంగా ఏర్పడడానికి ముందు జీవుడు అయిదుదశల్లలో ప్రయాణించాలి. ఆ అయిదుదశలను అయిదు అగ్నిమార్గాలన్నారు ప్రతిదశలోను అయిదురకాల ఆహుతులు హోమంగా చేయబడాలి దీనిని పంచాగ్నివిద్య అంటారు

ముఖ్యప్రాణంగా తాదాత్మ్యం చెందిన ఆత్మ మరణసమయంలో శరీరాన్ని వదిలినప్పటినుండి తిరిగి మళ్లా గర్భస్థశిశువు అయ్యేంతవరకు సూక్ష్మమైన అయిదు అగ్నిపరీక్షలకు లోనుకావాలి — స్వర్గం, విద్యుద్వర్షాల ప్రపంచం, భూమి, పురుషుడు, స్త్రీ—ఈ అయిదింటిద్వారా ప్రయాణించడానికి అర్పించవలసిన ఆహుతులు ఇవి—శ్రద్ధ, సోమం, వర్షం, ఆహారం, వీర్యం— ఈ ఆహుతులు, ప్రయాణాలద్వారా తిరిగి పురుషరూపమైన గర్భస్థశిశువుగా

ఏర్పడుతుంది ఇలా ఏర్పడేది సౌమ్యకాశీశ్రమమే! ఆయనకు నా నమస్కారాలు! నమస్కారాలు!

నిత్యమూ గృహస్థులు త్రిసంధ్యలలో మూడుసార్లు అర్పించే అగ్నిహోత్రాన్ని ఇక్కడ శ్రద్ధ క్రింద వర్ణించారు 'శ్రద్ధ' అనడానికి ప్రత్యేక కారణం వున్నది ఈ మూడు సమయాల ఆహుతులని గాఢమైన భక్తితో చలించని విశ్వాసంతో అర్పించాలి శ్రద్ధ వున్నప్పుడే వాటిఫలితం లభిస్తుంది. పితృకర్మలను 'శ్రాద్ధం' అనడం కూడా అందుకే, భక్తివిశ్వాసాలతో అర్పించబడాలి

అగ్నికి అర్పించే ఈ ఆహుతులద్వారా మరణానంతరం జీవుడు ముందు స్వర్గాన్ని చేరుకుంటాడు ఆ తరువాత తనకువున్న పుణ్యాన్ని అనుసరించి అంతకన్న ఎక్కువైన సోమలోకాన్ని చేరడానికి తగిన శరీరాన్ని పొందుతాడు ఆ పుణ్యం ఖర్చుకాగానే సోమలోకంనుండి క్రిందికి దిగి పర్జన్యలోకానికి అంటే "మెరుపులు–వర్షం" లోకానికి దిగివస్తాడు అక్కడ మెరుపులు–వర్షంద్వారా భూమివైపుకి క్రిందుగా ప్రయాణిస్తాడు భూమిని చేరి మానవులు తినడానికి పనికివచ్చే ధాన్యం–దినుసుల ఆహారరూపాన్ని ధరిస్తాడు పురుషుడు ఆహారాన్ని తినగానే అతడిలో బీజరూప మౌతాడు. "వీర్యం" అని నిర్దేశింపబడిన ఈబీజం స్త్రీ గర్భంలోకి చేరుతుంది ఇలా శ్రద్ధగా అర్పించిన ఆహుతులద్వారా జీవుడు మానవశిశువుగా మారుతాడు ఉపనిషత్తు ఈప్రయాణానికి చెందిన జ్ఞానాన్ని 'పంచాంగవిద్య' అన్నది ఈవిద్య శ్వేతకేతువుకు పాంచాల భూపతి ప్రవాహణుడికి మధ్య జరిగిన సంభాషణద్వారా వివరించబడింది ప్రవాహణుడు ఆ సంవాదంలో పంచాగ్నివిద్యను ఇలా వర్ణించాడు –

జిజ్ఞాసువులు మూడు ఆశ్రమాలకు చెందినవారై వుంటారు–గృహస్థులు, వానప్రస్థులు, నిత్యబ్రహ్మచారులు ఈ మూడు తరగతులవాళ్లూ నిత్యమూ త్రికాలాలలో ఈ ఆహుతుల్ని అర్పించాలి 'ఆహవనాగ్ని' అంటే ఈ అగ్నిహోత్రానికి సమిధలు, ధూమం, అర్చికలు, అంగారాలు, స్ఫులింగాలు అయిదు అంశాలు వుంటాయి ఈ అయిదు, పైన వివరించిన పంచాగ్నులలోను వుంటాయి.

'శ్రద్ధ' అనే మొదటి అగ్నిహోత్రంద్వారా చేరుకునేది స్వర్గస్థానం. ఇందులో ఈ అయిదు అంశాలు ఇవి — 1) సూర్యుడు–సమిధ, 2) సూర్య కిరణాలు–ధూమం, 3) వెలుగుతో కనబడే పగలు–అర్చికలు, 4) సోముడు–అంగారాలు లేదా బొగ్గులు, 5) నక్షత్రాలు–స్ఫులింగాలు. ఇవి చాలా సున్నితమైన సాంకేతికోపాసనలు. జిజ్ఞాసువులకోసం ఉపనిషత్తుల ఋషులు వీటిని ఏర్పాటుచేశారు. వేదకాలంలో అగ్నిహోత్రం సర్వసాధారణంగా జరిగేది. కాబట్టి ధ్యానంకోసం ఇలా అయిదేసి అంశాల అగ్నిఉపాసన ఇవ్వబడింది. పంచాగ్నివిద్య అనేపేరుకూడ అందుకే ఏర్పాటు అయింది.

శ్రద్ధను అర్పించి జీవుడు మొదట అందుకునే స్థానం స్వర్గం. పై సంకేతాల వర్ణనలను విశ్లేషించి పరిశీలించి ధ్యానించినప్పుడు జీవుడు ఉత్తమ వాసనలను అనుసరించి ఊర్ధ్వగామియై ప్రయాణిస్తాడని గోచరిస్తుంది. అతడు ఆచరించే ఆధ్యాత్మిక సాధనలు, తపస్సు కారణంగానే స్వర్గం లభిస్తుంది. నిర్మలంగా స్వార్థరహితమైన ఆధ్యాత్మిక జీవితాన్ని గడపడంద్వారా ఉత్తమమైన తేజోవంతమైన ఊర్ధ్వలోకాలను పొంది స్వర్గంలో సుఖిస్తారని సాధకులకు ఈ వర్ణనలు హామీ ఇస్తాయి.

ఈ స్వర్గలోకాలలో జీవుళ్ళు ఎంతకాలం ఉంటారనేది వాళ్ళు ఇక్కడ జీవించివుండగా సాధనచేసిన సమయంలో ఏయే వాసనలు, కోరికలు వాళ్ళ సాధనకు కారణం అయ్యాయో దానిమీద ఆధారపడివుంటుంది. వాళ్ళ ఉద్దేశ్యాలు, కోరికలు పూర్తిగా స్వార్థపరంగా ఉండి అహంకారంతో స్వర్గలోక సుఖాలు అనుభవించడం మేరకే వుంటే, అక్కడ వాళ్ళఉనికి వాళ్ళు చేసిన పుణ్యకర్మలమేరకే వుంటుంది. ఈ పరిమిత కర్మలు ముగియగానే వాళ్ళు తిరిగీ భూమిమీద పుట్టాలి. శుద్ధమై, స్వార్థరహితమై అహంకారపూరితమైన కోరికలు లేకుండా దివ్యమై నిర్మలమైన భావాలతో ఇక్కడ సాధన చేసి వున్నట్లయితే జీవుడు భూమిపైన తిరిగి పుట్టడు. స్వర్గానికి ఇంకాపైన ఉన్న ఊర్ధ్వలోకాలకి వెళ్ళి సర్వవ్యాప్తమైన పరమాత్మలో కలిసిపోయే స్థానంవరకు వెళుతాడు.

ప్రస్తుతశ్లోకంలో జీవుడు మానవశిశువుగా తిరిగి జన్మపొందే సిద్ధాంతం ప్రస్తావించబడింది. అందుకని పైలోకాలకు వెళ్ళకుండా క్రిందిలోకానికి దిగి వచ్చే విషయమే ఇక్కడ వున్నవి. ఈ క్రిందిలోకం పర్జన్యలోకం లేదా వర్షలోకం.

ఇలాంటి జీవుళ్లు స్వర్గాన్ని చేరుకున్నాక చంద్రలోకంలోకి ప్రవేశించడానికి తగిన రూపాన్ని ధరిస్తారు. దానినే శాస్త్రాలలో 'పితృలోకం' అన్నారు. చంద్రలోకంలోని స్వర్గసుఖాలను అనుభవించాక పుణ్యాలన్నీ ఖర్చయిపోయిన జీవుడు చంద్రుని దివ్యలక్షణాలను పొంది క్రిందికిదిగడం ప్రారంభిస్తాడు. చంద్రలోకంలో జీవుడు సంపాదించుకొనే చంద్రలక్షణాలు ఆలోకంలోని సుఖాలన్నింటినీ అనుభవించడానికి, తిరుగుప్రయాణానికి కూడా తోడ్పడుతాయని తోస్తుంది. అందుకే సోముణ్ణి కూడా ఆహుతిక్రింద పేర్కొన్నారు. శ్రద్ధ జీవుణ్ణి స్వర్గానికి తీసుకువెళ్లుతుంది. సోముడు అతణ్ణి పర్జన్యలోకానికి క్రిందకి తిసుకువస్తాడు. ఇదే విద్యుల్లోకం, వర్షలోకంకూడా.

విద్యుల్లోకంలో జరగవలసిన యజ్ఞం సోముణ్ణి ఆహుతిగా ఇవ్వడం. ఇందులో హోమాంతాలూకు అయిదు అంశలు ఉండాలి. అవి ఇవి— 1) వాయువు–సమిధలు, 2) మేఘాలు–దాని పొగ, 3) విద్యుత్తు--దాని అర్చికలు, 4) మెరుపులు–అంగారాలు లేదా బొగ్గులు, 5) ఉరుములు–నిప్పురవ్వలు. ఈయజ్ఞంతో జీవుడు మేఘాల (వర్షం) లోకి సూక్ష్మరూపంతో ప్రవేశిస్తాడు.

ఇక తరువాతస్థాయి. జీవుడు వర్షంగా భూమిలోకి ప్రవేశించి మానవులు తినే ధాన్యంగా మారుతాడు. భూమిపై జరిగే మూడో యజ్ఞంలో అయిదు అంశాలు ఇవి—1) పంటలు పండడానికి సరైనఋతువులు కావాలి. అందుచేత ఋతువులు సమిధలు, 2) పైన వ్యాపించివున్న ఆకాశం పొగ, 3) ఆకాశంలో వెలిగే చంద్రుడు, నక్షత్రాలు, అర్చికలు, 4) అంతా ప్రశాంతంగా ఉండే నాలుగుదిక్కులూ బొగ్గులు లేదా అంగారాలు, 5) అవాంతరదిశలు ఆగ్నేయ, వాయువ్య, నైఋతి, ఈశాన్యాలు నిప్పురవ్వలు, వర్షాలకారణంగా భూమిపైన జనించే మొక్కలు, చెట్లద్వారా మానవులకు పనికివచ్చే ఆహారదినుసులు లభిస్తాయి. జీవుడు ధాన్యరూపాన్ని పొందుతాడు.

అటుపిమ్మట జీవుడు పురుషుడిలోకి ప్రవేశిస్తాడు. వాడితో ఆహారం అరగడం నాలుగో యజ్ఞం. ఇందులోని అయిదు అంశాలు ఇవి— 1) వాక్కు. ఇది పురుషుడి అగ్నికర్మలకు ముఖ్యమైన సమిధ. 2) ప్రాణం—ఇది ధూమం. ఉచ్ఛ్వాసనిశ్వాసాలుగా ఉండే రెండుక్రియలూ పొగలాగానే ఉంటాయి. 3) నాలిక అర్చికలు. ఆహారాన్ని అందుకొని రుచులు చెప్పేది ఇదే. 4) మిలమిల మెరిసే కళ్లు అంగారాలు లేదా మండుతున్న బొగ్గులు, 5) అగ్ని ప్రక్కలా చెవిరివ్వన్ని ధ్వనులను వినే చెవులు నిప్పురవ్వలు. ఈస్థానంలోకి అర్పించే ఆహుతులు రకరకాలైన ఆహారపదార్థాలు. ఈయజ్ఞంద్వారా పురుషుడు తినే ఆహారంనుండి బీజం ఏర్పడుతుంది. దానిని రేతస్సు అంటారు. జీవుడు ఆహారరూపం వదిలి రేతస్సురూపం ధరిస్తాడు.

చివరి అగ్ని స్త్రీ. ఆమెలో జరిగే యజ్ఞానికి అయిదు అంశలు ఇవి— 1) నాభిస్థానం—సమిధ, 2) పురుషునితో సంగమం — ధూమం, 3) గర్భం— అర్చికలు, 4) సంగమంద్వారా స్త్రీ గర్భంలోకి ప్రవేశించే పురుషబీజం— అంగారాలు, లేదా బొగ్గులు, 5) స్త్రీ పురుషులిద్దరికి సంగమంద్వారా కలిగే ఆనందం నిప్పురవ్వలు. పురుషుడర్పించే వీర్యమే ఆహుతి. దానితో పునర్జన్మ కోసం జీవుడికి మానవ శిశురూపం వస్తుంది.

ఇలా శాస్త్రాలు బోధించే పంచాగ్నివిద్యను ఉపాసించి క్షుణ్ణంగా అర్థం చేసుకొన్న గృహస్థులు, వానప్రస్థులు, నైష్ఠికబ్రహ్మచారులు, మరణానంతరం 'అక్షపురుషుని' ఉపాసనలో వర్ణించినట్లుగా ఉత్తరదిక్కుగా ప్రయాణిస్తారు. వీరి ప్రయాణం తరువాతి శ్లోకంలో వివరింపబడుతుంది.

శ్లో॥ పంచాగ్నివిద్యో గృహమేధివర్య
స్తపోధనో నైష్ఠిక వేదగశ్చ।
పారాయణం యంతి హి యం న సద్యో
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 3

ప్రతి॥ పంచాగ్నివిద్యః = పంచాగ్నివిద్యలను తెలిసినవాడు, గృహమేధివర్యః = ఉత్తమగృహస్థు, తపోధనః = తపోధనుడు, నైష్ఠికవేదగః + చ = నైష్ఠికబ్రహ్మచారియు, సద్యః = వెంటనే, సౌరాయణం = సూర్యుని అధిష్ఠానమును, స + యంతి = పొందరో——

## తాత్పర్యం

పంచాగ్నివిద్య నెరిగిన ఉత్తమగృహస్థు, వానప్రస్థు, నైష్ఠికబ్రహ్మచారి, తమశరీరాలను వదిలినప్పుడు సూర్యమార్గాన ప్రయాణిస్తారు. అయ్యో! పాపం వాళ్లు సూటిగా అందుకోలేని ఆ పరమశివునకు నా నమస్కారాలు!నమోవాకాలు!

## వ్యాఖ్య

సూటిగా ఆత్మజ్ఞానాన్ని పొందలేని సాధకులగతిని శ్రీ గురుదేవులు నిరసిస్తున్నారు. "యం సద్యః న యంతి"—ఇక్కడే సాక్షాత్తుగా పరమాత్మను దర్శించలేరు. ఉపనిషత్తులనుబట్టి చూస్తే ఆత్మనెరిగిన బ్రహ్మజ్ఞానికి ఎక్కడికో ప్రయాణం అంటూ వుండదు. (న తస్య ప్రాణాః ఉత్క్రామంతి) అతడు తన బ్రాహ్మీ స్థితిలోకి వెళ్ళిన బ్రహ్మమే అవుతాడు. అలా ఆత్మజ్ఞాని అయిన మహాత్ముడు ఇంక ఏలోకాలకూ వెళ్ళడు. దేశకాలాల పరిధితో ఆయన పయనించ వలసిన లోకమంటూ ఉండదు. దేశకాలాలు ఎక్కడనుండి ఉత్పన్నమౌతాయో అసర్వవ్యాప్త బ్రహ్మమే అవుతాడు. కుండ బ్రద్దలైనప్పుడు కుండలోని ఆకాశం సర్వవ్యాప్తమైన ఆకాశంలో కలిసిపోయినట్లు బ్రహ్మజ్ఞాని తన మర్త్యశరీరాన్ని వదిలిపెట్టినప్పుడు సర్వవ్యాప్తమైన పరబ్రహ్మంలో లీనమై పోతాడు. కలలోంచి మెల్కొన్నప్పుడు కలగనేవాడు, అతడి కలప్రపంచమూ రెండూ మేలుకొన్నవాడి మనస్సుగా మారిపోతాయి. తిరిగి జన్మను పొంది కర్మేంద్రియాలద్వారా ఖర్చుచేసుకోవలసిన వాసనలేవీ అతడిలో మిగలవు,

ముందు పేర్కొనబడిన మూడురకాల వాళ్ళల్లో వాసనలు పూర్తిగా క్షయం కానందున వాళ్లు ఉత్తరలోకాలకు వెళ్ళి అక్కడుండి వాటిని క్షయం చేసుకోవాలి. అందువలన వాళ్ళు సూర్యమార్గాన అంటే ఉత్తరాయణంద్వారా బ్రహ్మలోకానికి వెళ్ళి అక్కడ దివ్యమైన సుఖభోగాలను అనుభవిస్తారు. ఈ

ఉపాసకులు తిరిగి భూలోకానికి రారు. బ్రహ్మదేవుని అయువు పూర్తి అయ్యేంతవరకు బ్రహ్మలోకంలోనే వుండి బ్రహ్మ ప్రళయసమయంలో ఆయనతోబాటు పరబ్రహ్మలో కలిసిపోతారు. ఇది క్రమముక్తి. క్రమముక్తికి సద్యోముక్తికి వుండే తేడాని శ్రీ గురుదేవులు ఇక్కడ విశదీకరించారు.

రాబోయే శ్లోకంలో అతిరహస్యమైన ఈ పంచాగ్నివిద్యని గౌతమగోత్రానికి చెందిన అరుణి ఋషికి, క్షత్రియకులానికి చెందిన ప్రవాహణుడనే రాజ కుమారునిద్వారా నేర్పబడిందని నిరూపణం చేస్తున్నారు.

శ్లో॥ పంచాగ్నివిద్యా మపఠన్నిగూఢాం
యద్బ్రహ్మ బుద్ధే రధిరోహిణీ ప్రాక్।
ప్రవాహణం క్షత్త్రియ మేత్య విప్రో
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 4

ప్రతి॥ ప్రాక్ = మునుపు, విప్రః = బ్రాహ్మణుడుఅయిన గౌతముడు, ప్రవాహణం = ప్రవాహణుడను పేరుగల, క్షత్త్రియం = రాజును, ఏత్య = పొంది, యత్ = ఏ, బ్రహ్మబుద్ధేః = బ్రహ్మభావముయొక్క దయ వలన, అధిరోహిణీం = పొందదగిన, నిగూఢాం = రహస్యమైన, పంచాగ్నివిద్యాం = పంచాగ్నివిద్యను, అపఠత్ = చదివెనో———

## తాత్పర్యం

భగవంతుని కృపవల్ల ఆశీస్సులవల్ల ఈ నిగూఢ సనాతన పంచాగ్ని విద్య క్షత్త్రియుడైన ప్రవాహణమహారాజుచేత బ్రాహ్మణుడైన గౌతముఋషికి పరమాత్మ నందుకునే సాధనాక్రమంలో ఒక మెట్టుగా నేర్పబడింది ఆ పరమాత్మ పరమశివునికి పునఃపునః నా నమోవాకాలు!

## వ్యాఖ్య

పూర్వకాలంలో పంచాగ్నివిద్య కేవలం రాజవంశీకులైన మహారాజులకే తెలిసివుండేది. బ్రాహ్మణులకు తెలియదు. పాంచాలరాజు అయిన

ప్రవాహణుడు అరుణి కుమారుడైన శ్వేతకేతువు అనే బ్రాహ్మణకుమారుడికి బోధించాడు. శ్వేతకేతువు విద్యానిమిత్తమే మహారాజును సమీపించాడు. ఈ రహస్యవిద్యకోసం శ్వేతకేతువు మహారాజును ఏవిధంగా సమీపించాడో అయిదో అధ్యాయంలో 3–9 ఖండాలు వివరంగా తెలుపుతాయి.

తరువాతి శ్లోకంలో వేదాల కర్మకాండ భాగంలోని యజ్ఞయాగాదులు (ఇష్టం), సత్రాల నిర్మాణం, వైద్యశాలల నిర్మాణం, చెరువులు — నూతులు త్రవ్వించడం, చెట్లునాటడం వంటి సమాజసేవా కార్యక్రమాలు (పూర్తం) ఉత్తమ లోకాలను చేరుకొని సుఖించాలనే స్వార్థకామనలతో చేసి మరణానంతరం ఉత్తమ చంద్రలోకానికి దక్షిణాయనంద్వారా చేరుకొనే పద్ధతి వర్ణించబడింది.

శ్లో॥ ఇష్టాదికృద్ధూమ నిశాసితై ష
ణ్మాసైశ్చ పిత్రా నభసా చ నీతః।
చాంద్రీం పురీమేతి హయ న్నయాత్యోం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 5

ప్రతి॥ ఇష్టాదికృత్ = గృహస్థు, ధూమనిశాసితైః = ధూమదేవత,రాత్రిదేవతలచే షట్ + మాసైః + చ = దక్షిణాయనములచే, పిత్రా = పితృలోకముచే, నభసా + చ = ఆకాశముచే, నీతః = తీసుకొనిపోబడినవాడు, చాంద్రీం పురీం = చంద్రలోకాన్ని, ఏతి = చేరుచున్నాడు–కాని, యత్ = ఏ పరమాత్మ నయితే, న + యాతి = చేరడంలేదో, ఓం నమః + శివాయ = ఓం నమశ్శివాయయని——

## తాత్పర్యం

ఇష్టాపూర్తాలను చేసిన గృహస్థులు శరీరాలను వదిలేసినప్పుడు వాళ్ళ జీవాత్మలను ముందు ధూమదేవత, తరువాత రాత్రిదేవత అటుపిమ్మట కృష్ణపక్షదేవత, ఆ వెనువెంట దక్షిణాయనదేవత ఒక్కొక్కరుగా తీసుకువెళు

తారు. అక్కడనుండి వాళ్ళు పితృలోకంనుండి విశాలమైన ఉన్నతమైన ఆకాశంలో ప్రయాణించి సోమలోకాన్ని చేరుకుంటారు పాపం! వారు తెలుసుకో లేని పరమశివునకు పునఃపునః నా ప్రణామాలు!

వ్యాఖ్య

వాసనల ఒత్తిడి కారణంగా అంతులేని స్వార్థకామనలవలన జీవుడు ఎన్నెన్ని యాతనలలో పడుతూ జననమరణాల విషచక్రంలో పడి తిరుగు లాడుతూంటాడో వర్ణింపబడుతోంది. ఈ జన్మలోనే ఆత్మ నందుకోలేక ఏ ప్రకారంగా తప్పిపోతాడో మన మనస్సుకు హత్తుకునేట్లు తెలియజెప్పడానికే దీనిని వివరిస్తున్నారు.

ఈశ్లోకంలో పేర్కొనబడిన సాధకుడు సామాన్యగృహస్థు. చిత్తశుద్ధితో నిత్యమూ పూజలు, ప్రార్థనలు చేస్తూ, తన హోదాకి తగినట్లు సమాజసేవ చేస్తూ ఉదారజీవనాన్ని గడిపేవాడే. అయితే అతడి ఇష్టాపూర్తాలు, అంటే సాధన, సేవ కూడా స్వార్థమైన కోరికలతో చేయడంవల్ల మరణసమయంలో అతడు ఖర్చుకాని వాసనల బరువును మోసుకొంటూ పోతాడు. ఈ బరువు పూర్తిగా ఖర్చు అయిపోయేంతవరకూ అతడికి ఆత్మసాక్షాత్కారం కాదు. అంత వరకు ఈ జనన మరణాలు తిరిగితిరిగి కలుగుతూనే వుంటాయి. చనిపోయాక అతడి ప్రయాణం చాలా దీర్ఘమైంది. సూర్యుడి దక్షిణాయనం మార్గమంతా పొగతో చీకటితో నిండివుంటుంది. ఈ విషయం గీతలోను ఉపనిషత్తులలోను కూడా వివరింపబడింది.

సోమలోకంలో, స్వర్గంలో పరిధులు—పరిమితులతో కూడిన సుఖభోగా లనుభవించి, పుణ్యం ఖర్చు అయిపోయాక అతిబాధాకరమైన తిరుగు ప్రయాణాన్నిప్రారంభించి ఈలోకాన్ని చేరుతాడు. తిరుగు ప్రయాణంలోని మజిలీలు రాబోయే శ్లోకంలో ఉన్నాయి.

శ్లో॥ ఖం వాయు ధూమాభ్ర వలాహకాశ్చ
ధారా చ వృష్టే ర్యవకాది రేతః।
ఏతైః పతత్యత్ర స యన్న యాత్యోం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 6

ప్రతి॥ ఖం = విశ్వాంతరాళం, వాయు = వాయువు, ధూమ = పొగ, అభ్ర = ఆకాశం, బలాహకాః + చ = మేఘములును, వృష్టేః = వర్షము యొక్క, ధారా + చ = ధారయును, యవక + ఆది = ధాన్యమాదిగా గల, రేతః = జీవపదార్థాలును–అను, ఏతైః = వీటిచే, సః = అతడు, అత్ర = ఇచ్చట, పతతి = పడిపోతున్నాడు, యత్ = దేనిని – ఏ పర బ్రహ్మను, నయాతి = పొందడో–, ఓం–తస్మై = ఆ, శివాయ = శివునికి నమః = నమస్కారము.

## తాత్పర్యం

ఆకాశం, వాయువు, పొగ, తెల్లమేఘం, నల్లమేఘం,వర్షం, వరిధాన్యంగా క్రమంగా మారి రేతస్సుగా తయారవుతాడు. ఇలా ఇక్కడికి పతనమైనవాడు ఏ పరమశివుని చేరలేడో ఆయనకు నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

ఆజీవుడు శుద్ధుడు, ఉదారుడు అయి, క్రౌర్యం, హింస భ్రాంతి లేని వాడైతే ఒక ఉత్తమమానవుడి రూపం ధరిస్తాడు. లేకపోతే దుర్మార్గురాలైన స్త్రీలాగా, దుష్టపురుషుడిగా, లేదా హీనమైన జంతురూపంలోనో పుట్టుతాడు. తరువాతశ్లోకం వివరాలని అందిస్తుంది.

శ్లో॥ కల్యాణకర్మా కమనీయయోనిం
కపూయకర్మా చ కపూయయోనిం।
ప్రపద్యతేఽజ్ఞో హహా యంన్నయాత్యోం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 7

ప్రతి॥ అజ్ఞః = అజ్ఞాని, కళ్యాణకర్మా = శుభకర్మలుచేయు వాడైతే, కమనీయ యోనిం = ఉత్తమజన్మను, కపూయకర్మా + చ = నీచకర్మను చేయు వాడైతే, కపూయయోనిం = నీచజన్మను, ప్రపద్యతే = పొందుచున్నాడు కాని, అహహ = అయ్యయ్యో! యం = ఏ పరమాత్మస్వరూపాన్ని, న + యాతి = పొందుటలేదు——

## తాత్పర్యం

ఆత్మనెరుగని అజ్ఞాని పుణ్యకర్మలు కలిగివుంటే బ్రహ్మక్షత్రియులుగా ఉదాత్తమైన రూపంలో తిరిగి జీవిస్తాడు. బాగా పాపకర్మలు కలిగివుంటే సమాజంలో అధమస్థాయిలో చండాలుడిగా జీవిస్తాడు. లేదా ఇంకా క్రిందికి దిగి జంతులోకంలో కుక్క, పంది, ఆవు మొదలైన జన్మలను పొందుతాడు. ఇలా తమలోనే వున్న పరమాత్మను తెలుసుకోలేని అజ్ఞానం కారణంగా గుణ వంతులు, ఉదారులు కూడా జననమరణాల విషవలయంలో చిక్కుకుపోవడం ఎంత దయనీయమైన విషయం! ఆ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

ఇక తరువాతి శ్లోకంలో గురుదేవులు పంచాగ్నివిద్యయొక్క ఉత్తమ సాధనను గాని, ఇష్టాపూర్తాల అల్పసాధననిగాని ఏదీ చేయని నికృష్టులు చనిపోయాక ఏమవుతారో వర్ణిస్తున్నారు.

శ్లో॥ విద్యాథవేష్టాది న సేవ్యతే యై
సై యాంతి దశాదిపదం తృతీయమ్।
పథచ్యుతా యత్ పదదూరదూరం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై 8

ప్రతి॥ యైః = ఎవరిచే, విద్యా + అథవా + ఇష్ట + ఆది = పంచాగ్నివిద్యయో లేక, ఇష్టాపూర్తి మొ॥ పూజో, న + సేవ్యతే = సేవింపబడదో, తే = వారు, దశాదిపదం = క్రిమికీటకాది జన్మఅగు, తృతీయం = మూడవ దానిని, యాంతి = పొందుచున్నారు, పథచ్యుతా = మోక్షమార్గము నుండి తొలగినవానికంటె, యత్ = ఏ పరబ్రహ్మ, పదదూరదూరం = సుదూరంగా ఉంటుందో——

## తాత్పర్యం

పంచాగ్ని విద్య సాధనగాని, ఇష్టాదులుగాని చేయని మూడోరకం వారు భూమిపైన జుగుప్సాకరమైన పురుగులు, దోమలు నల్లులు, కీటకాలుగా పుట్టుతారు. పథానికి అతిదూరమైనచోట పడి ఏపదాన్ని అందుకోలేరో ఆపరమశివునికి నా పునఃపునః ప్రణామాలు

## వ్యాఖ్య

మూడోరకానికి చెందిన మనుష్యులు వేరేవుంటారు. పంచాగ్నివిద్యను అనుసరించి ఉత్తమధ్యానాన్నిచేయరు, మామూలు పూజలు – ప్రార్థనలూ చేయరు, సమాజపరమైన కర్తవ్యాన్ని (పూర్త)కూడా నెరవేర్చరు, ఈనికృష్టులు ఉత్తమమైన స్వర్గంగా క్రమముక్తిని పొందటానికిగాని, కనీసం తాత్కాలిక స్థానాన్ని పొందటానికిగాని నోచుకోరు. పరమాత్మపదానికి ఎంతోదూరంగా జీవిస్తూ వేలాది సంవత్సరాలైనా అందులోంచి బైటపడే ఉపాయం లేక జీవిస్తారు క్రిమికీటకాలుగా పుట్టిన తదుపరి, ఆదుర్మార్గమైన జీవుళ్లకు ఉత్తమగతులు దాదాపు మృగ్యమే. క్షణంలో పుట్టి క్షణంలో మరణించే నీచమైన చంచలమైన జీవితం అది. ఒక జీవుడికి రాగల అతిదుర్భరక్లేశం అది.

ప్రపంచ బాహుళ్యంలో, మార్పులలో చిక్కుకుపోయిన అభాగ్యజీవుల శోచనీయస్థితిని కళ్లకు కట్టేట్లు శ్రీ గురుదేవులు వర్ణించారు. ఇకముందు దుఃఖాలతో కూడుకొన్న ప్రపంచబాహుళ్యంలోనుండి అద్భుతమైన మానవ యంత్రాన్ని పొందిన మానవుడు త్యాగజీవితాన్ని గడుపుతూ పరమాత్మను తెలుసుకొని ఎలా బయటపడగలుగుతాడో వివరిస్తున్నారు.

శ్లో॥ కష్టాగతి ర్జన్మజరాది దుఃఖో
త్ప్రుష్టా హి యం సంసరణస్య ధీరః।
తస్మా జ్జుగుప్సేత బుభుత్సమానో
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 9

ప్రతి॥ యం = ఏపరబ్రహ్మమును, బుభుత్సమానః = తెలిసికొనగోరువాడగు, ధీరః = పండితుడు. సంసరణస్య = సంసారముయొక్క, ఉత్ప్లుష్టా = దాటదగిన, జన్మజరాదిదుఃఖ = పుట్టుక,ముసలితనము మొ॥ బాధలతో కూడిన, కష్టాగతిః = కష్టమయిన మార్గమని, తస్మాత్ = అందుచేత, జుగుప్సేత = ఈసడించుకొనునో——

## తాత్పర్యం

దుఃఖాలతో మార్పులతో కూడిన ఈ సంసారంలో జీవితం అతికష్టమైనది తోసుకుంటూ వచ్చే వృద్ధాప్యం, నిస్సత్తువ, మరణాలతో దహించివేస్తుంది. మరణానంతరం వచ్చే దేవయానం (సూర్యమార్గం, ఉత్తరాయణం), పితృయానం (చంద్రమార్గం, దక్షిణాయనం) రెండూ జుగుప్సాకరమైనవే. వివేకి సాధకుడు ఏ పరమశివుని సాక్షాత్కారం కోరి అల్ప సాధనలను త్యజిస్తాడో, ఆయనకు నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

మూడోరకానికి చెందిన మనుష్యులగతి ఎంతో దుర్భరంగా బాధామయంగా ఉంటుంది. అయితే దేవయాన, పితృయానాలు అంతా ఆనందమయంగా ఉంటాయని చెప్పడానికి వీలులేదు. వాళ్లుకూడా భయాందోళనలతో, జనన మరణాల విచారాలతో కూడుకొని వుంటారు. స్వర్గంలోని చంద్రలోకాన్ని చేరాకకూడా ఆ జీవుడు తిరిగి మానవుడుగా పుట్టడానికి లక్షలాది సంవత్సరాలు పట్టుతుంది. చంద్రలోకంలోని సుఖాలను అనుభవిస్తున్నప్పుడు కూడా వాళ్లకు ఈ సుఖాలనుండి ఎప్పటికైనా పతనం వస్తుందని నిత్యమూ బెంగలు,భయాలు పడుతూనే వుంటారు. పతనమై క్రిందికి వచ్చాక కూడా వెంటనే మానవులుగా పుడతారని నమ్మకం లేదు. వర్షపునీటిద్వారా ఆ జీవుడు దిగి వచ్చినప్పుడు ఆ నీరు భూమిమీదకాక నదులలో పడవచ్చును. ఆనదులు అతణ్ణి సముద్రంలోకి తీసుకుపోతే మరల ఆవిరై మేఘంలోకి వెళ్లి మళ్లీ వర్షపునీటితో దిగిరావాలి. ఇలా జీవుళ్లు తిరిగి మానవులుగ్గా జనించే కాలం అనిశ్చితం. ఎంతో దీర్ఘకాలం పట్టవచ్చును. ఒకవేళ జీవుళ్ళు ధాన్యంగా మారినా వాళ్ళు మానవులకు ఆహారమై జీర్ణమైనప్పుడే పురుషుడిలో బీజంగా మారే అవకాశం వస్తుంది. ఇది కూడా అనిశ్చితమైనదే.

పోనీ దేవయానంలో ప్రయాణించి బ్రహ్మలోకానికి వెళ్ళి అక్కడ క్రమముక్తిని పొందవచ్చునుకదా అనుకుంటే బ్రహ్మదేవుడు పరమాత్మలో కలిసిపోడానికి ఎన్నికోట్ల సంవత్సరాలు పట్టుతుందో! అన్నికోట్ల సంవత్సరాలూ అక్కడ వేచివుండవలసిందే. అక్కడి కాలమానమైనా ఎంతోభయం కొల్పుతుంది.

అందువల్ల సరైన వివేచనంవల్ల తేలికగా ఈ సంసారంపట్ల పరమ వైముఖ్యాన్ని పెంచుకోవచ్చును. అరుదైన ఉత్తమమైన మానవజన్మను పొందాక ఈ జన్మలోనే ప్రతిఒక్కరూ లోనున్న ఈశ్వరుణ్ణి తెల్సుకోడమే తమ లక్ష్యంగా పెట్టుకోవాలి.

రాబోయే శ్లోకంలో వైశ్వానరబ్రహ్మము వివరించబడుతుంది.

శ్లో॥ ద్యుమూర్ధ ముఖ్యావయవై ర్విశిష్టం
వైశ్వానరం కృత్స్న ముపాసతే యం।
ఆత్మాన మాత్మ న్యమలాంతరంగా
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 10

ప్రతి॥ ద్యుమూర్ధ = స్వర్గమనెడిశిరస్సు, ముఖ్య + అవయవైః = ము॥ ప్రధానాంగాలతో, విశిష్టం = కూడిన, యం = ఏ, వైశ్వానర = అగ్నిదేవుని కృత్స్నం = సమగ్రంగా, ఆత్మానం = పరబ్రహ్మను, ఆత్మని = ఆత్మయందు, అమలాంతరంగా = పరిశుద్ధ మనస్కులు, ఉపాసతే = సేవించునో——

## తాత్పర్యం

ఆకాశం తన తలగా తక్కిన లోకాలన్నీ తన అవయవాలుగా కల సర్వవ్యాప్త విరాడ్రూప వైశ్వానరుణ్ణి తమ ఆత్మరూపిణి నిర్మల హృదయులు తమలోనే ధ్యానించుతారో ఆ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

**వ్యాఖ్య**

ఔపమన్యఋషి వైశ్వానరబ్రహ్మన్ని 'విశ్వనరుడనే పదంలోని పూర్తి సత్యాన్ని గ్రహించకుండానే ఉత్తమ ఊర్ధ్వలోకాలుగా ఉపాసించాడు. విశ్వనరుడంటే వ్యక్తరూపంలో సర్వత్రా వ్యాపించి బ్రహ్మాండాన్నంతా సజీవం చేసే వాడని, అవ్యక్తరూపంలో సర్వాతీతంగా వుండేవాడనీ అర్థం. అందుచేత ఔపమన్యఋషి ఉపాసన పరమాత్మయొక్క వ్యక్తరూపంలో ఒకభాగంపైనే జరిగింది. ఆకాశాన్ని నిర్దేశించే 'తలని' మాత్రమే ఉపాసించాడు. సత్యయజ్ఞ ఋషి ఈ సర్వవ్యాప్త పరమాత్మను సూర్యునిగా ఉపాసించాడు. అలాగే ఇంద్రద్యుమ్న, జనఋషి బుద్దాయనుడు, ఉద్దాలకుడు వైశ్వానరబ్రహ్మను వాయువుగా, ఆకాశంగా, జలంగా, భూమిగా ఉపాసించారు. వాళ్ళు అర్థంచేసుకున్న దానిని బట్టి వాళ్ళవాళ్ళ ఉపాసన జరిగింది. ఇవి అన్ని పరమాత్మలో వేరువేరు భాగాలే. వాళ్ళు సమగ్రమైన వైశ్వానర రూపాన్ని తెలుసుకోలేక పోయామని గ్రహించారు. దానిని తెలుసుకోడానికి అశ్వపతిమహారాజు వద్దకు వచ్చారు. ఆయన వాళ్లకు వైశ్వానరబ్రహ్మము యొక్క పరమసత్యాన్ని గురించి జ్ఞానబోధ చేశాడు ఛాందోగ్యోపనిషత్తులోని అయిదో అధ్యాయంలో ఈ సన్నివేశం సాకల్యంగా వివరింపబడింది. ఈశ్లోకంలో శ్రీ గురుదేవులు దీనినే ప్రస్తావించారు.

రాబోయే శ్లోకంలో అశ్వపతిమహారాజు ఆ ఋషులకి చేసినబోధ వున్నది.

శ్లో॥ ప్రాదేశమాత్రం ప్రభుమీశ్వరం యం
వైశ్వానరం హ్యాశ్వపతే రపాయన్।
విప్రాశ్చ రాజన్యపతే రజన్యం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 11

ప్రతి॥ రాజన్యపతేః = రాజర్షియైన, అశ్వపతిః = అశ్వపతివలన, అజన్యం = జన్మలేని, ప్రాదేశమాత్రం = అంగుష్ఠమాత్రమయిన, ప్రభుం = ప్రభువును, ఈశ్వరం = రక్షకుడును అయిన, వైశ్వానరం = అగ్నిదేవుని, విప్రాః + చ = అయిదుగురు బ్రహ్మర్షులు, అపాయన్ = సంపాదించిరో–

## తాత్పర్యం

ఆ బ్రాహ్మణఋషు లయిదుగురికి రాజర్షి అశ్వపతి మహనీయమైన వైశ్వానరబ్రహ్మము జనన–మరణ సంసారానికి అతీతమైన ఆత్మయే అని బోధించాడు. ఆత్మ అన్నిప్రాణులహృదయాలలో బొట్టనవ్రేలు–చూపుడువ్రేలు కలపగా ఏర్పడేంత (ప్రాదేశమాత్రం) చిన్నస్థలంలో ఇమిడివుంటూనే యావత్తు బ్రహ్మండానికి ప్రభువుగా, ఈశ్వరుడుగా శాసించి నియమిస్తుందనీ బోధించాడు. ఆ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

అశ్వపతి మహారాజు ఆ ఋషులకు తాము ఇన్నాళ్ళు ధ్యానించినది పరమాత్మలోని వేర్వేరు అంగాలని మాత్రమే స్పష్టపరిచాడు. వైశ్వానరుడు ప్రపంచంలోని సర్వప్రాణులలో వుంటాడు. అంటే ఊర్ధ్వలోకంనుండి అధోలోకం వరకూ ఉన్న అన్ని ప్రాణుల హృదయాంతరాళాలలోని సారం ఆయనే. ఆయన తల–ద్యులోకం, కళ్లు – సూర్యుడు, ఊపిరి – వాయువు, శరీరం–ఆకాశం, ఆయన ఉపస్థ–నీరు, పాదాలు–భూమి. ఈ వైశ్వానరుడు అధిదైవికమైన సర్వాతీత పరమాత్మగా, అధ్యాత్మికమైన సర్వభూతాంతరాత్మగా భావింపబడాలి.

అయిదో అధ్యాయం ఇక్కడితో ముగిసింది. ఇక్కడినుండి ఆరో అధ్యాయంలో ముఖ్యబోధ ప్రారంభమౌతుంది. ఆరుణి ఋషియొక్క కుమారుడు శ్వేతకేతువు గురుకులంలో వేదవేదాంగాలు అభ్యసించి ఇంటికి వచ్చాడు. తన అధ్యయనజ్ఞానంతో మిథ్యాగర్వం, అభిమానం పెంచుకొని ఉబ్బిపోతున్నాడు, కుమారుడి అవలక్షణాలు చూచి తండ్రి ఆరుణి అన్నాడు. "నాయనా గురుకులంలో నేర్చిన విద్యనుగురించి మిడిసిపడుతూ, అహంకారంతో నిండివున్నావు ఏవిద్యను తెలుసుకుంటే మిగిలిన అన్నివిద్యలూ తెలియబడతాయో ఆవిద్యను మీ గురువువద్ద నేర్చుకున్నావా?"

శ్వేతకేతువుకి ఆ విద్య తెలియదు. "అదేమి విద్య?" అని ప్రశ్నించాడు. ఇలా ఆరుణి తనకుమారుడిలో బ్రహ్మజిజ్ఞాసను రేకెత్తించాడు!

ఆరో అధ్యాయం ఈ ప్రకారం తండ్రీకుమారుల మధ్య జరిగిన నిగూఢ సంవాదం అరుణి ఋషి తన కుమారుడు శ్వేతకేతువుకి "తత్త్వమసి" అన్న మహావాక్యాన్ని తొమ్మిది పర్యాయాలు వేరువేరు ఉపమానాలద్వారా బోధిస్తాడు ఈ విషయాన్ని రాబోయేశ్లోకం వివరిస్తుంది

శ్లో॥ యేన శ్రుతేన శ్రుత మేవ సర్వం
యచ్చేన్మతం స్యా న్మత మేవ సర్వం।
యన్నిశ్చితం నిశ్చిత మేవసర్వం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 12

ప్రతి॥ యేన = ఏ, శ్రుతేన = శ్రవణముచే, సర్వం = అంతయు, శ్రుతం + ఏవ = వినబడినదియే (శ్రవణం), యత్ = ఏది, మతం = అనిపించినదో, సర్వం = అంతయు, మతం + ఏవ = తోచినదో (మననం), యత్ = ఏది నిశ్చితం = నిర్ణయింపబడ్డదో, సర్వం = అంతయు, నిశ్చితం + ఏవ = నిశ్చయింపబడినదిగనే(నిధిధ్యాసం)స్యాత్ = అయినదో, తస్మై = అట్టి-

## తాత్పర్యం

ఏది వినడంవల్ల వినవలసిన సర్వమూ వినడం జరుగుతుందో, దేనిని గురించి చింతించడంవల్ల ధ్యానింపబడవలసిన వన్నీ ధ్యానింపబడుతాయో దేనినిగురించి బుద్ధిలో నిర్ణయం చేయడంవల్ల నామరూపజగత్తులోని యావత్తు నిర్ణయింపబడుతుందో ఆ పరమశివునకు నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

పరమాత్మను గురించి శ్రవణ మనన నిధిధ్యాసలు - అంటే వినడం, మననం చేయడం, ధ్యానించడం జరిగితే ప్రపంచంలో ఉన్న అన్ని నామరూపాలను గురించి శ్రవణ మనన నిధిధ్యాసలు చేసినట్లే. పరమాత్మ చైతన్యంలో మేలుకొన్నాక నామరూపాలతో కూడిన మిథ్యాప్రపంచాలన్నీ మటుమాయం అవుతాయి అందువల్ల ఏకమైన అద్వితీయమైన ఆత్మను గురించి తప్ప వినవలసినది, యోచింపవలసింది, అనుభవించవలసింది అంటూ మరొకటి

లేదు పరమాత్మ నెరుగని అజ్ఞానంలో మిధ్యాభ్రాంతిగా పుట్టినవే బ్రహ్మలోకం నుండి అపోలోకంవరకూ ఉన్న అన్ని నామరూపాలూ! ఈ మిధ్యాభ్రాంతికి కారణం పరమాత్మనుగురించిన అజ్ఞానం ఒక్కసారి పరమాత్మనుగురించి అనుబవం సరిగా కలిగినప్పుడు మిధ్యాభ్రాంతి వెంటనే తొలగిపోతుంది కారణం అంతమొందినప్పుడు కార్యం నిలవలేదు ఈతర్కం తరువాతి శ్లోకంలో చెప్పబడుతోంది

శ్లో॥ వికార ఏతత్ ఖలు నామమాత్రమ్
జగద్యథా మృణ్మయ మాశ్రయో యః।
మృత్పిండవత్ సంతత సత్యమూర్తిః
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 13

ప్రతి॥ మృణ్మయం = మట్టిరూపమైన, ఏతత్ = ఈ, జగత్ = ప్రపంచము, నామమాత్రం + యథా = ఎట్లునామమాత్రమో—అట్లే, యః = ఏ, సంతతసత్యమూర్తిః = శాశ్వత సత్బ్రహ్మ, మృత్పిండవత్ = మట్టిముద్ద వలె, వికారః = రూపముమారిన, ఆశ్రయః = మూలాధారమో——

## తాత్పర్యం

ఈ నామమాత్రమైన ప్రపంచం ఎప్పుడూ మారుతూంటుంది భ్రాంతి మూలక మైనది అది తన కారణమైన పరమాత్మ కన్న బిన్నమైనది కాదు. రకరకాల ఆకారాలు, పరిమాణాలు ఉన్న మట్టికుండ లన్నింటికి మట్టి ఒక్కటే కారణము, సత్యమూ వివిదాలుగా ఉండే కుండలలో వేటికి మట్టికి బిన్నంగా సత్తాలేదు కారణమైన మట్టిసత్తాకు బిన్నంగా కార్యమైన కుండలకు వేరేసత్తా ఎలా లేదో అలాగే ప్రపంచంలోని నామరూపాలు వేటికి సత్యాదారమైన పరమాత్మకన్న అన్యమైన సత్తా వేరుగా లేదు. ప్రపంచబాహుళ్యం ఎప్పుడూ మారుతూ వుంటుంది. అధిష్ఠానమైన బ్రహ్మము మార్పులకు అతీతమై ప్రకాశమానమైన సత్యంగా భాసిస్తుంది. ఆ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

ఉద్దాలక ఋషి తన కుమారుడైన శ్వేతకేతువుకు బోధించిన తొమ్మిది ప్రసిద్ధమైన ఉపమానాలలో ఇది మొదటిది ప్రపంచానికి పరబ్రహ్మానికి మధ్యవున్న సంబంధం దీనిద్వారా వివరింపబడింది. కుండలకు ఉపాదాన కారణం మట్టి, అందువల్ల ఏకుండా మట్టికన్న భిన్నంకాదు. అలాగే ప్రపంచ నామరూపాలకు ఉపాదానకారణం పరబ్రహ్మము. అందువల్ల అవి పర బ్రహ్మముకన్న భిన్నంకావు.కార్యాలకు కారణంకన్న భిన్నమైన సత్తా వుండదు.

మరో ఉపమానంద్వారా ఈవిషయమే తరువాతి శ్లోకంలో పునరుద్ఘాటింప బడుతోంది.

శ్లో॥ వికార ఏతత్ ఖలు నామమాత్రం
జగద్యథా హైమ మథాశ్రయో యః।
హేమోపమ స్సంతత సత్యమూర్తిః
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 14

ప్రతి॥ హైమం = స్వర్ణమయమయిన, ఏతత్ = ఈ, జగత్ = జగత్తు, యథా = ఎట్లు, నామమాత్రం = నామమాత్రమో అట్లే, యః = ఏ, హేమ + ఉపమః = బంగారుతో పోల్చదగిన, సంతతసత్యమూర్తిః = శాశ్వత పరబ్రహ్మము, వికారః = రూపాంతరమయిన, ఆశ్రయః + ఖలు = మూలాధారముకదా!

## తాత్పర్యం

గాజులు, దుద్దులువంటి బంగారు ఆభరణాలన్నీ ఏ ఆకారంలో వున్నా వాటి అసలుసారం బంగారమే. అలాగే ప్రపంచబాహుళ్యంలోని ఏ నామరూపాలైనా అవి మార్పులేని అధిష్ఠానమైన పరబ్రహ్మమే. అనిత్యసత్యమైన పరమ శివునకు నా పునఃపునః ప్రణామాలు!.

## వ్యాఖ్య

ఉపనిషత్తులోని రెండో ఉపమానం పైశ్లోకంలో ఇవ్వబడింది. మూడో ఉపమానం తరువాత శ్లోకంలో పేర్కొనబడుతోంది.

శ్లో॥ వికార ఏతత్ ఖలు నామమాత్రమ్
జగ ద్యథా పైండ మథాశ్రయో యః।
పిండోపమ స్సంతత సత్యమూర్తిః
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 15

ప్రతి॥ పైండం = ఇనుపముద్దవంటి, ఏతత్ = ఈ, జగత్ = జగము, నామ మాత్రం + హి = నామమాత్రమో, అథ = అట్లే, యః = ఏ, పిండ + ఉపమః = ఇనుపముద్దవంటి, సంతతసత్యమూర్తిః = శాశ్వత పరబ్రహ్మ, వికారః = రూపాంతరితమైన, ఆశ్రయః + ఖలు = మూలాధారముకదా—

## తాత్పర్యం

శుద్ధమైన ఇనుము బాకు, కత్తెర, ఖడ్గం, కత్తి మొదలైన పరికరాలుగా మారినప్పుడు ఆ నామరూపాలన్నీ ఇనుమే. వాటి నిజస్వభావం ఎప్పుడూ ఇనుముగానే ఉంటుంది అలాగే భ్రాంతిమూలమై నిత్యమూ మారుతూవుండే ప్రపంచబాహుళ్యంలోని నామరూపాలు నిజంగా ఉన్నట్లు కనబడుతాయి. కాని వాటి నిజస్వభావం అధిష్ఠానం ఆధారం అయిన నిత్యసత్య పరమాత్మ తప్ప వేరుకాదు. ఆ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

శ్లో॥ అగ్రే సదాసీ దసతః కథం స
జ్జాయేత యత్సర్వ మిదం ససర్జ।
త్రివృత్కృతై రగ్నిపురోగమై రోం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 16

ప్రతి॥ అగ్రే = మొదట, సత్ = సత్యము, ఆసీత్ = ఉండెను కాన, అసతః = అసత్తునుండి, సత్ = సత్యము, కథం = ఎట్లు, జాయేత = పుట్టును?

యత్ + ఇదంసర్వం = ఏ యీసమస్తము, అగ్నిపురోగమైః = అగ్ని, నీరు, భూమి-అను, త్రివృత్ + కృతైః = మూడుమహాభూతాలచే, ససర్జ = సృష్టింపబడెనో——

## తాత్పర్యం

సృష్టికి పూర్వం సత్తు ఉన్నది. లేకుంటే అసత్తునుండి సత్తైన ఈయావత్తు ప్రపంచం ఎలా వస్తుంది? అగ్ని వాయు భూమి రూపాలుగా మూడుగా ప్రకటమయిన ఆ పరమాత్మ పరమశివునకు నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

కుండ తయారుకావడానికి పూర్వం మట్టి సత్తా మాత్రమే ఉన్నది. అలాగే జగత్తు వ్యక్తం కావడానికి పూర్వం కేవలం పరబ్రహ్మ తన శుద్ధసత్తా రూపంలో ఉన్నది. జాగ్రత్స్వప్నాలలో వ్యక్తమయ్యే నామరూపాలు సుషుప్తిలో అనుభవానికి రావు. సుషుప్తిలో అనుభవమయ్యేది ఆత్మయొక్క శుద్ధసత్తా రూపమే నామరూపాలు లేక ఘనీభవించిన శుద్ధచైతన్యమే! అందులో స్వాప్నికుడు, మేలుకొన్నవాడు స్వప్నజాగ్రత్త ప్రపంచాలను సృజించుకోడానికి కావలసిన సరుకు అంతా ఉన్నది. పరబ్రహ్మమంటే ఈ విశాలమైన బ్రహ్మాండంగా విచ్చుకోడానికి సిద్ధంగాఉన్న పరమశక్తివంతమైన శుద్ధసద్రూపం అదే పరమపవిత్రమైన ఓంకారం! ఆ పరమశివునకు నా ప్రణామాలు.

ఇక్కడ శ్రీ గురుదేవులు ముందు వైనాశికులనే శూన్యవాదులు అంటే నాస్తికవాదాలను ఎదుర్కొంటున్నారు. బౌద్ధులలో ఇదొక శాఖ. నాస్తికుల వాదనప్రకారం ఈ నామరూపజగత్తు శూన్యంనుండి ఉద్భవించింది. అసత్తులో నుండి సత్తు ఎలా వస్తుంది? (అసతః సత్ కథం జాయేత?) అని గురుదేవులు ప్రశ్నిస్తున్నారు. ఏమీలేని దాంట్లోంచి ఏదైనా ఎలా వస్తుంది? వంధ్యాస్త్రీ శిశువును ప్రసవించగలదా? నాస్తికుల వాదాలకు వేదాలలో ఎక్కడా ఆధారం లేదు. శూన్యత్వ మనేది చైతన్యమంటూ ఉన్నప్పుడేగా తెలిసేది? అదే శూన్యాన్ని తెలుపుతుంది. అందుచేత ఆ చిద్భావం లేదా చైతన్యం పరబ్రహ్మం యొక్క సద్రూపం.

సృష్టికి పూర్వం పరబ్రహ్మం కేవల శుద్ధ సద్భావంగా ఉంటాడు. సృష్టికి కావలసిన శక్తి వ్యక్త మవడానికి సిద్ధంగా ఉన్నప్పుడు పరమాత్మలో ఒకబృహత్కామన ఉదయిస్తుంది— "ఏకంగా ఉన్న నేను అనేకం ఎందుకు కాగూడదు? ఈ బృహత్కామననుండి మహాభూతమైన అగ్ని – తేజస్స్వరూపం ఉదయించింది. ఆ తరువాత జలమహాభూతం, దానివెంబడే పృథ్విమహాభూతం జనించాయి. ఈ మూడు మహాభూతాలు పరస్పర కలయికలవల్ల స్థూలమైన విశాలబ్రహ్మాండం ఎంతో శక్తిమంతంగా ఏర్పడింది. ఇలా బ్రహ్మాండాన్ని సృజించి పరమాత్మ అందులో జీవరూపంలో ప్రవేశించాడు. ఈ జీవభావం ఆయనలో ప్రతిఫలించే ఆయన ప్రతిబింబమే! దాని వల్లనే బ్రహ్మాండం చేతనత్వాన్ని పొంది సజీవమై శక్తివంతమై పనిచేయసాగింది. ఈ విషయాలన్నీ మున్ముందు వివరించబడుతాయి.

శ్లో॥ ప్రాణాది సమ్యగ్ ధ్రియతే చ యేన
జీవాత్మనా విశ్వ మనుప్రవిశ్య।
వ్యాకుర్వతా నామ చ రూపమస్మై
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 17

ప్రతి॥ యేన = ఏ, జీవాత్మనా = పరమాత్మచే, విశ్వం = సృష్టిసమస్తమును, అనుప్రవిశ్య = ప్రవేశించి, ప్రాణ + ఆది = ప్రాణము మొ॥ వాటిని, సమ్యక్ = బాగుగా, ధ్రియతే = ధరింపబడుచున్నదో, నామ = పేరును, రూపం = రూపమును, వ్యాకుర్వతా = విశ్లేషించుచు, అస్మై = ఈ—

## తాత్పర్యం

సమిష్టి విశ్వరూప జగత్తులోకి ప్రవేశించి పరబ్రహ్మము పరిమితరూపుడై ప్రాణము మొదలైన సృష్టిపరికరాలద్వారా స్వతంత్రంగా కార్యకారణ సంబంధంతో వర్తించే అనంత నామరూపాలను సృజించి ప్రకాశింపజేశాడు. **ఆ పరమాత్మ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!**

## వ్యాఖ్య

అనంతమై ఆదిమధ్యాంత రహితుడైన పరమానంద స్వరూప పర బ్రహ్మము స్వేచ్ఛగా పరిమిత నామరూపజగత్తుగా మారి అంతులేని దుఃఖాలను అనుభవిస్తున్నాడని చెబితే అది విశ్వసనీయం గాని, తార్కికంగాని కాదు. ఈ విషయం మనం గుర్తించకుండా ఉండలేము అందుచేత సమిష్టి ప్రపంచంతో తాదాత్మ్యం పొందే పరమాత్మ ప్రతిబింబమే వ్యష్టిలో పరిమిత జీవాత్మ అవుతుందని గ్రహించడం తార్కికంగా హేతుబద్ధంగా ఉంటుంది.

శ్లో॥ బుద్ధ్యాదిమాత్రాన్వయజో హి యద్వ
దాదర్శబింబః ప్రతిభాతి జీవః।
యా దేవతా న చ్యవతే మహిమ్నో
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 18

ప్రతి॥ యత్ = ఏ, బుద్ధ్యాది = బుద్ధి మొ॥, మాత్ర + అన్వయజః = అల్ప మాత్రల సంయోగముగల, జీవః = జీవము, ఆదర్శబింబః + వత్ = అద్దంలోని ప్రతిబింబంవలె, ప్రతిభాతి = ప్రకాశిస్తున్నాడు, యాదేవతా = ఏదేవుడు, మహిమ్నః = మహిమనుండి, న + చ్యవతే = జారిపడడో-

## తాత్పర్యం

అద్దంలోని ప్రతిబింబంలాగే బుద్ధిమొదలైన పరికరాలలో ప్రతిఫలించే శుద్ధ పరమాత్మతత్త్వమె పరిమితంగా ఆద్యంతాలలో కూడినదిగా కనబడే జీవభావం. ఇలా కనిపించినా ఏదేవుని మహిమ ఇసుమంతైనా తగ్గదో ఆ పరమ శివునికి నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

జీవాత్మ పరిమితులున్నట్లు కనబడినా నిజానికి ఈ పరిమితులు. బుద్ధి, మనస్సు, ఇంద్రియాల పరిమితులు-జీవభావానివి కాదు. అందువలన ఇంత

బ్రహ్మాండము ఇంతమంది జీవుళ్ళను సృష్టించినా జీవుళ్ళ పరిమితులు, గుణాలు పరమాత్మను ప్రభావితం చెయ్యలేవు

ఆకాశంలో మిరుమిట్లుగొలుపుతూ వెలిగిపోయే సూర్యుడు భూమిమీద వెర్వేరు స్థానాలలో ప్రతిఫలించి విరిగిపోయి, తరిగిపోయి కనిపించే ప్రతిబింబాల వల్ల ప్రభావితుడు కాడు

ఒక మనుష్యుని నీడో ప్రతిబింబమో, ప్రతిబింబించే వస్తువుదోషంవల్ల మారిపోయి కనిపించినా, అసలు మనుష్యుణ్ణి ఏమీ చేయలేదు అలాగే బ్రహ్మ ప్రతిబింబమైన జీవుడి సుఖదుఃఖాలు బుద్ధితో, మనస్సుతో తాదాత్మ్యం చెందడంవల్ల వస్తాయి అవి పరమాత్మను ఎప్పుడూ తాకవు పరమాత్మను ఎరగని అవిద్యకారణంగానె జీవుడు బుద్ధితో, మనస్సుతో తాదాత్మ్యం పొందుతాడు

ఇలా అగ్ని, నీరు, భూమి, ఈ మూటిని సృజించాక వాటిని వేరువేరు నిష్పత్తులలో కలపడంవల్ల నామరూప జగత్తు పరబ్రహ్మంవల్ల తయారు చేయబడింది ప్రపంచబాహుళ్యంలోని అన్నిరూపాలు ఈమూటి కలయిక తప్ప వేరుకాదు ఇది ఎలా సాధ్యమయ్యిందో రాబోయే నాలుగుశ్లోకాలు వివరిస్తాయి·

శ్లో॥ తేజోఽంబుపృథ్వీ మయ మగ్నితత్త్వం
తేభ్యో న భిన్నం న చ వస్తుతస్సత్।
తథా జగద్యస్య వికారమాత్రం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 19

ప్రతి॥ అగ్నితత్త్వం = అగ్నితత్త్వం, తేజః + అంబు + పృథ్వీమయం = త్రేతాగ్నులు, నీరు, భూమిస్వరూపంగా ఉన్నదో, తేభ్యః = ఈమూటి నుండి, నభిన్నం = బిన్నంకాదో, వస్తుతః = నిజానికి, న + చ + సత్ = వాస్తవమునుకాదో, తథా = అట్లు, జగత్ = ఈవిశ్వం, యస్య = ఏ పరమాత్మయొక్క, వికారమాత్రం = రూపాంతరం మాత్రమో

## తాత్పర్యం

స్థూలమైన అగ్ని మహాభూతం సూక్ష్మతత్త్వమైన తేజస్సు, జలం, పృథ్వి —ఈ మూటితో తయారయింది అందుచేత అవి ఈ మూటికన్న భిన్నమైంది కాదు. అంటే అగ్ని మహాభూత మనేది వేరుగా లేనే లేదు. దానిని విశ్లేషించి నప్పుడు అందులోని ఎరుపు అగ్నితత్త్వానిది, తెలుపు జలతత్త్వానిది, నలుపు పృథ్వీతత్త్వానిది. అలాగే జగత్తు కేవలం ఎవరి వికారమాత్రమో ఆపరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

పరబ్రహ్మంచేత సృజింపబడ్డ అగ్ని, జల, పృథ్వి—తత్త్వాల కలయికల వల్లనే నామరూప ప్రపంచం ఏర్పడింది. అందుచేత అనేకంతో కూడిన ప్రపంచం ఒక తయారీవస్తువు. అంటే కార్యం. దానికి మూలకారణం పరబ్రహ్మము. ఏకార్యమూ కారణంకన్న భిన్నంకాదు. అది స్వంతసత్తాని కలిగివుండదు కాబట్టి ప్రపంచంయొక్క మూలసత్తా పరబ్రహ్మమే. ప్రపంచం యొక్క సత్తా కేవలం నామమాత్రమే. పైపైన కనిపించేదే.

తరువాతి శ్లోకంలో సూర్యుని ఉపమానం ఇవ్వబడుతోంది.

శ్లో॥ తేజోంఽబుపృథ్వీమయ ఏష సూర్య
స్తేభ్యో న భిన్నోఽస్తి వివేకకాలే।
తథా జగన్నాస్తి హి యద్వ్యతోఽస్మై
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 20

ప్రతి॥ ఏషః సూర్యః = ఈసూర్యభగవానుడు, తేజః + అంబు + పృథ్వీమయః ప్రతేజాగ్నులు, నీరు, భూమి—రూపాత్మకమైనవాడు, కాని, తేభ్యః = ఈ మూటికంటె, వివేకకాలే = వివేచనచేసినపుడు, న + భిన్నః + అస్తి = వేరుగాకనబడడు, తథా = అట్లే, జగత్ = జగము, హి యద్వ్యతః = భిన్నంగా, నాస్తి = లేదు, అస్మై = ఇట్టి, తస్మై = ఆ——

## తాత్పర్యం

ఈసూర్యుడు తేజస్సు, జల, పృథ్వీ–తత్త్వాల కలయికే. వివేచనం చేసినప్పుడు ఆ మూటికన్న భిన్నుడు కాదు. అలాగే ఈ జగత్తు ఎవరికన్న లేశమైనా భిన్నం కాదో ఆ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

సూర్యు డాకాశంలో ఉన్నట్లుగా చూచేవాళ్ళకు కనబడుతుంది. అయినా సూర్యుడిసత్తా కేవలం పైకి తోచేదే. అగ్నిజలపృథ్వీ తత్త్వాలు తప్ప ఆయనకి వేరే సత్తా లేదు. అలాగే ఈ నామరూప జగత్తుకూడ ఆ మూడుభూతాల కలయికే. ఆ మూడుతత్త్వాలకి మూలమైన పరబ్రహ్మమే ఈ జగత్తుయొక్క అసలు సత్తా. జగత్తుకు వేరే సత్తా లేదు.

మూడోదిగా చంద్రుని ఉపమానం తరువాత ఇవ్వబడుతోంది.

శ్లో॥ తేజోఽంబుపృథ్వీమయ ఏష చంద్రః
తేషాంహి రక్తార్జునకృష్ణరూపైః।
రూపే భవత్యేవ మిదం యదీయం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 21

ప్రతి॥ ఏషః + చంద్రః = ఈ చంద్రుడు, తేజః + అంబు + పృథ్వీమయః = త్రేతాగ్నులు, నీరు, భూమిఅను త్రిపుటిస్వరూపుడు, తేషాం + హి = ఈ మూడింటియొక్క, రక్త + అర్జున + కృష్ణరూపైః = ఎరుపు, తెలుపు, నలుపు, రూపాలతో, రూపేభవతి = రూపంకలవాడగుచున్నాడు, ఏవం = ఇట్లే, ఇదం — ఈ, యదీయం = తన పరమాత్మ స్వరూపం——

## తాత్పర్యం

చంద్రుడు తేజస్సు, జల, పృథ్వీతత్త్వాలతో నిండినవాడు. వాటియొక్క ఎరుపు తెలుపు నలుపుల రూపాల సమ్మేళనమే అతడి రూపం. అలాగే ఇది (ఈప్రపంచం) ఎవరిదో ఆ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

చంద్రుడుకూడా ప్రపంచంలోని మిగతా వాటిలాగే అగ్ని, జల, పృథివీ —తత్త్వాల కలయికవలన జనించాడు. అందుచేత చంద్రుని ఆకారంలో కనబడేది ఆ మూడుతత్త్వాల రంగులే. వాటికి భిన్నంగా చంద్రునిరూపంలో ఉన్నది యావత్తు మిథ్య మాత్రమే.

అలాగే ఈ దృశ్యప్రపంచం యావత్తు ఆ పరబ్రహ్మ మూలకారణంగా కలిగినదే. బ్రహ్మముకన్న భిన్నం కాదు.

నాలుగో ఉపమానం విద్యుత్తు తరువాతిశ్లోకంలో పేర్కొనబడుతోంది.

శ్లో॥ తేజోఽంబుపృథ్వీవికృతి శ్చ విద్యుత్<br>
విచారితేఽపైతి తటిత్ప్రతీతిః।<br>
తథా యదగ్రే న జగద్విభాత్యోం<br>
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 22

ప్రతి॥ విద్యుత్ = కాంతి (మెఱుపు), తేజః + అంబు + పృథ్వీ + వికృతిః + చ = త్రేతాగ్నులు, నీరు, భూమి – ల వికారము, విచారితే = పరిశీలించగా, తటిత్ + ప్రతీతిః + అపైతి = మెఱుపుతనమును పొందుతుంది, తథా = అట్లు, జగత్ = జగత్తు. యత్ + అగ్రే = ఏ పరమాత్మకు పూర్వం, న + విభాతి = భాసించదో– "ఓం", తస్మై = అట్టి———

## తాత్పర్యం

విద్యుత్–తేజస్సు, జల, పృథ్వీ–తత్త్వాల వికృతిరూపమే. విచారణ చేయగానే విద్యుత్‌రూపం తొలగిపోతుంది. అలాగే ఎవరికి పూర్వం జగత్తు ప్రకాశించదో ఆ పరమాత్మ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

## వ్యాఖ్య

అగ్ని, సూర్య, చంద్ర, విద్యుత్తుల ఉపమానాల దృష్ట్యా జగత్తుయొక్క నిజతత్త్వాన్ని గురించి లోతుగా మననం చేసినప్పుడు ఈ ప్రపంచానికి పైమూడు సూక్ష్మతత్త్వాల (తేజస్సు, జల, పృథ్వితత్త్వాలు) కన్న వేరే సత్తా లేదు—అని గోచరిస్తుంది. ఆ మూడు సూక్ష్మతత్త్వాలు ప్రపంచరూపంలో ఏర్పడడానికి కారణం పరబ్రహ్మసంకల్పం. అందువల్ల సృష్టికిపూర్వం ఉన్నది పరమాత్మ యొక్క స్వరూపం మాత్రమే. వీసమైనా విశ్వరూపం లేకుండానే త్రికాలాల లోను మారకుండా ఉండేది పరమాత్మస్వరూపం ఒక్కటే.

పైశ్లోకాలద్వారా మూడుప్రాథమిక తత్త్వాలైన అగ్ని జలభూముల సమ్మేళనంవల్ల కలిగే కార్యరూపాలను తెలియజెప్పారు. ఈ మూడుతత్త్వాలు ప్రాణుల శరీరాలలో ఏఏరూపాలలో ఉంటాయో ఇకముందు చెప్పబడుతుంది.

శ్లో॥ అన్నస్య ధాతు ర్జలతేజసోశ్చ
హృత్ప్రాణ వాచోఽణుతమోఽభిమానీ।
య స్తత్ర క ర్తృత్వపదే పతత్యోం
నమశ్శివాయాస్తు నమోఽస్తు తస్మై॥ 23

ప్రతి॥ ధాతుజలతేజసోః + చ = భూమి, నీరు, అగ్ని—అనువాటినుండిపుట్టిన, అన్నస్య = అన్నమునకు, క్రమంగా, హృత్ + ప్రాణ + వాచః = మనస్సు, ప్రాణము, వాక్కు—అనునవి పుట్టుచున్నవి, అణుతమః = పరమాణుస్వరూపమయిన, అభిమానీ = అధిష్ఠాత అయిన, యః = ఏ పరమాత్మ, తత్ర = ఆపైసృష్టిక్రమంలో, కర్తృత్వపదే = కారణ స్థానమున, పతతి = ఉన్నాడో, 'ఓం'—తస్మై——

## తాత్పర్యం

భూ, జల, తేజస్సులవల్ల ఏర్పడే అన్నంయొక్క సూక్ష్మాంశము మనస్సు, ప్రాణము వాక్కులుగా మారుతాయి. వాటితో తాదాత్మ్యం పొంది కర్తృత్వ భావాన్ని సంపాదించుకొని పతనమయ్యే శుద్ధాత్మ పరమశివునికి నా పునఃపునః ప్రణామాలు!

వ్యాఖ్య

భూ, జల, తేజస్సుల తత్త్వాలు మూడురూపాలైన అన్నంగా ప్రాణులలో ఏప్రకారంగా రూపొందుతుందో శ్రీ గురుదేవులు విశదీకరిస్తున్నారు. మానవుడు తినే ఆహారంలో మూడురకాలుంటాయి. స్థూలం, సూక్ష్మం, బాగాసూక్ష్మంగాను ఉంటాయి. పృథ్వీతత్త్వంలోని స్థూలభాగం మనుష్యుడు విసర్జించే మలంగాను కొంతసూక్ష్మమైన భాగం మాంసంగాను, ఎక్కువ సూక్ష్మమైనది మనస్సుగాను మారుతుంది.

జలతత్త్వంలోని స్థూల భాగం మూత్రంగాను, కొంతసూక్ష్మమైనది నెత్తురుగాను, బాగాసూక్ష్మమైనది ప్రాణవాయువుగాను మారుతుంది. అగ్ని తత్త్వంలోని స్థూలభాగం ఎముకలక్రింద, కొంతసూక్ష్మభాగం మజ్జాక్రింద, బాగాసూక్ష్మమైనది వాక్కుక్రింద మారుతుంది. మనం నెయ్యి, నూనె స్వీకరించి నప్పుడు వాటిలో ఎక్కువగా అగ్నితత్త్వం ఉంటుంది. కాబట్టి వాక్కు దాని తాలూకు అవయవాలు దృఢపడుతాయి. నీటిని త్రాగకపోతే ప్రాణంపోతుంది. అన్నం తినకపోతే మనస్సు బలహీనమౌతుంది. అందుచేత మనస్సు — అన్నమయం, ప్రాణం—జలమయం, వాక్కు—తేజోమయం.

స్థూలాహారంచేత పోషింపబడే మనస్సును గురించి శ్రీ గురుదేవులు తరువాతి శ్లోకంలో ఇంకా వివరిస్తున్నారు.

శ్లో॥ నాశ్నాతి పంచదశ చేత్ పురుషో దినాని
ఛాయాన్నషోడశకలః పతితం హి కించిత్।
తస్మాన్మనోఽన్నమయ మంబుపిబేన్న బాధః
ప్రాణస్య తత్ర విహరన్ గతి రస్తుశంభుః॥ 24

ప్రతి॥ షోడశకళః = షోడశకళలుగల, పురుషః = పురుషుడయిన సాధకుడు, పంచదశదినాని = 15 రోజులు, న + అశ్నాతిచేత్ = ఉపవాసమున్నచో, కించిత్ + పతితం హి = ఏకొంచెముచదివినను, న ఛాయాత్ = ప్రకాశించడు, తస్మాత్ = అందువలన, అన్నమయం = అన్నమయ

మయిన, మనః = మనస్సు, అంబు = నీటిని, పిబేత్ = త్రాగినచో, ప్రాణస్య = ప్రాణానికి, న + బాధః = బాధలేదు, తత్ర = అచ్చట, విహరన్ = విహరించు, శంభుః = శివుడు,గతిః + అస్తు = దిక్కగుగాక!

## తాత్పర్యం

ఎవరైన పదిహేను రోజులు వరుసగా అన్నం తినకపోతే పదహారో కళగా మాత్రం మిగిలిన మనస్సులో చదివిన దేనీ ప్రకాశించదు. అందుచేత మనస్సు అన్నమయం. నీరు త్రాగుతూంటే ప్రాణం పోదు. ప్రాణరూపంతో అందులో విహరించే శంభుడు నాకు గతియగును గాక!

## వ్యాఖ్య

ఇక్కడ "షోడశకలః" అంటే పదారుకళల చంద్రుడిగ శోభించే మనస్సు. అన్నంతో పదిహేనుకళలుగా ఆలోచనలను పొందే మనస్సు పదహారోది. ఒక్కొక్క కళ ఒక్కొక్క దినం తినే ఆహారం. మానవుడు చదివిన విద్యను జ్ఞాపకం ఉంచుకున్నప్పుడే మనస్సుకు జ్ఞానం కలుగుతుంది ఆహారం స్వీకరించనప్పుడు ఈజ్ఞాపకం నశించిపోయి ఏవిద్యా స్ఫురించదు.

"అన్నం" అనే పదంక్రిందికి మానవుడు తినే అన్నిరకాల ఆహారాలు వస్తాయి.

ప్రాణాన్ని నిలుపుకోడానికి నీళ్ళు త్రాగడం అవసరం. మనం తినే ఆహారం మన ఆలోచనలను ఎలా అదుపుచేస్తుందో చెప్పే ఈశ్లోకాలభావం భగవద్గీత 17వ అధ్యాయంలో ఇంకా వివరంగా పేర్కొనబడివున్నది.

ఆత్మయొక్క ప్రతిబింబమైన జీవుడు మనోబుద్ధులతో తాదాత్మ్యం పొంది, వాటిని జాగ్రత్స్వప్నావస్థలలో వినియోగించుకొంటాడు. గాఢనిద్రలో వాటిని తనలో మూసిపెట్టుకొని తనలో తాను నిలిచిపోతుంది. ఈ విషయాన్ని ఈ స్తబకంలోని చివరిశ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ పాయా ద్యుపాధ్యుపహితః పురుషోను వేలం
ధ్యాయన్నివ వ్యవహరన్నివ దృశ్యమానః।
యస్యాం వివిత్త్యుపశమే పరదేవతాయా
మానందధామ్ని వినిమజ్జతి మాం స శంభుః॥ 25

ప్రతి॥ ఉపాధి = భిన్నశరీరాకారాలను, ఉపహితః = పొందిన, పురుషః = పరమ పురుషుడు, ధ్యాయన్ + ఇవ = ధ్యానించువానివలె, వ్యవహరన్ + ఇవ = ప్రవర్తించువానివలె, దృశ్యమానః = కనిపించుచున్నవాడై, పాయాత్ = రక్షించుగాక, యస్యాం = ఏ, పరదేవతాయాం = పరాత్పరుని యందు, వివిత్తి + ఉపశమే = పైఉపాధి వైవిధ్యము నశించినపుడే, సః = ఆ, శంభుః = శివుడు, మాం = నన్ను, ఆనందధామ్ని = ఆనంద సాగరంలో, వినిమజ్జతి = ముంచివేయును.

## తాత్పర్యం

నిత్యమూ ఉపాధులతో కూడివున్న పురుషుడు యోచిస్తున్నట్లు, వ్యవహరిస్తున్నట్లు కనబడుతాడు. ఏవి విశ్రమించినప్పుడు విడివడి పరదేవత అయిన ఆనందధామంలో మునిగిపోతాడో ఆ శంభుడు నన్ను రక్షించును గాక!

## వ్యాఖ్య

గురుదేవులు ఇక్కడ దేహంలో ఉన్న ఆత్మను పెద్ద పట్టణంలోకి ప్రవేశించిన పురుషునితో పోల్చుతున్నారు. ఆత్మ శరీరమనోబుద్ధులతో తాదాత్మ్యం పొంది దర్శించే–భావించే–విచారించే జీవుడిగా మారి విషయ–ఉద్రేక–తలపులుగా పొందే అనుభవాలు పురుషుడు పట్టణంలో పొందే అనుభవాలవంటివని శ్రీ గురుదేవులు పోల్చుతున్నారు. శరీరమనోబుద్ధులతో తాదాత్మ్యం పొందినప్పుడు జాగ్రదవస్థానుభవాలు, మనోబుద్ధులతో తాదాత్మ్యం పొందినప్పుడు స్వప్నానుభవాలు వస్తాయి. గాఢనిద్రలో ఈ మూడు పరికరాలతో తాదాత్మ్యాన్ని వదిలేసి జీవుడు తన శుద్ధానంద స్వరూపాన్ని చేరుకుంటాడు. 'సుషుప్తి'లో తన ఆత్మవద్దకు తిరిగివస్తాడు. అశుద్ధాత్మే సౌమ్య కాశీశుడు.

ఇంతవరకు ఉపనిషత్తులో 5వ అధ్యాయము, 6వ అధ్యాయంలో 1–7 ఖండాలు ఉదహరించబడినవి. ఆరో అధ్యాయంలో 'తత్త్వమసి' మహా వాక్యం యొక్క ప్రతిభావంతమైన వివరణ ఉన్నది. ఉద్దాలకుడనే మహా ఋషికి ఆయన కుమారుడు శ్వేతకేతువుకి మధ్య జరిగిన సంవాదం అది

ముందు భగవంతునికి ప్రపంచానికి మధ్య ఊన్న సంబంధం మట్టి—కుండలు, బంగారం—ఆభరణాలు, ఇనుము—పనిముట్లు ఉపమానాలద్వారా వివరించబడింది ఆ తరువాత ఆత్మ శరీరమనోబుద్ధులతో తాదాత్మ్యం పొందడం వలన జాగ్రత్స్వప్న సుషుప్తులలో ప్రపంచబాహుళ్యం ఎలా సృజింపబడిందో వివరించబడింది

ఈ సంవాదం ఆరో అధ్యాయంలో కొనసాగుతుంది. రాబోయే స్తబకంలో దానిసారాంశం వస్తుంది.



# ఏకాదశ స్తబకం

ఈ స్తబకంలో ఛాందోగ్యోపనిషత్తు ఆరో అధ్యాయంలో మిగిలిన అంశాలు, ఏడు, ఎనిమిది అధ్యాయాల భావాలు చెప్పబడుతాయి.

శ్లో॥ శరీరశుంగో హ్యాయ మన్నమూల
స్తస్యాపి చాపోఽగ్ని రపాంచ మూలమ్।
అగ్నేశ్చ యన్మూల మమూల మేత
త్తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 1

ప్రతి॥ శరీరశుంగః = శరీరానికి మూలకారణమయిన, అయం = ఈ పరబ్రహ్మము, అన్నమూలః = అన్నమునుమూలముగా కలది, తస్య + అపి = దానికిని, ఆపః = నీరు, మూలం = మూలము, అపాం + చ = నీటికి. అగ్నిః = అగ్ని, మూలం = మూలాధారం, అగ్నేః + చ = ఆ అగ్నికి కూడ, యత్ = మూలం = ఏది మూలమయినదో, ఏతత్ = ఇది, అమూలం = మూలాధారంలేనిది, తం = అట్టి, విశ్వనాథం = శివుని, శరణం = శరణమును, ప్రపద్యే = ప్రార్థిస్తున్నాను.

## తాత్పర్యం

శరీరానికి అన్నం మూలం. దానికి నీరు, నీటికి అగ్ని మూలం. అగ్నికి ఏది మూలమో ఆ పరమాత్మ అమూలం. ఆ విశ్వనాథుణ్ణి శరణువేడుతాను.

## వ్యాఖ్య

ప్రపంచంలోని నామరూపాలకు ప్రాణులకు మూలమైన అకారణ కారణం పరబ్రహ్మమని సూచింపబడుతోంది. ఆ బ్రహ్మమునుండే ఇవన్నీ వస్తాయి. దానేవల్లనే నిలుస్తాయి. అందులోనే కలిసిపోతాయి ఇక్కడ

పరమాత్మను కార్యకారణ సంబంధంద్వారా నిర్దేశిస్తున్నారు శ్వేతకేతువు అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఉద్దాలకుడు ఈ సమాధానాన్ని ఇచ్చాడు.

"ఈ శరీరం బీజంవల్ల కార్యమైనట్లయితే, ఈ కార్యానికి మూలకారణం ఏది?" సుషుప్తి అవస్థలో జీవులు పొందే అనుభవాలద్వారా అకారణమైన ఆత్మను నిర్దేశించుటలా ఉద్దాలక ఋషి కార్యకారణ నియమం ద్వారా అన్నం నీరు, అగ్నిని ఉదహరిస్తూ అకారణ కారణమైన బ్రహ్మయొక్క సద్రూపాన్ని సూచించాడు, అన్నిప్రాణుల స్థూలశరీరాలు తినబడే అన్నంవల్ల పుట్టుతాయని ఎరుగుదుము ఆ తిన్నఅన్నమే పురుషుడి బీజంగా ఎలా మారుతుందో కూడా ఎరుగుదుము అందువల్ల స్థూలశరీరంలో జనించే బీజం అన్నమనే కారణంనుండి జనించిన కార్యం మామూలుగా ఆకలి వేసినప్పుడు అన్నం తింటాము స్థూలశరీరంలో తయారయ్యే వేరువేరు రసాయనాల పరస్పర వ్యవహారాలవల్ల ఆహారం అరిగిపోయినప్పుడు ఆకలివేస్తుంది శరీరంలోని రసాయనాలన్నీ ద్రవరూపాలు ఇవి జలతత్త్వం అందువలన మనకు కలిగే ఆకలికి కారణం నీరు. ఇలా అన్నం వీర్యము, నీరు మూలకారణం

దాహం వేసినప్పుడు మనం నీరు త్రాగుతాము దాహం ఎందుకవుతుంది? ముందు త్రాగిన నీటిని శరీరం జీర్ణంచేసుకొని నెత్తురుగా, మూత్రంగా, ప్రాణంగా మార్చివేస్తుంది. శరీరంలోని వేడి ఈప్రకారంగా నీటిని ఇలా మారుస్తుంది ఈ వెచ్చదనం అగ్నితత్త్వమైన తేజస్సు అందుచేత మనం త్రాగే నీటికి మూలకారణం తేజస్సు ఈ తేజస్సు శరీరంలో జీవుడున్నంత కాలం ఉంటుంది ప్రాణం నిర్గమించినప్పుడు శరీరం చల్లబడిపోతుంది అందుచేత మనలోని ప్రాణం జీవుళ్ళందరిలోని తేజస్సుకు మూలకారణం.

జీవుళ్ళలోని ప్రాణతత్త్వానికి కారణం ఏది? అది అకారణమైన కారణం శుద్ధాత్మయే! అయితే ఇలా కారణాలను అన్వేషించే తర్కంవల్ల ఆత్మ లభించదు కారణాన్ని వెదుక్కునేది బుద్ధిలోని జిజ్ఞాస, శుద్ధాత్మచేత ఆడించబడే బుద్ధి ఆత్మను ఒక విషయంగా ఎప్పటికీ కనుక్కోలేదు. అద్దమును తీసివేసినపుడు అద్దంలోని ప్రతిబింబం అదృశ్యమైనట్లే ఆత్మ దర్శనమైనప్పుడు బుద్ధి ఆత్మలో లీనమైపోతుంది. ఈ ఆత్మే సౌమ్య కాశీశుడైన విశ్వనాథప్రభువు ఆయనకు నా అనంతకోటి ప్రణామాలు!

అగ్ని జల భూతత్త్వాల్లోని సూక్ష్మాంశాలు మానవశరీరంలో వాక్కు మనః ప్రాణాలుగా ఎలామారుతాయో ముందే వివరింపబడింది. మరణకాలంలో జీవుడు శరీరంలోనుండి నిష్క్రమించినప్పుడు ఈ మూడూ శరీరంలోనుండి ఎలా వెళ్ళిపోతాయో రాబోయే శ్లోకం వివరిస్తుంది (ఛాందోగ్య 6. 8)

శ్లో॥ యతోఽస్య వాణీ మనసి ప్రశామ్య
త్యనే మనోఽగ్రౌ స చ హవ్యవాహః॥
యస్మిన్ పరే బ్రహ్మణి చాప్రకమ్యే
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 2

ప్రతి॥ యతః = ఏ చనిపోవువానినుండి, అస్య = అతని, వాణీ = వాక్కు, మనసి = మనస్సునందును, మనః = మనస్సు, అనే = ప్రాణవాయువు నందు, స చ + హవ్యవాహః = అపాణవాయువు, అగ్రౌ = ఊర్ధ్వ లోకాల్లోనున్న, అప్రకమ్యే = ఉపశమనంలేని, యస్మిన్ = ఏ, పరేబ్రహ్మణి = పరబ్రహ్మమందు, ప్రశామ్యతి = లీనమగునో———

## తాత్పర్యం

పురుషుడు మరణించినప్పుడు అతడి వాక్కు మనస్సులో లయిస్తుంది. మనస్సు గాఢనిద్రలోవలె ప్రాణశక్తిలో లయిస్తుంది, ఆ సమయంలో మరణించే పురుషుడు పూర్తిగా నిశ్చేతనుడవుతాడు. గతించిన తనజన్మను గురించి ఏ జ్ఞానమూ ఉండదు. మనోవాక్కులు లయించిన ఆ ప్రాణశక్తి తేజస్సులో లయిస్తుంది. ఇదే శరీరంలోని వెచ్చదనం. ఈ స్థితిలో పురుషుడు శరీరమంతటా ఎంతో యాతనని పొందుతాడు. క్రమంగా శారీరక సంచనలన్నీ ఆగిపోయి చివరికి శరీరం నిర్జీవమైన కట్టెగామిగిలిపోతుంది. అప్పటికీ శరీరం ఇంకా వెచ్చగానే ఉంటుంది. తేజోరూపమైన ప్రాణం ఇంకా ఉన్నట్లుగా సూచన. చుట్టుప్రక్కల వాళ్ళు అతడు ఇంకా బ్రదికివున్నాడో లేదో తెలుసుకోలేరు. క్రమంగా శరీరం చల్లబడుతుంది. అప్పటికి ప్రాణలక్షకమైన తేజస్సుకూడా జీవుడిలో లయమౌతుంది. జీవుడు దేహాన్ని వదిలి సర్వవ్యాప్తమైన పరమాత్మలో లీనమవుతాడు. ఇదే సౌమ్య కాశీశుడైన విశ్వనాథప్రభువు. ఆ విశ్వనాథునికి నా ప్రణామాలు!

## వ్యాఖ్య

ఒక మనుష్యుడు మరణించినప్పుడు నిష్క్రమించే జీవి తన స్థూల శరీరాన్ని మాత్రమే వదలుతాడు. ఇది స్థూలమైన అన్నసారాంశంవల్ల జనించింది. (అన్నమయకోశం) మనోబుద్ధులతో ఉండే సూక్ష్మశరీరం ఇంకా జీవిని చుట్టుకునే వుంటుంది. ఈ సూక్ష్మశరీరాన్ని అంటిపెట్టుకొన్న కోరికలు వాసనలు ఉదాత్తము, ఆధ్యాత్మికము అయి పరమాత్మను వెదుక్కునేవిగా వుంటే ఆ జీవుడు ఉత్తమలోకాలవైపుగా పయనించి చివరికి పరమాత్మను తెలుసుకుంటాడు. అతడు తిరిగి మానవరూపాన్ని ధరించడు. అలాకాక మరణ సమయంలో జీవికి కేవలం భౌతికమైనవి, అహంకారంతో కూడుకొన్నవి అయిన కోరికలు తీర్చుకోవలసినవి వుంటే, వాటిని తీర్చుకోడానికి తిరిగి మానవుడిగానో మరోప్రాణిగానో పుట్టుతాడు. ఇది మన గాఢనిద్రలోని అనుభవంలాంటిదే. శరీరమనోబుద్ధులతో తాదాత్మ్యం చెందివున్న జీవభావం ఆత్మలో పూర్తిగా లీనమైపోయినప్పుడు గాఢనిద్రాస్థితి అనుభవమౌతుంది. నిజానికి ఇది రోజు వచ్చే తాత్కాలిక మరణం. ఈ తాత్కాలిక మరణంనుండి మేలుకొని కోరికలు ప్రేరేపింపగా జాగ్రత్స్వప్న లోకాలలో అనుభవాలు పొందుతుంది. ప్రపంచంలో తిరిగి పుట్టిన జీవుళ్ళ పరిస్థితి కూడా సరిగ్గా అంతే.

పై రెండు శ్లోకాలలోను జగత్తులలోని నామరూపాలకి చివరి కారణమైన పరబ్రహ్మ సద్భావరూపం వివరింపబడింది. వేదాలలోని "తత్త్వమసి" మహా వాక్యంలోని ఈ పరమసత్యాన్ని గురించి పండితులైన జిజ్ఞాసువులు మననం చేసి పరమాత్మను తాము సూటిగా చేరుకుంటారు. ఈ విషయాన్ని రాబోయే శ్లోకం వెల్లడిస్తుంది.

శ్లో॥ అణిష్ఠ మాత్మా జగతశ్చ మూలం
సర్వస్య సాక్షాత్ సుధియో విదంతి।
యద్బ్రహ్మ స తత్త్వమసీతి వాక్యాత్
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 3

ప్రతి॥ అణిష్ఠం = పరమాణువునందున్న, ఆత్మా = ఈపరమాత్మ, సర్వస్య = సమస్తమైన, జగతః = జగత్తునకు, సాక్షాత్ = ప్రత్యక్షమైన, మూలం = మూలమని, సుధియః = పండితులు, విదంతి = తెలియుచున్నారు, యత్ = ఏ, తత్త్వం + అసి + ఇతివాక్యాత్ = "తత్త్వమసి" ఇత్యాది వాక్యమునుండి, సత్ = సత్యమైనదిగా తెలిసికొంటున్నామో——

## తాత్పర్యం

అన్ని ప్రాణులలోని సారమై, అంతరాత్మగా చరించి ప్రాణాన్నిచ్చే సూక్ష్మాతి సూక్ష్మమైన పరమాత్మ, అలాగే విస్తృతమైన జగత్తులోని బాహుళ్యానికి ఆఖరి కారణమైన పరమాత్మను గురించి విద్వాంసులైన జిజ్ఞాసువులు తత్త్వమసి మహావాక్యాన్ని గురించి మనన నిధిధ్యాసలు చేస్తూ అందుకునే పరమాత్మ విశ్వనాథుని నేను శరణువేడుతాను.

## వ్యాఖ్య

మానవుడు తన్నుతాను ఎరగని అజ్ఞానం ఈనాటిదీ, నిన్నటిదీ కాదు. ఈ నామరూప జగత్తు యొక్క సృష్టికి ముందే ఉన్నది. అది ఎప్పుడు మొదలైందో ఎవరూ చెప్పలేరు. అందుకే అది అనాది. ఇలా సృష్ట్యాదినుండి అజ్ఞాన తిమిరంలో ప్రాపంచిక జీవితంలోని బాధలను, పీడలను అనుభవిస్తూనే ఉన్నాడు. ఇలా బాధపడే మానవుల దురదృష్టానికి వగచి ఆత్మదర్శనం పొందిన మహాత్ములు, "నాయనా! భ్రాంతిమాత్రమైన ఈ ప్రాపంచిక దుఃఖాలను ఎందుకు అనుభవిస్తావు? ఈ బాహుళ ప్రపంచంలో నీవు కర్తవు, భోక్తవు దుఃఖపడే వాడివి కాదు. ప్రపంచంలోని యావత్తు ప్రాణులకు, వస్తువులకు ఆదికారణమైన పరమాత్మవు నీవు! కారణం ప్రతికార్యంలోను ఉంటుంది కాబట్టి నీవుకూడా కార్యమే కాబట్టి నీవు నిజానికి కారణంకన్న భిన్నంకాదు. నీవు పరమాత్మవే. నీలో ఉన్న పరమాత్మ స్వరూపమే నీది. "తత్త్వమసి" అన్న మహాసత్యం. దానినిగురించి నీవు యోచించి ధ్యానించావా పరమాత్మతో నీ తాదాత్మ్యాన్ని పూర్తిగా తెలుసుకుంటావు."

ఇంతవరకు జరిగిన చర్చలో పరమాత్మే సత్యమనీ తెలుసుకున్నాము. మిథ్య అయిన ఈప్రపంచానికి అకారణకారణం ఆయన. జీవుడు మనోబుద్ధుల

పరికరాలలో ప్రతిఫలించే పరమాత్మయొక్క ప్రతిబింబమేనని, కేవలం భ్రాంతిజన్యమేనని కూడా తెలుసుకున్నాము.

ఈ జీవుడు ప్రతిరాత్రి సుషుప్తిలో తన స్వస్వరూపాన్ని చేరుకుంటాడని చెప్పబడింది. "స్వం అప ఇతి" – సుషుప్తి అని నిర్దేశింపబడింది. అయితేనేం జీవుడు అక్కడ ఆత్మను గుర్తించలేడు. తన సద్భావమే కదా, ఎందుకు గుర్తించలేడు? ఈ కారణం రాబోయే శ్లోకంలో తెలుపబడుతుంది.

శ్లో॥ ప్రజా స్తరూణాం రసవత్ సుషుప్తౌ
సంపద్య యస్మిన్ సతి నిర్విశేషాః,
వాక్యేన యత్తత్త్వమసీతి వేద్యం
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 4

ప్రతి॥ తరూణాంరసవత్ = చెట్లపువ్వులలోని తేనెచుక్కలవలె, సుషుప్తౌ = గాఢనిద్రలో. ప్రజాః = ప్రజలు, యస్మిన్ = ఎవనియందు, సంపద్య = పొంది, నిర్విశేషాః = సర్వసములై, (భవంతి = అగుచున్నారో), తత్త్వమసి + ఇతి + వాక్యేన = తత్త్వమసీతివాక్యముచే, యత్ = ఏ పరబ్రహ్మము, వేద్యం = తెలియబడవలెనో,

## తాత్పర్యం

చెట్టునుండి సేకరింపబడిన మధువులాగా ప్రజలు గాఢనిద్రలో దేనిని పొందినాక ప్రత్యేకతలేని స్థితిని పొందుతారో, తత్త్వమసి మహావాక్యంద్వారా ఏది తెలుసుకోబడుతుందో, ఆ విశ్వనాథుణ్ణి నేను శరణువేడుతాను.

## వ్యాఖ్య

తేనెటీగలు అనేకరకాల వృక్షాలు, మొక్కలనుండి తేనెను సంగ్రహిస్తాయి. ఈ తేనెలలోని తీపి వేరువేరుగా ఉంటుంది. అయినా ఇవన్నీ కలిసి తేనెతుట్టెలో భద్రపరుపబడినప్పుడు వాటిరుచులలోని తేడాని గ్రహించడం సాధ్యంకాదు. అలాగే ఎవరి ప్రత్యేకత వారికున్నా గాఢనిద్రలోకి

జారుకున్న జీవుళ్లు సమిష్టిరూపమైన పరమాత్మలో లీనమై తమ ప్రత్యేకతలను గోల్పోతారు. అందుచేత ఆత్మను కనుక్కోలేరు. తత్త్వమసి మహావాక్యాన్ని గురించి లోతుగా మనన నిధిధ్యాసలు చేయడంవల్లనే తెలుసుకోగలరు.

ఇది ఉద్దాలకఋషి తేజస్వి అయిన తన కుమారుడు శ్వేతకేతువుకు ఇచ్చిన తొమ్మిది ఉపమానాలలో ఒకటి. తత్త్వమసి మహావాక్యాన్ని గురించి లోతుగా ధ్యానించడంవల్లనే జిజ్ఞాసువుకు ఆత్మబోధ కలుగుతుందని దాని ద్వారా బోధించాడు. (ఛాందోగ్య 9. 6)

తరువాతి శ్లోకంలో మరో ఉపమానం వస్తుంది. గాఢనిద్రలోను, మరణించినప్పుడు, ప్రపంచప్రళయం సంభవించినప్పుడు పరమాత్మలో లీనమయ్యే జీవుళ్ళకు పరమాత్మ సంగతి తెలియకపోవడమే కాదు. తెల్లవారి లేచినప్పుడు, తిరిగి జన్మించినప్పుడు, లేదా క్రొత్తసృష్టిలో క్రొత్తజన్మను సంపాదించినప్పుడు, తమ స్వస్వభావమైన పరమాత్మనుండి జనిస్తున్నామనే సంగతి గుర్తుండదు. జ్ఞాపకం రాదు. అంటే వాళ్ళు పరమాత్మలో కలిసిపోయి నప్పుడు ఆ సంగతి ఎరగరు. క్రొత్త అనుభవాలకోసం మరల పుట్టినప్పుడు పరమాత్మనుండి వేరై వచ్చామనీ ఎరగరు. నిద్రలేచిన మనిషి ఇంకొకరి ఇంటికి వెళ్ళవచ్చును. ఆ రెండో ఇంట్లో ఉన్నా తాను ఎక్కడనుండి వచ్చాడో గుర్తుంటుంది. అయితే జీవుడిగా క్రొత్త అనుభవాలకోసం పుట్టినప్పుడు ఆసంగతి వారికి తెలియదు. ఎందువలననో ఈ రాబోయే శ్లోకం ఉపమానాలతో సహా వివరిస్తుంది.

శ్లో॥ అబ్ధేర్యథాబ్ధిం ప్రవిశంతి నద్యో
వ్యాఘ్రాదయో యద్యపి యంతి తద్వత్।
వేద్యం విచారేణ చ తత్త్వమస్యాః
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 5

ప్రతి॥ అబ్ధేః = సముద్రమును, యథా = ఎట్లు, నద్యః = నదులు, అబ్ధిం = సముద్రమును, ప్రవిశన్తి = చేరుచున్నవో, తత్ + వత్ = అట్లే, వ్యాఘ్రాదయః = పులులు మొ॥ జంతువులు,

యత్ + హి + అపి = ఏ పరమాత్మని, యంతి = చేరుచున్నవో, అస్యాః = ఈ, తత్త్వం = దేవతా తత్త్వము, విచారేణ = బ్రహ్మవిద్యా విచారముచే, వేద్యం = తెలియబడవలెను———

## తాత్పర్యం

నదులు సముద్రాలలో చేరి వాటిలో కలిసిపోతాయో, అలాగే పులి మొదలైనవికూడా కలిసిపోతాయి. అవి ఎక్కడ కలిసిపోతాయో దానిని తత్త్వమసి వాక్యవిచారణవల్ల తెలుసుకోవాలి. ఆ విశ్వనాథుణ్ణి నేను శరణువేడుతాను.

## వ్యాఖ్య

ఏప్రాంతాలనుండి ప్రవహించే నదులైనా అన్నీ సముద్రంలోకి ప్రవేశించి తమతమ ప్రత్యేకతలను వదిలి పూర్తిగా లీనమైపోతాయి. ఒకసారి కలిసి పోయాక తమ పేర్లను, తమ నీటిమొత్తాన్ని, తమ తీపిగుణాన్ని తమ దిక్కుని తిరిగి పొందవు. పులులు, పురుగులు, ఈగలు, మనుష్యులు, నిద్రలో, చావులో ప్రళయంలో పరమాత్మలో కలిసినప్పుడు అలాగే తమ ప్రత్యేకతలను పోగొట్టు కొంటారు అయితే నదులలాగా కాక, పరమాత్మనుండి బైటకి వచ్చినప్పుడు తమ ప్రత్యేకతలను తిరిగి తెచ్చుకుంటారు. పరమాత్మలో లీనమైనపుడుగాని, తిరిగి వేరై వచ్చినప్పుడుగాని, పాపం వారికి ఆసంగతే తెలియదు. పరమాత్మను గురించిన జ్ఞానంకోసం "తత్త్వమసి" మహావాక్యాన్ని సరిగా అధ్యయనంచేసి, అర్థంచేసుకొని లోతైన మననంచేసి, గాఢంగా ధ్యానించాలి. అలా తెలుసుకోబడే పరమాత్మ విశ్వనాథుడే. ఆయనకు నా ప్రణామాలు!

శ్లో॥ అజీవ మేత మ్రియతే శరీరమ్
వృక్షోఽపి శుష్య త్యపజీవక శ్చేత్।
స ఏవ సద్ యత్త్రిపదైక వేద్యమ్
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 6

ప్రతి॥ అజీవః = జీవంలేని, ఏతత్ = ఈ, శరీరం = శరీరం, మ్రియతే = మరణించుచున్నది, వృక్షః + అపి = చెట్టుకూడ, అపజీవకః = చేవ

ఉడిగినచో, శుష్యతి = ఎండిపోవును, యత్ = ఏ పరబ్రహ్మము, త్రిపద + ఏకవేద్యం = మూడుపదాలచే, (తత్ + త్వం + అసి) ముఖ్యంగా తెలియబడవలసినదో, సః + ఏవ = అదియే, సత్యం = పరమార్థం———

## తాత్పర్యం

ప్రాణం పోయినపుడు నశించేది శరీరమే. ప్రాణం పోయినప్పుడు చెట్టైనా ఎండిపోతుంది. "తత్త్వమసి" అనే మూడుపదాలవల్ల తెలుసుకోబడవలసినది ఒక్కటే అప్పుడుంటుంది. ఆ విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

ఒక చెట్టుకొమ్మను నరికినప్పుడు లేదా ఆ కొమ్మ ఎండిపోయినప్పుడు చెట్టు చావదు. ఆ కొమ్మలోని ప్రాణం మిగతా చెట్టును చేరుతుంది. ఆ చెట్టులోని అన్నిభాగాలలోని ప్రాణం పోయినప్పుడే చెట్టంతా ఎండిపోతుంది. అప్పుడైనా చెట్టులోని ప్రాణం నశించదు. ఏ పరికరం ద్వారా చెట్టులో ప్రాణం వ్యక్తమైందో ఆ పరికరమే నశిస్తుంది. అలాగే మనకుకూడా ఏవైనా అవయవాలు తెగిపోయినా, పాడయిపోయినా తొలగించబడినా మనం మరణించము. ఆ భాగాన్ని సచేతనం చేసిన ప్రాణం అక్కడనుండి తొలగిపోతుంది. మొత్తం శరీరంలో వ్యాపించి నిలిచివున్న ప్రాణం వదిలినప్పుడే శరీరం నశిస్తుంది. అందుకని మరణం శరీరానికే, ప్రాణానికి కాదు. ఆత్మరూపి అయిన జీవునికి మరణంలేదు. ఛాందోగ్యం 10. 6 అధ్యాయంలోని అయిదు, ఆరు శ్లోకాలు ఉద్దాలకఋషి బోధించిన 4, 5 ఉపమానాలను వర్ణిస్తాయి.

శ్వేతకేతువుకు వచ్చిన తదుపరి అనుమానం ఇది—నామరూప రహితమైన సూక్ష్మాతిసూక్ష్మ రూపియైన సద్బ్రహ్మ ఇంతపెద్ద నామరూప జగత్తుగా ఎలా మారుతుంది? వటవృక్షం—విత్తనం ఉదాహరణద్వారా ఈ సంశయం నివారింపబడింది. ఈ వివరణ రాబోయే శ్లోకంలో ఉన్నది. ఇది ఏడవ ఉపమానం.

శ్లో॥ న్యగ్రోధ బీజా ద్విటపేవ జజ్ఞే
యతస్సతోఽణిమ్ని ఇదం సమగ్రం।
శ్రద్ధావతా యత్ర త్రిపదైశ్చ వేద్యం
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 7

ప్రతి॥ న్యగ్రోధ బీజాత్ = మఱ్ఱివిత్తనమునుండి, వటపి + ఇవ = మహావట వృక్షమువలె, ఇదం = ఈ, సమగ్రం = విశ్వము, యతః = ఏ, అణిమ్నః = పరమాణువైన, సతః = సత్తునుండి, జజ్ఞే = పుట్టెనో, శ్రద్ధావతా = శ్రద్ధాళువుచే, యత్ = ఏ బ్రహ్మము, త్రిపదైః + చ = తత్, త్వం, అసి అను మూడుపదాలచే, వేద్యం = తెలియబడదగినదో——

## తాత్పర్యం

అతిచిన్న విత్తనంనుండి ఎంతోపెద్దదైన మఱ్ఱిచెట్టు వచ్చినట్లే పరమాణువు కన్న సూక్ష్మమైన పరమాత్మ సద్భావంనుండి ఈ బ్రహ్మాండం యావత్తు ఏర్పడింది. తత్త్వమసి వాక్యంలోని మూడుపదాలను గురించి శ్రద్ధాళువు మననం చేయడంవల్ల తెలియబడే ఆ విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

ఈ శ్లోకంలో శ్రీ గురుదేవులు "శ్రద్ధ" యొక్క ప్రాముఖ్యతను విశదీకరిస్తున్నారు. శ్రద్ధఅంటే గురువువాక్యాలలో, పవిత్రమైన శాస్త్రాలలో అకుంఠిత మైన విశ్వాసం. "తత్", "త్వం", "అసి" అన్న మూడుపదాలమీద పూర్తి విశ్వాసం ఉన్నవాళ్లే మహావాక్యంలోని ఈ మూడు చిన్నపదాలను గురించి దీర్ఘంగా, గాఢంగా మననం చెయ్యగలరు. జీవిలోపలి ఆత్మ – సర్వాతీతమైన పరమాత్మల ఏకత్వాన్ని గురించి కేవలం బౌద్ధికస్థాయిలో అర్థంచేసుకోవడంవల్ల లాభంలేదు. బుద్ధిలోని జ్ఞానకాంతి సహాయంతో మనన నిదిధ్యాసలద్వారా ఈ ఏకత్వాన్ని హృదయంలో అనుభవం చేసుకోవాలి. క్రమంగా సాధకుడు తన లోని ఆత్మ నామరూప జగత్తురూపేంగ వ్యక్తమయ్యే పరమాత్మ తప్ప మఱొకటి కాదు అనే అనుభవంలోకి జాగృతు డౌతాడు.

ఇలా ఉద్దాలకుడు "ఓ శ్వేతకేతూ! నీవే అది!" అని బోధించాడు. విశ్వనాథప్రభువుగా వ్యక్తమయ్యే ఆ పరమాత్మను నేను శరణు పొందుతాను. (ఛాందోగ్య 12. 6)

శ్వేతకేతువుకు తరువాత వచ్చిన అనుమానం ఇది--నామరూప జగత్తుకు కారణమైన పరబ్రహ్మ మర్రిచెట్టుయొక్క విత్తనం కంటికి కనబడినట్లుగా మనకు ఎందుకు కనబడడు? మనం కంటితో ఎందుకు చూడలేము? నీరు-ఉప్పు ఉపమానంద్వారా ఈ అనుమానం నివారించబడుతోంది.

శ్లో॥ యథాప్సు లీనం లవణం నపశ్యే
దణిమ్న ఏవం యదలభ్య మక్షేః।
గ్రాహ్యం చ బుద్ధ్యా త్రిపదై ర్గురూక్తైః
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 8

ప్రతి॥ యథా = ఎట్లు, అప్సు = నీటియందు, లీనం = కలిసిన, లవణం = ఉప్పు, నపశ్యేత్ — చూడబడదో, ఏవం = అట్లే, అణిమ్నః = పరమాణు రూపంనుండి, యత్ = ఏ పరమాత్మ, అక్షేః = కన్నులచే, అలభ్యం = చూడబడదో–, గురూక్తైః = గురుబోధవలన, త్రిపదైః = తత్ + త్వం + అసి–అను మూడుపదాలచే, బుద్ధ్యా + చ = బుద్ధిచేతను, గ్రాహ్యం = తెలియబడదగినది——

## తాత్పర్యం

నీటిలో కరిగిపోయిన ఉప్పును ఎలా కంటితో చూడలేరో అలాగే సూక్ష్మమైన ఆత్మ కంటికి గోచరం కాదు. గురువు బోధించిన "తత్త్వమసి" మహావాక్యంలోని మూడు పదాలద్వారా బుద్ధికి గ్రాహ్యం అవుతుంది. ఆ విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

నీళ్ళలో కరిగిన ఉప్పును నీటివంక చూడడంవల్ల తాకడంవలన కనుక్కోలేము. రుచిచూచి పరీక్షించడంవల్లనే తెలుసుకోగలుగుతాము. అలాగే ఈ విశ్వానికి మూలకారణమైన పరమాత్మ సర్వంలో ఉన్నాడు. కాని ఇంద్రియ మనోబుద్ధుల గుర్తింపుకు ఆయన అందడు. విజ్ఞుడైన గురువుబోధవల్లనె దానిని తెలుసుకోవాలి. ఆయన సూచించిన సాధనాపద్ధతులను అవలంబించి, అభ్యసించి, అందుకోవాలి. ఉద్దాలకఋషి బోధించిన ఎనిమిదో ఉపమానం ఇక్కడ పేర్కొనబడింది. (ఛాందోగ్య 6. 13)

శ్వేతకేతువుకు తరువాత కలిగిన సంశయం ఇది – "తండ్రీ!, నీటిలో ఉన్న ఉప్పును పైనుండో, ప్రక్కనుండో, అడుగునుండో, కొద్దినీటిని తీసుకొని రుచిచూస్తే ఉప్పు అందులో ఉన్నట్లుగా తెలుస్తుంది. అలాగే సర్వవ్యాప్తమైన పరమాత్మను తెలుసుకోడానికి ఏదైనా ఉపాయం ఉన్నదా?" దానికి సమాధానం తరువాతి శ్లోకంలో వస్తుంది,

శ్లో॥ విక్రోశతాఽఽబద్ధ దృశా స్వనీవృ
న్నరేణ గమ్యేత యథా యథోక్తం।
ఆచార్యవా నృచ్ఛతి యత్త్రిశబ్దైః
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 9

ప్రతి॥ యథా = ఎట్లు, విక్రోశతా = ఏడ్చుచున్న, ఆబద్ధదృశా = కండ్లకు గంతలు కట్టబడిన, స్వనీవృత్ = రక్షించుమని అరచుచున్న, నరేణ = అపన్నునిచే, యథా + ఉక్తం = చెప్పబడినప్రకారం, యథా = ఏవిధముగ, గమ్యేత = చేరునో (అట్లే), త్రిశబ్దైః = తత్ + త్వం + అసి– అనెడి మూడుపదాలచే, యత్ = ఏ పరబ్రహ్మమును, ఆచార్యవాన్ = గురువుచేత, ఋచ్ఛతి = పొందుచున్నాడో——

## తాత్పర్యం

దొంగలచేత దోచుకోబడి, బద్ధుడై కళ్ళుగంతలతో దారితెలియక ఆక్రోశించే వ్యక్తికి, గంతలు, కట్లు విప్పి దారిచూపితే అతడు తనగమ్యాన్ని అందుకోగలడో,

అలాగే "తత్త్వమసి" మూడు పదాలద్వారా బోధించే ఆచార్యుడు గల వ్యక్తి కూడా అందుకోగలిగిన ఆ విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

వ్యాఖ్య

అడవులలో ఒంటరిగా ప్రయాణం చేసే మనుష్యుడిమీద బందిపోటు దొంగలు దాడిచేసి కట్టేసి, కళ్ళకు గంతలుకట్టి దోచుకుని పోయారు. ఆ అడవిలో దిక్కులు తెలియక విలపించే ఆ పాంథుడికి సజ్జను డెవరైన బంధనాలు, గంతలు విప్పి దారి చూపితే చక్కగా తనస్థానాన్ని చేరుకొంటాడు.

జీవుడైనా అంతే. శరీరమనో బుద్ధులలో కలిగిన తాదాత్మ్యంవలన అహంకారంతో గ్రుడ్డివాడై అగచాట్లు పడుతున్నాడు. గురువు ఉపదేశంవలన అజ్ఞానం నశించి అహంకారబంధనంనుండి విముక్తుడై, తన స్వస్వరూపమైన అనంతాత్మ స్వభావాన్ని తిరిగి పొందగలడు. ఆ అనంతాత్మ విశ్వనాథప్రభువును నేను శరణు పొందుతాను.

తన నిజస్వరూపాన్ని గుర్తెరగనందున ఆత్మ తన అనంతస్థాయినుండి క్రిందికి దిగజారుతుంది. ఈ అజ్ఞాన కారణంగానే శరీరమనోబుద్ధులతో తాదాత్మ్యం పొంది అహంకారవశమై గ్రుడ్డిగా అనేకభ్రాంతులకు లోనవుతుంది ఈ అహంకారభావంతో బహుళప్రపంచంలో వచ్చే అన్ని సుఖదుఃఖాలకు కర్తృత్వాన్ని భోక్తృత్వాన్ని సంపాదించుకుంటుంది. అనంత పరమేశ్వర కృప వలన, లేదా పూర్వజన్మలలో సంపాదించుకొన్న పుణ్యకర్మలవలన ఆధ్యాత్మిక సాధనలవలన, ఒక సద్గురువును కలుసుకోగలుగుతాడు. అడవిలో చిక్కుపడ్డ మనిషికి దయగల పాంథుడు లభ్యమైనట్లే సద్గురువు లభించడంవల్ల మూడు పదాలతో కూడిన మహావాక్యాన్ని గురువునుండి శ్రవణంచేసి మననంచేసిన జీవుడు శ్రీ గురుప్రసాదంవల్ల సంసార బంధనాలనుండి పూర్తిగా విడుదల పొంది ఆత్మజ్ఞాని అవుతాడు. స్వస్వరూపంలోకి మేల్కొని జీవన్ముక్తుడౌతాడు. ఆ పరమేశ్వరుడే సౌమ్య కాశీవిశ్వనాథుడు. ఆయనని శరణుజొచ్చుతాను.

చివరిదైన తొమ్మిదో ఉపమానం ఇక్కడ పేర్కొనబడింది. (ఛాందోగ్య 6 1)

శ్వేతకేతువు చివరి అనుమానం ఇది—అలాంటి జీవుడికి సాక్షాన్మోక్షం వస్తుందా?....జీవన్ముక్తియా? లేక దేహం రాలిపోయాక క్రమముక్తియా? ఈ సంశయం తరువాతి శ్లోకంలో నివారితమౌతుంది.

శ్లో॥ మూర్ఖో ముమూర్షు స్సతి యత్క్రమేణ
విద్వాన్ ముముక్షున్నపి తాదృశైవ।
సంపద్యతే యత్ర పదత్రయేణ
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 10

ప్రతి॥ క్రమేణ = క్రమముగా, మూర్ఖః = మూర్ఖుడు, ముమూర్షుః + సతి = చావగోరినవాడై, తాదృశ + ఏవ = అట్లే, విద్వాన్ = విద్వాంసుడు, ముముక్షన్ + అపి = మోక్షము కోరుచున్నవాడైనను, యత్ర = ఎక్కడయితే, పదత్రయేణ = తత్త్వాది పదత్రయముచే, యత్ = ఏ పర బ్రహ్మము, సంపద్యతే = పొందబడుచున్నదో,——

## తాత్పర్యం

మరణించే జీవుడు మూర్ఖుడుకానీ, క్రమముక్తి పొందేవాడుకానీ, మోక్షం పొందిన విద్వాంసుడుకాని అందరూ వొకేరకంగా పరమాత్మ సద్భావంలో లీసమవుతారు. మూడు పదాల మహావాక్యంద్వారా అందుకోబడే అనంత పరమాత్మ విశ్వనాథుని నేను శరణు వేడుతాను,

## వ్యాఖ్య

జీవుడు మరణించినప్పుడు పరమాత్మ సద్భావంలో లీనంకావడం తప్పనిసరి. ఆత్మతత్త్వం ఎరగని అజ్ఞాని జీవికర్మ, వాసనలు, లేదా సంస్కారాలను అనుసరించి తిరిగి పుట్టుతాడు. బ్రహ్మజిజ్ఞాసువు ఈ లోకానికి తిరిగి రాకుండా పరబ్రహ్మంలో లీనమవుతాడు.

ఛాందోగ్యం **6. 15** లోని భావం పైశ్లోకంలో ఉదహరించబడింది. ఇప్పుడు శ్వేతకేతువుకి ఇంకో సంశయం. విద్వాంసుడు, మూర్ఖుడు—ఇద్దరూ

మరణించినప్పుడు పరమాత్మ సద్భావాన్నే పొందుతారు కదా. మూర్ఖుడు ఎందుకు తిరిగి జన్మిస్తాడు, విద్వాంసుడు ఎందుకు తిరిగి రాడు? తరువాతి శ్లోకం మరో ఉపమానంతో ఈ సంశయాన్ని నివారిస్తుంది.

శ్లో॥ సంపద్య యస్మి న్నబుధోఽబుధస్తు
ప్రపద్యతే జన్మమృషాభిసంధః।
జ్వలత్ కుఠారగ్రహవత్ త్రిగమ్యం
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 11

ప్రతి॥ యస్మిన్ = ఏ బ్రహ్మజ్ఞానమందు, బుధః = పండితుడు, సంపద్య = పొంది, జన్మ = పుట్టుకను, నప్రపద్యతే = పొందడు, అబుధః + తు = మూర్ఖుడయితే, మృషా + అభిసంధః = అశాశ్వత కాంక్షతో గూడిన వాడై, జ్వలత్ = మండుచున్న, కుఠారగ్రహవత్ = గొడ్డలినిపట్టుకొన్నట్టు జన్మ = పుట్టుకను, ప్రపద్యతే = పొందుచున్నాడు, త్రిగమ్యం = మూడు పదాలద్వారా పొందదగు——

## తాత్పర్యం

దేనిని పొందికూడా అజ్ఞాని మండుతూన్న గొడ్డలిని పట్టుకున్నట్లు మిథ్యాగ్రహణం చేసినందున తిరిగి జన్మను పొందుతాడు. మూడు పదాల ద్వారా అందుకోబడే ఆ విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

సామాన్య అజ్ఞాన మానవుడు చిట్టచివరి సమయంలో ప్రబలంగా తలచుకొన్న అహంకారజనిత కామనవల్ల తిరిగి జన్మకోసం ఈ లోకానికి వస్తాడు. ఈ విషయాన్ని స్పష్టం చేయడానికిగాను వెనకటి రోజుల్లో నేరవిచారణ సమయంలో అవలంబించిన పద్ధతిని ఉదహరిస్తున్నారు. దొంగ అని అనుమానించబడిన వానిని ఎర్రగా కాలిన ఇనుపగొడ్డలిని పట్టుకోమనేవారు. నిజంగా అతడు దొంగతనం చేసివుంటే చెయ్యి కాలుతుందని, నిర్దోషి అయితే కాలదని ఆనాటి

విశ్వాసం. అలాగే పరమాత్మను ఎరిగిన విద్వాంసుడు భగవంతుణ్ణి అంటిపెట్టు కొన్నందువల్ల సంసారతాపాలవల్ల దహించుకు పోడనీ, అజ్ఞాని అయినవాడు మృషాప్రపంచాన్ని పట్టుకొన్నందువల్ల సంసారదవాగ్నిలో వే గి పో తా డ నీ సూచన, మహావాక్యంలోని మూడుపదాల మనననిధిధ్యాసలు చేసినప్పుడే అతడు నిజంగా బ్రహ్మమును తెలుసుకుంటాడు.

బ్రహ్మమును ఎరుగని వానిలో శరీరం నశించినప్పుడు వాసనలు క్షయం కావు. అతడు వాసనలు ప్రేరణవల్ల తిరిగి ఒకక్రొత్త శరీరాన్ని ధరించుతాడు. బ్రహ్మజ్ఞాని తన ప్రారబ్ధ వాసనలను, సంచిత వాసనలనుకూడా క్షయం చేసు కొంటాడు. స్వార్థరహితమై భగవదర్పితమైన జీవితంద్వారా ప్రారబ్ధాన్ని, ఆత్మ జ్ఞానమనే అగ్నిలో కాల్చివేయడంవల్ల సంచితాన్ని రెంటినీ క్షయం గావించు కొన్న మహాత్మునిలో శరీరాన్ని విడిచే సమయంలో ఏవాసనా ఉండదు. మరణ సమయంలో బ్రహ్మమునుగురించి ఒక్కటే ఆలోచన అతడిలో ప్రబలంగా ఉంటుంది. దేనిని గురించి యోచిస్తే దానినే పొందుతాడని, అదే అవుతాడని ప్రపంచంలోని ధర్మం. అందువలన భగవంతునిగురించి యోచిస్తూ అతడు భగవంతునిలో జాగృతుడౌతాడు. బ్రహ్మమే అవుతాడు. ఆస్థితి జనన మరణ రహితమైనది. "అలా మహావాక్య సహాయంతో తత్, త్వం, అసి అన్న మూడు పదాల మనన నిధిధ్యాసలద్వారా అందుకోబడే ఆపదం, ఓశ్వేతకేతుడా, నీవే!" ఈబోధతో శ్వేతకేతువు సంశయాలన్నీ తీరిపోయాయి. ఆత్మను అందుకున్నాడు (ఛాందోగ్య 6. 15)

ఇక్కడితో ఛాందోగ్యోపనిషత్తులోని 6వ అధ్యాయం పూర్తి అయింది. 3–11 శ్లోకాలలో శ్రీ గురుదేవులు తత్త్వమసి మహావాక్యబోధను క్షుణ్ణంగా వివరించారు. ఉద్దాలకఋషి తన కుమారుడైన శ్వేతకేతువుకు తొమ్మిది ప్రసిద్ధమైన ఉపమానాలద్వారా ఆత్మ–పరమాత్మల ఐక్యతను గురించి నిర్ధారణ చేసిన విధానం ఎంతో అందంగా ఈ శ్లోకాలలో చెప్పబడింది. — 1) మట్టి–మట్టికుండలు, 2) బంగారం–బంగారునగలు, 3) ఇనుము–ఇనపపనిముట్లు, 4) తేనె–తేనెటీగలు, 5) నదులు–సముద్రము, 6) మర్రిచెట్టు–దానివిత్తనము 7) ఉప్పు–ఉప్పునీరు, 8) చెట్టు–ఎండినకొమ్మలు, 9) దొంగలు–గంతలుకట్ట బడిన పాంథుడు.

రాబోయే శ్లోకాలలో ఛాందోగ్యంయొక్క 7, 8 అధ్యాయాలు వివరించబడుతాయి.

రాబోయే శ్లోకంలో ఏడో అధ్యాయం మొదలవుతుంది. భగవాన్ సనత్కుమారుడు, నారదఋషి-ల మధ్య ఆత్మబోధను గూర్చిన సంవాదం ఇందులో ఉన్నది. నారదుడు నాలుగువేదాలు, ఉపవేదాంగాలు, మిగిలిన అన్ని ఆధ్యాత్మిక భౌతిక శాస్త్రాలు అధ్యయనం చేశాడు. ఇంతవిజ్ఞానం వున్నా అతడిని శోకం, కామం, క్రోధం వదలలేదు అవి అప్పుడప్పుడు అతణ్ణి వికారాలలో పడవేస్తూండేవి. పూర్వులలో నిండిన ప్రాపంచికానుభవాలనుండి ఒక్కసారిగా విముక్తి పొందడానికి ఆత్మబోధ, ఆత్మానుభవం వినా మరోమార్గం లేదని అతడు గ్రహించాడు. తన అన్నలలో పెద్దవాడైన భగవాన్ సనత్కుమారుణ్ణి సమీపించాడు తరువాతి శ్లోకంలోని విషయం ఇది.

శ్లో॥ శాస్త్రాణ్యధీత్యాపి శుశోచ మోహా
న్మహర్షి రాత్మా ఽనవబోధహేతోః।
యదాత్మయాజీ హ్యాశుగాత్మతుష్టః
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 12

ప్రతి॥ మహర్షిః = నారదమహర్షి, ఆత్మా = ఆత్మను గూర్చి, అనవబోధ = తెలియని, హేతోః = కారణంవలన, శాస్త్రాణి = శాస్త్రాలను, అధీత్య + అపి = అధ్యయనంచేసికూడ, మోహాత్ = అజ్ఞానంతో, శుశోచ = దుఃఖించెను, యత్ = ఏ, ఆత్మయాజీ = ఆత్మజ్ఞాని, ఆశుక్ = వెంటనే, ఆత్మతుష్టః = ఆత్మానందాన్ని పొందినాడో, తం = అట్టి, విశ్వనాథం = శివుని, ప్రపద్యే = శరణుగోరితిని.

తాత్పర్యం

ఆధ్యాత్మిక, లౌకిక శాస్త్రాలన్నింటిని అధ్యయనం చేసి పూర్తిగా గ్రహించినప్పటికీ లౌకికజీవితంవల్ల కలిగే శోకమోహాలు ఆత్మజ్ఞానం లేనందున నారదుణ్ణి వదలలేదు. ఏ ఆత్మను ఆరాధించి అందులో రమించుతూ అనంతానందాన్ని పొందుతారో ఆ విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

వ్యాఖ్య

లౌకికమేకాని ఆధ్యాత్మికమేకాని శాస్త్రాధ్యయనం, విద్వత్తు, వివరించి వ్యాఖ్యానించే నేర్పు—ఇవేవీ లోపల ఆత్మజ్ఞానం లేకపోతే పరిపూర్ణం కావు. చివరికి అవి శోకమోహాలలోనే అంతమొంది అతణ్ణి జనన మరణాల విషమ వలయంలో పడవేస్తాయి.

రానున్న మూడు శ్లోకాలలో భగవాన్ సనత్కుమారుడు నారదఋషికి బ్రహ్మోపాసనను నేర్పి ఒక్కొక్క అంశంపైన ఎలా ధ్యానించాలో చెప్పిన విధానం వివరింపబడుతుంది.

శ్లో॥ యద్బ్రహ్మబుద్ధ్యాహ్వయవాఙ్మనాంసి
సంకల్పచిత్తే చ విచింతయన్తి।
ధ్యానం చ విజ్ఞాన మథో బలం చ
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 13

ప్రతి॥ యత్ + బ్రహ్మబుద్ధ్యా = ఏ బ్రహ్మజ్ఞానంచేత, ఆహ్వాయ + వాక్ + మనాంసి = పేరు, వాక్కు, మనస్సులను, సంకల్పచిత్తే + చ = సంకల్పమును, చిత్తమును, ధ్యానం + చ = ధ్యానాన్ని, విజ్ఞానం = విజ్ఞానం, అథ = ఇంకా, బలంచ = బలమును, విచితయంతీ = ధ్యానింపబడుచున్నవో, తం = ఆ——

తాత్పర్యం

పరబ్రహ్మ బుద్ధిద్వారా 1) పేర్లు, 2) వాక్కు, 3) మనస్సు, 4) సంకల్పం, 5) చిత్తం, 6) ధ్యానం, 7) విజ్ఞానం, 8) బలం—ఈవనిమిదీ ఒకదానికొకటి ఎక్కువ ప్రశస్తమైనవిగా ధ్యానించాలి. ఆ పరబ్రహ్మమైన విశ్వనాథుణ్ణి నేను శరణు పొందుతాను.

## వ్యాఖ్య

ఛాందోగ్యం ఏడో అధ్యాయంలో 26 ఖండాలద్వారా సనత్కుమార భగవానుడు నారదునికి చేసిన బ్రహ్మవిద్యాబోధ చాలా స్పష్టంగా ఉంటుంది. ఉదాత్తమైన ఈ బోధను స్వామితపోవనం 13–18 వరకూ వున్న ఆరుశ్లోకాలలో సంక్షిప్తపరచారు. ఆత్మవిద్యకోసం సనత్కుమారుణ్ణి నా ర దు డు ఎలా సమీపించాడో వెనకాలశ్లోకం చెప్పింది. అతడు బ్రహ్మవిద్యోపదేశాన్ని ఎలా పొందాడో ఈ శ్లోకం చెబుతుంది.

నారదుడు సనత్కుమారుణ్ణి సమీపించినప్పుడు, సనత్కుమారుడు అతణ్ణి అంతవరకు ఏమి నేర్చుకున్నాడో, అభ్యసించారో వివరాలు అడిగారు. నారదుడు తాను నేర్చుకున్న అద్భుతమైన విద్యల జాబితాను ఇచ్చాడు. వేదాలలో ప్రారంభమైన ఈ జాబితా నృత్య గాన చిత్రలేఖనాలతో పూర్తి అవు తుంది. సనత్కుమారుడు నారదుడితో అవన్నీ శుష్కమైన నామమాత్రమైన విద్యలే అని తెలిపాడు.

వాటికంటే ఎక్కువైనది, పవిత్రమైనది ఏమైన ఉన్నదా అని నారదుడు ప్రశ్నించాడు. సనత్కుమారుడు నామాల కన్న వాక్కు ఎక్కువ అని సూచించారు. అంటే అన్ని భాషలకన్న వాటికి కారణమైనది ఎక్కువ. అన్ని విద్యలపేర్లు మాటలేగా? అందుచేత నామాలకన్న పలికే వాక్కు ఎక్కువ. భాషలోని అచ్చులు, హల్లులు కలిసి నామాలు అవుతాయి. వాక్కునుండి అవి వెల్వడుతాయి. అందుచేత వాక్కు ఎక్కువ. ఇలాగే వాక్కుకన్న మనస్సు ఎక్కువ. మనస్సులో ఏదో అనుకోకుండా వాక్కు బయటకిరాదు.

సంకల్పం లేకుండా మనస్సులో ఆలోచన రాదు. అందుచేత సంకల్పం మనస్సుకన్న ఎక్కువ.

ఒకవిషయాన్ని సంకల్పించడానికిగాను త్రికాలాలలో దాని ప్రయోజనం ఏమాత్రం ఉంటుందో విచక్షణతో పరిశీలించాలి. లేకపోతే సంకల్పం ఏర్పడదు. అందువల్ల విచక్షణతో కూడిన చిత్తం లేదా బుద్ధి ఎక్కువైనది.

ఒకే తీరులో అన్నింటిని గురించి యోచించి అంచనాలు కట్టితేగాని సరైన విచక్షణ కాదు. దీనినే ధ్యానం అన్నారు. చిత్తంకన్న ధ్యానం ఎక్కువ.

వేరువేరు శాస్త్రాలలో ఉన్న అభ్యాసక్రమాన్ని పాటించి తెలుసుకోవాలి. లేకపోతే ధ్యానం కుదరదు అందుచేత ధ్యానం కన్న విజ్ఞానం ఎక్కువ.

దీనికంతటికీ కావలసింది మనోదార్ఢ్యం. అబలమే లేకపోతే ఏదీ సాధించలేము అందువల్ల విజ్ఞానంకన్న బలంఎక్కువ.

సనత్కుమారుడు నారదుడికి వ్యక్తిలో ఉండే ఈ లక్షణా లన్నింటినీ పరమాత్మ వ్యక్తస్వరూపాలక్రింద ధ్యానించాలని బోధించాడు. ఆయనే సౌమ్య కాశీశుడు. ఆయనను నేను శరణు పొందుతాను. (ఛాందోగ్య 7. 1–3)

శ్లో॥ అన్నం చ పాథోగ్ని మనంతకం చ
స్మృతిం తథాశా మథ సూత్రదేవమ్।
బ్రహ్మేతి యత్సుష్ఠు విదంతి సంతః
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 14

ప్రతి॥ సంతః = సత్పురుషులు, ఏ = ఏబ్రహ్మతత్త్వమును, అన్నం + చ = అన్నముగను, పాథస్ + అగ్నిం = నీరుగ, అగ్నిగ, అనంతకం + చ = ఆకాశముగను, స్మృతిం = స్మరణగ, తథా = అట్లే, ఆశాం = కోరికగ అథ = మఱియు, సూత్రదేవం = ప్రాణశక్తిగ, బ్రహ్మ + ఇతి = , పరబ్రహ్మగ, సుష్ఠు = బాగుగా, విదంతి = తెలుసుకొనుచున్నారో, తం–

## తాత్పర్యం

ఆత్మజిజ్ఞాసువు 1) అన్నము, 2) నీరు, 3) అగ్ని, 4) ఆకాశము, 5) స్మృతి, 6) ఆశ, 7) ప్రాణము — ఇవి ఒకదానికన్న ఒకటి ఎక్కువ ప్రశస్తమైనవిగా ధ్యానించాలి. అ పరమాత్మ విశ్వనాథుణ్ణి నేను శరణువేడుతాను.

## వ్యాఖ్య

బోధను కొనసాగిస్తూ సనత్కుమారుడు నారదుడికి అన్నం, నీరు, అగ్ని, ఆకాశము, స్మృతి, కామము, ప్రాణము – ఒకదానికన్న ఒకటి ఎక్కువైన పరబ్రహ్మస్వరూపాలుగా ధ్యానించమని బోధించాడు. ఏ ప్రకారంగా అవి ఒకదానికన్న ఒకటి ఎక్కువ?

వెనుకశ్లోకంలో బలం ఆశ్లోకంలో చెప్పబడిన ఎనిమిదింటిలోను శ్రేష్ఠమని తెలుపబడింది అన్నంవల్లనే మనస్సుకి బలంవస్తుంది. జీర్ణమైన అన్నంలో సూక్ష్మమైన భాగం మనస్సుకు బలాన్ని ఇస్తుంది. పదిరోజులు ఉపవాసం చేశామా, మనస్సుయొక్క శక్తి యావత్తు ఉడిగిపోతుంది.

మనం తినే అన్నం వర్షంవల్ల లభిస్తుంది. అందువల్ల అన్నంకన్న నీరు ఎక్కువ.

వేడి, విద్యుత్తులవల్ల వర్షాలు కలుగుతాయి. అందుచేత నీటికన్న అగ్ని ఎక్కువ.

ఆకాశంలోనే సూర్యచంద్రాగ్నులు, భూమిపైన వున్న కాంతులు నిలిచి వున్నాయి. అందుచేత అగ్నికి కారణమైన ఆకాశం అగ్నికన్న ఎక్కువ.

ఆకాశం, అందులోవున్న వస్తువులు మన ఎరుకలోకి వచ్చినప్పుడే అవి ఉన్నట్లు. గ్రుడ్డివానికి కాంతి లేనట్లు, ఎరుకలేని వానికి ఆకాశం లేదు. అందుచేత స్మృతి, లేదా తెలివి ఆకాశంకన్న ఎక్కువ.

ఏవిషయాన్నైనా మనం కోరుకున్నపుడే తెలుసుకొంటాము. అందువల్ల తెలివికి మూలం ఆశ. అది తెలివికన్న ఎక్కువైనది.

మనస్సులో ప్రాణశక్తి ఉండి దానిని కదిలించినప్పుడే కోరిక అనేది కలుగుతుంది. చక్రనాభికి చక్రంయొక్క ఆకులన్నింటిని గ్రుచ్చి వుంచినట్లు ప్రాణం ఉన్నప్పుడే పైవి అన్నీ సచేతనమై కదులుతాయి. అందుచేత ప్రాణం అన్నింటికన్న శ్రేష్ఠమైనది ఇవి అన్నీ పరబ్రహ్మ స్వరూపాలుగా ధ్యానింపబడాలి. ఆ పరబ్రహ్మమే విశ్వనాథుడు!

ఈశ్లోకం ఛాందోగ్యం 7వ అధ్యాయంలో 15వ ఖండం వరకు ఉన్న భావాలను క్లుప్తంగా వివరించింది. ఈప్రాణశక్తికి మూలం పరమాత్మ. ఆయనను ఛాందోగ్యంలో "భూమా" అన్నారు అంటే అతిమహిమాన్వితమైన బ్రహ్మము అన్నమాట అతిప్రశస్తమైన ఈబ్రహ్మమును తెలుసుకున్నప్పుడే తక్కినవన్నీ తెలియబడుతాయి. అలా తెలుసుకున్నవాడు సర్వజ్ఞుడౌతాడు. ఈ శ్రేష్ఠమైన పరబ్రహ్మమును బోధించడానికిగాను సనత్కుమారుడు కార్య కారణ సిద్ధాంతాన్ని ఉపయోగిస్తున్నాడు.

శ్లో॥ సత్యస్య విజ్ఞాన మథాఽస్య తర్కః
శ్రద్ధాస్య నిష్ఠాఽథ చ హేతు రస్యాం।
తస్యాః క్రియా యత్ సుఖమేవ తస్యాః
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 15

ప్రతి॥ యత్ = ఏబ్రహ్మజ్ఞానము, సత్యస్య = సత్యముయొక్క, విజ్ఞానం = అనుభవజ్ఞానమో, అథ = మరియు, అస్య = అవిజ్ఞానంయొక్క, తర్కః = తార్కికనిర్ణయమో, అస్య = దానియొక్క, శ్రద్ధా = శ్రద్ధయో, అథ = మరియు, అస్యాః = అశ్రద్ధయొక్క, హేతుః = కారణమైన, నిష్ఠా + చ = నిష్ఠయో, త్యాగమో, తస్యాః = ఆ అంకితభావముయొక్క, క్రియా = ఏకాగ్రతయో, తస్యాః = ఆ ఏకాగ్రతయొక్క, సుఖం + ఏవ = సుఖమో, తం— —

## తాత్పర్యం

మహిమాన్వితమైన శక్తివంతమైన ఈ బ్రహ్మమును సరిగా తెలుసుకోడానికి, విశదీకరించడానికి అనుభవంతో కూడిన విశేషజ్ఞానం అంటే విజ్ఞానం కావాలి. పరమసత్యాన్ని గురించిన తర్కసహాయంతో మననం చేసినప్పుడే విజ్ఞానం కలుగుతుంది. సత్యాన్నిగురించి తర్కబద్ధంగా యోచించడానికి గురువాక్యాలలో, శాస్త్రాలలో శ్రద్ధవుండాలి. గురువును భక్తిప్రపత్తులతో ప్రేమతో సేవించినప్పుడే శ్రద్ధ ఏర్పడుతుంది. ఇలా సేవించడానికి ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము, 'క్రియ' — ఉండాలి. ఇలాంటి క్రియను చేయగలగడానికి

నిత్యము, అవ్యయము అయిన ఆత్మానందాన్ని అందుకోవాలనే ప్రబలమైన తీవ్రమైన కాంక్ష ఉండాలి, లేకపోతే సాధ్యపడదు. ఆ ఆత్మ విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

సృష్టికర్త బ్రహ్మదేవునివద్దనుండి అల్పమైన తృణంవరకు వున్న నామరూపా లన్నింటికీ కారణమై అన్నిప్రాణులలోని ప్రాణంగా వ్యక్తమయ్యే మహిమాన్విత పరమాత్మనుగురించి నారదుడికి బోధించాక సనత్కుమారుడు ఈబోధను చేయడానికి స్వానుభవం ఉన్న మహాత్ముడే అర్హుడని ప్రకటించాడు. ఈసత్యాన్ని కేవలం బుద్ధితో అర్థంచేసుకొంటే చాలదు.

ఆ అనుభవం ఎలా కలుగుతుందో పైశ్లోకం వివరిస్తుంది. ఒక క్రమ ప్రకారం ఆధ్యాత్మిక సాధనను చేసినప్పుడే ఆ మహదనుభవం కలుగుతుంది. తనకు ఆత్మానుభవం కావాలని నారదుడు అన్నప్పుడు భగవాన్ సనత్కుమారుడు కార్యకారణపద్ధతిని అనుసరించి అవలంబించవలసిన సాధనాక్రమాన్ని వివరించాడు.

మొట్టమొదటగా సాధకుడిలో ప్రాపంచిక దుఃఖాలనుండి విడుదల పొందాలనే తీవ్ర ముముక్షుత్వం ఉండాలి. పరమసత్యం కోసం అంత తీవ్ర కాంక్ష ఉన్నప్పుడు ఇంద్రియమహానిగ్రహాలు, ఏకాగ్రత వాటంతట అవే వస్తాయి. ఇలా స్వాశిక్షితుడైన జిజ్ఞాసువు ఆత్మవిద్యాగురువును భక్తిప్రపత్తులతో సేవిస్తాడు. గురుసేవద్వారా గురుబోధలో, శాస్త్రాలలో చెదరని విశ్వాసాన్ని పొందుతాడు. ఒకసారి జిజ్ఞాసువులో ఈ శ్రద్ధ కుదిరిందా, తార్కికచింతనా, ధ్యానమగ్నమైన మననము సునాయాసంగా కుదురుతాయి. ఈ మననపూర్వక ధ్యానం నిరంతరం కొనసాగుతూ గాఢమౌతూండగా, ఆనందకరమైన ఆత్మానుభవం కలుగుతుంది. ఆత్మానుభవంలో ఆత్మయొక్క ఆనందస్వభావం తెలిసి దానిని వివరించే నేర్పు ఏర్పడుతుంది. ఆ పరమాత్మే సౌమ్య కాశీశుడైన విశ్వనాథప్రభువు ఆయనను నేను శరణుపొందుతాను. (ఛాందోగ్య 7.16—25)

ఆంతరంగికమైన ఆత్మానుభవంయొక్క రూపం తరువాతి శ్లోక వర్ణించు తుంది. నా ర దు డు ఈ అనుభవంకోసం ఉవ్విళ్ళూరేట్లు చేయడంకోసం సనత్కుమారుడు దీనిని వర్ణిస్తున్నాడు.

శ్లో॥ సుఖం తు భూమా న హి సౌఖ్యమల్పే
యస్మిన్నదృగ్దృశ్య విభక్తిలేశః।
యో వై మహిమ్ని ప్రతితిష్ఠతి స్వే
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 16

ప్రతి॥ భూమా సుఖంతు = పారమార్థికసుఖమో, సౌఖ్యం = సుఖదాయకము, న + హి — కాదా, యస్మిన్ = ఏ, అల్పే = అల్పమయిన భౌతికసుఖమందు, అదృక్ + దృశ్య + విభక్తిలేశః = దృశ్యాదృశ్యమైన అధారలేశ మయినాలేకుండ, యః = ఎవడు, స్వే = తనదైన, మహిమ్ని = మహిమ యందు, ప్రతితిష్ఠతి = నిలకడగా ఉన్నాడో, తం———

## తాత్పర్యం

సర్వశక్తిమంతుడైన పరమాత్మస్వభావం ఎనలేని ఆనందం అల్పమైన క్షణికమైన సౌఖ్యంకాదు. ఆయునలో దృక్దృశ్య విభేదాలు లేవు. అది తన పరమపదస్థానంలో అద్వితీయమై, స్వతంత్రమై నిరాధారంగా నిలిచివుంటుంది. ఆ విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

ఒకే సత్యాన్ని వివరించినా చెప్పే పద్ధతిలో, వ్యక్తీకరించే విధానంలో ఒకమహాత్మునికి మరో మహాత్మునికీ మధ్య ఎంతో తేడా ఉంటుంది. ఉపనిషత్తులు—భగవద్గీతలద్వారా ఇది స్పష్టంగా తెలుస్తుంది. ఇక్కడ సద్గురు సనత్కుమారుడు పరమాత్మను "భూమా" అన్నాడు. "భూమా" అంటే పెద్దదని, అతులమైనదని, శక్తిమంతమైనదనీ అనేకార్థాలు వున్నాయి. బ్రహ్మము అన్నిమాటలకు వర్ణనలకు అతీతం అయినా సాధకులు ధ్యానించుకోడానికి వీలుగా ఏదో ఒక విధమైన అనువైన సూచనను—గురువు ఇవ్వాలి. లేకపోతే శిష్యులకు పట్టుచిక్కదు.

తెలియని వస్తువును తెలిసిన వాటిద్వారా తెలియజెప్పడం శాస్త్రవిధానం నారదుడికి ప్రాపంచికమైన సుఖాలు, ఆనందాలు బాగా తెలుసును. అందువల్ల "భూమా"ను అనుభవంగా తెలుసుకొనడంవలన కలిగే ఆనందం ప్రపంచంలో నారదు డనుభవించిన అన్ని సుఖాలకన్న మిన్న అయినదని సనత్కుమారుడు బోధించాడు. ప్రాపంచికసుఖాలు అత్యల్పమైనవి,క్షణికమైనవి బ్రహ్మానందంతో పోల్చితే ఎంతో హీనంగా అగపడుతాయి, అలాంటి ఆత్మానుభవం వున్న మహాత్మునికి జీవితంలో ఎంత నిండైన సంతృప్తి ఉంటుందంటే అయనను జీవితంలో వెదుక్కోవలసింది కాని, కోరవలసింది కాని మిగలదు.

ఈ ప్రపంచంలో ద్రష్టకన్న దృశ్యాలు, భావుకుడికన్న భావాలు, తలిచే వాడికన్న తలపులు భిన్నంగా గోచరిస్తాయి. "భూమా" అనుభవమైనప్పుడు ప్రపంచ బాహుళ్యానికి చెందిన అన్ని ఊహలు, దృగ్దృశ్యాలు, భావుక భావనలు, యోచిక – యోచనలు మటుమాయం అవుతాయి. విషయ–ఉద్రేక –తలపుల ప్రపంచం నిరంతరం మార్పులతో కూడినందున ఎప్పుడూ నశించు తూనే వుంటుంది. పరబ్రహ్మము ఒకడే నిత్యసత్యము, జననమరణ రహితము.

శిష్యుడైన నారదుడికి మరో సంశయం వున్నది. "భూమా" దేని ఆధారంగా నిలిచివున్నది? నామ రూపజగత్తువలె కాక పరబ్రహ్మ తన మహిమలోనే తాను నిలిచి పూర్ణంగా, స్వస్వతంత్రంగా, ఏకసత్యంగా నిలిచి వుంటుందని సనత్కుమారుడు స్పష్టం చేశాడు. ఈ దృశ్యప్రపంచానికి అది ఒక్కటే ఆధారం. ఆ పరబ్రహ్మమే విశ్వనాథుడు. నాకు సర్వాశ్రయమైన ప్రభువు!

ఉపనిషత్తులోని ఈ మహోత్కృష్టభావాన్ని శ్రీ గురుమహారాజు ఎంతో సుందరంగా భావగర్భితమైన ఈశ్లోకంలో ఇమిడ్చారు. (ఛాందోగ్య 7. 23–24)

నారదుడిలో ఆత్మజిజ్ఞాసను పెంచడానికిగాను పరబ్రహ్మమును గురించి ఇంత వివరంగా సనత్కుమారుడు బోధించాడు. "భూమా" వర్ణన తరువాతి శ్లోకంలోకూడ వస్తుంది.

శ్లో॥ స్వాత్మా చ భూమా పురతశ్చ పశ్చాత్
యస్మాత్ సముద్భూత మశేషవిశ్వమ్।
స్వారాజ్యవాన్ క్రీడతి యద్విజానన్
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 17

ప్రతి॥ పురతః = ముందు, ఆత్మా = ఆత్మ, భూమా = పరమమైనదో, పశ్చాత్ = తర్వాత, యస్మాత్ = ఏ పారమార్థికమైన ఆత్మనుండి, అశేషవిశ్వం = సమస్తవిశ్వము, సముద్భూత్ = పుట్టెను, యత్ = దేనిని, విజానన్ = తెలిసి, స్వారాజ్యవాన్ = మోక్షసామ్రాజ్యాధీశుడు, క్రీడతి = విహరించునో——

## తాత్పర్యం

స్వాత్మఅయిన "భూమా" ముందు, వెనక, సర్వవ్యాపకుడుగా వున్నాడు ఆయననుండి అశేషంగా వుండే ఈనామరూపజగత్తు ఉదయించింది. ఈ 'భూమా'ను ఇలా తెలుసుకొని, గ్రహించి, దర్శించినవారు ఏబంధనాలూ లేక పూర్తిగా స్వతంత్రులై జీవితాన్ని ఒకక్రీడగా ఎంచి జీవిస్తారు. ఆ భూమా విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

పరమాత్మ సర్వవ్యాపకుడు. దశదిశలా వ్యాపించివున్నాడు. ఈ విశాల ప్రపంచంలోపలా పైనాకూడా ఉన్నాడు. నామరూపజగత్తు ఆయనలో జనించి, ఆయన ఆధారంగా నిలిచి, ఆయనలో లీనమవుతుంది దీనిని తెలుసుకొన్న మహాత్ముడు జీవించి ఉండగానే ముక్తుడవుతాడు. నిత్యానందంతో ఆత్మరతితో, ఆత్మక్రీడ గావించుతూ తన ఇచ్ఛవచ్చిన రూపాన్ని ధరించుతూ జీవిస్తాడు. (ఛాందోగ్య 7. 25)

కేవలం బుద్ధియొక్క తెలివివల్ల చేసే వాదాలద్వారా కాని, శాస్త్రాధ్యాయనంవల్ల కాని, దీక్షలేకుండా చేసే ఆధ్యాత్మికాభ్యాసాలవల్ల కాని ఆత్మజ్ఞానం లభించదు. మానవజన్మకు చరితార్థతని సమకూర్చే అంతిమలక్ష్యానికి

దగ్గిర దోవలు. అడ్డదార్లు లేవని శ్రీ గురుదేవులు ఖచ్చితంగా ప్రకటిస్తున్నారు. దీక్షతో, ఏకాగ్రచిత్తంలో, ఏకలక్ష్యంలో చేసే మానవ ప్రయత్నాలు మాత్రమే దానిని సాధించగలవు. ఈసందర్భాలు అతిముఖ్యమైనవి, తప్పని సరిగా చేయవలసినవి అయిన సాధనలు రాబోయే శ్లోకంలో ఇవ్వబడు తున్నాయి.

శ్లో॥ ఆహారశుద్ధే ఖలు సత్త్వశుద్ధిః
తస్యాంశ్చ భూమాత్మని నిశ్చలా ధీః।
యస్మిం స్తతశ్చాఽఖిలపాశమోక్షః
తం విశ్వనాథం శరణం ప్రపద్యే॥ 18

ప్రతి॥ ఆహారశుద్ధౌ = ఆహారనియమమందు, సత్త్వశుద్ధిః + ఖలు = సాత్త్విక శుద్ధికలుగునుగదా, తస్యాం = ఆ, భూమా + ఆత్మని + చ = పరమాత్మ యందు, నిశ్చలా + ధీః = ఏకాగ్రబుద్ధి, తతః = తర్వాత, యస్మిన్ = ఏపరమాత్మయందు, అఖిలపాశమోక్షః + చ = సర్వబంధాలనుండి విముక్తి కలుగునో, తం = ఆ, విశ్వనాథం = శివుని, శరణం = రక్షకునిగా ప్రపద్యే = పొందుచున్నాను.

## తాత్పర్యం

ఆహరశుద్ధితో సత్త్వశుద్ధి, సత్త్వశుద్ధితో భూమాలో నిశ్చలమైనధ్యానం, దానివల్ల అన్ని పాశాలనుండి మోక్షము కలుగుతాయి. భూమాఅయిన ఆ విశ్వనాథుణ్ణి నేను శరణు వేడుతాను.

## వ్యాఖ్య

మానవుడు తినే ఆహారంపైన అతడి మన స్తత్త్వం ఆధారపడివుంటుందని ఇదివరకే తెలుసుకున్నాము — మనం స్వీకరించే ఆహారంలోని ఉత్తమోత్తమ సారం ఆలోచనలక్రింద వ్యక్తమై మనసు ఏర్పడుతుంది. ఆహారం రాజసిక మైనది, తామసికమైనది అయితే మనస్స్వభావం అశాంతితోనో, అజ్ఞానంతోనో

నిండివుండక తప్పదు. సాత్త్వికమైన ఆహారాన్ని స్వీకరించినప్పుడు మన ఆలోచనలు ఉదాత్తమైనవి, ఉదారమైనవి, అధ్యాత్మిక పరమైనవి అవుతాయి. మనస్సు శుద్ధమై శాంతపడుతుంది సాత్త్వికమైన మనస్సుద్వారానే శుద్ధాత్మను గూర్చిన ధ్యానం సఫలమౌతుంది.

ఆహారమన్నప్పుడు శ్రీ గురుదేవులు కేవలం నోటితో స్వీకరించే స్థూలాహారాన్నే ఉద్దేశించడం లేదు. పంచేంద్రియాలద్వారా మనం స్వీకరించే అన్ని అనుభవాలూ ప్రేరణలూ ఆహారమే! సాధకుడు తన ఇంద్రియాలకు సాత్త్వికమైన ప్రేరణలు కలిగేట్లు చూచుకోవాలని గురుదేవుల హెచ్చరిక. ఇంద్రియాలద్వారా మనస్సుకు వచ్చిన అన్ని ప్రేరణలు సాత్త్వికమైనవి అయినప్పుడు మనోబుద్ధులు శుద్ధంగా నిశ్చలంగా ఉంటాయి. కామ రాగ ద్వేషాలనే విచ్ఛిన్నకర శక్తులు శుద్ధాంతరంగంలో ఉండవు ఈవినాశకరశక్తుల్ని వేదాంతపరిభాషలో "హృదయగ్రంథు" లంటారు. ఈగ్రంథులనే ముడులు తెగిపోగానే సాధకుడు అన్ని బంధనాలనుంచి విముక్తుడౌతాడు. 'పాశ' మను పదంలో ఈమూడు అజ్ఞానగ్రంథులు సూచింపబడ్డాయి. ఆత్మను ప్రతిబింబించే మనోబుద్ధిపరికరం అన్ని మాలిన్యాలనుండి విడివడి, ప్రతిబింబాన్ని పూర్ణంగా, సమగ్రంగా చూపిస్తుంది. (ఛాందోగ్య 7. 26)

తరువాతి శ్లోకంనుండి ఛాందోగ్యం 8వ అధ్యాయంలోని భావాలు సంక్షేపించబడుతాయి. ఇప్పటివరకు దేశకాలాల నధిగమించే పరబ్రహ్మం యొక్క అనంతాద్వితీయ స్వభావమే వర్ణింపబడింది. ఈ ఉపాసనలు ఎంతో పరిపక్వదశలో ఉన్న ఉత్తమశ్రేణిసాధకుడికే పనికివస్తాయి నారదుని వంటి సాధకుడికే అది సాధ్యపడుతుంది. అందుచేత ఋషి తన అత్యున్నత స్థాయి నుండి దిగివచ్చి మందబుద్ధులైన సామాన్యసాధకులకోసం సగుణ బ్రహ్మో పాసనను ఇప్పుడు బోధిస్తారు. సత్యసంకల్పంలో సత్యకామంతో హృదయ పద్మంలో ధ్యానంచేసే విధానాన్ని రాబోయేశ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ బ్రహ్మాలయే దహరసద్మని పద్మతుల్యే
యద్బ్రహ్మ ఖాదపి మహత్తర మంతరాస్తే।
నాంహో నతత్పృట్ క్షుత్ జరశ్చ విమృత్యుశోకః
సత్యేచ్ఛ సత్యకలనశ్చ గతి స్స శంభుః॥ 19

ప్రతి॥ పద్మతుల్యే = సహస్రారపద్మసమానమైన, బ్రహ్మాలయే = పరబ్రహ్మమందు, దహరసద్మని = దహరాకాశమందు. యత్ = ఏ, బ్రహ్మ = బ్రహ్మము, ఖాత్ + అపి = ఆకాశముకంటె, మహత్తరం = ఎక్కువ, అంతర = మధ్యలో, ఆస్తే = ఉన్నాడో, నాంహః = పాపరహితుడు, నతృట్, క్షుత్ జరః + చ = తృష్ణ, ఆకలి, ముదిమిలేనివాడు, విమృత్యుశోకః = చావు, దుఃఖమునులేనివాడు, సత్య + ఇచ్ఛా సత్యకలనః + చ = సత్యసంకల్పుడు, సత్యసంధుడు, అయిన, సః + శంభుః = శివుడు, గతిః = దిక్కు

## తాత్పర్యం

హృదయాకాశ భవనంలో బ్రహ్మాలయంలో పద్మమువంటి హృదయంలో మహాకాశంకన్న విశాలమై, పాపము, ఆకలి, వృద్ధాప్యంలేక మరణశోక రహితమైన ఏ బ్రహ్మమును సత్యవంతుడై సత్యసంకల్పుడైన సాధకుడు పొందుతాడో ఆ శంభుడు నాకు గతియగుగాక!

## వ్యాఖ్య

**8**వ అధ్యాయంలోని **1—3** ఖండాల భావాలను శ్రీ గురుదేవులు ఈ శ్లోకంలో కుదించారు. విఖ్యాతమైన దహరావిద్యను ఈ శ్లోకం పేర్కొంటోంది. అవ్యయ నిర్గుణ నిరాకార పరమాత్మను ధ్యానించేపాటి శుద్ధహృదయం. ఏకాగ్రచిత్తం, పరిపూర్ణవైరాగ్యం—లేని సామాన్య సాధకులకోసం ఈ ఉపాసన విధించబడింది. సాధారణ దశలోని సాధకులు ఉత్తమోత్తమ సత్యాన్ని అందుకోడానికి సగుణరూపుడైన హృదయాధివాసుణ్ణి మనం ఎలా ధ్యానించాలో నిర్దేశింపబడింది.

అందరి అంతరాంతరాలలోను ఆధ్యాత్మిక హృదయం ఒక పద్మాకారంలో ఉన్నదని శ్రుతి చెబుతుంది. ఈ పద్మమే అతి సూక్ష్మమైనది. అందులో ఇంకా సూక్ష్మమైన ఆకాశం ఉన్నది. సాధకుడు ఈ ఆకాశంలో తన హృదయాధినాథుణ్ణి ధ్యానించాలి. 'అంత అల్పమైన సూక్ష్మవస్తువును గురించి ధ్యానించి

ఏమి ప్రయోజనం' అని సాధకుడు అనుకోవచ్చును. ఈ సంశయ నివారణ కోసం వెనువెంటనే శ్రుతి ఇలా ప్రకటిస్తుంది. — ఈసూక్ష్మస్థానంలోని ఆత్మ సూర్య చంద్ర తారాగణాలను, సముద్రాలు, నదులు, వాయువు—మున్నగువాని నన్నింటిని కలిగివున్న స్థూలమైన మహాకాశం కన్న విస్తృతమైనదని, ఎక్కువ శక్తిమంతమైనదని వివరిస్తుంది. భూతకాలంలో అనుభవమైనవి, ఇప్పుడు అనుభవమౌతున్నవి, భవిష్యత్తులో అనుభవానికి రాబోయేవి అన్నీ ఈహృదయాకాశంలో ఉన్నాయి. అది దేశకాలాలకు అతీతమైనది. ఇలా అంతర్యామి అయిన ప్రభువుయొక్క శక్తిని, మహిమను వర్ణించినప్పుడు సాధకుడిలో మరో అనుమానం లేవవచ్చును — 'ఇంతశక్తి, మహిమ కలిగిన ఆత్మ దేశకాలాలకి, ఆకలి దప్పులకి, జరామృత్యువులకు లోనుకాకుండా ఉంటుందా' అని. మళ్ళీ శ్రుతి విస్పష్టం చేస్తుంది—ఆయనశక్తి, మహిమ ఇలాంటి పరిమితులకు లోను కావు. ఈ హృదయాధివాసుణ్ణి ఆయన దివ్యలక్షణాలతో, మహిమ, శక్తియుతంగా సాధకుడు దర్శించగలిగినప్పుడు అతడి కామనలు, సంకల్పాలు అన్నీ నెరవేరుతాయి, అని కూడా శ్రుతి వాగ్దానం చేస్తుంది. ఆ శంభునాథుడే ఈ ప్రభువు. ఆయనకు నా ప్రణామాలు.

రోజూ రాత్రిళ్లు గాఢనిద్రలో ఉన్నప్పుడు మహిమాన్వితుడైన ఈ అంతర్యామి ప్రభువును మనం తెలుసుకుంటూనే వున్నాము. అయితే, మన దౌర్భాగ్యం! మన అజ్ఞానకారణంగా ఆయనను గుర్తించలేము, ఎరుగము. మానవుడి ఈ దయనీయస్థితిని తరువాతిశ్లోకం వర్ణించుతుంది.

శ్లో॥ యద్వత్ సువర్ణనిధి మూర్ధ్వచరా అపీ మే
యద్బ్రహ్మ హంత హృదిశం హ్యనృతాపిధానాః।
యన్త స్తథా వ్యహరహర్న లభన్త ఏతత్
లోకా స్సలోకనిలయోఽనుగతి స్స శంభుః॥ 20

ప్రతి॥ ఊర్ధ్వచరాః + అపి = నేలపైన నడచువారైనను, ఇమే = ఈఅజ్ఞానులు యత్ + సువర్ణనిధిం + వత్ = భూమిలోనున్న ఏసువర్ణనిధినివలె, అనృతా + పిధానాః = అసత్యముచే కప్పబడినవారు, హృదిశం =

హృదయంలో నిద్రించు, యత్ + బ్రహ్మ = ఏ బ్రహ్మను, (తెలిసికొనలేరో), హంత = అయ్యో! తథా + అపి = అయినప్పటికిని, యంతః = ఈ భూచరులయిన, లోకాః = సామాన్యప్రజను, ఏతత్ = ఈ బ్రహ్మతత్త్వమును, న + లభంతే = పొందలేరు, అహః + అహః = ప్రొద్దు! సులోకనిలయః = స్వర్గవాసియైన, సః + శంభుః = ఆ శివుడు, నాకు గతిః + అస్తు = శరణుగుగాక!

## తాత్పర్యం

భూమిపైన నడుస్తున్నవానికి భూమిలో ఉన్న సువర్ణనిధి, ఎలా గోచరించదో, పాపం గాఢనిద్రలో ఉన్నవానికి మహిమాన్వితమైన తన ఆత్మస్వరూపం గోచరం కాదు రోజురోజూ ఆత్మప్రభావం అడుగడుగునా వెల్లడిఅవుతున్నా అయ్యో! లోకంలో తన ప్రమేయాలవల్ల దానిని తెలుసుకోడానికి కూడా ఇచ్ఛగించడు. ఊర్ధ్వ అధో లోకాలన్నింటికి ఆధారమైన ఆ ప్రభావశాలి శంభుడు నాకు గతియగునుగాక!

## వ్యాఖ్య

ఛాందోగ్యం 8వ అధ్యాయంలోని 3వ ఖండభావాలు ఈశ్లోకంలో పొందుపరచబడి వున్నాయి. దినదినమూ గాఢనిద్రలో ఆత్మప్రభావం వ్యక్తమౌతున్నా తెలుసుకోలేని మానవుని మూర్ఖత ఇక్కడ నిరసింపబడుతోంది. దానితోపాటే సగుణోపాసనద్వారా అంతర్యామి అయిన ప్రభువును ఆరాధించి చేరుకునే సాధకుని గొప్పదనంకూడా ఈ అధ్యాయం శ్లాఘిస్తుంది. అలాంటి సాధకుణ్ణి ప్రశంసించడంతోబాటు ఉపనిషత్తు బ్రహ్మచర్యంయొక్క ప్రాముఖ్యతను కూడా నొక్కి చెబుతుంది. అన్ని ఉపాసనలకు మూలం బ్రహ్మచర్యం. రాబోయే శ్లోకంలో గురుదేవులు దీనిని వివరిస్తారు.

శ్లో. యస్సేతురేష జగతాం విధృతి ర్విభాత
శ్శశ్వన్న యత్ర దినరాత్రికథాప్రసంగః।
యోషావితృష్ణమతి రేవ న వాక్ప్రవీణో
యం ప్రాప్తు మర్హతి సదాస్తు గతి స్స శంభుః॥ 21

ప్రతి॥ యః = ఏ, విధృతిః = విధృతిరూపమును, విభాతః = ప్రకాశమానుడు నయిన, ఏషః = ఈ, జగతాం సేతుః = లోకాలకు సేతువువంటివాడు, శశ్వత్ = ఎల్లపుడు, దినరాత్రి = రేయింబవళ్ళు, కథాప్రసంగః = కథా స్వరూపుడో, నయోషావితృష్ణమతిః = స్త్రీవాంఛచేలభించడో, న + వాక్ప్ర వీణః = వాక్చాతుర్యమున కందడో, అట్టి, యం = ఏపరమశివుని, ప్రాప్తుం + పొందుటకు, అర్హతి = తగియున్నాడో, సః + శంభుః = ఆ శివుడు, సదా = ఎల్లప్పుడు, గతిః + అస్తు = శరణుగుగాక——

## తాత్పర్యం

తన వ్యక్తరూపంలో శంభుడు ఈసంసారాన్ని దాటడానికి శంభుడే వంతెనఅయి సహాయపడుతాడు. పరబ్రహ్మం నోటిమాటలద్వారా తెలియ బడడు. రేయింబవళ్ళు తన దివ్యమహిమతో వెలుగొందుతూ కామంచేతగాని స్త్రీని గురించిన ఆలోచనలచేతగాని కళంకితం గాని బ్రహ్మచర్యాభ్యాసంవల్లనే తెలుసుకోబడే శంభుడే నాకు గతియగును గాక!

## వ్యాఖ్య

ఛాందోగ్యం 8వ అధ్యాయంలోని 4, 5 ఖండాల భావాలు ఇందులో ఉదహరింపబడినాయి. ఊర్ధ్వ, అధో లోకాలన్నింటికి పరమాత్మ అధిష్ఠానమని వెనుకశ్లోకం వర్ణించింది. ఈశ్లోకం ఆయనను సంసారాన్ని దాటడానికి సహాయ పడే వంతెన అని వర్ణిస్తోంది. అంటే గమ్యము, గమనముకూడా ఆయనే. అలాగే ధ్యానించాలి. ఆయన సగుణోపాసనద్వారా అద్వితీయ నిర్గుణ సత్య స్వరూపాన్ని చేరుకోవాలి. ఆయనను దేశకాలాతీతమైన పరమ సత్యంగా ఉపాసించాలి. రాత్రింబవళ్లు, ఋతువుల మార్పులు, కాలపరిమాణాలు—వేటి వల్ల తాకబడడు. ఆయన త్రికాలాలలో ఒకేవిధంగా ఉంటాడు.

అంతర్యామి అయిన ప్రభువును చేరుకోడానికిగాను తప్పనిసరిగా చేయ వలసిన ఆధ్యాత్మికాభ్యాసం బ్రహ్మచర్యాన్ని గురించి గురుదేవులు నిష్కర్షగా చెబుతున్నారు. అస్ఖలిత బ్రహ్మచారులమని చెప్పుకుంటూ విషయభోగాలలో వర్తించే దొంగసన్యాసులను గురుదేవులు చూచివుండవచ్చును. సన్యాసాశ్రమా నికి కళంకం తీసుకొనివచ్చే కపటుల్ని డంబాచారుల్ని గురుదేవులు బయట

పెట్టుతున్నారు. తాము స్వయంగా బ్రహ్మస్వరూపులమే అని గొప్పలు చెప్పుకుంటూ, చాటుకొంటూ, తాము అనుభవించే విషయభోగాలు తమని అంటవని చాటుకొంటూంటారు. లోకాన్ని నమ్మిస్తున్నామని వారు అనుకో వచ్చును. తమ్ముతాము మాత్రం మోసగించుకుంటున్నారు.

అస్ఖలిత బ్రహ్మచర్యం ఖచ్చితంగా అస్ఖలితంగా ఉండవలసిందే అన్ని ఇంద్రియాలను నియమించే సంయమనం వుండాలి. సంభోగవాంఛగాని, ఆ విషయమై ఆలోచనాలేశంగాని మచ్చుకైనా ఉండరాదు. శుద్ధ జ్ఞానమార్గమైన నిర్గుణోపాసనకుగాని, భక్తిమార్గమైన సగుణోపాసనకుగాని బ్రహ్మచర్యం ప్రాథమిక సాధన. మొదటి మార్గంలో అది జ్ఞానాన్ని పెంచుతుంది. రెండో మార్గంలో మనోబుద్ధుల్ని శుద్ధంచేస్తుంది.

అంతర్యామి అయిన పరమాత్మను ఉపాసించే సగుణోపాసనను 'దహరావిద్య' అంటారు. ఈసాధకులు సుషుమ్న నాడిద్వారా ప్రయాణించి బ్రహ్మలోకాన్ని చేరుకుంటారు. ఈ విషయాన్ని రాబోయే శ్లోకం విశదపరుస్తుంది.

శ్లో॥ నీలశ్చ రక్తధవళాహ్నృదయశ్చ నాడ్యః
స్పృష్టా హి యత్ర ఘృణయో మిహిరస్య తాసు।
మూర్ధన్యయా రవిమతో ద్రుహిణం తతశ్చ
సంయాతి యద్దహరవిత్ స హరో గతి ర్మే॥ 22

ప్రతి॥ యత్ — ఏ, ద్దహరవిత్ = సగుణోపాసకుడు—, నీలాః = నీలవర్ణమును, రక్తధవళాః + చ = ఎఱుపు తెలుపును నయిన, హృదయస్య = హృదయముయొక్క, నాడ్యః = (సుషుమ్నా) నాడులు, యత్ర = = ఎచ్చట, స్పృష్టాః = పయనించునో, తాసు = ఆనాడులందు, మిహిరస్య = సూర్యునియొక్క, ఘృణయః = కిరణాలు,సంచరించున్నో— అతః = తరువాత, మూర్ధన్యయా = సుషుమ్నానాడినుండి, రవిం = సూర్యుని, అతః + చ = అక్కడనుండి, ద్రుహిణం = బ్రహ్మను, సంయాతి = చేరునో, సః + హరః = ఆ శంకరుడు, మే = నకు, గతిః = శరణము.

## తాత్పర్యం

సగుణబ్రహ్మమును అన్వేషించే సాధకుడు చనిపోయినప్పుడు సుషుమ్నా నాడిద్వారా నిష్క్రమించి సూర్యలోకాన్ని చేరుకుంటాడు. అక్కడ నుండి బ్రహ్మలోకానికి వెళ్లుతాడు. అక్కడ సృష్టికర్త ఉన్నంతకాలం నివసించి ప్రపంచప్రళయం సంభవించినప్పుడు బ్రహ్మదేవునితోపాటు పరమాత్మను చేరుకొని లీనమైపోతాడు ఆ పరమాత్మ అయిన హరుడు నాకు శరణ్యా మగును గాక!

## వ్యాఖ్య

స్వామీతపోవనం ఈశ్లోకంలో ఛాందోగ్యం 8వ అధ్యాయంలోని 6వ ఖండం యొక్క భావాలను ఇమిడ్చారు. స్థూలహృదయంనుండి శాఖలుగా వెడలే 101 సూక్ష్మనాడుల విషయం ప్రస్తావనకు వస్తుంది. అవి సూర్యరశ్మిలోని ఏడురంగులకు అనుగుణమైన వేర్వేరు రంగులను కలిగివుంటాయని శాస్త్రాలు వర్ణిస్తాయి. స్థూలహృదయంనుండి విస్తరించే ఈనాడులు దేహమంతటా ఆపాదమస్తకం వ్యాపించివుంటాయి. అవి సూర్యకిరణాలలోని తేజంతోకూడా నిండివుంటాయి. జాతీయరహదారులు గ్రామాలకు పట్టణాలకు సంబంధాలు ఏర్పరచినట్లుగా ఈనాడులు, సూర్యకిరణాలు పరస్పరం ముడిపడి వుంటాయి. గురుదేవులు హృదయంలోనుండి విస్తరించే నాడులు నీలం, ఎరుపు, తెలుపు రంగులలో వుంటాయని చెబుతున్నారు. వీటిలో ఒకటి హృదయంనుండి తలలో మాడువైపుకి వెళ్లుతుంది. దానిని సుషుమ్నానాడి అంటారు. ఇక్కడ నుండే సగుణోపాసన చేసిన సాధకుడు హిరణ్యగర్భుని లోకానికి వెళ్లుతాడు. ప్రపంచప్రళయం సంభవించినప్పుడు అతడు ఆత్మజ్ఞానియై అద్వితీయ పరమాత్మలో లీనమైపోతాడు. ఆ పరబ్రహమే సౌమ్య కాశీశుడైన హరుడు. ఆయన నాకు శాశ్వతమైన శరణ్యా మగునుగాక!

రాబోయే శ్లోకంలో 8వ అధ్యాయం 7వ ఖండంలోని భావాలు ఉన్నాయి. ఈ భావాలు ఉపనిషత్తులో ఆసక్తికరమైన కథరూపంలో ఉన్నాయి. ఒకసారి ప్రజాపతి ఆత్మను గురించి ఈవిధంగా ప్రకటించారు—ఆత్మ ధర్మాధర్మాలకు అతీతమైనది. జరామృత్యువులు లేనిది. దానిద్వారా అన్నికోరికలు నెరవేరు

తాయి, సర్వసంకల్పాలు సత్యమవుతాయి అందుచేత సర్వజీవుళ్ళు దానిని అన్వేషించి అందుకోవాలి. ఆత్మనుగురించి గురువువద్ద శ్రవణంచేసి అధ్యయనం చేసి అందుకుంటే అతడు అన్నిలోకాలను పొందగలడు, అన్ని కామాలను తీర్చుకోగలడు.

దేవాసురులు ఆమాట విన్నారు. దేవతలరాజు ఇంద్రుడూ, రాక్షసుల రాజు విరోచనుడు ఆత్మను పొందాలని నిర్ణయించుకున్నారు. ప్రత్యేకంగా బ్రహ్మనుకలిసి ఈ మహాసత్యాన్ని గురించి అడిగారు విరోచనుడికి తరువాత ఏమిజరిగిందో రానున్నశ్లోకం చెబుతుంది.

శ్లో॥ అక్షిస్థ ఏష పురుషః ఖలు దృశ్యతే యో
బ్రహ్మైత దేత దభయం హ్యసురః ప్రజేశాత్।
శ్రుత్వైవ మంబుగతబింబ మవేక్ష్య చాత్మ
యోదేహ ఇత్యధిజగామ గతి స్స శంభుః॥ 23

ప్రతిః యః = ఏ, అక్షిస్థః = కంటిలోనుండెడి, ఏషః = ఈ, పురుషః = పురుషుడు, దృశ్యతేఖలు = చూడబడుతున్నాడో, ఏతత్ = ఇది, అభయం = భయములేని. బ్రహ్మ + ఏవ = బ్రహ్మయేయని, అసురః = రాక్షసుడు, ప్రజేశాత్ = ప్రజాపతివలన, శ్రుత్వా = విని, ఏవం = అట్లే, అంబుగత = నీటియందున్న, బింబం = ప్రతిబింబాన్ని, అవేక్ష్య = చూచి, యః + దేహః = ఏ శరీరము, ఆత్మా + ఇతి = ఆత్మగా, అధిజగామ = తెలుసుకొనెనో, సః + శంభుః = ఆ శివుడే, గతిః = శరణము

## తాత్పర్యం

కంటిలో కనబడే పురుషుడే బ్రహ్మమని, అభయమైనదని బ్రహ్మ ద్వారా విరోచనుడు విని, నీటిలో ప్రతిబింబాన్ని చూచి దేహమే ఆత్మ అని ఎంచుకున్నాడు. ఇలా స్థూలశరీరంగా భావింపబడిన శంభుడు నాకు గతియగు గాక!

## వ్యాఖ్య

ఇంద్రుడు, విరోచనుడు ఇద్దరూ ప్రజాపతిని సమీపించి బ్రహ్మమును గురించి తెలుసుకో గోరినప్పుడు ఆయన వాళ్ళను ఆశ్రమంలో ముప్పైరెండు సంవత్సరాల కఠినబ్రహ్మచర్యాన్ని పాటించమని ఆదేశించాడు.

వాళ్లు అలాగే ఉండి తిరిగి ప్రజాపతిని సమీపించారు. అక్షిపురుషుడే బ్రహ్మమని ఆయన ఉపదేశించాడు. దానికి వివరణగా నీటిలో, అద్దంలో వలె ఆత్మ అంతటా ప్రతిఫలిస్తుందని కూడా చెప్పాడు.

ఈబోధను బాగా మననం చేసుకొన్న పిమ్మట ముందు ఇద్దరూ నీటిలో కనబడిన ప్రతిబింబమే ఆత్మఅని నిర్ణయించుకున్నారు. నీళ్లల్లోగాని, అద్దంలో గాని కనబడేది ప్రతిబింబమేగా? కన్ను చూచేది స్థూలశరీరంయొక్క ప్రతిబింబమే కాబట్టి స్థూలశరీరమే ఆత్మ అని—విరోచనుడు తుది నిర్ణయానికి వచ్చాడు. విరోచనుడు పూర్తిగా బాహ్యదృష్టి కలవాడు లోతైన మననంగాని యోచనగాని చేయగలిగిన స్వభావం కాదు గురుబోధను, పరమసత్యాన్ని గురించి ఇచ్చిన వివరణలను విమర్శనాత్మకంగా యోచించలేని, బాహ్యదృష్టితో ఉండే సాధకు లందరిగతే ఇంతే. తమ ఇంద్రియాలతో చూచేదే నిజ మనుకుంటారు. ఆధునిక భౌతికవాదు లందరూ విరోచనుడివంటి వారే—జిజ్ఞాస వున్నా గురువు చేసేబోధలలోని నిగూఢసత్యాన్ని గురించి విమర్శ మననం, చేసేందుకు తగిన బుద్ధి వైశారద్యంకాని, మనోనిర్మలత్వంగాని, నిస్సంగభావం కాని, ఉంచవు. ప్రజాపతి అక్షిపురుషుడని వర్ణించినప్పుడు జడ మైన నేత్రేంద్రియాన్నికాక, దర్శించే పురుషుణ్ణి ఉద్దేశించాడు. ఇంద్రియ మనోబుద్ధు లన్నింటిద్వారా దర్శించే వాడిని ప్రజాపతి నిర్దేశించాడు. సద్గురువు ప్రజాపతి నిర్దేశించినది కంటిలో ద్రష్టగా, చెవిలో శ్రోతగా, ముక్కులో ఘ్రాతగా, త్వక్కులో స్పర్శయితగా, జిహ్వలో రసయితగా, మనస్సులో భావుకుడుగా, బుద్ధిలో విచారశీలిగా—ఉండే ఆత్మనే. ఈ సందర్భంలో కేనోపనిషత్తులోని భావాలను గుర్తుచేసుకోవాలి.

ముందు దేవతలరాజు ఇంద్రుడుకూడా స్థూలశరీరమే ఆత్మ అను కున్నాడు. అయితే మననం చేసుకొని అనుమానం కలగగా బ్రహ్మదేవుని

వద్దకు తిరిగివచ్చి ఆయనప్రబోధంలో అనుమాన నివృత్తి చేసుకొన్నాడు. ఉపనిషత్తులోని కథప్రకారం ఇంద్రుడు మూడుపర్యాయాలు గురువువద్దకు తిరిగివచ్చాడు. మొత్తం నూటొక్క సంవత్సరాలు నైష్ఠిక బ్రహ్మచర్యాన్ని పాటించుతూ గడిపాడు. ఈ విషయాన్ని తరువాతి శ్లోకం వివరిస్తుంది.

ఇక్కడ గురుదేవులు ఛందస్సుని మార్చారు ఉపనిషత్తులోని మిగిలిన అన్ని భావాలను పొందుపరుస్తున్నారు.

శ్లో॥ శ్రుత్వా చాక్షుషపూరుషం గురుముఖా చ్ఛాయేతి జగ్రాహ యం
పశ్చా ద్దోష మవేక్ష్య మఘవాన్ శుశ్రావ యం స్వాప్నికం।
సౌప్తం చాప్రియవిత్తి మంధతమసం తత్రాపి పశ్యం స్తః
తుర్యబ్రహ్మతయాఽగ్రహీ ద్యమభయం దద్యాత్ స
కాశీపతిః॥ 24

ప్రతి॥ మఘవాన్ = ఇంద్రుడు, యం = ఏ, చాక్షుషపూరుషం = అక్షిస్థపురుషుని గురుముఖాత్ = గురూపదేశంచే, శ్రుత్వా = విని, ఛాయా + ఇతి = ప్రతిబింబమని, జగ్రాహ = తెలిసికొనెనో, తత్ర = అచ్చట, పశ్చాత్, = తర్వాత, దోషం = దోషమును, అవేక్ష్య = గుర్తించి, యం = ఏ, స్వాప్నికం = స్వప్నరూపపురుషుని గూర్చి, శుశ్రావ = వినెనో, అత్రాపి అచ్చటగూడ, అప్రియవిత్తిం = అప్రియముచే తెలిసిన, అంధతమసం — అంధకారాత్ముడునయిన, సౌప్తం = నిద్రించిన వానిని, పశ్యన్స్తః = = చూచినవాడై, యం = ఎవనిని, తుర్యబ్రహ్మతయా = మోక్షరూపునిగ అగ్రహీత్ = గ్రహించెనో, సః + కాశీపతిః = ఆశంకరుడు, అభయం = శరణును, దద్యాత్ = ఇచ్చుగాక!

## తాత్పర్యం

ఇంద్రుడు గురుముఖంగా చాక్షుషపురుషుణ్ణి గురించి విని ఛాయే ఆత్మ అనుకున్నాడు. తరువాత అందులోని దోషం తెలిసి స్వప్నపురుషుణ్ణి గురించి

విన్నాడు. తరువాత సుషుప్తిని గురించి తెలుసుకొని అదికూడా అంధతమస్సుతో కూడినదని తెలుసుకొని తురీయావస్థ బ్రహ్మమని తెలుసుకున్నాడు. ఆకాశపతి నాకు అభయ మిచ్చునుగాక!

<u>వ్యాఖ్య</u>

ఈశ్లోకంలో తన అప్రతిమానమైన శైలిలో గురుదేవులు 8వ అధ్యాయం లోని 9-12 ఖండాల భావాలనన్నింటినీ సంగ్రహపరిచారు శార్దూలవిక్రీడితమనే పేరుగల ఈవృత్తాన్ని వాడడం ఆయనకు సంస్కృతభాషలో ఉన్న అపార మైన పాండిత్యాన్నేకాక మూడుఖండాల భావాలను ఒక్కశ్లోకంలో ఇమిడ్చే నేర్పునుకూడా విశదీకరిస్తుంది.

దేవతల అధిపతి ఇంద్రుడు బ్రహ్మదేవునివద్దనుండి పరమసత్యాన్ని గురించిన బోధ పొందడానికి ఎంత సాధన చేయవలసివచ్చిందో వర్ణింప బడుతోంది.

రాక్షసరాజులాగే ఇంద్రుడుకూడా స్థూలశరీరంలో ప్రతిఫలించే ఆత్మ స్వరూపమే పరమసత్యంగా భావించినా, దేవలోకానికి తిరిగివెళ్లుతూ చేసిన మననంవల్ల అతడిలో అనేక సంశయాలు ఉద్భవించాయి. కంటిలోని పురుషుడైన ఆత్మ అమృతస్వరూపుడనీ, మార్పులు లేనివాడని, ఆనందస్వభావుడని బ్రహ్మదేవుడు చెప్పాడు. శరీరమైన ఆత్మకు ఆవర్ణనలు అతకవు. శరీరం మారుతుంది, నశిస్తుందికూడా. ఇందువల్ల తిరిగి బ్రహ్మదేవునివద్దకు వచ్చి సంశయ నివారణం కోరాడు మరొ ముప్పైరెండు సంవత్సరాలు కఠిన బ్రహ్మ చర్యంలో గడుపుమని బ్రహ్మదేవుడు ఆనతిచ్చాడు

సాధనాకాలం పూర్తి అయ్యాక ఇంద్రుడు గురువుని సమీపించాడు. ఈసారి బ్రహ్మదేవుడు కంటిలోని పురుషుడు కేవలం జాగ్రదవస్థలో మాత్రం కనబడేవాడు కాడని, స్వప్నావస్థలో స్వప్నాన్నికూడా చూస్తాడని అదే బ్రహ్మ మనీ బోధించాడు.

ఈ బోధతో సంతృప్తిపడి ఇంద్రుడు దేవలోకానికి ప్రయాణంకట్టాడు. అయితే త్రోవలో మననం చేసుకొంటువుండగా క్రొత్త అనుమానాలు వచ్చాయి.

జాగ్రదవస్థ కంటిలో చూచేవాడు మాత్రమే కాదని, స్వప్నావస్థలోకూడ బ్రహ్మము చూస్తాడని గురువుబోధ పగలున్న శారీరక బాధలేవీ రాత్రి కలలో తెలియ వన్నమాట నిజమే. అయితే కలలో స్వాప్నికుడు మరణించిన పుత్రులకోసం, బంధువులకోసం విలపిస్తాడు. పర్వతాల మీదనుండి తన్ను ఎవరో క్రిందకి తోసినట్లు కలవస్తే ఎంతో బాధపడతాడు ఆత్మ మరణానికి అతీతమని, ఆనంద రూపమని చెప్పినందున కలను చూచేవాడుకూడా ఆత్మ కాదు ఈ అనుమానంతో ఇంద్రుడు తిరిగి బ్రహ్మదేవుడి వద్దకువచ్చి సంశయ నివారణం చేయమని అడిగాడు. మళ్ళీ ముప్పైరెండు సంవత్సరాల కఠిన బ్రహ్మచర్యం అవలంబించుమని బ్రహ్మదేవుడు చెప్పాడు.

ఈ సాధనకూడా ముగించి ఇంద్రుడు గురువుని సమీపించాడు. ఈసారి బ్రహ్మదేవుడు ఆత్మ కంటిలోని ద్రష్ట, కలలోని స్వాప్నికుడు మాత్రమే కాదని, గాఢనిద్రని అనుభవించే వాడుకూడానని బోధించాడు.

దీనితో పూర్తి తృప్తిపొంది ఇంద్రుడు స్వర్గానికి ప్రయాణించాడు. అయితే మార్గంలోనే అతడి మనస్సును అనుమానాలు వేధించాయి. గాఢనిద్ర లోని పురుషుడు పూర్తి అజ్ఞానంలో మునిగివుంటాడు. నిద్రిస్తున్నానని కూడా ఎరగడు. దాదాపు మరణావస్థే అది. జరామరణాలకు అతీతము, సర్వజ్ఞము అని చెప్పబడిన ఆత్మ ఇది ఎలా అవుతుంది?—అనుమానాలు తీర్చుకోడంకోసం ఇంద్రుడు తిరిగి బ్రహ్మదేవుని సమీపించాడు. తన శిష్యుడు అంతదీక్షతో సాధనని కొనసాగిస్తున్నందుకు బ్రహ్మదేవుడు సంతోషించాడు. అతడిలో మిగిలి వున్న మాలిన్యాన్ని కడిగివేయడానికిగాను మరో అయిదు సంవత్సరాలు కఠిన బ్రహ్మచర్యాన్ని పాటించుమన్నాడు. అప్పటికిగాని పరమసత్యాన్ని గురించి బోధించి లాభంలేదు.

ఈచివరిసాధన అయినాక ఇంద్రుడు గురువుని సమీపించాడు. బ్రహ్మ విద్యను పొందడానికి పూర్తి అర్హతని పొందిన ఇంద్రుణ్ణి చూచి ప్రజాపతి చివరికి కంటిలోనిద్రష్ట, కలలోని స్వాప్నికుడు, గాఢనిద్రని అనుభవించే ఆత్మ తురీయమైన బ్రహ్మమనీ, మూడు అవస్థలకు సాక్షి అని చెప్పాడు.

ఆ పరమాత్మ సామ్బ కాశీశుడైన విశ్వనాధుడే. ఆయనకి నేను సర్వ సమర్పణం చేసుకుంటాను.

దేవతల అధిపతి ఇంద్రుడు నూటొక్క సంవత్సరాల తీవ్ర బ్రహ్మ చర్యంలో కూడిన సాధన చేశాకనే తన గురువునుండి బ్రహ్మవిద్యను పొందాడు. ఆత్మదర్శనం పొందడానికి నిరంతరాయమైన అకుంఠితమైన సాధన ఎంత అవసరమో ఈస్తబకంలోని చివరిశ్లోకం తెలియజెప్పుతుంది.

శ్లో॥ మృత్యుగ్రస్త మిదం శరీర మమృతో హ్యాత్మా శరీరోజ్ఝితః
దేహాధ్యాసకృతం ప్రియాప్రియశతం హిత్వా చ తద్భావనామ్।
నిష్పద్యేత నిజాత్మనాఽఽత్మనిరతో విద్వా నదభ్రాబ్దకైః
శ్రుత్వేతీంద్ర ఇయాయ యత్పరపదం పాయా త్స
కాశీపతిః॥ 25

ప్రతి॥ ఇదం + శరీరం = ఈశరీరము, మృత్యుగ్రస్తం = చావుచే కబళించ బడింది, శరీర + ఉజ్ఝితః = శరీరంనుండి పైకిలేచిన, ఆత్మా + హి = ఆత్మఅయితే, అమృతః = అమృతరూపము, దేహ + అధ్యాసకృతం = దేహమను ఆరోపముచే కలిగిన, ప్రియ + అప్రియశతం = వందలాది ప్రియాప్రియాలను, తత్ + భావనాంచ = వానిగురించిన భావనలను, హిత్వా = విడిచి, నిజ + ఆత్మనా = తనఆత్మచే, ఆత్మనిరతః = ఆత్మ యందు రమించునట్టి, విద్వాన్ = విద్వాంసుడు, అదభ్ర = అకాశ మండలి, అబ్దకైః = మేఘాలచే, నిష్పద్యేత = పుట్టునో,— ఇతి = అని, శ్రుత్వా = విని, ఇంద్రః = ఇంద్రుడు, యత్ = ఏ, పరపదం = పరమ పదాన్ని, ఇయాయ = పొందెనో, సః = ఆ, కాశీపతిః = శంకరుడు, పాయాత్ = కాపాడుగాక!

## తాత్పర్యం

మరణగ్రస్తమైనది ఈశరీరం. ఆత్మ అమృతము, శాశ్వతము. దేహంతో తాదాత్మ్యం పొందడంవల్ల దేహంనుండి ఉద్భవించే వందలాది ప్రియాప్రియా

లను ఖండించి వివేకి ఆత్మలో రమిస్తూ ఆత్మభావనను పొందాలి. ఎన్నో సంవత్సరాల సాధన తరువాత ఇంద్రుడు పొందిన ఆ పరమపదం సౌమ్య కాశీపతియే!

వ్యాఖ్య

ఇది స్తబకంలోని చివరిశ్లోకం. ఇది కూడా గంభీరమైన "శార్దూల విక్రీడితం" ఛందస్సులోనే ఉన్నది. ఛాందోగ్యం 8వ అధ్యాయం 12–15 ఖండాలలోని భావాలు ఇందులో పొందుపరచబడివున్నాయి. 15వ ఖండంతో ఉపనిషత్తు సమాప్త మవుతుంది.

ఇక్కడ "శరీర" మన్నప్పుడు అన్నమయ, ప్రాణమయాలతో కూడిన స్థూలశరీరమూ, మనోమయ, విజ్ఞానమయాలతోకూడిన సూక్ష్మశరీరమూ, ఆనందమయమైన కారణశరీరమూ అన్నీ ఉన్నాయి. అంతర్యామి అయిన పరమాత్మ జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలలో ఈకోశాలవల్ల పరిమితులు చెంది నట్లు అగపడుతుంది. జాగ్రదవస్థలో ఆత్మ అనుభవించే అంతులేని సుఖ దుఃఖాలకు కారణం స్థూలశరీరంతో పొందే తాదాత్మ్యమే. స్వప్నావస్థలో ఆత్మపొందే బాధలు, ఆనందాలకు స్వాప్నికుడిగా మనోబుద్ధులతో పొందే తాదాత్మ్యమే కారణం. గాఢనిద్రలో అనుభవించే శూన్యం, సుఖానుభూతికి గాఢనిద్రాపరుడిగా కారణశరీరంతో లేదా అవ్యక్తవాసనలతో పొందే తాదాత్మ్యం కారణం. ఆత్మకు ఈ మూడు శరీరాలతో తాదాత్మ్యం ఉన్నంతకాలం సాధారణ మానవుడికి ప్రపంచంలో ఉండే ఈమూడు రకాల అనుభవాలూ ఉంటూనే వుంటాయి. ఈ మూడుశరీరాలు కాలంయొక్క గుప్పిట్లో ఉన్నందున అవి క్షణ క్షణం మారుతూంటాయి. నశించుతూంటాయి. మేలుకొన్నవాడిగా, స్వాప్నికుడిగా, గాఢనిద్రాపరుడుగా మారడానికి కారణం ఈమూడుశరీరాలే. కాబట్టి వీటి కార్యమైన ప్రాపంచికానుభవాలు కూడా తప్పనిసరిగా మారు తూంటాయి. ఆత్మ తన నిజస్వభావాన్ని ఎరుగక ఈమూటితో పెట్టుకొన్న తాదాత్మ్యంవల్ల స్వయంగా తెచ్చుకొన్న ఈ విషాదాన్ని "అధ్యాస" అంటారు. ఆత్మను ఎరుగని అవిద్య, నిత్య శాశ్వత అనంత అమృత అవ్యయ – ఆత్మ

స్వభావాన్ని సరిగా అర్థంచేసుకోడంవల్ల తొలగిపోతుంది. అన్ని ప్రాణులలోను ఈ అవిద్య గాఢంగా కూరుకొనిపోయి వున్నందువల్ల ఒక క్రమప్రకారం, దీక్షతో, పటిష్ఠతతో, దృఢనిశ్చయంతో, చేసే ఆధ్యాత్మికసాధన దానిని తొలగించ గలదు. దేవేంద్రుడు ఆస్థితిని చేరుకోడానికి నూటొక్క సంవత్సరాలు పట్టింది. మనలాంటి సాధారణ సాధకులకు ఇంకా ఎక్కువకాలం పట్టవచ్చును. అయితేనేం, నిరాశ చెందవలసిన పనిలేదు. కాశీ విశ్వేశ్వరప్రభు కరుణవల్ల అది త్వరగానే పూర్తి కావచ్చును. ఆయన అనుగ్రహం మనపైన ప్రసరించునుగాక!



# ద్వాదశ స్తబకం

ఈస్తబకంలో పూజ్య గురుదేవులు బృహదారణ్యకోపనిషత్తులోని ప్రారంభ బ్రాహ్మణాలను క్లుప్తీకరించారు. బృహదారణ్యకోపనిషత్తు శుక్ల యజుర్వేదంలోని కాణ్వ, మాధ్యందిన శాఖలకు చెందిన బ్రాహ్మణభాగానికి చెందినది. ఉపనిషత్తు చాలా పెద్దదైనందున 'బృహత్' అనీ, ఇందులోని ఉపదేశాలన్నీ అరణ్యవాసులైన ఋషులద్వారా ఒసగబడినందున అరణ్యకమనీ పేరు పొందింది.

వేదాల కర్మకాండలో విధింపబడిన అన్ని యజ్ఞప్రక్రియలలోను అశ్వమేధయాగం ఎంతో పవిత్రమైనదనీ, ప్రముఖమైనదనీ, యజమానికి చాలా ఎక్కువైన పుణ్యాన్ని తెచ్చిపెడుతుందని అంటారు. అయితే అశ్వమేధ యాగంతోసహా కర్మకాండలోని ఏయాగమూ పరబ్రహ్మను తెలుసుకోడానికి ఉపయోగించదు. ఈ భావం మొదటిశ్లోకంలో వెల్లడించబడుతోంది.

శ్లో॥ హయక్రతుప్రాగ్ర్య సమగ్ర కర్మభిః
సముచ్చితోపాస్తిభి రప్యతద్విదా।
న లభ్యతే భవ్య మభవ్యవస్తు యత్
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 1

ప్రతి॥ సమగ్రకర్మభిః = సమస్తకర్మలతో, సముచ్చిత + ఉపాస్తిభిః + అపి = శ్రేష్ఠమైన ఉపాసనలతోను కూడిన, హయక్రతుప్రాగ్ర్య = అశ్వమేధ యాగమును, అతద్విదా = ఆత్మజ్ఞానములేని వానిచే, యత్ = ఏ, భవ్యం = శ్రేష్ఠమైన, అభవ్యవస్తు = శ్రేష్ఠముకానిదియు, నలభ్యతే = పొందబడదో, ఉత్తరకాశికాధవం = సౌమ్య కాశీశుని, ఆశ్రయామి = శరణువేడెదను.

## తాత్పర్యం

పరమభక్తితో తీవ్రమైన దీక్షతో ఉపాసన చేస్తూ పరమపవిత్రమైన ఉత్తమోత్తమమైన అశ్వమేధయాగాన్ని చేసిన సాధకుడైనా, కర్మకాండలోని విధులను తు, చ, తప్పకుండా ఆచరించినా, అది అతడిలోనే సదా వెలుగుతూన్న ఆనందరూప మహామహిమాన్విత పరమాత్మను చూపింపలేదు. ఆ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

పేరు సూచించుతున్నట్లే బృహదారణ్యకోపనిషత్తు అన్నింటికన్న పెద్ద ఉపనిషత్తు. మంత్రాల సంఖ్యలోనే కాదు, ఈ మహాగ్రంథంలో అంతటా విరివిగా వెదజల్లబడిన ఆధ్యాత్మిక సత్యాలలోని గుహ్యత, గంభీరత, ఔన్నత్యం —వీటినిబట్టికూడా ఈ ఉపనిషత్తు ఎంతో గొప్పది. శుక్లయజుర్వేదంలోని శతపథ బ్రాహ్మణంలో ఈ ఉపనిషత్తు ఉన్నది. కాణ్వము, మాధ్యందినము అని ఈ బ్రాహ్మణానికి రెండు ప్రఖ్యాత పాఠాలున్నాయి. మాధ్యందినశాఖలో 14 ఖండాలు, కాణ్వశాఖలో 17 ఖండాలు ఉన్నాయి. ఈ రెండూ ఆరణ్యకాలతో సమాప్తమవుతాయి—అంటే ఉపాసనా భాగాలతో పూర్తిఅవుతాయి మాధ్యందిన శాఖలోని 4—9 భాగాలు ఆరణ్యక భాగాలు అవే బృహదారణ్యకోపనిషత్తు. అలాగే కాణ్వశాఖలోని 3—8 అధ్యాయాలు ఆరణ్యకభాగాలు బృహదారణ్యకోప నిషత్తువి. ఆదిశంకరులు కాణ్వశాఖలోని ఉపనిషత్తును తన మహాభాష్యానికి స్వీకరించారు.

ఈ ఉపనిషత్తులో ఆరు అధ్యాయాలు. అవే మధుకాండ, యాజ్ఞవల్క్య కాండ, ఖిలకాండ అని మూడు కాండలుగా విభజింపబడి వున్నాయి. ప్రతి కాండలో రెండేసి అధ్యాయా లున్నాయి. ప్రతిఅధ్యాయంలోను వేరువేరు బ్రాహ్మణా లున్నాయి. మొత్తం ఉపనిషత్తులో ఉన్నవి 47 బ్రాహ్మణాలు.

జగద్గురువు ఆదిశంకరాచార్యులు మహోత్కృష్టమైన ఈ ఉపనిషత్తుపైన ఎనలేని భాష్యాన్ని రచించారు. ఆయన ప్రఖ్యాతశిష్యుడు సురేశ్వరాచార్యులు శ్రీ శంకరభాష్యంపైన వార్తికాని రచించారు. శ్రీ విద్యారణ్యస్వామి శంకరభాష్యం

పైన భాష్యసారాన్ని రచించాడు ఇంతమంది మహాత్ములు ఇన్ని భాష్యాలను రచించడంవల్లనే ఉపనిషత్తుయొక్క మహత్త్వాన్ని మనం ఊహించుకోవచ్చును.

వేదాంతసాధకులకు పరిచయమై వున్న పరమ సత్యాలన్నీ దాదాపు అద్భుతమైన ఈ ఉపనిషత్తునుండి ఏరుకున్నవే! ❀

ఈ ఉపనిషత్తులో పరమసత్యాన్ని బోధించిన విధానము తక్కిన ఉపనిషత్తులకన్న కొద్దిగా బిన్నంగా ఉంటుంది. వేదాలలోని అరణ్యకాల భాగాలు సాధకుల మనస్సును పూర్తిగా భాహ్యప్రయోజనాలతో కూడిన కర్మకాండాభ్యాసాలనుండి మళ్ళించి, ఉత్తమోత్తమమైన ఆత్మవైపునకు ఉన్నతంగా లేవనెత్తడానికి సహాయపడుతాయి. ఈ విషయాన్నే గురుదేవులు ప్రబోధిస్తున్నారు. ఈ ప్రపంచంలో చేసిన పుణ్యకర్మవల్ల మరణానంతరం ఎలాంటి స్వర్గలోకసుఖాలు లభించినా, అవి యావత్తు కాలబద్ధమైనవి. అంతం కాక తప్పదు. ఈ విషయాన్ని చెబుతూ అద్యంతాలు లేని ఆత్మానుభవం పొందడానికి వివేకి అయిన ప్రతిమానవుడు ప్రయత్నించాలని గురుదేవులు సూచిస్తున్నారు. ఆ ఆత్మయే నా ఆరాధ్యదైవం సొమ్య కాశీశుడు!

గ్రంథవిస్తరణను తగ్గించడంకోసం ఉపనిషత్తు ప్రారంభంలో విపులమైన వర్ణనతో ఉన్న అశ్వమేధ యాగాశ్వాన్ని వివరించలేదు. తరువాతి శ్లోకంలో యజ్ఞాశ్వాన్ని సృష్టికర్త, హిరణ్యగర్భుడు అయిన ప్రజాపతికి సంకేతంగా ఎలా ఉపాసించాలో చెప్పబడింది. అలాగే సృష్టికర్తయే సర్వవ్యాపకమైన పరమాత్మగా ఎలా ఉపాసింపబడాలో చెప్పబడింది.

ఈక్రింద ఇవ్వబడిన యాగాశ్వావర్ణన బృహదారణ్యకోపనిషత్తు భాష్యం పైన స్వామి మాధవానంద గారు రచించిన ఆంగ్ల అనువాదానికి తెలుగు అనువాదం—

---

❀ 1) అహం బ్రహ్మాస్మి, 2) అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ, 3) ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః, మంతవ్యః, 4) అభయం వై బ్రహ్మ, 5) నేతి నేతి.

"యాగాశ్వం యొక్క శిరస్సు-ఉదయసంధ్య. దానినేత్రం— సూర్యుడు. దాని ప్రాణం— వాయువు. తెరిచివున్న దాని నోరు— వైశ్వానరాగ్ని. దాని శరీరం సంవత్సరం. దాని పృష్ఠభాగం— దేవ లోకం, పొట్ట-ఆకాశం, దాని గిట్టలు- భూమి దాని ప్రక్కలు-నాలుగు దిశలు. దాని ప్రక్క టెముకలు —అవాంతర దిశలు. దాని నరాలు — ఋతువులు. దాని కీళ్ళు — నెలలు, దాని కాళ్ళు— పక్షాలు. దాని ఎముకలు— నక్షత్రాలు. మేఘాలు— దాని మాంసము. సగం అరిగిన ఆహారం— ఇసక. దాని రక్తనాళాలు— నదులు. దాని కాలేయం,— (లివరు), (స్ప్లీను)-ప్లీహము కొండలు. దాని కేశాలు, జూలు — ఓషధి వనస్పతులు. దాని ముందుభాగం — ఉదయ సూర్యుడు, వెనుకభాగం— అస్తమించే సూర్యుడు. దాని ఆవులింత— మెరుపులు. దాని కదలిక—ఉరుములు దాని మూత్రం — వర్షం. దాని సకిలింపు— వాక్కు. (బ్ర. ఉ 1. 1. 1)

దానిని చూపుతూ దాని ముందుగా కనబడిన — మహిమాన్ అనే బంగారుపాత్ర— తూర్పు దాని వెనకాల కనబడే రజతపాత్ర — రాత్రి. దాని పుట్టుక తూర్పు సముద్రంలో. 'మహిమ'ల నబడే -ఈరెండు గిన్నెలూ దానికి రెండు ప్రక్కలా ప్రత్యక్ష మవుతాయి. 'హయం'గా దేవతల్ని, 'వాజి'గా గంధర్వుల్ని, 'అర్వన్'గా అసురుల్ని, 'అశ్వం'గా మానవుల్ని మోస్తుంది, దానికి పరమాత్మయే ఆధారం. (బ్ర. ఉ. 1. 1 2)

శ్లో॥ ప్రజేశ మధ్యాస్యతి మేధ్యసైంధవే
యమగ్ని వాయ్వర్య మభావభృచ్చయః।
క్రియాఫలం కారకమప్యయం విరాట్
తమాశ్రయా మ్యుత్తరకాశికాధవమ్॥ 2

ప్రతి॥ అగ్ని + వాయు + అర్యమ + భావ + భృత్ = అగ్ని వాయు సూర్య రూపాలను ధరించిన, యః = ఎవడు, యం = ఏ, ప్రజేశం = ప్రజా పతిని, మేధ్యసైంధవే = యాగాశ్వమందు, అధ్యాస్యతి = ఆరోపించు కొనునో, అయం = ఈ, విరాట్ = విరాట్పురుషుడు, క్రియాఫలం = క్రియాఫలమును, కారకం + అపి = సాధనాలుగను అగుచున్నాడో—

## తాత్పర్యం

పరమాత్మ, సృష్టికర్త సృష్టికార్యాన్ని తనపైన అధ్యాసగా ఏర్పరచు కొన్నాడు. తన విరాడ్రూపానికి సంకేతంగా పవిత్రాశ్వాన్ని యాగాశ్వంగా సమర్పించుకొన్నాడు. దానికి కావలసిన అగ్ని, వాయు, సూర్య రూపాలను ధరించాడు. తానే యజమానియై, యజ్ఞమై వస్తువులు, సామాగ్రులు అయ్యాడు తన విరాడ్రూపంలో తిరిగి తానే యజ్ఞఫలమై స్వర్గలోకంగా మారాడు. ఆ ఉత్తరకాశీ ప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఇందులో గురుదేవులు బృ ఉ. 1 2. లోని ఏడు మంత్రాల భావాలను చెబుతున్నారు. ఈ మంత్రాలలో సృష్టికర్త అశ్వమేధయాగంలో అశ్వాన్ని తనకు సంకేతంగా ఎలాపెట్టుకున్నాడో విస్తారమైన వర్ణన ఉన్నది.

పరమాత్మనుండి బ్రహ్మాండం తాలూకు నామరూపాలు వెలికి రావడానికి ముందు అంతయూ శూన్యమై నిండివుండేది ఈ శూన్యాన్నే ఉపనిషత్తు "మృత్యువ"ని పేర్కొన్నది. అలాగే "అశనాయ" (ఆకలి) అనే పదం ద్వారా కూడా ఈ అవ్యక్తస్థితిని సూచించింది ఆకలి వేసినప్పుడు ఇతర ప్రాణాలని నాశనం చెయ్యడం తప్పనిసరి—మొక్కలైనా, జంతువులు, పిట్టలు అయినా—అన్నీ ప్రాణులే. లేకపోతే ఆకలి తీరదు. అందుకే మృత్యువు, అశనాయ పర్యాయపదాలుగా వాడబడినాయి.

పరమాత్మ అవ్యక్త మహత్తత్వంతో తాదాత్మ్యం పొందినప్పుడు కలిగే ఈ ఆకలి కాల స్వరూప ధర్మం అవుతుంది. ఇలా తాదాత్మ్యం పొందిన స్థితిని హిరణ్యగర్భు డన్నారు. సృష్టికి పూర్వం నామరూపజగత్తులన్నీ హిరణ్యగర్భునిలో అవ్యక్తరూపంలో ఇమిడి వున్నాయి. హిరణ్యగర్భుడు తనలో ఇమిడి వున్న నామరూపాలను సృజింపకోరినప్పుడు అతడు మొదటిసారి సమిష్టి మనస్సును సృజించాడు. ఈసమష్టి మనస్సు పంచీకరణానికి ముందున్న శుద్ధమైన పంచతత్త్వాల సముదాయం తప్ప వేరుకాదు. తాను చేసిన మొదటి సృష్టితో పూర్తిగా తృప్తిపడి ప్రజాపతి గొప్పదైన అశ్వమెధయాగాన్ని చేసి సృష్టి

కార్యాన్ని నిర్వహించడానికి తగిన బలస్థైర్యాలను సమకూర్చుకో దలిచాడు. అందుచేత ఏకాగ్రచిత్తంతో జగత్సృష్టి సంకల్పంతో తీవ్రమైన తపస్సుచేశాడు. ఆ తపస్సు కారణంగా అయిదు మహాతత్త్వాలు ఆయనలోంచి బయల్వెడలినాయి సృష్టి విధానమైన వేదాలు కూడా ఆయనలోంచి బయల్వెడలాయి.

ఆయన వాటినుండి తన తాదాత్మ్యాన్ని ఉపసంహరించుకున్నప్పుడు, అవి స్థూలంగా మారి, పొంగి, మలినపడి అపవిత్రమై అశ్వమేధ యాగానికి పనికిరాకుండా పోయాయి. అందుచేత అయన తిరిగి వాటిలోకి ప్రవేశించి తన్ను తాను మూడుగా విభజించుకొని అగ్ని, వాయు, సూర్యుళ్ళుగా వ్యక్తం అయ్యాడు. దేశకాల పరిధుల్లో కార్యకారణసంబంధ శాసనాన్ని వ్యక్తం చెయ్యడం ద్వారా ప్రపంచమంతటా వ్యాపించి సృష్టిని పూర్తిచేసి అశ్వమేధ యాగాన్ని పూర్తిచేశాడు. ఇది సంకేతపూర్వమైన యాగం, మామూలు స్థూల మైన పద్ధతి కాదు. సృష్టిని చేయడమే అశ్వమేధం. ఈ యాగంలో యజమాని యజ్ఞం, ద్రవ్యాలు, పరికరాలు—అన్నీ హిరణ్యగర్భుడే—అంటే మహత్తత్త్వంతో తాదాత్మ్యం పొందిన పరమాత్మయే! యజ్ఞఫలదాత కూడా సూర్యాగ్ని వాయు దేవతలుగా వ్యక్తమైన తానే! ఆ పరమాత్మయే నాకు ఏకశరణ్యమైన సౌమ్య కాశీశుడు!

తరువాతి శ్లోకంలో ముఖ్య ప్రాణంయొక్క గొప్పదనము, మహిమ ధ్యానించే విధానము వర్ణింపబడుతోంది.

శ్లో॥ యమశ్మసంఘట్టిత పాంశుపిండవత్
విశీర్యతే పంకమభిద్రవత్ స్వయం।
ఉపాస్య రూపం హ్యనరూపరూపిణం
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 3

ప్రతి॥ అశ్మ = రాతిచే, సంఘట్టిత = కొట్టబడిన, పాంశుపిండవత్ = మట్టిముద్ద వలె, యం = ఏ, పంకం = పాపమును, స్వయం = తానుగా, అభిద్రవత్ = చెల్లాచెదరుగా, విశీర్యతే = నశించుచున్నదో, ఉపాస్యరూపం = ఉపాసనారూపుడును, అనరూపరూపిణం = ముఖ్యప్రాణరూపుడైన—

## తాత్పర్యం

రాతితో కొట్టిన మట్టిపిండం విశీర్ణమై నశించినట్లు ముఖ్యప్రాణరూపమైన పరమాత్మను గురించి ధ్యానించినప్పుడు సాధకుని సంచితపాపాలన్నీ స్వయంగా నశించిపోతాయి. ఆ పరమాత్మ ఉత్తరకాశీ ప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

పైశ్లోకంలో బృ. ఉ. 1. 3. లోని 28 మంత్రాలసారం పొందుపరచబడి వున్నది.

పరమాత్మ అన్నింటికీ చేతనత్వాన్ని కలిగించే ముఖ్యప్రాణంగా ఉపాసించబడినప్పుడు, అసుర వినాశకర సంస్కారాలు పూర్తిగా నశించి సాధకుడు పరిశుద్ధుడౌతాడు.

అయితే ఇంద్రియగోళాలను (వాక్కు, కన్ను, చెవి, ముక్కు, చర్మం) చేతనత్వాన్ని ఇచ్చే ప్రాణంగానో, మనోబుద్ధులకు చేతనత్వాన్ని ఇచ్చే ప్రాణం గానో ఆత్మను ఉపాసించినప్పుడు ఈ ఉపాధులలో ఉద్భవించే ఉత్తమ లక్షణాలు, ఉపాధులలో అంతర్గతమై వున్న విచ్ఛిన్నకర శక్తులవల్ల ఎదుర్కొన బడుతాయి. వాక్కు వెల్లడించే ఉదారవాణి మనం ఉచ్చరించే దుర్భాషలవల్ల చెడిపోతుంది. కళ్లు అందమైన దృశ్యాలనేకాక అసహ్యాకరమైన దృశ్యాలను కూడా చూస్తుంది. చెవులు మధురమైన ధ్వనులతోబాటు కఠోరమైన ధ్వనులను కూడా వింటుంది. ముక్కు తియ్యటి వాసనలతోబాటు దుర్భరమైన కంపునికూడ భరించాలి. చర్మం మృదువైన ప్రేమపూరితమైన స్పర్శలనేకాక కఠిన క్రూర స్పర్శలను కూడా భరించాలి. మనస్సు ఉదాత్త భావాలతోబాటు క్షుద్ర నీచ భావాలను కూడా పొందుతుంది. ఇంద్రియమనోబుద్ధులద్వారా వచ్చే ఈ ద్వంద్వాలు దేవాసురుల మధ్య జరిగే సంఘర్షణగా ఈ మంత్రాలలో వర్ణించబడినాయి ఉదారమైన వాణి, అందమైన దృశ్యాలు, శ్రావ్యమైన ధ్వనులు' మధురమైన వాసనలు, మృదుస్పర్శ, ఉదాత్తమైన భావాలు, ఉత్తమాదర్శాలు కోరుకొనే దేవతలు అసురుల ద్వారా ఓటమిని చవిచూస్తారు. అసురులు దుర్భాషలు, అసహ్యకరమైన దృశ్యాలు, కఠినమైన ధ్వనులు, కఠినమైన

స్పర్శలు, దుర్వాసనలు, దుష్టమైన ఆవేశాలు, నీచమైన ఆలోచనలు—వీటిని సృజిస్తారు. అందుచేత దేవతలు ఇంద్రియమనోబుద్ధులచేత కలుషితం కాని ముఖ్యప్రాణాన్ని ఉపాసించారు. అసుర సంపద యావత్తు రాతిపై పడ్డ మట్టి ముద్దలాగా నశించి పోయింది.

ఈ భావాలు ఛాందోగ్యోపనిషత్తును గురించి వున్న 10వ అధ్యాయంలో ఇదివరకే వెల్లడింపబడినాయి.

ఇక తరువాతి శ్లోకంలో నాలుగోది అయిన పురుషవిధ బ్రాహ్మణం క్లుప్తంగా తెలుపబడుతోంది. ముందు పరమాత్మయొక్క మొదటిరూపం హిరణ్యగర్భుడు, ఇది ఈ శ్లోకంలో వివరింపబడుతుంది.

శ్లో॥ విరాట్స్వరూపేణ య ఏకలః పురా
విభాయ పశ్చాత్ బుబుధే న కించన।
మదన్య దస్తీతి తతః కుతో భయమ్
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥

ప్రతి॥ యః = ఎవడు, ఏకలః = ఒంటరిగా, పురా = మునుపు, విరాట్ + స్వరూపేణ = విరాడ్రూపముతో, విభాయ = భాసించి, పశ్చాత్ = తరువాత, మత్ = నాకంటె, అన్యత్ + కించన = వేరేమియును, న + అస్తి + ఇతి = లేదని, బుబుధే = తెలిసికొనెనో, తతః = అందువలన, భయం = భయము, కుతః = ఎందులకు,——

## తాత్పర్యం

ముందు విరాడ్రూపుడై ప్రకాశిస్తూ ఒంటరిగా ఉండి భయపడ్డాడు. తరువాత నాకు అన్యమైనది ఇంకొకటి లేదని, ఎరిగి భయమెక్కడ అను కున్నాడు. ఆ పరమాత్మ ఉత్తరకాశీప్రభువును ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

గురుదేవులు ఈశ్లోకంలో బృ. ఉ. 1. 4 లోని మొదటి ఏడుమంత్రాలను పొందుపరుస్తున్నారు.

ఆత్మ స్వరూపాన్ని ఎరక్కపోవడం వల్లనే ఈ శరీరాన్ని, వ్యక్తుల్ని, వస్తువుల్నీ నిజమని ఎంచి అధ్యస్తం చేసుకొంటున్నాడు. ఆత్మ నెరుగని అజ్ఞానం ఇటీవల క్రొత్తగా పుట్టిందికాదు. అది సృష్టిప్రారంభం నుండి వున్నది. అందుకే దానిని 'అనాది' అంటారు. అందుకే ఈశ్లోకంలో పరమాత్మ విరాట్టుగా వ్యక్తమైనప్పుడు క్షణంసేపు తన నిజస్వరూపాన్ని గురించి మైమరపు వచ్చిందని పేర్కొన్నారు. మరపువల్లనే భయంవేసింది. సాధారణంగా భయం ఎప్పుడు కలుగుతుంది? రెండోవారు తనకు పోటీగానో, వ్యతిరేకంగానో. నాశనం చేయడానికో ఉన్నారని తెలిసినప్పుడు భయం వస్తుంది. సరిగా విమర్శించి ఆ రెండోవానితో తనసంబంధం ఏమిటో స్పష్టంగా తెలిసి విరోధం లేదని విశ్వాసం కలిగేంతవరకు భయం ఉండనే వుంటుంది. రజ్జువుని స్పష్టంగా చూచేంత వరకూ సర్పభయం వుంటూనే వుంటుంది. హిరణ్యగర్భుని సందర్భంలో ఈభయం అట్టేసేపు నిలవలేదు. కొద్దిగా ఆలోచించగానే అతడికి అర్థమైంది— 'రెండోవారంటూనే లేనప్పుడు భయానికి ఆస్కారమే లేదని, అద్వితీయ పరమాత్మక్రింద తానొక్కడే ఉన్నాడు.' ఇలా స్వస్వరూపాన్ని గుర్తెరగడమే జీవితగమ్యం.

ఈ బ్రాహ్మణంలో తరువాత తన వంటరితనాన్ని పోగొట్టుకొనడానికిగాను ప్రజాపతి తన్ను తాను స్త్రీ పురుషమిధునాలుగా ఎలా విభజించుకున్నాడో తన్ను తాను పెంచుకొని లెక్కలేనన్ని, తెలుసుకొని అర్థంచేసుకోడానికి కూడా వీలులేనన్ని ప్రాణికోటులుగా ఎలాతయారయ్యాడో వివరింపబడివున్నది. చాతుర్వర్ణ్యం అనేది ఎలా తయారయిందో కూడా తెలుపబడింది. గురుదేవులు వాటిని పేర్కొనలేదు.

తరువాతి శ్లోకంలో మనం ప్రియంగా విలువైనదిగా ఎంచుకొనే అన్నింటి కన్న ఆత్మ ప్రియాతిప్రియము, అమూల్యము అని తెలుపబడుతోంది. తక్కిన వన్నీ నిజానికి అప్రీతికరాలు, వినాశకరాలు.

శ్లో॥ సుతాత్ సువర్ణా దథ దైవవిత్తతో
ప్యతిప్రియోఽభ్యంతర ఏష పూరుషః।
వినంక్ష్యతి హ్యన్య దశేష మాత్మనః
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 5

ప్రతి॥ సుతాత్ = కొడుకుకంటె, సువర్ణాత్ = బంగారంకంటె, అథ = మరియు, దైవవిత్తతః + అపి = బ్రహ్మజ్ఞానికంటె, అభ్యంతరః = ఆత్మీయుడు అయిన, ఏషః = ఈ, పూరుషః = పురుషోత్తముడు, అతిప్రియః = అత్యంతప్రీతిపాత్రుడు—, ఆత్మనః = పరమాత్మకంటె, అన్యత్ = వేరయిన, అశేషం = అంతయు, వినంక్ష్యతి = నశించునో, తం———

## తాత్పర్యం

కుమారులకన్న, బంగారంకన్న, దైవసంపదకన్న అతిప్రియమైనవాడు లోనున్న పురుషుడు. ఈ అంతరాత్మకన్న అన్యమైనవి యావత్తు నశించిపోయేవే. ఆపరమాత్మ ఉత్తరకాశీప్రభువుని నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బృ. ఉ. 1. 4. 8వ మంత్రభావం ఈశ్లోకంలో వివరింపబడుతున్నది. ప్రపంచంలో ఏదీ ఆత్మకన్న ప్రియం కాదన్నమాట స్పష్టమే తమ స్వార్థ ప్రయోజనాలకోసం మనుష్యులు తమ దగ్గిర బంధువుల్ని కూడా త్యజించిన ఉదాహరణలు కోకొల్లలు. 1890 వ సంవత్సరంలో వచ్చిన కరువులో ఎందరో తల్లిదండ్రులు తమ ప్రాణాలని నిలబెట్టుకోడంకోసం తమ పసిబిడ్డల్ని వదిలేశారు. గుజరాతులోని కచ్, కథియవాడులలో సంభవించిన కరువులో వేలాది శిశువులు మరణించారు. అంటే ప్రపంచంలో ఆత్మకన్న ఎక్కువ ప్రియమైనది లేదని అందరూ ఒప్పుకునే విషయం. అయినప్పటికీ ప్రియాతి ప్రియమైన ఈ ఆత్మస్వరూపాన్ని తెలుసుకునేవారు ఎంతో అరుదు. ఇంత లోతు అజ్ఞానంలో మునిగివున్నాము. ఇదే ఆత్మనెరుగని అవిద్య.

తరువాతి శ్లోకంలో అహంబ్రహ్మాస్మి మహావాక్య విచారణవల్ల దేవతలు, మానవులు, ఇతరులు ఆత్మానుభవం పొందిన వైనం వివరింపబడుతోంది.

శ్లో॥ సురాశ్చ సరంత్వమగు ర్నరర్షయో
యదాత్మబోధేన తతోఽభవం మనుః।
రవిశ్చ హేత్యైక్షత వామదైవతం
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 6

ప్రతి॥ యత్ = ఏ, ఆత్మబోధేన = బ్రహ్మజ్ఞానంతో, సురాః = దేవతలు, నర + ఋషయః + చ = నరులు ఋషులును, సర్వత్వం = బ్రహ్మతత్త్వమును, అగుః = పొందిరి, తతః = తర్వాత, మనుః = మనువు, అభవం = అయితిని, రవిః + చ = సూర్యుడుగను, వామదైవతం + హ + ఇతి = వామదేవుడు అనియు, ఐక్షత = చూచితిని—, తం——

## తాత్పర్యం

దేవతలు, నరులు, ఋషులు "అహంబ్రహ్మాస్మి" భావాన్ని అర్థం చేసుకొని ధ్యానించటంవల్ల సర్వవ్యాప్త బ్రహ్మత్వాన్ని పొందారు. వారు షట్టుకలేని పరమాత్మయే అయ్యారు. ఆ అనుభవంతో వామదేవ ఋషి తానే మనువు, సూర్యుడు అయ్యానని ప్రకటించాడు! ఆ పరమాత్మ ఉత్తరకాశీప్రభువుని నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బృ. ఉ. 1. 4. 9. 10 మంత్రాల సారాన్ని గురుదేవులు ఈ శ్లోకంలో విశదీకరిస్తున్నారు.

వామదేవ ఋషి ఆత్మానుభవం పొంది సర్వవ్యాప్త బ్రహ్మమే అయినాడు. ఈ బ్రహ్మపదాన్ని పొంది ధైర్యంగా తానే సూర్యుణ్ణనీ, తానే మనువుననీ ప్రపంచంలోని నామరూపాలన్నీ తానేనని ప్రకటించాడు. "నేను తప్ప ఈ ప్రపంచంలో మరొకటి లేదని" ఆ ఋషి ప్రకటించాడు. పరబ్రహ్మానుభవం కలిగిన ప్రతివొక్కరికీ వామదేవునికి వచ్చిన అనుభవమే వస్తుంది.

అవ్యక్తమైన పరబ్రహ్మము మొదటగా వ్యక్తమైనప్పుడు సృష్టికి ముందే ఆ వ్యక్తబ్రహ్మము తనను గురించి తానే "నేను బ్రహ్మమును" అని ధ్యానించాడు. ఆధ్యానఫలంగా సర్వవ్యాప్త వ్యక్తబ్రహ్మ మయ్యాడు. దీని ననుసరించి దేవతలు, మానవులు, ఋషులు "అహంబ్రహ్మాస్మి" అనే మహా మంత్రాన్ని జపించి ధ్యానించారు. వాళ్ళందరూ వామదేవ ఋషిలాగే వ్యక్త బ్రహ్మంయొక్క సర్వాత్మత్వాన్ని పొందారు వామదేవ ఋషి ఉదాహరణ ద్వారా "అహం బ్రహ్మాస్మి" మంత్ర ప్రాముఖ్యత ఇక్కడ వెల్లడింప బడుతోంది. తానే పరబ్రహ్మము అన్న ఉపాసన ఇది.

ఈ బ్రహ్మోపాసనలోని ప్రాముఖ్యత, మహిమ తెలియక ఎందరో సాధకులు వేరువేరు దేవతలను తమకన్న భిన్నంగా భావించి పూజించి ఉపాసిస్తారు. ఉపాసకుడికీ ఉపాస్యదేవతకీ మధ్య స్పష్టమైన భేదం వాళ్ళచేత పాటింపబడుతుంది. అలాంటి సాధకులు ఆవు తన యజమానిని సేవించినట్లే తమతమ ఉపాస్యదేవతలను సేవించేవారు అవుతారు. ఈ భావం తరువాతి శ్లోకంలో స్పష్టీకరించబడుతోంది.

శ్లో॥ స్తుతి ప్రణామ ప్రణిధాన పూజనైః
యదాత్మనోఽన్యాం భజతేఽనుదేవతామ్।
య ఆత్మఘాతి స పశు ర్దివౌకసాం
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 7

ప్రతి॥ స్తుతి = స్తోత్రము, ప్రణామ = నమస్కారము, ప్రణిధాన = ధ్యానము-పూజనైః = పూజలచే, యదా = ఎప్పుడు, ఆత్మనః = తనకంటె, అన్యాం = వేరైన, అనుదేవతాం = దేవతను, భజతే = కొల్చుచున్నాడో, యః + ఆత్మఘాతి = ఏ ఆత్మఘాతుకుడో-, దివౌకసాం = దేవతలకు, సః = అతడు, పశుః = గోవువంటివాడో-, తం = ఆ, ఉత్తరకాశికాధవమ్ = సౌమ్య కాశీశుని, ఆశ్రయామి = ఆశ్రయిస్తాను.

## తాత్పర్యం

తన ఆత్మకన్న బిన్నమైన దేవతలను స్తోత్రాలు, నమస్కారాలు, ఆత్మ నివేదనలు, పూజలద్వారా సేవిస్తారో, ఆతడు ఆత్మఘాతి దేవతలకు పాలిచ్చే ఆవులాంటివాడు. ఆ పరమాత్మ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బృ. ఉ 1.4. లోని 10–17 మంత్రాలభావాలు ఈశ్లోకంలో విశదీకరింప బడుతున్నాయి. ఈ బ్రాహ్మణం ముగింపుకి వస్తుంది.

ఆవు మనకు పాలిచ్చి పోషిస్తున్నట్లే మన స్వర్గంలోని దేవతలను ప్రార్థనా ప్రణామ హోమాలద్వారా పోషిస్తున్నా వాళ్లను మనకన్న అన్యంగా ఎంచు కుంటున్నాము కాబట్టి మనం వాళ్లకు పాడిఆవులాంటి వాళ్లం, మందలోని ఒక ఆవుసు పులి ఎత్తుకుపోతే ఆ మంద యజమానికి దుఃఖం, బాధ కలుగుతాయి. పిండాలద్వారా పితరులను, ఆహుతులద్వారా ఋషులను, యజ్ఞాలద్వారా దేవతలను, జపధ్యానాదులద్వారా స్వర్గవాసులను భక్తుడు ఉపాసిస్తాడు. ఇవన్నీ మానేసి భక్తుడు తనలోని ఆత్మను తెలుసుకోడానికి ప్రయత్నిస్తే దేవత లకు ఎంతోనష్టం, అందుకే ఆత్మసాధన చేసేవాళ్ళని స్వర్గంలోని దేవతలు ఆగ్రహంతో పరికిస్తారట!

ఏ కొద్దిమందిలోనో అరుదుగా ఆత్మజిజ్ఞాస ఉదయిస్తుంది. జిజ్ఞాస ఉదయించినా దానిని సఫలం చేసుకునే త్రోవలో ఎన్నెన్నో ఆటంకాలు, అవాంతరాలు కలుగుతాయి. దశేంద్రియాలు, మనోబుద్ధులు, అధిష్ఠాన దేవతలు రకరకాల ఇబ్బందుల్నీ, అడ్డంకుల్నీ సృజించి సాధకులను బహిర్ముఖుల్ని చేసి, ఆత్మసాధనకు అడ్డపడుతారు. ఇలా బహిర్ముఖులను గావించినప్పుడు మనం 'నేను', 'నాది' అనే స్వార్థపూరిత తాదాత్మ్యంతో సంసారమనే సుడిగుండంలో చిక్కుకుపోతాము. అందుచేత ఆత్మనిగ్రహంతో కూడిన క్రమబద్ధ జీవితం ద్వారా సాధకుడు ఈ అవాంతరాలనుండి బయటపడాలి.

తరువాతి శ్లోకంలో అందరిలోని అంతరాత్మ అయిన పరమాత్మ ఏడురకాల ఆహారాన్ని సృజించి దేవతలకు ప్రాణులకు ఏవిధంగా స్వయంగా విభజించి ఇచ్చాడో విశదీకరింపబడింది. దానిని సప్తాన్నబ్రాహ్మణం అంటారు.

ఈ సందర్భంలో దేవతలు, మానవులలో చాతుర్వర్ణ్య విభజన ఎలా వచ్చిందో చెప్పే భాగాన్ని శ్రీ గురుదేవులు వదిలేశారు.

శ్లో॥ పితృస్వరూపేణ చ యోఽన్నసప్తకం
విధాయ జంతూన్ విబుధాన్ పశూనపి।
అభాజయత్ స్వం చ యథా స్వమేవ తత్
తమాశ్రయామ్యుత్తర కాశికా ధవమ్॥ 8

ప్రతి॥ యః = ఎవడు, పితృస్వరూపేణ = బ్రహ్మదేవుని రూపంతో, అన్నసప్తకంచ = అన్నమయాది ఏడుకోశాలనుగూడ, విధాయ = సృష్టించి, జంతూన్ = జంతువులను, విబుధాన్ = పండితులను, పశూన్ + అపి = పశువులనుకూడ, యథా = ఎట్లు, స్వం + చ = తనను, అభాజయత్ = భాగించెనో—, తత్ = ఆ ఆత్మ, స్వం + ఏవ = తానే——

## తాత్పర్యం

ప్రజాపతి హిరణ్యగర్భుడుగా వ్యక్తమైన ఏ పరమాత్మ ఏడురకాల అన్నాన్ని సృజించి అన్ని ప్రాణులకు, దేవతలకు, జంతువులకు, తనకుకూడా పంచాడో, ఆ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఇందులో గురుదేవులు బృ ఉ 1. 5లోని మొదటి మూడుమంత్రాల భావాలను చెబుతున్నారు.

ఇందులో 'పిత' అన్న పదం సమిష్టిలోని మహత్తత్త్వంతో, సమిష్టి మనస్సుతో తాదాత్మ్యం పొందిన హిరణ్యగర్భుణ్ణి నిర్దేశించుతుంది. పూర్వం

వున్న బ్రహ్మాండాల తాలూకు ఏవి వాసనలు, అంతర్హితమైన కోరికలు తిరిగి వ్యక్తంకావడానికి పక్వమై వున్నాయో ఆ సమిష్టి వాసనలను బట్టి ప్రస్తుత బ్రహ్మాండం సృష్టి అవుతుంది.

వ్యష్టిలో 'పిత' అన్న ఈపదం వ్యక్తిలో బయటకు వ్యక్తంకావడానికి సిద్ధంగా వున్న అవ్యక్త వాసనలు, తీరని కోరికలు, అహంభావంతో తాదాత్మ్యం పొందిన ఆత్మకు అన్వయిస్తుంది. ప్రజాపతిచేత మొట్టమొదట సృజింపబడిన ఆహారం ఆయా ప్రాణుల స్వభావాన్నిబట్టి, సృష్టి అయిన విధానాన్నిబట్టి వాళ్ళకు సహజంగా కావలసిన ఆహారం. అది సమిష్టిగా సృష్టి అయినదని చెప్పడానికి కారణం – ఇది అందరికీ చెందినది. ఎవరికీ వ్యక్తిగతమైనది కాదు. ఎవరూ ఈ ఆహారాన్ని హస్తగతం చేసుకొని అధికారం చలాయించరాదు అది అందరికీ అవసరాన్నిబట్టి పంచబడాలి రెండోరకం అన్నం దేవతలకు ఆహుతులుగా సమర్పించబడాలి. మూడోరకం అన్నం దేవతలకు బలిగా సమర్పించబడాలి. నాలుగోరకం అన్నం తల్లిపాలు. అప్పుడే పుట్టిన శిశువులకి దూడలకు ఏర్పాటు అయింది. మిగిలిన మూడురకాల అన్నాన్ని ప్రజాపతి తన కోసం సృజించుకొన్నాడు — అవి వాక్కు, మనస్సు, ప్రాణం. మనో వాక్ప్రాణాలను తనకోసం సృజించుకొన్న ప్రజాపతికి 'వాఙ్మయ', 'మనోమయ' 'ప్రాణమయ' అనే పేర్లు వచ్చాయి. అంటే వాక్కు. ప్రాణము, మనస్సు కలవాడని అర్థం. ఇలా ఏడురకాల అన్నాలను ఎందుకు సృజించాడో తెలుసు కోడానికి ఉపనిషత్తులలోని మంత్రాలను చదవాలి.

శ్లో॥ మనోమయః ప్రాణమయోఽథ వాఙ్మయం
పితృత్వ మాసాద్య జిఘత్సతీవ యం।
ఫలాన్యజన్మా నిజకర్మ యన్త్రితః
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 9

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, మనోమయః = మనోమయము, ప్రాణమయః = ప్రాణమయము, అథ = మరియు, వాఙ్మయః = వాఙ్మయరూపంతో, పితృత్వం = బ్రహ్మత్వమును, ఆసాద్య = పొంది, అజన్మా = పుట్టుక

లేనివాడై, నిజ = తన, కర్మ = కర్మలచేత, యంత్రితః = నియంత్రించ బడినవాడై, ఫలాని = ఫలములను, జిఘత్సతి + ఇవ = మ్రింగుచున్న వానివలెనున్న, తమ—

## తాత్పర్యం

జన్మ అంటూలేని ఏ పరమాత్మ వాఙ్మయ, ప్రాణమయ, మనోమయుడై హిరణ్యగర్భుని రూపంలో పితృత్వాన్ని చేపట్టి తన కర్మలచేత నియంత్రితుడై ఫలాలను భుజిస్తాడో, ఆ ఉత్తరకాశీ ప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఈశ్లోకంలో మూడోమంత్రంలోని భావం ఇంకా విస్తృతంగా విశదపరచ బడుతోంది. వాఙ్మనః ప్రాణాలనే ఆహారాలను సమిష్టిలో ప్రజాపతి, వ్యష్టిలో జీవుడు ఎందుకు స్వీకరించారో చెప్పబడుతోంది. ఈ మూడు ఆహారాల ఆధ్యాత్మిక తత్త్వాన్ని గ్రహించాలి. జీవస్వరూపంగా వ్యక్తమైన దానిని నిలబెట్ట డానికి వాక్కు, ప్రాణం, మనస్సు అవసరం. ఇంద్రియ వ్యాపారాలను మనస్సే – చేస్తుంది. ఇంద్రియాలనుండి మనస్సు వెనక్కి ఉపసంహరించుకో బడినప్పుడు వాటికి తమ తమ రంగాలలో వ్యవహరించే నేర్పు ఉండదు. ఇలా మనస్సును సంపాదించిః అన్ని కోరికలకు ఆలవాలం చేసుకొని అందులో పరమాత్మ స్థిరపడగలడు. తమ కోరికలను వెలిబుచ్చుకోడానికి వాక్కు ఒకటే మార్గం. జంతువులు, పక్షులు కూడా తమ తమ ధ్వనులద్వారా తమ అవసరా లను వెల్లడిస్తాయి. అవి అన్నీ వాక్కే!– అచ్చులు – హల్లులతో కూడిన మానవభాష కావచ్చును; జంతువులు, పక్షులు, ఇతర ప్రాణులు చేసే అవ్యక్త నాదాలు కావచ్చును.

అన్ని ప్రాణులలో వెల్వడే ముఖ్యప్రాణశక్తి ఇక్కడ 'ప్రాణం' అని ఉదహరించబడింది. అది వ్యవహరించే విధానాన్నిబట్టి వేరువేరు పేర్లు ఏర్పడి నాయి. నాసికాపుటాలద్వారా ప్రయాణించి హృదయాన్ని తాకే ముఖ్యప్రాణాన్ని 'ప్రాణవాయువు' అంటారు. గుండెక్రింద పనిచేస్తూ మలమూత్రాలను వెలిక తోసేసే ముఖ్య ప్రాణాన్ని "అపానవాయు" వంటారు. ప్రాణాపానాలను నియమ

మిస్తూ శరీరానికి పనిచేసే శక్తినిచ్చే దానిని "వ్యానవాయువు" అంటారు. శరీరంలో అన్ని భాగాలకు పుష్టినిస్తూ శిరస్సువైపుకి ఊర్ధ్వంగా ప్రయాణించి, చనిపోయినప్పుడు శరీరాన్ని విసర్జించే దానిని "ఉదానవాయువు" అంటారు. జీర్ణమైన ఆహారాన్ని శరీరంలోని అన్ని భాగాలకు పంచిఇచ్చే దానిని "సమాన వాయువు" అంటారు. మొత్తం ఈ వ్యవహారాలన్నీ సమరసంగా కలిసి పనిచేసేట్లు కనిపెట్టిచూచే ముఖ్యప్రాణాన్ని "అన" మంటారు.

ఈ బ్రాహ్మణంలో 4–15 మంత్రాలు ఈ మూడు ఆహారాల ఆధిభౌతిక ఆధిదైవిక రూపాలు విస్తృతంగా చర్చించబడినాయి. శ్రీ గురుదేవులు వాటిని వదిలేసి తరువాతి శ్లోకంలో ఏయే కర్మలద్వారా మానవ, పితృ, దేవలోకాలను పొందవచ్చునో తెలుపుతున్నారు.

శ్లో॥ మనుష్యలోక స్స్వసుతేన కర్మణా
పితుశ్చ లోక స్సురవేశ్మ విద్యయా।
విజయ్య ఏతైర్న విజీయతే తు యః
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 10

ప్రతి॥ స్వసుతేన = కుమారునిచే, మనుష్యలోకః = మానవలోకము, కర్మణా = కర్మలచే, పితుః + లోకః + చ = పితృలోకమును, విద్యయా = ఉపాసనాదివిద్యచే, సురవేశ్మ = బ్రహ్మలోకము–, విజయ్య = జయించి ఏతైః = ఈ మూడింటిచే, యః + తు = ఎవడైతే, న + విజీయతే = జయింపబడడో, తమా———

## తాత్పర్యం

పుత్రులవల్ల మనుష్యలోకాన్ని, కర్మలవల్ల పితృలోకాన్ని, విద్యద్వారా బ్రహ్మలోకాన్ని అందుకోవచ్చును. ఆహా వీటిద్వారా ఏపరమాత్మను పొందలేడో, ఆ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బృ. ఉ. I. 5. లో చివరిదైన 16–23 మంత్రాలు ఈ శ్లోకంలోను, తరువాతి దాంట్లోను కూడా వివరించబడినాయి.

పుత్రుడున్నప్పుడే తండ్రికి తాను కష్టపడి సంపాదించిన దానిని సరైన వారసుడికి అప్పగించాననే పరమతృప్తి కలుగుతుంది. అందుకే ఈ లోకాన్ని పొందడం, స్థిరపడడం పుత్రుడిద్వారా లభిస్తుందన్నారు.

శ్రాద్ధకర్మలు, ఉత్తమ ధార్మిక కర్మలు చేయడం వలన పితృలోకమూ విద్య లేదా ఉపాసనవల్ల బ్రహ్మలోకము లభిస్తుంది.

నామరూపాలతో కూడిన ఈ మూడు ప్రపంచాలు కేవలం భ్రమాత్మక మైనవి, తాత్కాలిక మైనవి కాబట్టి నిజమైన విచక్షణాజ్ఞానం కల మానవుడు, వాటిని విసర్జించి పరమాత్మను వెదుక్కోవాలి.

శ్లో॥ భవోఽయ మవ్యక్త తదన్యలక్షణ
త్రయం హి వై నామ చ రూపకర్మణీ।
అతో విరజ్యేత బుధో యదీప్సయా
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 11

ప్రతి॥ అయం = ఈ, భవః = లోకము, అవ్యక్త = అవ్యక్తమును, తత్ + అన్య లక్షణః = వ్యక్తమును–అనులక్షణాలుకలదై, నామ + రూప + కర్మణీ + చ = నామరూపకర్మలను, త్రయం + హి + వై = త్రిపుటిరూపమే– అతః = అందుచే, బుధః = పండితుడు, యత్ = ఏ, ఈప్సయా = బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకొనే కోరికచే, విరజ్యేత = విరక్తుడవుతాడో, తం–

## తాత్పర్యం

ఈ ప్రపంచం స్థూలము సూక్ష్మమూకూడా. నామరూపకర్మలనేవి మూడే దాని లక్షణాలు. దేనిని పొందగోరిన వివేకి వీటినుండి విరక్తు డవుతాడో ఆ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

సరిగా యోచించే బుద్ధిమంతునికి నామరూపాల వైవిధ్యమంతా నామం, రూపం, క్రియ–అనే మూడు భ్రాంతులవల్ల తయారయిందని అర్థమవుతుంది.

దేవదత్తుడు, రాముడు, కృష్ణుడు అన్న నామాలు: తెలుపు, నలుపు, ఎరుపు అన్న ఆకారాలు; ప్రతిబింబించడం, కనబడటం, కదలిక అన్నక్రియలు అన్నీ భ్రాంతులే. ఒక్కక్షణం కనబడి మరుక్షణంలో మాయమవుతాయి అందుచేత మానవజీవితానికి ఒక్కటే పరమార్థం, లక్ష్యం—పరమాత్మను కనుక్కోవడమే!

ఈశ్లోకంతో అయిదు బ్రాహ్మణాలతో కూడిన ఒకటో అధ్యాయం ముగిసింది. తరువాతి శ్లోకంనుండి రెండోఅధ్యాయం మొదలు.

శ్లో॥ రవీందు విద్యుత్ప్రముఖేషు పూరుషో
విచింత్యతే బ్రహ్మ తదన్యదూచివాన్।
అజాతశత్రు ర్మునయేఽపి యత్పరం
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 12

ప్రతి॥ తత్ + అన్యత్ + ఊచివాన్ పూరుషః = బ్రహ్మజ్ఞానములేని పురుషుడు, రవి + ఇందు + విద్యుత్ + ప్రముఖేషు = సూర్యచంద్ర విద్యుదాదులందు, బ్రహ్మ = బ్రహ్మగా, విచింత్యతే = ధ్యానించునో, యత్పరం = దేనికంటె, మునయే + అపి = మునికికూడా, అజాతశత్రుః = అజాతశత్రువు బోధించెనో, తం——

## తాత్పర్యం

సూర్యునిలో, చంద్రుడిలో, విద్యుత్తులో వున్న పురుషుణ్ణి బ్రహ్మగా ధ్యానించి మునికి అజాతశత్రువు బ్రహ్మము వాటికన్న భిన్నమని ఏపరమాత్మ తత్త్వాన్ని బోధించి సరిదిద్దాడో, ఆ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

గురుదేవులు బృ. ఉ. **2. 1** లోని **1–14** మంత్రాల సారాన్ని ఈశ్లోకంలో పొందుపరిచారు.

మొదటి అధ్యాయంలో నిజమైన సాధకుడు అంతర్ముఖ విచారణద్వారా తన ఆత్మనుగురించి ధ్యానంచేయాలని నిస్సందేహంగా రుజువుచేయబడింది.

ఉపాసనయొక్క పరమావధి ఆత్మనుగురించిన సరైన సమగ్రమైన జ్ఞానాన్ని సంపాదించడం, అనుభూతిని పొందడం. అన్నింటికన్న అమూల్యమైనది, శాశ్వతమైనది కాబట్టి ఆత్మనే కోరి, భజించి, ధ్యానించి అందుకోవాలి. ఇది చెప్పబడింది.

అయితే మొదటి అధ్యాయంలో విధింపబడిన ఉపాసన బహిర్ముఖమైనది. కర్మవిధి ముసుగులో కప్పబడివున్నది సూటిగా ఆత్మను ప్రకాశింపజేయదు. అందువలన ఈ అధ్యాయంలో ఋషి ఆత్మని వెల్లడించే ఆధ్యాత్మిక ఉపాసనలను విధించి ఆత్మానుభవానికి సాధకుణ్ణి దగ్గిరకి చేర్చుతారు ఇది ఒక చక్కనికథ ద్వారా నిరూపింపబడుతోంది. దానిద్వారా ఇందులోని భావాలు తేలికగా, స్పష్టంగా సూటిగా అర్థమవుతాయి.

గర్గగోత్రానికి చెందిన గార్గ్యముని అనే బ్రహ్మజిజ్ఞాసువు బాహ్యమైన వ్యక్తరూపాన్ని బ్రహ్మోపాసనగా చేసి బ్రహ్మమంటే అధిదైవిక శక్తులలో ఇమిడివుండి వాటికి శక్తినిచ్చే తత్త్వమని తప్పునిర్ణయానికి వచ్చాడు. దీనివల్ల అతడికి పరమాత్మతత్త్వాన్ని గురించిన అజ్ఞానంతోబాటు అహంకారాన్ని అభిమానాన్ని కూడా పెంచింది. తాను బ్రహ్మజ్ఞానినని చెప్పుకుంటూ కాశీ రాజైన అజాతశత్రువువద్దకు వెళ్ళి ఆయనకు బ్రహ్మవిద్యోపదేశం చేస్తానన్నాడు రాజా అజాతశత్రువు బ్రహ్మజ్ఞాని అతడిలో ఎలాంటి కల్మషమూ మోసమూ లేవు. ఎంతో వినయశీలి. గర్గ్యమునిని సగౌరవంగా ఆహ్వానించి మన్నించాడు. సాధారణంగ పండితులు, జిజ్ఞాసువులు, బ్రహ్మవిద్యాపారంగతులు, పండిత సత్కారం ఘనంగాచేసే వితరణగుణం కలిగిన జనక మహారాజువద్దకు వెళ్ళుతారు. ఆయన వద్దకు వెళ్ళకుండా తనవద్దకు వచ్చినందుకు, అడగకుండానే బ్రహ్మవిద్యను ఉపదేశిస్తా నన్నందుకుగాను సంతోషించి గర్గ్యమునికి వేయి గోవులను, గురుదక్షిణను ఇస్తానన్నాడు ఇలా దక్షిణను వాగ్దానంచేసి బ్రహ్మవిద్యను ఉపదేశించుమని అడిగాడు.

1) గర్గ్యుడిలా అన్నాడు – రాజా, బ్రహ్మోపాసనలో ముఖ్యప్రాణాన్ని సూర్యునిలో ఉన్న పురుషుడిగా, కంటిలో ద్రష్టగా, పరబ్రహ్మగా నేను ఉపాసిస్తాను.

అది పరబ్రహ్మం కాదని, పరిమితబ్రహ్మముయొక్క జ్ఞానాన్నే కలిగిస్తుందనీ అజాతశత్రుడు బదులు చెప్పాడు.

2) అప్పుడు గార్గ్యుడు రెండో ఉపాసన చెప్పాడు — ముఖ్యప్రాణాన్ని చంద్రుడిలో వున్న పురుషునిగాను, మనస్సులో భావించేవాడిగాను, పరబ్రహ్మగాను ఉపాసిస్తానన్నాడు.

అజాతశత్రువు అది పరిమితమైన బ్రహ్మముయొక్క జ్ఞానమే అని బదులు చెప్పాడు.

3) విద్యుత్తులోని శక్తిగాను, చర్మంలోని స్పర్శగాను, హృదయంలోని అనుభవదారుగా ఉపాసిస్తానని గార్గ్యుడు అన్నాడు.

ఇలా వరుసగా గర్గ్యముని పదకొండురకాల ఉపాసనలు చెబుతూ వచ్చాడు.

4) వాయువుగా, ప్రాణాలుగా, హృదయంలోని భావుకుడుగాను—

5) అగ్నిలోని చోదనంగా, వాక్కులోని వక్తగా, హృదయంలోని అనుభవదారుగాను—

6) నీటిలోని శక్తిగా, రేతస్సులోని బీజంగా, హృదయంలోని అనుభవదారుగాను—

7) అద్దంలోని ప్రతిబింబంగా, హృదయంలోని అనుభవదారుగా—

8) మానవుడు నడుస్తూండగా అతడి ఉనికిని తెలియజేసే ధ్వనిగాను ముఖ్యప్రాణంగాను—

9) దశదిశలుగా, హృదయంలో వినేవాడుగా, హృదయంలో అనుభవదారుగాను—

10) ఆకారాల నీడగా, ఆత్మనెరుగని అజ్ఞానంయొక్క పొరగాను—

11) ప్రజాపతిగాను,బుద్ధిలో విచారశీలిగా,హృదయంలో అనుభవదారుగాను-

గర్గ్యముని ఈ ఉపాధులన్నింటిలో పనిచేసే ముఖ్యప్రాణాన్ని, అందులోని సూక్ష్మరూపాన్ని పరబ్రహ్మగా ఉపాసిస్తున్నాడు. ఈ పదకొండు ఉపాసనలద్వారా అనంతమైన పరబ్రహ్మస్వరూపాన్ని అందుకోడం సాధ్యం కాదు. అజాతశత్రువు నిష్కర్షగా ఈవిషయాన్ని గార్గ్యుడికి చెప్పవలసివచ్చింది. ముని కొంతసేపు నిశ్శబ్దంగా వున్నాడు. తరువాత పరబ్రహ్మతత్త్వాన్ని తనకు ఉపదేశించుమని రాజును అడిగాడు. ఆయన బ్రాహ్మణుడు, తాను క్షత్రియుడు తన కన్న ఎక్కువైన కులానికి చెందినవానికి ఉపదేశం చేయడానికి అజాతశత్రువు కొంచెం వెనకాడాడు. అయితేనేం, చివరికి బ్రహ్మవిద్యని ఉపదేశించాడు ఆ ఉపదేశం ఏమిటో తరువాతిశ్లోకం వివరిస్తుంది.

పైకథలోని మిగతా వివరాలను తెలుసుకోడానికి ఉపనిషత్తును, దాని భాష్యాన్ని చదవాలి.

శ్లో॥ హృదంబుజే వ్యోమని యత్ర ధీమయ
స్సుఖేన శేతే నృపబాలవిప్రవత్।
అఖండసద్బ్రహ్మ తదేవ సాక్షి చిత్
తమాశ్రయామ్యుత్తర కాశికా ధవమ్॥ 13

ప్రతి॥ యత్ర = ఏ, హృదయంబుజే = మనః కమలమనెడి, వ్యోమని = ఆకాశమందు, ధీమయః = పండితుడు, నృప + బాల + విప్రవత్ = రాజు, బాలుడు, బ్రాహ్మణునివలె, సుఖేన = సుఖముగా, శేతే = నిదురించుచున్నాడో, తత్ + ఏవ = అదియే, అఖండసత్ + బ్రహ్మ = పరమాత్మ, సాక్షిచిత్ = ప్రత్యక్షజ్ఞానము, తం——

## తాత్పర్యం

గాఢసుషుప్తిలో పరబ్రహ్మము హృదయపద్మంలో తన అనంత సద్భావంలో తేజోమయుమై, మహిమాన్వితమై సర్వజ్ఞమై సాక్షిచైతన్యంగా ఉండి సామ్రాట్టులాగా, బాలుడిలాగా, ఆత్మజ్ఞాని అయిన బ్రాహ్మణుడివలె అఖండానందాన్ని అనుభవిస్తూ పడుకొని ఉంటాడు. ఆ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఈ శ్లోకంలో 2వ అధ్యాయంలోని మొదటి బ్రాహ్మణంయొక్క 15–20 మంత్రాలభావం సూచితమైంది.

సాంప్రదాయానుసారంగా శిష్యుణ్ణి అధ్యయనంలోకి దించకుండా, అజాతశత్రువు గార్గ్యమునిని చేయి పట్టుకొని గాఢనిద్రలో మునిగివున్న ఒక మనుష్యుని వద్దకు తీసుకొనివెళ్లాడు. వేరువేరు పేర్లతో పిలిచి అతణ్ణి లేప బోయాడు. ఆ మనిషి లేవలేదు. అతడి శరీరాన్ని పట్టుకొని కుదిపేసరికి లేచాడు. అతణ్ణి ఉదాహరణగా చూపుతూ రాజు, "ఇతడు గాఢనిద్రలో ఉన్నప్పుడు సర్వజ్ఞమైన అతడి ఆత్మ ఎక్కడ వున్నది?" గార్గ్యుడు సమాధానం చెప్పలేకపోయాడు. అతడి కావిషయం తెలియదు. అప్పుడు అతనికి సుషుప్త్యావస్థలో ఆత్మ ఎక్కడ వున్నదో బోధింపబడింది.

ఇంద్రియాలు, మనోబుద్ధులద్వారా వ్యక్తమైనప్పుడు ఆత్మ ప్రదర్శించే తన అన్ని ప్రత్యేకతలను ఉపసంహరించుకొని గాఢనిద్రలో తన స్వస్వరూపాన్ని చేరుకుంటారని అజాతశత్రువు చెప్పాడు. ఇలా ఉపసంహరించుకొన్నప్పుడు ఆత్మ హృదయావేశంలో ఉంటుంది. హృదయ కమలంలో ఉండే ఆవేశం అది. అంతా జాగ్రత్స్వప్నావస్థలలో శరీరమనోబుద్ధులద్వారా విస్తరించుకొనే ప్రత్యేకజ్ఞానాలన్నీ గాఢనిద్రలో వెనక్కి లాగుకోబడుతాయి. "స్వయం అపితి ఇతి" అంతా తనలోకి తిరిగివస్తాయి ఈ స్థితిలో చూపు, వినికిడి, స్పర్శ, వాసనచూడడం, మాట్లాడడం, యోచించడం—ఈ శక్తులన్నీ ఉపసంహరించుకోబడి శుద్ధాత్మలో లీనమైపోతాయి. అది అనంత సర్వజ్ఞ సాక్షిగా ఉండిపోతుంది.

ఉపనిషత్తులో ఈ అంతరాత్మయొక్క ప్రత్యేక జ్ఞానాలు జాగ్రత్స్వప్నాలలో డెబ్బయిరెండుకోట్ల సూక్ష్మచైతన్య నాడులద్వారా ఇంద్రియమనోబుద్ధులలో నుండి విస్తరించుకొంటుందని చెప్పబడింది. ఆ విచ్చుకోడం జీవుళ్లకర్మలను, వాసనలను అనుసరించి వుంటుంది గాఢనిద్రలో ఉపసంహరణకూడా ఈ డెబ్బయిరెండుకోట్ల నాడులద్వారానే జరుగుతుంది. ఇలా పూర్ణంగా ఉపసంహరించుకొన్న ఆత్మ "పురీతత్" అనేనాడిలో వసించివుంటుందనికూడా ఉపనిషత్తు

పేర్కొన్నది, ఈ ఉపసంహరణను అపాయకుడైన పసిబాలుడు, మహా చక్రవర్తి, ఆత్మజ్ఞాని అయిన బ్రాహ్మణుని సుఖశాంతిపూర్వకమైన దివ్య సుషుప్తితో పోల్చారు.

తన సద్భావరూపంలో ఉన్న పరమాత్మ వ్యష్టి, సమిష్టిస్థాయిలలో ఈవిధంగా జాగ్రత్స్వప్న సుషుప్తులలో విస్తరణ, ఉపసంహరణలను చేయడం సాలీడు తనలోంచి బయటకు తెచ్చి, దిగమింగే తంతువుతో పోల్చారు. అగ్ని నుండి వేలాదిగా ఎగిరివచ్చే విస్ఫులింగాలతో కూడా పోల్చబడింది. అన్ని మార్పులకు గుణాలకు అతీతుడైన పరమాత్మ దేనిమీద ఆధారపడకుండానే ఏడులోకాలుగా, వాక్కు, చూపు మొదలైన ప్రాణాలుగా విస్తరించుకొంటాడు, తిరిగి తనలోకి కలిపివేసుకుంటాడు.

తరువాతి శ్లోకంలో ముఖ్యప్రాణాన్ని హృదయంలో నివసించే పసిపాపగా కొందరు సాధకులు ఉపాసించే విధానం చెప్పబడింది.

శ్లో॥ విదంతి యం ప్రాణశరీరకం శిశుం
శరీర మాధాన మముష్య కేచన।
శిరోవరాధాన మధాన్నబంధనీ
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 14

ప్రతి॥ కేచన = కొందరు, యం = ఏ ముఖ్యప్రాణమును, ప్రాణశరీరకం = ప్రాణమున్న శరీరముగల, శిశుం = శిశువుగా, విదంతి = తెలియుచున్నారు, అముష్య = ఈముఖ్యప్రాణమునకు, శరీరం = శరీరము, ఆధానం = ఆధారము, శిరః = శిరస్సు, వర = శ్రేష్ఠమైన, ఆధానం = ఆధారము, అథ = మరియు, అన్నబంధనీ = అన్నమూలకము, తం—

## తాత్పర్యం

కొందరు సాధకులు ఈ ముఖ్యప్రాణాన్ని శరీరాన్ని ఆధారం చేసుకొన్న శిశువుగా ఉపాసిస్తారు. ఏడుకన్నాలతో కూడిన శిరస్సు ముఖ్యప్రాణంయొక్క

శరీరం కాబట్టి ఏడుకన్నాలను ఎంతో పవిత్రంగా ఎంచుతారు ముఖ్యప్రాణం ఈ శరీరానికి అన్నమనే రజ్జువుతో బంధింపబడివుంటుంది ఇలా ముఖ్య ప్రాణాన్ని ఎరిగిన వాళ్లు పరమాత్మను ఎరుగుదురు. ఆ ఉత్తర కాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బృ. ఉ. 2. 2. లోని ముఖ్యభావాలు ఈ శ్లోకంలో పొందుపరచబడి వున్నాయి.

ఇంద్రియాలు స్వతహాగా బహిర్ముఖమైనవి. ముఖ్యప్రాణం అంతర్ముఖం విషయవస్తువులతో దానికి సూటిగా సంబంధం లేదు. అందుకే అంతర్ముఖ మనడం. ఈ కారణంచేత అంతర్ముఖమై తనలో తాను నిమగ్నమై ఉండే శిశువుతో పోల్చారు. రెండుకళ్ళు, రెండుచెవులు, రెండుముక్కులూ, నోరు— ఈ ఏడింటి ద్వారా ప్రాణంయొక్క వ్యవహారాలు నడుస్తాయి. ఈ ఏడూ తలలోనే వున్నాయి కాబట్టి శిరస్సు ముఖ్యప్రాణమనే శిశువుకి ముఖ్యాధారం.

మనం తినే అన్నంద్వారా ముఖ్యప్రాణం శరీరంలో నిలిచి వృద్ధిపొందు తుంది. అందుచేత అన్నమే ప్రాణాన్ని శరీరానికి బంధించివుంచే త్రాడు.

పరమాత్మను శరీరంలో ఉన్న ముఖ్యప్రాణంగా ధ్యానిస్తూ శరీరం దానికి ప్రాథమిక ఆధారమనీ, తల దానికి ప్రత్యేక ఆధారమనీ తెలిసిన సాధకుడు ఇంద్రియాలను నిగ్రహించి దానిని శక్తిమంతం గావించుకుంటాడు. తాను ఇంద్రియాలపైన పూర్తి స్వాధీనతను పొందగలుగుతాడు. ఈ ఏడింటి మీద పూర్తి అధికారం పొందాలని ఆశించేవాడు తక్కిన ఇంద్రియాలను నిగ్రహించడం తప్పనిసరి.

ఉపనిషత్తులో దీనిని శిశుబ్రాహ్మణ మన్నారు. దానిసారమే ఈశ్లోకంలో చెప్పబడింది

తరువాతి శ్లోకంలో వ్యక్తమైన పరమాత్మయొక్క సద్భావం వివరింప బడుతుంది. సగుణబ్రహ్మకు స్థూలసూక్ష్మ రూపాలు రెండు వుంటాయి. ఈ

రెండురూపాల సగుణబ్రహ్మనికి అతీత మైనది నిర్గుణ పరబ్రహ్మము. అది అవ్యక్తం. మనస్సుకు, వాక్కుకు అందదు. "నేతి", "నేతి" అనే అభ్యాసంవల్ల మాత్రమే దానిని తెలుసుకొని సాక్షాత్కారం చేసుకోవచ్చును. ఈభావాలన్నీ రాబోయే శ్లోకంలో ఉన్నాయి.

శ్లో॥ సదస్తి మూర్తం కుజలానలాత్మకం
త్యదస్త్యమూర్తం మరుదంబరాత్మకం।
అతీత్య చైతేఽవధిభూ ర్విభాతి యత్
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 15

ప్రతి॥ కు + జల + అనల + ఆత్మకం = భూమి, నీరు, అగ్నిరూపాత్మకమైన, మూర్తం = ఆకారము, సత్ + అస్తి = సత్తుగా ఉన్నది, మరుత్ + అంబర + ఆత్మకం = వాయువు, ఆకాశరూపమయిన, అమూర్తం = ఆకారములేని, త్యత్ = త్యత్తు వున్నది, ఏతే = ఈరెంటిని, అతీత్య = దాటి, అవధిభూః = చరమరూపమై, యత్ = ఏది, విభాతి = భాసిల్లునో, తమా——

## తాత్పర్యం

తన సద్భావంలో పరమాత్మ భూ, జలాగ్ని రూపాన్ని ధరించినప్పుడు స్థూలమై ఇంద్రియాలకు గోచరమవుతాడు. వాయు, ఆకాశ రూపాలను ధరించినప్పుడు సూక్ష్మరూపియై అమూర్తరూపంలో ఉంటాడు. ఈ రెంటికీ అతీతమై నిత్యమూ పరమసత్యమై ప్రకాశించే ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బృ. ఉ 2. 3. లోని భావాలు ఈశ్లోకంలో పేర్కొనబడినాయి. దీనిని మూర్త–అమూర్త బ్రాహ్మణ మంటారు. పరమాత్మయొక్క వ్యక్తస్వరూపం స్థూలసూక్ష్మ రూపాలు రెండుగా విశ్లేషించబడింది. సమిష్టి, వ్యష్టి రెండు స్థాయిలలోను ఈవిశ్లేషణ జరిగింది.

సమిష్టి స్థాయిలో అంటే ఆధిదైవికంలో భూజలాగ్నులు సగుణబ్రహ్మము యొక్క వ్యక్తస్వరూపాలు. ఇది అయన స్థూలవ్యక్తిత్వం. కంటికి కనబడు తుంది. ఈమూటిని సృజించడానికి కారణం సూర్యశక్తి కాబట్టి కంటికి దృశ్య మైన సూర్యుడు స్థూల సగుణబ్రహ్మముయొక్క సారభూత వ్యక్తరూపం ఆకాశము, వాయువు — రెండూ కంటికి కనబడవు. అవి సగుణబ్రహ్మము యొక్క సూక్ష్మరూపం. ఈ రెంటిసారమూ సూర్యునిలో ఉన్న పురుషుడు. సూర్యునిలో వెలుగొందే పరమాత్మసారం ఈ పురుషుడు.

వ్యష్టిలో ప్రాణం, మానవహృదయంలోని ఆకాశం— ఈరెంటినీ వదిలేస్తే మిగిలిన యావత్తు దేహము భూజలాగ్నుల స్థూలరూపం, ఈస్థూలరూపానికి సారమైన ప్రతినిధి కుడికన్ను. ప్రాణము — ఆకాశము సగుణబ్రహ్మము యొక్క సూక్ష్మరూపం కుడికంటిలోని ద్రష్ట వాటి సారం.

సగుణబ్రహ్మములో నిజానికి ఆధిదైవిక, ఆధ్యాత్మిక తత్త్వాలలో భేదం లేదు. ఉపాధులతో ఉండే తాదాత్మ్యంవలన సమిష్టి, వ్యష్టిస్థాయిలలో సగుణ బ్రహ్మము ఎలా వ్యక్తమౌతుందో తెలుపడంకోసమే ఈభేదం చూపబడింది. ఈ విషయం ఏడో ప్రపాఠంలో చెప్పబడింది. తరువాతి దానిలో కూడా చెప్పబడుతుంది.

సగుణబ్రహ్మముయొక్క స్థూలసూక్ష్మ రూపాలనే భావాలు పరమాత్మను గురించి మనలో ఉన్న అవిద్యావిక్షేపాలవల్ల కలుగుతున్నాయి. వీటికి నిగూఢ మైన మన వాసనలే కారణం. పరమాత్మను తెలుసుకోగోరే జిజ్ఞాసువు "నేతి", "నేతి" విధానం ద్వారా ఈ సగుణబ్రహ్మ రూపాల నన్నింటిని తిరస్కరించి సర్వాతీతమైన బ్రహ్మని హృదయంలో దర్శించాలి.

తరువాతి శ్లోకంలో మైత్రేయబ్రాహ్మణం వివరింపబడుతుంది.

యాజ్ఞవల్క్యమహర్షికి ఇద్దరు కాత్యాయిని, మైత్రేయి అని భార్యలు. వారిలో మైత్రేయి చాలా తెలివైంది, జిజ్ఞాసకలది. సన్యసించడానికి సిద్ధపడు తున్న యాజ్ఞవల్క్యుడు తన భౌతిక సంపదను ఇద్దరిభార్యలకు సమానంగా పంచిఇచ్చాడు మైత్రేయి భర్తని ప్రశ్నించింది— "స్వామీ! భూమిలో ఉన్న

యావత్సంపదని మీరు నాకు ఇచ్చినా దానివల్ల నాకు మోక్షం వస్తుందా? ప్రాపంచిక బంధనాలనుండి పూర్తి విడుదల కలుగుతుందా?"

మహర్షి తన భార్యకి ఇచ్చిన జవాబు రాబోయే శ్లోకంలో కనబడుతుంది.

శ్లో॥ న విత్తపూర్ణాచలయా చ లభ్యతే
యదాత్మ భావామృత భావనిర్వృతిః।
సుఖం సుఖాన్యాహరతీవ విత్తవాన్
తమాశ్రయామ్యుత్తర కాశికా ధవమ్॥ 16

ప్రతి॥ యత్ = ఏ, ఆత్మభావ = ఆత్మరూపముచే, అమృత = శాశ్వతమైన, భావనిర్వృతిః = ఆనందమనునది, విత్తపూర్ణా = నిండినసంపదచేతను, అచలయా + చ = భూమిచేతను, న + లభ్యతే = పొందబడదు, విత్తవాన్ = ధనికుడు, సుఖాని + ఆహరతీ + ఇవ = సుఖాలను పొందు చున్నవానివలె, సుఖం = సుఖమును, (పొందుచున్నాడు) తమ్———

## తాత్పర్యం

సంపూర్ణ విత్తంతో కూడిన యావద్భూమినీ సంపాదించినా మానవుడు పరమాత్మ స్వలక్షణమైన శాశ్వతానందాన్ని పొందలేడు. ధనవంతుడు సుఖంగా అన్ని భోగాలను పొందగలడు, ఆత్మానందాన్ని కాదు. ఆ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బృ. ఉ. 2. 4 లోని 1. 2 మంత్రాభావాలు ఇక్కడ చెప్పబడినాయి.

యాజ్ఞవల్క్యుడు తన భార్య మైత్రేయితో ఇలా అన్నాడు— "భూమి లోని యావత్సంపద నీకు ఉంటే ఇతర భాగ్యవంతులలాగే బాహ్యప్రపంచం లోని భోగాలు, సుఖాలు నీకు లభిస్తాయి. భోగాలు కోరేవారికి మోక్షకాంక్ష లేశమైనా ఉండదు. కాబట్టి మోక్షం ఎన్నటికీ దొరకదు."

భర్త జవాబును వినగానే మోక్షంకోసం తపిస్తున్న మైత్రేయి యాజ్ఞవల్క్యుడితో అన్నది—"మోక్షం ఇవ్వని ఈ సంపదవల్ల నాకేమి ప్రయోజనం?" అన్నది. అక్కడితో ఆగక తనకు శాశ్వతపదాన్ని ప్రసాదించే జ్ఞానబోధ చేయుమని అడిగింది.

అందుకు సమాధానంగా ఆయన అన్నిభోగాలపట్ల పూర్తి నిస్సంగాన్ని పెంచుకోమని ఆమెకు సలహా ఇచ్చాడు. ఇది తరువాతి శ్లోకంలోని విషయం.

శ్లో॥ యదాత్మకామాయ పతిః ప్రియోభవేత్
యదాత్మకామాయ చ కామినీప్రియా।
యదాత్మకామాయ సుతః ప్రియో భవేత్
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 17

ప్రతి॥ యత్ = ఏ, ఆత్మకామాయ = తనకోరికకు, పతిః = భర్త, ప్రియః = ప్రియమైనవాడు, భవేత్ = అగును, యత్ = ఏ, ఆత్మకామాయ = తనకొఱకు, కామినీ + చ = కామినియు, ప్రియా = ప్రియురాలు, భవేత్ = అగును, యత్ = ఏ, ఆత్మకామాయ = తనకొఱకు, సుతః = పుత్రుడు, ప్రియః = ప్రియమైనవాడు, భవేత్ = అగును, తమ్———

## తాత్పర్యం

ఏ ఆత్మకోసం పత్నికి పతి ప్రియుడవుతాడో, ఏ ఆత్మకోసం పతికి పత్ని ప్రియురాలవుతుందో, ఏ ఆత్మకోసం తండ్రికి సుతుడు ప్రియుడవుతాడో, ఆ ఆత్మ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బృ. ఉ. 2. 4. లోని 4, 5 మంత్రాల భావాలు ఇందులో ఇమిడివున్నాయి.

నామరూపాల భ్రాంతి పూర్వకమైన ఈజగత్తులో ఏవస్తువు దానికోసమే ప్రీతికరం కాదు. ❋ అన్ని వస్తువులు తన ఆత్మకోసమె ప్రియంగా ఎంచుకో బడుతాయి.

ఇదే భావం తరువాతి శ్లోకంలో కూడా వెల్లడించబడుతోంది.

శ్లో॥ యదాత్మకామాయ వసుప్రియం భవేత్
తథా చ లోకామర జన్తవః ప్రియాః।
యదాత్మనోఽర్థే నిఖిలం చ వల్లభం
తమాశ్రయామ్యుత్తర కాశికా ధవమ్॥ 18

ప్రతి॥ యత్ = ఏ, ఆత్మకామాయ = తనకోరికల కొఱకు, వసు = సంపద, ప్రియం భవేత్ = ప్రీతిపాత్రము, తథా + చ = అట్లే, లోక + అమర + జంతవః = లోకాలు,దేవతలు, ప్రాణులును, ప్రియాః = ప్రియములు యత్ = ఏ, ఆత్మనః = ఆత్మయొక్క, అర్థే = కొఱకు, నిఖిలం + చ = సమస్తమును: వల్లభం = ప్రీతిపాత్రము, తం—

## తాత్పర్యం

ఏ ఆత్మకారణంగా సంపద ప్రియమవుతుందో, ఏ ఆత్మకారణంగా లోకాలు, దేవతలు, ప్రాణులు ప్రియం అవుతాయో, ఏ ఆత్మకోసం యావత్తు ప్రియం అవుతుందో ఆ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను,

---

❋ "...న వా అ రే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి, ఆత్మనస్తు కామాయ పతిః ప్రియోభవతి నవా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవతి, ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి, న వా అరే పుత్రకాః కామాయ పుత్రాః ప్రియా భవన్తి.ఆత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవంతి నవా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవతి. ఆత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి.

## వ్యాఖ్య

ఈశ్లోకంలోకూడా ముందు మంత్రాలభావాలే వెల్లడింపబడ్డాయి. ఈ రెండుమంత్రాలలో ఇచ్చిన ఉదాహరణల ద్వారా యాజ్ఞవల్క్యమహర్షి ఐహికాముష్మిక వస్తువు లన్నింటిపట్ల మనకుండే ప్రేమలకు, వ్యామోహాలకు, ఆవేశాలకు, కామాలకు ప్రాథమిక మూలకారణం ఆత్మ అని, ఆత్మ మాత్రమే నని ఉద్ఘాటించాడు. ఆత్మకోసం కాకపోతే భార్య, పుత్రులు, భర్త, ఆస్తి, ఆధ్యాత్మిక ప్రగతులు — వీటికి విలువ, వినియోగం ఉండవు. ఆత్మ కాని దీనికోసం మనం మమకారం పెట్టుకున్నా దానికి ప్రాముఖ్యత లేదు. ఆత్మకి భిన్నమైనవన్నీ తుచ్ఛమైనవి, క్షుద్రమైనవి అంతరాత్మపట్ల దృఢభక్తి, భరించని అనురాగమే సాధించబడవలసినది.

ఆత్మ అంటే ఏమిటి, దానిని సాక్షాత్కరింపజేసుకోడమెలా అనే విషయాలు మహర్షి మైత్రేయికి బోధించాడు. రాబోయేశ్లోకం ఈవిషయాన్ని తెలుపుతుంది.

శ్లో॥ యదాత్మనః ప్రేష్ఠతమస్య దృష్టయే
శ్రుతి ర్మతిర్ధ్యానమపి ప్రకీర్త్యతే।
తథా విదన్ బ్రహ్మ భవత్యశేషవిత్
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 19

ప్రతి॥ యత్ = ఏ, ప్రేష్ఠతమస్య = అత్యంత శ్రేష్ఠమయిన, ఆత్మనః = పరమాత్మను, దృష్టయే = చూచుటకొఱకు, శ్రుతిః = శ్రవణము, మతిః = మననము, ధ్యానం + అపి = నిధిధ్యాసముకూడ, ప్రకీర్త్యతే = చెప్పబడుచున్నదో, తథా = అట్లు, విదన్ = తెలిసికొంటూ, అశేషవిత్ = పరిపూర్ణజ్ఞాని, బ్రహ్మ = బ్రహ్మగా, భవతి = అగుచున్నాడు——

## తాత్పర్యం

ప్రియాత్ప్రియమైన ఈఆత్మను దర్శించడానికి శ్రవణ మనన ధ్యానాదులు విధానమని కీర్తింపబడుతాయి. అలా ఆత్మదర్శనాన్ని పొందిన విద్వాంసుడు సర్వజ్ఞు డవుతాడు. ఆ పరమాత్మ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఈ బ్రాహ్మణంలో అయిదో మంత్రంలోని చివరి భాగాన్ని పైశ్లోకం వివరించింది.

ఏ ఆత్మకోసం ఈలోకంలోని అన్ని వస్తువులు ఇతర లోకాలు ప్రియ మవుతాయో ఆ ప్రియాతిప్రియమైన ఆత్మను గురించియే తెలుసుకోవాలి. దానినే చూడాలి. దానిని గురించి శ్రవణంచేసి, మననంద్వారా, గ్రహించి సాంప్రదాయానుసారం ధ్యానం చెయ్యాలి. ❋ సమర్థుడైన గురువును సమీపించి శాస్త్రాధ్యయనం చెయ్యాలి. గురువుద్వారాను, శాస్త్రాలనుండి తెలుసుకున్న దానిని లోతుగా మననం చెయ్యాలి. అటుపిమ్మటనే అంతర్ముఖుడై ధ్యానం చెయ్యాలి.

ఆత్మ నెరిగిన వాడు సర్వాన్ని ఎరిగినవా డవుతాడు. ఎందుకంటే ఆత్మ కంటె అన్యమైనది ప్రపంచంలో లేదు.

స్వర్గంలోని దేవతలందరూ పరమాత్మయొక్క వేరువేరు వ్యక్తస్వరూపాలే దేవతలను పరమాత్మకన్న భిన్నంగా ఆరాధించేవారు మోక్షాన్ని పొందరు. ఈవిషయం తరువాతి శ్లోకంలో స్పష్టీకరించబడుతున్నది.

శ్లో॥ యదాత్మనోఽన్యత్ర సురాదికాన్ విదన్
పరాక్రియేతాజ్ఞతమ స్సదుష్టుతైః।
జగత్సమస్తం హి పతత్త్వ మాత్మనః
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 20

---

❋ ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః మంతవ్యః నిధిధ్యాసితవ్యః మైత్రాయీ ఆత్మనో వా అరే దర్శనేన శ్రవణేన, మత్యా విజ్ఞానే నెదం సర్వం విదితమ్!

ప్రతి॥ యత్ = ఏ, ఆత్మనః = ఆత్మకంటె, అన్యత్ర = భిన్నంగా, సురాదికాన్ = దేవాదులను, విదన్ = తెలిసి, సత్ + ఉష్టుతైః = మంచిమాటలచే, అజ్ఞతమః = అజ్ఞాని, పరాక్రియేత = దూరంగా దొలగింపబడుచున్నాడు, సమస్తం + జగత్ = ఈ జగత్సర్వస్వము, ఆత్మనః = ఆత్మయొక్క, సతత్త్వం = స్వరూపమే——

## తాత్పర్యం

ఎవరైనా దేవతలు మొదలైన వారిని తమ ఆత్మకన్నా భిన్నంగా భావించి అజ్ఞానాంధకారంలో చిక్కుకొని ఆరాధించితే దానివల్ల వారు ఆత్మకు దూరమై పోతారు. సమస్తప్రపంచము పరమాత్మ స్వరూపమె. ఆ ఉత్తరకాశీప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

ఈశ్లోకం ముందుశ్లోకంలోని భావంయొక్క విస్తరణ. బ్రాహ్మణంలోని 6వ మంత్రభావాన్నికూడా ఈ శ్లోకం వివరిస్తుంది.

పంచమహాభూతాలు,స్వర్గంలోని దేవతలు, మానవులలోని చాతుర్వర్ణ్యాలు ప్రపంచంలోని చరాచరప్రాణులు – సర్వమూ ఆత్మలో పుట్టి ఆత్మలో నిలిచి ఆత్మలో కలిసిపోతాయి. అందువల్ల పరమ శక్తిమంతమైన అద్వయ పరమాత్మ కన్న భిన్నమైన దంటూనే లేదు. ఈ పరమసత్యాన్ని గ్రహించని వాడు ద్వైత మనే వలలో చిక్కుకొనిపోతాడు. పరమాత్మను గురించి ద్వైతభావం ఉన్న వాడు అద్వయాత్మను గుర్తించి మోక్షాన్ని పొందలేడు.

అయితే అద్వయాత్మను గురించిన సమగ్రజ్ఞానం అంత తేలికగా లభించదు. తరువాత శ్లోకం ఒక ఉపమానంద్వారా దీనిని వివరిస్తుంది.

శ్లో॥ నకించి దస్తి వ్యతిరేకతశ్చితే
స్తతస్త దాత్మత్వ మనాత్మవస్తునః।
నినాదవ ద్దుందుభి శంఖయోర్భ్రశం
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 21

ప్రతి॥ చితేః = జ్ఞానముకంటె, వ్యతిరేకతః = భిన్నంగా, కించిత్ + న + అస్తి = ఏదీలేదు, తతః = అందువలన, తత్ = అది, అనాత్మవస్తునః = ఆత్మవస్తువు కానిదానికి, ఆత్మత్వం = ఆత్మస్వరూపమే—, దుందుభి శంఖయోః = దుందుభి శంఖములయొక్క, నినాదవత్ = నాదమువలె, భృశం = మేలైనది,——

## తాత్పర్యం

అనంత శక్తులలో ఏకమైన ఆత్మయే జగత్తులోని బహురూపాలతో విజృంభించింది. అందుచేత చిత్తుకన్న వేరైన వస్తువే లేదు. అనాత్మగా వేర్వేరు రూపాలలో కనబడేది యావత్తు ఆత్మ తత్త్వమే. ఆ పరమాత్మ ఉత్తరకాశీ ప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బ్రాహ్మణంలోని 7వ మంత్రభావం ఇందులో వివరింపబడింది.

గట్టిగా మ్రోగుతున్న రణభేరీధ్వనులలో ఏభేరీది పెద్దధ్వనో దేనిది చిన్నధ్వనో వివరంగా తెలియదు. బేరీధ్వనితో పరిచయం ఉన్నందున అది భేరీధ్వని అనిమాత్రం గ్రహించగలం. అలాగే శంఖాలను గట్టిగా ఊదినప్పుడు అది శంఖధ్వని అని తెలుస్తుంది తప్ప ఫలాని శంఖధ్వని ఫలానా అని గుర్తించ లేము. అధ్వనిలో క్రిందశ్రుతి, పైశ్రుతి దేనివో తెలుసుకోడం కూడా సాధ్యం కాదు. ఫలనా భేరీధ్వని, ఫలానా శంఖధ్వని అని స్పష్టంగా తెలుస్తుంది. ఎందుకంటె భేరీ, శంఖధ్వనుల ప్ర త్యే క త ఆయాధ్వనులలో వ్యాపించి ఉంటుంది కాబట్టి గుర్తుపట్టవచ్చును. అలాగే నామరూపాల ప్రత్యేకతలతో ఉన్న అన్ని అనాత్మభావాలలోను పరమాత్మయొక్క అనంతశక్తి చిద్రూపంలో వ్యాపించివున్నది.

ఇప్పటివరకు నామరూప జగత్సృష్టిలో ఉన్న పరమాత్మ సర్వవ్యాప కత్వ స్వభావాన్ని వర్ణించడమైనది. రాబోయే శ్లోకంలో సృష్టికి పూర్వం ఉన్న పరమాత్మ స్వరూపం ఉదాహరణ పూర్వకంగా వివరింపబడుతోంది.

శ్లో॥ యథా పృథ గ్ధూమకణా ధనంజయా
త్తథర్గ్ యజుస్సామ చ నిస్సరంతి హి।
యతః పరాన్నిశ్శ్వసితోపమం నరాత్
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 22

ప్రతి॥ యథా = ఎట్లు, ధనంజయాత్ = మండుచున్న అగ్నినుండి, పృథక్ = వేరుగా, ధూమకణాః = పొగ, మిణుగురులు మొ॥ (వచ్చుచున్నవో), తథా = అట్లు, యతః = ఏ, పరాత్ + నరాత్ = పురుషోత్తమునినుండి, నిఃశ్వసిత + ఉపమం = శ్వాసవలె, ఋక్ + యజుః + సామ + చ = ఋక్, యజుః సామవేదాలు, నిస్సరంతి హి = వెడలుచున్నవికదా,—

## తాత్పర్యం

అగ్నినుండి ధూమం, నిప్పురవ్వలు ఉదయించినట్లుగా ఋగ్సామయజుర్వేదాల సర్వజ్ఞానం ధ్వనిరూపంలో, ఊపిరివలె అప్రయత్నంగా, అనాయాసంగా పరమాత్మనుండి వెలువడుతుంది. ఆ పరమాత్మ ఉత్తరకాశీప్రభువుని ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బృ. ఉ. 2. 4 10 వ మంత్రంలోని భావం ఈశ్లోకంలో వివరించబడుతోంది.

పొగ, మిణుగురులు, మంట, అన్నీ అగ్ని రగుల్కొడానికి ముందే అవి అన్నీ అగ్నిలో నిబిడీకృతమై వున్నాయి. అలాగే సృష్టికి పూర్వమే పరమాత్మలో ప్రపంచనామరూపాలన్నీ అవ్యక్తంగా ఇమిడివున్నాయి. నాలుగువేదాలు, పురాణాలు, అన్ని శాస్త్రాలు, ఉపనిషత్తులు, మంత్రాలు, సూత్రాలు, వ్యాఖ్యానాలు, సృష్టికిముందే పరమాత్మలో అవ్యక్తంగా ఉన్నాయి. మనలో ఎంత అనాయాసంగా ఊపిరి సంచరిస్తుందో అంతతేలికగా అప్రయత్నంగా అవి పరమాత్మనుండి బయటికివచ్చి వ్యక్తమవుతాయి.

ఈ శ్లోకంతో జగత్తులోని నామరూపాలన్నీ పరమాత్మలోని అంశలే తప్ప వేరేకాదని వివరించడం పూర్తి అయింది. ఇప్పుడు ప్రళయం సంభవించాక బ్రహ్మముతప్ప మరేమి మిగలదని స్పష్టం చేయబడుతోంది.

శ్లో॥ విలీయతేఽక్షే విషయస్తదాత్మని
ధియాం చ సోఽప్యాత్మని యత్ర శేముషీ।
అనంత విజ్ఞానఘనేఽప్సముద్రవత్
తమాశ్రయా మ్యుత్తర కాశికా ధవమ్॥ 23

ప్రతి॥ విషయః = విషయవస్తువు, అక్షే = ఇంద్రియమందును, తత్ = ఆ ఇంద్రియము, ఆత్మని = మనస్సునందును, సః + అపి = ఆ ఆత్మ కూడ, ఆత్మని = తనదైన, ధియాం + చ = బుద్ధియందును, యత్ర = ఎచ్చట, అప్ = నీరు, సముద్రవత్ = సముద్రమును–చేరినట్లు, శేముషీ = ఆబుద్ధి, అనంతవిజ్ఞానఘనే = పరమాత్మజ్ఞానంలో, విలీయతే = లీనమగుచున్నది.

## తాత్పర్యం

ప్రళయసమయంలోను, గాఢనిద్రా సమయంలోను విషయవస్తువులు ఇంద్రియాలలోను, ఇంద్రియాలు మనస్సులోను, మనస్సు బుద్ధిలోను లయమవుతాయి బుద్ధి సముద్రంవంటి ఏ అనంత విజ్ఞానంలో లీనమవుతుందో ఆ ఉత్తరకాశీ ప్రభువును నేను ఆశ్రయిస్తాను.

## వ్యాఖ్య

బ్రాహ్మణంలోని 11 వ మంత్రాన్ని ఈ శ్లోకం వివరిస్తుంది.

ఈ ప్రపంచసృష్టికి ముందు, సృష్టికి తరువాతకూడా పరబ్రహ్మమే ఉన్నది. ప్రళయం తరువాతకూడా పరబ్రహ్మమే ఉంటుంది. ప్రపంచంలో ఉండేవారు యావత్తు సముద్రంలో కలిసిపోయి సముద్రమే అయిపోయినట్లుగా ఈ ప్రపంచంలోని నామరూపాలన్నీ ఒక్కొక్కటే క్రమంగా లయమవుతాయి.

రూప రస గంధ శబ్ద స్పర్శ–లుగా ఉండే ప్రాపంచిక విషయాలు ఇంద్రియ ప్రేరకాలు అవి ఆయా ఇంద్రియాలలో, ఇంద్రియాలు, మనస్సులో, మనస్సు బుద్ధిలోను లీనమవుతాయి. చివరికి బుద్ధి చైతన్యరాశిఅయిన ఆత్మలో లీనమవుతుంది. అలాగే కర్మేంద్రియ విషయాలు కర్మేంద్రియాలలో లీనమవుతాయి. ఈ నామరూపజగత్తు యావత్తు ఇంద్రియాలు, వాటి విషయాలు తప్ప వేరు కాదు. అందుచేత ఇంద్రియాలు మనస్సులో లీనమైనప్పుడు ప్రపంచ ప్రళయం జరుగుతుంది. ఇలా ప్రపంచం యావత్తు లయమైనప్పుడు చివరికి మిగిలేది ప్రజ్ఞాన ఘనమైన చైతన్యమే ఈప్రజ్ఞాన ఘనమే ప్రపంచప్రళయం తరువాత ఉండే పరబ్రహ్మంయొక్క స్వరూపం. మిగిలిన వివరాలకు ఉపనిషత్తులో 2. 4. 11 వ మంత్రాన్ని చదవండి.

ఇంతవరకు వర్ణింపబడినది సృజింపబడిన ప్రపంచ యొక్క స్వభావము, ప్రాకృతప్రళయం జరిగినప్పుడు నిలిచివుండే పరబ్రహ్మ స్వరూపము. తరువాతి శ్లోకంలో పరమాత్మయొక్క పరమ అవ్యయ ఆత్మ స్వరూపాన్ని స్వాత్మానుభవంగా అందుకున్నప్పుడు నామరూపాలనే ఆలోచనలు కూడా అంతరించిపోయే పరమపదస్థితి సోదాహరణంగా వివరింపబడుతోంది.

శ్లో॥ లవణ శకల మప్సు ప్రాస్త మస్తం గతం స
త్తదను పృథగమూభ్య శ్శక్యతే నోద్గ్రహీతుమ్।
విదపి యదపి యాత స్తద్వ దుద్భిన్నమాత్రే
భవతి న బహు సంజ్ఞ స్తం భజే విశ్వనాథమ్॥ 24

ప్రతి॥ అప్సు = నీటియందు, ప్రాస్తం = పడవేయబడిన, లవణశకలం = ఉప్పురాయి, అస్తంగతం = స్వరూపమును కోల్పోవును, తదను = అటు పిమ్మట, అమూభ్య = ఆ నీటినుండి, పృథక్ = వేరుగా, ఉద్గ్రహీతుం = తీసుకొనుటకు, నశక్యతే = వీలుపడదు, తద్వత్ = అట్లే, విత్ + అపి = జ్ఞానికూడ, ఉద్భిన్నమాత్రే = బిన్నరూపాత్మకముగా వేరుపడి, బహుసంజ్ఞః + అపి = అనేక నామములతోనున్నను, యత్ = ఏ పరమాత్మ, నభవతి = వేరుకాడో, తం విశ్వనాథం భజే = ఆ విశ్వనాథుని సేవింతును.

తాత్పర్యం

ఉప్పుగడ్డ నీటిలో పడినప్పుడు అది కరిగిపోయి నీటిరూపాన్ని ధరిస్తుంది మళ్ళీ తన గట్టిగా ఉండే గడ్డరూపాన్ని పొందలేదు. అలాగే పరమాత్మయొక్క అనంత సచ్చిదానంద స్వభావాన్ని తెలుసుకొన్న వానికి శరీరేంద్రియ మనో బుద్ధులనే యోచనగాని, తాదాత్మ్యంగాని, పరిమితులకు లోబడడంగాని ఉండదు. ఆ పరమాత్మ విశ్వనాథుణ్ణి నేను భజిస్తాను.

## వ్యాఖ్య

ఉపనిషత్తులోని 2. 4 12 వ మంత్రంలోని ముఖ్యభావాన్ని గురుదేవులు ఈ శ్లోకంలో వివరిస్తున్నారు.

పరమాత్మను అద్వయానంత ఆత్మగా, చిదానంద సత్యరూపంగా తెలుసుకున్నవానికి కర్తృత్వ భోక్తృత్వభావం, కర్మజ్ఞానం ఉండవు. ఈ విషయం రాబోయే శ్లోకంలో వివరింపబడుతోంది.

శ్లో॥ స్ఫుట సముదితసమ్య గ్వృత్తితో యస్య భిత్తి
ర్వ్యపసరతి సమూలం విశ్వ మాత్మైవ భాతి।
తదను కథము తిష్ఠేత్ కర్తృకర్మక్రియాది
వ్యవహృతి రసతీయం విశ్వనాథ స్స మాఽవ్యాత్॥ 25

ప్రతి॥ యస్య = ఏ పరబ్రహ్మయొక్క, స్ఫుట = వ్యక్తముగా, సముదిత = ఏర్పడిన, సమ్యక్ వృత్తితః = సరియైన జ్ఞానాకారమువలన, సమూలం = మూలముతోడి, భిత్తి = ఆధారము, వ్యపసరతి = తొలగిపోవునో, విశ్వమ్ = ప్రపంచమంతయు, ఆత్మా + ఏవభాతి = ఆత్మగానే భాసించునో, తదను = పిమ్మట, కర్తృకర్మ క్రియ + అది = కర్తకర్మ క్రియ మొదలగు, ఇయం = ఈ, అసతి = లేనట్టి, వ్యవహృతిః = వ్యవహారము, కథం + ఉ + తిష్ఠేత్ = ఎట్లుండును? సః = ఆ ఆత్మ స్వరూపుడయిన, విశ్వనాథః = శివుడు, మా = నన్ను, అవ్యాత్ = కాపాడుగాక.

## తాత్పర్యం

సాధకుని హృదంతరాళంలో అనంతపరిపూర్ణ అద్వయ మహిమాన్విత పరబ్రహ్మజ్ఞానం ఎప్పుడు ఉదయిస్తుందో, దానిని గురించి చిట్టచివరి సందేహం నామావశిష్టంగాకూడా లేకుండా గతించి పోతుందో, అతడు తనను తాను సర్వ వ్యాప్త పరబ్రహ్మంగా తెలుసుకుంటాడు. ఆత్మదర్శన సమాధిస్థితిలో ద్వైత రంగానికి చెందిన కర్తృత్వ భోక్తృత్వ క్రియాభావన లేశమాత్రమైనా ఉండదు. ఆ విశ్వనాథుడు నన్ను రక్షించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 2. 4. 13, 14 మంత్రాల సారాన్ని ఈ శ్లోకంలో వివరిస్తూ గురుదేవులు ఈ అధ్యాయాన్ని ముగిస్తున్నారు.

ప్రాకృతప్రళయం ఏర్పడినప్పుడు శుద్ధచైతన్యఘనంగా పరబ్రహ్మము మిగిలి వుంటుందనీ, వ్యష్టి చైతన్యం ఉండదని వివరించబడింది. వ్యష్టిచైతన్యం అంతరించిపోతే ఆత్మను తెలుసుకునేది ఎవరు? తెలుసుకునేవాడు ఉన్నంత వరకు వ్యష్టి వున్నట్లేగా? అది నశించి పోతుందనడం ఎలా?

మైత్రేయియొక్క ఈ సందేహాన్ని యాజ్ఞవల్క్యుడు నివృత్తి చేస్తున్నాడు.

ప్రపంచప్రళయం సంభవించినప్పుడు నామరూపాలను తెలుసుకునే వ్యక్తిచైతన్యం నశించిపోతుంది. అవ్యక్తుల చైతన్యాలన్నీ ఆత్మలో కరిగిపోయి చైతన్యఘనంగా తయారవుతాయి. అలా చైతన్యఘనంగా ఉండే ఆత్మకు నాశనం అంటూ ఉండదు, చైతన్యం వేటినుండి వ్యక్తమైనదో ఆ ఉపాధులు నాశన మైనప్పుడు ఆ ఉపాధులద్వారా తెలుసుకోబడే నామరూపాలజ్ఞానం నశించి పోతుంది కాని ఆ చైతన్యం విజ్ఞానాత్మగా నిలిచిపోతుంది.

ఈ సంగతిని ఇంకా స్పష్టంగా వివరించడంకోసం యాజ్ఞవల్క్యుడు ద్వైతరంగంలోనే ద్రష్ట — దృశ్యం, శ్రోత — శ్రుతం, స్పర్శయిత — స్పర్శ— మొదలైనవి నిలిచివుంటాయని విశదీకరించాడు. ఏకమైన ఆత్మను చూడడంవల్ల ద్వైతం నశించినప్పుడు ద్రష్టత్వం, శ్రోత్రత్వం, కర్తృత్వం, కర్మ, కర్మ ప్రయోజనం అన్నీ అంతర్ధాన మవుతాయి. ఈ అద్వయానుభవమే పరబ్రహ్మ స్వరూపం. నాశరహ్యమైన ఉత్తరకాశీపతి ఆయనే!

ఈ చివరిరెండుశ్లోకాలు మాలినీవృత్తంలో ఉన్నాయి.

# త్రయోదశ స్తబకం

పన్నెండోస్తబకం చివరిభాగంలో త్రికాలాలలోను, ప్రపంచ సృష్టిస్థితి లయాలలోను పరమాత్మ తప్ప వేరే ఏదీ లేదని నిరూపించబడింది. అద్భుత మైన ఈ సిద్ధాంతానికి ఉపసంహారంగా పదమూడో స్తబకంలో మధుబ్రాహ్మణం లోని సారాంశం పేర్కొనబడుతున్నది. ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక స్థాయిలు మూడింటిలోను పెక్కులుగా కనబడే వస్తువులు, ప్రాణులు అన్నీ ఒక్క పరమాత్మ వలననే సచేతనం, శక్తిమంతం గావింపబడుతున్నాయి. వాటి అన్నింటికీ ఏకఆధారం పరమాత్మయే. అద్వయబ్రహ్మము, ఈశ్వరుడు, జీవాత్మ అనె మూడు విభేదాలు ఆభాసమాత్రమే. సమిష్టి వ్యష్టి స్థాయిలలో ఉన్న తాదాత్మ్యాన్నిబట్టి కనబడుతాయి.

శ్లో॥ పృథ్వీ సమస్తజనిమన్మధు జంతువర్గః
పృథ్వీ మధు ద్వివిధ పూరుష ఏష పృథ్వ్యామ్।
మూర్త్యాం చ య స్స మధు తన్మధు కారణాత్మా
బ్రహ్మాస్తి యత్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 1

ప్రతి॥ పృథ్వీసమస్తజనిమత్ = పృథివియందుపుట్టిన సమస్తమైన, జంతువర్గః ప్రాణిసముదాయము, మధు = తేనెవలె తియ్యనైనది, పృథ్వ్యాం = పృథివియందు, ఏషః = ఈ, ద్వివిధపూరుషః = సమిష్టివ్యష్ట్యాత్మకమైన పురుషుడు, పృథ్వీమధు = పృథివి మధువుగా కలవాడు, మూర్త్యాం చ = మూర్తజాతమునందు, మధుకారణాత్మా = మధుకారణ స్వరూపుడుగా, యఃఅస్తి = ఏ విరాట్‌పురుషుడున్నాడో, సః మధు = అతడు మధుస్వరూపుడు, తత్ బ్రహ్మ = అది బ్రహ్మ, తం విశ్వనాథం = అట్టి, విశ్వనాథుని, అనిశం = ఎల్లప్పుడు, స్మర = స్మరించుము.

## తాత్పర్యం

ప్రపంచంలోని ప్రాణులందరికి పృథివి తియ్యనైన తేనెవంటిది. పృథ్వి తనపైన జీవించే ప్రాణులందరిని నిలబెట్టి వుంచుతుంది తియ్యగా ఉంటుంది. అనంత జ్ఞానస్వరూపమైన పరమపురుషుడు భూమిపై జీవించే అన్ని ప్రాణుల యొక్క మధురసారం. అలాగే పరమాత్మకు ఈ ప్రాణులందరు తియ్యటి తేనెవంటి వారు. దేహధారులైన ప్రాణులందరికీ ప్రకాశవంతమై మృత్యురహిత మైన అంతరాత్మ తేనెవలె తియ్యగా ప్రియంగా ఉంటుంది. ప్రతిప్రాణియొక్క శరీరంకూడా అంతరాత్మకు అంత తియ్యటిది, మధురమైనది ఆధిదైవిక ఆదిభౌతిక అధ్యాత్మిక రూపాలలో మధురమధువుగా వర్ణించబడిన పరమాత్మ సౌమ్య కాశీశుడైన విశ్వనాథుడు. ఓ మనసా ఆయనని నిత్యమూ స్మరించు!

## వ్యాఖ్య

బృ. ఉ. 2. 5. లో ఉన్న మధుబ్రాహ్మణాన్ని ఈశ్లోకం ఉదహరిస్తున్నది. బ్రాహ్మణంలోని మొదటి మంత్రంలోని భావాలు ఇందులో ఉన్నాయి— 1) భూమి, 2) భూమిపైనఉన్న అన్ని ప్రాణులు, 3) సమిష్టిరూపంలో అంత రాత్మ విరాట్ పురుషుడుగా, 4) అన్నిప్రాణులలోని అంతరాత్మ — ఇలా పరమాత్మ నాలుగు రకాలుగా ఇక్కడ వర్ణించబడినాడు. అది తేనెవలె పరస్పరం ప్రియమైనవి, మధురమైనవి. ఎన్నో తేనెటీగెలు నిస్వార్థంగా పనిచేసిన దాని ఫలంగా లభించే మాధుర్యం తేనె. అలాగే పైన చెప్పిన పరమాత్మ నాలుగురూపాలు పరస్పరం వ్యవహరించుతూ, కార్యకారణ సంబంధంతో, పరస్పరం సహకారం ఇచ్చుకొంటూ ప్రతిదీ మిగతావాటిని తేనె వలె మధురంగా భావించుకొంటుంది. దీనిలో ప్రతిదీ తక్కినవాటికి కార్యము, కారణమూ కూడా. ఇలా పరస్పర కార్యకారణ సంబంధాలతో వ్యవహరించడ మనేది అన్నింటికీ మూలంగా ఒక అకారణమైన కారణం ఉన్నప్పుడే సాధ్య పడుతుంది. అకారణమైన ఈ కారణం నిత్యశాశ్వత సత్యమైన పరమాత్మయే. ప్రపంచంలోని నామరూపాలన్నీ ఈ శాశ్వత నిత్య పరమాత్మయొక్క వ్యక్త రూపాలు. దీనినే బ్రహ్మమన్నారు. సమిష్టి పురుషుడు, పృథ్వి పురుషుడు అన్న పదాలు హిరణ్యగర్భుణ్ణి, అంతరాత్మని సూచించుతాయనీ, శరీరపురుషు డన్న పదం జీవుణ్ణి సూచించుతుందనీ గ్రహించాలి.

శ్లోకంలోని చివరిపాదంలో మధురాతిమధురమైన విశ్వనాథప్రభువుని గురించి యోచించి చింతించుమని గురుదేవులు మనస్సుకి ప్రబోధం చేశారు. పరాభక్తికి, పరాప్రేమకు తార్కాణమది

బ్రాహ్మణంలోని 2, 3, 4 మంత్రాలలో నీరు, అగ్ని, వాయువులకు సంబంధించిన ఇలాంటి వర్ణనే ఉన్నది. వాటిని శ్రీ గురుదేవులు వదిలేశారు. సూర్యునికి చెందిన సమిష్టి వ్యష్టి స్థాయిలలో ఆత్మయొక్క నాలుగురూపాలని తరువాతి శ్లోకంలో పేర్కొంటున్నారు

శ్లో॥ పూషా సమస్తజనిమ న్మధు జంతువర్గః
పూష్ణో మధు ద్వివిధ పూరుష ఏష పూష్ణి।
నేత్రే చ యస్సమధు సర్వమధూద్వహం స
ద్బ్రహ్మాస్తి యత్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 2

ప్రతి॥ సమస్తజనిమత్ = సమస్తమైన పుట్టుకలుగల, జంతువర్గః = ప్రాణికోటి, పూషామధు = సూర్యుడు తేనెగాగలది, పూష్ణి = సూర్యునియందు, ఏష ద్వివిధపూరుషః = ఈసమిష్టి వ్యష్ట్యాత్మకమైన పురుషుడు, పూష్ణోమధు సూర్యుని తేనెగా గలది, నేత్రే చ = నేత్రమునందు. యః = ఏ సూర్య దేవత కలదో, సః = ఆదేవత, మధు = మధువు, సర్వమధూద్వహం = ఈ సమస్త మధువులను ధరించిన, సద్బ్రహ్మ + అస్తి = సదాత్మకమైన బ్రహ్మ కలదు, యత్ = ఏ బ్రహ్మ, తం విశ్వనాథం = ఆ బ్రహ్మ స్వరూపుడయిన విశ్వనాథుని, స్మర = స్మరించుము.

## తాత్పర్యం

సూర్యుడు సమస్త ప్రాణులకు మధువు. అన్ని ప్రాణులు సూర్యునికి మధువు. పరమాత్మ అధిదైవంగా సూర్యునిలో పురుషునిగా వ్యక్తమవుతూ తన అధ్యాత్మరూపంగా ప్రతిప్రాణిలో కుడికంటిలో ద్రష్టగా ఉన్నాడు వ్యష్టి సమిష్టి రెండురూపాలలోని ప్రాణులన్నీ పరమాత్మకు మధువే. అలాగే రెండు రూపాలలోని పరమాత్మను ప్రాణులన్నీ మధువుగా ఎంచుకుంటాయి. మధుర

మైన మధురూపమైన పరమాత్మ ఒక్కటే అధిదైవస్థాయిలో హిరణ్యగర్భుడు గాను, అధ్యాత్మికస్థాయిలో జీవుడిగాను, అధిభౌతిక స్థాయిలో ప్రాణులుగాను ఉన్న అందరికీ శాశ్వతమైన ఆధారము, అధిష్ఠానము. ఆ పరమాత్మ స్వామ్య కాశీశుడైన విశ్వనాథుడు. మనసా, ఆయనను నిత్యమూ స్మరించుము.

## వ్యాఖ్య

బ్రాహ్మణంలోని ఐయిదో మంత్రం ఈశ్లోకంలో వివరింపబడింది.

ఇందులో వెల్లడించబడిన భావాలు సరిగ్గా ముందు శ్లోకంలో ఉన్న పద్ధతిలోనే ఉన్నాయి, పరమాత్మలో మనం భావనచేసే అధిదైవిక, అధిభౌతిక, అధ్యాత్మిక విభజనలు కేవలం ఊహా మాత్రాలేనని చెప్పడమే ఉపనిషత్తు ఉద్దేశ్యం. పరమాత్మపైన అధ్యాస అయిన ఈ మూడు విభజనలలోని మధుర మైన మధువుసారం ఆ పరమాత్మయే భిన్నం కాదు.

ఈ బ్రాహ్మణంలోని 6–14 మంత్రాలలో నాలుగు రకాలైన పరమాత్మ యొక్క మధురూపం వర్ణించబడివున్నది. అవి కేవలం పునరుక్తులే. పూజ్య గురుదేవులు వాటిని దాటవేయడం వుచిత మనుకున్నారు. వాటిని అధ్యయనం చేయదలచుకొన్న సాధకులు వ్యాఖ్యానంతో కూడిన ఉపనిషత్తు మంత్రాలను చదవడం మంచిది.

శ్లో॥ యద్బ్రహ్మభూతి విబుధే నిఖిలాత్మభూతే
భూతాని చేంద్రియగణ భువనాత్మదేవాః।
సర్వేఽర్పితా స్సమమరా ఇవ చక్రనాభౌ
రేరే మన స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 3

ప్రతి॥ యత్ = ఏ, నిఖిలాత్మభూతే = సమస్త + ఆత్మస్వరూపమైన, బ్రహ్మ భూతవిబుధే = బ్రహ్మజ్ఞానమునందు, భూతాని = జీవజాలము, ఇంద్రియగణాః = ఇంద్రియగణములు, భువనాత్మదేవాః చ = ప్రపంచాత్మ దేవతలు, సర్వే = ఈ అందరు, చక్రనాభౌ = చక్రము

యొక్క ఇరుసునందు, అరాః ఇవ = అరలవలె, సమం = సమముగా, అర్పితాః = అర్పించబడిరి, రేరే మనః = ఓమనసా! తం———

## తాత్పర్యం

పరమాత్మను సర్వవ్యాప్త పరమాత్మగా తెలుసుకున్న విజ్ఞానికి అన్ని ప్రాణులు, సమిష్టి ఇంద్రియాలు, పధ్నాలుగు లోకాలు భూమిపైన వున్న అందరు దేహధారులు, విశాలబ్రహ్మాండంలో ఉన్న అందరు జీవుళ్లు, అగ్ని, వాయువు మొదలైన అందరు దేవుళ్లు చక్రనాభికి గ్రుచ్చబడివున్న ఆకులలాగా పరమాత్మపైన అధ్యస్తం చేయబడి వున్నారు. ఆభాస మాత్రమైన నామరూపాల జగత్తుకి ఏకాధారము, అధిష్ఠానము ఆ పరమాత్మయే. ఆ పరమాత్మ సామ్య కాశీశుడైన విశ్వనాథుడు. మనసా! ఆయనను నిత్యమూ స్మరించిధ్యానించు.

## వ్యాఖ్య

బ్రాహ్మణంలోని 15 వ మంత్ర భావాన్ని ఈశ్లోకం వివరిస్తుంది.

చక్రంలో ఇరుసు లేదా నాభి ఒక్కటే చుట్టూతా ఉండే చక్రాన్ని, ఆకులను కలిపివుంచే అధారం, ఆకులు చక్రాన్ని నాభిని కలుపుతాయి. ఆకుల గుండ్రని కదలిక పూర్తిగా నాభమీద ఆధారపడి వుంటుంది. చక్రం కదిలినప్పుడు ఆకులకదలికే కనబడుతుంది. నాభి కదలిక చాలా స్వల్పంగా, దాదాపు కనబడకుండా ఉంటుంది. అలాగే వాటివాటి వ్యష్టి సమష్టి పరిధుల్లో పరిభ్రమించే నామరూపాల జగత్తులు అన్నీ పరమాత్మపైన ఉన్న అధ్యా రోపణలు తప్ప వేరుకాదు. సర్వవ్యాప్తమైన పరమాత్మను తెలుసుకొన్న ఆత్మ జ్ఞాని తన స్వరూపాన్నే అంతటా చూస్తాడు. ఇన్నేళ్ళుగా అనుభవమైన అన్ని ప్రపంచాలు కేవలం ఆభాసలుగా తనపైనే అధ్యాసలుగా గోచరమవుతాయి.

ఇక్కడ గురుదేవులు 'రే', 'రే' అని మనస్సుని ఉద్బోధిస్తున్నారు. పరిపూర్ణమైన నిస్సంగభావంలో నామరూపాలను పూర్తిగా త్యజించవలసిన అవసరాన్ని నొక్కి చెప్పడంకోసమే రెండుసార్లు ఉద్బోధ చేయబడింది. పరమాత్మను గూర్చిన నిత్యస్మరణ, జాగరూకత వుండాలి.

ప్రాపంచిక విషయాలపైన దృష్టి, చింతన పూర్తిగా ఉన్నవాళ్ళకి పరమాత్మనుగురించిన స్పృహ లేశమైనా ఉండదు. అసలు అలాంటి దేవుడు ఉన్నాడా అనికూడా తరుచు ప్రశ్నవేస్తూవుంటారు ఇలాంటి వాళ్లను ఉద్దేశిస్తూ తరువాతి శ్లోకంలో గురుదేవులు వాళ్ళు సత్యాన్ని వదిలిపెట్టి భ్రాంతిజన్యమైన మిథ్యావస్తువుల వెంటపడడాన్ని నిరసిస్తున్నారు.

శ్లో॥ యోఽయం పరాత్పరతరః పురురూపధారీ
మాయావశాత్ ప్రతిశరీర మనుప్రవిశ్య।
సర్వానుభూ ర్భవతి నిర్భయశోక మేకం
రేరే మన స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 4

ప్రతి॥ యః + అయం = ఏ ఈ, పురురూపధారీ = విరాట్ రూపధారియైన, పరాత్ + పరతరః = పరములన్నిటికంటే మిక్కిలిపరుడు అయిన, మాయావశాత్ = మాయాకారణముగ, నిర్భయశోకం = భయ శోకాలు లేని. ఏకం = ఒక్కటయిన, ప్రతిశరీరం = సమస్త ప్రాణి శరీరమును, అనుప్రవిశ్య = ప్రవేశించి, సర్వానుభూః = సమస్త జ్ఞాన స్వరూపుడుగా, భవతి = అగుచున్నాడు, రే——

## తాత్పర్యం

ఓ మనస్సా, అందరిలోను ప్రత్యగాత్మ అయిన ఉత్తరకాశీశుడు విశ్వనాథుణ్ణి గురించి నిత్యము స్మరించు ధ్యానించు. అందరిలోని పరమాత్మ ఒక్కడే అయినా తనభ్రాంతిపూర్వకమైన తాదాత్మ్యంవల్ల వేరువేరు నామాలు, రూపాలు ఉన్న ఆకారాలను ధరించి వాళ్లలోని సుఖాలను దుఃఖాలను అనుభవిస్తున్నాడు. ఈ భ్రమవల్లనే విషయవస్తువులు భోక్తగా, ద్రష్ట, శ్రోత, మంతగా కనబడుతున్నాడు. నిజానికి పరమాత్మ అన్ని దుఃఖాలకు, భయాలకు, భ్రాంతులకు అతీతము. అద్వితీయమైన పరమాత్మ అన్నింటికి సాక్షిగా ఉన్నాడు.

## వ్యాఖ్య

మన ఆవరణ విక్షేపాల కారణంగా పరమాత్మ ప్రతివారిలో వేరువేరుగా కనబడినా, అందరిలో ఉన్న ప్రత్యగాత్మ ఆయన ఒక్కడే. ఎన్నింటిలోనో పెక్కుప్రతిబింబాలుగా కనబడే సూర్యునివంటివా డాయన.

బ్రాహ్మణంలోని 19వ మంత్రం ఈశ్లోకంలో వివరింపబడింది. దీనితో రెండో అధ్యాయంలోని అయిదో బ్రాహ్మణం ముగిసింది.

బ్రహ్మవిద్యను పొందడానికి చేసే పవిత్రనిగూఢ సాధనలో మధువిద్య యొక్క ప్రాముఖ్యతను తెలియజెప్పడానికిగాను ఉపనిషత్తులో ఒకకథ ఇవ్వ బడింది. గురుదేవులు దానిని వదిలేశారు. అయినా సందర్భం వచ్చింది. కనుక ఇక్కడ క్లుప్తంగా పేర్కొనబడుతున్నది.

బ్రహ్మవిద్యను మధువిద్యద్వారా నేర్చుకోవాలని ఇంద్రుడు ఎరుగును. అయితే అతడు దానిని దేవతలకు కూడా తెలుపకుండా పరమగోప్యంగా దాచాడు. దేవతల వైద్యులు, కవలలు అయిన అశ్వినీకుమారులు మధువిద్యను నేర్చుకోవాలని చాలా ఆకాంక్షతో వున్నారు. ధధ్యక్ అథర్వణఋషి మధు విద్యను అశ్వినీ దేవతలకు నేర్పాడు. దానిని నేర్చుకోడానికిగాను అశ్వినీదేవతలు రెండు ఘోరకృత్యాలు చేశారు.

ఇంద్రుడే ధధ్యక్‌కి ఈమధువిద్యని నేర్పాడు ఆ విద్యను నేర్పడానికి ముందు అతని వద్ద ఒక ప్రమాణం చేయించాడు-ఆ విద్యను ఎవరికీ నేర్పనని. ఆ ప్రమాణం చేసిన ప్రమాణాన్ని ఉల్లంఘిస్తే అతడి తలను ఖండించివేస్తానని ఇంద్రుడు హెచ్చరిక కూడా చేశాడు.

ఇంద్రుడికి జడిసి అశ్వినీకుమారులకి మధువిద్యని నేర్పడానికి ధధ్యక్ వెనుకాడాడు. ఇంద్రుని కోపంనుండి ధధ్యక్‌ని కాపాడుతామని అశ్వినీదేవతలు హామీఇచ్చారు వాళ్ళు ధధ్యక్ తలని ముందే ఖండించి ఆస్థానంలో ఒక గుర్రం తలని అమర్చారు. అప్పుడు ఆయనవద్ద నుండి మధువిద్యని నేర్చుకున్నారు. ఇంద్రుడి కిది తెలిసి తనకిచ్చిన వాగ్దానాన్ని భంగం చేసినందుకుగాను ధధ్యక్

తలని ఖండించాడు. అశ్వినీదేవతలు తాము దాచివుంచిన ధధ్యక్ తలని అతని మొండెంమీద అతికించారు. ఇలా మధువిద్యని నేర్చుకోడం కోసం రెండుపాపాలు చేశారు. తమ గురువుతలను ఖండించడం ఒకటి, ఒక గుర్రాన్ని చంపడం ఇంకొకటి. ఈ కథవల్ల నేర్చుకోవలసిం దేమిటంటే బ్రహ్మవిద్యకోసం ఏలాంటి పని అయినా చేయవచ్చునని.

బృ. ఉ. 2. 5. 16, 17, 18 మంత్రాలలో ఈకథ ఉన్నది. ఆరో బ్రాహ్మణంతో రెండో అధ్యాయం ముగుస్తుంది. ఇందులో శతపథ బ్రాహ్మణంలో పేర్కొనబడిన మధువిద్యద్వారా బ్రహ్మవిద్యను సంపాదించిన ఆచార్యశిష్య పరంపర ఉన్నది. దీనిని కూడా గురుదేవులు వదిలేశారు

యాజ్ఞ్యవల్క్య కాంతమనే పేరుగల మూడో అధ్యాయాన్ని రాబోయే శ్లోకాలలో స్వామితపోవనం వివరిస్తారు. రెండోబ్రాహ్మణంలోని భావాలు రాబోయే శ్లోకంలో వివరించబడినవి జరత్కారగోత్రానికి చెందిన ఆర్తభాగునికి యాజ్ఞవల్క్యుడికి మధ్య గొప్పవాదం జరిగింది. ముక్తిని సాధించడానికి పరబ్రహ్మను తెలుసుకోవడం ఒక్కటే మార్గమనేది వాదంలోని విషయం. తక్కిన సాధనలన్నీ జనన మరణ విషవలయాన్ని కొనసాగించి అనేకజన్మలలో సంపాదించిన పుణ్యపాప ఫలితాలను అనుభవింపజేస్తాయి ఈ విషయాన్ని రాబోయే శ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ పుణ్యేన పాపపటలేన చ తత్తదేత్య
జన్మే హ హంత విషయేంద్రియ మృత్యుచక్రీ।
భ్రామ్య త్యనారత మవైతి స మృత్యుమృత్యుం
యం కర్మర స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 5

ప్రతి॥ కర్మరః = కర్మలయందు ఆసక్తుడు, పుణ్యేన = పుణ్యముచేత, పాపపటలేన చ = పాప సముదాయముచేతను, ఇహ = ఈలోకమునందు, తత్ + తత్ + జన్మ = ఆయాజన్మను, ఏత్య = పొంది, విషయేంద్రియమృత్యు చక్రీ = విషయములతోడి ఇంద్రియాలనెడి

మృత్యు చక్రమునందు, అనారతం = ఎల్లప్పుడు, భ్రామ్యం = తిరుగుచున్నాడు, హన్త = అయ్యో, మృత్యుమృత్యుం = మృత్యువుకేమృత్యువని, న + అవైతి = తెలుసుకోకున్నాడు, తం,విశ్వనాథం, అనిశం,స్మర–

## తాత్పర్యం

చాలామంది జీవుళ్లు ఇంద్రియాలు – విషయాలు – విషయభోగాల చట్రంలో బిగించబడిన మృత్యు చక్రజాలంలో చిక్కుకుపోయి తమ తమ పుణ్యపాప కర్మానుసారం లెక్కలేనన్ని జననమరణాలు పొందుతూంటారు. అయ్యో, వాళ్ళు ఆత్మనెరుగని మూలఅవిద్య కారణంగాను, కర్మవిధిపట్ల వున్న గ్రుడ్డి మమకారంవల్లను, అహంకారంతో నిండిన కర్మలు, వాటివల్ల కలిగే ఎడతెగని ఫలితాలవల్లను ఈ సంసారచక్రంలో ఇరుక్కుపోతారు. అందర్నీ భయపెట్టే మృత్యువుకి మృత్యువైన నిత్యశాశ్వత పరమాత్మకోసం వెదకి అందుకోరు కదా! ఎంత దయనీయులో! ఆ నిత్యశాశ్వత పరమాత్మ సౌమ్య కాశీశుడైన విశ్వనాథుణ్ణి ఓమనస్సా! నిత్యమూ స్మరించి ధ్యానించు.

## వ్యాఖ్య

బృ. ఉ. లోని మూడో అధ్యాయం యాజ్ఞవల్క్య కాండ అనే పేరు కలిగింది. పేరు సూచించుతున్నట్లే ఈ అధ్యాయంలో ఉపనిషత్తు సాహిత్యాని కంతా తలమానికమని చెప్పదగిన యాజ్ఞవల్క్య ఋషి వాదం ఉన్నది. అత్యుత్తమస్థాయిలో అత్యున్నత భావాలపైన జనకమహారాజు దర్బారులో జరిగిన తనకు సాటిలేని, అజేయమైన యాజ్ఞవల్క్యుని వాదం ఇది!

విదేహరాజు అయిన జనకుడు ఒకసారి ఒకయాగాన్ని చేశాడు. ఆ సందర్భంగా బ్రాహ్మణులకు, అర్హత గలిగిన ఇతరులకి ఎన్నో దానాలు ఇవ్వవలసి వున్నది. ఈ విశిష్టమైన దానాలకోసం పాంచాల కురుక్షేత్రాలనుండి ఎందరో విద్వాంసులైన బ్రాహ్మణులు వచ్చారు. అక్కడ సమావేశమై వున్న విద్వాంసుల మహాసభలో అందరికన్న ఎక్కువ విద్వత్తు కలిగిన వారెవరో తెలుసుకోగోరిన జనకుడు వేయి గోవుల్ని సభకు తెప్పించాడు. వాటికొమ్ములకి

బంగారు తొడుగు లున్నాయి. వాటిని చూపుతూ జనక మహారాజు అందరిలోకీ గొప్పవాడైన విద్వాంసుడు ఆగోవులన్నింటినీ దానంగా స్వీకరింప వచ్చునని ప్రకటించాడు. అందరూ విన్నారు కాని సాహసించి స్వీకరించడానికి ఎవరూ ముందుకు రాలేదు. అప్పుడు అక్కడేఉన్న యాజ్ఞ వల్క్యుడు ముందుకు వచ్చి తన శిష్యుడు బ్రహ్మచారి సోమశ్రవసుడితో ఆ గోవులన్నింటినీ ఆశ్రమానికి తోలుకుపొమ్మన్నాడు. యాజ్ఞ వల్క్యుని ఈ ఔదత్యానికి మి గి లి న బ్రాహ్మణులందరికీ కోపం వచ్చింది. అశ్వలాయనుడనే ఋత్విక్కు ఆగలేక, "నీవేనటయ్యా బ్రహ్మనిష్ఠుడివైన బ్రాహ్మణోత్తముడివి?" అన్నాడు. యాజ్ఞ వల్క్యుడు, "ఇక్కడున్న బ్రాహ్మణులందరికీ నానమస్కారం. నాకు గోవుల ఆవసరం ఉన్నది. అందుకే ఆశ్రమానికి తీసుకుపోతున్నాను" అన్నాడు.

అ క్క డు న్న బ్రాహ్మణులలో చాలామందికి యాజ్ఞ వల్క్యుడి వేదవిజ్ఞానాన్ని విద్యత్తుని పరీక్షించాలని తోచింది ఆ సమయంలో జరిగిన అత్యుత్తమమైన వాదం మూడో అధ్యాయంలోని విషయం.

మొదటివాదం అశ్వలాయనుడికీ, యాజ్ఞ వల్క్యునికీ మధ్య జరిగింది. 3వ అధ్యాయం మొదటి బ్రాహ్మణంలో 1–10 మంత్రాలతో ఈవాదం ఉన్నది. అశ్వలుడు వేసిన అన్ని ప్రశ్నలకు యాజ్ఞ వల్క్యుడు సముచిత సమాధానాల నిచ్చాడు. అయితే ఇవన్నీ వేదాంతంకన్న కర్మకాండకు ఎక్కువగా సంబంధించినవి కాబట్టి గురుదేవులు వాటిని ప్రస్తావించకుండా వదిలేశారు

రెండోబ్రాహ్మణంలో 1–13 వరకు వున్న మంత్రాల భావాన్ని ఈ శ్లోకంలో ఉదహరించారు. జరత్కార గోత్రజుడైన ఆర్తభాగునికి యాజ్ఞ వల్క్యుడికి మధ్య జరిగెన వాదం ఇది.

వెనక బ్రాహ్మణంలో కర్మపరిమితుల్ని, కాలపరిమితుల్ని అధిగమించడం విషయం వాదం జరిగింది. అయితే ఈ కాలకర్మ పరిధులు, పరిమితులు ఆత్మనెరుగని అజ్ఞానంవల్ల, తన్మూలంగా ఇంద్రియ, ప్రాణ, మనోవిషయ వస్తువులలో కలిగే తాదాత్మ్యంవల్ల ఏర్పడుతాయి.

"అంగాలెన్ని? వాటి విషయాలు ఏమిటి?" అని ఆర్తభాగుడు అడిగాడు, జీవుడు తన నిజ స్వరూపాన్ని ఎరుగక పరిమితులకు పరిధులకు లోనై మనస్సు. ప్రాణం ఇంద్రియాలు, విషయవస్తువులతో తాదాత్మ్యం పొంది మృత్యువు గుప్పెట్లో చిక్కుకుంటారని యాజ్ఞవల్క్యుడు జవాబిచ్చాడు. ఇంద్రియాలు ఎనిమిది. వాటిని లొంగదీసే విషయాలుకూడా ఎనిమిది — ఈ వివరాలను మూడో బ్రాహ్మణంలో 1–10 మంత్రాలు వివరిస్తాయి.

1) వాసన చూచే ఇంద్రియం ప్రాణం. దానిని నియమించే విషయం వాసన. అది అపానంవల్ల ఏర్పడుతుంది.

2) మాట్లాడే ఇంద్రియం వాక్కు. దానిని నియమించే విషయం ధ్వని.

3) రుచి చూచే ఇంద్రియం నాలుక. దానిని నియమించే విషయం రసం.

4) చూచే ఇంద్రియం కన్ను. దానిని నియమించే విషయం రూపం.

5) వినే ఇంద్రియం చెవి. దానిని నియమించే విషయం ధ్వని.

6) భావించి కామించే విషయం మనస్సు. దానిని నియంచే విషయం కామనలు.

7) పని చేసే ఇంద్రియం చేతులు. వాటిని నియమించే విషయం కర్మ.

8) స్పృశించే ఇంద్రియం చర్మం. దానిని నియమించే విషయం స్పర్శ.

తన ప్రశ్నకి తృప్తికరమైన సమాధానం వచ్చాక ఆర్తభాగుడు మరో ప్రశ్న వేశాడు. "ఇవన్నీ పరిమితులకి లోనైనవి. అంతమొందే స్వభావం కలవి ఈ పరిధుల్ని పరిమితుల్ని మింగివేసే పరదేవత ఎవరో ఉన్నారని అతడు భయంకరమైన మృత్యువునే మింగే మృత్యువని విన్నాము. ఎవరాతడు?"

దానికి యాజ్ఞవల్క్యుడు జవాబిచ్చాడు. "అనంతమైన పరమాత్మను సరిగా తెలుసుకొని అందుకోడంవల్ల మాత్రమే పరిమితులు, పరిధులు అంత మౌతాయి." పరమాత్మను అందుకున్నవాడే పరిమితుల్ని అధిగమించుతాడు.

ఆర్తభాగుడు వేసిన ఇతర ప్రశ్నలకి సమాధానంగా యాజ్ఞవల్క్యుడు, శరీరం నశించినప్పుడు ఆత్మనెరిగిన విద్వాంసుని ఆత్మ పరమాత్మలో లీన

మౌతుందనీ, ఆత్మనెరుగని అజ్ఞాని ఆత్మ ఇంద్రియాలతో ఇంద్రియ భోగాలతో ముందు జన్మలో ఉన్న తాదాత్మ్యం కారణంగా జనన మరణాల విషచక్రంలో ఇరుక్కొని పోయి పాపపుణ్యాల కారణంగా సుఖదుఃఖాల ననుభవిస్తూంటుందనీ చెప్పాడు. మృత్యువుయొక్క ఈ వల నుండి తప్పించుకోడానికి పరమాత్మను వెదుక్కొని అందుకోవడం ఒక్కటే మార్గం.

చిన్న చిన్న సత్కార్యాలు చేసినప్పుడు పైలోకాలలో స్వల్పకాలంపాటు నివసించి సుఖపడే యోగ్యత మాత్రమే కలుగుతుందని ఒప్పుకోవచ్చును. అశ్వమేధంవంటి ఘనమైన యజ్ఞాలు చేసినప్పుడో? వాటివల్ల మళ్ళీ క్రిందికి దిగిరాని శాశ్వత బ్రహ్మలోకావాసం లభిస్తుంది కదా — ఈ అనుమానానికి జవాబు తరువాతి శ్లోకంలో వస్తుంది.

శ్లో॥ పారిక్షిత ప్రభృతయః పురు పుణ్య పుంజ
భాజోఽపి సూత్రభువనాది భవప్రభేదాన్।
గచ్ఛంతి మోక్షభవనం న విశంతి యస్య
రేరే మన స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 6

ప్రతి॥ పారిక్షిత ప్రభృతయః = అశ్వమేధాదులను చేసిన, పురు పుణ్య పుంజ భాజః అపి = అధికపుణ్య సముదాయములుగల వారును, సూత్రభువన + ఆది = హిరణ్యగర్భలోకము మొదలయిన, భవప్రభేదాన్ = జన్మ విశేషములను, గచ్ఛన్తి = పొందుదురు, యస్య = యేపరమాత్మ యొక్క, మోక్షభవనం = మోక్షలోకమును, న విశన్తి = పొందలేరు, రేరే-

## తాత్పర్యం

అశ్వమేధ లేదా రాజసూయ యాగాన్ని చేసిన పారిక్షితుడు ప్రపంచంలో తాను చేసిన పాపాలన్నింటినీ క్షీణింపజేసుకుంటాడు. అరుదుగా ఉండే అలాంటి శుద్ధజీవులు సూక్ష్మరూపంలో ప్రయాణించి బ్రాహ్మలోకాన్ని అందుకుంటారన్న మాట నిజమే. అయినా వాళ్ళు సూక్ష్మాతిసూక్ష్మమైన పరబ్రహ్మధామాన్ని చేరుతారు. ఓ మనస్సా, ఆ పరబ్రహ్మమైన ఉత్తరకాశీశుడు విశ్వనాథుణ్ణి నిత్యమూ స్మరించి ధ్యానించు.

## వ్యాఖ్య

బృ. ఉ. 3 3 యొక్క సారాంశం ఈ శ్లోకం. దీనిని భుజ్యుబ్రాహ్మణ మంటారు ఈ బ్రాహ్మణంలో రెండే మంత్రాలున్నాయి.

జనకుని దర్బారులో విశిష్టమైన వాదాన్ని కొనసాగిస్తూ లహ్యుని కుమారుడు భుజ్యు అనే బ్రాహ్మణపండితుడు యాజ్ఞవల్క్యుని పాండిత్యాన్ని పరీక్షించడానికి లేచాడు. "పారిక్షితు లంటే ఎవరు? ఎక్కడుంటారు?" అని అడిగాడు. అశ్వమెధయాగం చేసినవాళ్ళు పారిక్షితులని, వాళ్లు ఉత్తమజీవులని సమాధాన మిచ్చాడు యాజ్ఞవల్క్యుడు. "పారిక్షత్త" అనేమాట శ్రుతులలో చాలా అరుదుగా వాడబడుతుంది. ఈ పదాన్ని యాజ్ఞవల్క్యుడు విన్నాడో లేదో తెలుసుకోడానికే భుజ్యు ఈ ప్రశ్న వేశాడు. సరైన సమాధానం వచ్చేసరికి భుజ్యు, శ రీ ర ం రాలిపోయినప్పుడు పారిక్షిత్తులు ఎక్కడికి వెళ్ళుతారని ప్రశ్నించాడు. దానికి యాజ్ఞవల్క్యుడు వివరంగా సమాధానం ఇచ్చాడు.

"ఈ లోకం సూర్యుడు ముప్పైరెండు రాత్రింబవళ్ళు ప్రయాణించేంత విశాలమైనది దాని చుట్టూరా సముద్రాలు విస్తరించుకొని ఉంటాయి. ఈ లోకంలోనే భూమిపైన ఉండే అన్నిప్రాణులు భోగాలని అనుభవిస్తారు. ఈ లోకాన్ని చుట్టుకొని దీనికి రెట్టింపు విశాలమైన మరోభూమి పరివేష్టించి వుంటుంది. దానిని ఘనోదమనే సముద్రం చుట్టివుంటుంది. ఆ భూమికి రెట్టింపుకొలత ఆ సముద్రానిది. ఈ సమిష్టి బ్రహ్మాండం రెండుగా చీలి వుంటుంది. ఆ రెండు భాగాలకు మధ్య క్షురధార లేదా ఈగరెక్క మాత్రమే పట్టే సన్నని సూక్ష్మమైన దారి వుంటుంది. అశ్వమేధయాగం చేసిన ఉత్తమ జీవుళ్ళు మరణించినప్పుడు అగ్నిదేవుడు వాళ్ళని ఆ సన్నని దారివరకు తీసుకు వెళ్లుతాడు. ఆ దారిలో అగ్నిదేవుడు ప్రయాణించలేడు. కాబట్టి ఆ పుణ్య జీవుళ్ళని వాయుదేవునికి అప్పగిస్తాడు. వాయుదేవుడు వాళ్ళని ఆసూక్ష్మమార్గం ద్వారా ఆ లోకాలకు ఆవలగా తీసుకొని వెళ్లుతాడు. అప్పుడు వాళ్లు హిరణ్య గర్భుని లోకం అంటే బ్రహ్మలోకంలోకి ప్రవేశిస్తారు." యాజ్ఞవల్క్యుడు సరైన సమాధానం ఇచ్చినందున భుజ్యు నిష్క్రమించాడు.

అశ్వమేధం, రాజసూయం మొదలైన పెద్దపెద్ద యాగాలు చేసినవాళ్ళు బ్రహ్మలోకము, లేదా ఇతర దేవలోకాలను శాస్త్రాలలో పేర్కొనబడినట్లు ఆయా యాగాల ఫలానుసారం పొందవచ్చును. కాని ఈ గొప్పకార్యాలన్నీ అహంకారం మీద ఆధారపడి చేసేవే. అందుచేత ఆ యజమానులకు పరిపూర్ణమైన మోక్షం లభించదు. పూర్ణ ముక్తికి పరమాత్మను తెలుసుకోవడం ఒక్కటే మార్గం.

తరువాతి శ్లోకంలో ఆత్మజ్ఞానంయొక్క లక్షణాలు వివరింపబడినాయి. ఇది ఉపస్త్ర బ్రాహ్మణంలోది.

శ్లో॥ సాక్షా ద్యద స్తి నిఖిలాత్మక మాత్మవస్తు
విజ్ఞాతి విజ్ఞ మథ సంహతి సన్నియంతృ।
బ్రహ్మాద్వయం యదితరత్ ఖపురీవ నార్తం
రేరే మన స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 7

ప్రతి॥ యత్ = ఏదయితే, అస్తి = కలదో, సాక్షాత్ = అదంతయూ, నిఖిలాత్మకం = సమస్త స్వరూపమైన, ఆత్మవస్తు = ఆత్మస్వరూపము, విజ్ఞ + అతి విజ్ఞం = తెలియదగిన దానికంటే తెలియతగినది, అథ = ఇంకను, సంహతి సన్నియంతృ = అన్నిటి యందుంటూ నియామకమైనది, అద్వయం బ్రహ్మ = ఏకాత్మకమైనబ్రహ్మ, యత్ = ఏదయితే, ఇతరత్ = బ్రహ్మభిన్నము, ఖపురి + ఇవ = ఆకాశనగరమువలె, న + అర్తం = అసత్యమైనది, రేరే——

## తాత్పర్యం

ఈజగత్తులో ఉండే అన్నింటిలోని అంతస్సత్త్వం పరమాత్మ. బుద్ధినికూడా వెలిగించేది అది. దాని సాన్నిధ్యంలో, దానికారణంగా కారణ సూక్ష్మ స్థూలాలనే మూడు శరీరాలు కార్యకారణ నియమప్రకారం వ్యవహరిస్తాయి. అయినా అది సర్వవ్యాప్తమైన అద్వితీయ పరబ్రహ్మంగానే ఉంటుంది. అదే లేకపోతే నామరూపాల జగత్తులన్నీ ఆకాశంలోని గంధర్వనగరాల వంటివే. అవన్నీ మిథ్య. ఆభాసమాత్రంగా గోచరిస్తాయి. ఆ పరమాత్మ ఉత్తరకాశీశుడైన విశ్వనాథుణ్ణి, ఓమనస్సా నిత్యమూ స్మరించి ధ్యానించు!

## వ్యాఖ్య

బృ ఉ, 3, 4 లోని సారం ఈ శ్లోకం. ఈ బ్రాహ్మణాన్ని ఉషస్త బ్రాహ్మణ మంటారు.

చక్రుని కుమారుడు ఉషస్తుడు. ఆ పండితుడు యాజ్ఞ వల్క్యుని వేద విజ్ఞానాన్ని పరీక్షించడానికి పూనుకొన్నాడు. సర్వాతీత మయిన, అన్నింటికన్నా ప్రశస్తమైనది అయిన, అందరిలోను ప్రత్యగాత్మగా ఉండే పరమాత్మలక్షణం ఏమిటో స్పష్టంగా చెప్పుమని అడిగాడు. దానికి సమాధానంగా యాజ్ఞవల్క్యుడు "నీలో ఉండే ఆత్మే అన్ని ప్రాణులలోని సారమైన ఆత్మ" అన్నాడు. ఈ ప్రత్యగాత్మ సాన్నిధ్యం కారణంగానే పంచప్రాణాలు, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి తమ తమ వ్యవహారాలు చేస్తాయి.

ఉషస్త అడిగిన మరోప్రశ్నకు జవాబుగా యాజ్ఞవల్క్యుడు ఈ ప్రత్యగాత్మను బాహ్యవస్తువుల్ని దర్శించినట్లుగా దర్శించడానికి వీలులేదని స్పష్టం చేశాడు. నడిచే ఎద్దునో, పరిగెత్తే గుర్రాన్నో ఇంద్రియాల ద్వారా చూచినట్లు ప్రత్యగాత్మని చూడడం కుదరదు. ప్రత్యగాత్మ శక్తి ని ఇచ్చినప్పుడే ఇంద్రియాలకు చూపు, వినికిడి, స్పర్శ, ఆలోచనలు సాధ్యమవుతాయి. లోపల నుండి నిరంతరం శక్తిని ప్రసాదించే ఈప్రత్యగాత్మే కళ్లల్లోని ద్రష్ట, చెవిలోని శ్రోత, మనస్సులోని భావుకుడు, బుద్ధిలోని విచారశీలి. ఈ పరికరాల ద్వారా దానిని తెలుసుకోడానికి సాధ్యంకాదు. చూపబడేది, వినబడేది, అనుభవింపబడేది యావత్తు తెలుసుకొనే పరమాత్మకన్న భిన్నమైనది. దృశ్యం కాలానికి, కార్యకారణ నియమానికి లోబడివుంటుంది అందుచేత అది నిత్యమూ మారుతూ అకాశంలోని హర్మ్యాలవలె అనిత్యంగా ఉంటాయి ఈ జవాబుతో ఉషస్త నిష్క్రమించాడు.

తరువాతి శ్లోకంలో కహోలబ్రాహ్మణంలోని ముఖ్యభావాలు వివరింపబడినాయి. ఆత్మజ్ఞానాన్ని పొందడంలో వచ్చే మూడు ఆటంకాలు — 1) పుత్రేషణ, 2) ధనేషణ, 3) దారేషణ పూర్తివైరాగ్యభావంతో వీటిని త్యజించితే కాని ఆత్మజ్ఞానం లభించదు. రాబోయే శ్లోకంలోని విషయం అదే.

శ్లో॥ యద్బ్రహ్మ చైకమఖిలాంతర మస్య విత్త్యై
ప్రత్యేక షడూర్మి రహితం గుణినో హ్యగౌణమ్।
భిక్షార్థిన స్స్వయ మటంతి బుధా విధూయ
విశ్వైషణా స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 8

ప్రతి॥ అస్య = ఈ ప్రపంచమునకు, అఖిలాన్తరమ్ = అన్నిటికంటే సన్నిహితము ఏకం = ఒక్కటిగాను, షట్ + ఊర్మిరహితం = అరు తరంగములు లేనట్టి, ప్రత్యక్ = ప్రత్యక్ష స్వరూపమైన, అగౌణమ్ = ముఖ్యమునయిన, యత్ బ్రహ్మ = ఏ పరబ్రహ్మముగలదో, విత్త్యై = ఆబ్రహ్మజ్ఞానము కొఱకు, గుణినః = గుణవంతులయిన, బుధాః = పండితులు, విశ్వ + ఏషణాః = ఈషణత్రయమును, విధూయ = విడిచి, స్వయం = స్వయముగా, భిక్షార్థినః = భిక్షనెతుకొందురు, తం———

## తాత్పర్యం

ఈ ప్రపంచంలోని చరాచర భూతాలన్నింటిలోని అంతరాత్మ పరబ్రహ్మం. ఈ ప్రపంచంలో జరిగే వాటన్నింటికీ అనంతసర్వసాక్షిగా వెలిగేది ఈ అంతరాత్మయే. ఈ ప్రపంచంలోని అన్ని ప్రాణులు లోనయ్యే జనన మరణాలు, క్షుత్పిపాసలు, భయమోహాలు–అనే అరు ఊర్మికలు ప్రత్యగాత్మని తాకవు. అది నిత్య ముక్తంగా, స్వతంత్రంగా పరిపూర్ణంగా అద్వితీయంగా ఉంటుంది. దానిని తెలుసుకొని అందుకోడానికిగాను జిజ్ఞాసువు పుత్రేషణ, విత్తేషణ, దారేషణలను త్యజించి శమాదమాది షట్సంపత్తిని సంపాదించి సన్న్యసించాలి. చేతిలో భిక్షాపాత్రతో, అంతఃబాహ్యాలలో పరమాత్మచింతన చేస్తూ సంచరించాలి. ఆ పరమాత్మ ఉత్తరకాశీశుడైన విశ్వనాథుణ్ణి, ఓమనస్సా నిత్యమూ స్మరించి, ధ్యానించు!

## వ్యాఖ్య

బృ. ఉ. 3. 5 లోని భావాలను ఈ శ్లోకం వివరిస్తుంది. దానినే కహోలబ్రాహ్మణ మంటారు.

కౌశికుని కుమారుడైన కహోలుడితో యాజ్ఞవల్క్యుని వాదం ఈ బ్రాహ్మణంతో జరిగింది. ముందు బ్రాహ్మణంలో ఉషస్థుడిలాగే కహోలుడు కూడా "అందరిలో ప్రత్యగాత్మగా ఉంటూనే దేనిచేత అడ్డగింపబడని పరమాత్మ లక్షణాన్ని వివరించు" మని అడిగాడు, యాజ్ఞవల్క్యుడు, "నీలో ఉన్న ఆత్మే అందరిలోని ప్రత్యగాత్మ " అని బదులు చెప్పాడు. "అది ఏది?" అని కహోలుడు అడుగగా యాజ్ఞవల్క్యుడు, "లోపల ఉంటూ, సర్వానికి నిత సాక్షిగా ఉండి, ఆకలిదప్పులు—శోకమోహాలు—జరామరణాలచేత తాకబడనిది"శే అని చెప్పాడు. ఇంకా వివరిస్తూ దారాపుత్ర విత్తేషణలను త్యజించిన నిజమైన జిజ్ఞాసువు దానిని పొందుతాడని కూడా చెప్పాడు. ఇలాంటి త్యాగభావంతో సన్యసించిన జిజ్ఞాసువు నిత్యమూ ప్రత్యగాత్మని గురించి ధ్యానిస్తూంటాడు.

ప్రత్యగాత్మని పొందటానికి సరైన సన్యాసాన్ని స్వీకరించాలి. నిజమైన సన్యాసం ఏమిటో తరువాతి శ్లోకంలో చెప్పబడుతోంది.

శ్లో॥ యద్బ్రహ్మబోధ మభికాంక్ష్య బుధా నిరీహా
ముణ్డా వివర్ణ వసనాశ్చ వివర్ణలింగాః।
ఆరణ్యకేషు విచరంతి చ యత్ప్రబుద్ధా
నిష్కించనా స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 9

ప్రతి॥ యత్ + బ్రహ్మబోధం = ఏ బ్రహ్మజ్ఞానమును, అభికాంక్ష్య = కోరిక, బుధాః = పండితులు, నిరీహాః = కోరికలు లేనివారై, ముండాః = గుండు గీయించుకొన్నవారై, వివర్ణవసనాః + చ = కాషాయవస్త్రమును ధరించిన వారై, వివర్ణలింగాః = వర్ణాశ్రమలింగమును విడిచి, ఆరణ్యకేషు = అడవులందు, విచరన్తి = సంచరించుచుందురు, యత్ + ప్రబుద్ధాః + చ = ఏ బ్రహ్మజ్ఞానమునందు మేల్కొన్నవారు, నిష్కించనాః = ఐహిక ధనమునేమియును లేకుందురు, తం———

## తాత్పర్యం

పరమాత్మను తెలుసుకోగోరిన జిజ్ఞాసువులు ఒక సద్గురువు ముఖతః శాస్త్రాలను అధ్యయనంచేసి సర్వాతీత పరమాత్మను గురించి తెలుసుకున్న వారై కాషాయవస్త్రం ధరించి, ముండనం చేసుకొని, వర్ణాన్ని త్యజించి సర్వ సంగపరిత్యాగం చేస్తారు వాళ్ళు సన్యాసధారులై ఈషణత్రయాన్ని విసర్జించి పరమాత్మ చింతన చేస్తూ నిరీహులై సంచరిస్తారు. శ్రవణ మనన నిధిధ్యాసల ద్వారా ఆత్మదర్శనం పొందినవారుకూడా అరణ్యాలలో ఏకాంతంగా గడుపుతూ బ్రహ్మానందంలో రమించుతూంటారు. ఈ రెండురకాల సన్యాసులు బ్రహ్మ విదులై, బ్రహ్మనిష్ఠులై వుంటారు ఆ పరమాత్మ ఉత్తరకాశీశుడైన విశ్వనాథుణ్ణి ఓ మనసా నిత్యమూ స్మరించి ధ్యానించు.

## వ్యాఖ్య

ఈశ్లోకంలో గురుదేవులు రెండురకాల సన్యాసుల మధ్య భేదాన్ని నిరూపిస్తున్నారు. శాస్త్రాధ్యయనంద్వారా ఆ త్మ ద ర్శ న ం పొందినవాళ్లది 'విద్వత్సన్యాసం' రెండోరకంవారు గురువువద్ద శాస్త్రాధ్యయనం చేసి ఆత్మను గురించి బుద్ధిస్థాయిలో తెలుసుకున్నవారు. ఆస్థాయిలోనే బ్రహ్మనిష్ఠులై పుత్రదారవిత్త – కామనలని వదిలి వర్ణాన్ని విసర్జించి సన్యాసులై పరమాత్మ చింతన చేస్తూ సంచరించేవారు. వాళ్ళది 'వివిదిష సన్యాసం'

తరువాతి శ్లోకంలో శ్రవణ మనన నిధిధ్యాసల వలన సా ధ కు డు పరమాత్మగానే రూపొందుతాడని శ్రీ గురుదేవులు వివరిస్తున్నారు.

శ్లో॥ నిశ్శేష మేత మవబుద్ధ్య యమాత్మవిద్యా
ద్విజ్ఞాననిష్ఠిత మతి ర్మనసై కశీలః।
పాండిత్యబాల్యమునితాభి రకృత్యశేషః
సర్వీ భవేత్ తమనిశం స్మర విశ్వనాథమ్॥ 10

ప్రతి॥ ఆత్మవిత్ = ఆత్మవేత్త, ఏతం + నిశ్శేషం = ఈ సమస్తమునుండి, అవబుద్ధ్య = మేల్కొని, యత్ విజ్ఞాన నిష్ఠితమతి = ఏ బ్రహ్మవిజ్ఞానము

నందు పరిణతి చెందిన మతిగలవాడై, మనన + ఏకశీలః = మననమే ముఖ్య స్వభావముగలవాడై, పాండిత్య, బాల్య, మునితాభిః = పాండిత్యము, బాల్యము, మౌనములచే, అకృత్యశేషః = చేయదగినది లేనివాడై సర్వీభవేత్ = సమస్త పురుషుడుగా అగునో, తం———

## తాత్పర్యం

సమర్థులైన ఆచార్యులవద్ద క్షుణ్ణంగా ఆత్మాభ్యాసం చేసి ఆత్మవిదుడైన వాడు నిత్యమూ మననశీలుఁడై అనాత్మను నిరాకరిస్తూ ఉండి ఇక శ్రవణమనన నిధిధ్యాసలద్వారా సాధించవలసినదంటూ లేనివా డవుతాడు. సర్వమూ తానే అవుతాడు. ఆపరమాత్మ ఉత్తరకాశీశుడైన విశ్వనాథుణ్ణి ఓమనసా, నిత్యమూ స్మరించు ధ్యానించు!

రాబోయే మూడు శ్లోకాలలో గురుదేవులు ఇలా బ్రహ్మజ్ఞాని అయిన మహాత్ముడే నిజమైన బ్రాహ్మణుడని వక్కాణిస్తున్నారు.

శ్లో॥ యత్ బ్రహ్మ సమ్య గవగచ్ఛతి యో మహాత్మా
ప్రత్యక్తయా భవతి విశ్వతమశ్చ విద్వాన్।
సబ్రాహ్మణ స్స పురుపూజ్యతమ స్స ధన్యః
తస్మై నమ స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 11

ప్రతి॥ యఃమహాత్మా = ఏ మహాత్ముడు, యత్ బ్రహ్మ = ఏ పరబ్రహ్మను. ప్రత్యక్తయా = ప్రత్యక్ స్వరూపుడుగా, సమ్యక్ = బాగుగా, అవగచ్ఛతి తెలుసుకొనునో, సః + విశ్వతమః = అతడు విరాట్ స్వరూపుడు, విద్వాన్ + చ = విద్వాంసుడు, సః బ్రాహ్మణః = వాడు నిజమైన బ్రాహ్మణుడు, సఃపురుపూజ్యతమః = వాడు మిక్కిలి పూజ్యుడు, సఃధన్యః = వాడు ధన్యుడు, తస్మై = అట్టి పురుషునకు, నమః = నమస్కారము,———

## తాత్పర్యం

పరబ్రహ్మమే తనలోని ఆత్మ అని తెలుసుకున్న మహాత్ముడు నిత్యమూ ఆత్మలో రమించుతూ ఆత్మతో క్రీడించుతాడు. ఆయనే బ్రాహ్మణుడు. ఆయనను నిత్యము ఆరాధించి పూజించాలి. ఆయన దివ్యాతిదివ్యమైన వాడు ఆయనకు సహస్రప్రణామాలు! ఆయన ఉత్తరకాశీశుడైన విశ్వనాథుడే! ఓ మనస్సా, ఆయనను నిత్యము స్మరించి ధ్యానించు!

నిజమైన బ్రాహ్మణుని వర్ణన తరువాతి శ్లోకంలో కూడా కొనసాగుతుంది.

శ్లో॥ వర్ణాశ్రమా స్పృగశరీరపదే హి యస్మిన్
తాదృగ్ ధియైవ విహరేదివ యో విపశ్చిత్।
సబ్రాహ్మణస్య బహుమాన్యతమ స్స ధన్యః
తస్మై నమ స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 12

ప్రతి॥ యః విపశ్చిత్ = ఏ పండితుడు, వర్ణ + ఆశ్రమ + అస్పృక్ = వర్ణాశ్రమములను అంటని, యస్మిన్ = ఏ, అశరీరపదే = రూపములేని పరబ్రహ్మమునందు, తాదృక్ ధియా + ఏవ = అట్టి బ్రహ్మజ్ఞానముతోనే విహరేత్ + ఇవ = విహరించునట్లు అగునో, సః = వాడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, సః = వాడు, బహుమాన్యతమః = పూజ్యతముడు, సః = వాడు, ధన్యః = ధన్యుడు, తస్మై——

## తాత్పర్యం

క్షుద్రమైన వర్ణాశ్రమ విభేదాలను అధిగమించి నిత్యమూ అశరీరపదమైన ఆత్మలో రమించే విజ్ఞానియే నిజమైన బ్రాహ్మణుడు. ఆయనను నిత్యమూ సమ్మానించి గౌరవించాలి. ఆయన పవిత్రుల కన్న పవిత్రుడు. ఆయనకు నా ప్రణామాలు. ఆయన ఆత్మ ఉత్తరకాశీశుడైన విశ్వనాథుడే. ఓ మనస్సా! ఆయనను నిత్మము స్మరించి ధ్యానించు!

తరువాతి శోకంతో నిజమైన బ్రాహ్మణుని వర్ణన ముగింపుకి వస్తుంది.

శ్లో॥ విప్రోఽహ మాఢ్యకులవా నితి మన్యమానో
న బ్రాహ్మణ శ్చిదహమి త్యనుచింతయన్ యత్।
స బ్రాహ్మణ స్స బహుమాన్యతమ స్స ధన్యః
తస్మై నమ స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 13

ప్రతి॥ అహం = నేను, విప్రః = బ్రాహ్మణుడను, ఆఢ్యకులవాన్ = గొప్ప కులమువాడను, ఇతి = అని, మన్యమానః = తలచువాడు, న బ్రాహ్మణః = నిజమైన బ్రాహ్మణుడు కాడు, యత్ = ఏ పరబ్రహ్మ, చిత్ = జ్ఞానము, అహం = నేను, ఇతి = అని, అనుచింతయన్ = చింతించు వాడు, సః బ్రాహ్మణః = అతడు బ్రాహ్మణుడు, సః బహుమాన్యతమః = మిక్కిలిపూజ్యతముడు, సః ధన్యః = వాడు ధన్యుడు, తస్మై ——

## తాత్పర్యం

ఉత్తమబ్రాహ్మణకులంలో పుట్టాను కాబట్టి నేను బ్రాహ్మణుణ్ణి అని గర్వపడేవాడు నిజమైన బ్రాహ్మణుడు కాడు. నేను చిద్రూపాన్ని అని తెలుసు కొని నిత్యమూ చింతన చేసేవాడు మాత్రమే బ్రాహ్మణుడు ఆయనే నిత్యమూ సమ్మానానికి అర్హుడు. ఆయన ధన్యుడు. ఆయనకి నా ప్రణామాలు. ఆయనె ఉత్తరకాశీశుడైన విశ్వనాథుడు. ఓ మనస్సా! నిత్యము ఆయనను స్మరించి ధ్యానించు.

## వ్యాఖ్య

కేవలం బ్రాహ్మణవంశంలో పుట్టినవాడు వర్ణాన్నిబట్టి బ్రాహ్మణు డవుతాడు. నిజమైన బ్రాహ్మణుడు కాడు. ఆత్మజ్ఞానం ఉన్నవాడు ఏకులంలో పుట్టినా బ్రాహ్మణుడే!

అద్భుతమైన తన కవిత్వశైలిలో పైమూడు శ్లోకాలలో బ్రాహ్మణుణ్ణి వర్ణించి శ్రీ గురుదేవులు గార్గిబ్రాహ్మణాన్ని రాబోయే శ్లోకంలో వివరిస్తున్నారు, పరమాత్మయొక్క శక్తివంతమైన వ్యక్తరూపసత్యమైన సూక్ష్మ ప్రాణ శక్తి. పరమాత్మకలిసి పంచభూతాలకు పడుగుపేకలని వివరించుచున్నారు.

శ్లో॥ ఓతంచ మిశ్రిత మమిశ్రిత భూతవర్గే
ప్రోతం చ సోఽథ సకలాశ్రయ సూత్రదేవే।
ప్రాణాత్మని స్వయ మతర్క్య మహిమ్ని సోఽప్యు
ద్భూతోయత స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 14

ప్రతి॥ అమిశ్రిత భూతవర్గే = అపంచీకరణ భూతవర్గమైన, సకలాశ్రయసూత్ర దేవే = సకలాశ్రయ సూత్రాత్మయైన, ప్రాణాత్మని = ప్రాణరూపమైన, ఆత్మయందు, సః = ఆ జీవుడు, ఓతంచ = పడుగుగా, ప్రోతం చ = పేకగాను, మిశ్రితం = కలసియుండెను, సః = అట్టి జీవుడు, యతః = ఏ బ్రహ్మవలన, స్వయం = స్వయముగా, అతర్క్యమహిమ్ని = ఊహించ రాని మహిమకలిగిన, పరమాత్మయందు, ఉద్భూతః = మేల్కొనెను, –

## తాత్పర్యం

పంచీకరణం చెందిన మహాభూతాలు, అపంచీకరణమైన భూతాలు పడుగుపేకలుగా ఉండి బ్రహ్మాండాన్ని నిలబెట్టుతున్నాయి. ఆ సూక్ష్మభూతాలకు పడుగుపేకగా ఉండి వాటికి శక్తిప్రదాత అయిన – ఆశ్రయం సూత్ర దేవుడైన ముఖ్యప్రాణం నిలబెట్టుతోంది. ఆ దివ్యప్రాణశక్తి శుద్ధసర్వజ్ఞ, సర్వ శక్తిమంత, లక్షణరహిత నిత్యవిముక్తమైన పరమాత్మయొక్క వ్యక్తస్వరూపమే ఓ మనస్సా! ఆ పరమాత్మ ఉత్తరకాశీశుడైన విశ్వనాథుణ్ణి నిత్యమూ స్మరించి ధ్యానించు.

## వ్యాఖ్య

జనకమహారాజు సభలో రాచక్నుని కుమార్తె గార్గికి యాజ్ఞవల్క్య మహర్షికి మధ్య జరిగిన ప్రసిద్ధవాదం పైశ్లోకంలో పొందుపరచబడి వున్నది.

ప్రఖ్యాతిగాంచిన మేధావి గార్గి ప్రశ్నలతీరు ఈ ప్రకారంగా నడిచింది. —"ఓ మహర్షీ, బ్రహ్మాండంలో మనకు కనిపించేది యావత్తు సముద్ర జలాల చేత పడుగుపేకలుగా ఆవరించబడి వున్నది. నీరు దేని ఆధారంగా నిలబడి వున్నది?

మహర్షి: నీరు వాయువు చేత పడుగుపేకగా కప్పబడి వున్నది.

గార్గి : ఆవాయువో?

మహర్షి: అంతరిక్షంవల్ల.

గార్గి : అంతరిక్షం దేనిచేత నిలబెట్టబడి వున్నది?

మహర్షి: గంధర్వలోకంవల్ల

గార్గి : గంధర్వలోకమో?

మహర్షి: సూర్యలోకంవల్ల.

గార్గి : సూర్యలోకం దేనివల్ల కప్పబడి వున్నది?

మహర్షి: సోమలోకంవల్ల.

గార్గి : సోమలోకమో?

మహర్షి: నక్షత్రలోకంవలన.

గార్గి : నక్షత్రలోకమో?

మహర్షి: దేవలోకంవలన.

గార్గి : దేవలోకమో?

మహర్షి: ఇంద్రలోకంవలన.

గార్గి : ఇంద్రలోకమో?

మహర్షి: ప్రజాపతిలోకంవలన.

గార్గి : ప్రజాపతిలోకమో?

మహర్షి: సూక్ష్మశరీరమైన హిరణ్యగర్భ లోకంవలన.

గార్గి : హిరణ్యగర్భలోకమో?

మహర్షి: నీప్రశ్న బుద్ధికి తర్కానికి అతీతమైనది. ఈప్రశ్నను వదిలిపెట్టక పోయావా, నీ తలపగిలి పోతుంది. నీబుద్ధిని వెలిగించే ప్రకాశాన్ని గురించి నీవు అడుగుతున్నావు.

ఇది విని గార్గి నిష్క్రమించింది.

తరువాతి శ్లోకంలో ఉద్దాలకునికి యాజ్ఞవల్క్యునికి జరిగిన వాదంలో వర్ణింపబడిన వ్యక్తపరమాత్మ వివరింపబడుతున్నది. దానిని అంతర్యామి బ్రాహ్మణమంటారు.

శ్లో॥ సూత్రం చ సంగ్రథిత సర్వజగ ద్యథా స్రక్
సూత్రేణ తస్య చ నియంతృ యదంతరస్థమ్।
జానన్ భవ త్యమరవిత్ స్వపరత్రయీవిత్
నిశ్శేష విత్త మనిశం స్మర విశ్వనాథమ్॥ 15

ప్రతి॥ సూత్రేణ = దారముచే, యథాస్రృక్ = దండవలె, సంగ్రథితసర్వజగత్ = సమస్త ప్రపంచము కూర్చబడినది, తస్య = ఆ ప్రపంమునకు, అంతరస్థం = లోపలనుండు, సూత్రంచ = త్రాడే, నియంతృ = నియమించునది అని, జానన్ = తెలిసి, అమరవిత్ = దైవత్వమును తెలిసినవాడు, స్వపరత్రయీవిత్ = ఆత్మను, పరమును, వేదములను తెలిసినవాడును, నిశ్శేషవిత్ = సమస్తమును తెలిసినవాడును, భవతి = అగుచున్నాడు, తం——

## తాత్పర్యం

దండలో దారం పూలన్నింటినుండి పోతూ వాటిని కలిపివుంచుతుందో అలాగే ముఖ్యప్రాణంగా వ్యక్తమైన పరమాత్మ అన్నింటికీ శక్తిని ప్రసాదిస్తూ, అన్నింటిలోని సారంగా ప్రపంచంలోని అన్నింట్లోను వసించివుంటుంది. ఇలా సూత్రరూపంలో అందరిలోని అంతరాత్మగా ఉన్న పరమాత్మను తెలుసుకొన్న విజ్ఞాని పరబ్రహ్మను దేవతలందరి నియంతగా, జీవుల్లఆత్మగా, వేదాలసారంగా తెలుసుకున్నవా డవుతాడు. ఆ విజ్ఞాని సర్వజ్ఞు డవుతాడు. అందరిలోను వసించివున్న ఆత్మే బ్రహ్మండానికి పరమ నియామకుడని తెలుసుకొంటాడు. ఆ పరమాత్మ ఉత్తరకాశీశుడైన విశ్వనాథుణ్ణి, ఓ మనస్సా! నిత్యము స్మరించి ధ్యానించు!

## వ్యాఖ్య

బృ.ఉ. 3.7.1. లోని సారాంశం ఈ శ్లోకంలో ఉన్నది. జనకమహారాజు దర్బారులో యాజ్ఞవల్క్యుడికీ ఉద్దాలకుడికీ మధ్య వాదం జరిగింది. అథర్వుని కుమారుడు కబంధునిద్వారా బ్రహ్మలోకం వరకు ఉన్న యావత్తు బ్రహ్మం డాన్ని నియమించే శాసకునిగా అంతరాత్మను గురించి తెలుసుకున్నానని

ఉద్దాలకుడు అన్నాడు. "ఈలోకాన్ని, పైలోకాలని, అన్ని ప్రాణులలోపలి ప్రత్యగాత్మగా, అందరిలోని సారంగా ఉండి నియమించేవా డెవరు?" అని తాను వేసిన ప్రశ్నకి కబంధుడిలా సమాధాన మిచ్చాడు— "అందరిలోపల ఉన్న ప్రత్యగాత్మని తెలిసినవాడు బ్రహ్మము నెరుగుతాడు. అన్నిలోకాలను, అందరిదేవతలను, అన్నివేదాలను, అన్నిప్రాణులను, ఆత్మను, సర్వాన్ని తెలుసుకొంటాడు."

యాజ్ఞవల్క్యుని సమాధానం రాబోయే నాలుగు శ్లోకాలలో ఉన్నది.

శ్లో॥ పృథ్వ్యాం స్థితోఽంతరతరో యమకృన్న పృథ్వీ
యం వేద యస్య పృథివీ తను రాత్మభూతమ్।
సర్వస్య నిర్వపుష మస్తసమస్తధర్మం
నారాయణం తమనిశం స్మర విశ్వనాథమ్॥ 16

ప్రతి॥ పృథ్వ్యాం = పృథివియందు, స్థితః = ఉన్నట్టి, అంతరతరః = అంతరతరుడుగా, యమకృత్ = నియమించువాడును, అయిన, యస్య = ఏ బ్రహ్మయొక్క, ఆత్మభూతం = స్వరూపమును. పృథివీతనుః = పార్థివ శరీరము, న + వేద = తెలుసుకొనలేదో, సర్వస్య = సమస్తమైన, నిర్వపుషం = శరీరములేనట్టి, అస్తసమస్తధర్మం = పోయిన సమస్త ధర్మములు కలిగిన, యం + నారాయణం + వేద = ఏ నారాయణుని తెలుసుకొనునో, తం

## తాత్పర్యం

పృథివిలో ఉండి పృథివిని నియమించే దేవతలో ఈప్రత్యగాత్మ ఉన్నది. పృథివి ఆయునను ఎరగదు. పృథివిని అభిమానించే ఆదేవతలో ఉన్న ఆయనని ఆ దేవతకూడా ఎరగదు. పృథ్వీదేవత శరీరము, ఆధారము, నియమనము కూడా సర్వమూ ఈ ప్రత్యగాత్మదే. ఏ ఆకారమూలేని ఈ ఆత్మ అన్ని ప్రాణులలో ఉండి అన్నిధర్మాలకు అతీతమై వుంటుంది. ఆ పరమాత్మే పరమప్రభు నారాయణుడు ఆయనే ఉత్తరకాశీశుడైన విశ్వనాథప్రభువు. ఓ మనస్సా! ఆయునను నిత్యము స్మరించి ధ్యానించు!

## వ్యాఖ్య

బృ. ఉ. 3. 7. 3 మంత్రభావం ఇందులో సూచింపబడింది.

శివకేశవులమధ్య భేదం చూపరాదని సగుణోపాసకుల కందరికీ శ్రీ గురుదేవుల సలహా. పరమాత్మలోనే విష్ణువనీ, శివుడనీ, ఆకారాలు సాధకుల ధ్యానానికి తోడ్పడడానికే ఏర్పరచబడినాయి. ఏ లక్షణమూ లేని, వర్ణనాతీతమైన నిష్కళ పరబ్రహ్మను గురించి తెలుసుకోడం ధ్యానించడం అంత సులభంకాదు. అద్వితీయ శుద్ధపరమాత్మను గురించి క్షుణ్ణంగా తెలుసుకొని శుద్ధమైన జ్ఞానంతో, ఏకాగ్రమైన చిత్తంతో గాఢమైన ధ్యానతత్పరతని పొందినప్పుడే సాధకుడు ఆ పరమాత్మవైపు పయనించగలడు. మనోబుద్ధులను అధిగమించేంతవరకు అన్ని ఉపాసనలూ సాకారోపాసనలే.

'నారాయణ', 'విశ్వనాథ' అన్న రెండుపదాలకి వ్యుత్పత్తిప్రకారం చూస్తే అర్థం ఒకటే. ఇవి ఒకే పరమాత్మయొక్క నామాలు. విశ్వనాథు డంటే ప్రపంచానికి అధిపతి అని అర్థం. 'నారాయణ' అంటే సృష్టికి ముందు ఉన్న సమిష్టి కారణ జలాలలో ఉన్నవాడని అర్థం. అందుచేత ఈరెంటికీ తేడా లేదు.

భూమిలో ఉన్న ప్రత్యగాత్మగా ఉన్న పరమాత్మని వర్ణించాక జలభూతంలో ఉన్న ప్రత్యగాత్మని తరువాతి శ్లోకంలో వివరిస్తున్నారు

**శ్లో॥ తిష్ఠన్ జలే నియమకృచ్చ జలస్య యోఽయం**
**నోవేత్తి కంజల తనుశ్చ జలాన్తరాస్తే।**
**ఆత్మా చ కృత్స్నజగతో హ్యభవీ చ యః శ్రీ**
**నారాయణం తమనిశం స్మర విశ్వనాథమ్॥ 17**

ప్రతి॥ జలే = నీటియందు, తిష్ఠన్ = ఉంటూ, జలస్య = నీటికి, నియమకృత్ = నియమించువాడు, యః = ఎవడు, యం + కం = ఏ నీటిని, నో + వేత్తి = తెలుసుకొనడో, జలతనుః + చ = నీటిశరీరుడై, జల + అంతః + ఆస్తే = నీటికి దేవతగానున్నాడో, కృత్స్నజగతః = సమస్త జగత్తునకు, ఆత్మా + చ = ఆత్మగాను, హి = ప్రసిద్ధముగా, అభవీ = అగుచున్నాడో, శ్రీ నారాయణం తం——

## తాత్పర్యం

జలమనే మహాభూతంలో వసించి వుండే ప్రత్యగాత్మ దానిని నియమించి శాసించుతాడు. ఆ మహాభూతంలో తాదాత్మ్యం పొందిన దేవతకు ఈ ప్రత్యగాత్మ సంగతి తెలియదు. అన్ని ఆకారాలకు అతీతమైన ఈ ప్రత్యగాత్మ జలాభిమాన దేవతయొక్క రూపాన్ని స్వీకరించి దానికి ముఖ్యఆధారంగా నియామకుడిగా ఉంటుంది ప్రపంచంలోని అన్ని ప్రాణులలోని ప్రత్యగాత్మ, అన్ని ధర్మాలకు అతీతుడైన పరమాత్మ ఆనారాయణమూర్తియే—ఉత్తరకాశీశుడైన విశ్వనాథుడు. ఓ మనస్సా! ఆయనను నిత్యమూ స్మరించి ధ్యానించు.

## వ్యాఖ్య

బృ. ఉ. 3. 7. 4–14 మంత్రాలలో ఉండే భావాలు 16, 17 శ్లోకాలలో పొందుపరచబడినాయి. భూమి, నీరు, అగ్ని అనే మూడుభూతాలలోను అంతరాకాశం, వాయువు, సూర్యుడు, ఆకాశం, చంద్రుడు, దిక్కులు, చీకటి వెలుగు ... ఇన్నింటిలోను ఆధిదైవిక రూపమైన పరమాత్మ స్వభావాన్ని ఆ మంత్రాలలో వర్ణించారు ఈ వర్ణనలన్నీ దాదాపు 16, 17 శ్లోకాలలోని వాటి లాగే ఉంటాయి. కాబట్టి శ్రీ గురుదేవులు వాటిని తిరిగి వేరుగా చెప్పలేదు. ఈ శ్లోకాలలోని వర్ణనలు అన్నింటికీ వర్తిస్తాయి.

శ్లో॥ **భూతేషు తిష్ఠతి సమేషు నియామకశ్చ**
**తేషాం హి భూతతను రంతరగశ్చ యోఽసౌ।**
**నావైతి భూతతతి రాత్మదృశం చ యం శ్రీ**
**నారాయణం తమనిశం స్మర విశ్వనాథమ్॥** 18

ప్రతి॥ సమేషు భూతేషు = సమస్తములయిన భూతములయందు, యః = ఎవడు, తిష్ఠతి = ఉన్నాడో, నియామకః + చ = నియామకుడగుచున్నాడో, తేషాం = ఆ భూతములకు, భూతతనుః = భూతశరీరుడు, అంతరగః చ = అంతరగతుడును, అగునట్టి, అసౌ = ఈ, భూతతతిః = భూతసముదాయము, ఆత్మదృశం = ఆత్మదృక్ స్వరూపమైన, యం + శ్రీ + నారాయణం = శ్రీనారాయణుని, న + అవైతి = తెలుసుకొనలేదో,-

## తాత్పర్యం

ప్రత్యగాత్మ అన్నింట్లోను ఉండి వాటిని నియమించి శాసిస్తుంది. వాటి ఆకారాలు దాని వ్యవహార రంగాలుగా వర్తిస్తాయి. అందరి హృదయాంతరాళాల్లో ఉంటుంది. కాబట్టి అవి దానిని ఎరగవు. అన్ని ప్రాణులలోని ప్రత్యగాత్మ అయిన ఆ పరమాత్మ పరమపురుషుడైన నారాయణుడే. ఆయనే ఉత్తర కాశీశుడైన విశ్వనాథుడు. ఓ మనసా! ఆయనని నిత్యమూ స్మరించి ధ్యానించు.

## వ్యాఖ్య

బృ. ఉ. 3. 7. 15 వ మంత్రంలోని భావాలు ఈ శ్లోకంలో వివరింపబడినాయి. గడ్డిపోచనుండి సృష్టికర్తవరకు ఉన్న అన్ని ఆకారాలలోను ఉన్న పరమాత్మయొక్క ఆధిభౌతిక రూపాన్ని ఇందులో వర్ణించారు.

తరువాతి శ్లోకంలో ప్రత్యగాత్మయొక్క ఆధ్యాత్మిక దర్శనాన్ని వర్ణిస్తున్నారు.

శ్లో॥ ద్రష్టా న దృష్టి విషయః శ్రుతిగోచరో న
శ్రోతా ఽమతో మనన కృచ్చన బుద్ధిబోద్ధ్యః
బోద్ధా చ యోఽన్యరహితశ్చ యదన్య దార్తం
స్రక్ సర్పవత్ తమనిశం స్మర విశ్వనాథమ్॥ 19

ప్రతి॥ ద్రష్టా = చూచువాడు, నదృష్టివిషయః = కంటికి గోచరుడుకాడు, శ్రోతా = చూచువాడు, నశ్రుతి గోచరః = వినబడువాడుకాడు, మనన కృత్ + చ = మననము చేయువాడు, అమతః = మననము చేయబడనివాడు, బోద్ధా = తెలుసుకొనువాడు, నబుద్ధిబోధ్యః = జ్ఞాన గమ్యుడుగాడు, యః = ఎవడు, అన్యరహితః = రెండవవాడు లేనివాడు, యత్ + అన్యత్ = పరబ్రహ్మకంటె భిన్నమైనది, స్రక్ సర్పవత్ = దండయందు పామువలె, న + అర్తం = మిథ్య, తం———

## తాత్పర్యం

అన్ని ప్రాణులలోని ప్రత్యగాత్మ కంటిలోని ద్రష్ట. కంటిచేత చూడబడడు. అతడే చెవిలోని శ్రోత. చెవిద్వారా వినబడేవాడు కాడు. మనస్సులో మంతగా ఉంటాడు. మనస్సుచేత భావింపబడడు. బుద్ధిలో నిర్ణయాలు చేస్తాడు బుద్ధిచేత నిర్ణయింపబడడు. అద్వితీయ శుద్ధాత్మ అయిన ఆయన లేకపోతే నామరూపజగత్తు పూలమాలపైన సర్పదృశ్యంలాగా మిథ్యాభ్రాంతి అయిపోతుంది. ఆ పరమాత్మయే ఉత్తరకాశీశుడైన విశ్వనాథుడు. ఓ మనస్సా, ఆయనను నిత్యమూ స్మరించి ధ్యానించు!

## వ్యాఖ్య

ఈశ్లోకంలో బృ. ఉ. 3. 7. 16–23 మంత్రాలసారం ఇమిడివున్నది· దీనితో అంతర్యామి బ్రాహ్మణం ముగిసింది.

ఇక తరువాతి శ్లోకంనుండి అధ్యాయం చివరివరకూ అక్షరబ్రాహ్మణం లోని సారాంశం ఇవ్వబడుతుంది. అవధులు, పరిధులు లేని అక్షరపరబ్రహ్మ వర్ణన ఇది.

**శ్లో॥ సర్వేఽపి యేన విధృతాః ఖలు లోకిలోకాః**
**సోఽవ్యాకృతా నభసి తత్తు యదక్షరే చ।**
**గాంగేయకుండలనిభం ప్రతితిష్ఠతి శ్రీ**
**సచ్చిద్ఘనం తమనిశం స్మర విశ్వనాథమ్॥ 20**

ప్రతి॥ యేన = ఏ బ్రహ్మచేత, సర్వే = సమస్తమైన, లోకిలోకాః = లోకములు, విధృతాః + ఖలు = ధరింపబడియున్నవి, సః = వాడు, అవ్యాకృతేనభసి = నామరూపములచే వ్యాకరింపబడిన, ఆకాశమునందు, తత్ + తల = ఆ ఆకాశము, యత్ + అక్షరేచ = ఏ పరబ్రహ్మయందు, గాంగేయ కుండలనిభం = బంగారపుకుండలమునందువలె, సత్ + చిత్ + ఘనం = సత్, చిత్, ఘనము, ప్రతితిష్ఠతి = కలదో, తం అనిశం———

## తాత్పర్యం

బ్రహ్మాండంలోని సర్వప్రాణులు జగత్తులు అవ్యాకృతాకాశంలో సూక్ష్మమైన సర్వవ్యాప్త పరమాత్మచేత పెనవేసుకొనిపోయి వ్యాపింపబడి వున్నాయి. మాయకు అతీతమైన ఈశ్వరతత్త్వం స్వర్ణంలో స్వర్ణాభరణాలు ఉన్నట్లే అవ్యాకృతాకాశం పరమాత్మచేత వ్యాపింపబడి పరమాత్మలో నిలిచివున్నది. సచ్చిద్ఘనమైన అనంతపరమాత్మ ఉత్తరకాశీశుడైన విశ్వనాథుడే. ఓ మనసా, ఆయనను నిత్యమూ స్మరించి ధ్యానించు!

## వ్యాఖ్య

ఈ శ్లోకాలలో గార్గికి యాజ్ఞవల్క్యునికి మధ్య అక్షరపరబ్రహ్మమును గురించిన వాదం వర్ణింపబడుతున్నది. బృ. ఉ. 3. 8. 3 వ మంత్రం ఈ శ్లోకంలో సూచితమైనది.

"నీ తల పగిలిపోతుంది" అన్న యాజ్ఞవల్క్యుని హెచ్చరికతో తాత్కాలికంగా నిష్క్రమించిన గార్గి బ్రాహ్మణుల అనుమతితో మళ్ళీ ప్రశ్న వేసింది.

ఆమె మొదటిప్రశ్న "భూమికి క్రింద ఆకాశానికి పైన వ్యాపించివుండి, భూమ్యాకాశాలు, వాటి మధ్యలోకూడా తానే అయి త్రికాలాలలో ఉండే వస్తువేది?" అని.

యాజ్ఞవల్క్యుడు సమాధానం ఇచ్చాడు — ఓ గార్గీ, ఆకాశానికి పైన భూమికి క్రింద అని అడిగినది సూత్రాత్మ. అది అవ్యాకృతాకాశం. సూత్రాత్మతో నిండి వ్యక్తప్రపంచం అవ్యాకృతాకాశంలో నీటిలో భూమివలె త్రికాలాలలో, సృష్టి స్థితిలయలు పొందుతూంటుంది."

అన్ని నగలూ బంగారంలో ఉన్నట్లే వ్యక్తప్రపంచం అవ్యాకృత సూక్ష్మ రూపంలోను, అది అద్వితీయ పరమాత్మలోను ఉంటాయి

తరువాతి శ్లోకంలో అక్షరపరబ్రహ్మవర్ణన కొనసాగుతున్నది.

శ్లో॥ అస్థూల మేత దనణు శ్రవణాక్షివాణీ
హీనం హ్యలోహిత మబాహ్య మనంతరం చ।
అప్రాణ మ స్తగుణ మ స్తి యదేవ భో క్తృ
భోజ్యే తర త్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 21

ప్రతి॥ ఏతత్ = ఈ ప్రపంచమంతయు, అస్థూలం = స్థూలముకానట్టి, అనణు = అణువుకానట్టి, శ్రవణాక్షివాణీహీనం = వాక్చక్షుశ్శ్రోత్రములు లేని, అలోహితం = లోహితముకాని, అబాహ్యం = బాహ్యముకాని, అనంతరం చ = ఆంతరమును కాని, అప్రాణం = ప్రాణముకాని, అస్తగుణం = గుణములు శమించినదయి, యత్ + ఏవ = ఏబ్రహ్మ స్వరూపముగా, భోక్తృభోజ్య + ఇతరత్ = భోక్త, భోజ్యములకంటే భిన్నమై, అస్తి = కలదో, తం — అని———

## తాత్పర్యం

ఆ అక్షరబ్రహ్మము స్థూలమని, పెద్దదని, చిన్నదని, సూక్ష్మమని వర్ణింప నలవికాదు. దానికి కన్ను, చెవి, వాక్కు మొదలైన ఇంద్రియాలు లేవు. దానికి అతీతమైనది లేదు. అది ఎంతచిక్కగా ఉంటుందంటే దానిలో లేశమైనా అంతరం లేదు. అది ప్రాణంకన్న ఎక్కువైనది. ధ్వని, స్పర్శమొదలైన విషయాలు దానికి పరిమితులు పెట్టవు. స్పృశించవు. అది భోక్త కాదు, భోగ్యం కాదు. ఆ అక్షరబ్రహ్మమే ఉత్తరకాశీశుడైన విశ్వనాథుడు. ఓ మనసా, ఆయనను నిత్యము స్మరించి ధ్యానించు.

## వ్యాఖ్య

బృ. ఉ. 3. 8. 8 వ మంత్రంసారం ఈశ్లోకంలో ఉన్నది.

నిరాకరణ పద్ధతిప్రకారం యాజ్ఞవల్క్యుడు వర్ణనాతీతమైన పరబ్రహ్మను వర్ణిస్తున్నాడు. అనిర్వచనీయమైన దానిని వర్ణించడానికి, వర్ణనా తీతమైన దానిని వర్ణించడానికి అన్ని ఉపనిషత్తులు ఈమార్గాన్ని అవలంబిస్తాయి. ఏకాద్వితీయమైన ఆత్మకు ఏలక్షణాలూ లేవు. అన్నింటికీ అది అతీతమైనది.

పదార్థానికి, లక్షణాలకు, క్రియలకు -- అన్నింటికీ అతీతమైన అక్షర బ్రహ్మము పైశ్లోకంలో సూచింపబడింది. అన్ని ధర్మాలకీ అతీతమైన శుద్ధ జ్ఞానంగా చూపబడింది.

తరువాతి రెండు శ్లోకాలలో ప్రకృతిలోని అన్ని శక్తుల్నీ, ఆకాశంలో సూర్యుడు, చంద్రుడు మొదలైన అన్ని ప్రకాశాలని నియమించి శాసించే అక్షరపరబ్రహ్మమహిమ వర్ణింపబడుతున్నది.

శ్లో॥ యస్య ప్రశాసన మహిమ్న ఇమౌ రవీందూ
స్వస్వోదయా స్తమయకర్మణి నిష్ఠితౌ స్తః
స్వశ్చ స్థిరాస్థిరతరం స్ఫుటనాద్యపేతం
నిస్తిష్ఠ స్తమనిశం స్మర విశ్వనాథమ్॥ 22

ప్రతి॥ యస్య = ఏ బ్రహ్మయొక్క, ప్రశాసన మహిమ్నః = ప్రశాసించు మహిమచే, ఇమౌ = ఈ, రవి + ఇందూ = సూర్య చంద్రులు, స్వ + స్వ + ఉదయ + అస్తమయకర్మణి = తమతమ ఉదయాస్తమయము లను కర్మయందు, నిష్ఠితౌ = పరినిష్ఠులుగా, స్తః = ఉండిరి, స్థిర + అస్థిరతరం = శాశ్వతము అశాశ్వతమునయిన, స్ఫుటన + ఆది + అపేతం = కదలిక మొ॥వి లేనట్టి, స్వః + చ = స్వరూపుడుగా, నిస్తిష్ఠతః = నిశ్చలముగా నుండునట్టి, తం——

## తాత్పర్యం

ఎవరి ప్రచండశాసనంవల్ల సూర్యచంద్రులు నియమబద్ధులై ఉదయించి అస్తమిస్తారో, తమతమస్థానాలలో స్థిరపడి ఉంటారో, ఎవరి దృఢశాసనంవల్ల భూమ్యాకాశాలు తమస్థానాలలో స్థిరంగా ఉండి బరువైన, అస్థిరమైన, క్షర స్వభావం కలిగిన మిగిలిన వాటిని తమతమ పరిధుల్లో సంచరింపజేస్తాయో ఆ పరబ్రహ్మం ఉత్తరకాశీశుడైన విశ్వనాథుడు. ఓ మనసా, ఆయనను నిత్యమూ స్మరించి ధ్యానించు!

## వ్యాఖ్య

బృ. ఉ. 3. 8. 9 వ మంత్రంలో భూమ్యాకాశాలను, అందులో ఉన్న జ్యోతులు సూర్యచంద్రులను నియమించే అక్షర బ్రహ్మమహిమ ఉన్నది. అది ఈ శ్లోకంలో సూచింపబడింది.

కాలంకూడా అక్షర పరబ్రహ్మంయొక్క ప్రబల శాసనాన్ని పాటిస్తుందని తరువాతి శ్లోకం చెబుతుంది.

శ్లో॥ యస్య ప్రశాసనమహిమ్న ఇమే చ కాలా
మాసర్తువత్సరపరాః కలయన్తి జంతూన్।
నద్యః స్రవంతి ధవలా ద్ధిమశైలత శ్చ
గంగాదయ స్తమనిశం భజ విశ్వనాథమ్॥ 23

ప్రతి॥ యస్య = ఏ బ్రహ్మయొక్క, ప్రశాసనమహిమ్నః = ఆజ్ఞాపించుశక్తిచే, ఇమే = ఈ, మాస + ఋతు + వత్సరపరాః = మాసములు ఋతువులు సంవత్సరపరములయిన, కాలాః = కాలములు, జంతూన్ = జీవులను, కలయన్తి = కాలము కలవిగా చేయుచున్నవో, ధవళాత్ = తెల్లనయిన, హిమశైలతః + చ = హిమగిరినుండి, గంగాదయః = గంగ మొ॥ నద్యః = నదులు, స్రవంతి = ప్రవహించుచున్నవో, తం——

## తాత్పర్యం

అక్షరపరబ్రహ్మము యొక్క చండశాసనానికి లోబడి ప్రబలమైన కాలంకూడా నెలలు, ఋతువులు, సంవత్సరాలు, మొదలైన విభజనలతో అన్ని ప్రాణుల ఆయువును లెక్కించుతుంది. ఆయన మహిమాన్విత చండ శాసనానికి లోబడి గంగ, యమున, సింధు — మొదలైన నదులు హిమాలయపు టౌన్నత్యాలనుండి క్రిందికి ప్రవహించుతాయి. ఆ అక్షరబ్రహ్మము ఉత్తర కాశీశుడైన విశ్వనాథుడే ఓ మనసా, ఆయనను నిత్యమూ స్మరించి ధ్యానించు!

## వ్యాఖ్య

దానితో గురుదేవులు 9వ మంత్రంలోని మిగతా భావాలను వివరించారు. ఈ రెండు శ్లోకాలలోని ముఖ్యాంశం ఏమంటే చరాచర ప్రపంచంలోని యావత్తు అక్షరపరబ్రహ్మ శాసనానికి లొంగి తమతమ విధులను నిర్వహిస్తాయి.

చివరి రెండు శ్లోకాలలోను గురుదేవులు అక్షరబ్రహ్మమును శ్రవణ మనన నిధిధ్యాసనలవల్ల తెలుసుకోవడంవల్లనే అక్షరబ్రహ్మ పదవిని పొందుతారని స్పష్టం చేస్తున్నారు. కర్మలు, ఉపాసనలు, యజ్ఞ యాగాదులు ఎవరినీ అక్కడికి చేర్చవు.

శ్లో॥ యజన తపన బుద్ధి ర్బుద్ధ్యతే యన్న యస్సం
సరతి స కృపణో య స్త్వక్షరం బ్రహ్మ సమ్యక్।
విగత విషయతృష్ణో వేత్తి సబ్రహ్మభూతో
భవతి భవవిముక్త్యై తద్భవాంఘ్రిమ్॥ 24

ప్రతి॥ యః + తు = ఎవడయితే, యజనతపనబుద్ధిః = యజ్ఞముచేయు, తపస్సు చెయు బుద్ధిగలవాడై, యత్ = ఏ బ్రహ్మను, న బుద్ధ్యతే = తెలుసుకొనలేదో, సః = వాడు, కృపణః = దీనుడై, సంసరతి = సంసారములో లీనమగును, యః + తు = ఎవడయితే, అక్షరం బ్రహ్మ = పరబ్రహ్మను, విగతవిషయతృష్ణః = పోయిన విషయవాంఛగలవాడై, సమ్యక్ = బాగుగా, వేత్తి = తెలుసుకొనును, సః = వాడు, బ్రహ్మభూతః = బ్రహ్మ స్వరూపుడు, భవతి = అగుచున్నాడు, భవవిముక్త్యై = సంసారవిముక్తి కొఱకు, తత్ + భవాంఘ్రిం = ఆ శివుని పాదముగా: భావయే = భావించెదను.

## తాత్పర్యం

ఈ అక్షరపరబ్రహ్మన్ని ఎరుగకుండా జప హోమ తపాదులలో నిమగ్నమై వుండే సాధకుడు విషయ భోగాలలో తగుల్కొని జనన మరణ వలయంలో ఇరుక్కొని తాను సంపాదించుకొన్న పుణ్యపాపాల అనుభవాలు

పొందుతాడు. జనన మరణాలు సుడిగుండంలోకి అతణ్ణి విసరికొట్టే విషయ వాసనల గుప్పిట్లో ఉండే అతడి జీవితం దుఃఖభాజనం, దయనీయం అయినది. ఎవరిలో ప్రాపంచిక వాసనలు దహించుకు పోయాయో, వాడు దృఢమైన వైరాగ్యం, నిత్యచింతనలవల్ల శుద్ధమైన అక్షరబ్రహ్మాన్ని తెలుసుకుంటాడు. ఇలా ఆత్మజ్ఞానంతో బ్రహ్మమే అయి చావు పుట్టుకలకు మార్పులకు అతీత మైన నిర్మలశాశ్వత పదాన్ని పొందుతాడు. ఈ సంసారంనుండి విముక్తి పొందడానికిగాను నేను అక్షరపరబ్రహ్మ స్వరూపమైన విశ్వనాథుని పాదపద్మా లను ధ్యానిస్తాను!

## వ్యాఖ్య

బృ. ఉ. 3. 8. 10 వ మంత్రంలో యాజ్ఞవల్క్యుడు తిరిగి వర్ణించిన అక్షరపరబ్రహ్మమును గురుదేవులు పైశ్లోకంలో వివరించారు.

చివరి శ్లోకంలో 11 వ మంత్రంలోని భావాలను వర్ణిస్తారు. జనన మరణ చక్రంనుండి తప్పించుకోడానికి అక్షరబ్రహ్మమును ఎరిగి తీరాలి. ఈవిషయమే ఇక్కడ ఒత్తి చెప్పబడుతోంది.

శ్లో॥ అచలితచితిమాత్రం హ్యక్షరం బ్రహ్మ యద్వై
ప్రచలిత తను తన్వాం దర్శనాదిక్రియాకృత్।
సకలసజను రంతయంతృచోపాధిభేదా
ద్భవతి భవ విముక్త్యై భావయే తద్గవాంఘ్రిమ్॥ 25

ప్రతి॥ యత్ బ్రహ్మ = ఏ బ్రహ్మ, అక్షరం = నాశములేని, అచలితచితిమాత్రం వై = నిశ్చిత జ్ఞానస్వరూపమే, ఉపాధిభేదాత్ = ఉపాధి భేదమననుస రించి, తన్వాం = శరీరమునందు, ప్రచలిత తను = చలించు ఇంద్రియము కలదియై, దర్శనాది క్రియాకృత్ = చూచుట మొ॥ క్రియలను చేయు న ది, సకలసజనుః + అంతయంతృ = సమస్త ప్రాణికోటి యందుండి నియమించునది, భవతి = అగుచున్నది, భవవిముక్త్యై—

## తాత్పర్యం

ఉపనిషత్తులలో గొప్పగా వర్ణించబడిన ఈ అక్షరపర బ్రహ్మము క్రియా రహిత మైనది, అఖండజ్ఞానరూప మైనది. అయినా దేహధారు లందరికి చూచి, విని, క్రియలు చేసేవాళ్లుగా తయారుచేస్తూ తాను క్రియలను చేపట్టుతున్నట్లుగా కనబడుతుంది. ఒకే సూర్యుని అన్ని వస్తువులు తమలో ఎలాగైతే ప్రతి బింబిస్తాయో అలాగే ప్రపంచంలోని అన్ని ప్రాణులలోని హృదయగుహలలో ప్రతిబింబించే ఈ అక్షర బ్రహ్మము తన ప్రతిబింబ మహిమవల్లనే అందులో ఉంటూ వాళ్ల క్రియలన్నింటినీ శాసిస్తూ వుంటుంది. ఆ అక్షర పరబ్రహ్మమే సౌమ్య కాశీశుడైన విశ్వనాధుడు ఈ సంసారంనుండి విముక్తి పొందడానికిగాను నేను ఆయన పాదపద్మాలను ధ్యానిస్తాను.

## వ్యాఖ్య

ఈ శ్లోకంలో 11 వ మంత్రభావాన్ని గురుదేవులు తన అద్భుతశైలిలో విశదీకరిస్తున్నారు.

మనకు తెలియడంకోసం పరమాత్మస్వరూపం మూడుస్థాయిలలో వర్ణింపబడుతోంది—అక్షరబ్రహ్మము, అంతర్యామి, జీవుడు. మాయాబద్ధుడైన జీవుడు సత్యాన్ని ఎరుగని అజ్ఞానంలో కార్యకారణ శాసనానికి బద్ధుడై వుంటాడు. అంతర్యామి ప్రతిప్రాణిలోని హృదయగుహలో వసించి వుంటాడు. ఆయనకి శాశ్వతమైన, అనంతమైన జ్ఞానము, శక్తి ఉన్నాయి. శుద్ధసచ్చిదానంద మైనది అక్షరబ్రహ్మము. ఇది నిజమైన అపరోక్ష పరబ్రహ్మము. ఇంద్రియమనోబుద్ధులకి అందరానిది. అందువల్ల శ్రుతులలో "సత్యస్య సత్య"మని వర్ణింపబడింది.

ఈ చివరి రెండు శ్లోకాలు మాలినీవృత్తంలోను అంతకు ముందువి వసంత తిలక వృత్తంలోను ఉన్నాయి.



# చతుర్దశ స్తబకం

అక్షరబ్రహ్మముయొక్క సారం పదమూడో స్తబకంలో వివరింపబడింది. యాజ్ఞవల్క్య కాండంలో ఉన్న పెక్కుభావాలని ముందు స్తబకంలో చెప్పడం జరిగింది. ఇక మిగిలింది శాకల్యబ్రాహ్మణం. ఆ బ్రాహ్మణం తాలూకు భావాలని ఇందులో మొదటి ఆరు శ్లోకాలు వివరిస్తాయి. ఈ బ్రాహ్మణం కూడా యాజ్ఞవల్క్యునితో జరిగిన బ్రాహ్మణమే. శాకల్యఋషి తన శ్రవణ మనన నిధిధ్యాసనాదుల ద్వారా పరబ్రహ్మ స్వరూపాన్ని ఒక విధంగా నిర్ణయించాడు. దాని విషయమే యాజ్ఞవల్క్యుడితో వాదించాడు కాబట్టి శాకల్యబ్రాహ్మణమని పేరు వచ్చింది.

పదమూడో స్తబకంలోని 20 వ శ్లోకంలో అక్షరబ్రహ్మన్ని గురించి వర్ణిస్తూ యావత్తు జగత్తు పడుగుపేకలవలె పరమాత్మలో జీవుల్లలోని ప్రాణ రూపంగా, సూక్ష్మసత్యంగా, సూత్రంగా వ్యాపించి వున్నదని చెప్పబడింది. ప్రాణదేవుడిగా వ్యక్తమయ్యే ఆ పరమాత్మయొక్క వివిధ మహిమలని ఇప్పుడు వర్ణిస్తారు.

శ్లో॥ ప్రాణోత్మనో యస్య మహావిభూతేః
విస్తారమాత్రం హి సమస్తదేవాః
అనంతసంఖ్యా వసురుద్రముఖ్యాః
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 1

ప్రతి॥ సమస్తదేవాః = దేవతలందరు, అనంతసంఖ్యాః = అనంతసంఖ్యగల, వసురుద్రముఖ్యాః = వసురుద్రాదులు--, యస్య = ఎవనియొక్క, ప్రాణాత్మనః = ప్రాణస్వరూపుడైన, మహావిభూతేః = మహావిభూతి

యొక్క, విస్తారమాత్రం + హి = విస్తృతిరూపమేకదా, సః = ఆ, సామ్యానాథః = సామ్యకాశీశుడు, శ్రియం = శ్రేయస్సును, అదధాతు = ప్రసాదించుగాక!

## తాత్పర్యం

ప్రపంచమంతా విస్తరించుకొని వున్న అధిష్ఠాన దేవతలందరూ ముఖ్యప్రాణరూపాన్ని ధరించిన పరమాత్మయొక్క అనంతమహిమల్ని ప్రకటించే చైతన్యాంశలే, వాళ్ళల్లో వసురుద్రులు ప్రముఖులు. వారిసంఖ్య, సృజనాత్మక మహిమ అంతులేనిది. ప్రాణాత్మదేవతగా వ్యక్తమయ్యే ఆ పరమాత్మ సామ్యకాశీపతి, అనంతస్వరూపుడు అమూల్యమైన బ్రహ్మవిద్యాసంపదని నాకు ప్రసాదించునుగాక!

## వ్యాఖ్య

ఈస్తబకంలోని మొదటి ఆరు శ్లోకాలలో గురుదేవులు శాకల్యబ్రాహ్మణాన్ని వివరిస్తారు. మొదటి శ్లోకంలో బృ ఉ. 3 9. 1–24 మంత్రాల సారం ఉన్నది.

ఇందులో కూడా ప్రశ్నలు – సమాధానాల రూపంలోనే వాదం జరుగుతుంది. శాకల్యుడు సునిశితమైన ప్రశ్నలతో యాజ్ఞవల్క్యుణ్ణి ఎదుర్కొన్నాడు.

మొత్తంవాదంలోని సారభూతమైన వాదం ఈశ్లోకంలో పేర్కొనబడింది. ప్రకృతిశక్తులపైన అధివసించి వుండే అధిష్ఠాన దేవతలందరూ ప్రాణరూపంలో వ్యక్తమైన పరమాత్మయొక్క దివ్యమహిమలె దీనిని ఎలా పరిగణించాలో శాకల్య – యాజ్ఞవల్క్య సంవాదం తెలుపుతుంది.

పరమాత్మయొక్క అనంత దివ్యలీలలు విశ్వమంతటా మహిమాన్వితమై సర్వాతీతమైన పరిమాణాలలో ఉంటాయి. ఆయన దివ్యాంశలు ప్రత్యగాత్మగా అంతరాంతరాలలో సూక్ష్మంగా అతిచిన్నవిగా కొద్దిపాటి వ్యక్తరూపాలలో ఉంటాయి. ఇలా వ్యాపకం సంకోచం ఉన్న ఆత్మయొక్క మహిమలే దేవతలుగా వర్ణించబడుతున్నాయి.

శాకల్యుడు యాజ్ఞవల్క్యుణ్ణి అడిగాడు -- "దేవుళ్ళు ఎంతమంది?"

మహర్షి: 3003 మంది దేవతలు తమ దివ్యరూపాలలో ప్రపంచమంతటా విస్తరించుకొని వున్నారు. అయితే వాళ్ళు తమ సూక్ష్మరూపాలలో 303, 33, 6, 3, 2, $1\frac{1}{2}$, 1 — ఇలా సంకోచం చెందుతారు. ఇలా సంకోచం చెందుతూ వాళ్లందరూ ముఖ్యప్రాణంగా ఉన్న పరమాత్మలో కలిసిపోతారు. అసంఖ్యాకంగా బ్రహ్మాండమంతా వ్యాపించివున్న దేవతలందరూ పరమాత్మయొక్క దివ్యమహిమలు తప్ప వేరుకాదు.

శాకల్య: ముప్పై ముగ్గురు ముఖ్య దేవతలు ఎవరు?

యాజ్ఞ: వసువులు 8 మంది, రుద్రులు 11 గురు, ఆదిత్యులు 12 గురు' ఇంద్రుడు, ప్రజాపతి.

శాకల్య: వాళ్ళ వివరాలు వేరువేరుగా చెప్పుతారా?

యాజ్ఞ: అగ్ని, భూమి, వాయువు, అంతరాకాశం, సూర్యుడు, స్వర్గం, చంద్రుడు, నక్షత్రాలు – వీళ్ళు అష్టవసువులు. యావత్ప్రపంచం వారిచేత వ్యాపింపబడి, వాళ్లల్లో నిలిచివున్నది. అందుకే వాళ్లని వసువులన్నారు. ప్రపంచబాహుళ్యం వారిలో ఉన్నది. (వసతి ఇతి వసు)

పది ఇంద్రియాలు, మనస్సు – ఇవి ఏకాదశరుద్రులు. వాళ్ళు ఈ శరీరాన్ని వదిలివెళ్ళేప్పుడు బంధువులందరూ రోదిస్తారు. అందర్నీ ఏడిపించే వాళ్లు కాబట్టి రుద్రులన్నారు. (రోదత ఇతి రుద్రః)

పన్నెండునెలలు ద్వాదశాదిత్యులు. ప్రతినెలతోను తాదాత్మ్యం పొందేది సూర్యుడే. వాళ్లు చేసే సంవత్సర పర్యటనలో జీవుళ్ళ ఆయువుని హరించేస్తారు. ఆదానక్రియ చేస్తారు కాబట్టి ఆదిత్యులన్నారు.

ఇంద్రుడు వర్షించే మేఘంలోని ఉరుము ప్రజాపతి యజ్ఞాధిపతి. ప్రతి నిస్స్వార్థకర్మలోను ఆయన అధ్యక్షుడు.

శాకల్య: కుంచించుకుపోయే మార్గంలో వచ్చే ఆరుగురు దేవతలెవరు?

యాజ్ఞ: చంద్రుడు, నక్షత్రాలు కాక మిగిలిన అరుగురు వసువులు.

శాకల్యః ముగ్గురు, ఇద్దరు, ఒకటిన్నర, ఒకరు అయిన దేవతలెవరు?

యాజ్ఞ: భూమి, అంతరాకాశం, దివి—వీళ్లు ముగ్గురు దేవతలు. తక్కినవాళ్లు వీళ్ళలో కలిసిపోతారు. అన్నం, ప్రాణం — ఇద్దరు దేవతలు. తక్కిన దేవతలు వీళ్ళల్లో కలిసిపోతారు

తనశక్తితో కూడిన ముఖ్యప్రాణం ఒకటిన్నరదేవత. కదిలేవి, కదలనివి— ఈముఖ్య ప్రాణమహిమవల్ల విస్తరించుకొని వ్యాపిస్తాయి.

పరమాత్మ సర్వప్రపంచంలోను వ్యాపించి అంతరాత్మగా ఉండే ఒక్క దేవుడు. అందుచేత అంతరాత్మ పరమాత్మ.

ఇదేవిధంగా దశదిశలలో ఉన్న అధిష్ఠానదేవత లందరూ ఈ ఉపనిషత్తులో సూచింపబడినారు. ఒక్కొక్క దిక్కులోని దేవతని వర్ణించే సమయంలో ఏ అంతస్సారంనుండి ఈ దేవతలు విస్తరించుకుంటూ వస్తున్నారో, ఆ సారమే హృదయసారం కూడా. అందుచేత ఉపనిషత్తుయొక్క సందేశం ఒకటే—ప్రపంచంలోని ఉత్తమోత్తమమైన ప్రబలమైన శక్తులన్నీ హృదంతరాళంలోని సారమే. బాహ్యంలో వేర్వేరు శక్తులుగా వ్యక్తంకావడంకోసం తన అంతరాంతరాలలో ఉదయిస్తున్న సూక్ష్మ అంతఃప్రేరణలని నియమించి దారిలోపెట్టినప్పుడు బాహ్యశక్తుల్ని అవలీలగా వశంలో పెట్టుకోగలము. ప్రారంభదశలోని సాధనలను చేయడంద్వారా పొందే శక్తుల్ని సిద్ధులంటారు. ఆత్మసిద్ధిని పొందడానికి చేసే ఉత్తమ ఆధ్యాత్మికసాధనా మార్గంలో ఇవి అమితమైన ఆటంకాలుగా, ఆకర్షణలుగా అడ్డువస్తాయి. అందుచేత అల్పమైన ఈ సిద్ధుల ఆకర్షణలకి లొంగి పోరాదని హెచ్చరిక చేస్తూంటారు.

హృదంతరాళంలోని సూక్ష్మాతిసూక్ష్మ సారమైన కేంద్రంమీదనే విశాలమైన స్థూలప్రపంచంయొక్క మూలం ఉన్నట్లే, సూక్ష్మమైన హృదయానికి స్థూలశరీరం ఆధారంగా ఉన్నది. ఈస్థూల సూక్ష్మ నామరూప ప్రపంచాలు పరమాత్మమీద నిలిచివున్నాయి. ఈ విషయం తరువాతి శ్లోకంలో స్పష్టం చేయబడుతుంది.

శ్లో॥ సర్వం చ నామాకృతి కర్మరూపం
ప్రతిష్ఠితం వై హృది సా చ దేహే।
ఉభౌ చ యస్మిన్ క్రమశః పరస్మిన్
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 2

ప్రతి॥ నామ + అకృతి + కర్మ + రూపం = పేరు, రూపము, కర్మలరూపమయిన, సర్వం + చ = సమస్తము, హృది = హృదయమందు ప్రతిష్ఠితం + వై = ప్రతిష్ఠింపబడినదికదా, సా + చ = ఆహృదయము దేహే = దేహమందు, ఉభే + చ = ఆరెండును, క్రమశః = క్రమముగా యస్మిన్ = ఏ, పరస్మిన్ = పరబ్రహ్మయందు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠింపబడినవి, సః———

## తాత్పర్యం

నామరూపాల జగత్తు, కర్మలు హృదయాంతరాళాలనుండి జనిస్తాయి. హృదయం స్థూలశరీరంలో ఉన్నది. స్థూలశరీరం, హృదయం పరమాత్మలో ఉన్నాయి. ఆ అనంత స్వరూప పరమాత్మ సౌమ్య కాశీపతి, నాకు అమూల్యమైన బ్రహ్మ విద్యాసంపదని ప్రసాదించునుగాక!

## వ్యాఖ్య

బృ. ఉ 3. 9. 25, 26 మంత్రాలు పైశ్లోకంలో ఉదహరించబడినాయి.

ఇది కూడా శాకల్యునికి యాజ్ఞవల్క్యునికీ మధ్య జరిగిన వాదమే.

నామరూపాల స్థూలసూక్ష్మజగత్తులు ముఖ్య అన్ని ప్రాణులలోనుండి ప్రసరించే పరమాత్మ ఆధారంగా నిలిచివున్నాయి. వ్యక్తమైన పరమాత్మ హిరణ్యగర్భుడు ప్రపంచా లన్నింటికి అకారణమైన కారణం. ఆ అకారణ కారణం హిరణ్యగర్భుడు సర్వకారణాలకి అతీతుడైన పరమాత్మలో నిలిచివున్నాడు.

వర్ణనాతీతమైన ఆపరమాత్మని 'నేతి', 'నేతి' అనే నిరాకరణపద్ధతిద్వారా తెలుసుకోవలసిందే గాని మరో విధానం లేదు. అవిషయాన్ని రాబోయే శ్లోకం వెల్లడిస్తుంది.

శ్లో॥ యన్నేతినేతీతి నిషేధవాచా
నిర్దిశ్యతే ఒగృహ్య మశీర్య మేతత్।
అసక్తబద్ధా వ్యథ మాత్మతత్త్వం
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 3

ప్రతి॥ యత్ + ఏతత్ = ఏఈ పరబ్రహ్మ, అగృహ్యం = గ్రహింపబడనిది, అశీర్యం = శిథిలంకానిది, అసక్తబద్ధ = ఆసక్తిలేని బంధముకలది, అవ్యథం = బాధింపబడనిది, ఆత్మతత్త్వం = ఆత్మస్వరూపము, న + ఇతి + న + ఇతి + ఇతి = ఇదికాదిదికాదని, నిషేధవాచా = నిషేధ వాక్యముచే, నిర్దిశ్యతే = నిర్దేశింపబడుచున్నదో, సః——

## తాత్పర్యం

ఆ పరమాత్మ వర్ణనాతీతుడు. 'నేతి', 'నేతి' అన్న నిషేధవాక్యాలద్వారానే ఆయనని సూచించడానికి వీలవుతుంది. ఇంద్రియాలకి, జ్ఞానంతోకూడిన ఇతర పరికరాలకి అది గోచరం కాదు. అది నిత్యముక్త, నిస్సంగ, అవినాశి. సుఖ దుఃఖాలకి అతీతమైనది. ఆ అనంతపరమాత్మ సౌమ్య కాశీపతి నాకు బ్రహ్మ విద్యా సంపదను అనుగ్రహించును గాక!

అయితే పరమాత్మ ఇంద్రియమనోబుద్ధులకి అందరానివాడా అన్నప్రశ్న ఇంకా మిగిలే వుంటుంది. తరువాతిశ్లోకం దానిని విశదం చేస్తుంది.

శ్లో॥ ప్రత్యక్ష తర్కాద్యఖిల ప్రమాణైః
ప్రమీయతే న శ్రుతిమూర్ధభిర్నైః।
యః పూరుషః ప్రత్యగఖండబోధః
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 4

ప్రతి॥ శ్రుతిమూర్ధభిన్నైః = ఉపనిషత్తులకంటె ఇతరములైన, ప్రత్యక్షతర్క + ఆది + అఖిలప్రమాణైః = ప్రత్యక్షము, తర్కము మొ॥ సమస్త ప్రమాణాలచే, యః = ఏ, ప్రత్యక్ = పరోక్షముకాని, అఖండబోధః = అఖండజ్ఞానరూపుడైన, పూరుషః = పురుషుడు, న + ప్రమీయతే = తెలియబడడో. సః——

## తాత్పర్యం

ఇంద్రియాలు సూటిగా దర్శించడానికిగాని, వేదాంతమార్గాన్ని వదిలిపెట్టి స్వతంత్రంగా చేసే తర్క విజ్ఞాన విచారణలద్వారా గాని అఖండ శుద్ధ జ్ఞానరూప పరమాత్మ తెలియబడదు. ఆ అనంతశుద్ధ పరమాత్మ సౌమ్య కాశీపతి నన్ను - బ్రహ్మవిద్యాసంపదలతో అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

ఈ శ్లోకం తిరిగి అదే మంత్రభావాన్ని ఇంకా లోతుగా వివరిస్తోంది. ఉపనిషత్తుబోధనలద్వారా సరైన శ్రవణ మనన నిధిధ్యాసలద్వారా తప్ప అంతరాత్మను తెలుసుకోడానికి వేరే మార్గమేదీ లేదని యాజ్ఞవల్క్యమహర్షి తిరిగి చెబుతున్నాడు.

నశించి పోయిన శరీరం తిరిగి విత్తనాలద్వారా మొలకఎత్తినట్లు, మరణించిన వారందరూ ఆ పరమాత్మనుండె తిరిగి జనిస్తారు— ఈ విషయం రాబోయే శ్లోకం చెబుతుంది.

శ్లో॥ వృక్షే విశీర్ణే సముదేతి బీజాత్
నవీనవృక్షః సదణిమ్న ఇత్థమ్।
యతః ప్రరోహన్తి మృతా మనుష్యాః
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 5

ప్రతి॥ వృక్షే = చెట్టు, విశీర్ణే (సతి) = నశింపగా, బీజాత్ = విత్తనమునుండి, నవీనవృక్షః = క్రొత్తచెట్టు, సమ్ + ఉదేతి = పుట్టుచున్నది, ఇత్థం =

ఇట్లు, సత్ + అణియ్యః = సూక్ష్మమైన అణురూపము అయిన, యతః = ఏ బ్రహ్మనుండి, మృతాః = మరణించిన, మనుష్యాం = మనుష్యులు, ప్రరోహన్తి = పుట్టుచున్నారో, సః———

## తాత్పర్యం

ఒకవృక్షం నశించినప్పుడు దాని సూక్ష్మమైన విత్తనాలద్వారా అదేరకం వృక్షం తిరిగి జనిస్తుంది అలాగే మనుష్యులు మరణించినప్పుడు అదే పరమాత్మనుండి సూక్ష్మాతిసూక్ష్మమైన మానవబీజాలద్వారా వాళ్లు తిరిగి జనిస్తారు ఆ అనంతపరమాత్మ సౌమ్య కాశీపతి నాకు బ్రహ్మవిద్యాసంపదని అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

బృ ఉ 3 28 2–16 మంత్రాలలో వృక్షానికి మానవునికి మద్య వున్న సామ్యం చాలా వివరంగా వర్ణించబడింది

ఆ బ్రాహ్మణానికంతా సారమైన పరమాత్మ నిజస్వభావాన్ని వర్ణిస్తూ రాబోయే శ్లోకం ఈ పటిష్ఠమైన వాదఖండాన్ని ముగించుతుంది

**శ్లో॥ విజ్ఞాన మానందఘనం యదస్తి**
**దాతుః పరంబ్రహ్మఫలం ప్రయచ్ఛత్।**
**ముక్తో పసృప్యంచ శివం ప్రశాంతం**
**స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥** 6

ప్రతి॥ యత్ = ఏ, విజ్ఞానం = విజ్ఞాన స్వరూపమైన, ఆనందఘనం = ఆనంద ఘనము (ముద్ద), అస్తి = కలదో, (అది) దాతుః = కర్మచేయువానికి, పరం = శ్రేష్ఠమైన, బ్రహ్మఫలం = బ్రహ్మప్రయోజనమును, ప్రయచ్ఛత్ = ఇచ్చెను, ముక్తోపసృప్యం = ముక్తులచే స్వస్వరూపముగా పొందబడునది, శివం = మంగళస్వరూపమైనది, ప్రశాంతం = ప్రశాంతమైన స్వరూపముగలది, సః———

## తాత్పర్యం

ఆ పరమాత్మ విజ్ఞానఘనం, ఆనందఘనం. పరమశుద్ధము. ప్రతికర్తకి కర్మానుసారంగా ఫలప్రదానం చేస్తాడు. నిజమైన ఆత్మ జిజ్ఞాసువులకి అన్ని బంధనాలనుండి ముక్తి కలిగించి శుద్ధమంగళమైన ఆధ్యాత్మిక ప్రశాంతత నిస్తాడు. ఆ అనంత పరమాత్మ సౌమ్యకాశీపతి నాకు బ్రహ్మవిద్యాసంపదను అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 3. 9. 28వ మంత్రంలోని 7 వ భాగం యొక్క అర్థం ఇందులో చెప్పబడింది. తన వాదాన్ని ముగిస్తూ యాజ్ఞవల్క్యుడు పరమాత్మయొక్క ముఖ్యలక్షణాలని పేర్కొన్నాడు. మనిషిని చెట్టుతో పోల్చినప్పుడు విచిత్రమైన విచిత్రంగా ఉండే పుట్టుక, చావు, తిరిగి పుట్టుక – అన్నీ చెప్పాలి. అందుచేత మహర్షి ఆ విషయాన్ని వివరించారు. మానవుడు తిరిగి జన్మను పొందడమనేది తన పూర్వజన్మలో చేసిన కర్మఫలాలని సుఖదుఃఖరూపాలుగా పొందడానికి గాను వాసనలు పరిపక్వ మైనప్పుడు జనించుతాడు. సరిగ్గా, న్యాయప్రకారం కర్మల ననుసరించి పరమాత్మయె అతడికి కర్మఫలాలని ప్రదానం చేస్తాడు.

బ్రహ్మసూత్రాలలోకూడా చాలా తార్కికంగా పరమాత్మయే ప్రాణు లందరికీ తమ పాపపుణ్యాల ననుసరించి కర్మఫలప్రదానం చేస్తాడని నిర్ణయింపబడింది. (ఫలమత ఉపపత్తేః)

ఇక తరువాత బృ. ఉ. 4 వ అధ్యాయం షడాచార్యబ్రాహ్మణంయొక్క సారం ఇవ్వబడుతోంది. ఇది జనకునికి యాజ్ఞవల్క్యుడు ఉపదేశించాడు.

శ్లో॥ వాక్ప్రాణచక్షుః శ్రవణాని చిత్తం
బ్రహ్మేతి బుద్ధ్వా హృదయం చ విద్వాన్।
యద్బ్రహ్మ విజ్ఞాతు మగౌణ మర్హేత్
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 7

ప్రతి॥ వాక్ = వాక్కు, ప్రాణ = ప్రాణము, చక్షుః = చక్షువు, శ్రవణాని = శ్రవణములు, చిత్తం = మనస్సు, హృదయంచ = హృదయమును, బ్రహ్మ + ఇతి = బ్రహ్మ అని, బుద్ధ్వా = తెలిసికొని, విద్వాన్ = విద్వాసుండు, అగౌణం = ముఖ్యమైన, యత్ + బ్రహ్మ = ఏ పరబ్రహ్మను, విజ్ఞాతుం = బాగుగా తెలుసుకొనుటకు, అర్హేత్ = అర్హుడగును, సః——

## తాత్పర్యం

కన్ను, చెవి, ముక్కు, మనస్సు, హృదయం – వాటిని వెలిగించే, లేదా అధివసించే అధిష్ఠాన దేవతలను గురించి నిర్ద్వయ అవ్యక్త పరమాత్మయొక్క వ్యక్తస్వరూపాలని చింతించి ధ్యానించే సాధకుడు అన్ని పరిమితుల్ని, ఉపాధుల్ని అధిగమించే అనంతపరమాత్మని చేరుకోడానికి అర్హుడు. ఆ పరమాత్మ సామ్య కాశీపతి నాకు బ్రహ్మవిద్యాసంపదని ప్రసాదించును గాక!

## వ్యాఖ్య

నాలుగో అధ్యాయంలోని మొదటి బ్రాహ్మణాన్ని యావత్తు ఈ శ్లోకంలో తన అద్భుతశైలిలో క్లుప్తంగా వివరించేశారు పూజ్యగురుదేవులు. బ్రాహ్మణం లోని ఏడు మంత్రాలు ఇందులో ఉదహరింపబడినాయి. ఈ భావాలుకూడా యాజ్ఞ వల్క్యుడు జనకునికి ఇచ్చిన సలహాలోనివే!

పరమాత్మని గురించి పూర్ణంగా బోధచెయ్యడానికి గాని యాజ్ఞవల్క్యుడు జనకుని దర్బారుకి వెళ్ళాడు. తాను ఈ మహాజ్ఞానాన్ని ఇవ్వడానికి ముందు ఇతర ఆచార్యులు పరమాత్మని గురించి ఏమిబోధించారని జనకుణ్ణి అడిగాడు. అప్పుడు జనకుడు వాక్కు. కన్ను, చెవి, ప్రాణం, మనస్సు, హృదయం, మొదలైన ఇంద్రియాల అధిష్ఠానదేవతలన్నీ పరమాత్మయొక్క వ్యక్తస్వరూపాలని బోధించినట్లు చెప్పాడు. అప్పుడు మహర్షి జనకుడితో ఆచార్యులు నేర్పింది పరమాత్మలో ఒక భాగమేనని ఇది బ్రహ్మంలో ఒక పాదం మాత్రామేనని మొత్తం బ్రహ్మం కాదని వెటకారంగా అన్నాడు మహర్షి యొక్క నిర్దేశం ఏమంటే – ఇంద్రియాల అధిష్ఠానదేవతలు పరిమితులకు లోనైనవి. ఇంద్రియ గోళాలు, ఇంద్రియశక్తులు పరిమితుల్నే ఏర్పరుస్తాయి. అందుచేత ఆ శక్తుల్ని

అన్ని పరిమితులకి, పరిధులకి అతీతమైన పరబ్రహ్మస్వరూపంగా ఇంద్రియాల ఉపాసన చెయ్యాలి. ఇలా ఉపాసన చేసే సాధకుడు సర్వాతీతమైన ఉపాధి రహితమైన సర్వవ్యాప్త పరమాత్మని పొందగలడు. జనకునికి పైఉపాసనను నేర్పిన ఆచార్యులు చాలామందిలో – వాక్కు బ్రహ్మమని శిలిని కుమారుడు జీవలుడు, ప్రాణం బ్రహ్మమని శుల్బన్ కుమారుడు ఉల్లంకుడు, కన్ను బ్రహ్మమని వృషలుని కుమారుడు బార్షి, చెవి బ్రహ్మమని భారద్వాజుని కుమారుడు గార్దభి, మనస్సు బ్రహ్మమని సత్యకామ జాబాలుడు, హృదయం బ్రహ్మమని శకలుని కుమారుడు విదగ్ధుడు నేర్పారు. యాజ్ఞవల్క్యుడు వాళ్ల బోధలని పూర్తిగా కొట్టివెయ్యలేదు. కొద్దిగా సవరించాడు. వాళ్లు చెప్పినది పరిమితులలో ఉన్న బ్రహ్మమని అవి కూడా ఒక భాగమేనని వివరించాడు. ఈ ఉపాధులన్నింటికీ అతీతమైనది బ్రహ్మమని ధ్యానించాలి. ఆచార్యులు నేర్పిన దానికి ఇంకాకొంత కలపబడినది కాబట్టి ఇది ఆచార్యబ్రాహ్మణమని పిలువబడింది.

అన్నింటికన్న ముందు సృష్టికి పూర్వం బ్రహ్మ తన మహిమలో కలలో రమించుతున్నాడు దీనిని జ్యోతిర్బ్రహ్మమన్నారు. దానిని రాబోయే శ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ ఆదిత్య చంద్రాగ్నివచాంసి యత్ర
శామ్యంతి మర్త్యః కురుతే తదాత్వే।
యజ్జ్యోతిషా కర్మ నిజాత్మరూపః
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 8

ప్రతి॥ యత్ర = ఏ బ్రహ్మయందు, ఆదిత్య చంద్ర + అగ్నివచాంసి = సూర్య చంద్ర అగ్ని వాక్కులు–అను తేజస్సులు, శామ్యంతి = శమించును, తథాత్వే = అప్పుడు, మర్త్యః = నరుడు, యత్ + జ్యోతిషా = ఏ జ్యోతిస్సుచే, కర్మ = కార్యము, కురుతే = చేయునో, నిజ + ఆత్మరూపః = నిజాత్మ స్వరూపుడయిన, సః——

## తాత్పర్యం

రెండోది అయిన స్వప్నావస్థలోకి మనుష్యులు చేరినప్పుడు సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాక్కు — కలలోని అనుభవాలని వివరించడానికి వుండవు. అవి ఈ అవస్థలో పూర్తిగా నశించిపోతాయి. అయినా వాళ్లు స్వప్రకాశంలో స్వప్నానుభవాల పొందుతో ఎన్నో పనులు చేస్తారు. ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నాకు బ్రహ్మవిద్యాసంపదని అనంతంగా ప్రసాదించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 3 1–6 మంత్రాలు ఈ శ్లోకంలో ఉదహరింపబడినాయి.

ఇక్కడకూడా యాజ్ఞవల్క్యుడు జనకుని ప్రశ్నలకి జవాబిస్తూ మెలకువ సమయంలో ఆత్మ సూర్యుడిగాను, సూర్యుడు అస్తమించినప్పుడు చంద్రునిరూపంలోను, ఆయన లేనప్పుడు అగ్నిరూపంలోను ప్రకాశిస్తుందనీ, అగ్ని లేనప్పుడు వాగ్రూపంలోను, వాక్కు అస్తమించినప్పుడు అది తన స్వయంప్రకాశంలో వ్యక్తమై అన్ని కర్మలను చేసి సుఖదుఃఖానుభవాలన్నింటిని తనప్రకాశంలోనే చూస్తుందనీ బోధించాడు. సూర్యచంద్రాగ్ని వాక్కులు లేకుండా ఆత్మప్రకాశంతో సుఖదుఃఖాలు పొందే స్థితిని స్వప్నావస్థ అంటారు.

స్వప్నావస్థలోని పరమాత్మ స్వయంప్రకాశస్వభావాన్ని తరువాతి శ్లోకం వర్ణిస్తుంది.

శ్లో॥ యజ్జ్యోతి రంతర్హృది పూరుషాఖ్యం
పరత్ర చాత్రాపి మతిప్రధానమ్।
చరత్యథ ధ్యాయతి ఖేలతీవ
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 9

ప్రతి॥ యత్ = ఏ, పూరుష + ఆఖ్యం = పరమ పురుషుడను పేరుగల, మతి ప్రధానం = బుద్ధిప్రధానంగల, జ్యోతిః = జ్యోతిస్సు, అంతః = లోపల,

హృది = హృదయమందు, పరత్ర = ఇతరత్ర, అత్ర + అపి + చ = ఇచ్చటకూడా, చరతి + ఇవ = చరించుచున్న దానివలె, ధ్యాయతి + ఇవ = ధ్యానించుచున్న దానివలె, ఖేలతి + ఇవ = క్రీడించుచున్న దానివలె (అగుచున్నదో) సః——

## తాత్పర్యం

పురుషుడని ఖ్యాతిపొందిన ఈ స్వయంప్రకాశ పరమాత్మయే బుద్ధిని వెలిగిస్తుంది. బుద్ధితోపొందిన తాదాత్మ్యం పొందటంవల్ల జీవుడై సర్వాన్ని తెలుసుకుంటూ ఈ ప్రపంచ మంతటా, పైప్రపంచంలోనూకూడా సంచరిస్తూంటుంది. బుద్ధితో తాదాత్మ్యంవల్ల ఒక్కొసారి ధ్యానమగ్నమై శాంతిగాను, మరికొన్నిసార్లు విలాసంగా కదలి క్రియాత్మకంగాను అగపడుతుంది. ఆ పరమాత్మ సౌమ్య కాశీశుడు నాకు బ్రహ్మవిద్యాసంపదను అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 3. 7 వ మంత్రంలోని సారం ఇందులో వివరింపబడింది.

ఇంద్రియ ప్రాణమనో బుద్ధులకి భిన్నమైన నిత్యప్రకాశాత్మని వేరుగా ఎలా తెలుసుకోవాలని జనకుడు ప్రశ్నవేశాడు. ఆత్మకు ఎలాంటిలక్షణాలూ లేవని స్పష్టపరుస్తూ యాజ్ఞవల్క్యుడు బుద్ధితో కలిసిన ఆత్మ ఒక్కొకసారి యోచిస్తున్నట్లు, మరొకసారి క్రియాత్మకంగాను కనబడుతూ కదలికను కలిగి వుంటుంది. జాగ్రదవస్థను వదలిన బుద్ధి స్వప్నంలోకి పోతుంది. అప్పుడు పరమాత్మకి జాగ్రదనుభవాలని మూసివేసి స్వప్నానుభవాలనే వెలిగిస్తుంది. అందుచేత పరమాత్మకి ఇంద్రియప్రాణ బుద్ధులతో ఉన్న సంగాన్నిబట్టే దానికి సత్తా ఉన్నట్లు ఎంచుకుంటాము. అందుకే బుద్ధితోను, ఇంద్రియాలతోను ఆత్మని ఒకటిగా భ్రమిస్తాము. సత్యస్థితిలో ఆత్మ ఈ పరికరాలకన్న భిన్నమైనది. ఆత్మయొక్క ప్రకాశమానమైన దివ్యతేజంలోనే అవి కదులుతూ పనిచేస్తాయి.

తరువాతి శ్లోకంలో ఆత్మ స్వప్నానుభవాలని స్వప్రకాశంతో ఆత్మ ఎలా వెలిగిస్తుందో వర్ణింపబడుతోంది.

శ్లో॥ యః పూరుషాత్మా విషయేంద్రియాద్యైః
సంకీర్ణభా జాగ్రతి భాత్యకీర్ణః।
స్వప్నే స్వయంజ్యోతి రలుప్తదృష్టిః
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 10

ప్రతి॥ యః = ఏ, పూరుషాత్మా = పురుషస్వరూపము, విషయ + ఇంద్రియ + ఆద్యైః = విషయములు, ఇంద్రియాలు మొ॥ వానిచే, జాగ్రతి = జాగరణకాలమందు, సంకీర్ణభా = సంశ్లిష్టమైన వెలుగుగా, భాతి = ప్రకాశించుచున్నది, స్వప్నే = స్వప్నమందు, అకీర్ణః = సంకీర్ణము కానటువంటి, అలుప్తదృష్టిం = నశించని దృష్టికలదై, స్వయంజ్యోతిః = స్వతస్సిద్ధమైన జ్యోతి, భాతి = ప్రకాశించుచున్నది, సః— —

## తాత్పర్యం

మెలకువస్థితిలో జీవాత్మగా వ్యక్తమయ్యే పరమాత్మ తన స్వయంప్రకాశ మహిమతో ఇంద్రియప్రాణ మనోబుద్ధుల్ని, సూర్య చంద్రాగ్నుల్ని ఇతర బాహ్యప్రకృతి శక్తుల్ని వెలిగిస్తుంది ఈ అవస్థలో శుద్ధమైనదాని స్వయం ప్రకాశం వెల్లడికాదు. మలినము, స్థూలము అయిన జ్ఞానేంద్రియాలు ప్రకృతి శక్తులు – వీటితో కలిసి అశుద్ధమై వుంటుంది. స్వప్నావస్థలో ఈ స్థూలఇంద్రియాలు, సూర్యచంద్రులవంటి బాహ్యకాంతులు ఉండవు కాబట్టి ఆత్మ తన నిత్యనిర్మల శుద్ధచైతన్య కాంతిలో సాక్షిగా వెలుగుతూ తన అనుగ్రహంతో వాసనలవల్ల ఏర్పడే కలల అనుభవాలని వెలిగిస్తుంది. ఏ స్వయంప్రకాశ మహిమవల్ల స్వప్నానుభవాలు వెలుగుతాయో ఆ పరమాత్మ సౌమ్యకాశీనాథుడు తన అనంతకరుణతో నాకు శాశ్వతమైన బ్రహ్మవిద్యాసంపదని అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 3. 8, 9 మంత్రాలభావాలు ఈ శ్లోకంలో ఉదహరించబడినాయి.

జీవాత్మకి ఈ జన్మలోని జీవితం, రాబోయే జన్మలోని జీవితం—ఇలా రెండు స్థాయిలున్నాయి. ఈ రెంటికీ మధ్యలో ఉన్న జీవాత్మస్థితిని స్వప్నమని ఇక్కడ వర్ణించబడింది. సాధారణంగా కలలో పొందే అనుభవాలు మెలకువ అనుభవాలని పోలివుంటాయి. అయితే ఒక్కొక్కసారి మెలకువ సమయంలో ఎన్నడూ చూడని అనుభవాలు కలలోకి వస్తాయి పూర్వజన్మలోని సంస్కారాలు అలా ప్రకటమైనందున ఆ కలలు వస్తాయి అలాగే జాగ్రత్స్వప్నాలకి భిన్నంగా పరలోకానుభవం వుంటుంది. జీవాత్మ చేసే జ్ఞాన కర్మ సాధనని బట్టి, పూర్వ జన్మలలో సంపాదించిన అంతర్జ్ఞానాన్నిబట్టి పైలోకాలు అనుభవ మౌతాయి. అవే మనకి స్వప్నంలో కలిగే సుఖదుఃఖానుభవాలకి కూడా కారణం. మెలకువలో మనకి తాదాత్మ్యం కలిగించే స్థూలశరీరం కూడా పూర్వ సంస్కారాల కారణంగా ఏర్పడింది. ఇదే కార్య—కారణ సంబంధం. జీవుడు స్థూల విషయాల (స్థూల వాసనల) నుండి ఉపసంహరించుకొని సూక్ష్మ వాసనల స్వరూపాన్ని తనతో తీసుకొని పోతాడు. ఈ సూక్ష్మవాసనలతో పొందే తాదాత్మ్యాన్ని స్వప్నమంటారు. ఈ స్వప్నావస్థలో సూక్ష్మ వాసనలు తయారు చేసి పెట్టిన శరీరాన్ని ధరిస్తాడు. ఇక్కడ స్వయం ప్రకాశమహిమతో ఇంద్రియాలు, గోళాలు, అక్కడ లేకుండానే సంచరిస్తూ కలల అనుభవాలని పొందుతాడు. సూక్ష్మ వాసనలలో ఇరుక్కుపోయిన జీవుడు సాక్షిరూపంలో ఉండే స్వయంజ్యోతి ఆత్మద్వారా కలయొక్క సూక్ష్మానుభవాలని పొందుతాడు.

అయితే కలలో కూడా స్వాప్నికుడు సూర్య చంద్రుల్ని రథాలని చూస్తాడు. అవి అన్నీ సూక్ష్మ వాసనలవల్ల సృజింపబడినవే. స్వయంజ్యోతి ఆత్మ కేవలం సాక్షిగానే ఉంటుంది. అయినా మనస్సులోని వాసనలు ఈ కలలని సృష్టిస్తాయి. ఈవిషయాన్ని రాబోయే శ్లోకం స్పష్టం చేస్తుంది.

శ్లో॥ రథాన్ తురంగా న థ రాజమార్గాన్
సరాంసి యోఽసౌ సృజతే స్రవంతీః।
మోదప్రమోదా నపి పూరుషాత్మా
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 11

ప్రతి॥ యః + అసౌ = ఏ,ఈ,పూరుష + ఆత్మా = పూరుష స్వరూపమైనబ్రహ్మ, రథాన్ = రథములను, తురంగాన్ = గుర్రాలను, అథ = మరియు, రాజమార్గాన్ = రాజమార్గాలను,సరాంసి = సరస్సులను, స్రవంతీః = నదులను, మోదప్రమోదాన్ + అపి = సుఖసంతోషాలను కూడ, సృజతే = సృజించుచున్నది, సః———

## తాత్పర్యం

జీవాత్మభావాన్ని స్వీకరించిన పరమాత్మ కలలోని జీవాత్మగా రథాలని, గుర్రాలని, చెరువులు, నదులు, వీధులు మోదప్రమోదాలని సృష్టించినట్లు అగపడుతాడు. ఆ పరమాత్మ సామ్య కాశీనాథుడు నాకు బ్రహ్మవిద్యా సంపత్తిని అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 3. 10 వ మంత్రం ఇందులో విశదీకరింపబడింది.

ఈ శ్లోకం జాగ్రత, స్వప్నం — ఈ రెండు అవస్థలలోని అనుభవాలకి మధ్య ఉన్న తేడాని వివరించుతుంది. జాగ్రదవస్థలో పరమాత్మ తన స్వయం ప్రకాశంద్వారా ఇంద్రియ మనోప్రాణాలతో, బాహ్యప్రాకృతిక శక్తులతో మిళితమై వాటిని వెలిగిస్తాడు. కలలో ఏ బాహ్యస్పర్శలు లేకుండానే రథాలు, గుర్రాలు, చెరువులు, నదులు, అన్నీ సృష్టింపబడి వెలిగింపబడుతాయి. నదులు లేనిచోట నదుల్ని స్వాప్నికుడే సృజిస్తాడు. గుర్రం, రథం లేకుండానే స్వాప్నికుడు వాటిని తయారుచేసి వెలిగిస్తాడు. ఇక్కడ చెప్పదలచుకొన్న భావం ఏమిటంటే, ఆత్మయొక్క స్వయంప్రకాశంవల్ల వెలిగి చురుకుదనాన్ని పొందే మనస్సు తన సూక్ష్మ వాసనలనుండి విషయాలని తయారుచేసుకొని అనుభవిస్తుంది. రూపమే లేని మనస్సు ఆత్మప్రసాదంవల్ల తన సూక్ష్మవాసనల నుండి అనేక రూపాలని తయారు చేసుకొని భోగించి రమిస్తుంది.

ఈ భావాన్ని తరువాతి శ్లోకం కూడా వెల్లడిస్తుంది.

శ్లో॥ ఉచ్చావచాన్ సంస్కృతి మాత్ర రూపాన్
నిర్మాయ నారీ నగరాదికాన్ యః।
భుంక్తే స్వయంభా స్సువివిక్తమూర్తిః
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 12

ప్రతి॥ యః = ఏ పరాత్మ, ఉచ్చావచాన్ = అధికములయిన, సంస్కృతిమాత్ర రూపాన్ = సంస్కారమాత్రరూపాలయిన, నారీనగర + ఆదికాన్ = స్త్రీలు, నగరాలు మొ॥ వాటిని, నిర్మాయ = నిర్మించి, వివిక్తమూర్తిః = విభిన్నమూర్తిగా, స్వయంభాస్స = స్వయంజ్యోతిస్సులందు, భుంక్తే = అనుభవించుచున్నాడు, సః——

## తాత్పర్యం

పరమాత్మ జీవాత్మగా వ్యక్తిత్వాన్ని ధరించి కలలో పవిత్రమైన దేవతలని, అల్పమైన జంతుపక్షిరూపాలని తయారుచేసినట్లు అగపడతాడు, స్త్రీలని, నగరాలని తయారుచేసి ఆనందిస్తాడు. ఈసృష్టికి, భోగాలకి పరమాత్మ పూర్తిగా విభిన్నం, విలక్షణం. అది స్వయంప్రకాశ మైనది. ఈ అన్ని అనుభవాలకి ఏకైకసాక్షి ఆ ప్రకాశాత్మ సౌమ్య కాశీనాథుడు అనంతమైన కరుణతో నాకు బ్రహ్మవిద్యాసంపదను అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 3. 13 వ మంత్రంలోని భావాలు ఈ శ్లోకంలో ఉన్నాయి.

కలలో స్వాప్నికుని మనస్సే భోక్తగా, వివిధ భోగ్యవిషయాలుగా తయారవుతుంది. ఆత్మ నిత్యసాక్షిగా, జ్ఞానరాశిగా నిలబడివుంటుంది. కలలోలాగే జాగ్రతలోకూడా ఆత్మ తన స్వయంప్రకాశ మహిమతో కేవలం సాక్షిగానే వుంటుంది, శుద్ధమైన పరమాత్మ నిజానికి ఈ రెండుదశలలో సాక్షిత్వానికి కూడా అతీతమైనది. ఈ విషయాన్ని తరువాతిశ్లోకం స్పష్టీకరిస్తుంది.

శ్లో॥ స్వప్నే చ యో జాగ్రతి జాగరూకః
తత్పుణ్యపాపా ననుబద్ధ ఏవ।
సంక్రీడతేఽయం పురుషో హ్యసంగః
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 13

ప్రతి॥ యః = ఏ పురుషోత్తముడు, స్వప్నే = స్వప్నమునందును, జాగ్రతి + చ = జాగ్రత్తయందును, జాగరూకః = జాగరూకుడై, తత్ + పుణ్య పాప + అనను బద్ధః + ఏవ = ఆ పుణ్యపాపాలచే బద్ధుడు కానివాడే, అయం + పురుషః = ఆ యీ పురుషుడు, అసంగః = సంగములేకనే సంక్రీడతే = క్రీడించుచున్నాడు, హి = కదా, సః——

## తాత్పర్యం

స్వప్నజాగ్రతలు రెంటిలోను వాటి పాపపుణ్యాలవల్ల తాకబడకుండా పరమాత్మ నిత్యజాగరూకమై, కేవలం ఎరుకతో తెలివిగా వుంటుంది. నిత్య అసంగ వస్తువు కాబట్టి అది అలా ఉండగలదు. ఆ పరమాత్మ సౌమ్య కాశీనాథుడు నాకు బ్రహ్మవిద్యాసంపదను ప్రసాదించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 3. 14 వ మంత్రభావం ఈశ్లోకంలో ఉన్నది.

కల ఉదాహరణద్వారా ఆత్మ యొక్క స్వయం ప్రకాశస్వభావం ఋజువైంది. శరీరం రాలిపోయి నప్పుడుకూడా సత్తా వుంటుందనే సంగతి కూడా సంశయం లేకుండా నిరూపింపబడింది.

ఈ ఆత్మే గాఢనిద్రలోని అనుభవాన్ని కూడా వెలిగిస్తుందని రాబోయే శ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ యస్సంప్రసాదే చ నిజస్వరూపే
స్ఫురత్యపాస్తార్తి శత స్సుఖాత్మా।
స్వయం ప్రభోఽయం పురుషో హ్యసంగః
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 14

ప్రతి॥ యః = ఏ పరాత్మ, సంప్రసాదే = గాఢనిద్రయందు, నిజస్వరూపే + చ = నిజస్వరూపమునందును, అపాస్త = గతించిన, ఆర్తిశతః = దుఃఖ శతం కలవాడై, సుఖ + ఆత్మా = సుఖ స్వరూపుడుగ, స్ఫురతి = ప్రకాశించును, అయం + పురుషః = ఈ పురుషుడు, స్వయంప్రభః = స్వయంజ్యోతి స్వరూపుడు, అసంగః + హి = నిస్సంగుడుకదా, సః—

## తాత్పర్యం

గాఢనిద్రలో ఈ పరమాత్మ ఎలాంటి దుఃఖంచేతను తాకబడక, నిత్య సుఖ స్వరూపంతో, శుద్ధస్వయం ప్రభతో ఉంటాడు. ఎందుకంటే శుద్ధాత్మ నిత్యము నిస్సంగమై వెలుగుతూంటుంది. ఈ అవస్థలో అది తన స్వస్వరూపంలో వెలుగుతూంటుంది. ఆ పరమాత్మ సౌమ్య కాశీనాథుడు నాకు బ్రహ్మవిద్యానందాన్ని ప్రసాదించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 3. 15 వ మంత్రంలోని భావాలు ఈ శ్లోకంలో ఉన్నాయి.

మూడు అవస్థలలోను నిస్సంగి అయిన ఆత్మ తన స్వయంప్రకాశంతో దేనితోను సంబంధం లేకుండానే ఉంటుంది. ఉపనిషత్తులో ఈ విషయం చాలా విస్తారంగా వివరింపబడింది. గురుదేవులు దానిసారాన్ని మాత్రం క్లుప్తంగా వివరిస్తున్నారు.

జాగ్రత్స్వప్నాలలో సుఖదుఃఖాలతో నిమిత్తం లేకుండానే రకరకాలుగా ప్రయాణించి ఆత్మ తన స్వస్థితి అయిన శుద్ధస్థితిని ఎలా చేరుతుందో రాబోయే శ్లోకంలో చక్కని సూక్ష్మమైన ఉదాహరణలద్వారా తెలుపబడుతుంది.

శ్లో॥ స్వప్నే చ యో జాగ్రతి మత్స్యతుల్యః
చరత్యథ శ్యేనవ దాత్మనీడమ్।
సుషుప్త మాసర్పతి పూరుషాత్మా
స సౌమ్యనాథః శ్రియ మాదధాతు॥ 15

ప్రతి॥ యః = ఏ పురుషుడు, స్వప్నే = స్వప్నమునందును, జాగ్రతి + చ = జాగ్రదవస్థయందు, మత్స్యతుల్యః = చేపవలె, చరతి = చరించునో, అథ = మరియు, శ్యేనవత్ = డేగవలె, ఆత్మనీడం = తనగూటిని, సుషుప్తం = స్వప్నావస్థలోనున్న. పూరుష + ఆత్మా = పురుషరూపము, ఆసర్పతి = ప్రవేశించును, సః——

## తాత్పర్యం

ఆ పరమాత్మ పరిమిత జీవుడుగా వ్యక్తిత్వాన్ని పొంది శరీరమనే పురంలో వసించి విశ్రాంతి పొందుతూ జాగ్రత్స్వప్నాలనే రెండు అవస్థలకి మధ్య చేపలాగా ఈదుతూంటాడు. ఈ రెంటిలోను ఈతని ముగించి డేగవలె పైకెగిరి గాఢనిద్రలో తన శుద్ధస్వరూపంలోకి నిష్క్రమిస్తాడు. ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నాకు అనంతబ్రహ్మవిద్యను అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 3. 18, 19 మంత్రాల భావాలకి గురుదేవులు ఈ శ్లోకంలో సుసూక్ష్మవివరణ ఇచ్చారు.

నదీమహాప్రవాహంలో పెద్దచేప స్వేచ్ఛగా ఈదులాడుతుంది. నదికి అవల ఈవల ఉండే రెండుగట్లనీ తేలికగా స్పృశిస్తుంది. ఏ గట్టుమీది ఆకర్షణలు, అడ్డుకట్టలు దాని స్వేచ్ఛాగమనాన్ని అరికట్టలేవు. అలాగే జాగ్రత్స్వప్న స్థితులు రెంటిలోను ఆత్మ దేనికీ తగుల్కొకుండా సంచరిస్తుంది.

డేగ స్వశక్తివల్లనే ఆకాశంలో ఎంతో ఎత్తుకి ఎగిరిపోతుంది. ఎంత ఎత్తయినా, ఎంత దూరమైనా అది ఎగరగలదు. ఇలా ఎగిరీ ఎగిరీ అలిసినప్పుడు రెక్కలు ముడుచుకొని గూటికి వచ్చి పడుకొంటుంది. అలాగే స్వేచ్ఛగా జాగ్రత్స్వప్నాలనే రెండు అవస్థలలోను అనేకరకాల పరుగులు పెట్టిన ఆత్మ కారణశరీరంలోకి వచ్చి విశ్రాంతి తీసుకొంటుంది.

ఇప్పటివరకు జాగ్రత్స్వప్నాలలో ఆత్మ నిస్సంగమై, విలక్షణమై ఉంటుందని, తాను స్వీకరించే స్థూలసూక్ష్మ శరీరాలకి కూడా భిన్నమైనదనీ

చెప్పబడింది. ఇప్పుడు రాబోయే శ్లోకాలలో శుద్ధాత్మ—అవిద్య, అజ్ఞానంకన్న కూడా భిన్నమైనదని బోధింపబడుతుంది. ఆత్మ నెరుగకపోవడం అజ్ఞానం.

16—23 శ్లోకాలలో గురుదేవులు ఛందస్సుని మార్చారు. ఈ క్రొత్త ఛందస్సుని "మందాక్రాంత" మంటారు.

శ్లో॥ సృష్ట్వా స్వప్నే వివిధ విషయాన్ సూక్ష్మనాడీగతస్సన్
యద్యత్ పశ్యామ్యహమిు సకలం తత్తదాత్మైవ సాక్షాత్।
విద్వన్మూర్తిర్య ఇతి మనుతే గాఢ సంస్కారతంత్రః
సౌమ్యాధీశః శ్రితసురతరుః శ్రేయసే న స్స భూయాత్॥ 16

ప్రతి॥ అహం = నేను, సూక్ష్మనాడీగతః + సన్ = సూక్ష్మనాడినిపొందిన వాడనై ఉంటూ, వివిధవిషయాన్ = అనేకవిషయాలను, సృష్ట్వా = సృజించి, స్వప్నే = స్వప్నమునందు, యత్ + యత్ = దేనిదేనిని, పశ్యామి = చూచుచున్నానో, తత్ + తత్ + సకలం = ఆయాసమస్తము, సాక్షాత్ = సాక్షాత్తుగా, ఆత్మా + ఏవ = ఆత్మయే, యః = ఏ పరమాత్మ, విద్వన్మూర్తిః = విద్వాంసుడు, గాఢసంస్కారతంత్రః = నియమ నిష్ఠలతో కూడినవాడు—, ఇతి = అని, మనుతే = తలంచుచున్నాడో, సః = అట్టి, శ్రితసురతరుః = ఆశ్రితదేవతలకు కల్పతరువైన, సౌమ్యాధీశః = సౌమ్యాధీశుడు, నః = మనకు, శ్రేయసే = మంచికి, భూయాత్ = అగుగాక!

## తాత్పర్యం

జీవాత్మ భావాన్ని పొందిన ఆత్మ స్వప్నంలో "హిత" అనబడే సూక్ష్మాతి సూక్ష్మమైన నాడీకేంద్రాలలో వ్యాపించి ఉంటుంది. అవి వెంట్రుకలో వెయ్యోవంతు ఉంటాయి. వాటిలో ఉండే ఆత్మ వ్యక్తమై సూక్ష్మవాసనల రూపాలలో ఉన్న ఎన్నెన్నో రకాల విషయవస్తువుల్ని సృజిస్తుంది. తన స్వస్వరూపాన్ని ఎరగని అజ్ఞానంలో తాను సృజించుకొన్న సూక్ష్మవిషయాలతో తాదాత్మ్యం పొందుతుంది. "నేను చూచేది యావత్తు ఆత్మయొక్క ప్రకటనే అను

కొంటుంది. కలలో పొందే ఈ ఆత్మయొక్క ఈ భ్రాంతి అవిద్యయొక్క విస్తారమే తప్ప వేరుకాదు. జాగ్రదవస్థలో ముందే పొందివున్న జాగ్రత్ప్రపంచాన్ని, జాగ్రత్తలోని విషయాలని నిజమనుకుంటుంది. జాగ్రత్తలోని స్థూల విషయాలే స్వప్నంలో సూక్ష్మరూపాలలో సూక్ష్మానుభవాలుగా కొనసాగుతాయి. అందువల్ల తీవ్రమైన ఉపాసన, గాఢమైన ఆధ్యాత్మిక సాధనతో పండితుడైన సాధకుడు మెలకువ ప్రపంచాన్ని అందులోవున్న విషయవస్తువుల్ని శుద్ధాత్మ యొక్క వ్యక్తరూపాలుగా భావించుకొంటే అతడు కలలోకూడా ఆత్మానుభవాన్ని పొందగలడు.

ఆ పరమాత్మ ఉత్తరకాశీపతి అయిన విశ్వనాథప్రభువు దేవదారు వృక్షాలమధ్య నిలుచుండి ఏలే ప్రభువు, దేవలోకంలోని కల్పతరువుగా భక్తుల కోరికల్ని తీర్చేప్రభువు నాకు మోక్షాన్ని ప్రసాదించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 3. 20 వ మంత్రభావం ఈ శ్లోకంలో వివరింపబడింది.

సూక్ష్మశరీరం ఉండే స్థానాన్ని 'లింగశరీరం' అంటారు. అది "హిత"అని చెప్పబడే సూక్ష్మనాడీకేంద్రాల చేత నిర్మితమై ఉన్నది. అవి అన్నీ సూక్ష్మమైన వాసనలచేత నిండింపబడి వుంటాయి. ఇలా ప్రత్యేకతలతో కూడిన నాడీకేంద్రాలతో కలిసిన ఆత్మ తాను శుద్ధమైనా, పూర్వజన్మలలో, జాగ్రదవస్థలోను సంపాదించుకొన్న వాసనల ననుసరించి వేర్వేరు ఆకారాలని ధరించి వేర్వేరు సూక్ష్మానుభవాలని పొందుతుంది. ఇలా ఆత్మ భ్రాంతితో కూడిందని అనుకోడం ఆత్మనెరుగని అజ్ఞానంవల్ల ఏర్పడుతుంది. దీక్షతో సాధనచేసి ఒకసారి జాగ్రదవస్థలో ఆత్మ స్వరూపాన్ని గ్రహించినప్పుడు, అదే కలలోకి కూడా ప్రవేశిస్తుంది.

స్వప్నావస్థలో ఆత్మ తన స్వయం ప్రకాశమహిమతో తన్ను తాను చూచుకొంటుందని ముందే చెప్పబడింది. అక్కడ దానికి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు అక్కర్లేదు. ఇతర ఏ పరికరాలూ అక్కరలేదు.

ఇప్పుడు గాఢనిద్రలో పండితుడు, పామరుడు కూడా ఒకే ఆత్మని దాని నిత్యానంద రూపంలో అనుభవిస్తారని వివరింప బడుతోంది. సుషుప్తిలో ఆత్మని సూటిగా అనుభవించే సంగతిని జీవితంలోని ఒకసాధారణ ఉదాహరణద్వారా తెలుపుతున్నారు.

శ్లో॥ కాంతాశ్లిష్టః కిమపి కమనో వేత్తి నాంత ర్నబాహ్యః
యద్వత్ స్వాత్మన్యభయతృషి యః ప్రాప్తనిర్భేదభావః।
ఆనందాత్మా స్వపితి చ తథా నీరుజః పూరుషాత్మా
సౌమ్యాధీశః శ్రితసురతరుః శ్రేయసే న స్స భూయాత్॥ 17

ప్రతి॥ కాంతా + ఆశ్లిష్టః = కాంతచేత కౌగిలించబడిన, కమనః = కాముకుడు, కిమ్ + అపి = దేనినికూడ, అంతః = ఆత్మనుకూడ, నవేత్తి = తెలియడు, బాహ్యం = బాహ్యమునుకూడ, నవేత్తి = తెలుసుకోలేదు, యత్ + వత్ = ఎట్లైతే, యః = ఏ, ప్రాప్తనిర్భేదభావః = భేదములేని భావమును పొందినవాడై, ఆనంద + ఆత్మా = ఆనందరూపుడై, అభయతృషి = భయములేకపోవుటచే తృప్తిపడిన, స్వ + ఆత్మని = స్వస్వరూపాత్మలో, స్వపితి + చ = నిద్రించుచున్నాడో, తథా = అట్లు, నీరుజః = ఏరోగమూ లేని, పూరుషాత్మా = పురుషోత్తమరూపుడు, సః = ఆ,——

## తాత్పర్యం

తనప్రియకాంతను ఆశ్లేషం చేసుకొన్నవాడికి తనప్రేమావేశంలో బాహ్యం గాని, అంతరంగాని తెలియదు. అలాగే జీవాత్మ గాఢనిద్రలో అద్వితీయ శుద్ధాత్మని సుఖంగా పెనవేసుకొని కరిగిపోయి నిర్భయమైన, మధురమైన, అతీతమైన, ప్రశాంతతని అనుభవిస్తూ పరిమితానుభూతులైన భయం, క్షుత్తు, బెదిరింపు మొదలైన వాటిని మర్చిపోతాడు. ఆ పరమాత్మ ఉత్తరకాశీపతి సౌమ్య కాశీశుడు. తన్ను శరణుజొచ్చే భక్తుల కోరికలన్నింటిని తీర్చుతాడు. ఆ అనంత ప్రభువు నన్ను అనుగ్రహించును గాక!

వ్యాఖ్య

బృ. ఉ. 4. 3. 21 వ మంత్రాన్ని ఈశ్లోకం వివరిస్తుంది. గాఢనిద్రలో కూడా ఆత్మను గురించిన అజ్ఞానం పోదు. అది అవ్యక్తంగా బీజరూపంలో ఉంటుంది. అయితే జాగ్రత్స్వప్నావస్థలలో కనబడే భ్రాంతులు వుండవు. అందువల్ల గాఢనిద్రావస్థలో జీవుడు అన్నికోరికలకి, బాధలకి దూరంగా వుంటాడు. ఈ అవస్థ ఆ రెంటికన్న కొంతమెరుగుగా ఉంటుంది. ఈ అవస్థలో భయంకూడా ఉండదు. భయం తనకన్న భిన్నమైన దానిని చూచినప్పుడే కలుగుతుంది గాఢనిద్రలో వుండేది ఆత్మ ఒక్కటే. కాబట్టి అక్కడ భయం ఉండదు.

గాఢనిద్రలో శుద్ధాత్మ ఏకంగా ఉంటుంది. ఆకారంలో, సత్తాలో కూడా తాను ఒక్కటే అయినందున ఆత్మ వెలిగించడానికి తానుగాని వస్తువంటూ ఉండదు. అందుచేత దానికి ప్రత్యేకజ్ఞానమనేది ఉండదు. తెలుసుకొనేందుకు వస్తువే లేదు. అందుచేత ఆత్మని వెలిగించేదనీ, స్వయంప్రకాశమనీ వర్ణించి ప్రయోజనంలేదు ఏ రూపమన్నా స్వీకరించవలసిన అవసరంకూడా అక్కడ లేదు. ఈ భావం రాబోయే శ్లోకంలో వర్ణింపబడుతోంది.

శ్లో॥ పశ్యన్నేవ స్వయ మచలచిత్ దృశ్యజాతం నపశ్య
త్యన్యత్సుప్తే కరణరహితః ప్రాజ్ఞభావం ప్రపన్నః।
ద్రష్టుర్దృష్టే ర్భవతి విలయో నావినాశిత్వతో యః
సౌమ్యధీశః శ్రితసురతరుః శ్రేయసే నస్స భూయాత్॥ 18

ప్రతి॥ కరణరహితః = సాధనసంపత్తిలేనివాడై, ప్రాజ్ఞభావం = ప్రజ్ఞామతిని, ప్రపన్నః = పొందిన, స్వయం = ఆత్మ, సుప్తే = సుషుప్తిలో, అచలచిత్ = నిగ్రహచిత్తుడై, పశ్యన్ + ఏవ = చూచుచునే, అన్యత్ = వేరైన, దృశ్యజాతం = దృశ్యమును, నపశ్యతి = చూడడు, యః = ఏపరమాత్మ ద్రష్టుః = చూచువాని, దృష్టేః = దృష్టికి, అవినాశిత్వతః = అవినాశము కంటె, విలయః = విలయము, నభవతి = కాదో, సః———

## తాత్పర్యం

గాఢనిద్రలో ఆత్మ ప్రాజ్ఞస్థితిని పొందుతుంది. అంటే రెండోది లేని శుద్ధాత్మజ్ఞానాన్ని పొందుతుంది. అక్కడ ప్రత్యేకజ్ఞానాన్ని కలిగించే ఇంద్రియ మనోబుద్ధులు లేవు అక్కడ దాని స్వయం ప్రకాశరూపాన్ని తెలుసుకొనే అచలస్థితి. నిత్యసాక్షిగా తన్నుతానే చూచుకొంటుంది. చూడడానికి అక్కడ మరోవస్తువుగాని అనుభవంగాని ఉండదు. ద్రష్ట–దృశ్యభేదం అక్కడ ఇక ఉండదు. దృశ్యం అక్షరుడైన ద్రష్టలో కలిసిపోతుంది. ఆ శుద్ధ పరమాత్మ ఉత్తరకాశీపతిగా వసిస్తూ తన్ను భక్తితో కొలిచే భక్తులకు మోక్షాన్ని భోగాలని ప్రసాదిస్తాడు. తన అనంతకృపతో నాకు శ్రేయస్సుని కలుగజేయును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4 3. 23 వ మంత్రభావం ఈశ్లోకంలో చెప్పబడింది. గాఢ నిద్రలో ఆత్మ చూడడానికి వస్తువే లేదు. అందుచేత గాఢనిద్రలో ఆత్మ దేనినీ చూడదని సాధారణంగా అంటారు. అంటే ఆత్మకి చూచేశక్తి లేకుండా పోతుందని అనుకోరాదు. ఆత్మలో ద్రష్టగా చూచేశక్తి నశించదు. అయితే తనకి భిన్నంగా చూడవలసిన వస్తువు లేదు కాబట్టి అది దేనినీ చూడదని అంటారు. అగ్నిలోని వేడి, సూర్యునిలోని వెలుగులాగా ద్రష్టలో చూచేగుణం సహజ మైనది. అద్వితీయాత్మ నెరుగని అవిద్యకారణంగా మనం ఆత్మని ఆత్మకన్న భిన్నంగా భావిస్తాము ఇలా మనం మిథ్యాభ్రాంతిలో ఉన్నప్పుడే ప్రాపంచిక వ్యవహారభాషలో మనకి దృష్టి వస్తుందనీ మనం వస్తువుల్ని దర్శిస్తామనీ అంటారు. గాఢనిద్రలో ఈ మిథ్యాభ్రాంతి లేదు. అందువల్ల అక్కడ చూడ బడేది ఏదీ ఉండదు. ఆకారణంచేత ఆత్మ అక్కడ ఏమీ చూడదని అంటారు. అగ్నిలోని వేడి, సూర్యునిలోని వెలుగులాగా ఆత్మలో ద్రష్టగా చూచేస్వభావం నిత్యమైనది. 4 వ అధ్యాయంలో ఆత్మలోని ద్రష్ట, ఘ్రాత, శ్రోత, రసయిత, భావయిత, మంతలస్వభావం అక్షరమైనదని చెప్పబడింది.

ఈ శ్లోకంలో పరమసత్యస్థానంలో అద్వితీయాత్మకన్న భిన్నమైన రెండో వస్తువంటూ చూడడానికి లేదని చెప్పబడింది. జాగ్రత్స్వప్నాలలో మనం ఎన్నో వస్తువుల్ని ఆత్మ కన్న అన్యంగా చూస్తున్నాము కదా, అదెలా సాధ్యం?

ఈ విషయాన్ని రాబోయే శ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ స్వస్మా ద్దన్యత్ స్ఫురతి తమసా ప్రత్యుపస్థాపితం సత్
తత్రద్వైతే చరతి పురుధా ధీమయో యః పరాత్మా।
దృష్టి ఘ్రాతిప్రభృతి కృతిభి ర్జాగ్రతస్వాప్నభూమ్యోః
సౌమ్యాధీశః శ్రితసురతరుః శ్రేయసే న స్స భూయాత్॥ 19

ప్రతి॥ స్వస్మాత్ = తనకంటె, అన్యత్ = మరియొకటి, ప్రతి + ఉపస్థాపితం సత్ = నిక్షేపింపబడినదై, తమసా = అజ్ఞానంతో, స్ఫురతి = ప్రకాశించు చున్నదో, తత్ర = అచ్చట, ద్వైతే = ద్వైతమునందు, యః = ఏ, పురుధా = గొప్పగా, ధీమయః = ప్రజ్ఞానరూపమయిన, పరాత్మా = పరబ్రహ్మ, చరతి = చరించుచున్నాడు, జాగ్రత = మెలకువ, స్వాప్నభూమ్యోః = స్వప్నావస్థలందు, దృష్టి = చూచుట, ఘ్రాతి = వాసన చూచుట, ప్రభృతి = మొ॥ కృతిభిః = పనులతో (చరించునో) సః—

## తాత్పర్యం

పరిమిత జీవభావాన్ని పొందిన పరమాత్మ అనాదినుండి తన్నుతాను ఎరగని అవిద్యలో మునిగివున్నాడు. గాఢమైన ఈ అనాది అవిద్యనుండి మిథ్యా భ్రాంతి అయిన నామరూపజగత్తుయొక్క బాహుళ్యం జనించింది. అతిక్రమించ డానికి వీలులేని కార్యకారణ శాసనంచేత జాగ్రత్స్వప్నావస్థలలో ఇంద్రియాల ద్వారా అన్ని వ్యవహారాలను చేస్తున్నట్లు అగపడుతాడు. ఇలా జాగ్రత్స్వప్నాలలో ద్వైతానుభవాలను పొంది బాధపడే పరమాత్మ సౌమ్య కాశీనాథుడే. దేవదారు వృక్షాల మధ్య అధిపత్యం వహిస్తూ కల్పవృక్షంలా భక్తులకోరికల్ని తీర్చే అనంతప్రభువు నాపైన కరుణారసాన్ని కురిపించును గాక!

## వ్యాఖ్య

బృ ఉ. 4. 3. 31 వ మంత్రంలోని భావాలు ఈ శ్లోకంలో వెల్లడించ బడినాయి.

దృగ్దృశ్యం, శ్రోత – శ్రుతం, స్పర్శయిత – స్పర్శ, భోక్త – భోగ్యం, భావుకుడు–భావం, మంత–మంతవ్యం–ఈ ద్వైతభావాలు జాగ్రత్స్వప్నావస్థలు రెంటిలోను ఉన్నాయి ఇక్కడ కేవలం ఆత్మను గూర్చిన అజ్ఞానమే కాక మిధ్యాభ్రాంతికూడా ఉన్నది.

జాగ్రత్తునుండి స్వప్నానికి ఆత్మ ప్రయాణించినట్లే, ఈ లోకంనుండి ఊర్ధ్వలోకాలకి కూడా ప్రయాణిస్తుంది. ఈ సంగతిని తరువాతి శ్లోకం అనువైన ఉదాహరణలతో బోధిస్తుంది.

శ్లో॥ భారాక్రాంతం శకటమివ యో లింగమాస్థాయ విద్యా
కర్మాశ్లిష్టం వపు రభినవం పూర్వదేహాత్ ప్రయాతి।
జాగ్రత్స్వప్నక్రమవ దమృతం చాత్తి జీవత్వభృచ్ఛ్రీ
సౌమ్యాధీశః శ్రితసురతరుః శ్రేయసే నః స భూయాత్॥ 20

ప్రతి॥ యః = ఏ పరాత్మ, భార + ఆక్రాంతం = బరువుతోనిండిన, శకటం + ఇవ = బండివలె, లింగం = శరీరమును, ఆస్థాయ = పొంది, విద్యాకర్మ + అశ్లిష్టం = జ్ఞానకర్మతోకూడిన, అభినవం = క్రొత్తదైన, వపుః = శరీరము, పూర్వదేహాత్ = పూర్వజన్మమునుండి, ప్రయాతి = పయనించును, జీవత్వభృత్ = జీవత్వమును పొందినవాడై, జాగ్రత్ + స్వప్న + క్రమవత్ = మేల్కొను నిద్రించుక్రమమువలె, అమృతం + చ = అమృతమునుకూడ, అత్తి = భుజించుచున్నాడు——

## తాత్పర్యం

పరిమిత జీవభావాన్ని స్వీకరించి స్థూలశరీరాన్ని మరణసమయంలో వదిలిపెట్టుతాడు. ఇలా దేహాన్ని విడిచి ఆయన తన వాసనల ననుసరించి లింగశరీరాన్ని పొందుతాడు. ఇలా స్థూలశరీరాన్ని వదిలిన జీవాత్మ బరువువేసిన బండిలాగా పూర్వజన్మ వాసనల బరువుతో బాధపడుతాడు. అతడు ముందు జన్మలో చేసిన ఉపాసన. కర్మ అతడు స్వీకరించే సూక్ష్మశరీరాన్ని రూపొందించి అతడు ప్రయాణించే విధానాన్నికూడా నిర్ణయిస్తాయి. లింగశరీరాన్ని ధరించిన

జీవాత్మ ఇతరప్రపంచాలని చేరుకొని సుఖదుఃఖ రూపాలుగా వచ్చే తన కర్మ ఫలాన్ని అనుభవిస్తాడు. బరువుతో నిండిన బండిని లాగడానికిగాను దానిని లాగే గాడిద, తోలేమనిషి ఎన్నోరకాల అరుపులు, చప్పుళ్లు చేస్తారు. అలాగే జీవాత్మ కూడా వాసనల బరువుని మోసుకుంటూ స్థూలశరీరాన్ని వదిలిపెట్టి వెళ్లేప్పుడు మరణవేదనతో దీనంగా విలపిస్తూ బాధతో భయంకరంగా అరుస్తాడు. జీవాత్మ స్థూలశరీరాన్ని వదిలి లింగశరీరాన్ని ధరించి ఇతరలోకాలకి వెళ్లడం సరిగ్గా జాగ్రదవస్థనుండి జీవుడు సూక్ష్మశరీరంలోని స్వప్నావస్థకి వెళ్ళడంలాగే ఉంటుంది ఆ పరమాత్మ భక్తుల కోరికల్ని తీర్చే సాంబ్య కాశీపతియే. ఆయన కరుణాశీస్సులు మాపైన ప్రసరించును గాక!

## వ్యాఖ్య

బృ ఉ. 3. 4. 35 వ మంత్రంలోని భావాలు ఈశ్లోకంలో వివరింప బడినాయి.

గురుదేవులు 32–34 మంత్రాలని వదిలేశారు. వీటిలో యాజ్ఞవల్క్యుడు మనుష్యు లనుభవించే యావత్తు ఆనందము బ్రహ్మానందంలో ఒకలేశమాత్ర మని వివరింపబడింది. మనుష్యులు, పితరులు, గంధర్వులు, స్వర్గలోక వాసులు, దేవతలు, హిరణ్యగర్భుడు – ఈ అందరి ఆనందాలలో తేడాలు వివరింపబడినాయి. చివరికి ముగింపుగా బ్రహ్మానందం అన్నింటికన్న ఎక్కు వైనదని ఋషి చెబుతాడు. గాఢనిద్రలోని ఆత్మ ఆ ఆనందమయస్థితిలో ఉంటుందని, దానిని అందుకోడమే జీవితంయొక్క పరమార్థమనీ చెప్పాడు.

ఈ మంత్రాలలో తరతమానందాలని వర్ణించిన తరువాత జీవాత్మ పరలోకానికి వెళ్ళడం విషయం ప్రస్తావించాడు. జీవాత్మ పరలోకప్రయాణం జాగ్రత్తునుండి స్వప్నానికి వెళ్లడం వంటిదే స్వప్నావస్థలో జీవుడు తన సూక్ష్మ వాసనలని తీసుకొని స్థూలదేహాన్ని వదిలి, సూక్ష్మరూపంలో స్వప్నానికి వెళ్ళు తాడు. అలాగే చనిపోయినప్పుడుకూడా ముందు జన్మలో సకామంగా చేసిన కర్మలు, ఆలోచనలు, పొందిన ఉద్రేకాలు – వీటివల్ల ఏర్పడినవాసనలు బరువుని మోసుకొంటూ పోతాడు.

ఈ సూక్ష్మవాసనలతో ఏర్పడిన లింగదేహం వా స న ల ఒత్తిడివల్ల పైలోకాలకో, క్రిందిలోకాలకో పోతుంది.

సరైన విచక్షణాజ్ఞానం వున్న జిజ్ఞాసువు జీవితంలో భక్తితో, నిస్సంగ భావంతో జీవించి భరింపరాని బాధానుభావాలని తప్పించుకోవాలని శ్రుతి నొక్కి చెబుతుంది.

దీనితో 4 వ అధ్యాయంలో 3 వ బ్రాహ్మణం పూర్తిఅయింది. 4 వ బ్రాహ్మణంలోని ముఖ్యసారాన్ని తరువాతి శ్లోకం చెబుతుంది.

చనిపోయిన జీవాత్మ స్థూలశరీరాన్ని వదిలి లింగశరీరంలో ఇతర లోకాలలో పూర్వకర్మఫలాలని అనుభవించడానికి పోతుందని ఇప్పుడే వివరించ బడింది. రాబోయే శ్లోకంలో జీవాత్మ దేహంలోని ఏ భాగాలనుండి నిష్క్ర మిస్తుందో చెబుతున్నారు.

శ్లో॥ యోఽయం మూర్ధ్నా నయనసుషిణా వాన్యరంధ్రేణ దేహాత్
నిష్క్రమ్యాన్యత్ సపది వపు రబ్జన్తువ జ్జీవమూర్తి।
ధార్మం ధర్మా దథ చ దురితా దౌరితం చాదదీత
సౌమ్యాధీశః శ్రితసురతరుః శ్రేయసే న స్స భూయాత్॥ 21

ప్రతి॥ యః + అయం = ఏ ఈ ఆత్మ, మూర్ధ్నా = శిరోరంధ్రముచే, నయన సుషిణా = కన్నుల కాంతులచే, అన్యరంధ్రేణ + వా = ఇతర రంధ్రా లచే కాని, దేహాత్ = శరీరమునుండి, సపది = వెంటనే, అప్‌జంతువత్ = జలగవలె, జీవమూర్తి = జీవరూపమై, అన్యత్ + వపుః = మరొక శరీరమును (చేరుతుంది), ధర్మాత్ = ధర్మమునుండి, ధార్మం = ధర్మమును, అథ = మరియు, దురితాత్ = పాపమునుండి, దౌరితం + చ = పాపమును, అదదీత = పొందుచున్నది, సః——

## తాత్పర్యం

జీవితంలో ఎన్నో పుణ్యకార్యాలు ఆధ్యాత్మిక సాధన చేసిన జీవాత్మ మరణసమయంలో బ్రహ్మరంధ్రం నుండి నిష్క్రమించి బ్రహ్మలోకాన్ని

అందుకొంటుంది. అది చేసిన కర్మలు, ఉపాసనలు సరియైనవైతే కంటినుండి నిష్క్రమించి ఆదిత్యలోకాన్ని చేరుతుంది. అలాగే తాను చేసిన పాపపుణ్య కర్మల ననుసరించి శరీరంలోని క్రిందిభాగాలగుండా నిష్క్రమించి ఊర్ధ్వ అధో లోకాలకు గమించి సుఖదుఃఖాలు పొందుతుంది. చనిపోయే సమయంలో ఆ జీవాత్మ పూర్వవాసనల ననుసరించి తను వెళ్ళడానికి అనువైన సూక్ష్మశరీరాన్ని ధరించి దానితో పూర్తిగా తాదాత్మ్యం పొందుతుంది. గడ్డిపోచమీద ప్రాకే జలగ తృణంనుండి తృణాన్ని పట్టుకొని ముందుకు పోయినట్లే జీవాత్మ ఒకశరీరాన్ని వదిలి మరో శరీరాన్ని పట్టుకొని ముందుకు పోతుంది.

ఇలా జీవాత్మ్మ భావాన్ని పొందే పరమాత్మ సామ్యు కాశీనాథుడే. అపార కరుణతో తనభక్తులకి మోక్షాన్ని కూడా ప్రసాదించగలడు. ఆ కరుణాసముద్రు డైన ప్రభువుయొక్క కృప నాపైన ఎప్పుడూ ప్రసరించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 4. 2, 3 మంత్రాలు ఈ శ్లోకంలో పేర్కొనబడినాయి.

మరణసమయంలో స్థూలేంద్రియాలనుండి ప్రాణాలనుండి జీవాత్మ మళ్ళిపోయి లింగశరీరాన్ని ధరించి హృదయంనుండి స్వయంప్రకాశాలైన సూక్ష్మనాడులద్వారా నిష్క్రమిస్తుంది ఆ జన్మలో సాధన, పుణ్యకర్మలు చేసివుండి ఆదిత్యలోకానికి తగివుంటే కంటిద్వారా బయటికి వెళ్ళుతుంది. కంటికి సూర్యుడికి మధ్యఉన్న సంబంధం ముందు ఎన్నోసార్లు ఉపనిషత్తులో పేర్కొనబడింది. జీవుని సాధన అంతకన్న చాలా ప్రశస్తమైనదైతే జీవాత్మ ఇంకా మంచిలోకానికి అర్హమై బ్రహ్మరంధ్రంద్వారా బయటికివెళ్ళి బ్రహ్మ లోకాన్ని చేరుతుంది. అంతప్రశస్తమైన కర్మలుగాని సాధనకాని లేకపోతే జీవాత్మ క్రిందిభాగాలనుండి నిష్క్రమిస్తుంది. లింగశరీరాన్ని ధరించే సమయంలో సూక్ష్మమైన ఇంద్రియాలను తనతో తీసుకొనిపోతుంది. లౌకిక కర్మలు, సంపాదించుకొన్న లౌకికజ్ఞానం, సంస్కారాల ఒత్తిడి—వీటివల్ల తాను ఏ జన్మని పొంది ఎలా జీవించాలో తెలుసుకుంటుంది. అందులో జీవాత్మకి స్వాతంత్ర్యం లేదు కర్మ, వాసనలను బట్టి ఆ క్రొత్త జీవితాన్ని తీసుకొని తీరవలసిందే. అందుకనే మన శాస్త్రాలన్నీ పుణ్యకర్మలు ఆధ్యాత్మిక సాధన

ఉన్నప్పుడే శుద్ధమైన సాత్త్వికఁసంస్కారాలు లభించి జీవుడు ఉన్నతమైన ఎక్కువైన జీవితాన్ని పొందగలడని ఏకగ్రీవంగా ఘోషిస్తాయి. చనిపోయాక జీవుడు వెంట తీసుకఁవెళ్ళ గలిగినవి తాను సంపాదించిన పుణ్యపాప కర్మ పలాలని మాత్రమే.

జీవుడు ఒకదేహమునుండి వెళ్ళి మరోదేహాన్ని సంపాదించుకునే విధానం ఇక్కడ ఎంతో స్పష్టంగా వర్ణించబడింది. అది సరిగ్గా జలగ ఒక గడ్డి పోచ మీద నుండి మరొక గడ్డిపోచమీదికి వెళ్ళడం వంటిదే. రెండో గడ్డిపోచనీ పట్టుకొని అక్కడ పట్టు చిక్కాకనే మొదటి దానిని వదులుతుంది. అలాగే సంస్కారానుగుణ్యమైన లింగశరీరాన్ని పట్టుకున్నాకనే స్థూలదేహాన్ని వదులుతుంది మేలుకున్నవాడు కలలోకి వెళ్ళడంకూడా సరిగ్గా ఇలాగే వుంటుంది.

ఆత్మజ్ఞానం లేక అహంకారంతో నిండి, కోరికలతో సతమతమయ్యే జీవుళ్ళకే ఈ ప్రయాణాలు. పరమాత్మను జ్ఞానసాధనద్వారా అందుకున్న వాళ్లకి కాదు. కుండ పగిలినప్పుడు కుండలోని ఆకాశం బాహ్యాకాశంలో కలిసిపోయి నట్లు, మరణసమయంలో జ్ఞానుల శుద్ధమైన ఆత్మ పరమాత్మలో కలిసిపోతుంది.

శ్లో॥ భోక్తుం భోగాన్ భ్రమతి విషయాసక్తితోఽత్రాప్యముత్ర
బ్రహ్మజ్ఞానా దథ చ జనుషే నాస్తతృష్ణః స్వధిష్ణ్యమ్।
ప్రాప్తః ప్రాణోత్క్రమణ విరహా ద్యాతి యో జీవమూర్తిః
సౌమ్యాధీశః శ్రితసురతరుః శ్రేయసే నస్స భూయాత్॥ 22

ప్రతి॥ విషయ + ఆసక్తితః = విషయాలలో ఆసక్తి కలుగుటవలన, భోగాన్ = భోగాలను, భోక్తుం = అనుభవించుటకు, అత్ర = ఈలోకమునందు, అముత్ర + అపి = పరలోకమందును, భ్రమతి = తిరుగును, అథ = మరియు, బ్రహ్మజ్ఞానాత్ = బ్రహ్మజ్ఞానమువలన, అస్తతృష్ణః = కోరికలు లేనివాడై, స్వధిష్ణ్యం = తనప్రజ్ఞను, న + జనుషే = వదలడు, ప్రాప్తః = పొందిన, యః = ఏ, జీవమూర్తిః = జీవుడు, ప్రాణ = ప్రాణముయొక్క, ఉత్క్రమణవిరహాత్ = వెడలుటవలని ఎటబాటుచే యాతి = పోవునో, సః——

## తాత్పర్యం

విషయ వస్తువులపైన ఉన్న గాఢమైన మమకారంవల్లనే పరిమిత జీవాత్మభావాన్ని పొందిన పరమాత్మ అనంతమైన జనన మరణ చక్రంలో చిక్కుకుపోయి ఈలోకంలోను ఇతరమైన ఊర్ధ్వ అధోలోకాలలో సుఖదుఃఖాలు పొందుతాడు. బ్రహ్మజ్ఞాని శుద్ధమైన స్వస్వరూపంతో ఉన్నందున విషయ వస్తువుల వలనుండి పూర్తిగా విముక్తుడౌతాడు. స్థూలశరీరాన్ని వదిలేసినప్పుడు అతడిలో కోరికగాని వాసనల ఒత్తిడిగాని ఉండదు. కాబట్టి అతడు లింగశరీరాన్ని ధరించే ప్రసక్తే రాదు. మరోజన్మ అనేదే వుండదు. ఆ పరమాత్మ సౌమ్య కాశీనాధుడు. కల్పతరువులాగా భక్తుల కోరికలు తీర్చుతాడు. ఆయన అనుగ్రహాశీర్వాదాలు నాపైన ప్రసరించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 4. 6 వ మంత్రం ఈ శ్లోకంలో ఉదహరించబడింది.

విషయ వస్తువులపైన గట్టి వ్యామోహాలు పెంచుకొన్నవాడు మరణించి నప్పుడు ఆవ్యామోహాల ముద్రలు మనస్సుమీద ఉంటాయి. అందుచేత మనస్సు ప్రధానంగా ఉండే లింగశరీరం ఈ కోరికల ముద్రలనుకూడా తనతో తీసుకొనిపోతుంది. అందువల్ల జీవుడు ఆ కోరికలను తీర్చుకోడానికి ఎన్నో జన్మ లెత్తవలసి వుంటుంది. అంటే జనన మరణ విషచక్రంలో ఇరుక్కుపోయా డన్నమాటే. అయితే ఎవరిలో విషయవస్తువుల వ్యామోహం పూర్తిగా నశించి, ఆత్మను తెలుసుకోవాలనే కామన ఒక్కటే మిగిలిందో అలాంటి వ్యక్తిలో వాసనల ఒత్తిడి వుండదు. అతనిలోని ప్రాణం ఈ దేహాన్ని వదిలి మరోదేహాన్ని పట్టుకొనే ప్రమేయం ఉండదు. అతడు శుద్ధబ్రహ్మమే అవుతాడు.

ఈ ప్రపంచం కర్మభూమి. ఎవరి నియతకర్మను వాళ్ళు చెయ్యాలి. తక్కినలోకాలు భోగభూములు. ఆ లోకాలను పొందాక వాళ్ళందరికీ అక్కడ సుఖదుఃఖానుభవాలు అయ్యాక, మళ్ళీ ఈ కర్మభూమికి తిరిగి రావాలి. విషయ వస్తువులకు తగుల్కొన్న జీవుళ్ళకి వర్తించే నియమం అది. కేవలం ఆత్మకాముడైన వాడో, ఆత్మనందుకొని ఆప్తకాము డవుతాడు. ఆత్మనుపొంది

నిష్కాముడవుతాడు. అందుచేత నిష్కాముడు అకాముడై ఏవిధమైన జన్మాంతర ప్రయాణాలు చెయ్యనక్కరలేదు. ఈ జన్మలోనే తన నిజస్వరూపాన్ని గుర్తెరుగుతాడు. తన శరీరాన్ని వదిలేసినట్లు ఇతరులకు కనిపించినా అతడికి చావు, పుట్టుక లేవు సముద్రాన్ని చేరిన నది సముద్రమే అయినట్లు ఆయన పరబ్రహ్మమే అవుతాడు.

ఇలా ఆత్మజ్ఞాని అయిన మహాత్ముడు జీవన్ముక్తుడని పిలువబడుతాడు. ఆయనకి స్థూలశరీరం ఇంకా ఉన్నా ఆశరీరంతో అహంకారబద్ధ తాదాత్మ్యం ఉండదు. బ్రదికివున్నా శరీర స్పృహ ఉండదు. దానికి సంబంధించి నంత వరకు అతడు మరణించినట్లే. ఈ విషయం తరువాతి శ్లోకం సముచితమైన ఉదాహరణద్వారా వెల్లడిస్తుంది.

శ్లో॥ జిజ్ఞాసం తే యదిహ వివిధైః కర్మభి ర్నిర్నిమిత్తైః
పుణ్యాపుణ్యే తరతి సుతరాం యద్విదన్ బ్రహ్మసాక్షాత్।
శేతే యద్విద్వపు రురగనిర్మోకవత్ ప్రాస్త మారాత్
సౌమ్యాధీశః శ్రితసురతరుః శ్రేయసే న స్స భూయాత్॥ 23

ప్రతి॥ ఇహ = ఈలోకమునందు, నిర్నిమిత్తైః = కారణములులేని, వివిధైః = అనేకములయిన, కర్మభిః = కర్మలను, యత్ = దేనిని, జిజ్ఞాసంతే = తెలుసుకోగోరుచున్నారో, పుణ్య + అపుణ్యే = పుణ్యపాపాలను, సుతరాం = పూర్తిగా, తరతి = దాటుచున్నాడో, యత్ = దేనిని, సాక్షాత్ = ప్రత్యక్షముగా, బ్రహ్మవిదన్ = బ్రహ్మగా తెలిసికొంటూ, శేతే = నిద్రించుచున్నాడో, యత్ = ఏ, విద్వపుః = ప్రజ్ఞాశరీరము, ఉరగ = పాముయొక్క, నిర్మోకవత్ = కుబుసమువలె, ఆరాత్ = తననుండి దూరముగా, ప్రాస్తః = విడువబడినది,——

## తాత్పర్యం

నిజమైన బ్రహ్మజిజ్ఞాస కలవాడు నిష్కామ నిస్స్వార్థ కర్మలతోసహా రకరకాలైన సాధనలలో నిమగ్నుడవుతాడు. బ్రహ్మజిజ్ఞాసద్వారా తాను

బ్రహ్మమునని తెలుసుకొని పాపపుణ్యాలని తేలికగా అధిగమించుతాడు. అట్టి ఆత్మజ్ఞాని తన స్థూల సూక్ష్మ శరీరాలని తుచ్ఛమైనదిగా ఎంచి పాము కుబుసాన్ని వదిలినట్లు అవలీలగా త్యజించుతాడు. ఆ పరమాత్మే సౌమ్య కాశీనాథుడై భక్తుల కోరికలను కల్పవృక్షంలా తీర్చుతాడు. ఆ అపారకరుణా సముద్రుడు నాపైన అనుగ్రహపు జల్లులని కురిపించును గాక!

## వ్యాఖ్య

బృ. ఉ. 4. 4. 7 వ మంత్రం ఈశ్లోకంలో ఉదహరింపబడింది.

మానవజీవితంయొక్క నాలుగో పురుషార్థం అంటే మోక్షం ఏదో ఊర్ధ్వ లోకాలలో సంపాదించుకోవలసింది కాదు. ఈలోకంలోనే ఈజీవితంలోనే సాధింపబడవలసిన లక్ష్యం అది ముక్తి లేదా అమృతత్వసిద్ధి అంటే ఆత్మని తన స్వరూపమని తెలుసుకొని తక్కినవి మిథ్య అని తెలుసుకోడమే తన సూక్ష్మదేహాలతో సహా ఈ దృశ్యమాన నామరూపజగత్తు అసత్యమని, అనాత్మ అని తెలుసుకోడమే ఆత్మప్రాప్తి.

పాముకి వదులైన కుబుసంతో ఎంతప్రయోజనం ఉంటుందో తన స్థూల సూక్ష్మ దేహాలతో ఆత్మజ్ఞానికి అంతే ఉపయోగం. ప్రాణంలో శరీరంలో ఉండి దానిని ఆడిస్తున్నా ఆయనకి దానితో ఎలాంటి సంగమూ ఉండదు ఆయన తన స్వయంప్రకాశమైన సర్వవ్యాప్తమైన బ్రాహ్మీస్థితిలో జాగరూకుడై ఉంటాడు.

ఆత్మస్వరూపం బ్రహ్మమే ముందు భాగాలలోనే తార్కికంగా ఈ విషయం నిరూపింపబడింది. జీవన్ముక్తుని లక్షణాలుకూడా చెప్పబడినాయి.

అయితే ఈ ఉదాత్తభావాలు ఆధ్యాత్మికసాధనలో బాగా స్థిరపడిన జిజ్ఞాసువులకే వర్తిస్తాయి. ఈ అత్యుత్తమ సాధనస్థితికి రావడానికిగాను సాధకుడు ముందు దశలలో ఎంతో తీవ్రమైన సాధనలని చేసి శరీరాన్ని ఆత్మజ్ఞానం పొందడానికి తగినట్లు చేసుకోవాలి. ఈ చివరి రెండు శ్లోకాలలో ఆ విషయమే వివరింపబడుతుంది ఆత్మను గురించిన జ్ఞానం పెరుగుతున్న కొద్దీ కష్టమని అనిపించిన ఆధ్యాత్మిక సాధనలు ఎంతో సహజంగా కొనసాగుతాయి ఆత్మను

గురించిన అవిద్య నెమ్మదిగా అదృశ్యమౌతుంది. అయితే ఈ రోజుల్లో కొందరు ఆధ్యాత్మిక తత్త్వపరులు, గురువులు చేస్తున్నట్లుగా ఆధ్యాత్మిక సాధనలకి తరువాత వదిలి వేయరాదు. అవిద్య పూర్తిగా నశించడానికి ఈ సాధనలను ఎంతో నీకగా, గాఢంగా నిరంతరం చేయడం అవసరం. చివరికి స్వయంప్రకాశమైన సర్వజ్ఞానమైన సర్వవ్యాప్తమైన శుద్ధానందరూపమైన ఆత్మ అనుభవమౌతుంది. అందువల్ల సాధకులు ఉత్సాహంతో, సంతోషపూర్వకంగా ఈ సాధనలను చేస్తూనే వుండాలని రాబోయే శ్లోకం ఉద్బోధిస్తుంది.

"స్రగ్ధర" అనే ప్రసిద్ధ ఛందస్సులో చివరి రెండుశ్లోకాలు ఉన్నాయి.

శ్లో॥ శాంతి ర్దాంతి స్తితిక్షా హ్యుపరతి రథ యచ్చిత్తనైశ్చల్య మేతైః
యో యత్ప్రత్యక్ ప్రపశ్య త్యహ మిద మితి స బ్రాహ్మణో బ్రహ్మతుల్యః।
**ముఖ్యం బ్రాహ్మణ్య మేతన్న వికృత సుకృతైః క్షీయతే వర్ధతే వా**
**వందే తం హైమభూమీధరశిఖరలసత్ సౌమ్యకాశీపురీశమ్॥24**

ప్రతి॥ శాంతిః = శాంతి, దాంతిః = దాంతి, తితిక్షా = తితిక్ష, ఉపరతిః = ఉపరతి, అథ = మరియు, యత్ = ఏ, చిత్తనైశ్చల్యం = మనోనిగ్రహము అను, ఏతైః = వీటిచే, యః = ఎవడు, యత్ = దేనిని, ప్రత్యక్ = ప్రత్యక్షముగా, ఇదం = ఇది, అహం + ఇతి = దేనిని, ప్రపశ్యతి = చూచునో, సః = ఆ, బ్రాహ్మణః = ఆబ్రాహ్మణుడు, బ్రహ్మతుల్యః = బ్రహ్మసమానుడు, ఏతత్ = ఈ, ముఖ్యం = ముఖ్యమైన, బ్రాహ్మణ్యం = బ్రాహ్మణ్యము, వికృతసుకృతైః = పాపపుణ్యములచే, న + క్షీయతే = నశించదు, న వర్ధతేవా = వృద్ధినందదు, తం = అట్టి, హైమభూమీధర = హిమాలయపర్వతముయొక్క, శిఖర = శిఖరమునందు, లసత్ = ప్రకాశించు, సౌమ్య కాశీపురీశం = సౌమ్యకాశీశుని, వందే = నమస్కరిస్తున్నాను.

## తాత్పర్యం

శాంతి, దాంతి, తితిక్ష, ఉపరతి మొదలైన అభ్యాసాలవల్ల సాధకుడు ఆత్మధ్యానంలో ఏకాగ్రచిత్తాన్ని పొందుతాడు. ఈ ధ్యానం గాఢమైనప్పుడు తానే ఆత్మనని క్రమంగా తెలుసుకుంటాడు. ఇలా ఆత్మని తెలుసుకున్నవాడే నిజమైన బ్రాహ్మణుడు. ఆయన పరమాత్మ నిజస్వరూపాన్ని పొందుతాడు. అందుచేత అతడు హిరణ్యగర్భునిలాగ, ఈశ్వరునివలె గౌరవాలు, పూజలు పొందుతాడు ఇదే ఉత్తమమైన బ్రాహ్మణత్వం. ఆ తరువాత ఆయన పాపంవల్ల తగ్గడు, పుణ్యంవల్ల పెరగడు. ఆయన ఆత్మజ్ఞానకాంతి వేడికి పాపపుణ్యాలు కాలి నశించిపోతాయి. ఆ తరువాత ఆయనకి వాటితో సంబంధం కాని ప్రయోజనం కాని వుండదు. ఆ పరమాత్మ హిమాలయ శిఖరాలపైన ఏలుతూన్న సామ్మ కాశీపతి విశ్వనాథుడు. ఆ ఉత్తరకాశీప్రభు పాదాలవద్ద నేను ప్రణమిల్లుతాను.

## వ్యాఖ్య

బృ. ఉ 4. 4 23 వ మంత్రసారం ఇందులో వివరింపబడింది.

ఆత్మజ్ఞానియైన మహాత్ముని మహిమ నిత్యము ఎనలేనిదై ఉత్తమోత్తమంగా ప్రకాశించుతూంటుంది. ఆయన పనులవల్ల అది తరగదు, పెరగదు. పాపపుణ్యాలు అతనికి చెందవు శమదమాది షట్సంపత్తివల్ల ఆయన ఈస్థానాన్ని చేరుకుంటాడు. ఆయన ఇంద్రియాలు పూర్తిగా అదుపులో ఉంటాయి. ఆయన మనస్సు పూర్తిగా ప్రశాంత మవుతుంది. విత్తేషణ, పుత్రేషణ, భోగేచ్ఛ అనేమూడు బంధనాలనుండి విడివడుతాడు. ఆయన మనస్సు ఏకాగ్రంగా ఉంటుంది. ఆయన ధ్యానం సఫలమై ప్రయోజనకర మౌతుంది. ఆయన ఆత్మస్వరూపాన్ని తెలుసుకొని ప్రపంచం యావత్తు ఆత్మ యొక్క ప్రకట రూపమని తెలుసుకుంటాడు. ఆయన పాపరహితుడు, నిష్కళంకుడు అయి, నిజమైన బ్రాహ్మణు డవుతాడు. ఆయన సంశయాలు అంతమవుతాయి ఆయన బ్రహ్మస్వరూపు డవుతాడు.

యాజ్ఞవల్క్యుడు బ్రహ్మజ్ఞానాన్ని గురించిన తన ప్రవచనాన్ని దాదాపు ముగించాడు. నాలుగో భాగంలోని ముఖ్యభావాలన్నీ పూర్తి అయ్యాయి. ఇది ఉపనిషత్తులో బ్రహ్మజ్ఞానానికి సంబంధించిన ముఖ్యమైన అధ్యాయం.

ఖిలకాండ అని చెప్పబడే 5, 6 అధ్యాయాలు చాలా ఉపాసనలు, కర్మ అభ్యాసాలతో కూడి వుంటాయి. ఈ రెండు అధ్యాయాలసారం రాబోయే శ్లోకంలో గురుదేవులు క్లుప్తీకరించారు దీనితో ఈఅధ్యాయం ముగింపుకి వస్తుంది.

శ్లో॥ పూర్ణం పూర్ణ ప్రతిష్ఠా నిరుపచరిత సద్వస్తు యద్బ్రహ్మ సాక్షాత్
అధ్యస్తై ర్నామరూపై రుపహిత పదవీ మాప్నువ ద్భూరి
భేదైః।
కర్మోపాస్తి ప్రకారైః కమితృభి రితరై శ్చైతదారాధ్యతేఒద్ధా
వందే తం హైమభూమీధర శిఖరలసత్ సౌమ్యకాశీపురీశమ్॥25

ప్రతి॥ యత్ = ఏది, పూర్ణం = పరిపూర్ణము, పూర్ణ = నిండిన, ప్రతిష్ఠ = స్థితి నిరుపచరిత = సాటిలేని చరితగలది, అధ్యస్తైః = ఆరోపింపబడిన, నామరూపైః = నామరూపాలచే, భూరిభేదైః = అనేకభేదాలతో, ఉపహిత పదవీం = ఉచితస్థానమును, ఆప్నువత్ = పొందునటువంటిది, సాక్షాత్ + బ్రహ్మ = ప్రత్యక్షబ్రహ్మమె, కర్మ + ఉపాస్తిప్రకారైః = కర్మ ఉపాసనా ప్రకారాలచే, ఇతరైః = ఇతరములయిన. కమితృభిః = కోరికలచే,ఏతత్అద్ధా = ఈబ్రహ్మతత్త్వము, ఆరాధ్యతే = ఆరాధింపబడు చున్నాడో, తం, వందే———

## తాత్పర్యం

పరమాత్మ ఎప్పుడూ దేశకాలాల నధిగమించి వుంటాడు. కార్యరూపంగా వ్యక్తమైన నామరూపజగత్తుకి ఆయన అకారణమైన కారణం. ఆయన నిత్యుడు పరిపూర్ణుడు, అనంతుడు ఏ ఉపాధులు పరమాత్మకి అవధులు కల్పింపలేవు. ఆయన నిత్య సత్యమై, పరమసత్తాయై, అనంతసత్యంగా భాసిస్తాడు. స్వార్థంతో అహంకారంతో కామనలతో ప్రాపంచిక దృష్టితో ఉన్నవాళ్లు, స్వార్థమమకారాలు లేక, నిరహంకారులై, అకాములై పూర్తిగా దైవచింతనాపరులైనవాడు — అందరి చేత ఆయన ఆరాధింపబడుతాడు. మొదటి రకంవారు ఆయనని వ్యక్త ప్రపంచంలో వెదుక్కుంటూ కోరికలు తీర్చుకోడానికి ఉపాసిస్తారు. అందుకనే

స్వార్థంతో, సార్థపరమైన కామనలతో అన్నిరకాలకర్మల్ని చేస్తారు. వాళ్లకి ఇహాముత్ర భోగాలు కావాలి. రెండోరకం వాళ్లు పరిపూర్ణమైన భక్తిశ్రద్ధలతో, నిస్వార్థంగా, పూర్ణవైరాగ్యంతో ఆత్మసమర్పణం చేసుకొంటారు. సకాములు, అకాములు ఇలా ఇద్దరూ వేరువేరు సంకల్పాలతో పరిపూర్ణ పరమాత్మని సేవిస్తారు. ఆ పరమాత్మయే హిమాలయాలపై ఉత్తరకాశీనాథుడుగా అధిపత్యం వహించే విశ్వనాథుడు. ఆయనకు నా నమస్సులు!

## వ్యాఖ్య

ఈ శ్లోకంలో గురుదేవులు ఖిలకాండ అనబడే భాగంలో 5 వ అధ్యాయ సారాన్ని పొందుపరిచారు. ఈ అధ్యాయంలో 15 బ్రాహ్మణాలు ఉన్నాయి. ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకి వేర్వేరు ఉపాసన లున్నాయి. వాటిద్వారా అనంత నిరాకార నిర్గుణ స్వరూపంగాను, పరిమిత వ్యక్తస్వరూపాలలోను పరమాత్మను ఉపాసించవచ్చును అనంతసత్యము, వ్యక్తమైన పరిమితసత్యము – రెండూ ఒక పరిపూర్ణబ్రహ్మమని స్పష్టంచేసిన మహర్షి సోపాధిక, నిరుపాధిక ఉపాసనల రెంటికి ముందు దమ, దాన, దయలను సాధనలు అభ్యసించాలని చెప్పారు.

బ్రహ్మదేవుడు దేవతలు, మానవులు, అసురులు—ముగ్గురికీ 'ద' అనే అక్షరంమీద ఉపాసన చెయ్యమని బోధించినట్లు అందులో మనకి తెలుస్తుంది. దేవతలు దానిని సమంగాను, మానవులు దానంగాను, అసురులు దయగాను భావించారు. ఈ మూడురకాల సాధకులు ఈ మూడు లక్షణాలని అలవరచుకొన్నాకనే ఉపాసనని ప్రారంభించాలి, తరువాత ఋషి వేర్వేరు ఉపాసనలని విధించాడు— (1) బుద్ధిమీద నిలిపి హృదయాన్ని మెరుగుపరిచేవి, (2) పరమాత్మయొక్క స్థూల సూక్ష్మ లక్షణాలని హృదయంలో ఉపాసించేవి, (3) కంటిలోని ద్రష్ట, మింటిలోని సూర్యుడు-ఇద్దరిని ఉపాసిస్తూ వ్యక్తావ్యక్త స్వరూపాలు రెండూ ఒకే పరమాత్మ అని ధ్యానించడం, (4) మనస్సులో ప్రతిబింబించే ఆత్మోపాసన, (5) విద్యుత్తులోని ఆత్మోపాసన (6) వాక్కులోని ఆత్మోపాసన, (7) వైశ్వానరుడుగా అన్నాన్ని అరిగించడానికి జఠరాగ్నిగా కనబడే అగ్నియొక్క ఉపాసన, (8) అన్నలక్షణాలు, ప్రాణశక్తి-రెంటి కలయికలోని ఆత్మోపాసన, (9) గాయత్రీ ఉపాసన.

ఆరో అధ్యాయంలో అయిదు బ్రాహ్మణాలు ఉన్నాయి. ఇక్కడి వర్ణన పైఉపాసనల వివరణమే. ఇవన్నీ ముందుఖండాలలో ఏదో రూపంలో చెప్పబడి నందున గురుదేవులు వాటిని వదిలేశారు. అయితే ఉపనిషత్తుని పూర్తిగా చదవదలచుకొన్న జిజ్ఞాసువులు భగవత్పాదశంకరుల భాష్యసహాయంతో ఆ అధ్యాయాలు చేదవడం మంచిది.

ఇలా మధుకాండ, మునికాండ (లేదా యాజ్ఞ వల్క్యకాండ), ఖిలకాండ అనే విభజనలతో ఉన్న ఆరు అధ్యాయాల బృహదారణ్యకోపనిషత్తులోని సారం క్లుప్తంగా సూచింపబడింది ఇందులో వేదాంతంలో తెలుసుకోవలసిన దంతా ఉన్నది ఈ గొప్పదైన పెద్ద ఉపనిషత్తు శుక్లయజుర్వేదంలోని శతపథ బ్రాహ్మణంలో ఉన్నది.



# పంచదశ స్తబకం

శ్లో॥ నిగమ మూర్ధ్వతరో ర్గళితం ఫలం।
శుకముఖా దమృతద్రవ సంయుతమ్॥

ప్రతి॥ ఊర్ధ్వతరోః = ఊర్ధ్వవృక్షమునుండి, గళితం = జారిపడినదియు, శుకముఖాత్ = చిలుకనోటినుండిజారిన, అమృతద్రవ = అమృతముతో, సంయుతం = కూడిన, ఫలం = ఫలముగా, నిగమం = వేదము, భవతి = అగుచున్నది.

ఉపనిషత్తు లనేకం ఉన్నాయి. వాటిలో దశోపనిషత్తులు చాలా గొప్పవి, ప్రధానమైనవి. ఇంతవరకు అయిన పధ్నాలుగు స్తబకాలలో గురుదేవులు ఆ పది ఉపనిషత్తుల సారాన్ని మథించి తీశారు, ఇకనుండి ఇతర ఉపనిషత్తులు వివరింపబడుతాయి.

పదిహేనో స్తబకంలో శ్వేతాశ్వతరోపనిషత్తు ను 24 శ్లోకాలలోను. బ్రహ్మబిందూపనిషత్తును 25 వ శ్లోకంలోను చెబుతున్నారు.

ఈ ఉపనిషత్తులో కూడా దశోపనిషత్తులలోని ఉదాత్తభావాలే ఉంటాయి, అయితే వీటిలోని భాష, శైలి స్పష్టంగా తేలికగా ఉంటాయి. ఈ శ్లోకాలలో వాటిసారం మాత్రమే ఉన్నందున జిజ్ఞాసువులకి ఆత్మనుగురించి మనన స్మరణ ధ్యానాదులు తేలికగా సాధ్యపడుతాయి.

ఫలవృక్షాలలో పళ్లకుండే మాధుర్యం బెరడులోకాని కొమ్మలలో కాని ఉండదు. వృక్షాలకికాచే ఫలాలలోనే మధురమైన రుచి, వాసన ప్రవేశిస్తాయి. అందుకే చెట్లలో పళ్ళనే మనం ప్రేమిస్తాము. అవే మనకి తృప్తినిస్తాయి. ఫలాలలో కూడా పండిన పళ్లే చాలా తియ్యగా వుంటాయి. కాబట్టి చిలకలు

కూడా వాటినే ముందు తింటాయి. అందుచేత పరిపక్వమైన ఫలాలు యావత్తు వృక్షంయొక్క మాధుర్యమూ, సారమూ అని చెప్పవచ్చును.

అలాగే దశోపనిషత్తులు పెద్దపెద్ద శాఖలతో బాగా విస్తరించుకొన్న మహా వృక్షంతో ఉపమింపబడినాయి. మిగిలిన ఉపనిషత్తులు ఈ మహావృక్షానికి పండిన పళ్ళవంటివని పూజ్య గురుదేవులు అంటున్నారు స్వామి తపోవనం ఆ పండ్ల మాదుర్యాన్ని తనివితీరా చవిచూచిన చిలక వారు చవిచూచిన వాటి మాధుర్యాన్ని తాము అనుభవించుతున్న ఆత్మానందానుభూతితో సులలితంగా మిశ్రితం చేసి మనకిచ్చారు అందుచేత ఆత్మవిద్యానుభవం కోరే జిజ్ఞాసువులు ఉత్తేజకరమైన ఈ శ్లోకాల అమృతానందాన్ని నిత్యమూ పానంచేసి ఉత్తేజనాన్ని పొంది మత్తచిత్తులు కావాలి.

శ్వేతాశ్వతరోపనిషత్తులో జగత్తుయొక్క కారణం చర్చించబడింది. కాలమే ప్రపంచకారణమని చాలామంది మేధావులు ఎంచుతారు. జీవుళ్ళ స్వభావం కారణమని మరికొందరు ఎంచుతారు. ఈ విషయం మొదటిశ్లోకంలో చెప్పబండిది.

ఈ శ్లోకాలు అనుష్టుప్ ఛందస్సులో ఉన్నాయి.

**శ్లో॥ కాల ఏవ జగన్మూలం స్వభావ ఇతి చాపరే।**
**వదంతి య మజానంతః స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 1**

ప్రతి॥ యం = ఏ పరమాత్మను, అజానంతః = తెలియనట్టివారు, జగత్ + మూలం = జగత్తును మూలము, కాలః + ఏవ = కాలమే, అపరే = మరికొందరు, స్వభావః + ఇతి + చ = సహజమని, వదంతి = చెప్పు చున్నారో, సః + ప్రభుః + శంభుః = ఆప్రభువైన శంకరుడు, ప్రీయతాం = ప్రేమను ప్రసాదించుగాక!

## తాత్పర్యం

కొందరు మేధావులు జగత్తుయొక్క సృష్టిస్థితిలయలకి నిరంతరం ప్రవహించే కాలమె కారణమని ఎంచుతారు. నిప్పుకి వేడి, భూమికి గట్టిదనం

లక్షణాలు అయినట్లు ప్రతివస్తువుకి వున్న స్వభావధర్మమే జగత్తుకి కారణమని మరికొంద రంటారు. ఎవరిని ఎరుగనందున ఇలా వారు వాదిస్తారో, ఆ శక్తి మంతుడైన పరమాత్మ శంభుడు నన్ను కరుణతో అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

శ్వేతాశ్వతరోపనిషత్తులోని మొదటిరెండు మంత్రాల సారం ఇందులో ఉన్నది.

బ్రహ్మాండంయొక్క సృష్టిస్థితిలయాలకి కారణమేదో తెలుసుకోడానికి గాను చేరిన సత్యాన్వేషకుల సత్సంగసభతో ఉపనిషత్తు ప్రారంభమౌతుంది. వాళ్ళు ఒక విషయం చర్చించారు. చర్చనీయాంశమైన ప్రశ్న ఇదీ—"వేదాలలో పరబ్రహ్మమునుండి బ్రహ్మాండం జనించినట్లు మనం చదివాము. మనం అందరం ఏ బ్రహ్మమునుండి జనించామో ఆ బ్రహ్మముయొక్క స్వభావం ఏమిటి? మనలని ఎవరు నిలబెట్టి ఉంచుతున్నారు? మన నిజస్వభావం ఏమిటి?"

కొందరు వేదప్రకారం కాలమే కారణమని చెప్పబడిందన్నారు. అందరూ కాలానికి లోబడి జీవించేవారే. మరికొందరు ప్రతివిషయానికి ఉన్న స్వభావమే నామరూపజగత్తుకి కారణమన్నారు.

ఇంకొందరు వేరువేరు నిష్పత్తులలో ప్రకృతి కలయికలు చెందడంవల్ల ప్రపంచం ఏర్పడిందన్నారు. మరికొందరు జగత్తు యాదృచ్ఛికంగా అకారణంగా ఏర్పడిందన్నారు. ఈ సంగతిని తరువాతిశ్లోకం వివరిస్తుంది.

**శ్లో॥ భూతాని జగతో మూలం యద్రచ్ఛేతి చ కేచన।**
**జానంతి యమజానంతః స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 2**

ప్రతి॥ యం = ఏ పరమాత్మను, అజానంతః = తెలియనట్టివారు, జగతః = జగత్తునకు, మూలం = మూలముగ, భూతాని = పంచభూతాలని, కేచన = మరికొందరు, యదృచ్ఛా + ఇతి + చ = యాదృచ్ఛికమని యును, జానంతి = తెలియుచున్నారో, సః———

## తాత్పర్యం

పదార్థవాదులు ప్రకృతి రకరకాలుగా పరస్పరం కలియడంవల్ల జగత్తు ఏర్పడిందంటారు. మరికొందరు కాలం, స్వభావం, నియతి ఏదీ కారణంకాదని కార్య–కారణ సంబంధం లేకుండా కేవలం యాదృచ్ఛికంగానే జగత్తు ఏర్పడిందనీ అంటారు ఈ వాదాలు లేవదీసే వారందరూ మూలకారణమైన పరమాత్మ నెరగకపోవడం విచిత్రం. ఏకారణాన్ని ఎరుగక ఇలా వాదిస్తారో ఆ శంకరుడు నాపట్ల ప్రీతుడగును గాక!

తరువాతి శ్లోకంలో పరమాత్మయే ప్రపంచానికి మూలకారణమని వివరింపబడుతోంది.

శ్లో॥ గుణై ర్నిగూఢో యో దేవః కారణానాం చ కారణం।
స ఏవ జగతో మూలం స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 3

ప్రతి॥ యః + దేవః = ఏ పరమాత్మ, గుణైః = త్రిగుణాలచే, నిగూఢః = కప్పబడియున్నాడో, కారణానాం + చ = కారణాలకును, కారణం = కారణమగుచున్నాడో, సః + ఏవ = అతడే, జగతః = జగత్తునకు, మూలం = ఆధారము, సః———

## తాత్పర్యం

పరమాత్మయొక్క ప్రబల శాసకశక్తివలన సత్త్వరజస్తమస్సులనే త్రిగుణాత్మకమైన మాయతో కూడిన నామరూపాల బ్రహ్మాండం సృష్టి అయింది. అందుచేత ప్రపంచానికి మూలకారణం పరమాత్మయే, ఆ పరమ ప్రభు శంభుడు నాపట్ల ప్రీతుడగును గాక!

పరమాత్మని ఉపాసించడంవల్ల ఈ మాయావరణాన్ని ఛేదించవచ్చునని తరువాతి శ్లోకం చెబుతుంది.

శ్లో॥ విశ్వమాయా వినాశ స్స్యా ద్యస్య దేవస్య దర్శనాత్।
అక్షరస్య క్షరేశస్య స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 4

ప్రతి॥ అక్షరస్య = నాశములేని, క్షరేశస్య = నాశమునకు ప్రభువైన, యస్య = ఏ, దేవస్య = పరమాత్మయొక్క, దర్శనాత్ = దర్శనమువలన, విశ్వమాయావినాశః = సర్వమాయానాశము, స్యాత్ = అగునో, సః——

## తాత్పర్యం

శుద్ధబ్రహ్మమైన పరమప్రభువు అక్షరుడు, శాశ్వతుడు ఈక్షరప్రపంచానికి ఆయన ప్రభువు. ఆయనను ఆరాధించి తెలుసుకోడంవల్లనే బాహుళ్యంతో కూడిన ప్రపంచము, దాని ఉపాదానకారణమైన మాయ అంటే అవిద్య శాశ్వతంగా తొలగిపోతాయి. ఈ బహుళప్రపంచానికి ఆధారమైన పరమాత్మ శ్రీ శంభుడు నాపట్ల ప్రీతుడగును గాక!

తరువాతి శ్లోకంలో ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికమైన అన్ని దుఃఖాల నివారణ ఆత్మజ్ఞానంవల్లనే సాధ్యపడుతుందని చెప్పారు.

శ్లో॥ క్లేశపాశాపహానిస్తు దేవం జ్ఞాత్వైవ నాన్యథా।
బ్రహ్మశబ్దాభిధేయం యం స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 5

ప్రతి॥ క్లేశపాశ + అపహానిః = దుఃఖపాశమును పోగొట్టునది, యం = ఏ, బ్రహ్మశబ్ద + అభిధేయం = బ్రహ్మశబ్దముచే చెప్పబడు, దేవం = దేవుని జ్ఞాత్వా + ఏవ = తెలిసినపుడే అగుచున్నది, అన్యథా = వేరుగా' న (భవతి) = కాదు, సః——

## తాత్పర్యం

జీవుళ్లందరిలోని ఆత్మయే పరమాత్మ అని తెలిసి అనుభవసిద్ధం చేసుకోడంవల్ల అజ్ఞానం మమకారం, క్రోధం మొదలైన ప్రాపంచికమైన దుఃఖాలు బంధనాలు తెగిపోతాయి. మనల్ని బంధించి ఊపిరాడకుండా తన గుప్పిట్లో పెట్టుకొనే వాటినుండి విముక్తి పొందటానికి వేరేమార్గం లేదు. ఆ పరమాత్మ అయిన శ్రీ శంకర భగభానుడు, ప్రభువు నాపట్ల ప్రీతుడగునుగాక!

ఆ పరమాత్మయే మనశరీరంలో వెలుగుతున్న ఆత్మ. దానిని సోదాహరణంగా తరువాతి శ్లోకం వర్ణించుతుంది.

శ్లో॥ యోనిస్థో యథా వహ్నిః తద్వదాత్మాపి దేహగః।
యోఽదృశ్యో దృశ్యతేఽభ్యాసాత్ స శంభుః ప్రీయతాం
ప్రభుః॥ 6

ప్రతి॥ యోనినిష్ఠః = కారణభూతమైన కొయ్యయందుడు, వహ్నిః + యథా = అగ్నివెట్లో, తద్వత్ = అట్లే, దేహగః = శరీరగతమైన, ఆత్మా + అపి = ఆత్మకూడా—, అదృశ్యః = కనిపించని, యః = ఏ పరమాత్మ, అభ్యాసాత్ = అభ్యాసమువలన, దృశ్యతే = కనబడుచున్నాడో, సః—

## తాత్పర్యం

కాష్ఠంలో అగ్నిలాగా దేహంలో ఆత్మ ఉన్నది. అభ్యాసంవల్ల అదృశ్యంగా వున్నది కనిపిస్తుంది ఆ పరమాత్మ శంభుడు నాపట్ల ప్రీతుడగును గాక!

## వ్యాఖ్య

కాష్ఠంలో కనిపించకుండా అగ్ని ఉన్నది. దానిని ముట్టించేవరకు అగ్ని పైకి కనబడదు. కట్టెను సరిగా అంటించినప్పుడు అగ్నియొక్క నిజస్వరూపం గోచరమౌతుంది. అలాగే ప్రతిదానిలోను అంతర్హితంగా ఆత్మ ఉన్నది. ప్రస్తుతం అది మనకు గోచరించదు. కట్టెకి నిప్పుఅంటించో, రాపిడిపెట్టడం వల్లనో అందులో ఉన్న అగ్నిని ప్రత్యక్షం చేసుకున్నట్లే మనలో నిత్యమూ వెలుగుతున్న ఆత్మని బాహ్యవిషయాలనుండి ఇంద్రియమనోబుద్ధుల్ని మళ్లించి అంతర్ముఖం చేసి ఓంకార ధ్యానం చేయడంవల్ల దర్శించవచ్చును. ఓం అనేది ఆత్మయొక్క సంకేతం.

వెనకాలి రోజుల్లో రెండు కట్టెలని నిలువుగాపెట్టి ఒరిపిడి పెట్టడం ద్వారా హోమాగ్నిని రగుల్కొల్పేవారు. ఆ రాపిడికి లోనఉన్న అగ్ని ప్రకట మయ్యేది. అలాగే ఓం అనే సంకేతాన్ని పై కర్రగాను, వెనక్కి మళ్ళించిన ఇంద్రియమనో బుద్ధుల్ని క్రింది కర్రగాను భావించుకోవాలి. తదేకచిత్తంతో ఓంకారధ్యానాన్ని అభ్యసించడంవల్ల ఆత్మజ్ఞానం ఈ శరీరంలోనే కలుగు

తుంది. బుద్ధిలోని విచక్షణవల్ల స్థిరత్వము, ఇంద్రియాలని విషయ వస్తువుల నుండి మళ్ళించడంవల్ల శుద్ధత్వము పొందిన మనస్సే ఏకాగ్రంగా ధ్యానించ గలదు.

తరువాతి శ్లోకంలో పరమాత్మయొక్క సర్వవ్యాపకత్వం వర్ణించబడింది.

శ్లో॥ క్షీరే సర్పిర్యథా తద్వత్ ఆత్మా య స్సర్వగోఽద్వయః।
గృహ్యతే సత్యతపసా స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 7

ప్రతి॥ యథా = ఎట్లు, క్షీరే = పాలయందు, సర్పిః + యథా = వెన్న ఎట్లో, తత్ + వత్ = అట్లు, యః = ఏ, అద్వయః = ద్వయముకాని, సర్వగః = సర్వగతమయిన, ఆత్మా = ఆత్మ, సత్యతపసా = బ్రహ్మతపస్సుచే, గృహ్యతే = స్వీకరించబడునో, సః——

## తాత్పర్యం

పాలలో వెన్నలాగా అద్వితీయమైన ఆత్మ సర్వవ్యాప్తమై వున్నది. సత్యంలో నిలబడి తీవ్రమైన తపస్సుతో ఏకాగ్రమైన చిత్తంతో ధ్యానించడంవల్ల అది లభ్యమౌతుంది. ఆ పరమాత్మయే శ్రీ శంకరభగవాన్‌ప్రభువు. ఆయన నాపట్ల ప్రీతుడగును గాక!

## వ్యాఖ్య

పాలలోని అన్ని కణాలలోను వెన్న వ్యాపించి ఉన్నట్లే పరమాత్మ అంతటా వుండి అణువులు పరమాణువులలోకూడా వ్యాపించివున్నాడు.

ఆత్మ అంతటా ఉంటే మనకి ఎందుకు కనిపించదు? దానిని ఏలా తెలుసుకోవాలి?

దానికి సరైన తపస్సు, సత్యనిష్ఠ కావాలి. ఆలోచనలని, వాక్కుని, క్రియలని జాగరూకతతో ఏకత్రాటిమీద నడపడంవల్ల మనస్సు సత్యంలో నిలబడుతుంది.

ఇలా ధ్యానసిద్ధమైన మనస్సును తపస్సులో ఎలా ఏకాగ్రం చెయ్యాలో అందరికీ తెలియదు. అందుకే తరువాతి శ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ సమే దేశే విశుద్ధే చ గుహాదౌ వాతవర్జితే।
స్థిత్వైవ యమనుధ్యాయేత్ స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 8

ప్రతి॥ సమే = సమతలమయిన, విశుద్ధే = పరిశుద్ధమయిన, దేశే = ప్రదేశమందు, వాతవర్జితే = గాలిపాటులేని, గుహ + ఆదౌ + చ = గుహ మొ॥ ప్రదేశములందు, స్థిత్వా + ఏవ = ఉండే—, యః = ఏ పరమాత్మను, అనుధ్యాయేత్ = ధ్యానించునో, సః——

## తాత్పర్యం

వాయుతీవ్రత్వం లేని గుహలు మొదలైన వాటిలో చదునుగా శుభ్రంగా ఉండే భూమిపైన ఉంటూ ఆయనని నిరంతరచింతన చెయ్యాలి. ఆపరమాత్మ శ్రీ శంకరభగవాన్ ప్రభువు నాపట్ల ప్రీతుడగును గాక!

## వ్యాఖ్య

భూమి సమంగా శుభ్రంగా ఉండాలి. ఎక్కువ గాలివేస్తే ధ్యానానికి అంతరాయం కలుగుతుంది. సాధకుడు ప్రశాంతంగా, నిశ్శబ్దంగా, నిశ్చింతగా ఉండాలి. గుహలో అయితే శ్రేష్ఠం. ఇవన్నీ అయాచితంగా లభిస్తాయి. ఇక కూర్చొని ధ్యానం చేసుకోడానికి గాను సుఖమైన ఆసనాన్ని అవలంబించాలి. నింపాదిగా తొందరపాటు లేకుండా అభ్యాసం చేయాలి.

ఇలా ఆత్మపైన ధ్యానించే యోగికి ఆత్మానుభవం కావడానికి ముందు ఈ క్రింది విధాలైన అనుభవాలు వస్తాయి.

శ్లో॥ యస్యాభివ్యక్తితః పూర్వం అర్కధూమాది దర్శనం।
సంభవే ద్యోగినాం యోగే స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 9

ప్రతి॥ యోగినాం = యోగులకు, యోగే = యోగమునందు, యస్య = ఎవని యొక్క, అభివ్యక్తితః = ప్రత్యక్షము వలన, పూర్వం = మొదట, అర్క + ధూమ + అది దర్శనం = సూర్యుడు, పొగ మొ॥వాని దర్శనం, సంభవేత్ = కలుగునో, సః

## తాత్పర్యం

యోగి ఆత్మను దర్శించడానికి ముందు అతడికి ధ్యానంలో సూర్యుడు, ధూమం, అగ్ని, వాయువు, విద్యుత్తు, చంద్రుడు—వీటి దర్శనం అవుతుంది. ఆ పరమాత్మే శ్రీ శంకరభగవాన్ ప్రభువు. ఆయన నా పట్ల ప్రీతుడగునుగాక!

ఈ దర్శనాల తరువాత ఆత్మదర్శనం స్వయంగా లభిస్తుంది.

శ్లో॥ కృతార్థో భ్రాజతే యోగీ తేజోమయ కళేబరః।
ప్రత్యం చ వీక్ష్య యం సాక్షాత్ స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 10

ప్రతి॥ యం = ఏ పరమాత్మను, ప్రత్యఞ్చం = ప్రత్యక్కును, సాక్షాత్ = ప్రత్యక్షముగా, వీక్ష్య = చూచి, తేజోమయ = తేజస్సుతో నిండిన, కళేబరః సన్ = శరీరముగల, యోగీ = యోగి, కృతార్థః = కృతార్థుడుగా భ్రాజతే = ప్రకాశించుచున్నాడో,— సః——

## తాత్పర్యం

గాఢమైన ధ్యానంలో ఆ యోగి నెమ్మదిగా అద్వయమైన ఆత్మలో మేల్కొంటే కృతార్థుడవుతాడు. ఆ తరువాత నిత్యకాంతితో జ్యోతి స్వరూపుడైన పరమాత్మగా భాసిస్తాడు. ఆ పరమాత్మయే శంభుప్రభువు. ఆయన నాపట్ల ప్రీతుడగును గాక!

అలా ఆత్మ దర్శనమైన యోగి తన జాగ్రదవస్థలో జాగ్రత్ప్రపంచాన్ని యావత్తు పరమాత్మ యొక్క ప్రకట స్వరూపంగా దర్శిస్తాడు.

శ్లో॥ విశ్వబాహు ర్విశ్వమూర్తిః విశ్వేశో విశ్వభావనః।
విశ్వాధారశ్చ యోరుద్రః స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 11

ప్రతి॥ విశ్వబాహుః = విశ్వబాహుడు, విశ్వమూర్తిః = విశ్వమూర్తి, విశ్వేశః = విశ్వేశుడును, విశ్వభావనః = విశ్వభావుకుడును, విశ్వ + ఆధారః + చ = విశ్వాధారుడునైన, యః రుద్రః = ఏ రుద్రుడున్నాడో, సః——

## తాత్పర్యం

ఆ యోగి జాగ్రదవస్థలో సర్వవ్యాపకుడైన భగవంతుణ్ణి అనంతబాహువులతో అనంతశరీరాలతో చూస్తాడు. విశ్వానికి కర్తగా, ఏక ఆధారంగా చూస్తాడు. ఆ పరమాత్మయే శ్రీ శంకరభగవానుడు, పరమేశ్వరుడు, రుద్రుడు. ఆ అనంత ప్రభువు నాపట్ల ప్రీతుడగును గాక!

## వ్యాఖ్య

విశ్వంలో ఉన్న అందరి జీవుళ్ళ చేతులు, దేహాలు – అన్నీ ఆయన చేతులూ, దేహాలే అంటే ఆయన అందరిలోను వ్యాపించివున్నాడని భావం.

వర్ణన ఇంకా కొనసాగుతోంది.

శ్లో॥ జ్యాయోఽణీయో వా న కించిత్ యస్మాత్ స్తబ్ధ శ్చకాస్తి యః।
వృక్షవన్మోక్షదో మోక్షః స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 12

ప్రతి॥ జ్యాయః = సర్వాధికుడు, అణీయః + వా = అణుస్వరూపుడుగనో, యః = ఎవడున్నాడో, యస్మాత్ = ఎవనికంటె, న + కించిత్ + అస్తి = ఏదియునులేదో, వృక్షవత్ = చెట్టువలె, యః = ఎవడు, స్తబ్ధః = నిశ్చలుడుగ, చకాస్తి = ప్రకాశించుచున్నాడో, మోక్షదః = ముక్తినిచ్చుచున్నాడో, మోక్షః = మోక్షస్వరూపుడో, సః——

## తాత్పర్యం

ఆ పరమాత్మ పెద్దదానికన్న పెద్దవాడు, చిన్నదానికన్న చిన్నవాడు. ఆయన వృక్షంవలె స్థిరుడు. సర్వత్ర ప్రకాశిస్తాడు. ఆయనే మోక్షాన్ని

ప్రసాదిస్తాడు. ఆయనే మోక్షం. ఆ పరమాత్మ శ్రీ శంకరప్రభువు నాపట్ల ప్రీతుడగును కాక!

### వ్యాఖ్య

ఆయన అణుపరమాణువుల కన్న సూక్ష్మమైనవాడు. ఆయన ప్రబల మైన దానికన్న ప్రబలుడు.

వర్ణన ఇంతతో ఆగలేదు. ఇంకా కొనసాగుతోంది.

**శ్లో॥ యోషా పుమాన్ కుమారశ్చ కుమారీ చాస్తి యో విరాట్।**
**దండగ్రాహీ చ జఠరః స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 13**

ప్రతి॥ యః + విరాట్ = ఏవిరాట్ స్వరూపుడు, యోషా = స్త్రీ, పుమాన్ = పురుషుడు, కుమారః + చ = కుమారుడుగను, కుమారీ + చ = కుమార్తెగను, దండగ్రాహీ = ఊతకఱ్ఱను పట్టుకొన్న, జఠరః + చ = వృద్ధుడుగనున్నాడో, సః——

### తాత్పర్యం

ఆ పరమాత్మ విరాడ్రూపి. స్త్రీగా, పురుషుడుగా, బాలుడిగా, బాలికగా కర్రపట్టుకొన్న వృద్ధుడుగా అన్ని రూపాలలోను ఆయనే ఉన్నాడు. ఆ పరమాత్మ శ్రీ శంకరభగవానుడు నాపట్ల ప్రీతుడగును గాక!

### వ్యాఖ్య

ఒకే అద్వితీయ సర్వవ్యాపక పరమాత్మ తన మాయాశక్తివల్ల అనేక రూపాలు ధరించినట్లు కనబడుతాడు. మాయ ఆవరణ విక్షేపాలుగా వ్యక్త మౌతుంది.

పరమాత్మ మాయాశక్తిలో వేరువేరు నామరూపాలని, పరిమిత జీవ రూపాలను ధరించుతుంది. ఇలా స్వీకరించిన పరిమితులను వదిలించుకొని

బయటపడడానికి చాలా ప్రయత్నం కావాలి. ఈ విషయాన్ని రాబోయే శ్లోకం చెబుతుంది

శ్లో॥ అజయా మోహితో భుంక్తే జనస్తాం న జిహాసతి।
గుణమయ్యాతు యచ్ఛక్త్యా స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 14

ప్రతి॥ అజయా = అవిద్యచే, మోహితః = మోహితుడైన, జనః = జనుడు, భుంక్తే = భుజించుచున్నాడో, గుణమయ్యా = త్రిగుణాత్మకమైన, యత్ + శక్త్యా = ఏశక్తితో, తాం = ఆ అజ్ఞానమును, నజిహాసతి = వదలిపెట్టుటలేదో, సః———

## తాత్పర్యం

అనాది అవిద్యకారణంగా మూడుగుణాల కలయికవల్ల మానవుడు నిత్యమూ బహుళప్రపంచంలో సుఖదుఃఖానుభవాలు పొందుతూంటాడు. అతడెన్ని ప్రయత్నాలు చేసినా పరమప్రభు మాయాశక్తియొక్క గుప్పిట్లోంచి తప్పించుకోడం చాలాకష్టమౌతుంది. ఆ పరమప్రభువు సర్వశక్తిమంతుడైన శంకరభగవాన్. ఆ ప్రభువు నాపట్ల ప్రీతుడగును గాక!

## వ్యాఖ్య

సాంఖ్యశాస్త్రం ప్రపంచానికి 'ప్రధానం' ఉపాదాన కారణమని చెబుతుంది. వైశేషిక దర్శనం అణువులు, పరమాణువుల వల్ల ప్రపంచం ఏర్పడిందంటుంది. బౌద్ధులు క్షణికవిజ్ఞానంవల్ల ప్రపంచం కనబడుతోందంటారు. నాస్తికులు ప్రపంచం శూన్యంలోంచి వచ్చిందంటారు. ఇవేవీ నిజానికి కారణం కావు. పరమాత్మయే కారణమని వేదాంతం ఘోషిస్తుంది. ఆ పరమాత్మయే రెండు స్థాయిలలో వ్యవహరించి జీవునిలోపల నిస్సంగుడైన అనంతాత్మగా ఉంటూ బాహ్యంలో పరిమితజీవుడై భ్రాంతిలో విషయవస్తువుల తాదాత్మ్యంతో మమకారంలో మునిగిపోతాడు.

ఈ విషయాన్ని తరువాతి శ్లోకం చెబుతుంది.

శ్లో॥ మాయయా సృజతే విశ్వం మాయి యస్సంగవర్జితః।
అన్యస్తు సజ్జతే తస్మిన్ స శంభుః ప్రీయతాం ప్రభుః॥ 15

ప్రతి॥ సంగవర్జితః = నిస్సంగుడైన, యః = ఏ, మాయీ = ఐంద్రజాలికుడు, విశ్వం = విశ్వమును, మాయయా = మాయచేత, సృజతే = సృష్టించుచున్నాడో, తస్మిన్ = ఆవిశ్వమందు, అన్యః + తు = మరియొకడు, సజ్జతే = చిక్కుకొనుచున్నాడు, సః———

## తాత్పర్యం

ఆ పరమాత్మ తన మాయశక్తిని ధరించి మాయావి లాగా ఈ నామ రూపాల విశాలప్రపంచాన్ని తయారు చేస్తాడు. దానితో ఆయనకు సంగంలేదు. మోహితుడై భ్రాంతిలో పడిన జీవుడు మరొప్రక్క పూర్తిఅజ్ఞానంలో మునిగిపోయి ప్రాపంచిక భ్రమల్లో చిక్కుకుంటాడు. ఆ పరమేశ్వరుడైన శంకరభగవాన్ నాపట్ల ప్రీతుడగును గాక!

## వ్యాఖ్య

మాయావి చూపే అద్భుతప్రదర్శనలు అందరికీ తెలిసినవే. వేరుగా చెప్పనక్కరలేదు.

పరమాత్మ స్వభావాన్ని అర్థం చేసుకోవడం చాలా కష్టం. అందువలన రాబోయే ఎనిమిది శ్లోకాలలో రకరకాలుగా ఆయనస్వభావం వర్ణించబడుతోంది. అన్ని శాస్త్రాలలోను ఇలా తిరిగి తిరిగి వర్ణనలు చేయడం మార్గసూచకంగా, ఆత్మను గురించి గాఢమైన జ్ఞానాన్ని ప్రసాదించి ధ్యానానికి, చింతనకి తోడ్పడడం ఆచారం.

ఈ స్తబకంలో మొదటి మూడుశ్లోకాలలో బ్రహ్మము ఒక్కటే ప్రపంచానికి మూలకారణమని చెప్పబడింది. కాలం, యాదృచ్ఛికత, నియతి మొదలైన వాటిని కారణాలు కావని దృఢంగా త్రోసివేయడం కూడా జరిగింది. మళ్ళీ ఒకసారి వాటిని రాబొయే శ్లోకం తిరస్కరిస్తుంది.

శిఖరిణి అనే ప్రసిద్ధ ఛందస్సులో ఈ శ్లోకాలు వ్రాయబడినాయి.

శ్లో॥ ఉపాదానం మాయాశబలిత పరబ్రహ్మ జగతః
ప్రధానం వాణుర్వా క్షణిక చిదసద్వా న భవతి।
నిచాయ్యైత ద్యోనిం యదిహ విబుధా నిర్వృతి మితాః
సదా తద్దేవాంఘ్రి స్మరణ మధుమత్తం భవ మనః॥ 16

ప్రతి॥ జగతః = జగత్తునకు, మాయా = మాయచే, శబలిత = చిత్రవర్ణములు కలదిగా, పరబ్రహ్మ = పరబ్రహ్మ. ఉపాదానం = కారణమగుచున్నాడు, ప్రధానం + వా = ముఖ్యమయినదికాని, అణుః + వా = అణువుగానీ, క్షణికచిత్ = క్షణికజ్ఞానమైన, అసత్ + వా = అసత్తుగానీ, నభవతి = కారణముకాదు. ఇహ = ఇక్కడ, ఏతత్ = ఈ, యోనిం = కారణమును, నిచయ్య = నిశ్చయించుకొని, నిర్వృతిమితాః = ఆనందమునే పరిమితిగాగల, విబుధాః = పండితులున్నారో, సదా = ఎల్లప్పుడు, మనః = ఓ మనసా!, తత్ = ఆ, దేవ + అంఘ్రి = దేవునిపాదాలను, స్మరణ = ధ్యానించుట అనెడి, మధు = మధువుచే, మత్తం = మత్తెక్కినదానవుగా, భవ = అగుము—

## తాత్పర్యం

ప్రపంచసృష్టికి ఉపాదాన సహకార కారణాలు పరమాత్మయొక్క మాయాశక్తి తప్ప వేరు కావు. ప్రధానంకాని, అణువుకాని, క్షణిక విజ్ఞానం కాని, శూన్యంకాని, కావు. నిజమైన విద్వాంసులు శ్రవణ మనన నిధిధ్యాసల ద్వారా పరమాత్మయే అకారణకారణమని తెలుసుకున్నవారై ఈ జీవితంలోనే జీవన్ముక్తిని పొంది ఉత్తమమైన శాంతిని, ప్రశాంతతని పొందుతారు. ఓ మనస్సా!, పరమాత్మయొక్క రూపమైన మహాదేవుని పాదపద్మాలని వెదుక్కో. సుగంధభరితమైన ఆయన పాదపద్మాల మకరందమాధుర్యాన్ని గ్రోలి, స్మరించి మత్తెక్కి సంచరించు!

వర్ణనాతీత వస్తువుయొక్క వర్ణన కొనసాగుతోంది. సూర్యచంద్రాదులు పరమాత్మస్థాయిలో ఉండరు. వాళ్ళవెలుగు అక్కడ ప్రకాశించదు. అది వర్ణనాతీతం.

శ్లో॥ తమో వా రాత్రిర్వా దివసగణనా వా ద్యుతిరియం
నయత్ర స్వస్మిన్ యద్విలసతి శివం శాంత మతులమ్।
నశూన్యం నాశూన్యం సజనురజనుశ్చాపి యదహో
సదా తద్దేవాంఘ్రిస్మరణ మధుమత్తం భవ మనః॥ 17

ప్రతి॥ యత్ర = ఎచ్చట, తమః + వా = చీకటిగాని, రాత్రిః + వా = రాత్రిగాని, దివసగణనా + వా = పగలుకానీ, ఇయం = ఈ, ద్యుతిః = విశ్వతేజస్సు, న = ఉండదో, అతులం = అసమానమైన, శాంతం = శాంతము, శివం = మంగళము, స్వస్మిన్ = తనయందు, యత్ = ఏది, విలసతి = ప్రకాశించుచున్నదో, శూన్యం + న = శూన్యముకాదో, అశూన్యం + న = అశూన్యమునుకాదో, సః = అది, జనుః = పుట్టుక, అజనుః + చ + అపి = పుట్టుక లేకపోవుటయును, యత్ + అహో = ఏదగుచున్నదో, సదా——

## తాత్పర్యం

అక్కడ చీకటి లేదు, రాత్రి లేదు. పగలు లేదు, సూర్యునివెలుగు లేదు. అక్కడ పరమమంగళమై, ప్రశాంతమై, స్వప్రకాశమై అతులమైన చైతన్యకాంతి వున్నది. అది శూన్యంకాదు, అశూన్యం కాదు. దానికి ప్రారంభం జన్మ లేవు. దానికి అంతం, మరణం లేవు. అద్భుతమై వర్ణింపనలవికాని విచిత్రమది! ఓ మనస్సా ఆ పరమాత్మ రూపమైన మహాదేవుని పాదపద్మాలని వెదుక్కో. సుగంధభరితమైన ఆ పాదపద్మాల మకరందాన్ని గ్రోలి, స్మరించి మత్తెక్కి చరించు!

మహర్షులు సర్వవ్యాపక సర్వజ్ఞ పరమాత్మను తమ స్వస్వరూపంగా తెలుసుకొని ముక్తులౌతారని రాబోయే శ్లోకం సూచిస్తుంది.

శ్లో॥ అధ శ్చోర్ధ్వం పశ్చాత్ పురత ఇతి సర్వాసు నిరతాం
కమప్స భ్రాజిష్ణు ప్రసృత మహ మిత్యేత దృషయః।
నిగూఢం యత్ పూర్వేఽవిదురపి విద న్త్యద్య సుధియః
సదా తద్దేవాంఘ్రి స్మరణ మధుమత్తం భవ మనః॥ 18

ప్రతి॥ యత్ = ఏ పరమాత్మ స్వరూపము, అధః = క్రింద, ఊర్ధ్వం + చ = పైనకూడా, పశ్చాత్ = తర్వాత, పురతః = ఎదురుగా, ఇతి = అనెడి, సర్వాసు కకుప్సు = అన్నిదిక్కులందు, నిరతాం = ఎక్కువగా, భ్రాజిష్ణుప్రసృతం = ప్రకాశించుచువెలువడిన, అహం + ఇతి = నేనని, పూర్వేఋషయః = పూర్వఋషులు, ఏతత్ = ఈపరమాత్మ, నిగూఢం = రహస్యమైనదానినిగా, అవిదుః = తెలిపిరి, అద్య = ఇప్పుడు, సుధియః + అపి = పండితులుకూడా—అట్లే—, విదంతి = తెలిసికొనుచున్నారు— సద———

తాత్పర్యం

పరమాత్మ సర్వవ్యాపకుడు. అనంతాకాశాన్ని క్రింద, పైన, ముందు, వెనుక....అన్ని దిక్కులను వెలిగిస్తాడు. అయినా విషయ ప్రపంచంలో కార్య—కారణాల తాదాత్మ్యంవల్ల మోహితులైన సామాన్యులకు అది అగోచరమై, అప్రత్యక్షంగా ఉంటుంది. పూర్వమహర్షులు ఈ పరమాత్మని తెలుసుకొని చూచి "అదే నేను" అని ప్రకటిస్తారు. ఆ పరమాత్మయే మహాదేవుడు. ఆయన పాదాలను వెదుక్కో. ఓ మనస్సా! సుగంధభరితమైన ఆయన పాదపద్మాల మకరందాన్ని స్మరించి, గ్రోలి, మత్తెక్కి చరించు!

మహిమాన్వితమైన ఆ పరమాత్మ తాను అవినాశిగా అక్షరంగా ఉంటూనే సంహారమహిమని ఎలా ప్రకటిస్తుందో రాబోయే శ్లోకం వర్ణించుతుంది.

శ్లో॥ పరాత్మా పాచ్యానాం పరిపచనకృత్ ప్రచ్యుతి మృతీ
బిభీతో యస్మాద్యః స్వయమసుభృతాం కర్మ ఫలదః।
విద్యతే కర్మాత్తి ధ్రువమథ ఫలం తస్య వివిధం
సదా తద్దేవాంఘ్రి స్మరణ మధుమత్తం భవ మనః॥ 19

ప్రతి॥ యః + పరాత్మా = ఏ పరమాత్మ, పాచ్యానాం = నశించువస్తువులకు, పరిపచనకృత్ = నశింపజేయువాడు, ప్రచ్యుతమృత్ = సర్వనాశకుడైన యముడు, యస్మాత్ = ఎవనివలన, బిభీతః = భయపడుతున్నాడో,

స్వయం = తాను, అసుభృతాం = జీవులకు, కర్మఫలదః = కర్మఫల ప్రదాతగా, విద్యతే = తెలియబడుచున్నాడు, అథ = మరియు, కర్మ = కర్మను, అత్తి = భుజించుచున్నాడు, ఇతి ధ్రువం = ఇదినిశ్చయము, తస్య = అట్టి, ఫలం = ఫలితం, వివిధం = అనేకమయినది.

## తాత్పర్యం

ప్రకృతిలోని నాశకశక్తి ఆ పరమాత్మ, సర్వసంహారకుడైన యముడు, క్షణక్షణం మారే కాలం కూడా ఆయనకి విపరీతంగా భయపడుతాయి. ఆయనో నిత్యుడు. అక్షరుడు. నాశనానికి, మార్పులకి అతీతుడు. జీవుళ్ళకి వాళ్ళవాళ్ళ కర్మఫలాన్ని ఆయన ప్రదానం చేస్తాడు. ఆయనే జీవాత్మ భావాన్ని పొంది పాపపుణ్యాలని చేసి వాటి సుఖదుఃఖాలని పొందుతాడు. ఆ పరమాత్మయే మహాదేవుడు. ఓ మనస్సా! సుగంధభరితమైన ఆయనపాదపద్మాల మకరందాన్ని స్మరించి, గ్రోలి, మత్తెక్కి చరించు!

వర్ణన ఇంకా కొనసాగుతోంది.

శ్లో॥ న యోషిత్ షండో వా న ఖలు పురుషోవాపి పురుషః
పరాత్మా యోఽలింగోఽప్యతను తనురూపైః ప్రకృతిజైః।
స లింగః క్రీడత్యోం తనురిద మవష్టభ్య భువనం
సదా తద్దేవాంఘ్రి స్మరణ మధుమత్తం భవ మనః॥ 20

ప్రతి॥ పరాత్మా = పరమాత్మ, యోషిత్ + న = స్త్రీ కాదు, షండః + న = నపుంసకుడు కాడు, నఖలు పురుషః + అపి + పురుషః = పురుషుడు కానే కాడు, ఇట్లు, అలింగః + అపి + యః = లింగనిర్ణయమునకు లోనుకానివాడైనను, ప్రకృతిజైః = స్వతస్సిద్ధముగా పుట్టిన, అతను తను రూపైః = స్థూలశరీరరూపాలతో, సలింగః = లింగశరీరము కలవాడు, ఓం + తనుః = ఓంకారశరీరమును, అవష్టభ్య = పొంది, ఇదం = ఈ, భువనం = లోకమునందు, క్రీడతి = ఆడుచున్నాడు.

## తాత్పర్యం

పరిపూర్ణమైన ఆ పరమాత్మ స్త్రీ కాదు, నపుంసకుడు కాదు పురుషుడు అంతకన్న కాదు. సర్వవ్యాప్త పరమాత్మ అన్నిరూపాలకు, లింగాలకు అతీతుడు. అయినా ప్రకృతి నుండి జనించిన పెక్కు నామరూపాలను ధరించి స్థూలంగా సూక్ష్మంగా తనలో తానే ఆడుకుంటాడు. పవిత్రమైన ఓంకారధ్వనియే ఆయన రూపం. ఆ పరమాత్మయే మహాదేవుడు. ఓ మనస్సా, సుగంధభరితమైన ఆయన పాదపద్మాల మకరందాన్ని స్మరించి గ్రోలి మత్తెక్కి చరించు!

సంసార చక్రాన్ని త్రిప్పేవా డాయనే, మరెవ్వరూ లేరని తరువాతశ్లోకం స్పష్టం చేస్తుంది.

శ్లో॥ మహిమ్నా యస్యేదం భ్రమతి భవచక్రం భవపతేః
భ్రమిన్నో కాలేన ప్రకృతివశతో వా న చ భవేత్।
భ్రమే నైష్కారణ్యం శివశివ తవైషాఽపి మహిమా
సదా తద్దేవాంఘ్రి స్మరణ మధుమత్తం భవ మనః॥ 21

ప్రతి॥ యస్య = ఏ పరమాత్మయొక్క, మహిమ్నా = మహిమచే, భవపతేః = సంసారకర్తయొక్క, ఇదం + భవచక్రం = ఈ సంసారచక్రము, భ్రామతి = పరిభ్రమించుచున్నదో, కాలేన = కాలముచే, న + భ్రమేత్ = పరిభ్రమించదో, ప్రకృతివశతః + వా = ప్రకృతికారణంగాగానీ, న + చ + భవేత్ = పరిభ్రమించదో–, భ్రమే = పరిభ్రమణమున, నైష్కారణ్యం = కారణం లేదో, శివశివ + ఓ పరమశివా!, మహిమా + అపి = మహిమకూడా, తవ + ఏవ = నీదే.

## తాత్పర్యం

ఓ లోకాధీశ్వరా! నీ మహిమవల్లనే ఈ నామరూప సంసారచక్రం నియమప్రకారం పరిభ్రమిస్తోంది. కాలము, ప్రకృతి – కారణం కావు. సామాన్యప్రజలు మరో కారణం వున్నదని భ్రమించడానికి కూడా ఓ పరమ శివా, నీ మహిమె కారణం! అకారణుడివైన నీవే ఈ భ్రమకి కారణం! అనంత

మహిమతో కూడిన ఆ పరమాత్మ మహాదేవుడే, ఓ మనస్సా, సుగంధభరితమైన అయన పాదపద్మాల మకరందాన్ని స్మరించి, గ్రోలి, మత్తెక్కి చరించు!

## వ్యాఖ్య

'శివ, శివ' అనే పునరుక్తి శ్రీ గురుదేవుల భక్త్యావేశాన్ని, పారవశ్యాన్ని తెలుపుతుంది.

పరమాత్మ కార్య – కారణ నియమానికి అతీతుడు. ప్రపంచంలోని విషయవస్తువులకు ఆయన స్వభావమే ఉపాదాన కారణం ఆత్మ ఏకమైనది, అద్వితీయం. అందుకని కార్యకారణ సంబంధం దానికి లేదు. ఈ విషయాన్ని తరువాతి శ్లోకం తెలుపుతోంది.

శ్లో॥ న కార్యం యస్యేష న్న చ కారణ మప్యస్య సదృశః
కనీయాన్ జ్యాయాన్ వా న చ గుణమయీ యస్య విపులా।
స్వతః సిద్ధాశక్తి ర్విలసతి విబోధాది వపుషా
సదా తద్దేవాంఘ్రి స్మరణ మధుమత్తం భవ మనః॥ 22

ప్రతి॥ యస్య = ఏపరమాత్మకు, ఈషత్ = కొంచెమైనను, కార్యం = కార్యము, కరణం + చ = సాధనముకూడ, న = లేదో–, అస్యదృశః + అపి = ఇతనికి సమానుడును, కనీయాన్ = చిన్నవాడును, జ్యాయాన్ + వా = అధికుడును, గుణమయీచ = గుణవంతుడును–, న = లేడో–, యస్య = ఏ పరమాత్మయొక్క, విపుల = విస్తారమైన, స్వతః + సిద్ధ = స్వయముగాసిద్ధించిన, శక్తిః = శక్తి, విబోధ + ఆది = బ్రహ్మబోధ మొ॥ వపుషా = రూపముతో, విలసతి = భాసించుచున్నదో–, సదా——

## తాత్పర్యం

నిజానికి పరమాత్మకి ఈ ప్రపంచంలోని దేనితోను కార్యకారణ సంబంధం లేదు. దేహం, ఇంద్రియాలు మొదలైన వేటివల్ల అది పరిమితం కాదు. పరమాత్మ కన్నా సూక్ష్మమైనదీ, చిన్నదీ ఈ విశాలప్రపంచంలో ఏదీ

లేదు. దాని కన్న పెద్దదీ ఎక్కువ శక్తిమంతమైనదీ కూడా లేదు. అది ఒక్కటే ఇక్కడ ఉన్నది. అది అద్వితీయమైనది. స్వతః సిద్ధమైన ఆ పరమాత్మ శక్తి విలాసంవల్ల ఈ నామరూపజగత్తు ఏర్పడుతున్నది. ఆ పరమాత్మ మహాదేవుడే. ఓ మనస్సా! సుగంధభరితమైన ఆయన పాదపద్మాల మకరందాన్ని స్మరించి, గ్రోలి మత్తెక్కి చరించు!

రాబోయే శ్లోకంలో సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడే ఆ పరమాత్మ యొక్క సృష్టి అని చెప్పబడుతోంది. ఆ పరమాత్మే వేదజ్ఞానాన్ని బ్రహ్మకి అనుగ్రహించాడు.

శ్లో॥ ప్రధాన క్షేత్రజ్ఞ ప్రభు రభవహేతు ర్న చ పతిః
యదన్యః కశ్చిద్యో జనయతి విధిం విశ్వజనకమ్।
యదైశ్వర్యాత్ స్ఫారం స్ఫురతి హృదయే చాస్య నిగమః
సదా తద్దేవాంఘ్రి స్మరణ మధుమత్తం భవ మనః॥ 23

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, ప్రధానక్షేత్రజ్ఞః = ముఖ్యక్షేత్రజ్ఞుడు, ప్రభుః = ప్రభువు, అభవహేతుః = మోక్షకారణుడు, యత్ + అన్యః + కశ్చిత్ పతిః = ఈ పరమాత్మకన్న భిన్నమైన అధిపతి, న = లేడు, యః = ఏ పరమాత్మ, విశ్వజనకం = ప్రపంచసృష్టికర్తయైన, విధిం = బ్రహ్మను, జనయతి = సృష్టించుచున్నాడు, యత్ = ఎవని, ఐశ్వర్యాత్ = ఐశ్వర్యమువలన, అస్య నిగమః + చ = అతని వేదముకూడ, హృదయే = హృదయమందు, స్ఫారం = ప్రకాశవంతముగా, స్ఫురతి = భాసించుచున్నదో—, సదా———

## తాత్పర్యం

పరమాత్మయే క్షేత్రాన్ని—క్షేత్రజ్ఞుడినీ, అంటే, ప్రకృతిని—జీవుణ్ణి సృష్టి చేస్తాడు. ఆత్మజిజ్ఞాసువులకి మోక్షప్రదానం చేస్తాడు. ప్రపంచానికి మరో ఆధారం కాని, అధిష్ఠానంకాని మూలం కాని లేదు. మొదటి సృష్టికర్త అయిన బ్రహ్మమే తన సృష్టికూడా. బ్రహ్మదేవుడు ప్రపంచసృష్టిని ప్రారంభించడానికి

పూర్వం ఆ పరమాత్మయే తన మహిమ ద్వారా అతడి హృదయంలో వేదాలను స్ఫురింప జేస్తుంది. ఆ పరమాత్మ మహాదేవుడే! ఓ మనస్సా, ఆయన సుగంధ భరితమైన పాదపద్మాల మకరందాన్ని స్మరించి, గ్రోలి, మత్తెక్కి చరించు!

తరువాత శ్లోకంలో పరమాత్మను గురించిన సరైన జ్ఞానము, స్ఫురణ లేకపోతే ముక్తి ఎన్నటికీ సాధ్యంకాదని తెలుపబడుతోంది. దానికోసం చక్కని ఉదాహరణ కూడా ఇవ్వబడింది.

శ్లో॥ అబుద్ధ్వా బ్రహ్మైత ద్యది యదమృతం యాతి మనుజః
తదా కుర్యాత్ కృత్తేరివ చ వియతో వేష్టన మపి।
ముముక్షు ర్యం విద్యాత్ విషయవిధురేణైవ మనసా
సదా తద్దేవాంఘ్రి స్మరణ మధుమత్తం భవ మనః॥ 24

ప్రతి॥ యత్ + అమృతం = ప్రాణదానముచేయు, ఏతత్ + బ్రహ్మ = ఈ పరబ్రహ్మ తత్త్వమును, యది + అబుద్ధ్వ = తెలియనట్టి, మనుజః = మనుష్యుడు, యాతి = ముక్తిని పొందగలనని ఆశించుచున్నాడో, తదా = అప్పుడు, వియతః = ఆకాశముయొక్క, వేష్టనం + అపి = వేష్టనమునుగూడా, కృత్తేః + ఇవ = చర్మమువలె, కుర్యాత్ = చేయునో—, యం = ఏ పరమాత్మను, ముముక్షుః = మోక్షకామి, విషయవిధురేణ = విషయములపై ఆసక్తిగొని విసిగిన, మనసా + ఏవ = మనస్సుచేతనే, విద్యాత్ = తెలిసికొనునో, సదా——

## తాత్పర్యం

నిత్యమూ అందరి హృదయాలలో వసిస్తూ వెలిగిస్తూ, ప్రాణప్రదానం చేసే పరమాత్మని సరిగా తెలుసుకోకుండా ఎవరూ ముక్తినిపొందగలమని ఆశించి ప్రయోజనం లేదు. ఎవరన్నా భావిస్తే, విశాలమైన ఆకాశాన్ని చుట్టి పెట్టుకోగల మని ఆశించినట్లే. పరమాత్మను పొందగోరే వారు ధ్యానమగ్నమైన మనస్సుతో శుద్ధమైన బుద్ధిద్వారా ఇంద్రియార్థాలనుండి ఇంద్రియాలను

పూర్తిగా ఉపసంహరించుకోడంవల్లనే దానిని తెలుసుకొని చేరుకోగలరు. ఆ పరమాత్మ మహాదేవుడే. ఓ మనస్సా, సుగంధభరితమైన ఆయన పాదపద్మాల మకరందాన్ని స్మరించి గ్రోలి మత్తెక్కి చరించు!

## వ్యాఖ్య

విశాలాకాశాన్ని తివాచీలాగ మడిచి చుట్టిపెట్టలేరు. పరిమిత విషయాన్ని తెలుసుకునే పద్ధతిలో అనంత పరమాత్మని ఎవరూ ఎరగలేరు. అది అంత రాంతరాలలో అనుభవంగా తెలుసుకోబడవలసిన వస్తువు.

పరబ్రహ్మను అందుకున్నాక శాస్త్రాలని చదివి తెలుసుకోవాలనే ఉత్కంఠ, ప్రేమ దానంతటఅదే పోతుంది. అలాంటి ఆత్మజ్ఞాని బ్రహ్మ నిష్ఠలో ఉండి శాస్త్రవాసనలను విడిచిపెట్టుతాడు. బ్రహ్మబిందూపనిషత్తులోని సారవిషయం ఇది. దీనిని చివరి శ్లోకం వెల్లడిస్తుంది.

శ్లో॥ నిరుద్ధే చిత్తే తు స్ఫురతి పరివిద్యా స్ఫుటమియం
మహామోహధ్వాంతం దళయతి పలాలోపమ మథ।
నిరర్థాన్ గ్రంథౌఘాన్ త్యజతి యదభి జ్ఞప్తి నిరతః
సదా తద్దేవాంఘ్రి స్మరణ మధుమత్తం భవ మనః॥ 25

ప్రతి॥ నిరుద్ధేచిత్ = నిగ్రహింపబడిన మనస్సునందు, ఇయం + పరవిద్యా = ఈ ఆత్మవిద్య, స్ఫుటం = బాగుగా, స్ఫురతి = ప్రకాశించును, అథ = మరియును, పలాల + ఉపమం = మాంససమానమైన, మహామోహ = అజ్ఞానమనెడి, ధ్వాంతం = చీకటిని, దళయతి = చీల్చును, యత్ = ఏ అభిజ్ఞప్తి = తెలిసికొనుటయందు, నిరతః = ఆసక్తుడు, నిరర్థాన్ = నిష్ప్రయోజనములయిన, గ్రంథ + ఓఘాన్ = గ్రంథసముదాయమును, త్యజతి = వదలిపెట్టుచున్నాడో, సదా——

## తాత్పర్యం

విషయ మమకారాలన్నీ తుడిచిపెట్టుకుపోయి, సాధకుని మనస్సులో స్పష్టమైన బ్రహ్మజ్ఞానం ఉదయించినప్పుడు, శుద్ధాత్మను గురించిన అజ్ఞానాంధకారం తొలగిపోతుంది. ఆత్మను గురించిన అవిద్య తొలగినప్పుడు, అజ్ఞాని మనస్సు ఆత్మలో నికరంగా నిలిచిపోతుంది. ఆత్మలోనే నిలిచిన అతడు నిత్యమూ ధ్యాననిరతు డౌతాడు. ఇక శాస్త్రాధ్యయనం చేయవలసిన అగత్యం లేదు. ధాన్యంనుండి బియ్యాన్ని పొందాక పొట్టుని చెరిగివేసినట్లే శాస్త్రాలని విడిచిపుచ్చుతాడు. పరమాత్మ లాభంవల్ల పరిపూర్ణమైన తృప్తిని, చరితార్థతని అనుభవిస్తాడు. ఆ తరువాత అతడు ప్రపంచాన్ని నిషేధించి ఆత్మమహిమలో, ఆత్మానందంలో నిలబడివుంటాడు.

ఆ పరమాత్మే మహాదేవుడు! నా మనస్సు ఆ ప్రభువు పాదపద్మాల మధురస్మరణలో ఉండి ఆనందపుమత్తు ఉత్తేజనాన్ని పొందును గాక!



# షోడశ స్తబకం

ఈస్తబకంలో మొదటి ఇరవై శ్లోకాలు కైవల్యోపనిషత్తులోని భావాలను, చివరి అయిదు శ్లోకాలు పరమహంసోపనిషత్తులోని భావాలను వివరిస్తాయి.

ద్రుతవిలంబితమనే వృత్తంలో మొదటి ఇరవైశ్లోకాలు ఉన్నాయి. చివరి అయిదూ శిఖరిణి అనే వృత్తంలో ఉన్నాయి.

వేదాంతతీర్థ పంచనదీయ హరిద్వారలాల్‌శాస్త్రి వంటి మహాపండితులు సైతం కైవల్యోపనిషత్తుకు చెందిన ఇరవైశ్లోకాలు నిగూఢమైన భక్తితత్పరతతో భక్త్యావేశంతో తొణికిసలాడుతున్నవని ప్రశంసించారు పరమేశ్వరభక్తుల హృదయాలను ఊగించి భక్తి ఆనందాల ఉత్తుంగ శిఖరాగ్రాలకు కొనిపోయే ఆత్మ నివేదనలను వర్ణించారు.

అశ్వలాయనఋషి బ్రహ్మదేవుణ్ణి తనకు బ్రహ్మవిద్యను బోధింపుమని అడిగిన ప్రశ్నతో కైవల్యోపనిషత్తు ప్రారంభ మవుతుంది. సృష్టికర్త బ్రహ్మదేవుడు ఆత్మవిద్యను శ్రద్ధా భక్తి ధ్యానయోగాలద్వారా తెలుసుకోవాలని చెప్పాడు. బ్రహ్మదేవుని ఈ జవాబును మొదటి శ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ యమిహ పశ్యతి చాస్తికతా మతిః
చరణభక్తి రచంచల ధీరపి।
ఇతి గుణత్రయనేత్రయుతః పుమాన్
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 1

ప్రతి॥ ఇహ = ఇక్కడ, అస్తికతామతిః = అస్తికుడు, చరణభక్తిః = దేవుని పాదములందు భక్తిగలవాడు, అచంచలధీః + అపి = నిశ్చలమతియైనను, యం = ఏ పరమాత్మను, గుణత్రయ = త్రిగుణాలనెడు, నేత్ర

యుతః = కన్నులుగల, ప్రమాన్ + ఇతి = పురుషుడుగ, పశ్యతి = చూచుచున్నాడో, సః + సౌమ్యపతిః = ఆ సౌమ్య కాశీపతి, సదా = ఎల్లప్పుడు, హృది = హృదయంలో, ఖేలతు = విహరించుగాక–

## తాత్పర్యం

ఈ ప్రపంచంలో భగవంతునిలో శ్రద్ధవున్న ఆస్తికుడు గురువాక్యాల ద్వారా శాస్త్రాధ్యయనం చేసి దేవునిపట్ల ఎనలేని భక్తితో నిండిన ఏకాగ్రచిత్తంతో ధ్యానించడం ద్వారానే భగవద్దర్శనం చేసుకొని ఆత్మానుభూతిని పొందుతాడు. ఆ పరమాత్మ ఉత్తరకాశీ అధీశుడైన విశ్వనాథుడే. ఆయన నా హృదయంలో సదా క్రీడించును గాక!

## వ్యాఖ్య

తరువాతి శ్లోకం బ్రహ్మదేవుని జావాబు ఉన్న రెండోమంత్రంలోని చివరి భాగాన్ని వివరిస్తుంది. అమృతస్థితి త్యాగంవల్ల, ఆత్మజ్ఞానంవల్లనే పొందగలరు. కర్మద్వారాగాని, సంతానంవల్లకాని, ధనంమూలంగా గాని పొందలేరు.

శ్లో॥ ద్వివిధకర్మచయేన తథాత్మజైః
ధనచయైశ్చ న కశ్చిదాప్నుయాత్।
యదవబోధజ యత్ పదనిర్వృతిం
సహృది ఖేలతు సౌమ్యకాశీపతి స్సదా॥ 2

ప్రతి॥ ద్వివిధ = రెండువిధాలయిన, కర్మచయేన = కర్మసమూహముచే, తథా = అట్లే, ఆత్మజైః = ఆత్మనుండిపుట్టిన కుమారులచేగాని, ధనచయైః = సంపత్తిచేగాని, కః + చిత్ + అపి = ఎవ్వడయినను, పదనిర్వృతిం = ఆత్మానందమును, న + అవాప్నుయాత్ = పొందలేడు, యత్ = ఏఆత్మ అవబోధజయత్ = జ్ఞానముచే జయింపదగినదో, సః——

## తాత్పర్యం

శ్రుతిస్మృతులలో విధింపబడిన పూజలు కర్మలు చేయడంవల్ల కాని, పుత్రపౌత్రుల్ని పొంది వంశాన్ని శాశ్వతంగా నిలబెట్టుకోవడంవల్ల కాని, లౌకిక

ఆధ్యాత్మిక సంపదనుకూడ బెట్టడంవల్లగాని ఎవరూ ఆత్మను తెలుసుకొని అనుభూతిని పొందలేరు. ఆత్మను గురించిన సరైనజ్ఞానంతో వివేకం కలిగి సంపూర్ణత్యాగం చేయడంవల్లనే పరమాత్మను చేరుకొని అమృతత్వాన్ని పొంద వచ్చును. ఆ పరమాత్మ అయిన సౌమ్య కాశీపతి విశ్వనాథుడు నా హృదయంలో క్రీడించును గాక!

## వ్యాఖ్య

జ్ఞానంవల్లనే ఆత్మను గురించిన అజ్ఞానం నశిస్తుంది కాని ఇతర ఉపాయాలవల్ల కాదని పైశ్లోకం వెలిబుచ్చుతుంది.

కైవల్యోపనిషత్తులోని మూడో మంత్రసారాన్ని తరువాతిశ్లోకం చెబు తుంది. సన్న్యాసమే ఆత్మానుభూతికి మార్గం.

శ్లో॥ సకల సంన్యసనం న తతోఽన్యతో
యదనుదర్శన సాధన మిష్యతే।
పరమహంస పదాత్మక మాస్తికైః
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 3

ప్రతి॥ ఆస్తికైః = ఆస్తికులచే, యత్ = ఏ పరమాత్మ, సకలసంన్యసనం = సంపూర్ణసంన్యాసము, అనుదర్శనసాధనం = మోక్షసాధకము, పరమ హంస పదాత్మకం = పరమహంస రూపసంన్యాసముగ—, ఇష్యతే = కోరబడుచున్నది, తతః = అందువలన, అన్యతః = వేరొకవిధముగ, న = కాదు, సః— —

## తాత్పర్యం

ఆధ్యాత్మిక సాధనతో సహా లౌకికాధ్యాత్మిక కర్మల నన్నింటినీ పూర్తిగా త్యజించడమే పరమహంస సన్న్యాసమని బ్రహ్మజిజ్ఞాసువులచే పేర్కొనబడింది.

ప్రసిద్ధమైన ఈ ఉత్తమ సన్న్యాసంవల్లనే ఆత్మదర్శనం పొందడానికి ఆశించవచ్చును. మరే పద్ధతిద్వారాను పొందలేరు. ఆ పరమాత్మ అయిన ఉత్తర కాశీపతి నా హృదయంలో నర్తించును గాక!

## వ్యాఖ్య

మూడో మంత్రంలోని భావం తిరిగి రాబోయే శ్లోకంలోకూడా వివరింపబడింది.

శ్లో॥ యతయ ఏవ యదాత్మసమాధినా
సుఖసరస్వతి మజ్జితు మీశ్వరాః।
గృహపరా న తథా న గృహమేధినః
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 4

ప్రతి॥ యతయః + ఏవ = ఋషులే, యత్ = ఏ ఆత్మను, ఆత్మసమాధినా = నిధిధ్యాసముచే, సుఖసరస్వతి మజ్జితుం = మోక్షలగ్నమందుటకు, ఈశ్వరాః = సమర్థులు, గృహమేధినః = వివాహితులైన, గృహపరాః = కుటుంబీకులై, తథా + న = అట్లు కాలేరు, సః——

## తాత్పర్యం

శుద్ధమైన దీక్షతో సన్యాసాన్ని స్వీకరించినవారు ఏకాగ్రచిత్తంతో భగవద్ధ్యానంలో లీనమైనప్పుడు సర్వాన్ని విస్మరించి ఆనందానుభూతి సాగరంలో నిమజ్జితు లౌతారు. ఆత్మానందంలో మగ్నులై నిత్యమూ ఉండిపోతారు. గృహస్థులీ సన్యాసుల లాగా ఆనందరూపమైన ఆత్మానుభూతిని పొందలేరు. ఎందుకంటే గృహపరులైన గృహస్థులు తమ హక్కులు—బాధ్యతల యోచనలలో మునిగిపోతారు. అందుచేత వాళ్ళల్లో బ్రహ్మజ్ఞానం నిలకడగా ఉండదు. మనస్సుపైన ప్రభావం చూపదు. ఆ పరమాత్మ ఉత్తరకాశీశుడైన విశ్వనాథుడు నా హృదయంలో నర్తించును గాక!

## వ్యాఖ్య

ఆ పరమాత్మ వాక్కుకు, మనస్సుకు, క్రియలకు అందడు. అందుచేత సాధకుడు ముందుదశలో గుణరూపాలతో కూడిన పరమేశ్వరధ్యానం చెయ్యాలి. ఈ విషయాన్ని తరువాతి శ్లోకం చెబుతుంది.

శ్లో॥ విమల చిత్తతను ర్విజనే జనః
శివ మవక్రతనుశ్చ విచింతయేత్।
జితహృషీకగతి ర్యము తస్థివాన్
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 5

ప్రతి॥ విజనే = నిర్జనప్రదేశమున, అవక్రతనుః = నిటారుశరీరముకలవాడై, విమలచిత్తతనుః = ప్రశాంతచిత్తముతోడి శరీరముగల, జిత = జయింపబడిన, హృషీక = ఇంద్రియాల, గతిః = వ్యాపారముకలవాడై, తస్థివాన్ = సుస్థిరుడై, యంశివం + ఉ = ఏ పరమాత్మను, జనః = జనుడు, విచింతయేత్ = ధ్యానించునో, సః——

## తాత్పర్యం

సాధనలో ఆత్మజిజ్ఞాసువు ధ్యానానికి అనువైన శుచిగా ఉండే ఏకాంత ప్రదేశాన్ని ముందు ఏరుకోవాలి శుద్ధమైన మనస్సుతో సుఖాసనంలో కూర్చొని తలని వీపుని సూటిగా నిలబెట్టాలి. ఆ తరువాత ఇంద్రియాలను విషయ వస్తువులనుండి మళ్ళించి పరమశివుని మంగళరూపాన్ని ధ్యానించాలి. ఆ పరమాత్మ ఉత్తరకాశీవిశ్వనాథుడు నా హృదయరంగంపైన నర్తించును గాక!

## వ్యాఖ్య

ఇందులో 4 వ మంత్రం క్లుప్తంగా ఉదహరించబడింది. ఇప్పుడు ధ్యాన నిమిత్తం పరమేశ్వరుని సగుణరూపవర్ణన చేయుబడుతోంది.

శ్లో॥ అసితకంఠ ముమేశ మద్భుతం
ప్రభు మజం త్రిదృశం పరమేశ్వరం।
హృది దధీత తథా యమనన్యధీః
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 6

ప్రతి॥ తథా = అట్లు, అనన్యధీః + అయం = అసామాన్య ప్రజ్ఞకల భక్తుడు, అసితకంఠం = కాలకంఠుని,ఉమా + ఈశం = ఉమాపతిని, అనద్భుతం = తనకంటె అద్భుతంలేనివానిని, ప్రభుం = ఈశ్వరుని, అజం = పుట్టుకలేనివానిని, త్రిదృశం = ముక్కంటిని, అయిన, పరమేశ్వరం = పరమేశ్వరుని, హృది = హృదయమునందు, దధీత = ధరించునో,సః—

## తాత్పర్యం

ఆ ప్రభువు దేవతలకు దేవుడు. పరమేశ్వరుడు. అద్భుతమైన రూపంతో అందంగా ఉన్న నీలకంఠంతో మూడు కళ్ళతో మనోహరమైన ముఖాన్ని కలిగి వుంటాడు. ఆయన పార్వతీమాతకి భర్త. ఆయనకు పుట్టుక లేదు–ఇలా నిరంతరాయంగా ఏకాగ్రమైన ధ్యానం కొనసాగాలి. ఆ పరమాత్మ ఉత్తరకాశీ విశ్వనాథుడు నా హృదయ వేదికపై నర్తించును గాక!

## వ్యాఖ్య

7 వ మంత్రంలో వున్న పరమేశ్వర సగుణోపాసన ఇక్కడ వివరింపబడింది.

సగుణోపాసన ద్వారా అంతర్దృష్టితో సూక్ష్మంగా చరించే మనస్సు భగవద్రూపాన్ని పొందుతుంది. ఆకారంలేని నిర్గుణమైన శుద్ధచైతన్యంలో మనస్సు కరిగిపోయినప్పుడు సాకారధ్యానం పూర్తి అయినట్లు అప్పుడు నిర్గుణ ధ్యానం మొదలు తరువాతి శ్లోకం ఈ విషయాన్ని బోధిస్తుంది.

శ్లో॥ యమనుసందధ దేవ ముమాధవమ్
సుఖచిదాత్మక మాత్మ పదం మునిః।
సకలసాక్షిణ మృచ్ఛతి చిద్ఘనం
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 7

ప్రతి॥ మునిః = సంన్యాసి, యం = ఏ, సుఖచిత్ + ఆత్మకం = ఆనందజ్ఞాన స్వరూపమైన, ఆత్మపదం = పరమాత్మను, అనుసందధత్ = పొంద

గోరును, ఏవం = ఇట్లే, సకలసాక్షిణం = పరమసాక్షియు, చిద్ఘనం = చిద్ఘన స్వరూపుని, ఉమాధవం = పార్వతీపతిని, ఋచ్ఛతి = పొందు చున్నాడో, సః——

తాత్పర్యం

సచ్చిదానంద స్వరూపి అయిన ఉమాపతి శంకరునిపైన సాధకుని ధ్యానం కొనిసాగుతున్నప్పుడు అతడు క్రమంగా, కొద్దికొద్దిగా ఆత్మను దర్శింప సాగుతాడు. ప్రపంచంలో జరిగే అన్ని సంఘటనలకీ ఆత్మ నిత్యసాక్షిగా నిరంతరం వెలుగుతూ, బాహ్యాభ్యంత రానుభవాలని వెలిగించుతూంటుంది. ఆ పరమాత్మ కాశీపతి నా హృదయంలో సదా నర్తించును గాక!

వ్యాఖ్య

సాకారధ్యానం ద్వారా సాధకుడు రూపాతీతమైన అనంతాత్మను చేరుకుంటాడు.

ఆరో మంత్రంలోని భావం పైన వివరించబడింది.

బ్రహ్మ, విష్ణువు మొదలైన అందరిదేవతల సాకారధ్యానం చేసినప్పుడు కూడా నిజానికి మనం శుద్ధాత్మ అయిన పరమేశ్వరుణ్ణే ధ్యానిస్తున్నాము. వేర్వేరు ఆకారాలు, గుణాలు ఉన్న దేవతలమధ్య మనం భేదాలను చూడరాదు. ఉపాసకులలో, సాధకులలో ఉండే తేడాల కారణంగా వారివారి అభిరుచులకి అనుగుణ్యంగా వేర్వేరు నామరూపాలు కల్పించబడినాయి. ఈ నామరూపాలన్నీ ఏకమైన పరమాత్మపైననే అధ్యస్తం చేయబడినాయి. ఈ విషయాన్ని రాబోయే శ్లోకం చెబుతుంది.

**శ్లో॥ కమలజః కమలాపతి రప్యయం**
**పశుపతిః సురతారపతీ చ సః।**
**యమిహ పశ్యతి యో నిజహృత్తటే**
**సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥** 8

ప్రతి॥ కమలజః = బ్రహ్మ, కమలాపతిః + అపి + అయం = విష్ణువునుఇతడే, పశుపతిః + సః = ఈశ్వరుడును అయిన అతడు, సురతారపతీ + చ = ఇంద్రుడు చంద్రుడును, యః = ఎవడు, ఇహ = ఈలోకమునందు, నిజహృత్ + తటీ = తనహృదయతీరమందు, యం = ఏ పరమాత్మను, పశ్యతి = చూచుచున్నాడో, సః——

## తాత్పర్యం

విజ్ఞాని అయిన సాధకుడు తన హృదయంలో ప్రకాశిస్తున్న ఆత్మను సర్వవ్యాప్తమైన పరమాత్మగా తెలుసుకొన్నప్పుడు అయనే బ్రహ్మదేవుడు, ఆయనే విష్ణువు, ఆయనే శివుడు, ఇంద్రుడు, తారపతి అయిన చంద్రుడు కూడా. తనలోని ఆత్మను సర్వవ్యాపిత పరమాత్మగా తెలుసుకొన్న మహా పురుషుడు పరమాత్మయొక్క పరమానుభూతిని పొందుతాడు. ఆ పరమాత్మ ఉత్తరకాశీపతి నా హృదయంలో సదా నర్తించును గాక!

## వ్యాఖ్య

8 వ మంత్రార్థం ఇక్కడ పొందుపరచబడింది. తనలోని ఆత్మయే పరమేశ్వరుడని అనుభూతి చెందని వానికి ముక్తిలేదని రాబోయే శ్లోకం స్పష్టం చేస్తుంది.

శ్లో॥ పురిశయం పురుషం పరమాదరాత్
యమనువీక్ష్య విలంఘయతి క్షణాత్।
జని మృతీ న విముక్తి రితోఽన్యథా
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 9

ప్రతి॥ యం = ఏ, పురిశయం = హృదయపురనివాసియైన, పురుషం = పురుషోత్తముని, పరమ + ఆదరాత్ = ఎక్కువ ఆదరముతో, అనువీక్ష్య = చూచిన, క్షణాత్ = క్షణములోనె, జని + మృతీ = జననమరణా లను, విలంఘయతి = దాటుచున్నాడో—, ఇతః = దీనికంటె, అన్యథా = మరొక విధమైన, విముక్తిః = మోక్షము, న = లేదు, సః——

## తాత్పర్యం

ఆ పరమాత్మ అందరి హృదయాలలో నిరంతరం వసించి వుంటాడు. హృదయాంతరాలలోని సారమైన కేంద్రాన్ని తన శాశ్వతనివాసంగా ఆయన ఏరుకుంటాడు. ముక్తిని కోరే సాధకుడు కేవలం శ్రద్ధాభక్తులతో లోనున్న ఆయనకోసం వెదికితే చాలును. దీక్షతో, భక్తితో వెదికే ఆ సాధకుడికి భగవంతుడు తన్నుతాను స్వయంగా వెల్లడి చేసుకొంటాడు. లోపల భగవంతుని దివ్యదర్శనం అయిన మరుక్షణలో అతడు ఆత్మానుభూతి కారణంగా జనన మరణవలయాన్ని ఛేదించి, తరించి శాశ్వతామృతపదాన్ని పొందుతాడు. ప్రకృతిపొరలనుండి ఈ జన్మలోనే విముక్తిపొందటానికి ఇంతకన్న వేరేమార్గం లేదు ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నా హృదయంలో నర్తించును గాక!

## వ్యాఖ్య

ఈ శ్లోకంలో 9 వ మంత్రభావం ఈ శ్లోకంలో తెలుపబడింది.

చరాచరప్రపంచంలోని జీవుల్లందరూ ఈ అంతరాత్మయొక్క ప్రకట రూపాలే అనే విషయం తరువాతి శ్లోకం తెలుపుతుంది.

శ్లో॥ నిరవశేష మవస్థితమాత్మని
స్వహృదయాంతరిదం హి చరాచరం।
ఇతి నితాంతమతిః పదమేతియత్
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 10

ప్రతి॥ చరాచరం = స్థావరజంగమాత్మకమయిన, ఆత్మనిస్థితం = తన యందున్న, నిరవశేషం = పరిపూర్ణమయినది, స్వహృదయ + అంత + ఇదం = తనహృదయమధ్యమందున్నదియే–ఇది–, ఇతి = అని, నితాంతమతిః = పూర్ణజ్ఞాని, యత్ = ఏ, పదం = పరబ్రహ్మను, ఏతి = పొందుచున్నాడో, సః——

## తాత్పర్యం

చరాచరవస్తువులతో, ప్రాణులతో కూడియున్న ఈ విశాలబ్రహ్మాండం యావత్తు హృదయపద్మ మధ్యం లోపలవున్న అంతరాత్మయే. అందువల్ల బాహ్యప్రపంచం యావత్తు ఈ అంతరాత్మయొక్క ప్రకటస్వరూపమే. అద్వితీయమై బాహ్యాభ్యంతరాలు అంతటా నిండివుండే శుద్ధచైతన్యస్థితిలో నిలబడిన సాధకుడు పరబ్రహ్మను చేరుకుంటాడు. ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నా హృదయంతరాళాలలో సదా క్రీడించును గాక!

## వ్యాఖ్య

కైవల్యోపనిషత్తు 10 వ మంత్రం ఈ శ్లోకంలో పొందుపరచబడింది.

ఆత్మజ్ఞానంవల్లనే ప్రాపంచికబంధనాలు పూర్తిగా దహించుకు పోతాయి. ఈ జ్ఞానాగ్నిని ఎలా వెలిగించాలో తరువాతి శ్లోకం చెబుతుంది.

శ్లో॥ సుధిషణా ప్రణవారణి ఘర్షణాత్
జ్వలిత ఏష దహేజ్జ్వలనో భృశం।
యదవబోధ తనుర్భవబంధనీం
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 11

ప్రతి॥ సుధిషణా = బుద్ధియనెడు, ప్రణవ + అరణి = ప్రణవమనెడి అరణి యొక్క, ఘర్షణాత్ = మథనమువలన, జ్వలితః = మండిన, ఏషః + జ్వలనః = ఈఅగ్గి, భృశం = మిక్కిలి. దహేత్ = కాల్చును, యత్ = ఏ అవబోధ తనుః = అజ్ఞాని, భవబంధనీం = సంసారబంధమును, దహేత్ = దహించునో, సః———

## తాత్పర్యం

శుద్ధబుద్ధిని ఏకాగ్రపరచి పరమాత్మనామమైన ప్రణవ ధ్యానాన్ని చేసినప్పుడు ఆత్మబోధ కలుగుతుంది. ప్రణవ అరణిని మథించడంవల్ల ప్రాపంచికబంధనాలన్నీ కాలిబూడిద అయిపోతాయి. ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నా హృదయంలో నిత్యమూ క్రీడించును గాక!

## వ్యాఖ్య

పైన చెప్పిన ధ్యానాన్ని వేదకాలంలో హోమాలకోసం అగ్నిని రగిల్చే విధానంతో పోల్చారు రెండుకర్రలని నిలబెట్టి రాపిడి పెట్టినప్పుడు నిప్పు రవ్వలు లేచేవి దానిని 'అరణి' అంటారు పైనున్న కర్ర ప్రణవము క్రింద నున్నది సాధకుడు ఇలా జ్ఞానమనే అగ్ని రగుల్కొన్నప్పుడు అజ్ఞానం నాశనమై బంధనాలన్నీ కాలిపోతాయి

ఇందులో 11 వ మంత్రంయొక్క భావం ఉన్నది.

ఆత్మకు దేనితోను సంబంధం లేకపోయినప్పటికీ అది తన మాయవల్లనే వ్యామోహపడి దేహంగా మనస్సుగా, బుద్ధిగా తాదాత్మ్యం పొంది జాగ్రత్స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలలో జీవిస్తూ వేరువేరు సుఖదుఃఖానుభవాలను పొందుతుంది ఈ విషయాన్ని తరువాతి శ్లోకం వెల్లడిస్తుంది

శ్లో॥ స్వయ మసంగచిదుద్య దవిద్యయా
విపరిమూఢ ఇవోఢ కలేవరః।
చలతి యో లలనాదిషు జాగ్రతి
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 12

ప్రతి॥ స్వయం = తాను, పరమాత్మ, అసంగచిత్ = సంగరహితుడైనను, ఉద్యత్ = ఉద్యమించిన, అవిద్యయా = అజ్ఞానముతో, ఊఢకలేవరః = శరీరమునుధరించి, విపరిమూఢః = పరమమూర్ఖుడుగా, ఇవ = వలె, లలనా + అదిషు = స్త్రీలు మొదలగు వానియందు, జాగ్రతి = జాగ్రదవస్థలో, చలతి = ప్రవర్తించును, సః——

## తాత్పర్యం

పరమాత్మ నిత్యమూ అసంగుడు, శుద్ధచైతన్యరూపి అయితే పరిమితమైన వ్యక్తరూపంలో, అనాది అవిద్యాకారణంగా సంపాదించుకొన్న రూపంలో తాదాత్మ్యాన్ని ఉంచుతుంది ఈ అనాది అవిద్య కారణంగా శరీరమనే బుద్ధు

లతో కలిగిన తాదాత్మ్యం 'నేను', 'నాది' అనే భావాలుగా ఏర్పడుతాయి. దాని అహంభావ తాదాత్మ్యం దేహేంద్రియాలతో ఉన్నప్పుడు అది జాగ్రదవస్థలో స్త్రీ, అన్నం, పానం మొదలైన విషయాలని భోగిస్తుంది. ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నా హృదయంలో సదా తన దివ్యలీలలతో క్రీడించును గాక!

## వ్యాఖ్య

12 వ మంత్రభావం ఈ శ్లోకంలో ఉన్నది తరువాతిశ్లోకంలో స్వప్నావస్థ వర్ణించబడింది.

శ్లో॥ అథ చ యః కరణోపరమే స్వయం
సృజతి వాసనయా సకలం జగత్।
అథ నిమజ్జతి గాఢతమః ప్రహౌ
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 13

ప్రతి॥ అథ = తర్వాత, యః = ఎవడు, కరణ + ఉపరమే = సాధనము, ఉపసంహరింపబడగ, స్వయం = స్వయముగా, వాసనయా = వాసనాబలముచే, సకలం = సమస్త, జగత్ = జగత్తును, సృజతి = సృష్టించుచున్నాడు, అథ = ఇంకను, గాఢతమః = అజ్ఞానియై, ప్రహౌ = బావియందు, నిమజ్జతి = మునుగుచున్నాడు, సః———

## తాత్పర్యం

పరిమిత జీవరూపంలో వ్యక్తమైన పరమాత్మ స్థూలదేహేంద్రియాల నుండి వెనక్కి మళ్ళినప్పుడు సూక్ష్మరూపాన్ని ధరించి అవ్యక్తవాసనలద్వారా కలప్రపంచాన్ని సృజించుతుంది.

స్వాప్నికుడిగా కల అనుభవాన్ని పొందాక గాఢనిద్రలోకి మునిగి కారణ శరీరాన్ని ధరించి అవిద్యావసనంతో తన్ను తాను కప్పుకొంటుంది. ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నా హృదయంలో సదా క్రీడించును గాక!

## వ్యాఖ్య

13 వ మంత్రంలోని భావం ఈ శ్లోకంలో వచ్చేసింది. గాఢనిద్రాస్థితిని తరువాతి శ్లోకం వర్ణించుతుంది.

శ్లో॥ నిరుపమే నిజధామ్ని నిరంకుశే
సుఖఘనేఽస్త సమస్తభిదేహి యః।
స్వయమిహ స్వమహిమ్ని విరాజతే
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 14

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, స్వయం = తానుగా, ఇహ = ఇచ్చట, నిరుపమే = ఉపమింపబడరాని, నిజధామ్ని = తనస్థానమున, నిరంకుశే = ఎదురులేని. అస్త = నశించిన, సమస్త = సకలమయిన, భిదే = భేద భావాలు గల, సుఖఘనే = సుఖఘనమునయిన, స్వమహిమ్ని = తన మహిమయందు, విరాజతే = ప్రకాశించుచున్నాడు, సః——

## తాత్పర్యం

గాఢనిద్రాస్థితిలో జీవాత్మ తన సహజస్థితికి, ఎనలేని నిరుపమ అనంతాద్వితీయ ఘనసుఖస్వరూపాన్ని చేరుకుంటుంది. ఇక్కడ స్వమహిమలో తాను వెలుగుతూంటుంది. సౌమ్య కాశీపతి అయిన పరమాత్మ నా హృదయ వేదికపైన సదా నర్తించును గాక!

## వ్యాఖ్య

13 వ మంత్రంలోని భావం ఇందులో కూడా వివరింపబడింది.

కారణశరీరంలో గాఢనిద్రలో విశ్రమించే ఆత్మ కర్మవాసనల ననుసరించి తిరిగి జాగ్రత్స్వప్న స్థితులకి రావాలనే విషయం తరువాతి శ్లోకం చెబుతుంది.

శ్లో॥ స్వకృతకర్మ నియంత్రిత ఏవ యః
స్వభవనాద్ధి వినిష్క్రమతే బహిః।
వ్యవహర త్యథ పూరుషభావభృత్
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 15

ప్రతి॥ యః = ఎవడు, స్వకృత = తానుచేసిన, కర్మ = పనులచే, నియంత్రిత = నియమింపబడిన, స్వభవనాత్ + హి = తన స్థానమునుండియే, బహిః = వెలుపలికి, వినిష్క్రమతే = వెడలుచున్నాడు, అథ = మరియు పూరుషభావభృత్ = పురుషోత్తమరూపధారియై, వ్యవహరతి = వ్యవహరించుచున్నాడు, సః——

## తాత్పర్యం

పరిమిత జీవభావాన్ని పొందిన ఆత్మ గాఢనిద్రలోని సహజ శుద్ధానందాద్వయ స్థితినుండి జీవభావంతో ఉన్న తాదాత్మ్యం కారణంగా స్వస్వరూపాన్ని ఎరగక మోహవశంలో ఉన్నంతకాలం కర్మవాసనల ప్రాబల్యంవల్ల జాగ్రదనుభవాలకి తిరిగి రావలసివస్తుంది. జీవితంలో ఎన్నోరకాల అహంపూరితానుభవాలను పొందుతుంది. తాను ప్రారంభించే అన్ని కర్మలలోను కర్తృత్వభోక్తృత్వాలను స్వీకరిస్తుంది. ఆ పరమాత్మ సౌమ్య కాశీశ్వరుడే. ఆయన సదా నా హృదయవేదికపైన నర్తించును గాక!

## వ్యాఖ్య

14 వ మంత్రభావం కొంతవరకు పైశ్లోకంలో ఉన్నది. రెండోభాగం తరువాతి శ్లోకంలో వస్తుంది.

తన నిజస్వరూపాన్ని పూర్తిగా గుర్తెరిగే వరకూ ఈ మూడులోకాలలో తిరిగి తిరిగి ప్రయాణించక తప్పదు.

శ్లో॥ త్రిషు పురే ష్వయమేవ మనారతం
చరతి యః పురుధా చరయన్ స్వయమ్।
భువనమేత దశేష మవిద్యయా
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 16

ప్రతి॥ యః = ఏ పరాత్మ, పురుధా = ముందుగా, స్వయం = తాను, త్రిషు + పురేషు = మూడులోకములందు, అనారతః = ఎల్లప్పుడును, ఏవం =

ఇట్లు, చరతి = తిరుగుచూ, అవిద్యయా = అజ్ఞానముచే, అశేషం = పూర్తిగా, ఏతత్ = ఈ, భువనం = లోకమును, చరయన్ = నడిపించునో, సః ———

## తాత్పర్యం

జీవాత్మగా పరిమితులకు లోనైన ఆత్మ తన స్వస్వరూపాన్ని అపార్థం చేసుకొని స్వర్గాన్ని, దేవతలను, పంచమహాభూతాలను, మనుష్యులను, జంతువులు మొదలైన నామరూపాలను సృజించి, అంతులేకుండా లక్ష్యం లేకుండా ఈమూడు అవస్థలలోను స్థూలసూక్ష్మ కారణ శరీరాలను ధరించి తిరుగాడుతూంటుంది. ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నా హృదయకర్ణికపైన నృత్యమాడును గాక!

## వ్యాఖ్య

14 వ మంత్రంయొక్క భావం ఇందులో కూడా చెప్పబడింది.

ఆత్మజ్ఞానం పొందినప్పుడు ఈ మూడు అవస్థలు, శరీరాలు ఆత్మలో అదృశ్యమైపోతాయి. ఈ విషయాన్ని తరువాతి శ్లోకం చెబుతుంది.

**శ్లో॥ ఇద మఖండచితి ప్రవిలీయతే**
**సుఖసరస్వతి యత్ర పురత్రయమ్।**
**ఉరగరజ్జునిభే చ నిజాత్మని**
**సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 17**

ప్రతి॥ యత్ర = ఎక్కడయితే, అఖండచితి = అఖండజ్ఞానము, సుఖసరస్వతి = ఆనందము, ఉరగరజ్జునిభే = సర్పరజ్జు న్యాయమైన, నిజ + ఆత్మని = తన ఆత్మయందు, ఇదం = ఈ, పురత్రయం = ముల్లోకాలు ప్రవిలీయతే = విలీనమగునో, ———

## తాత్పర్యం

సర్పదృశ్యం రజ్జువులో కలిసిపోయినట్లే జీవుడు సుఖాల నన్వేషిస్తూ తిరిగే ఈమూడు పురాలు అఖండ చైతన్యరూపమైన ఆత్మలో కలిసిపోతాయి. ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నా హృదయంలో ఖేలనం చేయును గాక!

## వ్యాఖ్య

జీవుడు పరిభ్రమించే మూడు అవస్థలను మూడు పురాలతో పోల్చారు. ఆత్మదర్శనమై నప్పుడు ఈ మూడూ ఆత్మలో కలిసిపోతాయి.

ఆత్మయొక్క నిజస్వభావాన్ని రాబోయే శ్లోకం తెలియజేస్తుంది.

శ్లో॥ అమృత మాయతనం జగతో బృహత్
తనుతమం చ సదోంచతి వస్తు యత్।
పురుష ఏష తదేవ చిరంతనం
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 18

ప్రతి॥ అమృతం = అమృతరూపము, ఆయతనం = విశాలము, జగతః = జగత్తుకంటె, బృహత్ = పెద్దది, తనుతమం + చ = అణుస్వరూప మయినది, సదా = ఎల్లపుడు, అంచతివస్తు = పూజ్యరూపము–, ఏషః + పురుషః = ఇతడే పురుషుడు, తత్ + ఏవ + అదియే, చిరంతనం = అనాది, శాశ్వతము, సః——

## తాత్పర్యం

పరమాత్మ అమృతుడు. యావత్ప్రపంచానికి ఏక ఆధారం. ఆయన పెద్దదానికన్న పెద్ద, చిన్నదానికన్న చిన్న ఆయన సనాతనుడు, అనాది, శాశ్వతుడు ఓంకారరూపి, చైతన్యరూపి. ఆ అనంత పరమాత్మ స్వస్వరూపాన్ని మరచి జీవాత్మభావాన్ని పట్టినట్లు జరిపిస్తాడు. నిజానికి ఆయన ఎప్పుడూ పరమాత్మయే ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నా హృదయరంగంలో సదా రమించును గాక!

## వ్యాఖ్య

ప్రతివానిలోని ఆత్మ అయిన పరమాత్మ వర్ణన తరువాత శ్లోకంలోకూడా ఇవ్వబడుతోంది. ఆయన అసంగుడనే మాట ఒత్తి చెప్పబడుతుంది

శ్లో॥ శ్రవణ దర్శన కృత స్స్వయ మద్వయః
శ్రవణ దృగ్రహితోఽపి మహాద్భుతమ్।
చరణకృచ్చరణం చ వినైవ యః
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 19

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, స్వయం = స్వయముగ, అద్వయః = ద్వంద్వ రహితుడు, శ్రవణదర్శనకృత్ = వినును, చూచును, శ్రవణదృక్ + రహితః + అపి = చెవులు, కన్నులు లేనివాడయినను, మహద్భుతం = ఆశ్చర్యము, చరణం = పాదాలు, వినా + ఏవ = లేకనే, చరణకృత్ + చ = పాదాలున్నవాడే, సః——

## తాత్పర్యం

ఆ పరమాత్మ అద్వితీయబ్రహ్మము. రెండోది లేక కేవలం తనకు తానుగా ఉంటుంది. ఇంద్రియాలు లేకనే వింటుంది, చూస్తుంది, అన్ని పనులూ చేస్తుంది దానికి కాళ్లు చేతులు లేవు అయినా అది అంతటా చరిస్తుంది. సర్వవ్యాపి. దాని మహిమ అద్భుతం, విచిత్రం! ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నాహృదయంలో తన దివ్యలీలలను సదా ప్రదర్శించును గాక!

## వ్యాఖ్య

అది పాపపుణ్యాలకు అతీతం కాబట్టి అవి దానిని ఏమీ చెయ్యలేవు— ఈ విషయాన్ని తరువాత శ్లోకం చెబుతుంది.

శ్లో॥ స్పృశతి నో సుకృతం న చ దుష్కృతం
యమథ యస్య న ధీ వపురింద్రియమ్।
జని మృతీ చ న భూప్రభృతీ న్యపి
సహృది ఖేలతు సౌమ్యపతి స్సదా॥ 20

ప్రతి॥ అథ = మరియు, యః = ఏ పరమాత్మను, సుకృతం = పుణ్యము, న + స్పృశతి = తాకదు. దుష్కృతం + చ = పాపముకూడ–న–, ధీవపుః + ఇంద్రియమ్ = బుద్ధి, శరీరము, ఇంద్రియములును,–న–, జనిమృతీ + చ = జననమరణములును,–న–, భూ + ప్రభృతీని + అపి = భూమి మొదలగునవియును–, న స్పృశతి = తాకవు–, సః———

## తాత్పర్యం

పరమాత్మకు దేనితోను సంగం లేదు పుణ్యపాపాలు దానిని తాకవు. రెంటికీ అది అతీతం. పరిమిత పరికరాలైన ఇంద్రియ శరీరమనోబుద్ధులు దానికి లేవు. అది పుట్టదు, చావదు. పంచమహాభూతాలకు దానితో ఏ సంబంధమూ లేదు. అది అన్నింటినీ అధిగమిస్తుంది. అది తన స్వయంప్రకాశ మహిమతో వెలుగుతుంది అది నిత్యశుద్ధం ముక్తం, చిదాత్మ శాశ్వతమైంది. ఆ పరమాత్మ సౌమ్య కాశీపతి నా హృదయంలో సదా రమించును గాక!

## వ్యాఖ్య

కైవల్యోపనిషత్తులో మిగిలిన భావాలన్నీ పైనాలుగు శ్లోకాలలో శ్రీ గురుదేవులచేత వివరింపబడినాయి. కైవల్యోపనిషత్తు సారం ఇక్కడితో పూర్తి అయింది.

రాబోయే అయిదు శ్లోకాలలో పరమహంసోపనిషత్తు సారం ఉన్నది. పరమహంస అయిన సన్యాసి లక్షణాలు, ధర్మాలు ఎంతో మనోహరంగా వర్ణింపబడినాయి. ఈ ఉపనిషత్తు చాలాచిన్నది. ఇందులో ఖండాలు, మంత్రాలు అంటూ లేవు. ఉపదేశరూపంలో ఉన్న దానిని శిఖరిణి వృత్తంలో గురుదేవులు రచించారు.

చిన్నదైనా అతి ప్రభావవంతమైన ఈ ఉపనిషత్తు గురు శిష్య సంవాదం. బ్రహ్మదేవుడు గురువు, నారదుడు శిష్యుడు. పరమహంసల మార్గమేది, ధర్మమేది అని నారదుడు ప్రశ్నించాడు. బ్రహ్మదేవుని సమాధానమే మిగిలిన ఉపనిషత్తు. ఉపదేశం నాలుగు భాగాలుగా ఉన్నది.

ఎవరిమనస్సులు నిత్యసత్యమైన బ్రహ్మములో నిరంతరం దృఢంగా నిలిచి నామరూప ప్రపంచాన్ని మిథ్యగా త్రోసివేశాయో, ఎవరు కేవలం కౌపీన ధారులై నిత్యమూ అరణ్యాలలో సంచరిస్తూంటారో వారు పరమహంసలు. వారినే ఈ క్రింద వర్ణిస్తున్నారు.

శ్లో॥ నిరాతంకే యస్మిన్ నిరుపచరితబ్రహ్మణి సదా
మనోలీనం యస్య త్యజతి స సుతాన్ దారసుహృదః।
అథైకం కౌపీనం విహరతి గృహీత్వా విగతభీః
స శంభుః స్వారాజ్యే దిశతు వసతిం సౌమ్యనిలయః॥ 21

ప్రతి॥ నిరాతంకే = ఆటంకములేని, యస్మిన్ = ఏ, నిరుపచరిత = సాటిలేని, బ్రహ్మణి = పరబ్రహ్మమందు, సదా = ఎల్లపుడు, యస్యమనః = ఎవని మనస్సు, లీనం = నిమగ్నమైయుండునో, సః = అతడు, సుతాన్ = పుత్రులను, దారసుహృదః = భార్యామిత్రులను, త్యజతి = విడిచిపెట్టు చున్నాడు, అథ = మరియు, ఏకం + కౌపీనం గృహీత్వా = కేవలం కౌపీనం ధరించి, విగతభీః = భయరహితుడై, విహరతి = విహరించును, సౌమ్యనిలయః + సః + శంభుః = సౌమ్య కాశీశుడు, స్వారాజ్యే = ఆత్మరాజ్యమందు, వసతిం + దిశతు = దిక్కగు గాక!

## తాత్పర్యం

నిత్యానందము అనంతము అయిన పరమాత్మలో ఎవరిమనస్సు నిరంతరం రమించుతూ సతిసుతుల్ని, బంధువుల్ని ప్రాపంచిక మమకారాలను పూర్తిగా వదిలేసి వుంటుందో ఆయన నిర్భయుడై కేవల కౌపీనధారియై విహరిస్తాడు. ఆ పరమాత్మయే ఉత్తర కాశీనాథుడు. ఆ అనంతపరమాత్మ నన్ను బ్రహ్మనిష్ఠనుండి చలించకుండా ఆశీర్వదించును గాక!

## వ్యాఖ్య

బ్రహ్మదేవుడు పరమహంస యోగులు చాలా అరుదుగా ఉంటారని అన్నాడు పరమహంస ప్రాపంచిక మమకారాలనే కాక ఆధ్యాత్మిక సాధనను కూడా మానివేస్తాడు. కౌపీనాన్ని దేహరక్షణకోసం, సమాజంకోసం ధరిస్తాడు.

వివేకంతో అన్ని బంధనాలను త్యజించుతాడు ఆయనకు కర్తవ్యాలు లేవు. చరితార్థత నొందినందున స్వేచ్ఛగా నడయాడుతాడు ఆయనను అరికట్టే బంధనాలు లేవు నిత్యముక్తుడు.

తనలో తాను రమించుతూ ఆయన తనతో తాను క్రీడించుతూంటాడు. ఆయనకు శీతోష్ణాల బాధలు పట్టవు. ప్రాపంచికానుభవాలు ఆయనను ఏమీ చెయ్యవు. ఈ విషయాన్ని రాబోయే శ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ న శీతం నాప్యుష్ణం న సుఖ మసుఖన్నాపి నిధనం
న మానామానౌ శుక్ క్షుదపి న పిపాసా న విషయాః।
యదాత్మక్రీడైకప్రవణ ధిషణస్యాస్తి విదుషః
స శంభుః స్వారాజ్యే దిశతు వసతిం సౌమ్యనిలయః॥ 22

ప్రతి॥ యత్ = ఏ, ఆత్మక్రీడా + ఏక = ఆత్మానందమందే, ప్రవణ + ధిషణస్య = నిమగ్నబుద్ధిగల, విదుషః = పండితునికి, శీతం = శీతలము న = లేదో, ఉష్ణం + అపి = వేడికూడా,–న, నిధనం + అపి = చావు కూడ–న, మాన + అమానౌ = మానావమానాలు–న. శుక్ = దుఃఖము, క్షుత్ + అపి = ఆకలికూడ, పిపాసా = దప్పిక,–న, విషయాః = విషయ సుఖాలు–, న = లేవు, సః———

## తాత్పర్యం

పరమహంసయోగి తన ఆనందాత్మలో రమించుతూంటాడు. శీతోష్ణాల వల్ల చలించడు సుఖదుఃఖాలు అతణ్ణి ఏమీ చెయ్యవు. ఆయనకి చావు లేదు, చావు భయం లేదు మానావమానాలు అతణ్ణి ఇసుమంతైనా కదిలించవు. ఆత్మక్రీడలో నిరంతరం నిమగ్నుడై ఉండే అతడు దుఃఖం, క్షుత్పిపాసలు, విషయాలు–అన్నింటి పట్ల పరమ నిర్లిప్తతతో ఉంటాడు. ఆ పరమాత్మయే విశ్వనాథప్రభువు. ఆయన బ్రహ్మనిష్ఠనుండి చలింపకుండా నన్ను ఆశీర్వదించును గాక!

## వ్యాఖ్య

ఈ సందర్భంలో బ్రహ్మదేవుడు పరమహంసయోగి దండాన్ని ధరించడని పిలక–యజ్ఞోపవీతము–వస్త్రము కూడా ధరించడనీ చెప్పాడు. ఆయన శరీర మనోబుద్ధులకి సంబంధించిన మిథ్యాజ్ఞానాన్ని, అజ్ఞానాన్ని త్యజిస్తాడు. శాశ్వతమైన బ్రహ్మన్ని ఎరిగి తానే బ్రహ్మమనే నిత్యజ్ఞానంతో ఉంటాడు. 'నిత్యము, శాంతము. అచలము, నిష్కలము అయిన చిదానందరస స్వరూపిని నేను అదే నా స్వభావం' అని ఎరిగి వుంటాడు. అదే ఆయన శిఖ. అదే ఆయన యజ్ఞోపవీతం. జీవాత్మపరమాత్మల కలయికే ఆయన సంధ్యావందనం.

ఈ వర్ణనని శ్రీ గురుదేవులు తరువాతి శ్లోకంలో కొనసాగిస్తున్నారు.

శ్లో॥ న దంభో దర్పోఽహంకృతి రథ న నిందా న స్తుతి రపి
న కామః క్రోధో వా కుణపమివ గర్హ్యం స్వకవపుః।
న శౌద్ర్యం చ వైప్ర్యం యత్ పరపరమహంసస్య విదుషః
స శంభుః స్వారాజ్యే దిశతు వసతిం సౌమ్యనిలయః॥ 23

ప్రతి॥ యత్ = ఏ, పరపరమహంసస్య విదుషః = శ్రేష్ఠతముడైన పరమహంస స్వరూపుడైన సర్వజ్ఞునికి, దంభః = దార్ఢ్యము, న = లేదు, అథ = మరియు, దర్పః + అహంకారము = గర్వము, అహంకారము – న, నిందాస్తుతిః + అపి = నిందాస్తుతులు – న. కామః + క్రోధః + వా = కామక్రోధాలు, – న, స్వక + వపుః = తనశరీరాన్ని, కుణపమ్ + ఇవ = శవమును వలె, గర్హ్యం = హేయమయినదిగా (భావించును) శౌద్ర్యం = శూద్రత్వము, న = లేదు, వైప్ర్యం = విప్రత్వమును–న,సః-

## తాత్పర్యం

బ్రాహ్మస్థితిలో నిత్యము నిశ్చలుడై నిలిచియున్న పరమహంస యోగిలో లేశమైనా దంభదర్పాహంకారాలు, నిందాస్తుతులు, కామక్రోధాదులు ఉండవు తన శరీరాన్ని శవంగా భావించి అసహ్యించుకుంటాడు. అతడి దృష్టిలో బ్రహ్మ శూద్ర జాతులంటూ ఉండవు నిత్యమూ తన నిస్సంగమహిమలో

ప్రకాశిస్తూంటాడు. ఆ పరమహంస పరమాత్మయే! ఆయనే సౌమ్య కాశీ విశ్వనాథుడు! ఆయన నన్ను బ్రాహ్మీస్ఫురణతో నిత్యమూ అనుగ్రహించును గాక!

వ్యాఖ్య

రాబోయే శ్లోకంలో కేవలం దండం ధరించడంవల్ల దండిసన్యాసి కారని చెబుతున్నారు.

శ్లో॥ న దండీ యః కాష్ఠగ్రహణపటు రజ్ఞాన జటిలః
న దండీ హృద్దండాన్ సుదృఢషడరీన్ యో దమయతి।
ధృతో యద్బ్రహ్మణ్య వ్యభిచరిత నిష్ఠైకలగుడః
స శంభుః స్వారాజ్యే దిశతు వసతీం సౌమ్యనిలయః॥ 24

ప్రతి॥ యః = ఎవడు, కాష్ఠగ్రహణపటుః = దండమును ధరించుశక్తిగలవాడు అజ్ఞాన = అజ్ఞానముగల, జటిలః = జడధారి, దండీ + న = దండికాడు, యః = ఎవడు, ఉద్దండాన్ = విజృంభించిన, సుదృఢ = పటిష్ఠములైన, షట్ + అరీన్ = అరిషడ్వర్గమును, దమయతి = నిగ్రహించునో, సః + దండి = అతడేదండి, యత్ + బ్రహ్మణి = ఏ పరమాత్మయందు, అవ్యభిచరిత = చలించని, నిష్ఠా + ఏక + లగుడః + ధృతః = నిష్ఠ అనే దండమునే ధరించినవాడో, సః——

**తాత్పర్యం**

అజ్ఞానంలో మునిగివుండి కేవలం కర్ర పట్టుకోడంలో మాత్రం కుశలుడైనవాడు దండికాడు. శుద్ధచైతన్య బ్రహ్మస్వరూపంలో స్థిరంగా నిలిచి హృదయాన్ని దృఢంగా పట్టుకు పీడించే కామక్రోధాది అరుశత్రువుల్ని అణచి వేసినవాడే దండి వ్యభిచరించని నిష్ఠతో పరమాత్మను గురించి ఏకాగ్రచిత్తంతో ధ్యానించేవాడే నిజమైన దండిసన్యాసి. ఆ దండి సన్యాసియే పరమాత్మ. ఉత్తరకాశీవిశ్వనాథు డాయనే. ఆ అనంతపరమాత్మ నాకు బ్రాహ్మీ చైతన్య నిష్ఠను ప్రసాదించును గాక!

## వ్యాఖ్య

అవిచ్ఛిన్న తైలధారవలె పరమాత్మధ్యానాన్ని నిరంతరాయంగా కొనసాగించే వారే దండిస్వాములు. అజ్ఞానంలో మునిగి కర్రను పట్టుకునేవాడు సన్యాసివేషధారి మాత్రమే. కర్ర = దండం కేవలం బాహ్యమైన సంకేతం. జిజ్ఞాసువుల్ని పట్టి పీడించే ఆరు శత్రువులకు లొంగకపోవడమే దండానికి సంకేతం. వీటిని వదలకుండా చేత్తో దండం పట్టుకున్నవానిని దండిస్వామి అనరాదు. అలా కేవలం కాష్ఠం పట్టుకున్నవాడు మిథ్యాచారి. ఆరు శత్రువుల్ని జయించి నిరంతరం బ్రహ్మధ్యానంలో ఉన్నవాడు. దండం లేకపోయినా దండిస్వామియే.

పరమహంస సన్యాసియొక్క నిజస్వభావాన్ని వర్ణించే శ్లోకంతో ఈ స్తబకం ముగింపుకి వస్తోంది.

శ్లో॥ అనిష్ఠో యన్నిష్ఠః స్థిరమతి రనంతో దవసితః
హిరణ్యే చాతృష్ణో రుచిరవిషయే ష్వాత్మధనికః
వరేణ్యో యో భిక్షు స్సతు జయతి నాన్యేఽఘనిధయః
స శంభుః స్వారాజ్యే దిశతు వసతిం సౌమ్యనిలయః॥ 25

ప్రతి॥ యః = ఏ పరమాత్మ, అనిష్ఠః = స్థానములేనివాడు, యత్ + నిష్ఠః = ఏ పరమాత్మయందు ఉండువాడో, స్థిరమతిః = స్థిరచిత్తుడో, అనంత + ఉత్ + అవసితః = అనంతాకాశమునందు నివసించువాడు, హిరణ్యే = సంపదయందు, అతృష్ణః + చ = ఆశలేనివాడు, అవిషయేషు + రుచిః విషయవాంఛలు లేనివాడు, ఆత్మ = ఆత్మనే, ధనికః = ధనముగా కలవాడు, వరేణ్యః + భిక్షుః = పరమహంస–అయిన, సః + తు = అతడే–, జయతి = జయించుచున్నాడు, అఘనిధయః = పాపరాసులయిన, అన్యే = ఇతరులు, న (జయంతి) = కృతార్థులుకారు———

## తాత్పర్యం

పరమాత్మయొక్క శుద్ధచైతన్యంలో స్థిరంగా నిలచి వున్నవాడే పరమహంసయోగి. ఆయనకు ఎక్కడా స్థిరవాసం అంటూ ఉండదు. యావత్ప్రపం

చమూ ఆయన వాసస్థానమే. ఆయన బుద్ధి చలించదు. స్వర్గంపట్ల, విషయ భోగాలపట్ల ఆయనకు ఎలాంటి ఆకర్షణగాని, కోరికగాని ఉండదు. సాధనద్వారా సంపాదించిన ఆత్మధనమే ఆయన ధనం. ఆయనే జీవన్ముక్తుడు. ఆయనే పరమహంస. యోగియొక్క ఉత్తమపదాన్ని పొందినవాడు! ఆ పరమహంస సన్యాసియే పరమాత్మ. ఉత్తరకాశీశుడు. ఆ కరుణామూర్తి నన్ను నిత్యము బ్రహ్మచైతన్య నిష్ఠలో స్థిరంగా ఉండేట్లు అనుగ్రహించును గాక!

## వ్యాఖ్య

పై లక్షణా లేవీ లేక దండధారులై సంచరించే వాళ్లు మోసగాళ్లు. తమ్ము తామే వంచించుకొంటూ అమాయకులైన ఇతరులను కూడా మోసగిస్తారు. వాళ్ళ దండప్రదర్శనం ఆధ్యాత్మికదర్పమే. అంధభక్తుల్ని, అమాయక సాధువుల్ని మోసగించడానికే పనికివస్తుంది. వాళ్ళు తమ్ము తాము మోసగించు కోటమే కాక పాపాలను కూడా మూటకట్టుకొంటారు. తత్కారణంగా వాళ్ళు రౌరవం వంటి నరకాలలో బాధపడవలసి వస్తుంది.



# సప్తదశ స్తబకం

ఈ స్తబకంలో మైత్రేయి, తేజోబిందూపనిషత్తుల సారం వేరువేరు వృత్తాలలో పొందుపరచబడి వున్నది. ఈ శ్లోకాలన్నీ సూటిగా విషయాన్ని చెబుతూ నిండుభక్తితో తొణికిసలాడుతూ ఉత్తమసాహిత్యంగా అలరారుతున్నాయి. మొదటి పందొమ్మిది శ్లోకాలు మైత్రేయి ఉపనిషత్తుకు చివరి ఆరు శ్లోకాలు తేజోబిందూపనిషత్తుకు చెందినవి.

రాజాబృహద్రథుడు తీవ్రమైన తపస్సు చేసి తన అంతఃకరణాలను విశుద్ధపరచుకొన్నాడు. వేదవిదుడైన శాకాయన్యఋషిని సమీపించి తన సంశయనివారణార్థం చాలాప్రశ్నలు వేశాడు. ఆప్రశ్నలు మొదటి మూడు శ్లోకాలలో ఉన్నాయి.

శ్లో॥ శిఖరీ ప్రపతత్య థోదధిః
పరిశుష్య త్యవని ర్నిమజ్జతి।
కిమిహాస్తి భవేఽభవం భవం
శరణం యామి శివం శివాధవమ్॥ 1

ప్రతి॥ శిఖరీ = కొండ, ప్రపతతి = పడిపోవును, అథ = మరియు, ఉదధిః = సముద్రము, పరిశుష్యతి = ఇంకిపోవును, అవనిః = భూమి, నిమజ్జతి = మునిగిపోవును, ఇహ = ఇక్కడ, భవే = శివునిలో, అభవం = పుట్టనిది, కిమ్ + అస్తి = ఏమున్నది, భవం = భవుడును, శివాధవం = పార్వతీపతి అయిన, శివం = శవుని, శరణం = శరణమును, యామి = పొందుము.

## తాత్పర్యం

అతిపెద్దవి, ఎత్తైనవికూడా పర్వతాలు ఒకరోజు పగిలి నుసి కావచ్చును. అంతులేని సముద్రం ఏనాడైనా ఎండిపోవచ్చును. కాలవశాత్తు భూమి గతితప్పి

ఆకాశంలో అదృశ్యమై పోవచ్చును. నిత్యమూ మారిపోయే నామరూపాలతో కూడిన క్షరప్రపంచంలో మార్పులకు అతీతమైనది నిత్యంగా శాశ్వతంగా ఉండేది ఏది? అనిత్యశాశ్వత మంగళరూపుడు పార్వతీపతియే! ఆ పరమశివుని శరణు వేడెదము గాక!

వ్యాఖ్య

ఈశ్లోకం వైతాలీయ వృత్తంలో ఉన్నది. ప్రపంచంలో సర్వమూ మారుతోంది. మారడం అనేది ఈ జగత్తులో మారని శాసనం! పర్వతశ్రేణులు, సముద్రం, భూమి కూడా ఈ నియమానికి లోబడినవే. అందుకే రాజాబృహద్రథుడికి ఒక ఆశంక కలిగింది. మార్పుచెందే ఈ ప్రపంచానుభవాలను పొందడం వల్ల ప్రయోజనం ఏమైనా ఉన్నదా? ఇది ఆయన మొదటిప్రశ్న.

దానికి సమాధానం శ్లోకంలోని చివరిపాదం ఇస్తుంది. జననమరణాలు లేని పరమశివుడు, పార్వతీధవుడు ఈ జగత్తు ఉదయించి, నిలిచి, అంతరించడానికి ఏకాధిష్ఠానం ఈ జననమరణాల బాధను వదిలించుకోడానికి ఆయన శరణు పొందుదాము.

మృత్యు సంసార రూపమైన ఈ భయంకర ప్రపంచంలో మానవులు విషయాకర్షణలకు అశాంతిగా ఉండి కప్పదాట్లు వేస్తున్నారు ఇందులోంచి బయట పడడానికి భగవంతుని వెదకొని ఆయనకు సర్వసమర్పణం చేసుకోవడం ఒక్కటే తేలికమార్గం. ఈ సంగతిని రాబోయే శ్లోకం చెబుతుంది.

శ్లో॥ అరమంధ తమః ప్రహౌ నరః
ప్లవవ ద్ఘోరభవే విఘూర్ణతి।
గతి రత్ర భవ త్పదాంబుజే
రతి రేవోత్తరకాశికేశ్వర॥ 2

ప్రతి॥ అరమంధతమఃప్రహౌ = లోతైన, ఎండిపోయిన చీకటిబావిలో, ప్లవవత్ = కప్పవలె, నరః = నరుడు, ఘోరభవే = భయంకరసంసారమున,

విఘూర్ణతి = కొట్టుమిట్టాడుచున్నాడు, ఉత్తరకాశికా + ఈశ్వర = ఉత్తర కాశీపతీ! భవత్ = నీ, పద + అంబుజే = పాదపద్మాలపై—. రతిః + ఏవ = భక్తియే, అత్ర = ఇచ్చట, గతిః = శరణము—

## తాత్పర్యం

ఎండిపోయిన లోతునూతిలో పడ్డ కప్ప ఎగిరెగిరి పడ్డట్లే మానవులు తమ స్వస్వభావాన్ని పూర్తిగా విస్మరించి, విశ్రాంతి నెరగక, అంతులేని కామనలతో ఈ భయంకర సంసారంలో అనేకకర్మలలో చిక్కుకొని స్వార్థ ప్రేరణలతో అటూ ఇటూ పరుగులు పెట్టుతున్నారు. ఈ సుడిగుండంలో చిక్కుకొన్న మానవులు ఇందులోంచి బైటపడే మార్గం కానలేకుండా ఉన్నారు. కరుణామయుడవైన ఉత్తరకాశీనాథా! శుద్ధభక్తితో నీ పవిత్ర పాదపద్మాలవద్ద ప్రణమిల్లి ఆత్మార్పణం చేసుకోడం ఒక్కటే ఈ విషయ సంసారంనుండి, జననమరణాలనుండి తరించేమార్గం.

## వ్యాఖ్య

ఈ శ్లోకంకూడా వైతాలీయ వృత్తంలోనే ఉన్నది. ఈ స్థూలశరీరంమలిన దుర్గంధభూయిష్ఠమైన పదార్థంతో తయారైంది. దీనిని నెరిగి శరీరంయొక్క పనికిమాలిన స్వభావం అర్థంచేసుకొన్నవాడు దానిపట్ల విముఖతను పొందు తాడు. ఈ సంగతిని తరువాతి శ్లోకం చెబుతుంది.

శ్లో॥ మైథునోత్థ మతిమాత్రకచ్చరం
చాత్ర మూత్రకుహరా ద్వినిర్గతమ్।
మాత్ర మేత దసృగస్థి సంచితమ్
తత్ర కిం కురు రతిం త్రిలోచనే॥ 3

ప్రతి॥ మైథునా + ఉత్థం = సంభోగముచే పుట్టిన, అతిమాత్రకచ్చరం + చ = ఈ స్థూలశరీరము, అత్ర = ఇక్కడ, మూత్రకుహరాత్ = మూత్ర ద్వారమునుండి, వినిర్గతం = వెలువడినది, ఏతత్ = ఇది, అసృక్ +

అస్థిసంచితమ్ + మాత్రమ్ = నెత్తురు, ఎముకలతో కూడినది మాత్రమే, తత్ర = అచ్చట, కిం = ఏమున్నది, త్రిలోచనే = ఈశ్వరునియందు, రతిం + కురు = ఇష్టపడుము.

## తాత్పర్యం

మానవుని స్థూలశరీరం స్త్రీ పురుషుల సంగమంవల్ల జనించింది మాలిన్యాలతో నిండింది. మూత్ర సంచికవద్దనుండే స్త్రీ గర్భంలోంచి పుట్టుతుంది. నెత్తుటితో ఎముకలతో నిండివుంటుంది. ఇలా దానిపుట్టుక ఉనికికూడా అసహ్యకరమైనవే. అది చక్కగా ఎదిగి ఆరోగ్యవంతంగా ఉన్నప్పుడు కూడా, ఎంత శుభ్రంచేసి అలంకరించినా అది మలినంగానే ఉంటుంది. ఈ మురికి కుప్పని 'నేను', 'నాది' అని మనుష్యులు ఎలాప్రేమిస్తారో, ఆశ్చర్యం!

దీనిని కాదని తిరస్కరిస్తే దేనిని పట్టు కోవాలి? నీవు ఈ జగత్తునుండి బయట పడదలచుకొంటే నీకు జవాబు త్రిలోచనుడైన మహాదేవుడే అయనకు భక్తితో ఆత్మ నివేదనం చేసుకో!

## వ్యాఖ్య

ఈ శ్లోకం రథోద్ధత ఛందస్సులో ఉన్నది

పైమూడు శ్లోకాలు బృహద్రథుని అనుమానాలను చెబుతున్నాయి. ఆత్మ బోధను పొందడానికి తగిన అర్హతలు రాజులో ఉన్నాయి. అతడికి వైరాగ్యం ఉన్నది. తీవ్రమైన తపస్సును చేశాడు. తీవ్రముముక్షువుగా ఉన్నాడు. అయన ప్రశ్నలను బట్టే ఈ విషయం స్పష్టమైనది.

బ్రహ్మనిష్ఠుడు, తత్త్వజ్ఞుడు అయిన శాకాయనఋషి బ్రహ్మవిద్యా బోధను చేశాడు అయన బోధలసారాన్ని రాబోయే శ్లోకాలు వివరిస్తాయి.

ముందుగా శాకాయనుడు పరమాత్మ జీవునిలో హృదయసారంగా అంతరాంతరాలలో ఉన్నాడని చెప్పాడు. అది తనకు అంతదగ్గిరగా ఉన్నప్పటికీ, అతని విషయవ్యామోహాలవల్ల ఎంతో దూరంగా ఉన్నట్లు అగపడుతుందని కూడా వివరించాడు.

శ్లో॥ స్పర్శరూపరస గంధనిస్వనే
ష్వారయా భ్రమతి యః పృథగ్జనః।
తద్దవిష్ఠతర మాత్మవస్తు యత్
స్వస్తి దోఽస్తు మమ తత్తను శ్శివః। 4

ప్రతి॥ యః = ఏ, పృథక్ + జనః = ఆత్మభిన్నుడు, స్పర్శ + రూప + రస + గంధ + నిస్వనేషు = స్పర్శ, రూపము, రసము, గంధము, శబ్దము-లందు, ఆశయా = కోరికతో, భ్రమతి = తిరుగుచున్నాడో, యత్ + ఆత్మ వస్తు = ఏ ఆత్మవిషయము, తత్ = అతనికి. దవిష్టతరం = దూరమైనది తత్ = అట్టి, తనుః = శరీరంగల, శివః = శివుడు, స్వస్తిదః = శుభము నిచ్చువాడు, అస్తు = అగుగాక.

## తాత్పర్యం

స్పర్శ రూపరసగంధ ధ్వనుల విషయాల వెంబడి అనురాగంతో ఎడతెగకుండా పరుగెత్తే వానికి పరమాత్మ ఎంతోదూరంగా ఉంటాడు. అతనికి ఆత్మ దర్శనం అతి దుర్లభం. ఆ పరమాత్మ పరమేశ్వరుడే. ఆయన నాకు ముక్తిని ప్రసాదించును గాక!

## వ్యాఖ్య

పూర్తిగా బాహ్యదృష్టి కలవాడు విషయవస్తువుల వేటలో అంధులై తిరుగుతూంటారు. జన్మలకి జన్మలు గడిచిపోయినా వాళ్ళు ఆత్మదర్శనానికి నోచుకోరు.

తరువాతిశ్లోకంలో తపస్సుతో శుద్ధమైన మనస్సుద్వారా ఆత్మజ్ఞానాన్ని పొందవచ్చునని తెలుపబడుతోంది.

శ్లో॥ ప్రాప్యతే న తరసా తవ తత్త్వం
ప్రాప్యతే తు తపసాంతరనేధాః।
వీతిహోత్ర ఇవ వృత్తి నివృత్త్యా
శాంతి మేతి తపసైవ హి చిత్తమ్॥ 5

ప్రతి॥ తవ = నీ, తత్త్వం = తత్త్వము, తరసా = త్వరగా, న + ప్రాప్యతే = పొందబడదు, అంతరనేధాః! = ఓ ఆత్మస్వరూపుడా!, తపసా + తు = తపస్సుచేతనైతే, ప్రాప్యతే = పొందబడును, వీతిహోత్రః + ఇవ = అగ్నివలె, వృత్తి + నివృత్త్యా = ప్రవృత్తినివృత్తిఅయిన, తపసా = తపస్సుచే,చిత్తం = మనస్సు,శాంతిం = శాంతిని, ఏతి = పొందుచున్నది.

## తాత్పర్యం

ఓ మహాదేవప్రభూ, ఆధ్యాత్మికసాధన లేకుండా నీ స్వభావాన్ని తెలుసుకోవడం సాధ్యంకాదు. యమనియమాదుల అభ్యాసాల ద్వారా, తపోనిష్ఠతో, నీపట్ల నిస్స్వార్థభక్తితో, శుద్ధమైన అంతరంగంలో, నీస్వభావం వెల్లడి అవుతుంది. అస్థితిలో ఉన్న మనస్సులో శుద్ధాత్మతత్త్వం స్ఫుటంగా ఉదయిస్తుంది. సమిధలు అయిపోయిన అగ్నివలె మనస్సు ఏకాగ్రధ్యానంలో శమించినప్పుడు మనస్సు అణగిపోయి శివస్వరూపంలో కలిసిపోతుంది.

## వ్యాఖ్య

రాబోయే శ్లోకంలో మనస్సే ఈ బహుళప్రపంచానికి కారణమని తెలుపబడుతోంది.

శ్లో॥ చిత్తమేవ హి భవో నిజచిత్తం
శోధయేద్ వివిదిషు శ్శివతత్త్వమ్।
భావయేత్ సరస మంఘ్రిసరోజమ్
కాశికేశ తవ చిత్తసరోజే॥ 6

ప్రతి॥ భవః = సంసారము, నిజచిత్తం = మనః కల్పితమయిన, చిత్తం + ఏవ + హి = చిత్తమే, శివతత్త్వం = శివతత్త్వమును, వివిదిషుః = తెలియగోరువాడు, శోధయేత్ = పరిశోధించును, కాశికా + ఈశ = ఉత్తర కాశీపతి!, తవ = నీ, చిత్తసరోజే = మనః పద్మమందు, సరస = సార భూతమైన, అంఘ్రిసరోజం = పాదపద్మమును, భావయేత్ = ధ్యానించవలెను.

## తాత్పర్యం

ఈ సంసారం మనః కల్పితం తప్ప మరోటి కాదు. శివుని తత్త్వ మెరుగ కోరినవారు తపస్సుద్వారా, దైవభక్తిద్వారా తమ మనస్సును శుద్ధపరచుకోవాలి అలా శుద్ధమైన మనస్సుతో తమ హృదయకమలంలో భగవంతుని పాదపద్మాలను ప్రేమతో భక్తితో ధ్యానించాలి. ఇలా భగవద్ధ్యానంలో మనస్సు పూర్తిగా నిమగ్న మైనప్పుడు, మనస్సులోని ఆలోచనలు పూర్తిగా ఆగిపోయి మనస్సు అంతమౌతుంది. అప్పుడు మనఃకల్పితమైన సంసారం అదృశ్యమై సాధకుడు ముక్తి పొందుతాడు.

## వ్యాఖ్య

పైశ్లోకం స్వాగతవృత్తంలో ఉన్నది.

తరువాతి శ్లోకంలో పరబ్రహ్మను మనం స్వీకరించడానికి, తిరస్కరించడానికి కూడా అవకాశం లేదని వివరించుచున్నారు.

శ్లో॥ హేయా ద్దేయా ద్దూరతో నిర్విశేషం
**నిస్సామాన్యం చాస్తి యత్తత్త్వ మీడే।**
**నిర్వాణం తన్నిర్వపు ర్నిర్వికల్పం**
**విశ్వాధారం విశ్వనాథాభిధానమ్॥** 7

ప్రతి॥ యత్ + తత్త్వం = ఏబ్రహ్మతత్త్వము, హేయాత్ = హేయమైన దాని కంటె, దేయాత్ = ఇవ్వగల్గిన దానికంటె, దూరతః = దూరంగా, నిర్విశేషం = గుణరహితము, నిస్ + సామాన్యం + చ = విశిష్టమునునై, అస్తి = ఉన్నదో, తత్ = ఆ తత్త్వము, నిర్వాణం = మోక్షము, నిర్వపుః శరీరములేనిది, నిర్వికల్పం = వికల్ప రహితము, విశ్వ + ఆధారం = సర్వానికి ఆధారము, విశ్వనాథ + అభిధానం = విశ్వనాథుడను పేరుగల దానిని, ఈడే = స్తుతించుచున్నాను.

## తాత్పర్యం

పరబ్రహ్మన్ని స్వీకరించడానికి గాని తిరస్కరించడానికి గాని వీలు లేనంత దూరంలో ఉన్నది. అలాగే గ్రహించడానికి వీలులేనంత దూరంలో

ఉన్నది. అది లక్షణ రహితమైనందున దానిని దేనితోను పోల్చడానికి కూడా వీలులేదు. అది నిర్వాణరూపము, నిత్యముక్తము. దానికి ఉపాధి (శరీరం) లేదు. మనస్సుయొక్క నామరూపకల్పనలకు అది అతీతమైనది. బ్రహ్మాండం యావత్తుకి అది అధిష్ఠానం. ఆ పరమాత్మయే విశ్వనాథప్రభువు. అయనను నేను ఆరాధించి పూజిస్తాను.

## వ్యాఖ్య

ఈ శ్లోకం శాలినీ వృత్తంలో ఉన్నది. విశ్వనాధుణ్ణి నిర్గుణ పరబ్రహ్మ మని వివరించారు.

తరువాతి శ్లోకం సౌమ్యకాశీపతి నాపట్ల ప్రీతుడగునుగాక అనే ప్రార్థనలో నిండివున్నది.

శ్లో॥ శుద్ధం బుద్ధం నిత్యముక్త స్వభావం
సత్యం సూక్ష్మం సంవిదానందసింధుః।
ప్రత్యగ్వస్తు ప్రీయతాం ప్రేమమూర్తి
సౌమ్యాకారం సౌమ్యకాశీశ్వరాఖ్యమ్॥ 8

ప్రతి॥ శుద్ధం = శుద్ధము, బుద్ధం = జ్ఞానరూపము, నిత్యముక్తస్వభావం = శాశ్వతముక్త లక్షణముగలది, సత్యం = సత్యరూపము, సూక్ష్మము = అణురూపము, సంవిత్ + ఆనంద = జ్ఞానానందమనెడి, సింధుః + సముద్రుడు, ప్రేమమూర్తి = ప్రేమస్వరూపుడు, సౌమ్యకాశీ + ఈశ్వర + అఖ్యం = సౌమ్యకాశీపతియను పెరుగల, సౌమ్య + ఆకారం = శాంతమూర్తి గలవాడు, ప్రత్యక్ + వస్తు = ప్రత్యక్షస్వరూపము ప్రీయతాం = తృప్తిచెందును గాక.

## తాత్పర్యం

ఓ సౌమ్యకాశీశ్వరా, రాగద్వేషాలచేత స్పృశించబడని పరమశుద్ధుడివి నీవు. శుద్ధచైతన్యరూపివి. ఉపాధులు పరిమితులు పెట్టలేని నిత్యముక్తుడివి

పరమ సత్యానివి. సర్వవ్యాప్తాకాశంకన్న సూక్ష్మతరమైన వాడివి. సుఖ సముద్రుడివి. జ్ఞానస్వరూపివి. శాంతిరూపివి. సర్వభూతాల అంతరాంతరాల లోని సారం నివు. అన్నింటికన్న ఎక్కువైన, స్వార్థరహితమైన ప్రేమపుంజానివి ప్రియతముడివి. నీ దివ్యానుగ్రహం నాపై ఎప్పుడూ ప్రసరించును గాక!

## వ్యాఖ్య

ఈ శ్లోకంకూడా శాలినీ వృత్తంలోనే ఉన్నది.

భగవంతుణ్ణి సరిగా పూజించి ఆరాధించడం ఎలాగో తరువాతి శ్లోకం చెబుతోంది.

శ్లో॥ తవ హే శివమందిరం శరీరం
శివద స్త్వం చ సదా శివోఽన్తరాత్మా।
అహ మస్మి శివోఽద్వయః పరాత్మే
త్యనుచింతాపచితి స్తవేశ్వరస్య॥ 9

ప్రతి॥ హే = ఓ శివా! శరీరం = ఈశరీరము, తవ = నీయొక్క, శివమందిర = ప్రవిత్రాలయము, త్వం + చ = నీవైతే, శివదః = శుభంకరుడవు, అంతర + ఆత్మా = అంతరఆత్మకూడా, సదాశివః = సదాశివుడే, శివః = శివుడు, అద్వయః = ద్వంద్వాతీతుడు, పరాత్మా = పరమాత్మను, అహం + అస్మి = నేనేఅగుచున్నాను. ఇతి = అని, అనుచింతా = ధ్యానమే, ఈశ్వరస్య = శివుడవైన, తవ = నీకు, అపచితి = పూజ.

## తాత్పర్యం

ఓ పరమశివా! ఈ శరీరం నీ పవిత్రాలయము. నా శుద్ధఅంతరాత్మ నీ సదాశివరూపం. "నేను సదాశివరూపమైన అద్వితీయ పరమాత్మను" అని ఏకాగ్రభక్తితో ఈ ఆత్మను గూర్చిన నిరంతర ధ్యానమే నీపూజ.

## వ్యాఖ్య

ఇదే భగవంతునికి నిజమైన ఆరాధన. బాహ్యపూజలు, క్రియలు భక్తుణ్ణి ఈ మానసిక పూజకు అర్హుణ్ణి చేయడానికే వినియోగపడుతాయి.

ఈ శ్లోకం ఔపఛందస్సులో ఉన్నది.

సన్యాస స్వీకరణం తరువాత ఆసాధకుడు ఇంటినీ గ్రామాన్నీ వదిలెయ్యాలి. తన ఇంటివిషయం, జన్మస్థానవిషయం ఇక స్మరణ ఉండరాదు. బ్రహ్మమును గురించే అతడు సదా చింతన చెయ్యాలి– ఈవిషయాలు తరువాతి శ్లోకం చెబుతుంది

శ్లో॥ కృతధీః కృతసన్యసనో న వసేత్
నిజనీవృతి నిర్జితవృత్తి రయం।
శివ తావక నిష్కల రూపమలం
విదధీతహృది ప్రవివిక్తపదే॥ 10

ప్రతి॥ హేశివ = ఓ శివా! కృతధీః = శుద్ధబుద్ధియై, కృతసంన్యసనః = సంన్యాసమును స్వీకరించి, న వసేత్ = అచ్చటనే నివసించరాదు, అయం = ఇది, నిజ = తన, నీవృతి = స్వస్థానమును, నిర్జిత = జయించిన(వదలిన) వృత్తి = ప్రవృత్తి కలది, ప్రవివిక్త = నిర్జనమైన, హృది = మనస్సునందు, తావక = నీ, నిష్కల = నిర్గుణమైన, రూపం = రూపమును, అలం విదధీత = ధ్యానించిన చాలును.

## తాత్పర్యం

విశుద్ధబుద్ధియై సన్యాసస్వీకరణ చేసిన సాధకులు ఇక తన నిజస్థానంలో ఉంతరాదు. నిర్జనవాసం చేస్తూ నివృత్తిపరుడైన ఆ సన్యాసి, ఓ శివా, నీ నిష్కల నిర్గుణపదాన్ని హృదయంలో బాగా చింతన చెయ్యాలి.

## వ్యాఖ్య

మనోబుద్ధులను శుద్ధపరచుకొన్నాక, స్థిరసంకల్పు డయ్యాక, శాస్త్రాధ్యయనం చేసి వాటి నిగూఢార్థాలను గ్రహించాక ఆ సన్యాసి ఇక తన జన్మగ్రామంలో కాని పట్టణంలోకాని వసించరాదు. జైలునుండి విడుదల అయిన దొంగ వేగంగా అక్కడనుండి పారిపోయినట్లు జనసమ్మర్దంతో కూడిన

పట్టణాలనుండి దూరంగా పోయి ప్రశాంతమైన ఏకాంతప్రదేశాన్ని ఏరుకోవాలి. అక్కడ అతణ్ణి చలింపజేసే ఆలోచననుండి తేలికగా విడుదల అవుతాడు. అప్పుడే నిర్గుణధ్యానం కొనసాగుతుంది.

పూజ్యగురుదేవు లిచ్చిన ఈ సలహా ప్రారంభదశలోని సాధకులకు ఎంతో అవసరం.

ఈ శ్లోకం తోటక ఛందస్సులో ఉన్నది.

'అహంబ్రహ్మాస్మి' అనే పరమజ్ఞానం ఉదయించిన మహాత్ముని స్థితిని ఈక్రింది శ్లోకం వర్ణించుతుంది.

శ్లో॥ న వా మఠం భీమవనం న వాశ్రయేత్
కృతా కృత స్స్వాత్మవినిశ్చయ స్సతామ్।
కటాక్షపాతేన విపర్యయోజ్ఝితః
కటాక్షపాత్రం తవ సౌమ్యరాట్ప్రభో॥ 11

ప్రతి॥ సౌమ్యరాట్ప్రభో = సౌమ్య కాశీశుడా, కృతీ = ధన్యుడు కృత = చేయబడిన. స్వ + ఆత్మ = తనయాత్మయందే, వినిశ్చయః = నిశ్చయము కలవాడు, మఠం + వా = మఠమునుగాని, న + ఆశ్రయేత్ = ఆశ్రయించరాదు, భీమవనం + వా = భయంకరారణ్యమునుగాని, న + ఆశ్రయేత్ = ఆశ్రయించరాదు, సతాం = సత్పురుషులయొక్క, కటాక్షపాతేన = అనుగ్రహముచే, విపర్యయా = భేదభావముచేత, ఉజ్ఝితః = తొలగింపబడినవాడై, తవ = నీ, కటాక్షపాతం = దయకు అర్హుడను—(అయితిని)

## తాత్పర్యం

ఓ సౌమ్య కాశీశప్రభూ, ఓ విశ్వనాథప్రభూ! నీ పరమకారుణిక అనుగ్రహ దృష్టిని నాపైన ప్రసరింపజేశావు. సత్పురుషుల కటాక్షంవల్ల నామనస్సు సందేహ రహితమై, ప్రశాంతమై ని కటాక్షానికి పాత్రుడనయ్యాను. ఓ ప్రభూ! ఆత్మజ్ఞానియై కృతకృత్యత చెందినవానికి మఠానికిగాని వనానికిగాని పోవలసిన అవసరం లేదు.

## వ్యాఖ్య

ఆత్మజ్ఞానికి ఎలాంటి బంధనాలు లేవు. ఆయన గాలిలా స్వేచ్ఛగా సంచరించగలడు.

ఈ శ్లోకం వంశోత్తర వృత్తంలో ఉన్నది ఇందులో గురు మహరాజ్ యొక్క అత్యద్భుత ఆత్మానుభూతి మహిమ ప్రకటమౌతోంది.

అనుమానాలతో దృఢనిశ్చయులు కాలేక ఊగులాడేవారు ఎన్నటికీ ముక్తిని పొందలేరనే విషయాన్ని క్రింది శ్లోకం స్పష్టం చేస్తోంది.

శ్లో॥ శివ విషయవత స్తవాద్వితీయే
హ్యనుపహితాత్మని శుద్ధబుద్ధముక్తే।
సుఖ మనతిశయం కదాపి మోక్ష
ప్రభవమహో న భవేత్ ప్రమూఢబుద్ధేః॥ 12

ప్రతి॥ శివ = శంకరా, విషయవతః = విషయములుగల, తవ = నీయొక్క, అద్వితీయే = ద్వంద్వాతీతమయిన, శుద్ధబుద్ధముక్తే = శుద్ధము, బుద్ధము, ముక్తము నయిన, అనుపహత = సాటిలేని, ఆత్మని = ఆత్మయందు, ప్రమూఢబుద్ధేః = మూర్ఖునియొక్క, అనతిశయం = అతిశయముకాని సుఖము, కదాపి = ఎప్పుడును, మోక్షప్రభవం = ముక్తికారకము, న + భవేత్ = కాదు, అహో = ఔరా!

## తాత్పర్యం

ఓ భగవాన్, నీ అద్వితీయ అనంత శుద్ధ సర్వజ్ఞ నిత్యముక్త స్వభావాన్ని గురించి ఇంకా అనుమానాలతో ఊగులాడే మనస్సుకల తెలివితక్కువ సాధకులు ఎన్నటికీ ముక్తివల్ల లభించే నిరుపమ శుద్ధానందానుభూతిని పొందలేరు కదా!

## వ్యాఖ్య

పరమాత్మయొక్క అద్వితీయ పరమపదస్థితిని గురించి లేశమైనా అనుమానం ఉన్న మూర్ఖ సాధకులకి ముక్తిద్వారం మూసుకుపోతుంది. ఇదే భావనని భగవద్గీతకూడా వెల్లడించింది.

"నాయం లోకోఽస్తి నపరః నసుఖం సంశయాత్మనః"

అని భగవంతు డన్నాడు. మనస్సును దృఢపరచుకోలేక, అనుమానాల చేత పీడింపబడుతూ ఏకమైన పరమసత్యాన్ని సందేహించుతూంటే ఈ లోకం లోను పరలోకంలోను కూడా సుఖం మృగ్యమౌతుంది.

ఈ శ్లోకం పుష్పితాగ్ర వృత్తంలో ఉన్నది.

తరువాతి శ్లోకంలో గురుదేవులు లౌకికాముష్మిక కర్మ లన్నింటిని సన్యసించడం, గురువునుండి మంత్రదీక్ష పొందటం కేవలం బాహ్యలక్షణాలని స్పష్టపరుస్తున్నారు. సన్యాసంయొక్క అంతిమలక్ష్యం ఏమిటో స్పష్ట పరుస్తున్నారు.

శ్లో॥ కర్మత్యాగః ప్రేషజపో వా న యతిత్వం
భిక్షాశిత్వం చాపి యతిత్వం న కథంచిత్।
శశ్వన్నిష్ఠా సంయమనోత్థైవ యతిత్వం
విశ్వేశ త్వాద్ధామ్ని విభో భూమ్ని మహిమ్ని॥ 13

ప్రతి॥ విభోవిశ్వేశ! = ఓ శంకరా! కర్మత్యాగః = పనిచేయకపోవడం, ప్రేష జపః + వా = జపస్వీకరణముకాని, యతిత్వం + న = సంన్యాసము కాదు, కథంచిత్ = ఒకప్పుడును, భిక్షా + అశిత్వం = భిక్షనుతినుటకూడ, యతిత్వం + న = సన్యాసముకాదు, త్వత్ = నీయొక్క, ధామ్ని = ప్రకాశవంతము, మహిమ్ని = మహిమోపేతమునయిన, భూమ్ని = భూమియందు, సంయమన + ఉత్థా = నిగ్రహముచే కలిగిన, నిష్ఠా + ఏవ = నిష్ఠయే, శశ్వత్ = శాశ్వతమైన, యతిత్వం = సంన్యాసము.

## తాత్పర్యం

కేవలం కర్మలన్నింటినీ మానివేయడం, గురువునుండి జపమంత్రదీక్ష తీసుకోవడం సన్యాసంకాదు. భిక్షాటనం కూడా సన్యాసం కాదు. ఓ ప్రభో, ఇంద్రియసంయమనం ద్వారా మహిమాన్విత పదమైన నీ ధ్యానంలో నిలకడగా ఉండే నిష్ఠయే నిజమైన యతిత్వం.

వ్యాఖ్య

బాహ్యలక్షణాలు నిజమైన సన్యాసాన్ని ఋజువు చెయ్యవు అన్ని కర్మలను మానివేసి కూర్చోడం. గురువునుండి దీక్ష తీసుకోవడం బాహ్యచిహ్నాలే. రోజుకు రెండు మూడుసార్లు మధుకర భిక్షకు వెళ్ళడం, దేవాలయాలలోనో, భక్తుల ఇళ్ళల్లోనో భిక్ష స్వీకరించడం కూడా నిజమైన సన్యాసానికి చిహ్నంకాదు.

ఓ విశ్వనాథా, నీ అద్వయానంత సర్వవ్యాప్త స్వరూపాన్ని నిరంతరం ధ్యానం చేయడమే సన్యాసి లక్షణం. ఇంద్రియమనోబుద్ధుల్ని పూర్తిగా సంయమనం చేసి ఆత్మవైపుకు దృష్టిని మళ్ళించి "నేను బ్రహ్మమును" అనే ఎరుకలో నిలిచివుండాలి. అతడే నిజమైన సన్యాసి. మిగిలినవాళ్లు సామాన్యమైన సన్యాసులు!

ఈ శ్లోకం మత్తమయూర ఛందస్సులో ఉన్నది.

వేదాంతంలో ఎంతో విద్వత్తు వున్నా, సాధకుడు ఇంద్రియవిషయాలవల్ల ఆకర్షింపబడితే అతడు బహిర్ముఖదృష్టితో ఉంటే పరబ్రహ్మ స్వరూపాన్ని నిలకడగా తెలుసుకోలేడు, అతడి శాస్త్రవిజ్ఞానం కుక్షి నింపడానికే పనికివస్తుంది. ఈ సంగతిని తరువాతి శ్లోకం విశదపరుస్తుంది.

శ్లో॥ అవిద్యయా శివ తవ మోహితా జనా
విచక్షణా అపి నిగమేషు నైగమమ్।
పరాఙ్ముఖాః ఖలు న విదన్తి పూరుషం
స్వచాతురీ ముదరభరాయ విభ్రతి॥ 14

ప్రతి॥ శివ = శంకరా, తవ = నిన్నుగూర్చిన, అవిద్యయా = అజ్ఞానముచే, మోహితాః + జనాః = సమ్మోహితులైన ప్రజలు, విచక్షణాః + అపి = విద్వాంసులయ్యును. పరాఙ్ముఖాః = బాహ్యముఖులై, నిగమేషు = వేదములందలి, నైగమం + పూరుషం = పరమాత్మను, న + విదంతి + ఖలు = తెలిసికొనలేరుగదా, స్వచాతురీం = తమనేర్పరితనమును, ఉదరభరాయ = పొట్టనింపుటకొరకే, విభ్రతి = ఉపయోగించుకొంటున్నారు.

## తాత్పర్యం

ఓ భగవాన్, నీ మాయాశక్తిలో చిక్కుకొని ఈ వేదాంతవిద్వాంసులు బహిర్ముఖులై విషయభోగాలని వేటాడి అనుభవిస్తున్నారు వాళ్లు ఉపనిషత్తులలో వర్ణింపబడిన పురుషుణ్ణి అంతరాత్మఅయిన పరమాత్మని చేరలేరు.

వాళ్ళు తమనేర్పుని ఉదరపోషణకే ఉపయోగించుకుంటారు.

## వ్యాఖ్య

వేదాంతశాస్త్రంలో ఉన్న లోతైన జ్ఞానాన్ని తమ ఆత్మ స్వరూపాన్ని శోధించి తెలుసుకోడానికి వినియోగించలేని విద్వాంసులు కాకుల కంటే ఏ విధంగా నయం?

ఈ శ్లోకం రుచిర వృత్తంలో ఉన్నది.

రాబోయే శ్లోకంలో మట్టితోనో రాతితోనో తయారైన భగవద్విగ్రహాన్ని పూజించినంతమాత్రాన భగవంతుని నిజస్వభావం తెలియదు. అంతరాత్మగా వున్న పరమాత్మను దర్శించేవరకు పరమాత్మతత్త్వాన్ని ఎరగడం సాధ్యం కాదని చెప్పుతున్నారు.

**శ్లో॥ మృదుపలమణికాష్ఠే ష్వీశబుద్ధిం వితన్వన్**
**భయకరభవయన్త్రే భ్రామ్యతే భ్రాంతచిత్తః।**
**భవ భవత్ భవంతం వీక్ష్య మోహాయ సాక్షాత్**
**ప్రభవతి రవి తుల్యం హంత భాంతం హృదంతే॥ 15**

ప్రతి॥ మృత్ = మట్టి, ఉపల = రాయి, మణి = రత్నము, కాష్ఠేషు = చెక్క బొమ్మలయందు, ఈశబుద్ధిం = పరమాత్ముడను భావమును, వితన్వన్ = ఉంచుతూ, భ్రాంతచిత్తః = భ్రమించినమనస్సు కలవాడై, భయకర = భయంకరమైన, భవయంత్రే = సంసారచక్రమందు, భ్రామతే = తిరుగాడుచున్నాడు, హంత = అయ్యో!, భవ = ఓ ఈశ్వరా!, హృత్ + అంతే = హృదయమందు, రవితుల్యం = సూర్యునివలె, భాంతం =

ప్రకాశించు, భవత్ = నీయొక్క, భవంతం = స్వరూపమును, సాక్షాత్ = ప్రత్యక్షము, వీక్ష్య = చూచి, మోక్షాయ = మోక్షముకొఱకు, ప్రభవతి = సమర్థుడగుచున్నాడు.

## తాత్పర్యం

మట్టి, రాయి, మణి, దారు విగ్రహాలని నీవే అనుకొని భ్రాంతులు భయంకరమైన భవచక్రంలో పరిభ్రమిస్తూంటారు. అయ్యో, ఓ భగవాన్! సంసారాన్ని నశింపజేసే నిన్ను హృదయాంతరాళంలో సూర్యునివలె వెలిగే నిన్ను దర్శించినప్పుడే వాళ్ళకి సూటిగా మోక్షం లభిస్తుంది.

## వ్యాఖ్య

భగవంతుని తత్త్వాన్ని సరిగా ఎరగక, విగ్రహాలనే పరమాత్మగా ఎంచుకొనే వాళ్ళు భ్రాంతులు. మట్టి, శిల, సాలగ్రామం, దారువు—ఇలా రకరకాల పదార్థాలతో తయారుచేసిన విగ్రహాలను పూజిస్తారు. అయితే అసలు తత్త్వాన్ని ఆ పూజలతోబాటే హృదయంలో వెదుక్కోవాలి. అలా వెదుక్కోనంతకాలం ఈ భవయంత్రంలోంచి బయటపడే మార్గం లేదు.

ఎలా బయటపడాలనే ప్రశ్నకి కూడా శ్లోకంలోని చివరిభాగం జవాబిస్తుంది. మహాదేవుడు ఈ సంసారచక్రానికి అధిష్ఠానం. ఆయనే ఈ యంత్రాన్ని ఆపగలడు. కాలానికి లోబడి తిరుగుతుంది ఈ ప్రపంచం. కాలాంతకు డాయన. నామరూపాల భ్రాంతినుండి ఆయనే మనుష్యుల్ని ఉద్ధరించగలడు. హృదయపద్మంలో స్వయంజ్యోతి అయిన ఆయన మహిమ సూర్యతేజంతో ప్రకాశిస్తుంది. ఆయనని లోపల దర్శించిన మానవుడు తిరిగి ఈ సంసారంలో జనించడు.

ఈ శ్లోకం మాలినీ వృత్తంలో ఉన్నది.

ఆ ప్రభువు బాహ్యాభ్యంతరాలు రెంటిలోను పరిపూర్ణుడనే విషయాన్ని తరువాతి శ్లోకం చెబుతుంది.

శ్లో॥ ధవళగిరిజాబంధో, సింధోదురంత కృపాంబునః
త్వమణు నపరిచ్ఛిన్నః. ఛిన్నోఽపి కాలదిగాదిభిః।
బహిరపి భవానంతః పూర్ణే యథాంభసి కుంభికా
బహిరపి సదాహ్యంతశ్శూన్యో యథాంబర కుంభికా॥ 16

ప్రతి॥ ధవళగిరిజాబంధో = గౌరీపతీ!, దురంత = దాటబడరాని, కృపాంబునః = కరుణాజలమునకు, సింధో = సముద్రుడా, కాలదిగ్ + ఆదిభిః = కాలము, దిక్కు మొ॥ వానిచే, చిన్నః + అపి = విభజింపబడియున్నను, త్వం = నీవు, అణు = కొంచెమైనను, న పరిచ్ఛిన్నః = భాగింపబడవు, అంభసి కుంభికా + యథా = నీటియందలి కుండవలె, భవాన్ = నీవు, బహిః + అంతః + అపి = వెలుపల, లోపలకూడా, పూర్ణః = పరిపూర్ణుడవు, అంబర = ఆకాశమందలి, కుంభికాయథా = కుండవలె, సదా = ఎల్లప్పుడు, బహిః + అంతః + అపి = బాహ్యాభ్యంతరములందు, శూన్యః = శూన్యుడవు.

## తాత్పర్యం

ఓ గిరిజాపతీ, నీవు కరుణాసముద్రుడివి మా అజ్ఞాన కారణంగా నీవు పరిమితుడివిగా, దేశకాలాల పరిధులకి లోబడిన వాడివిగా అగపడినప్పటికీ నీ అనంత మహిమలో నీలోని అంశమైనా పరిమితులకు బద్ధం కాదు. నీటిలో మునిగివున్న కుండలాగా బాహ్యాభ్యంతరాలు రెంటిలోను నీవు పూర్ణుడివి. ఆకాశంలో ఉన్న కుండలాగా నీవు అఖండ అద్వితీయ పరిపూర్ణ తత్త్వానివి, సర్వవ్యాపివి. నీ అవ్యక్తరూపంలో నీవు అంతటా పూర్ణుడివిగా వ్యాపించివున్నావు.

ఈ శ్లోకం హరిణీ వృత్తంలో ఉన్నది.

తరువాత రాబోయే మూడు శ్లోకాలలో బ్రాహ్మిస్థితిలో స్థిరంగా నిలబడి వున్న మహాత్ముని వర్ణన జరుగుతోంది.

శ్లో॥ న దర్శన మదర్శనం న దృగదృక్ చ దృశ్యోద్భమో
ప్యదృశ్య మపి యత్ర హి స్వపనజాగ్రద స్తం గమః।
నిర స్తకలనం చ యత్ పద మహో దృషత్ సన్నిభం
త్వియం హి సహజస్థితిః శివ తవోత్తమా రాధనమ్॥ 17

ప్రతి॥ శివ = శంకరా!, తవ = నీయొక్క, ఉత్తమ + ఆరాధనమ్ = ఉత్తమ పూజ, నదర్శనమ్ = చూచుటకాదు, అదర్శనం + న = చూడకుండుట కాదు, దృక్ + న = చూపుకాదు, అదృక్ + చ + న = చూడనిదియు కాదు, దృశ్య + ఉద్భమః + అపి + న = దృశ్యమును కాదు, అదృశ్యం + అపి + న = దృశ్యముకానిదియు కాదు, యత్రహి = ఏనీఆరాధనలో, స్వపన జాగ్రత్ = స్వప్నజాగ్రత్తనెడి అవస్థ, అస్తంగమః = అస్తమించి నదో, యత్ + పదం = ఏ పూజాస్థానము, నిరస్తకలనం + చ = కూర్పు లేనిది, దృషత్ + సన్నిభమ్ = శిలవంటిది, ఇయం + తు = ఇదే, సహజస్థితిః + హి = సహజస్థితి, అహెూ = ఔరా!

## తాత్పర్యం

ఓ పరమేశ్వరా, నీ ఉత్తమోత్తమమైన పూజ సహజావస్థలో ఉండడమే. ఆస్థితిలో తన అద్వితీయ స్వస్వరూపంలో ఉన్నప్పుడు అనుభవము లేదు, లేకపోవడం లేదు చూచేవాడు లేడు, చూడనివాడు లేడు. దృశ్యం లేదు, లేక పోవడం లేదు. స్వప్నం, జాగ్రద్—రెండూ లేవు. అన్ని సృజనాత్మక చింతనలు అస్తమించిన, నిశ్శబ్దమై శిలాసన్నిభమైన అద్భుత శాంతపదం అది!

## వ్యాఖ్య

పూలతో గంధ లేపనాదులతో అర్చించడం ఈ స్థితికన్న ఎంతహీనమో!

ఈ శ్లోకం పృథ్వీ వృత్తంలో ఉన్నది.

"అఖండ సచ్చిదానందమైన ఆ పరమేశ్వరుడనే నేను" అని దృఢ నిశ్చయ జ్ఞానస్థితియే సహజావస్థ అని గురుదేవులు క్రింది శ్లోకంలో వివరిస్తున్నారు.

శ్లో॥ శివోఽస్మి విమలోఽస్మ్యహం
విశకలోఽస్మి బుద్ధోఽస్మ్యహం।
సదఽస్మి సకలోఽస్మ్యహం
సుఖచిదస్మి శుద్ధోఽస్మహం
ఇతిస్ఫుట మనుక్షణం
చ యది వృత్తి రాత్మోన్ముఖీ
త్వియం హి సహజస్థితిః
శివ తవోత్తమారాధనమ్॥ 18

ప్రతి॥ శివ = ఈశ్వరా!, అహం = నేను, శివః + అస్మి = శివుడను, విమలః + అస్మి = నిర్మలుడను, విశకలః + అస్మి = అఖండవ్యక్తిని, బుద్ధః + అస్మి = బుద్ధుడను, అహం = నేను, సత్ + అస్మి = సత్యస్వరూపుడను అహం = నేను, సకలః + అస్మి = సంపూర్ణుడను, సుఖచిత్ + అస్మి = చిత్స్వరూపుడను, అహం = నేను, శుద్ధః + అస్మి = పరిశుద్ధుడను, ఇతి = అని, అనుక్షణం = ప్రతిక్షణమూ, స్ఫుటం = స్పష్టమైన, ఆత్మా + ఉన్ముఖీ = ఆత్మకు అభిముఖమైన, వృత్తిః = జీవనము, యది + చ = ఉన్నట్లయితే, ఇయంహి = ఇదియే, సహజస్థితిః = సహజస్థితి, మరియు అదియే, తవ + ఉత్తమ + ఆరాధానమ్ = నీకుచేయు మహో త్తమ పూజ.

## తాత్పర్యం

ఓ విశ్వనాథప్రభూ! "నేను శివుణ్ణి. నేను విమలుణ్ణి. నేను విభజనలు లేని వాడిని. నేను సర్వజ్ఞుడిని. నేను పరమసత్యాన్ని. నేను సర్వవ్యాపిని. నేను అనంతసచ్చిదానందాన్ని. నేను శుద్ధస్వరూపాన్ని." — ఇలా అనుక్షణం ఆత్మోన్ముఖమై నిరంతరాయమైన వృత్తిలో ఉండడమే సహజస్థితి. ఇదే ఉత్తమోత్తమమైన నీ ఆరాధన!

ఈ వర్ణన తరువాతి శ్లోకంలో కూడా కొనసాగుతుంది.

శ్లో॥ అకార్య కరణోఽస్మ్యహమ్
హ్యపగుణోఽస్మి పూర్ణోఽస్మ్యహమ్
అజన్మ నిధనోఽస్మ్యహమ్
నిరుపయోఽస్మి నిత్యోఽస్మ్యహమ్।
ఇతి త్రిపథగాంబువ
ద్యది వహేత్ స జాతీయ ధీ
రియం హి సహజస్థితిః
శివ తవోత్తమారాధనమ్॥ 19

ప్రతి॥ శివ = శంకరా! అహం = నేను, అకార్యకరణః + అస్మి = కార్యకరణాలు లేనివాడను, అపగుణః + అస్మి = గుణాతీతుడను, అహం = నేను, పూర్ణః + అస్మి = పరిపూర్ణుడను, అహం = నేను, అజన్మనిధనః + అస్మి = జననమరణాలు లేనివాడను, నిరుపమః + అస్మి = సాటిలేని వాడను, అహం = నేను, నిత్యః + అస్మి = నిత్యుడను, ఇతి = ఇట్లు, త్రిపథగా + అంబువత్ = గంగాజలమువలెః సజాతీయధీః = సజాతి బుద్ధి, యదివహేత్ = ధరించినచో, ఇయం, హి, సహ——

## తాత్పర్యం

ఓ పరమేశ్వరా! "నాకు కార్యకరణాలు లేవు. గుణాలు లేవు. నేను పూర్ణుణ్ణి. నాకు జననమరణాలు లేవు. నాతో పోల్చగలిగినది లేదు. నేను నిత్యుణ్ణి." ఇలా నిరంతరం గంగాస్రోతస్సువలె ఒకే రకమైన ఆలోచనలను బుద్ధి కలిగివున్నప్పుడు ఇదే సహజస్థితి. ఓ శివా, ఇదే నీ ఉత్తమోత్తమారాధన!

## వ్యాఖ్య

దేహం కార్యము, ఇంద్రియాలు కరణాలు. ఆ రెండూ తాను కానని ఎంచుకోడమే కార్యకరణాలు లేకపోవడం అంటే. విచారం, మోహం, సుఖం, దుఃఖం—ఇలాంటి ఉద్రేకాలు గుణాలు.

ఈ శ్లోకంతో మైత్రేయి ఉపనిషత్తుపూర్తి అయింది. ఇక తేజోబిందూప నిషత్తు యొక్క సారం వివరింపబడుతోంది. రాబోయే శ్లోకంలో కుంభక ప్రాణాయామం తెలుపబడుతుంది

శ్లో॥ బ్రహ్మాస్మీతి నిజాంతరాత్మధిషణా నైష్కంప్య సత్కుంభకాత్
సమ్యగ్బ్రహ్మమయం సమస్తమిద మిత్యుద్దామదృష్ట్యా తథా।
సౌమ్యాధీశవిభో భవత్పద ముదస్తాధ్యస్త భేదం బుధాః
సంపశ్యంతి సదా సురోధకలయా నాసాగ్రదృష్ట్యా చ కిమ్॥ 20

ప్రతి॥ సౌమ్యాధీశవిభో = సౌమ్యకాశీశుడా, నైష్కంప్య = చలనములేని, సత్ + కుంభకాత్ = నిజకుంభకమువలన, నిజ + అంతరాత్మా + ధిషణా = ఆత్మజ్ఞానముచేత, బ్రహ్మ + అస్మి + ఇతి = బ్రహ్మనని, తథా = అట్లే, ఉద్దామదృష్ట్యా = పూరకదృష్టిచే, సమస్తం + ఇదం = ఈ సమస్తము, సమ్యక్ + బ్రహ్మమయం + ఇతి = ఉత్తమబ్రహ్మ రూప మని, సదాసురోధకలయా = సడలని ప్రాణాయామ సంధానముతో, బుధాః = పండితులు, భవత్ + పదం = నీ పాదాలను (నీ పదవిని) ఉదస్త + అధ్యస్త + భేదం = అరోపము అధ్యస్తమును లేనిరూపముగా, సంపశ్యన్తి = చూచుచున్నారు, కావున — నాస + అగ్రదృష్ట్యా = నాసాగ్రదృష్టిచే– కిం = ఏమి ప్రయోజనమున్నది—

## తాత్పర్యం

జ్ఞానులు "నేను బ్రహ్మను" అనే పూర్ణజ్ఞానంతో శాంతంగా మౌనంగా ఉండడమే నిజమైన కుంభకం, యావత్ప్రపంచం బాహ్యాభ్యంతరాలలో బ్రహ్మ విభూతితో నిండివున్నదని పరమాత్మమీద దృష్టి నిలిపి వుంచడమే నిజమైన పూరకం. పరమాత్మపై నామరూపాల భ్రమని కలిగించే అధ్యాసని తిరస్కరించి పరమాత్మలో దృష్టి నిలపడమే రేచకం. నాసాగ్రంమీద చూపు నిలపడం దేనికి?

## వ్యాఖ్య

హఠ యోగంలో ప్రాణాయామం చేస్తూ ఊపిరిపీల్చడం, నిలపడం

వదలడం, నాసాగ్రంమీద దృష్టి నిలపడం మొదలైన శారీరకక్రియలు చేస్తారు. వాటిలో ఆత్మజ్ఞానం లేదు.

జ్ఞానయోగులకి సంబంధించినంతవరకు దృక్‌యమము, కుంభక, పూరక రేచకాదులు పైపద్ధతిలో జరుగుతాయి కేవల శారీరక ప్రక్రియలవల్ల అతడికి ప్రయోజనం లేదు. నామరూపజగత్తును త్రోసివెయ్యడమె రేచకం. "నేను బ్రహ్మము" ననే ఆలోచనతో మనస్సును నిలిపి వుంచడమె కుంభకము

మనస్సుయొక్క పరుగులనుబట్టే మనిషి స్వభావము, ఆకృతి ప్రాథమికంగా నిర్ణయమౌతాయి అందుచేత పరమాత్మను కోరుకునేవారు తమ మనస్సులో పరమాత్మ చింతనతో ఒకే యోచన ఉండేట్లు జాగ్రత్త వహించాలి. మరొకరకమైన ఆలోచనతో మనస్సును చెదరనివ్వరాదు. ఈ విషయాన్ని తరువాతి శ్లోకంలో విశదీకరిస్తున్నారు.

శ్లో॥ భావవృత్తి మథ శూన్యవృత్తిమతి
భక్తి యోగబల పుష్కలా
సన్నిరస్య పరిపూర్ణవృత్తి మథ
పాలయేత్ బుధ మతల్లికా।
బ్రహ్మవృత్తి మిహ తావకీం పరమ
పావనీం న పరిశీలయేత్
యస్సః పూరుష పశు ర్విపశ్చిదపి
నోత్తరేత్ భవసరిత్పతిమ్॥ 21

ప్రతి॥ భక్తియోగ = భక్తియోగమువలన, బల + పుష్కలా = పుష్కలమైన శక్తిగల, బుధమతల్లికా = మోక్షార్థులు, భావవృత్తిం = మనోభావమును, అథ = మరియు, శూన్యవృత్తిం = శూన్యవృత్తిని, సన్నిరస్య = బాగుగా వదలి, అథ = తరువాత, పరిపూర్ణవృత్తిం = పరిపూర్ణవృత్తిని, పాలయేత్ = నిర్వహించవలెను, యః = ఏ, పురుషుడు = కర్తవ్యపరుడు, ఇహ = ఈలోకమందు, తావకీం = నీదైన, పరమపావనీం = పరమపవిత్ర

మైన, బ్రహ్మవృత్తిం = మోక్షవృత్తిని, న పరిశీలయేత్ = విమర్శించడో, సః = అట్టివాడు, పశుః = అజ్ఞాని, విపశ్చిత్ = పండితుడు, అపి = అయినను, భవసరిత్ + పతిం = సంసారసారమును, న + ఉత్తరేత్ = దాటలేడు.

## తాత్పర్యం

పరమాత్మనే నిజంగా కోరుకునే విద్వాంసులు ముందు బాహ్యవృత్తి యోచనలను వదిలెయ్యాలి. మనస్సులో లేచే యోచనలన్నింటినీ బహిష్కరించి శూన్యవృత్తిని అవలంబించాలి. తరువాత భగవంతుని వైపుకి త్రిప్పి భక్తితో జీవాత్మ పరమాత్మల ఐక్యతని గురించిన యోచనలతో నింపాలి. దీనిని సాధకుడు నిత్యమూ ఇలా నిలిపివుంచాలి. ఓ సౌమ్య కాశీశ్వరా, నిన్ను గురించిన పరమపావనమైన బ్రహ్మవృత్తిని నిలపని పురుష పశువు ఎంత విద్వాంసుడైనా భవసముద్రాన్ని దాటలేడు!

## వ్యాఖ్య

బహిర్ముఖంగా ఉన్న మనస్సులో నిత్యమూ బాహ్యవిషయవేటలో ఆలోచనలు పరుగెడుతూంటాయి. బాహ్యవృత్తిని నిలిపివేశాక కూడా మనస్సులో అప్పుడప్పుడు ఆలోచనలు రేగుతూనే ఉంటాయి ఒక్క ఆలోచన కూడా రాకుండా నిలిపివుంచడం శూన్యవృత్తి.

భగవంతుని వైపుకి మనోస్రోతస్సును అప్పుడు త్రిప్పాలి. దానికి పరిపూర్ణభక్తి అవసరం. భక్తితో నిండిన మనస్సులో బ్రహ్మవృత్తిని ప్రవేశ పెట్టాలి.

తరువాతి శ్లోకంలో తేజోబిందూపనిషత్తులోని చివరిభాగానికి చెందిన భావాలున్నాయి. విశ్వంలోని దేవతలందరూ ఆత్మస్వరూపమైన పరమశివుని ప్రకట రూపాలే. ఈ విషయాన్ని రాబోయే శ్లోకం వివరిస్తుంది.

శ్లో॥ త్వన్మయ శ్శివవిరాట్ చ సూత్ర మథ విష్ణుజిష్ణుముఖదేవతాః
త్వన్మయం శివ ఖవాయు వాయుసఖ వారిభూప్రభృతి
వైకృతమ్।
త్వన్మయం శివ యదస్తి భూత మథ భావి సర్వమపి
సౌమ్యరాట్
త్వన్మయం యది సమస్తవస్త్వథ చ చిన్మయం తతథ
మన్మయమ్॥ 22

ప్రతి॥ శవ = ఓ పరమేశ్వరా, విష్ణు = విష్ణువు, జిష్ణు = ఇంద్రుడు, ముఖ = మొ॥ దేవతాః = దేవతలు, విరాట్ = విరాట్టు, సూత్రం + చ = జగత్సూత్రమును. త్వత్ + మయః = నీరూపమే--, అథ = మరియు, శివ!, ఖ + వాయు + వాయుసఖ + వారి + భూ + ప్రభృతి = ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి మొ॥ వైకృతం = వికారమును, తత్ + మయం = నీరూపమె, సౌమ్యరాట్శివ = సౌమ్యకాశీశుడా, యత్ = ఏ, అస్తి = వర్తమానము, భూతం = భూతకాలము, అధ, భావి = భవిష్యత్తు, యత్ = ఏ, సర్వమ్ + అపి = అన్నికాలాలును, అథ = ఇంకను, త్వత్ + మయం, సమస్తవస్తు = సకలవస్తువులు, చిత్ + మయం = చిత్స్వరూపము, మత్ + మయం + చ = మనోరూపము, యది = ఏదైతే ఉన్నదో, తత్—అదంతయు, త్వత్ + మయం = నీరూపమె——

## తాత్పర్యం

ఓ పరమేశ్వరా, ఈ స్థూలప్రపంచము, సూక్ష్మరూపుడైన హిరణ్యగర్భుడూ నీవే! శ్రీ విష్ణువు, ఇంద్రుడు, ఇతర దేవతలు అన్నీ నీ వేర్వేరు వ్యక్తస్వరూపాలే! వికృతులైన పంచమహాభూతాలు—ఆకాశవాయు, అనిల, జల, భూములూ అన్నీ నీ స్వరూపాలే! భూత భవిష్య ద్వర్తమానాలలో జరిగేది యావత్తు చరాచర ప్రాణులు యావన్మందీ నీ ప్రకటరూపాలే! అవన్నీ నీ రూపాలే కాబట్టి అవి అన్నీ చిన్మయాలు. అంటే అవన్నీ నారూపాలే! ఓభగవాన్

నీవు—నేను తేడాలేని ఒకే అద్వయ శుద్ధ అఖండ చైతన్యమే పరబ్రహ్మ స్వరూపం!

## వ్యాఖ్య

పైన చెప్పింది యావత్తూ విని అర్థంచేసుకొన్నా శివుడు శివుడే, జీవుడు జీవుడే. నీవేమో పరిమితులతో కూడినవాడివి అయనేమో అఖండ పరిపూర్ణుడు నేను శివుడనెలా అవుతాను?—అనే సందేహం ఇంకా మిగిలివుండవచ్చును ఈ సందేహాన్ని తరువాత శ్లోకం తీర్చుతుంది.

శ్లో॥ బ్రహ్మైవాహం న జీవో జనిమృతి రహితః సచ్చిదానంద సాంద్రః
శత్రు ర్మిత్రం కళత్రం ఖగమృగ భుజగాః సర్వమాత్మైవ సాక్షాత్।
బుద్ధి ర్బుద్ధీంద్రియాది క్వచిదపి నమయి శ్లిష్ట మశ్లిష్టగాత్రో
నిశ్చిత్యైవం విపశ్చిచ్ఛివ తవ విహర త్వాత్మభూతో మహాత్మా॥ 23

ప్రతి॥ శివ = శంకరా, అహం = నేను, బ్రహ్మ + ఏవ = పరబ్రహ్మమునే, న జీవః = జీవుడను కాను, జనిమృతిరహితః = పుట్టుక చావులేనివాడను, సత్ + చిత్ + ఆనందసాంద్రః = సచ్చిదానంద స్వరూపుడను, శత్రుః = శత్రుడను, మిత్రం = మిత్రుడను, కళత్రం = భార్య, ఖగమృగభుజగాః = పక్షి జంతు నాగములు, సర్వం = ఈ అంతయు, సాక్షాత్ = పరిపూర్ణముగ, ఆత్మా + ఏవ = ఆత్మయే, బుద్ధిః = బుద్ధి, బుద్ధి + ఇంద్రియాది = జ్ఞానేంద్రియాలును, క్వచిత్ + అపి = ఒకప్పుడును, మయి = నాయందు, న శ్లిష్టం = స్పృశింపలేదు, ఏవం = ఇట్లు, నిశ్చిత్య = నిశ్చయించి, అశ్లిష్టగాత్రః = ఇంద్రియ స్పర్శలేని శరీరముగల, విపశ్చిత్ = పండితుడు, ఆత్మభూతః = స్వస్వరూపుడైన, మహాత్మా = పరబ్రహ్మము, తవ = నీకుగా, విహరతు = సంచరించును గాక.

తాత్పర్యం

నేను పరిమితులతో కూడిన జీవుణ్ణి కాను అనంతుడైన పరబ్రహ్మను. జనన మరణాలకు అతీతమైన శుద్ధ సచ్చిదానంద ఘనమైన పరమాత్మ స్వభావమే నాది నా శత్రు మిత్రులు, భార్య, పక్షులు, జంతువులు, పాములు – అన్నీ నా ప్రకటరూపాలే, త్రికాలాలలోను నాకు బుద్ధి, మనస్సు, ఇంద్రియాలు లేవు. స్థూలసూక్ష్మ కారణశరీరాలు లేవు. ఓ భగవాన్! ఇలా నీ స్వరూపాన్ని గుర్తెరిగి అదే తన రూపమని ఎవరు నిశ్చయంగా తెలుసుకొన్నారో ఆ మహాత్ముడే జీవన్ముక్తుడు. ఆయన అద్వితీయ పరమాత్మ దివ్యమహిమతో వెలుగొందుతూ ఉండిపోతాడు.

వ్యాఖ్య

తేజోబిందూపనిషత్తులోని చివరిభాగసారం పైశ్లోకంలో వివరింపబడింది. రాబోయే రెండుశ్లోకాలు కూడా అదే భావాన్ని విశదీకరిస్తాయి.

పరబ్రహ్మము శుద్ధము, ముక్తము, జ్ఞానస్వరూపము. అది ఎప్పుడూ వెలుగుతూ ఉంటుంది. భోక్త–భోగ్యము మొదలైన భావాలతో కూడిన ప్రపంచ బాహుళ్యం అక్కడ ఇది వరలో లేదు, ఇకముందు ఉండదు. ఈ విషయాన్ని క్రింది శ్లోకం స్పష్టీకరిస్తున్నది.

శ్లో॥ దేశః కాలో నిమిత్తం కథమపి న జగజ్జన్మ భంగాది కార్యే
ష్వేవం సృష్టే రభావే క్వ భవతి భవ భో భోక్తృభోజ్య
ప్రసంగః।
బంధో మోక్షశ్చ కస్యా స్త్వఖిలకృదఖిలం చేంద్రజాలోద్భవం
త్వ
న్మాయా కైవల్యమూలం శ్రుతిరపి జగ దుజ్జృంభణే
బంభణీతి॥ 24

ప్రతి॥ భవ–భోః = ఓ శంకరా!, దేశః = దేశము, కాలః = కాలము, జగత్ = సృష్టియొక్క, జన్మ + భంగ + ఆది = నిర్మాణ, విలయములు మొ॥ కార్యేషు = పనులయందు, కథం + అపి = ఏవిధంగాను, న + నిమిత్తం = కారణముకాదు, ఏవం = ఇట్లు, సృష్టేః + అభావే = సృష్టియే లేనపుడు. భోక్తృ + భోజ్యప్రసంగః = భుజించువాడు, భుజింపబడునది –అనుప్రస్తావన, క్వ + భవతి = ఎక్కడిది? బంధః + మోక్షః + చ = బంధమోక్షములును, కస్య = ఎవనికి, అస్తి = ఉన్నవి? అఖిలకృత్ = సర్వసృష్టికర్త, ఇంద్రజాల + ఉద్భవం = మాయచే పుట్టిన, అఖిలం + చ = సమస్తమంద, త్వత్ = నీయొక్క, మాయాకైవల్యమూలం = మాయాకైవల్యమనె ఆధారముగగలదైన, ఉజ్జృంభణె = విలాసమునందు జగత్ = ప్రపంచమని, శ్రుతిః + అపి = వేదముకూడ, బంభణీతి = ఘోషించుచున్నది.

## తాత్పర్యం

దేశకాల నిమిత్తాలవల్ల నామరూపజగత్తు యొక్క సృష్టి లయలు లేవు. ఇలా ప్రపంచమె లేనప్పుడు, స్వామీ, దేశకాలాలలో భోక్త – భోగ్యాల ప్రశ్న ఎలా ఉదయిస్తుంది? బంధమోక్షాలు ఎవరికి?

ఓ భగవాన్, నీవే సర్వాన్ని చేసే మాయావివి. ఈ నామరూప జగత్తు నీ ఇంద్రజాలం, వేదాలు కూడా ఈ జగత్తుని నీ మాయవల్ల విజృంభించి మారుతున్నట్లు అగపడుతోందని ఘోషిస్తున్నాయి.

## వ్యాఖ్య

భోగాలు, కర్మలుకూడా దేశకాలాలలో జరుగుతాయి. దేశకాలాలు జగత్తనేదే లేనప్పుడు వాటికి లోబడి అనుభవించేవారు ఎవరు? మమకారాలలో చిక్కుకొనే వారెవ్వరు? బంధనాలలో నుండి బయటపడేదెవరు?

అయితేనేం, ప్రపంచం ఎదురుగా కనబడుతోంది. దానిని కాదనడం ఎలా? ఎందుకు కనబడుతోందో గురుదేవులు శ్లోకం చివరిభాగంలో వివరించారు. ఇది మాయావి అయిన భగవంతుని మాయాశక్తి విజృంభణం. లేనిది

ఉన్నట్లుగా తోపింపజేసే శక్తిని మాయ అంటారు. లేని జగత్తును ఉన్నట్లుగా చూపించేది భగవంతుని మాయాశక్తి.

చివరిశ్లోకంలో ఇదేభావం ఇంకొకవిధంగా వెల్లడింపబడుతోంది

శ్లో॥ కర్తా భోక్తా చ భోగ స్సుఖ మసుఖ మథ స్వర్గతి ర్దుర్గతిశ్చ
పుణ్యాపుణ్యం ప్రచ సర్వం విలసిత మసతో భాతి తృప్యే
న్మృగాంభః।
పీత్వాపీత్వా పిపాసు ర్యది జగదుదితం సంభవేత్ సత్యమేతత్
సౌమ్యాధీశ త్రిసత్యం తవవపు రమలం త్వేకమేత
న్నతోఽస్మి॥ 25

ప్రతి॥ కర్తా = కర్త, భోక్తా + చ = భోక్తయు, భోగః = అనుభవము, సుఖం = సుఖము, అసుఖం = దుఃఖము, అధ = మరియు, స్వర్గతిః = స్వర్గము, దుర్గతిః + చ = నరకము, పుణ్య + అపుణ్యం ప్రచ = పుణ్యాపాపములును, అసతః = మాయనుండి, విలసితం + సర్వం = ప్రకాశించు పై సర్వస్వము, మృగ + అంభః = మృగతృష్ణిలో నీటిని, పిపాసుః = దప్పికగొన్నవాడు, పీత్వాపీత్వా = త్రాగిత్రాగి, తృప్యేత్ + యది = తృప్తిచెందేటట్లయితే, జగత్ = ఈ జగత్తు, ఉదితం + భవేత్ = పుట్టినదగును, సౌమ్యాధీశ! = శంకరా!, ఏతత్ సత్యం = ఇదిసత్యము, త్రిసత్యం = ముమ్మాటికి సత్యం, ఏతత్ = ఈ, తవ = నీయొక్క, ఏకం + వపుః = ఏకైకశరీరం, అమలం + పరిశుద్ధము, దానికి, నతః + అస్మి = నమస్కరించుచున్నాను.

## తాత్పర్యం

కర్త, భోక్త, భోగం, సుఖం, దుఃఖం, స్వర్గం, నరకం, పుణ్యం, పాపం, యావత్తు అసత్తు – లేకపోయినా ఉన్నట్లుగా కనబడుతుంది. దాహంకొన్న వారికి ఎండమావిలో తాగితే మాత్రం దాహం తీరుతుందా? జగత్తు ఉదయించనే

లేదు అనుభవాలెక్కడ? ఓ సౌమ్య కాశీపతీ, త్రికాలలోని సత్యం నీవే నీవు ఒక్కడివే. నీకు వేయి ప్రణామాలు!

## వ్యాఖ్య

మృగతృష్ణలో నీరు లేదు. అలాగే ఈ ప్రపంచంకూడా మాయవల్ల ఉన్నట్లు కనబడుతుంది. నిజానికి లేదు. ఉన్నదొక్కటే–అదే పరమేశ్వరుడు।



# అష్టాదశ స్తబకం

ఉత్తమ వేదాంత మంజూష అని చెప్పదగిన సౌమ్య కాశీశ స్తోత్రంలో ఇది చివరి స్తబకం. అన్ని ఉపనిషత్తుల సారాన్ని ముందు స్తబకాలలో తెలిపాక సర్వవ్యాపక రూపంలోని పరమేశ్వరుని అనంత మహిమలను శ్రీ గురుదేవులు ఈస్తబకంలో ముగింపుగా వర్ణిస్తున్నారు.

శ్లో॥ యో దేవ స్సత్యరూపేణ స్వస్మిన్నేవ విరాజతే।
నమ స్తస్మై నమ స్తస్మై నమ స్తస్మై నమోనమః॥ 1

ప్రతి॥ యః + దేవః = ఏ శివుడు, సత్ + స్వరూపేణ = సత్స్వరూపముతో, స్వస్మిన్ + ఏవ = తనయందే, విరాజతే = ప్రకాశించు చున్నాడో, తస్మై + నమః = అతనికి నమస్కారము, తస్మైనమః, నమోనమః = పునర్నమస్కారము.

## తాత్పర్యం

శుద్ధ సద్రూపంలో ఏ దేవుడు విరాజిల్లుతున్నాడో ఆయనకు నా నమస్కారాలు! ఆయనకు నా నమస్కారాలు! నమస్కారాలు! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవః సూత్రరూపేణ జగ త్సూత్రయతి ప్రభుః।
నమ స్తస్మై నమ స్తస్మై నమ స్తస్మై నమోనమః॥ 2

ప్రతి॥ యః దేవః = ఏ శివుడు, ప్రభుః = ప్రభువైనవాడు, సూత్రరూపేణ = మూలాధారుడై, జగత్ = జగత్తును, సూత్రయతి = నిర్మించునో, నమః—

## తాత్పర్యం

సూత్రరూపంలో ఏదేవుడు ఈ ప్రపంచంలో నామరూపాల నన్నింటినీ గ్రుచ్చి ఉంచుతున్నాడో ఆయనకు నా నమస్కారాలు! ఆయనకు నా నమస్కారాలు! నమస్కారాలు! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవో విధిరూపేణ జగత్సృజతి రాజసః।
నమస్తస్మై నమస్తస్మై నమస్తస్మై నమోనమః॥ 3

ప్రతి॥ రాజసః + యః + దేవుడు = రజోగుణరూపుడైన ఏదేవుడు, విధిరూపేణ = బ్రహ్మరూపమున, జగత్ = జగత్తును, సృజతి = సృష్టించుచున్నాడో,— తస్మైనమః———

## తాత్పర్యం

ఏ దేవుడు రజోగుణ ప్రధానుడై బ్రహ్మదేవుని రూపంతో ఈప్రపంచాన్ని సృజిస్తాడో ఆయనకి నా నమస్కారాలు! ఆయనకి నా నమస్కారాలు! నమస్కారాలు! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవో విష్ణురూపేణ జగత్పుష్ణాతి శుక్లవాన్।
నమస్తస్మై నమస్తస్మై నమస్తస్మై నమోనమః॥ 4

ప్రతి॥ శుక్లవాన్ + యః + దేవః = ఏసత్వగుణరూపుడు, విష్ణురూపేణ = విష్ణురూపముచే, జగత్ = జగత్తును, పుష్ణాతి = పోషించుచున్నాడో———

## తాత్పర్యం

ఏ దేవుడు సత్త్వగుణప్రధానుడై మహావిష్ణురూపంలో ఈ ప్రపంచాన్ని నిలబెట్టి పోషిస్తున్నాడో ఆయనకి నా నమస్కారాలు! ఆయనకి నా నమస్కారాలు! నమస్కారాలు! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవో రుద్రరూపేణ జగదశ్నాతి తామసీ।
నమస్తస్మై నమస్తస్మై నమస్తస్మై నమోనమః॥ 5

ప్రతి॥ తామసీ + యః + దేవః = తమోగుణరూపుడైన ఏదేవుడు, రుద్రరూపేణ = ఈశ్వరరూపముతో, జగత్ = జగమును, అశ్నాతి = భుజించునో,—

తాత్పర్యం

ఏ దేవుడు తమోగుణప్రధానుడై రుద్రరూపంలో ఈ ప్రపంచాన్ని మింగివేస్తాడో ఆయనకి నా నమస్కారాలు! ఆయనకి నా నమస్కారాలు! నమస్కారాలు! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవః సూర్యరూపేణ జగద్భాసయతే సదా।
నమస్తస్మై నమస్తస్మై నమస్తస్మై నమోనమః॥ 6

ప్రతి॥ యః + దేవః = ఏ శివుడు, సూర్యరూపేణ = సూర్యరూపముతో, సదా = ఎల్లప్పుడు, జగత్ = జగత్తు, భాసయతే = వెలిగించుచున్నాడో,—

తాత్పర్యం

ఏ దేవుడు సూర్యరూపంలో నిరంతరం జగత్తును వెలిగిస్తున్నాడో, ఆయనకు నా నమస్కారం. ఆయనకు నమస్కారం. నమస్కారం! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవస్సోమరూపేణ పుష్ణాత్యోషధీ వీరుధః।
నమస్తస్మై నమస్తస్మై నమస్తస్మై నమోనమః॥ 7

ప్రతి॥ ఓషధివీరుధః = ఓషధివృక్షపోషకుడు, యః + దేవః = ఏ శివుడు, సోమరూపేణ = చంద్రస్వరూపముతో, పుష్ణాతి = పోషించుచున్నాడో—

తాత్పర్యం

ఏ దేవుడు సోమరూపంలో వృక్షాలని ఓషధుల్ని రసాలతో నింపుతున్నాడో ఆయనకి నా నమస్కారం! ఆయనకి నమస్కారం! నమస్కారం! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవో వృషరూపేణ వర్ష త్యంబుద వాహనః।
నమ స్తస్మై నమ స్తస్మై నమ స్తస్మై నమోనమః॥ 8

ప్రతి॥ అంబుదవాహనః = మేఘవాహనుడు, యః + దేవః = ఏ శివుడు, వృష రూపేణ = వరుణరూపముతో, వర్షతి = వర్షించుచున్నాడో,——

తాత్పర్యం

ఏ దేవుడు ఇంద్రరూపంలో మేఘంద్వారా వర్షాన్ని కురిపిస్తాడో ఆయనకు నా నమస్కారాలు! ఆయనకు నమస్కారం! నమస్కారం! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవో నృపరూపేణ నృధర్మాన్ పాతి ధర్మవిత్।
నమ స్తస్మై నమ స్తస్మై నమ స్తస్మై నమోనమః॥ 9

ప్రతి॥ ధర్మవిత్ = ధర్మజ్ఞుడు, యః + దేవః = ఏ శివుడు, నృపరూపేణ = రాజురూపముతో, నృధర్మాన్ = మానవధర్మాలను, పాతి = రక్షించుచున్నాడో,——

తాత్పర్యం

ఏ దేవుడు రాజురూపంలో ధర్మజ్ఞుడై మానవధర్మాలని రక్షిస్తాడో అయనకి నా నమస్కారాలు! ఆయనకి నమస్కారాలు! నమస్కారం! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవో బ్రహ్మరూపేణ బ్రహ్మవేదితు మిచ్ఛతి।
నమ స్తస్మై నమ స్తస్మై నమ స్తస్మై నమోనమః॥ 10

ప్రతి॥ బ్రహ్మరూపేణ = బ్రహ్మరూపముతో, బ్రహ్మ = బ్రహ్మను, వేదితుం + ఇచ్ఛతి = తెలియగోరుచున్నాడో,——

తాత్పర్యం

ఏ దేవుడు బ్రాహ్మణుని రూపంలో పరబ్రహ్మని తెలుసుకోగోరుతాడో అయనకి నా నమస్కారం! ఆయనకి నమస్కారం! నమస్కారం! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవో ధేను రూపేణ దుగ్ధం దుగ్ధే జగత్ప్రసూః।
నమ స్తస్మై నమ స్తస్మై నమ స్తస్మై నమోనమః॥ 11

ప్రతి॥ ధేనురూపేణ = అవురూపముతో, దుగ్ధం = పాలను, దుగ్ధే = పితికి జగత్ప్రసూః = ప్రపంచమున కిచ్చుచున్నాడో,——

తాత్పర్యం

ఏ దేవుడు జగన్మాత గోవురూపంలో క్షీరాన్ని ఇస్తాడో ఆయనకు నా నమస్కారం! ఆయనకు నమస్కారం! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవో వ్యాఘ్రరూపేణ గర్జ త్యూర్జీ వనాంతరే।
నమ స్తస్మై నమ స్తస్మై నమ స్తస్మై నమోనమః॥ 12

ప్రతి॥ వ్యాఘ్రరూపేణ = పులిరూపముతో, ఊర్జీవన + అంతరే = ఘోరవన మధ్యమందు, గర్జతి = గర్జించునో——

తాత్పర్యం

ఏ దేవుడు వ్యాఘ్రరూపంలో పరాక్రమవంతుడై గర్జిస్తూ సంచరిస్తాడో అయనకు నా నమస్కారం। ఆయనకు నమస్కారం! నమస్కారం! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవః ఖగరూపేణ ద్రుత ముడ్డయతే దివి।
నమ స్తస్మై నమ స్తస్మై నమ స్తస్మై నమోనమః॥ 13

ప్రతి॥ ఖగరూపేణ = పక్షిరూపముతో, దివి = స్వర్గమందు, ద్రుతం = వేగముగ, ఉడ్డయతే = ఎగురుచున్నాడో,——

## తాత్పర్యం

ఏ దేవుడు పక్షిరూపంలో ఆకాశంలో వేగంగా ఎగురుతాడో ఆయనకు నా నమస్కారం! ఆయనకు నమస్కారం! నమస్కారం! పునః పునః ప్రణామాలు,

**శ్లో॥ యో దేవో వృక్షరూపేణ స్తబ్ధః ఛాయాం ప్రయచ్ఛతి।**
**నమస్తస్మై నమస్తస్మై నమస్తస్మై నమోనమః॥ 14**

ప్రతి॥ వృక్షరూపేణ = వృక్షరూపముతో, స్తబ్ధః = స్థిరమై, ఛాయాం = నీడను, ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నాడో——

## తాత్పర్యం

ఏ దేవుడు వృక్షరూపంలో భూమిపై స్థిరపడి చల్లటి నీడని ప్రసాదిస్తాడో ఆయనకు నా నమస్కారం! ఆయనకు నమస్కారం! నమస్కారం! పునః పునః ప్రణామాలు!

**శ్లో॥ యో దేవ స్తృణరూపేణ హరిద్వర్ణః చకాస్తి హి।**
**నమస్తస్మై నమస్తస్మై నమస్తస్మై నమోనమః॥ 15**

ప్రతి॥ తృణరూపేణ = గడ్డిరూపముతో, హరిత్ + వర్ణః = పచ్చగా, చకాస్తి + హి = ప్రకాశించుచున్నాడో,——

## తాత్పర్యం

ఏ దేవుడు పచ్చటి గడ్డిరూపంలో ఉండి నేలకి అందాన్ని చేకూర్చుతున్నాడో ఆ దేవునికి నా నమస్కారం! ఆయనకు నమస్కారం! నమస్కారం! పునః పునః ప్రణామాలు!

శ్లో॥ యో దేవః సర్వరూపేణ సర్వో భవతి సర్వదా।
నమ స్తస్మై నమ స్తస్మై నమ స్తస్మై నమోనమః॥ 16

ప్రతి॥ సర్వరూపేణ = సర్వరూపముతో, సర్వదా = ఎల్లప్పుడు—, సర్వో = సర్వ రూపమును, భవతి = అగుచున్నాడో,——

## తాత్పర్యం

ఏ దేవుడు అన్ని ప్రదేశాలలో అన్ని కాలాలలో అన్ని రూపాలను ధరించి అన్నీ తానే అయ్యాడో ఆ దేవునికి నా నమస్కారం! ఆయనకు నా నమస్కారం! నమస్కారం! పునః పునః ప్రణామాలు!

## వ్యాఖ్య

బ్రహ్మ విష్ణు మహేశ్వరుల వద్దనుండి గడ్డిపోచవరకు చరాచర ప్రపంచం యావత్తు సర్వవ్యాపి అయిన పరబ్రహ్మయొక్క వ్యక్తరూపమేననే సంగతిని తెలుసుకోడం, ధ్యానించడం, దర్శించడం—పరాజ్ఞానం, ఉత్తమోత్తమమైన భక్తి, అన్నింటికన్న ఉదాత్తమైన కర్మ.

ముఖ్యమైన ఉపనిషత్తులలోని సందేశసారాన్ని తెలుపుతూ విశ్వనాథ మహిమని వర్ణించుతూ చేసిన ఈ ఉత్తమస్తోత్రాలు ఇక్కడితో ముగింపుకి వచ్చాయి. దీనితో చేపట్టిన విషయం పూర్తి అయినది.

చివరి తొమ్మిది శ్లోకాలలో శ్రీ గురుదేవులు పవిత్రమైన ఉత్తరకాశీధామ మహిమని ప్రశంసించుతూ అనంతపరమాత్మయొక్క అనుగ్రహాశీర్వాదాలను కోరుతున్నారు. పరమ పవిత్రమైన ఈ స్తోత్రాలని రోజూ పఠించడంవల్ల భక్తులకు కలిగే ఫలాలని కూడా సూచిస్తున్నారు ఈ సందర్భంలో పూజ్యగురుదేవులు తన జీవిత సంఘటనలనికూడా కొద్దిగా ప్రస్తావిస్తున్నారు. ఇక ఆఖరిమాటగా చివరి శ్లోకంలో ఈ గ్రంథాన్ని సౌమ్య కాశీశుని పరమపవిత్రమైన పాదాలకు పరిపూర్ణభక్తితో, శరణాగతితో సమర్పించారు.

రానున్న శ్లోకంలో ముందు భగవంతుని విరాడ్విభూతులని వర్ణించి తరువాత భగవంతుని అనుగ్రహాన్ని వేడుకొంటున్నారు.

శ్లో॥ ప్రసీద భగవన్ సౌమ్య కాశికేశ కృపాంబుధే।
ప్రసీదావిద్యక ధ్వాంతధ్వంస హంసనిభప్రభో॥ 17

ప్రతి॥ కృపాంబుధే = దయాసముద్రుడా, భగవన్ = పూజ్యుడా, సౌమ్య కాశీకేశ = సౌమ్యకాశీపతి, ప్రసీద = ప్రసన్నుడవుకమ్ము, అవిద్యక ధ్వాంతధ్వంసహంసనిభ = అజ్ఞానమనెడి అంధకారమును నశింపచేయు జ్ఞాన సూర్యుడా, ప్రభో = స్వామీ, ప్రసీద = ప్రసన్నుడవుకమ్ము

## తాత్పర్యం

ఓ సౌమ్యకాశీప్రభూ నీవు దయాసముద్రుడివి. నన్ను సదా అనుగ్రహించు. అవిద్యాంధకారాన్ని సంహరించే సూర్యప్రభా సన్నిభుడా, నాపైన నీకృపని సదా ప్రసరింపజేయి!

## వ్యాఖ్య

తిరిగి తిరిగి అడగడంలో శ్రీ గురుదేవుల ప్రార్థన ఎంత స్థిరమైనదో నిరూపిస్తున్నారు.

పరిపూర్ణమైన కృతార్థతని పొందికూడా శ్రీ గురుదేవులు ఎంతో వినీత భావంతో తనకు స్థిరభక్తి నొసగుమని తరువాతి శ్లోకంలో భగవంతుని వేడుకొంటున్నారు.

శ్లో॥ యది ప్రసన్నో భవదంఘ్రిసేవా
రతిం ప్రయచ్ఛాన్య దహం న యాచే।
నిరస్తభేదభ్రమ మృత్యుపాశం
పరాం పరానందకరీం పరాత్మన్॥ 18

ప్రతి॥ పరాత్మన్ = ఓ పరమాత్మా, ప్రసన్నః యది = ప్రసన్నుడవయినచో, నిరస్తభేదభ్రమమృత్యుపాశం = తొలగించబడిన భేద భావ భ్రమ అను మృత్యు పాశమును, పరాం = శ్రేష్ఠమైన, పరానందకరీం = మంచి ఆనందమును కలుగజేయునట్టి, భవదంఘ్రిసేవారతిం = నీపాదసేవా సక్తిని, ప్రయచ్ఛ = కలుగచేయుము, అహం = నేను, అన్యత్ = మరి యొకదానిని, నయాచే = కోరను.

## తాత్పర్యం

ఓ ప్రభూ, నాపట్ల నీవు ప్రీతుడవైతే నాకు నీ పాదసేవలో నిరతరతిని ప్రసాదించు. నేను అన్యమేదీ కోరను. ఏభక్తివల్ల భేదాలు, భ్రమలు, మృత్యు పాశము వదిలిపోతాయో పరమానంద దాయకమైన అట్టి పరాభక్తిని నాకు ప్రసాదించు!

## వ్యాఖ్య

ఉపాస్య-ఉపాసక భేదాలుండేది పరాభక్తి కాదు. భక్తుడు భగవంతునిలో లీనమైనప్పుడు ఈభేదాలను గమనించేవాడే వుండడు.

ఈశ్లోకం ఉపేంద్రవృత్తంలో ఉన్నది. స్తోత్రం ముగింపుకి వచ్చిందని తరువాతి శ్లోకం చెబుతోంది.

శ్లో॥ **సంపూరిత మిదం స్తోత్రం సర్వసిద్ధికరం నృణామ్।**
**శ్రుత్యంత సుమనో మాధ్వీ హృద్య మత్యంత ముత్తమమ్॥ 19**

ప్రతి॥ నృణాం = భక్తులకు, సర్వసిద్ధికరం = కోర్కెలనన్నింటిని సిద్ధింపజేయు నట్టిది, శ్రుత్యంత సుమమాధ్వీహృద్యం = ఉపనిషత్తులనెడి కుసుమా లతో హృదయమునకు మాధుర్యమును కలుగజేయునట్టిది, అత్యంతం = మిక్కిలి, ఉత్తమం = శ్రేష్ఠమైనది అయిన, ఇదం స్తోత్రం = ఈ స్తోత్రము, సంపూరితం = పూర్తి చేయుబడినది.

## తాత్పర్యం

ఈ స్తోత్రం పూర్తిఅయింది. మనుష్యుల అన్ని అన్ని కోరికలని తీర్చి అన్నిరకాల సిద్ధుల్ని ప్రసాదించగలదు. ఉపనిషత్తుల ఉద్యానవనంలో పూచిన పూలమకరంద మిది. హృదయానందకరమైనది. అత్యుత్తమమైనది.

శ్లో॥ జయ త్యుత్తరకాశీతి సౌమ్య కాశీతి చ శ్రుతమ్।
క్షేత్రం గోత్రకులోత్తంస హిమవన్మధ్య సంస్థితమ్॥ 20

ప్రతి॥ హిమవన్మధ్య సంస్థితమ్ = హిమాలయాల మధ్యభాగమునందున్న, గోత్రకులోత్తంస = పర్వతశ్రేష్ఠమైన, క్షేత్రం = ఈపుణ్యక్షేత్రము, సౌమ్య కాశీ + ఇతిచ = సౌమ్య కాశీక్షేత్రముగ, శ్రుతమ్ = పురాణాలలో చెప్పబడినది, ఉత్తరకాశీ + ఇతి = ఉత్తరకాశీగా, జయతి = కీర్తింప బడు చున్నది.

## తాత్పర్యం

పురాణాలలో "సౌమ్య కాశి" గా ప్రసిద్ధమైన ఆ ఉత్తరకాశీక్షేత్రం ప్రపంచంలోని పర్వతాలన్నింటిలోకి ఉత్తమచూడామణి అనదగిన హిమాలయ శ్రేణుల మధ్యలో ఉన్నది.

శ్లో॥ పంచక్రోశవిశంటం వరుణయా చాస్యా చ సంవేష్టితం
భూభృ ద్భూషణ వారణావత నితంబాలంబి యత్ భ్రాజతే।
గంగా యత్ర చ గాయతీవ మధురం సామోర్మితుంగస్వనైః
తప్యం తే చ తపో వితృష్ణ మతయో యత్రోల్బణం
సాధవః॥ 21

ప్రతి॥ యత్ = ఏఉత్తరకాశీక్షేత్రము, పంచక్రోశవిశటం = ఐదుకోశముల దూరమువరకు వ్యాపించినదియు, వరుణయా = వరుణయనెడిపేరుగల నదితోను, అస్యా చ = అసు-అనెడి నదితోను, సంవేష్టితం = చుట్టబడి

యున్నదియును, భూభృద్భూషణవారణావత నితంబాలంబి = హిమాల యమునకు అలంకారమైన వారణావతమునకు వడ్డాణములాగా, భ్రాజతే = ప్రకాశించుచున్న, యత్రచ = ఎచ్చట, గంగా = గంగానది, సామోర్మితుంగస్వనైః = సామనాదములాగ త ఎత్తైన అలలధ్వనులతో మధురం = మధురముగ, గాయతి ఇవ = గానముచేయు చున్నట్లున్నదో యత్రచ = ఎచ్చట, వితృష్ణమతయః = పోయినకోర్కెలుగల, సాధవః = సాధువులు, ఉల్బణం = తీవ్రమైన, తపః = తపస్సును, తప్యంతే = ఆచరించుచున్నారో.

## తాత్పర్యం

పంచక్రోశాల విస్తీర్ణం గల ఉత్తరకాశీ పవిత్ర ధామం వారుణి, అసి అనే పావననదుల చేత పర్యవేష్టింపబడి ప్రపంచంలోని అన్ని పర్వతశ్రేణుల లోని తలమానికమైన వారణావతశ్రేణిలో ఉన్నది పరమపావని గంగాదేవి తన ఉధృతవేగంతో ఇక్కడికి ప్రవహించి చేరుతుంది. ఆమె తరంగాల నిస్వ నాలు సామగానంవలె ఈ ప్రాంతాన్ని నింపుతూ పునీతం చేస్తున్నాయి ఇక్కడ పరమహంసలైన సన్యాసులనేకులు తృష్ణారహితులై తీవ్రమైన తపస్సులో నిమగ్నులై ఉంటారు ఉత్తరకాశీక్షేత్రం మహామహిమాన్వితమైనది

**శ్లో॥ తత్రాస్తే విశ్వనాథ శ్రీశక్త్యాది సహితః ప్రభుః।**
**స్తోత్రరత్నేన యో దేవ స్తుష్టువేఽనేన సౌమ్యరాట్॥ 22**

ప్రతి॥ తత్ర = అచ్చట, శ్రీ శక్త్యాదిసహితః = శ్రీ, శక్తిమొదలగువారితో కూడిన, ప్రభుః = ప్రభువైన, విశ్వనాథః = విశ్వనాథుడు, ఆస్తే = ఉన్నాడు, సౌమ్యరాట్ = సౌమ్యకాశీపతియైన, యః దేవః = ఏ ప్రభువు, అనేన = ఈ, స్తోత్రరత్నేన = స్తోత్రరత్నముచే, తుష్టువే = స్తుతించెనో

## తాత్పర్యం

ఆ ఉత్తరకాశీ పావనక్షేత్రంలో శ్రీశక్తిమొదలైన వారితో కూడి సౌమ్య కాశీప్రభువు స్తోత్రరత్నాలతో కీర్తింపబడుతున్నాడు.

తరువాతి శ్లోకంలో ఫలశ్రుతి ఇవ్వబడుతోంది.

శ్లో॥ యః పఠేత్ ప్రయతో నిత్యం శ్రద్ధయా తదనన్య ధీః।
స కామో లభతే కామం నిష్కామో ముక్తి మాప్నుయాత్॥23

ప్రతి॥ యః = ఏ, అనన్యధీః = సాటిలేనిబుద్ధిమంతుడు, ప్రయతః = ప్రయత్న పూర్వకముగా, శ్రద్ధయా = శ్రద్ధతో, ఏతత్ = ఈస్తోత్రమును, పఠేత్ = చదువునో, సకామః = కోర్కెలుగలవాడు, కామం = కోర్కెను, లభతే = పొందును. నిష్కామః = కోర్కెలులేనివాడు, ముక్తిం = మోక్షమును ఆప్నుయాత్ = పొందును.

తాత్పర్యం

ఈ స్తోత్రాన్ని నిత్యమూ శ్రద్ధతో, శుద్ధమైన హృదయంతో ఎవరు పఠిస్తారో, వాళ్లు సకాములైతే కోరికలు తీరుతాయి. నిష్కాములైతే మోక్షాన్ని పొందుతారు.

శ్లో॥ కేరలావని సుతేన శోభనం
భూరిభాగ్యనిధి నేద మీరితమ్।
భిక్షుణా హిమమహీధ్రశృంగికో
త్సంగవాసరసికేన కేనచిత్॥ 24

ప్రతి॥ భూరిభాగ్యనిధినా = ఆత్మసాక్షాత్కారమే సంపదగాగలవాడును, హిమ మహీధ్రశృంగిక + ఉత్సంగవాసరసికేన = హిమవత్పర్వతశిఖర గుహలలో నివసించుటకు ఇష్టపడువాడును, కేరళావనిసుతేన = కేరళ దేశమునందు జన్మించినవాడును నయిన, కేనచిత్ = ఒకానొక, భిక్షుణా = సన్యాసిచేత, శోభనం + ఇదం = మంచిస్తోత్రములతో కూడిన ఇది, ఈరితమ్ = చెప్పబడినది.

## తాత్పర్యం

కేరళదేశంలో జనించిన భిక్షువుద్వారా ఈ పవిత్రమైన స్తోత్రాలు చెప్ప బడినాయి అయన వీటిని తన చరితార్థతగా, పరమభాగ్యంగా ఎంచుకుంటు న్నాడు తండ్రి ఒడిలో కూర్చొని ప్రేమలాలింపుని పొందే పసివానిలాగా ఉత్తుంగ శృంగాలతో నిండిన హిమవాన్ ఔన్నత్యానికి పులకరించుతూ లోయలో ఉన్న ఈ భిక్షువు ఉత్తేజనాన్ని పొంది ఈ స్తోత్రాలని రచించాడు ఇందులో భక్తి జ్ఞానసాహిత్యాల మేలు కలయిక వున్నది.

పైశ్లోకం రదోద్ధత ఛందస్సులో ఉన్నది.

చివరిశ్లోకంలో ఈ స్తోత్రాన్ని గురుదేవులు ప్రభు విశ్వనాథ పాదాలకు సమర్పించుతున్నారు

శ్లో॥ విశ్వేశ్వరస్య కృపయా ఖలు తత్ప్రయుక్తః
క్షుద్రోపలబ్ధి తమకుటోఽహ మకార్ష మేతత్।
తస్యార్పితశ్చ పదయోః స్తబకోపహారః
స్తోత్రాత్మక స్సురభిలోఽస్తు స సుప్రసన్నః॥ 25

ప్రతి॥ విశ్వేశ్వరస్య = విశ్వనాథునియొక్క, కృపయా = దయతో, తత్ప్రయుక్తః = ఆ దయామయునిచే ప్రేరేపింపబడిన, క్షుద్ర + ఉపలబ్ధిమకుటః = ఈ పొందిన చిన్నశ్లోక మకుటములు గలవాడనైన, అహం = నేను ఏతత్ = ఈస్తోత్రగ్రంథమును, అకార్షమ్ = చేసితిని, స్తోత్రాత్మకః = స్తోత్రాత్మకమైన, సురభిలం = సుగంధమునిచ్చునట్టి, స్తబక + ఉప హారః = పూగుత్తులనెడి కానుకయిన ఈగ్రంథము, తస్య = ఆ పరమ శివునియొక్క, పదయోః = పాదములయందు, అర్పితః చ = సమర్పింప బడినది, సః = ఆ విశ్వనాథుడు, సుప్రసన్నః = దయామయుడుగా, అస్తు = అగుకాక.

## తాత్పర్యం

విశ్వనాథప్రభువుయొక్క కరుణవల్ల, ఆశీస్సులవల్ల, ఆయనప్రేరణవల్ల ఈ స్తోత్రాలను పరమమూఢుడిని అయిన నాచేత రచింపబడినాయి. ఆయున పాదాంబుజాలకి ఈ స్తబకాలని పూవులుగా సమర్పించుతున్నాను. నా అల్ప కానుకని ఆ కరుణామయుడు స్వీకరించును గాక! నా యీ చిన్న ఉపహారాన్ని ఆ ప్రభువు స్వీకరించి సంతుష్టు డగునుగాక!

## వ్యాఖ్య

ఉత్తమ విద్వాంసుడైన గురుదేవులు తన్నుతాను తెలివితక్కువ వాడినని ఈశ్లోకంలో వర్ణించుకుంటున్నారు! నిరహంకారానికి, వినయానికి ఈ మహా పురుషుని కన్న వేరే నిదర్శనం ఉన్నదా?

ఓం తత్సత్!

